శ్రీరస్తు

# కవిశిరోభూషణవివృతి




వివృతి రచయిత

విద్వాన్ - ఆచార్య

ఆకెళ్ళ అరుణాచలశాస్త్రి

విజయనగరము





1972

శ్రీ గురుమూర్తయే నమః

# సమీక్ష

✠

ఆంధ్రవ్యాకరణశాస్త్రమునకుఁ బ్రథమాచార్యుఁడు నన్నపార్యుఁడు. ద్వితీయాచార్యుఁ డథర్వణాచార్యుఁడు. వీరిరువురును సంస్కృతభాషయందు 'ఆంధ్రశబ్దచింతామణి, వికృతివివేక కారికావళి' యను రెండుగ్రంథముల రచించిరి. ఆరెండుగ్రంథములను శోధించి, యహోబలుఁడు వానిపైని "కవిశిరోభూషణము" అను పేర విపులవ్యాఖ్యను రచించెను. 'అహోబలపండితీయము' అని ప్రసిద్ధినొందిన యీ వ్యాఖ్యను దెనుఁగునఁ బూర్వులలో నొకరిద్దఱనువదించిరి. కాని యవి ముద్రితములై వెలుఁగులోనికి వచ్చినట్లగపడదు. ముద్రితమై చిరకాలము క్రిందటనే వెలువడిన మొదటిగ్రంథము బ్రహ్మశ్రీ పేరి భద్రాద్రి రామశాస్త్రులవారియనువాదము. రెండవది హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయపండితులగు శ్రీ చేలమచర్ల రంగాచార్యులవారును, శ్రీ అమరేశం రాజేశ్వరశర్మగారును చేసిన యనువాదము. మూఁడవది బ్రహ్మశ్రీ ఆకెళ్ళ అరుణాచలశాస్త్రులుగారొనర్చిన యీ యనువాదము.

భద్రాద్రిరామశాస్త్రులవారి యనువాదము కేవలము మూలానుసారియై దర్పణప్రతిబింబమువలె నుండును. అమరేశమువారి యనువాదము కొన్నియెడల మూలమునఁ గలుగుసంశయముల కందంద వివరణములతో నుండును. శాస్త్రులవారి యీ "కవిశిరోభూషణవివృతి" యందు యథామూలము ప్రతిపదార్థము, వివరణము మాత్రమే కాక నన్నయగారిమార్గమునకుఁ జిన్నయసూరిమార్గమునకుఁ గల యైక్యమును, వ్యత్యాసమును, ఆరెండిటఁ గనఁబడు గౌరవలాఘవములను సందందు సూచింపఁబడుచుండును.

శ్రీ అరుణాచలశాస్త్రిలవారు విజయనగరమహారాజసంస్కృత కళాశాలయందుఁ జదువుకొని విద్వత్పట్టము నొందినవారు. అందు "కళాప్రపూర్ణ" బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిలవారి యాచార్యకమున నాంధ్రలక్షణగ్రంథములనెల్లఁ బఠించి గురువులయాశీః పాత్రులై, యాకళాశాలయందే చిరకాల మధ్యాపకులుగా నుండి, యాంధ్రవ్యాకరణ, ఛందోఽలంకారశాస్త్రగ్రంథములను విద్యార్థివరంపరకుఁ బాఠప్రవచన మొనర్చి ఖ్యాతి నందినవారు. తరువాత రాజమహేంద్రము గుంటూరు మున్నగుపురములందలి సంస్కృతకళాశాలలయందుఁ గొంతకొంతకాలము దేశికపద మలంకరించి ప్రకృతము విశ్రాంతిఁ దీసికొనుచున్న విద్యావయోవృద్ధులు.

శ్రీశాస్త్రిగారు లక్షణగ్రంథములచిరకాలపఠన పాఠనములందుఁ దమకుఁ గలిగినయనుభవవిశేషములను గాలికి విడిచిపెట్టక, కళాశాలా విద్యార్థులకే కాదు, పండితులకును నుపకరించునట్లు సరళ మగుబోధన పద్ధతిలో వార్ధకమును లెక్కింపక కవిశిరోభూషణమునకు నాంధ్రవివరణముగా నీగ్రంథమును రచించి ముద్రించి యాంధ్రభాషాజిజ్ఞాసువుల కందఁజేసి, యాంధ్రులసార్వకాలికకృతజ్ఞతకు భాజనులైనారు.

క్రీ.శ. ౧౧ శతాబ్దిలోఁ బ్రథమాచార్యుఁ డగునన్నయభట్టారకుఁడు తత్సమపదసంస్కారము హెచ్చుగను, దద్భవదేశ్యపదసంస్కారము తక్కువగను నుండునట్లు సంస్కృతభాషయం దార్యావృత్తములలో 'ఆంధ్రశబ్దచింతామణి' యను చిన్నవ్యాకరణమును రచించెను. పిదప ౧౩ శతాబ్దిలో నథర్వణాచార్యుఁడు పాణినీయమునకు వార్తిక గ్రంథమువలెఁ జింతామణికిఁ బూరకగ్రంథముగా, నాంధ్రపదసంస్కారము విపుల మొనర్చి సంస్కృతమునందే యనుష్టుప్ఛందమున 'వికృతి వివేకమును' (కారికావళిని) రచించెను. అనంతరము ౧౬ శతాబ్దితుదిని ఎలకూచి బాలసరస్వతి చింతామణికిఁ దెనుఁగునఁ జక్కనిటీక వ్రాసెను. ౧౭ శతాబ్దిలో నప్పకవి యాచింతామణికే తెనుఁగునఁ బద్యమయముగా

వివరణము వ్రాయఁబూని, సంజ్ఞాసంధిపరిచ్ఛేదములు పూర్ణముగను, అజంతపరిచ్ఛేదమునఁ గొంతభాగమును మాత్రమె రచించెను. ౧౭ శతాబ్దివాఁడని అహోబలుఁడు, తెనుఁగు లాక్షణిక గ్రంథకర్తలైన పూర్వకవులమార్గమును విడిచి, నన్నయాథర్వణుల రెండుగ్రంథములను జత పఱచి వారివలెనే సంస్కృతమునంగూడ దానికి విశేషభాష్యమును రచించెను. ఈరీతిగా నన్నయాథర్వణాహోబలపండితుల వ్యాకరణమార్గము సంస్కృతభాషామయముగా వెలసినది.

నన్నయాదుల మార్గముతోఁగాక, సంస్కృతప్రాకృతవ్యాకరణములతోఁగాని, యంతగా సంబంధములేక యాంధ్రపద్యమయముగా వెలసిన కేతనాదులమార్గము నేఁటికిని గనుపడుచున్నది. కేతన క్రీ. శ. ౧౩ శతాబ్దివాఁడు (తిక్కనసోమయాజికి శిష్యుఁడు.) దశకుమారచరిత్రము రచించి తనగురువగు తిక్కనకవిబ్రహ్మకే కృతిగా నిచ్చినవాఁడు. "విజ్ఞానేశ్వరము" అను ధర్మశాస్త్రమును నాంధ్రీకరించినవాఁడు. ఆతఁడు "డాంధ్రభాషాభూషణ" మను తెనుఁగు వ్యాకరణమును నూటయెనుబదియెనిమిది పద్యములలో రచించెను. అందాతఁడు చింతామణికర్తను–

క॥ "మున్ను తెనుఁగునకు లక్షణ। మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద, వి
ద్వన్నికరము దగి మెచ్చఁగ। నన్నయభట్టాదికవిజనంబుల కరుణన్" అనియు,

గీ॥ సంస్కృతప్రాకృతాది లక్షణముఁ జెప్పి। తెలుఁగునకు లక్షణము మున్ను తెలుపకుండు
కవిజనంబుల నేరమి గాదు, నన్ను। ధన్యుఁ గావింపఁదలఁచి విడచిరి గాని" అనియుఁ

దానే ప్రథమాంధ్రశాబ్దికుఁడ నని చెప్పికొనెను.

దాని నూఁతగాఁ గొని ప్రథమాంధ్రవ్యాకరణము భాషాభూషణమే కాని చింతామణి కాదనియు, నన్నయ పేర నితరులెవ్వరో చింతామణి రచించిరనియు నొకవాదము బయలుదేఱినది. బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారు నావాదమును బ్రతిఘటించి, వావిళ్లవారు ప్రకటించిన 'అథర్వణకారికావళి' యుపోద్ఘాతమునను,

'చింతామణివిషయపరిశోధనము'నను, నన్నయకృతభారతభాగమున కును, చింతామణికిని గల లక్ష్యలక్షణసంబంధమును జూపి, యక్షరశః ఖండించి చింతామణికర్త భట్టారకుఁడే యనియుఁ జింతామణి మొదటి దనియుఁ దక్కినవి దరువాతివే యనియు ధ్రువపఱిచిరి.

భాషాసంస్కారము నెడఁ గేతనగ్రంథము పరిమితమే కాని చింతామణిపాటి విపులమును గాదు. అందలి పరిభాషలును, సంజ్ఞలును గొన్ని పాణినీయమునకుఁగాని ప్రాకృతవ్యాకరణమునకుఁగాని సంబంధింపవు. అజ్జు, ఇజ్జు, ఉజ్జు, ఋజ్జు, ఌజ్జు మొదలగు తెత్తుల కక్షరసంజ్ఞామాత్రమే కాని వేఱుఫలము గనరాదు.

"లక్షణములు దెలిపెడిచో। నక్షరములం దెలియుఁగను ననువైనక్రియన్
శిక్షార్థముగాఁ బలికెద। లాక్షణికులు తప్పుగాఁ దలంపకుఁడు మదిన్"

అని చెప్పినాఁడు.

ఇట్లు చెప్పుటవలన "వర్ణాత్కారః" అనువిధిచే 'కార' ప్రత్యయము వర్ణమాత్రమునకు వచ్చునట్లే అకారము ననుబంధముగా సర్వత్ర కూర్చెనేమో యనుకొంద మనిన "శబ్దానికాంతనకారము" అనియు, "ఇల ముకారమునకు ద్విత్వమేని బిందుపూర్వకబుకారమేనియుఁ బొసఁగియుండు" అనియు, 'కార' ప్రత్యయమును గొన్నియెడలఁ జెప్పకపోలేదు. అకారానుబంధము ప్రాకృతసంబంధి యేమో యన - కకట రేఫము కాదు. కాని సాధురేఫ మనుబంధముగా నున్నయెడ "రితో ద్విత్వాత్ - రేఫానుబంధ స్యాదేశవ్యంజనస్య నిత్యం ద్విత్వం భవతి" అని (షడ్భాషాచంద్రిక). తెత్తనుహాలాదేశము ద్విత్వయుక్తమని కలదు. కాన దానితోడను సంబంధము కానరాదు. కేతనమార్గము ననుసరించినది 'కావ్యాలంకారచూడామణి'. అందు నవమోల్లాసమునఁ గలశబ్దసంస్కారము భాషాభూషణమునకుఁ జేరువగా నున్నది. అదియును బరిమితమే. ఆవ్యాకరణములు రెండిటిపద్ధతి యంతటితో నాఁగిపోయినది.

ముద్దరాజు రామన్న రచితమగు "కవిజనసంజీవని," గణపవరపు వేంకటకవికృతమగు 'ఆంధ్రకౌముది,' అడిగము నాగనార్యకృతమగు 'కవిసంశయవిచ్ఛేదము,' కూచిమంచి తిమ్మకవికృతమగు 'సర్వలక్షణసారసంగ్రహము;' మున్నగు పద్యమయములైన పెక్కులక్షణగ్రంథము లప్పుడప్పుడు వెలువడుచు వచ్చినవి. అవి సామాన్యముగా నప్పకవీయము వలెనే ఛందశ్శాస్త్రప్రధానములుగా నున్న వేకాని చింతామణిమున్నగు వానివలె వ్యాకరణప్రధానములుగాఁ గన్పట్టవు. మధ్యకాలమునం దట్టి లక్షణగ్రంథములు బహుముఖములుగా వెలసినవి.

నేఁటివలె ముద్రణాదిసౌకర్యములు లేనికారణముననో, మఱి యేకారణముననో కాని యాగ్రంథములు పుట్టినకాలమునందైనను వాని కధికవ్యాప్తి యున్నట్లు కనఁబడదు. ఉన్నను నేఁడెంచెమో పండితలోకమున నుండెడి దనవచ్చును. నన్నయాథర్వణులగ్రంథములు సంస్కృతభాషామయములు; అందును లక్షణగ్రంథములు. కావున భారతాదిగ్రంథములవలె బహుముఖవ్యాప్తి లేక యందందు మూలఁబడియుండుటచేఁ గేతన కాగ్రంథములయునికి తెలియకపోవచ్చును.

కేతన తానే ప్రథమలాక్షణికుఁడనని చెప్పినవాక్యమే ప్రమాణమైనపుడు "నిత్యసత్యవచనుఁడును" "జపహోమపవిత్రుఁడు" నగు నన్నపార్యుఁడు "విపులశబ్దశాసనుఁడ"నని చెప్పినపలుకు ప్రమాణము నసత్యము నగునా? అదియునుగాక — కేతన కించుమించు సమకాలికుఁడును, బాలసరస్వతి మున్నగువారికిఁ బూర్వుఁడు నైన జక్కనకవి తన విక్రమార్కచరిత్రమున —

"ఉ. వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు సత్ప్రబంధముల్
పాయక చెప్పి, రట్లు రసబంధురవాగ్విభవాభిరాముల
రేయులు శబ్దశాసనవరేణ్యులు నాఁగఁ బ్రశస్తి కెక్కి రే
యేయెడ నన్నపార్యుగతి నిద్ధర? నట్టిమహాత్ముఁ గొల్చెదన్."

అని నన్నయభట్టును శబ్దశాసనవరేణ్యునిగాఁ జెప్పినమాట యనృతమా? అట్లగుచో నాశబ్దశాసన మేది యందురా? నన్నయకృత మని

వేటికి శబ్దానుశాసనము లభించుచున్నంతము చింతామణికి ప్రామాణికమే యనుకొనుటలో విప్రతిపత్తి లేదు. ఈపరిశీలనమువలన - ఆంధ్రవ్యాకరణము సంస్కృతమున నవతరించుట మొదటిఘట్టము. తరువాత దాని చాయనే పద్యమయముగా నాంధ్రమున నవతరించుట రెండవఘట్టము - అని విశద మగుచున్నది.

పిదప ౧౭ శతాబ్దిలోఁ జిన్నయసూరి రచించినయాంధ్రవ్యాకరణములయవతరణము మూఁడవఘట్టము. ఆతఁడు నన్నయాథర్వణుల మార్గముననే పంచపరిచ్ఛేదవిభాగముతో 'శబ్దలక్షణసంగ్రహమును', సిద్ధాంతకౌముదీమార్గమున సంస్కృతభాషయందు 'సూత్రాంధ్రవ్యాకరణమును' 'పద్యాంధ్రవ్యాకరణమును' (కొంతమాత్రమే కనఁబడుచున్నది)రచించి, సూత్రమయముగాఁ దెలుఁగున 'బాలవ్యాకరణమును' రచించెను. అనంతరము శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యుల వారు 'త్రిలింగలక్షణశేష'మనెడి ప్రౌఢవ్యాకరణమును బూర్వకవుల ప్రయోగవిశేషోదాహరణములతో వ్రాసిరి.

ఈరీతిగా నాంధ్రవ్యాకరణశాస్త్రము మూఁడుమార్గములఁ బ్రవర్తిల్లినదని స్థూలముగా ననుకొనవచ్చును. సంస్కృతమున ముందుగా వెలువడిన నన్నయాథర్వణాహోబలపతులహృదయము తెలిసినఁగాని, యాంధ్రశబ్దశాస్త్రము కూలంకషముగా నవగతము కా దనెడితలంపునఁ జిన్నయసూరిబాలవ్యాకరణముతో మేళవించి బ్రహ్మశ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రులవారు బహుకాలము పరిశోధనము గావించి సమన్వయ మొనర్చుచు "వ్యాకరణసంహితాసర్వస్వము" అను బృహద్విమర్శనగ్రంథమును రచించిరి. ఏఁబదిసంవత్సరములక్రింద 'మహోపాధ్యాయ' కల్లూరి వేంకటరామశాస్త్రులవారు బాలవ్యాకరణమునకు 'గుప్తార్థప్రకాశిక' యను విపులవ్యాఖ్య రచించియున్నారు. బ్రహ్మశ్రీ వజ్ఝల పండితులశిష్యులైన దూసి రామమూర్తిశాస్త్రిగారు "బాలవ్యాకరణసారస్యసర్వస్వపేటిక"యనువ్యాఖ్య రచించిరి. ఈనడుమనే

పెద్దలు నిశ్చయించి 'గాలి నరసయ్య' యనుదానికే 'ప్రభంజనము లేక వాతూలము-అహోబలపతి' యని సంస్కృతీకరణ మనినారు.

ఆచార్య ఖండవిల్లి లక్ష్మీరంజనముగారి యాదేశానుసారము హైదరాబాదుప్రతికి నే నుపోద్ఘాతము వ్రాయునప్పు డాంధ్రసాహిత్య పరిషత్పత్రికలందలివ్యాసములను మాత్రమే చూచుటచే నాతనిపే రేదియో నిర్ధరింపఁజాలక "నరసయ్య" యని వ్యవహారనామ మూహించుటకంటె నరసభూపాలీయప్రయోగముల ననుసరించి 'ఔబళయ్య' యని కాని, 'ఓబయ్య' యని కాని యూహించుట సముచితము; అహోబల శబ్దమునకు వికృతులే 'ఔబళ - ఓబ శబ్దములు' అనిమాత్రము సూచించితిని. తరువాత ముద్రితమై వచ్చినహైదరాబాదు (అమరేశము వారి) ప్రతితుట్టతుదిని గల

> చ. అకుటిలకీర్తినిర్మలత నంచితుఁ డౌబళపండితుండు శే
> తోకఁ దనుశబ్దశాసనుఁ దహో! యని మన్ననసేయ....

అనుపద్యము చూడఁగనే 'గాలి ఔబళపండితుఁడు' అనునిశ్చయము నాకుఁ గలిగినది. సంస్కృతశబ్దమంజరిచివర నున్న సమాస కుసుమావళి రచించినమహాపండితులు నడిమింటి సర్వమంగళశాస్త్రి గారు '(శ్రీ)మధ్యమందిరకులాంబుధిపూర్ణచంద్ర (శ్రీ)సర్వమంగళమనీషి కృతా సలీలం' అనుశ్లోకమున 'నడిమింటి' అనుపదమును "మధ్యమందిరము" అని సంస్కృతీకరించుకొనినట్లే 'గాలి' అనుపదమును 'ప్రభంజనము, వాతూలము' అనియు, 'ఔబళపండిత'పదమును, 'అహోబల పండిత'యనియుఁ దానే సంస్కృతీకరించుకొనె ననుటలో విప్రతిపత్తి కనరాదు.

ఇఁక నీతనివాసస్థలము వినుకొండసీమలోని 'ఉమ్మడివరమో' లేక యాప్రాంతమున నున్న మఱొకగ్రామమో యైయుండును. ఈతని గోత్ర మీగ్రంథమునఁగాని, కాళిందీకన్యాపరిణయమునఁగాని పేర్కొనఁ బడలేదు. కాని అమరేశం రాజేశ్వరశర్మగారు తమయహోబలపండి

తీయోపోద్ఘాతమునందు గాలివారిది భారద్వాజసగోత్రమని తెలిసికొని నట్లు వ్రాయుటచే నీతనిది భారద్వాజసగోత్రమని స్పష్టమైనది. ఇతని తలిదండ్రులఁగూర్చి యీరెండుగ్రంథములందును గానఁబడదు. కాని యీతని మేనమామ యైన పోలూరి మాధవయజ్వను గూర్చి యీ రెండిటియందును బెద్దగఁ బ్రశంసించియుండుటచే బాల్యమునుండియు మేనమామయింటనే పెరిఁగి పెద్దవాఁడై, యాతనిగురుత్వముననే సకల శాస్త్రములను, సంస్కృతప్రాకృతాదిభాషలను నేర్చినట్లు విశదమగు చున్నది.

"తం పోలూరివంశపయోధిచంద్రం, వందామహే మాధవవిద్వదింద్రమ్" అనియు,

"దాక్షీపుత్రకణాదగౌతమఫణిప్రాగ్ర్యాదిసంఖ్యావతో
ద్రష్టుం యేఽఖిలవంతి పండితజనా స్తే పూర్ణకామాః స్వయమ్
యత్సందర్శనతో నిదర్శితకలా వైశద్యదాతా సత
స్వాంతాత్యంతతమోబలం త మతులం ధ్యాయామి మద్మాతులమ్"

(పాణిని, కణాదుఁడు, గౌతముఁడు, శేషుఁడు మొదలగు శాస్త్ర కారులను దర్శింపఁగోరుపండితు లెవనిదర్శనము చేసి పూర్ణకాము లగుదురో, యట్టి శాస్త్రకారులరూపమే యనఁదగినవాఁడును, సకలశాస్త్రవైశద్యము చే విధేయు లగువారిమానసికాంధకారమును బోఁగొట్టువాఁడును, నాకు మేనమామయు నగుమాధవగురుని ధ్యానింతును) — అని యీ గ్రంథమందును,

గీ. ఏమహాత్ముని దర్శింప నెసఁగు దక్ష। పాదకణచరమునివ్యాసవాన
కపిలఫణిరాజదర్శనఫలితమోద। మతని మద్గురు మాధవు నభినుతింతు"

అని కాళిందీకన్యాపరిణయమందును మాధవబుధునిసకలశాస్త్ర పాండిత్యమును, దనభక్తిభావమును బెక్కుపద్యములందుఁ బ్రకటించి కృతార్థుఁడయ్యెను.

ఇఁకఁ దనపాండిత్యమునుగూర్చియే యీ కవిశిఖామణి దాదిని

"శ్యామం సంతు పరశ్శతం ....సర్వావనీమండలే" అనియు, గ్రంథాంతమున

సీ. కర్కశతర్కవాక్తర్కనాకుంఠితవిశదమేధావిధావిలసనంబు . ...... ..
.... ...కవిశిరోభూషణంబు."

అపి కవిశిరోభూషణప్రశంసారూపమునఁ దనకుఁ గలప్రతిభావ్యుత్పత్తులగాంభీర్యమును స్వయముగా వెల్లడింప మరల వివరింపఁబూనఁ బునరుక్తమగును. చింతామణి మొదటిపదిసూత్రముల వ్యాఖ్యానమున— తర్క, వ్యాకరణ, పూర్వోత్తరమీమాంస, సాలంకారశాస్త్రములందలి రహస్యముల నెన్నిటినో చేటలతోఁ జెరిగివైచినాఁడు.

"ఆద్యాయాః పంచాశద్వర్ణాః" అనుసూత్రము మొదలు 'వర్ణాగమో విశేషః' అను చిట్టచివరసూత్రముదాఁక వ్యాకరణశాస్త్రవిషయములపై బహుముఖవిమర్శనము కనఁబడును. అందు సంస్కృతప్రాకృతవ్యాకరణముల కేపాటిభిన్నముగా నున్నను, నొక్కనన్నయాథర్వణులనుదక్క, నన్యులగు శ్రీనాథాదిమహాకవులనుగూడ లెక్కింపక నిరాకరించును. తనకుఁ బూర్వమున్న వ్యాఖ్యలలో బాలసరస్వతీయము నాదరించినయంతగా నప్పకవీయము నాదరింపఁడు. కాని యందందు దానిని స్వీకరింపకమానఁడు.

"విశ్వశ్రేయః కావ్యమ్" అనుప్రథమసూత్రవ్యాఖ్యయందు — కవిలక్షణము, కవులలోనిభేదములు, కావ్యప్రయోజనములు, గణ, వృత్త, గుణదోషవిచారము, అరివర్గచక్రము, రాశికూటము, గ్రహములు వానిఫలములు, సుదూరము చర్చింపఁబడినవి.

"తదదోషౌ" అనురెండవసూత్రవ్యాఖ్యయందుఁ బదగతములు, నర్థగతములు, వాక్యగతములు నగుదోషములును, నలంకారములును, వాచ్యలక్ష్యవ్యంగ్యస్వరూపములు, రీతి, గుణ, వృత్తి, శయ్యాద్యులభేదములును ప్రాచీననవీనాలంకారికమతానుసారముగా విచారింపఁబడినవి.

"సా వాగ్యాగసవృత్తిః" అనుసూత్రవ్యాఖ్యయందు మీమాంసకు లంగీకరించిన తాత్పర్య మనెడి వృత్తిని వ్యంజనావృత్తియందే

నన్నయాథర్వణు లంగీకరించినపదాదిగత యకారమునుగూర్చి చర్చించి ప్రక్రియాగౌరవమును జూపి, తుద కా'యకారము' వ్యర్థమని లాఘవమును జూపి, చిన్నయసూరిప్రభృత్యర్వాచీనశాబ్దికులకు మార్గ దర్శకుఁ డయ్యెను. శ్రీ అరుణాచలశాస్త్రిలవారు తమవివృతియం దహోబలునియాసిద్ధాంతము నన్నయాథర్వణమతసమ్మతముకాదని సోప పత్తికముగా నిరూపించి, బాలసరస్వతీయచింతామణిపాఠమే సమంజస మనియు, నహోబలుఁ డంగీకరించిన అప్పకవివారము ప్రక్షిప్తమనియు ధ్రువపఱచిరి. ఆస్థిరపఱచుటలోఁ జిన్నయసూరిమతము నెత్తికొని చింతామణిమతగ్రంథలిస్వారసతయు, సూరిపాఠములోనియస్వారసతయు నిరూపించినారు.

యరలవల లఘుత్వాలఘుత్వవిమర్శనమున "శకారమునకు యతి ప్రాసమైత్రి నంగీకరించుటలో హేతువు లేదు" అని వైయాకరణపారి జాతమతానుసారముగా శాస్త్రిగారు బాగుగాఁ జర్చించి వ్రాసినారు.

శ్రీ శాస్త్రిగారు సామాన్యముగఁ దమవివృతిలో నహోబలుని మత మేదియో విశకలితముగ వివరించుచు, దానికి సరియగుచిన్నయ సూరిరచన నెత్తికొని, యారెండిటిలోని గౌరవలాఘవములఁ జర్చించు చుందురు. ఆచర్చ విద్యార్థిలోకమున కెంతయు నుపకారక మగును. సంజ్ఞా. 40. తిజ్మధ్యశేషమష్ట్యాదిసూత్రవ్యాఖ్యయందు "యదా, తదా" యనునవి నిత్యైకవచనాంతములని చిన్నయసూరి యేల యనెనో, య ట్లనుటలోఁ గలవిశేష మేమియో వ్యక్త మొనర్చి నారు.

ఇట్లే సంజ్ఞా. 32. "ద్రుతాఖ్యో నః" అను సూత్రవ్యాఖ్యాంత మునఁ బ్రౌఢవ్యాకరణకర్త "శబ్దశాసనుఁడు ద్రుతాఖ్యో నః-అని కేవల నకారగ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియ వలెను" అనువాక్యముపై శ్రీ శాస్త్రిగారు చేసినవివరణము యుక్తి యుక్తముగను నెంతయు సరళముగను నున్నది.

"సంధి ర్నా చోఽచ్యనుతః" అనుసూత్రవ్యాఖ్యానాంధ్రభాష... మంతయుఁ బూర్తియైనపిదప "తేషూన్నాం నిర్ణీతకాలానుమానమేవ సీనే త్యవధేహి" యనునంతవఱకు నున్న గ్రంథము నవీనప్రాయము—అని యారంభించి పూర్వపక్షసిద్ధాంతముల నున్న భాగము నాతఁడు జిజ్ఞాసువులహృదయములకు హత్తుకొనునట్లు శాస్త్రీయముగా సుబోధకముగా శైలిలో వివరించుట మెచ్చఁదగినది.

"పరిమితో సను స్తానాం" (సంధి. 49.) అనుసూత్రవివరణమునఁ "పరిమితే సమస్తానాం" అని వ్యాకరణసంహితాసర్వస్వము చేసినసవరణ మంగీకరించి, పరిమితశబ్దమునకుఁ గొన్ని ప్రత్యయాంగములని యర్థము చెప్పి, దానివలన నవదాదిస్వరసంధికి మార్గము చూపినారు.

"పోశ్చ తదాద్యర్థవాచకే పూంతః" (సంధి. 59) అనుసూత్రమున కహోబలుఁడు "యదా తదా ఇదానీంముఖవాచకా యే అత్ర 'అపుడు' ఇత్యాదయః, తేషు యః పుకారః, తస్య ఉకారస్య చ వా లుక్ స్యాత్. అపుడు, అప్డు ఇత్యాదయః" అని యున్న భాగమున "అప్డు, అపుడు" అనురూపములే కాక "అప్పుడు, ఇప్పుడు" అని ప్రశస్తమున కనావశ్యకరూపములుగూడఁ గవిశిరోభూషణగ్రంథమునఁ బ్రథమముద్రణమున నెక్కినవి; ఈగ్రంథమునను జేరినవి.

పరిశీలింప వ్యా.సం స. ప్రకారము "ప్రథమాంతగపి ద్వి నులోప్యః" అను చింతామణిసూత్రమున్నపిని 'అన్యత్రాపి భవే ద్వైకల్యం క్వచి త్పునరపి రమ్మ తేః' అనినవివృతివి వేరకారిక బయలుదేఱి 'అప్పుడు' మున్నగుపదములలోనియొకపకారము లోపింపఁ జేయఁగా—మిగిలిన 'పు'వర్ణమే యీ సూత్రమున గ్రహింపఁబడినది. 'పోశ్చ' అనుసూత్రమునకుఁ బూర్వము నుండు 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అనుసూత్రముచే 'అది' అనుదాని లోని అకారమునకుమాత్రము లోపము విధింపఁబడినది. ఆ అకార మొక్కదానికే కాదు. తదాద్యర్థవాచకములందని పువర్ణసంబంధియైన (ఉతశ్చ) ఉకారమునకును లోపము కలిగించుననియు, నట్లు

లోపించిన 'అప్పు, అపుడు' అనురూపములు సిద్ధించుననియు నిశదనుగుచు న్నగు. శాస్త్రిగారు గాభాగమును వివరించుచు—పకారమున కొంకసారియు, పకారోకారమున కొంకసారియు లోపము కల్గును' అని వ్రాసిరి. పకారమున కొంకసారి కలుగులోప మీసూత్రముచేతఁ గాదనియు, అన్యత్రాపి భవే ద్వైకల్యం-అనుకారికచేఁ గల్గుచున్నదనియు వివరింపకున్నను వారియాశయముమాత్ర మదియే.

'చొ శే రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్' (సంధి. 11) అనుసూత్రముపై వెలువడిన కవిశిరోభూషణము ననుసరించి– చివర్ణము పరమగుచుండఁగ నుపధాభూత మైనరేఫముమీఁది ఇకారము లోపించి– 'అమర్చి, అమరిచి' అనురూపములు కలుగునను కలదు.

శాస్త్రిగారు తదనుసారముగానే వివరించి చివర్ణ పరకత్వమందుఁ గాక, చువర్ణపరకత్వమున 'రేః అనుటకుమారు రోః అని సవరించిన యెడల 'అమర్చి' అనునొక్కరూపమేకాక, 'అమరుచు'ధాతువుపై వచ్చుయావద్రూపములు "అమర్చుచున్" ఇత్యాదిగా సిద్ధించుననిన వ్యా.సం.స. నిర్ణయమును బేర్కొని 'నలడా దే రంతరుతశ్చ' అను సూత్రముతో నీసూత్రమునకుఁ గలసంబంధమును సూచించుట సముచితముగ నున్నది. కాని యిందలి 'ఉపధ' యనుసంజ్ఞను వివరింపక యేల విడిచిరో తెలియకున్నది. పాణినీయమున 'అలోఽంత్యా త్పూర్వ ఉపధా'అని కలదు. 'అల్లు' అనఁగా అచ్చుగాని హల్లుగాని యేదయినను గావచ్చును. కావుననే తుదివర్ణమునకుఁ బూర్వవర్ణము 'ఉపధ' అని సూరి యనెను. దాని ననుసరించి, 'అమరిచి' లోని ఇకారము తుదివర్ణము. అట్టితుది ఇకారమునకుఁ బూర్వమం దున్నచకారము ఉపధయగును. చకారమునకు లోపముచేసినయెడల ననిష్టరూపము కలుగును. కాన 'అమర్చి' అనురూపసిద్ధికై తుదయచ్చునకుఁ బూర్వమం దున్న యచ్చు 'ఉపధ'యనిన సరిపడును. ఉపధ కట్టివిభిన్నపరిష్కార మే

దున గసడదవాదేశము రాక "సంతోషంపడి, సంతోషపడి" అను రూపములే నిల్చునని సిద్ధాంత మొనర్చెను.

కాని యీపూర్వపక్ష మెట్టిదో సిద్ధాంతమును నట్టిదే యనిపించుచున్నది. 'సంతోషపడు, సంతోషంపడు' అనునవి శబ్దపల్లవక్రియలు. సామాన్యముగా శబ్దపల్లవకార్యములకు నియమము కనరాదు. పడు ధాతుపరకత్వమున మువర్ణకమువంటిదానికి నొకేవిధము లగుకార్యములు ఘుణాక్షరముగ సరిపడినవికదాయని యన్నిటికిని గార్యకల్పనము కుదురనేరదు. "విజయంచేయు" అనుదానిమువర్ణకము బిందువు, 'వేంచేయు, విచ్చేయు' వానియవయవార్థమును సాధించునవకాశ మేది ? కావుననే అథర్వణాచార్యులు నన్నయగారు చెప్పనిశబ్దపల్లవక్రియలకు స్వరూపము నిరూపించుచు, "క్వచి న్నైవ వికారః స్యా ద్రూఢత్వాచ్ఛబ్దపల్లవే" యని శాసించెను. దాని ననుసరించుచు 'చేకొని'ఇత్యాదౌ న గకారాదివర్ణవికారః" అని యహోబలుఁడు 268సూత్రవ్యాఖ్యయందుఁ జెప్పుచు నిచట గసడదవాదేశనిషేధమున నొనర్చిన యీ శాస్త్రచర్చ యంతయు నకాండతాండవ మనిపించుచున్నది.

"భయముపడెను" అనునెడ భయమును బొందెను—అని యర్థమైనపు డది శబ్దపల్లవము కాకున్నను క్షతిలేదు. 'భయపడి' అనునపుడు భీతిల్లు—అనుసాముదాయికార్థమున శబ్దపల్లవము కాకతప్పదు. అట్టియెడ "క్వచి న్నైవ వికారః స్యా" త్తనుమీఁదికారికచే గసడదవాదేశనిషేధము సులభముగాఁ బ్రాప్తించుచుండ వెనుకటిశాస్త్రార్థచర్చ యంతయు వృథాయని శాస్త్రిగారియభిప్రాయమును గావచ్చును.

శబ్దపల్లవములనుగూర్చి 268 సూత్రవ్యాఖ్యలో అహోబలుఁడు చేసినవిచారణమును శాస్త్రిగారివివరణమును జూచినయెడల సర్వమును విశదము కాఁగలదు. గ్రంథవిస్తర మగునని యీవిషయ మింతతో మాని యిఁక నొక్కవిషయముమాత్ర ముదాహరింతును.

"ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" (74 సూ.) అను దాని వివృతియందుఁ దత్సమమిశ్రమాచ్ఛికసమాసములన్నియు విశదముగాఁ గలదు. "షష్ఠి భవే ద్వితీయాసేల్యా" అను సూత్రమునకును "లోపశ్చ విభక్త్యాదేః" అను సూత్రమునకును గలసంబంధ ముదాహరణములతో విపులముగాఁ జర్చింపఁబడినది.

"అంద్వంద్వానాస్తు సప్తమీ" అను సూత్రవివరణమునందుఁ గొన్ని తెలుఁగునామములమీఁదను, క్రియలమీఁదను సప్తమీప్రత్యయములు వచ్చునప్పటివిశేషములను శ్రీశాస్త్రిగారు చక్కఁగా సవరించినారు. ఆవిషయము తెలియనియెడల విద్యార్థులకేకాదు, పండితులకును సుబంత తిజంతప్రక్రియ సుగమము కానేరదు.

అహోబలునిగ్రంథము ననుసరించుటయేకాక, విశేషము లున్న కావున శ్రీశాస్త్రిగారు చేసినవిమర్శనము లందందుఁ జక్కఁగఁ గలవు. అవి పండితుల నావర్జింపఁగలవటేమో కలవని నేను వ్రాయుట స్తవము కావచ్చును. కావున నీవిషయమున సహృదయులగు విజ్ఞులే ప్రమాణము.

పరీధావి జ్యేష్ఠశుద్ధ సప్తమీ
భానువాసరము
కొమానపల్లి (కోనసీమ)

విద్వజ్జనవిధేయుఁడు,
'కవిభూషణ, విద్వత్కవిశేఖర'
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి



ఓం

శ్రీ రామచంద్రాయ నమః

# కవిశిరోభూషణవివృతి

## అభివాదము

శ్లో. శ్రీవాఙ్మయా శ్రీశవిరించిశర్వా
వక్షోముఖాంగేషు సతీ ర్దధానాః
వాగర్థపూర్ణాభ్యుదయార్థినో మే
స్వస్తిప్రదా స్స్యుః పురుషాః పురాణాః.

శ్లో. అన్యోఽన్యభావావగతిక్రమోత్థై
ర్యా తోషయే త్ప్రాణికులం వచోభిః
సా నాదసౌమ్యా, శ్రుతిమాత్రగమ్యా,
బ్రాహ్మీ ముఖే ఖేలతు మేఽక్షరాఽఽద్యా.

శ్లో. ఆర్యప్రాకృతభాషాసు యే వ్యాకృతివిచక్షణాః
తాన్ వందే శబ్దశాస్త్రామృతాపారాంభోధిపారగాన్.

క. ప్రాకటగీర్వాణాంధ్ర
వ్యాకరణగ్రంథనిర్వహణచణధిషణా
శ్రీకులకున్ మ్రొక్కెద భా
షాకల్పకములకుఁ జిరయశఃకాయులకున్.

క. శ్రీవాగనుశాసను, వి
ద్యావన్మాన్యు నథర్వణాచార్యు, మహా

కోవిదు బాలసరస్వతి
భావించెద నాంధ్రవాఙ్మబంధనపటులన్.

కం. సునిశితపాండిత్యోద
గ్రుని గీర్తించెదను "కవిశిరోభూషణ" క
ర్తను, శ్రీమదహోబలపతి
ననవరతశ్రీరఘునాథార్చాసక్తచరితున్.

ఉ. ధీమహితుండు నన్నయ సుధీమణి మెచ్చఁగ 'నాంధ్రశబ్దచిం
తామణి' యన్న వ్యాకృతి నొనర్చె, నహోబలనాథపండితా
గ్రామణి తద్వ్యమూల్యము సుప్రియభాష నొనర్చెఁ దానినా
యీమతిమన్మతానుకృతి నే 'వివృతిన్' విరచింతు నెంతయున్.

చ. విలసితశాస్త్రపట్కమును వీనుతిఁ గన్నవిదగ్ధుఁడయ్యహో
బలపతి దివ్యవాగ్జటిలభాష్య మొనర్చిన వ్యాఖ్యకున్ మెఱుం
గులు దగఁ దెల్పునన్ 'వివృతి'గూర్చుట నావశ మెంతలేసియు
య్యాలతన, నోటఁ జప్పవలెనా సనవగాంబలమాట మీఁదటన్.

శా. ఆర్యాప్రోక్తనధర్మసంస్కృతినులు, శిష్టాచారముల్, కాలనీ
గాయత్ర్యుద్గతి మాఱుచుండునటు లన్యాన్యాకృతుల్ గాంచి, భా
షాయోషామణి మాఱుచుండుటది నైజంబౌట, నాద్యాంధ్రభా
గాయోగస్థితి మాఱుఁగాన బుధులారా! మాఱుఁ బో వ్యాకృతుల్.

గీ. శబ్దసాధుత్వనిశితవిజ్ఞతను గూర్చి,
విమలబహుళాంధ్రభాషాప్రవీణత నిడి,
మద్వివృతి యిది సువదసంపదను సుకృతిఁ
బదపదంబున సమాకరింపంగ వలఁతి.

క్రీ. శ. పదునొకండవశతాబ్ది నాంధ్రకవితాప్రవర్తకుఁ డగుచున్న పార్యుఁడు తనప్రభు వగురాజరాజనరేంద్రకోరికపై శ్రీవేదవ్యాసప్రోక్తమగు శ్రీమన్మహాభారతమును దెలిఁగించుట ప్రారంభించెను. తనకార్యమున కనుకూలముగ నుండుటకై యాతఁడు సంస్కృతభాషాపదములను దెలుఁ

గులోనికిఁ దెచ్చికొనుటకొఱకు యత్నముసల్పుచు నప్పు డున్నకవిపండి తులవ్యవహారము ననుసరించి కొన్నిభాషావిషయకానుగమముల నిర్ణ యించుకొని వానిని గీర్వాణభాషలోఁ దనజ్ఞాపకార్థము కారికలరూప మున వ్రాసికొనె ననియు, నవియే కాలాంతరమున 'చింతామణి' యను పేరఁ బరఁగినవనియుఁ, గావుననే తరువాతివా రాకారికలను 'నన్నయ భట్టీయ'మని పేర్కొనుట తటస్థించిన దనియు నభిజ్ఞులు వాకొందురు. ఇందలి యనుగమములు తత్సమముల కధికముగను దెల్గుభాషకత్యల్పముగను నగపడుచున్నవి. అచ్చాంధ్రపదములసంఖ్యయును లోకమువలనఁ దెలియనగునని యాతఁడు తలంచెను. కావుననే "సిద్ధిర్లోకాద్దృశ్యా" అని వచించియున్నాఁడు. తరువాత గణనీయులఁగనినకవు లందఱును నన్నపార్యుఁడు తనభారతమునఁ బ్రయోగించినసరణి ననుస రించి భాషాపదములఁ బ్రయోగించియే తమగ్రంథములను విరచించి కొనిరి. ఈవిషయము నప్పకవియు నహోబలపండితుఁడు నంగీకరించి యున్నారు. కవు లందఱు నాపద్ధతినే యనుసరించినను గాలాంతరమున వానిలోఁ గొన్నిమార్పులు కల్గినవి. వానినే తరువాతవచ్చినలాక్షణికులు నిర్వచించియున్నారు.

"ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
నేది వచింపఁగాఁబడెరా నెందును దాని నెగాని సూత్రసం
పాదన కేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటి గూర్చి చెప్పఁగా
రాదని దక్షవాటికవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్.
"ఆమాఁడుపర్వములలో
సామాన్యుఁడు నుడువుతెలుఁగు లరసికొని కృతుల్
దాము రచించిరి తిక్కను
ధీమణి మొదలైన తొంటితెలుఁగుకవీంద్రుల్"

(అప్పకవీయ పీఠిక 46, 47 ప.)

"శబ్దానుశాసనకృతాఽఽదిమపర్వముఖ్య
పర్వత్రయేణ కథితం పదమేవ యోగ్యమ్

సాన్యత్ర త్రిభిరాంధ్ర సర్గా సూత్రాణ్యప్యద్వైః
లేవం కృతో హి నియమః కవిరాక్షసేన."

(కవిశిరోభూషణము పీ॥ 64 శ్లో.)

అప్పకవియుఁ గవిశిరోభూషణకర్తయుఁ గొన్నిపదులవత్సరముల వ్యవధానముతో నొక్కశతాబ్దిలోనివారే యగుచున్నారు. పదునేడవ శతాబ్ది వీరికాలము. బాలసరస్వతి పదునాఱవశతాబ్దిలోనివాఁడు. అప్పకవి చెప్పినకవిరాక్షసుఁడు వీరికంటె సుమారు నూటయేఁబదివత్సరములకుఁ బూర్వపువాఁడై యుండవచ్చును. ఆతనినాఁటికి నన్నయకారికలకు వ్యాకరణత్వప్రతిపత్తి రూఢము కాలేదు. ఆకారణముచే నతఁ డట్లు చెప్పియుండ నోపును.

పదుమూఁడవశతాబ్దియం దథర్వణాచార్యులుగారు చింతామణికారికలను వివరించిరి. వాని నప్పటిపండితు లందఱు 'నథర్వణవ్యాకరణ' మని పిలిచిన ట్లగపడుచున్నది. దాని కానాఁడు ప్రసిద్ధి లేదు. కావుననే కేతనపండితుఁడు తన దే తెలుఁగునకు మొట్టమొదటివ్యాకరణమని వచించియున్నాఁడు.

పదునాఱవశతాబ్దియందు సిద్ధుఁ డొకఁడు నన్నయకారికలప్రతి నొకదానిని బాలసరస్వతి కిచ్చి "దీనికిం టీక వ్రాయుము" అని యాదేశించి వెడలిపోయెనఁట. అప్పుడే చింతామణికి వ్యాకరణత్వప్రతిపత్తి కల్గినదని తెలియుచున్నది. దానికి బాలసరస్వతి టీక వ్రాసెను. అది యిపుడు 'బాలసరస్వతీయ'మని వ్యవహరింపఁబడుచున్నది. పిదప మఱి యేఁబదివత్సరములనాఁడు మాతంగశైలనివాసి యగుసిద్ధుఁ డొకఁడు చింతామణిప్రతి నొకదానినప్పకవి కిచ్చి, దానికిఁ దెనుఁగు వ్రాయుమని యాదేశింప నీతఁడు తద్భావము నాంధ్రపద్యములలో వివరించెను. దానినే 'యప్పకవీయ' మనుచున్నారు. కాని యందుఁ జింతామణిలోని మూఁడుపరిచ్ఛేదములుమాత్రమే వివరింపఁబడినవి. మిగిలినవి లేవు.

బాలసరస్వతి తన కొక చింతామణిప్రతియు, నప్పకవి తన కొక చింతామణిప్రతియు లభించినట్లు చెప్పుకొనిరి. కాని యీరెంటికిని నామసామ్యమేతప్ప విషయసామ్య మున్నట్లగపడదు. కవిశిరోభూషణకర్త యగు ప్రభంజనము అహోబలపతిపండితుఁ డావిషయమును స్వీకరించి నుడివియున్నాఁడు.

"మతఙ్గశైలవిప్రేన్ద్రా దన్యద్వ్యాకృతిపుస్తకమ్
కాకునూర్యప్పకవినా గృహీతం తత్ర షద్గతాః"
"పాఠభేదాస్తు బహవో దృశ్యన్తే పుస్తకద్వయే
మయా ప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే"
"అప్పార్యపుస్తకారూఢపాఠభేదాద్య దర్థితమ్,
మయా సంగృహ్యతే రూపం తదప్యాథర్వణోక్తితః"
(కవిశిరోభూషణపీఠికా – 71, 72, 73 శ్లో.)

విభిన్నపాఠములతోఁ గూడిన రెండుచింతామణిప్రతు లున్నట్లును నారెండుప్రతులపాఠములును విభిన్నములుగా నున్నట్లును పై గ్రంథము స్పష్టముచేయుచున్నది. ఆరెండుపాఠములలో బాలసరస్వతిపాఠమునే యహోబలపతి గ్రహించినట్లు చెప్పుటచే నానాఁటిపండితు లందఱు బాలసరస్వతికి లభించినపాఠము నన్నయప్రోక్తమనియు, మిగిలినది కాదనియు నూహించియున్నట్లు వ్యక్తమగుచున్నది. మఱియు నప్పకవి పుస్తకములోనిపాఠభేదములవలన సిద్ధించినరూపముల నథర్వణకారికల వలన సంపాదించుచున్నానని యహోబలపండితుఁడు చెప్పుటచే నప్పకవీయచింతామణి యథర్వణకారికలు చెప్పినవిషయములతో మేళవింపఁబడియున్నదని స్పష్టపడుచున్నది. మఱియు నాకాలమున నథర్వణవ్యాకరణమని ప్రసిద్ధి నందియున్నకారికల నహోబలపతి సంగ్రహించి వానికిఁ జింతామణికారికతో సంబంధ మున్నట్లు తెలిసికొని వాని నాయాచింతామణికారికలక్రింద జతపఱిచినను నారెండింటికిని గలసంబంధమును వ్యక్తముచేయక యప్పటి పండితాభిప్రాయానుసారముగ వానిని వేఱు వేఱు వ్యాకరణములుగనే వ్యాఖ్యానించినాఁ డని

యూహింపఁదగినది. దీనిచే సద్యాపేక్షులు చెప్పిన—చెప్పుచున్న 'చింతామణికారికలను బాలసరస్వతియు, నథర్వణకారికల నహోబలపతియు వ్రాసెను' అనుసిద్ధాంతము పరాస్తమగుచున్నది కదా!

చింతామణికారికలు నన్నయభారతభాగములందలి రచనములను సంస్కరించుచున్నవనియు, నథర్వణకారికలు (వికృతి వివేకము) నన్నయభారతత్రయయుక్తములగునాంధ్రదేశ్యతద్భవములను సంస్కరించుచున్నవనియు నహోబలపతి యొకప్రక్క వివాదము చేయుచు మరొకచో వేఱువేఱు వ్యాకరణములని గ్రంథమునందంతటను చెప్పినను నొక్కచోటమాత్ర మాసంబంధ మనఁగాఁ జింతామణికి వికృతివివేకము వివరణ మనుసంగతి నాతఁ డంగీకరించినట్లగపడుచున్నది. "పే"వివిధ క్రియ సంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ దుల్యాదే ర్నామ్నాం స్మి న్హేహి విభక్తౌ సమాసే చ' అనుసూత్రమును వ్యాఖ్యానించుచు నహోబలపతి 'హిశబ్దతః=ప్రసిద్ధార్థక 'హి' శబ్దప్రయోగాత్' అని వ్రాసెను. నన్నయగారు 'హి' అనుదానిని పై కారికలోఁ బ్రయోగించుటచే నథర్వణాచార్యులుగారు దాని నాధారముగాఁ దీసికొని యీవివిధక్రియకార్యములను విస్తరించిరని చెప్పికొనిరి. ఆవిషయము చింతామణివికృతివివేకములకుఁ గలసంబంధమును వ్యక్తపఱుచుచున్నది. అయుంశము నహోబలపండితుఁ డీయెడ నంగీకరించెను. ఈయెడమాత్రమే యహోబలుఁ డారెంటికిఁ గలసంబంధము నంగీకరించెనుగాని మఱెచ్చటను నంగీకరింపలేదు.

"నడుగు రాదుమాట పాటియు దగఁ జెల్లు, నొక్కఁ డాడుమాట యొక్క యెందు" అనునానుడిచొప్పున నహోబలపండితుఁ డప్పకవిసిద్ధాంతమునకును నప్పటికవిపండితులసిద్ధాంతమునకును, విరుద్ధముగ సిద్ధాంతము చేయుటకు జంకెనని పై విషయమునుబట్టి యూహింపవలసియున్నది. అప్పకవ్యహోబలపండితులును వారి ననుసరించి బాలప్రౌఢ

వ్యాకర్తలును 'ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టనకారము ద్రుతసంజ్ఞకమని సిద్ధాంతముచేసిరి. దాని కనుగుణముగాఁ దదనంతర కవిపండితులు ప్రాచీనపాఠములను సరిపెట్టుటకు సాహసించుచు వచ్చిరే గాని ప్రాచీన మగువ్యంజననకారద్రుతసిద్ధాంతము ననుసరించుట కంగీకరింపలేదుగదా! పండితసంఘము చేసినసిద్ధాంతముల కంత ప్రాబల్యమున్నదని తేలుచున్నది.

“మయా ప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే” అని చెప్పినట్లే యహోబలపండితుఁడు తఱచుగా బాలసరస్వతీయచింతామణిపాఠమునే యనుసరింతునని చెప్పినను నప్పకవీయాపసిద్ధాంతపాఠములనుగూడ ననుసరింపకపోలేదు. అదియు నానాఁటికవిపండితుల సిద్ధాంతప్రాభవముచేతనే యని చెప్పక తప్పదు. తెనుఁగుపదముల మొదట 'యకార' ముండదని 'అద్యాః క్రియాసు' అను బాలసరస్వతీయ చింతామణి చెప్పుచున్నను దాని నచట యథాస్థితముగా వ్యాఖ్యానించియు, నప్పకవీయచింతామణిలోనున్న 'వికృతిపదాదౌ ప్రథమా స్తస్తృతీయానునాసికా న స్తః। క్వచిదపి న స్త ఉదాత్తౌ దన్త్యోష్ఠభవస్య వికృతిశబ్దాదౌ' అనుపాఠమునం దాదరము చూపి తెనుఁగుపదముల మొదట యకార ముండదని చెప్పి యప్పకవీయములోని 'అద్యాః క్రియాసు భూతాద్యర్థకముద్ద్యోతినం వినా సర్వాః' అనునవపాఠమే సమంజసమని సిద్ధాంతీకరించెను. ఇట్టివిషయము లన్నియు నాయాసూత్రములకడ నావివృతిగ్రంథమున సవిస్తరముగ వివరింపఁబడినవి.

రాజమహేంద్రవరమును రాజరాజమహేంద్రుఁ డనురాజు పాలించెననియు నాతనికి రత్నాంగి, చిత్రాంగి యనునిరువురు భార్య లుండిరనియు, రత్నాంగికి సారంగధరుఁ డనుకుమారుఁ డుండెననియు, జిన్నభార్య యగుచిత్రాంగిమాయమాటలను నమ్మి రాజు తనకుమారునికాలుసేతులు నఱకించి యడవిలోఁ బాఱవేయించెననియు, నొకకథ

యాంధ్రదేశమునఁ బ్రబలినది. అప్పటికిఁ [illegible]
గాని యప్పకవి యిట్లు వచించెను. సారంగధరుఁడు చిన్నవాఁడు [illegible]
య్యాగారికడ నీకారికల నధ్యయనము చేసెననియుఁ [illegible]
డైన యాతఁ డొక సిద్ధునియనుగ్రహమునఁ గరచరణము [illegible]
లలోఁ గలిసిపోయియుఁ దాను [illegible] ప్రాయమున [illegible]
నేర్చిన నన్నయానుగమకారికల నొకపత్రమున [illegible]
వ్యాఖ్య వ్రాయుమని యొసంగెననియు వ్రాసెను. [illegible]
శతాబ్దినుండి పదునాలవశతాబ్దివఱకుఁ జింతామణికారికల [illegible]
కెఱుకపడకుండుటకుఁ గలహేతు వీచరిత్రమూలమునఁ గుదురుచున్న
న్నను జారిత్రకవిమర్శకు లీచరిత్రము మన తెనుఁగుదేశమునకు సంబంధిం
చినది కాదనియు, మాళవదేశమునకు సంబంధించినదనియు నిష్కర్ష
చేసి చెప్పియున్నారు. అహోబలపతియు నప్పకవి ననుసరించి యీవిష
యమెల్ల వ్రాసియున్నాఁడు. చరిత్రోపకరణసామగ్రి [illegible]
వారికి లభ్యపడకుండుటయే వా రిట్లు వ్రాయుటకు హేతు [illegible]
నని యూహింపవలసియున్నది.

శ్రీమదహోబలపండితుఁడు వ్రాసిన యీకవిశిరోభూషణమును
బట్టి యాతని కన్నిశాస్త్రములలో నిరతపాండిత్య మున్నట్లు వ్యక్తమగు
చున్నది. చింతామణినిగూఢాభిప్రాయములను లోకమునకు వ్యక్త
పఱుచుటకై నన్నయయే తానుగా నవతరించినట్లు చెప్పికొనినాఁడు.
దీనింబట్టి యాకాలమునం దింతటిపండితుఁడు మఱియొకఁడు లేఁడని
తోఁచుచున్నది. ఈతఁడు వ్రాసినకవిశిరోభూషణభాష్యమును, గాళిందీ
కన్యాపరిణయప్రబంధమును దద్విషయమును వ్యక్తముచేయుచున్నవి.
అయినను 'ప్రమాదో ధీమతామపి' అనునట్లుగా నాంధ్రభాషాసంప్రదా
యమునకు విరుద్ధము లైనట్టియు, నన్నయాద్యర్థముల కిష్టము కానట్టియుఁ
నిగ్గొన్నివిషయము లిందుఁ బ్రవేశింపకపోలేదు. విభక్తివిపరిణామాన్వ

యములు, ననువృత్తులు, నపకర్షములు, స్థానివద్భావము మున్నగునవి సంస్కృతవ్యాకరణమునఁ బ్రసిద్ధములై యున్నను దెనుఁగువ్యాకరణమునందుఁ బ్రసిద్ధములు కావు. నన్నయాథర్వణు లట్టివాని నంగీకరించిన సూచన లెచ్చటను నగపడవు. నిరాధారముగా నట్టివానికిఁ దెనుఁగునందుఁ బ్రవేశము కల్పించుట సరికాదు. అట్టిచేఁతవలన నాంధ్రభాషాసంప్రదాయవిరుద్ధములు, నన్నయాథర్వణమత విరుద్ధములు నైనరూపములు తెలుఁగునం దేర్పడుట కవి కారణము లైనవి.

శ్రీ శొంఠి భద్రాద్రిశాస్త్రిగారు కవిశిరోభూషణమునకుఁ దెలుఁగునందు విపులవ్యాఖ్య వ్రాసియున్నారు. దానికంటె విశదముగ శ్రీ లక్ష్మీరంజనముగారు ప్రకటించినది యీమధ్య వెలువడినది. నేను మాగురువర్యు లగు 'కళాప్రపూర్ణ' శ్రీవజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారియనుగ్రహముచే సంపాదించిన యాంధ్రవ్యాకరణసిద్ధాంతములను 1936 సం॥ నుండియుఁ బాఠప్రవచనములలోఁ బెట్టుకొని పరిశీలించితిని. అపుడు నాకుఁ గవిశిరోభూషణమునకు వివృతిని వ్రాయవలయునని సంకల్పము కల్గినది. దానికి మాగురుపాదులుగూడ ననుమతించిరి. వారియాజ్ఞానుసారముగ దీని నప్పుడే వ్రాసితిని. కాని ముద్రించుటకుఁ దగినద్రవ్యపుష్టి లేనివాఁడ నగుటచే నింతవఱకు దీనిని వెలువరించు భాగ్యము నాకుఁ గల్గలేదు. ఈగ్రంథము (కవిశిరోభూషణవివృతి) పూర్వోత్తరభాగములుగ (రెండుగ) నుండవలయునని మొదటినుండియు నాచే నుద్దేశింపఁబడినది. సంజ్ఞాసంధ్యజంతపరిచ్ఛేదములను పూర్వభాగముగను, మిగిలినపరిచ్ఛేదముల నుత్తరభాగముగను బ్రకటింపఁ దలఁచితిని. కాని సుహృన్మణులసూచనల ననుసరించి, పాఠకసౌలభ్యమునకై దీని నిపు డొకే సంపుటముగఁ బ్రకటించితిని. గ్రంథాంతమునఁ జింతామణి సూత్రసంఖ్యతోఁ, గవిశిరోభూషణ విభాగసంఖ్యతో నథర్వణకారికా సూచి ననుబంధించితిని.

# సమర్పణము





"కళాప్రపూర్ణ"

శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి మహాశయులు

మ. అతివేలాదృతి శిక్షణం బొనఁగి, యాద్యాంధ్రోక్తివిస్తారసం
స్కృతి నాకున్ గలిగింపఁ, దీర్చినమదీయైకత్కృతిన్ వజ్ఝలా
తతవంశోద్ధరశాస్త్రికప్రథితసీతారామవిద్వద్బృహ
స్పతిపాదాబ్జయుగంబునందు గురుపూజాపూర్తి నర్పించెదన్.

శిష్యవరమాణవ,
వివృతిరచయిత.

బహుగంభీరమగు నీ వ్యాకరణగ్రంథమునందలి సజాతీయ విజాతీయ బహుముఖపదసన్నివేశములు సరిగా గుర్తించి సంగ్రహించుట కేవలకిని సాధ్యపడదేమో! నా యజ్ఞానవిస్మృతులచే బహిర్గతములు గావించిన రత్నములలోఁ గొన్ని కాచమాత్రములు గూడ నుండవచ్చు-కాన, సహృదయ పరీక్షాదక్షు లగు విచక్షణులు దయతో నిరూపించినచో సస్నేహముగ స్వీ కరింతునని సవినయముగ మనవిచేయుచున్నాఁడ.

గుంటూరు, అరండల్ పేటలో నున్న డాక్టర్ కొలచల వేంకటకృష్ణమూర్తిగారి సంస్కృతకళాశాలలో 1966 జూలై 4వ తేదిని నే నుపాధ్యాయుఁడుగఁ బ్రవేశించిన నాఁటినుండియు గ్రంథప్రకటనార్థము తీవ్రయత్నము సాగించుచుంటిని. కాని భగవదనుగ్రహము సమగ్రముగఁ గలుగవలెనుగదా! నేను గుంటూరు వచ్చిన నాఁటినుండియు విద్వత్ప్రియు లగు శ్రీచన్నావఝ్ఝల విశ్వనాథము, M. A. (C. V. N. Dhan) కళాశాలాధ్యక్షులు నాయందు దయాగౌరవవాత్సల్యమును జూపుచు గ్రంథముద్రణవిషయమున నన్ను ప్రోత్సాహపఱచుచుఁ దీవ్రప్రయత్నముతో ముద్రణమునకును, బైండింగునకును వలసియుండు ద్రవ్యమున విశేషభాగమును సమకూర్చి నేఁటికి ముద్రణభాగ్యమును బూర్తిగావించునవకాశమును గల్గించిరి. నేను గోరనంతనే నావిన్నపము వీరు తమగభీరనిశ్చితాభిప్రాయమునుగూడ నొసంగియున్నారు. మహోదారమనీషు లగు వీరికి నాకృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

గీర్వాణాంధ్రభాషలయందు సరసకవులును, పారీణులును, గ్రంథముద్రణాదివిషయములలో సుశిక్షితానుభవజ్ఞులు నయిన వేదమూర్తు లగు బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రిగారు నా కగ్రగణ్యమిత్రు లైరి. నిరాడంబరజీవులు, వినయసంపన్నులు, వ్యవహారచతురులు, పరోపకారపరాయణులు నగువీరు నా గ్రంథముద్రణవిషయముల నన్నింటిని దమపై వేసికొని సర్వకార్యములను స్వీయకార్యములవలె నిర్వ

హించుచు వ్యయప్రయాసములనుగూడ గణింపకుంట నాభాగ్యము. వీరియక్షరశోధననైపుణ్యవిశేషమువలన 'కవిశిరోభూషణవివృతి' అను నాయీగ్రంథము నిర్దుష్టముగను, సమాకర్షకముగను వెలువడఁగల్గినది. అకారణబాంధవు లగునిట్టిమహాశయులకు జీవితావధిగఁ గృతజ్ఞతాంజలి వందనసహస్రముల నర్పించుచున్నాను.

ఆంధ్రవ్యాకరణ విద్యారహస్యములను నాకు బోధించి యీ గ్రంథమును వ్రాయుటకుఁ దగినవిజ్ఞానప్రోత్సాహములఁ గల్గించిన యస్మద్గురుపూజ్యపాదులు, కీ. శే. కళాప్రపూర్ణ, శ్రీవఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిమహోదయుల కిద్దానిని గురుదక్షిణగా సమర్పించుచుఁ గొంతఋణవిముక్తుఁడ నగుచున్నానని తృప్తినొందుచున్నాఁడను.

డాక్టరు శ్రీ కోలచల వేంకటకృష్ణమూర్తిసంస్కృతకళాశాలాధ్యక్షులుగ నుండిన కీ. శే. శ్రీ చతుర్వేది సత్యనారాయణశాస్త్రిమహోదయులవిచక్షణతతో 1966 సం.న దక్షిణాశాలలో నేనొకయుపాధ్యాయుఁడుగాఁ బ్రవేశించితిని. అప్పటినుండి శ్రీ డాక్టరుగారును, వారిసతీమణి శ్రీమతి శ్యామలాంబగారును నన్నును నాసతీమణిని నాబందుగులను దమకుటుంబసభ్యులుగా భావించి, మాకు గ్రాసవాసోదైన్యము లేకుండునట్లు పోషించినారు. నేఁటికి నట్లే జరుగుచున్నది. శ్రీమతి శ్యామలాంబగారు జీవించియుండఁగా నాగ్రంథోత్తరభాగమును డాక్టరు దంపతులకు నంకితముసేయవలయునని సంకల్పించితిని. దురదృష్టవశమున శ్రీమతి శ్యామలాంబగారు జీవించియుండఁగా నాకట్టిధన్యత కలుగలేదు. నేఁటికిఁ గొందఱు వదాన్యులదయచే నాగ్రంథము ప్రకటింపఁబడుటచే నాసంకల్పమును డాక్టరుగారికి విన్నవింపఁగా వారు దయతో నంగీకరించిరి. వైదికవిధానము ననుసరించి, కీ. శే. శ్రీమతి శ్యామలాంబగారి యాబ్దికసమయమున వారికి నాకృతి నంకిత మొనరించితిని. ఏతద్విషయమును లౌకికప్రక్రియానుసారముగా మద్గ్రంథావిష్కరణసమయమునఁ బ్రకటించితిని.

శ్రీ వేదమూర్తులైన బ్రహ్మశ్రీ [illegible] శాస్త్రిగారును, నేనును సంగతకాలము రాజమహేంద్రవరమున శ్రీ కాంగ్రెసులజమీందారుగారి సంస్కృతకళాశాలలో [illegible] పండితులుగాఁ గలిసి పనిచేసితిమి. శ్రీశాస్త్రిగారితో నా కప్పటినుండియు, మైత్రి యేర్పడినది. అది సామాన్యమైనది కాదు; [illegible]. శ్రీ శాస్త్రిగారు సహృదయులును, విద్వత్కవులును నయి యున్నారు. అప్పటినుండి నాకష్టములనుండి నన్నుఁదీసి నాకు సుఖములు సమకూర్చిరి. [illegible] వణమును ముద్రించుట కారంభించి, శ్రీశాస్త్రిగారికి విషయమును దెలుపుచు దీనికి వారిసమీక్షను వ్రాయఁ గోరితిని. [illegible] ల్యమునే నేఁడును జూపుచు ననేకాపూర్వాంశవిశిష్టమగు చక్కని విపుల సమీక్షను వ్రాసి, నాగ్రంథమునకు మెఱుఁగులు దిద్దిరి. 120 సూత్రమున (121 పుటలో) 'యొక్క' అనుషష్ఠీవిభక్తిప్రత్యయమునకు ప్రయోగము లేదని నేను వ్రాయఁగా "నాగర మణిరుచి 'గవ' ప్రకాశావనంగఁ బూర్వార్ధమనంగ నీయొక్కసంగతి లింగపూజావేళలందు...." అనుపండితారాధ్యచరిత్రలోని ప్రయోగమును నాకుఁ జూపి యదియుఁ ప్రక్రియాదశయేగాని ప్రయోగదశ కాదని శ్రీ శాస్త్రిగారు సెలవిచ్చినారు. ఇట్టిమహోపకారులు నగుసవిద్వత్కవిశేఖరులు నగు శ్రీ శాస్త్రిగారికి నాహృదయపూర్వకకృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాఁడను.

ఈగ్రంథ మెంతో కాలముక్రిందటనే వ్రాయఁబడినను నాయసమర్థత నది ముద్రణభాగ్యము నందఁజాలకపోయినది. గ్రంథముద్రణమునకై పలువురు దాతలు నేఁడు ద్రవ్యసాహాయ్యము గావించి నన్నీక గ్రంథకర్తగ లోకమునకు వెల్లడించిరి. అట్టిదాతల కందఱకును నా కృతజ్ఞతను విన్నవించుచున్నాను. నేను గ్రంథ మింతప్పటికిలోఁ జేర్కొన్నవారికిగాక మఱికొందఱు పిన్నలు, పెద్దలు ప్రత్యక్షముగను, పరోక్షముగను, ముద్రణకార్యమునకు ద్రవ్య మిచ్చి, యింకను మఱికొన్నివిధము

లుగ నాకుఁ దోడ్పడిరి. వారిలోఁ జిన్నలకెల్ల నాశీర్వాదములఁ బం
పుచుఁ, బెద్దలకు నాకృతజ్ఞతను నివేదించుచున్నాను.

గుంటూరులో బ్రాడీపేట రెండవలైనులో నెలకొనియున్న వెల్కం ముద్రణాలయమువారు నాగ్రంథమును సొగసుగను, బొంకము గను, నాకర్షకముగను ముద్రించినారు గాన వారికని నాకృతజ్ఞతను దెల్పుకొనుచున్నాను.

గుంటూరు,
29-6-1972

విద్వద్విధేయుఁడు,
విద్వాన్ ఆకెళ్ళ అరుణాచలశాస్త్రి.



శ్రీః

# వేడుకోలు

సహృదయమహోదయులారా!

అష్టభాషావాగనుశాసనుఁడును, మహాభారతాంధ్రీకరణప్రథమప్రయోక్తుఁడును, సకలాంధ్రకవికవితామార్గదర్శియు నగు నన్నయభట్టారకాచార్యు 'లాంధ్రశబ్దచింతామణి' యను పేర నార్యావృత్తములందు నిబంధించిన సూత్రముల కథర్వణాచార్యులు కొంతకాలము తరువాత విస్తృతానుబంధము లనఁదగు కారికలను బెక్కుశ్లోకములలో విరచింపఁగా, వానిపై మరికొంతకాలమునకు సంస్కృతప్రాకృతాంధ్రవ్యాకృతిప్రవీణుఁడును, బహుశాస్త్రపారంగతుఁడును, 'అభినవనన్నయభట్టాచార్య' బిరుదాంచితుఁడును నగు శ్రీమదహోబలపతిపండితుఁడు తనకాలమునాఁటికిఁ బ్రచారమున నున్న బాలసరస్వతీయాప్పకవీయాదిలక్షణగ్రంథముల నన్నిఁ బరిశీలించి, వానియన్నింటికంటెను మించి యత్యంతవిస్తృతముగను విశదముగను బహూదాహరణపరిపుష్టముగను "కవిశిరోభూషణ" మను పేరఁ బ్రౌఢసంస్కృతభాషయందే చింతామణిని వ్యాఖ్యానించియుండెను. అహోబలపండితీయ మగు నీవ్యాఖ్య నిద్దణమగ్గుపండితు లాంధ్రమున వివరించియుండినను, నేఁటిపాఠకలోకమున కంతను సులభగ్రాహ్యముగ నుండునట్లు బహుముఖపాండిత్యసన్నద్ధసన్నాహు లగు బ్రహ్మశ్రీమదాకెళ్ళ అరుణాచలశాస్త్రిమహోదయులు తమ బహుకాలాధ్యాపకానుభవప్రవృద్ధబోధకతాప్రజ్ఞతో, శాస్త్రీయవిమర్శవివరణములతో దీని కాంధ్రభాషలో "వివృతి"ని రచించి, యాంధ్రవ్యాకరణవిద్యార్థుల కత్యంతోపకార మొనర్చి, విద్వదభివంద్యమాను లైరి. శ్రీశాస్త్రుల వారివివృతిగుణవిశేషములను విమర్శప్రవేశమును సోదాహరణముగఁ బూజ్యపాదులు, 'కవితాభూషణ, విద్వత్కవిశేఖర' ప్రముఖసార్థకబిరుదాంకితులు బ్రహ్మశ్రీ సంపరాల సూర్యనారాయణశాస్త్రిమహోదయులు తమ సమీక్షయందు నిరూపించియుంటచే నే నిటఁ దద్విషయ

మును స్పృశించుట చర్వితచర్వణ మగునుగానఁ దద్విషయమును విడిచి యేతద్గ్రంథముద్రణమునకు సంబంధించినవిషయాంతరమును మాత్ర మొకింత విన్నవింతును.

మాన్య శ్రీమదరుణాచలశాస్త్రివర్యులమహత్త్వ మెఱిఁగిన యుదారసహృదయు లనేకులును, దచ్ఛిష్యప్రముఖులును వారికిఁ గొంత యార్థికోపపత్తిని గల్గించుచు వెంటనే యేతద్గ్రంథముద్రణ మొనర్పించుఁడని వారిని బ్రోత్సహించిరఁట. వృద్ధు లగుశాస్త్రిగారికి నది యెంతో ప్రమోదకరమే యయ్యును, వ్రాఁతప్రతి నంతయు సరిగఁ బరిశీలించి, పదవాక్యవిభాగాదులను గుర్తించి, ముద్రాశాలవారు కూర్చినపంక్తుల నెల్ల రెండుమూఁడుసార్లు ప్రత్యక్షరపరిశోధనపద్ధతితో సరిదిద్దునభ్యాసముగాని, యోపికగాని లేకుంటచే బెంగ గొనియుండ, నా కందుఁ గొంతయభ్యాసము గలదని వారి కెవ్వరో సూచించిరఁట. అంత శ్రీశాస్త్రులుగారేతన్ముద్రాక్షరపరిశోధనకార్యనిర్వహణమున నన్ను సాయపడఁగోరిరి. నిష్కామసారస్వతసేవాయజ్ఞాచరణమున జీవితశేషమును గడపునే నిది మజ్జన్మాంతరసుకృతపరిపాకసంఘటితమహాభాగ్యముగ భావించితిని. తొలుత నాయల్పజ్ఞతనుబట్టి జంకియు, నిద్దాన బహుజ్ఞుఁడఁ గాఁగల ననునాశతో వారియాజ్ఞను శిరసావహించితిని. దైవానుగ్రహమున నెట్లో సంపూర్తి గావించితిని. ఱెప్ప వాల్చక నా వేయికనులతోఁ బరీక్షించినను ముద్రాపకపిశాచీ (Printer's Devil) విహితమ్ములై యెన్నో యక్షరములు తాఱుమాఱై యుండకపోవు. కాన నభిజ్ఞలోకము నన్ను దయతో మన్నించి, వాని నెల్ల శ్రీశాస్త్రిగారిలోపములుగఁ దలంపకుండుఁగాక యని వేఁడుకొనుచున్నాఁడ. నా కిట్టిసదవకాశమును బరమదయతోఁ గలిగించినశ్రీశాస్త్రిగారికి నాప్రణామములు.

బ్రాడీపేట, గుంటూరు, విద్వద్విధేయుఁడు,

23-6-72, 'పండితకవిప్రియ' చతుర్వేది అమరేశ్వరశాస్త్రి.

## APPRECIATION

Nannaya's Andhra Sabda Chintamani, Ahobala's Kavi Sirobhushanam and Sri Arunachala Sastry's commentary are unparalleled and will remain eternal works of outstanding originality, merit and scholarship. Sri Arunachala Sastry, a man of eighty, combines in himself the erudition and experience, sense and extra sensory perception, scholarship and creativity and has brought out the subtlities and nuances of the intricate yet difficult aspects of grammar with ease and grace. Sri Sastry's long and fruitful service to the cause of education in general and to Sanskrit in particular will be remembered long by his numerous illustrious students, spread all over the country. A man of such simplicity and virtue, humility and honesty is yet to be found by me. These good qualities proved inadequate to get the funds necessary for the publication of this monumental work that has taken away the precious part of his life. Yet he succeeded. That is a great satisfaction for me. I can neither wish nor pray for anything for I am too young and incompetent to do. This is neither an introduction of the person nor any appraisal of his work but a note from an unknown man about the well known scholar.

**C. V. N. Dhan, M. A.,**
Principal,
RAVI'S COLLEGE.

**Brodipet, Guntur,**
28-6-'72

ఓం

# విషయసూచి





# కవిశిరోభూషణము

## (ఆహోబలపండితీయము)

### మంగళాచరణము

శ్లో॥ శ్రీమద్భూమితలోదరీతనుభవాపత్యోజసత్పుష్కర
స్వాయత్కైరమణి ర్గిరీన్ద్రతనయాచిత్తాబ్జభృఙ్గాగ్రణీః ।
భక్తవ్రాతమనోవ్యథాదవశిఖాప్రోద్భూతవర్షామ్బుదో
రామ స్సర్వజగ న్తి పాతు సతతం కారుణ్యపాథోనిధిః. 1

శ్లో॥ తాపం నో హరతా ద్ధగోజ్జ్వలశిఖాకోటీరపాదాఙ్కితో
గాఢోన్నిద్రకలావిలాసవసతిః పద్మాసుహృద్ద్యోతనః
దీవాలు స్సతతం సమస్తసుమనోబృన్దస్య మోదప్రదో
శేషీ శీతలగోవిభాతి రమతే శ్రీరామచన్ద్రో విభుః. ౨

శ్లో॥ మిత్రత్రాణపరో హి సాధ్వసమ్పాతివ్యగ్రోరుతేజా స్సరి
స్మాథోద్ధతవిదారిమన్యులహర స్సర్వజ్ఞపక్షాశ్రయః ।
నిర్దోషోఽమ్బుజభూహితోదయయుతో మన్దోదరీమ్పూద్వల
ద్భోగేచ్ఛాహరణాకృతి ర్గిశగు స శ్రీరామచన్ద్రో ముఖమ్. ౩

శ్లో॥ నిష్పిష్టోఽక్షీణబాణా న్ప్రతిర ముదయా న్సాగ్వదా విష్కరో
నిర్గోప స్సాధ్వవక్త్రీ ప్రచురతరగుణః పోషితాశేషలోకః
స్వాధీనో రక్తభావః ప్రథితకుటిలతాదోషకాన్యశ్చ నిత్యం
మిత్రశ్రీదానశౌణ్డో భవతు సుఖకరో రామచన్ద్రో నవీనః. ౪

శ్లో॥ నానాఽఖాణ్డఫలాన్వితోఽద్భుతయశ స్సాంధ్యవిభ్రాజిత
స్వచ్ఛామేయగుణప్రసూనమహిత స్సర్వేష్టదానక్షమః

శుద్ధస్వాన్తమునీన్ద్రహృన్మధుకరై ర్నిత్యం సమాలిఙ్గితో
నిర్బీజోఽనఘరామకల్పకతరు ర్యత్నాత్తతోఽవతా న్న స్సదా. 5

శ్లో॥ యత్పాదామ్బుజజం రజో మునివరం త్రేతాగ్నిపూజాక్రియా
కర్తారం ప్రచకార యత్కరపయోజాతోజ్జ్వలో మార్గణః
పౌలస్త్యామ్బుజలోచనామృదులదృక్సంసారపాటచ్చరో
జాత స్తం ప్రణమామి మామకమనఃపఙ్కేజగేహం విభుమ్. 6

శ్లో॥ సీతే తే కుచచక్రవాకయుగళం పశ్యాధునాఽత్యద్భుతం
ప్రాప్తం నో ఖలు రామచన్ద్రకరసంస్పర్శా ద్వియోగం మిథః
భిన్నం నైవ పుపోష కాన్తి మధికా మిత్యాలప న్జానకీ
వక్షోజౌ పరిమర్దయ న్రఘుపతి ర్నిత్యం ప్రదిశ్యా త్సుఖమ్. 7

శ్లో॥ యన్నామామృతపానవైభవవశా ద్గౌరీకురఙ్గేక్షణా
ప్రాణేశః కటుకాలకూటగిళనే దక్షస్స నోఽవ్యా త్ప్రభుః
రామ శ్శ్యామలకోమలామ్బుదరుచిస్తోమాభిరామః కృపా
రామో మైథిలనన్దనేన్దువదనారామో విరామోఽంహసః. 8

శ్లో॥ సంసారనీలవిషభృత్పరిదష్టనష్ట
సారోఽపి యద్భజనతోఽభవ దిద్ధసారః
భక్తవ్రజ స్త దఖిలామరసేవ్యమానం
రామాభిధానపరమామృత మాశ్రయామః. 9

శ్లో॥ లోకే నిజం ద్యోతయితుం జనానాం
శృఙ్గారసాథత్వ మివాతినీలమ్
వన్దారువాచంయమపారిజాతం
వన్దేఽనిశం లక్ష్మణపూర్వజాతమ్. 10

శ్లో॥ లఙ్కాయాం యదుదారవిక్రమయశస్సారప్రకాశక్రియా
దక్షోఽద్యాపి విభీషణాకృతిజయ స్తమ్భ శ్చిర న్నద్భుతః
యూథో రాజతి రాజతాచలనిభాహఙ్కారనిర్వాపణ
ప్రోద్యత్కీర్తిధురన్ధరం త మనిశం సేవే రఘూణాం పతిమ్. 11

శ్లో॥ వసన్త మన్తరే నిత్యం పరప్రకృతిజీవయోః
వన్దే ఘనాఘనశ్యామం పరాత్మానం మదాశ్రయమ్. 12

శ్లో॥ హరినాభిసరోజాతే వసన్తం భ్రమరం భజే
వేదనాదనినాదం తం చతుర్వదన మద్భుతమ్. 22

శ్లో॥ యత్సౌన్దర్యాతిరేకో వదతి కమనతాం జన్మకర్తు ర్విధాతు
స్సర్వబ్రహ్మాణ్డజాగ్రన్నిఖిలకమలదృబ్రహ్మాణ్డలస్యాతిదూరమ్
వన్దే తా మిన్దురేఖాభరణభరణకృత్కేశహస్తాగ్రదేశా
మాశాధీశాలికేశాగణగణితవిభామానితాఙ్గీం నతాఙ్గీమ్. 23

శ్లో॥ సుధాహారప్రధాహారిస్ఫురద్దేహా న్విధే ర్గృహాన్
సుధాధారాధరా స్వన్దే సుధాకరకలాధరాన్. 24

శ్లో॥ విద్యాసఙ్గీతనామామృదురపి కుచతాం ప్రాప్య తే ప్రాప తీవ్రం
కాఠిన్యం తే స్వభావః కఠిన ఇతి వద న్జాతరోషాం విధి ర్యామ్
దోర్భ్యా మాలిఙ్గ్య చక్రే వదనవనరుహప్రస్ఫురన్మన్దహాసాం
సా దేవీ మే ముఖాబ్జే నివసతు నకులీ శారదా పారదాభా. 25

శ్లో॥ నీలాభం కేశపాశం పవిధతలగతా యానకేళీమరాళీ
దృష్ట్వా భీత్యా ప్రయాయా త్సజలఘన ఇతి భ్రాన్తిలీఢా న్తరఙ్గా
వాహిత్వం మే కథం స్యా దితి విధి రనిశం యాం ముఖాబ్జే వ్యభార్షీ
త్సా పాయా దాయతాక్షీ రుచివిజితశరన్నీరదా శారదా మామ్. 26

శ్లో॥ యచ్ఛోణాధరదచ్ఛదామృతరసం వేధాః పిబ న్నాననై
రతృప్తైః క్రమశ శ్చతుర్భి రధికం స్వీయాననానాం ప్రియమ్
త్యక్తుం వా చతురాననాబ్జసహితాం యాం వా విదాతుం స్మర
త్యాకామ స్సా నకులీ ముదా వసతు మే చిత్తామ్బుజాతేఽనిశమ్. 27

శ్లో॥ పఞ్చాక్షరీమనుశిరోమణితారవక్త్రా
స్సమ్బోధ్యతే సగుణనిర్గుణరూపయు గ్యాం
వన్దే త మిన్దుకలికాభరణాభిరామం
రామాభిషిక్తవరదేశికసార్వభౌమమ్. 28

శ్లో॥ విద్యాకుముద్వతీచన్ద్రరేఖాం విద్యాబ్ధినామణిమ్
నీలకణ్ఠమనస్తోమవర్షాకాదమ్బినీం భజే. 29

శ్లో॥ యద్దేహోద్భృతబిన్దుసఙ్ఘపవనాత్ [illegible]
వర్ణైః భూతపతేర్వ్యపన్యాపదప్రమాణ్యదివ్య [illegible]
కృష్ణప్రబ్రహ్మక [illegible]
వన్దే తాం పరబిన్దుసున్దరముఖీం [illegible] 30

శ్లో॥ అత్యన్తశీతలసుధారసదీపితాఙ్గీం
మాయాన్వయదివ్యసరసీరుహగన్ధిశీర్షమ్
హ్రీఙ్కారసౌధతలమఙ్గళదీపరేఖాం
విద్యాం భజామి పరమాద్భుతరూపగాత్రామ్. 31

శ్లో॥ యా వేదాన్తసరోజినీమధుకరీ యా భక్తచిత్తవ్యథా
గాఢధ్వాన్తనివారణద్యుమణిరుగ్యా లోకసమ్మోహినీ
యా మృత్యుఞ్జయహృత్కరీన్ద్రబలవద్వారీ దయాసారిణీ
వన్దే తాం పురవాసినీం సుజఘనాం హ్రీఙ్కారసింహాసనామ్. 32

శ్లో॥ యా గఙ్గాధరదేహపఞ్జరశుకీ యా సాధకత్రాణదా
జ్యోత్స్నాలాస్యభరహాకౌముదీ సురపతిసఙ్కల్పితస్వర్గదీ
యా వారణ్యకముణ్డతాద్యుపనిషన్మాలామ్బుజాతాకర
క్రీడచ్ఛ్వేతపతత్రిణీ గిరిసుతా సా పాతు మాం మన్వహమ్. 33

శ్లో॥ ఓం హ్రీం దుం బీజసమ్పన్నమనురాజాధిదేవతామ్
పోషితాశేషసద్వర్గాం వనదుర్గాముపాస్మహే. 34

శ్లో॥ నానాదర్శనమర్మభేదనమహామేధావలద్వల్లికా
బీజం మన్త్రసహస్రలోచనమనోఽభీష్టార్థచిన్తామణిః
నానాశ్రీపురుషాన్తరఙ్గవశతానిర్వాణనిష్ప్రియా
విద్యా రామసదాశివద్విజయుగ్భీ నిత్యవమే శివనమ్. 35

శ్లో॥ యద్వ్యాకరణవైదుష్యహృతా లోకేశవాగ్రజా
విద్వత్సహస్రకోటిస్థం దాక్షిణ్యరూపముపాస్మహే. 36

శ్లో॥ ఉత్పాదితప్రాకృతలక్షణోఽపి యో
నిర్ధారితప్రాకృతలక్షణోఽభవత్
తం కావ్యకల్పద్రుమకుమ్భవారిధిం
ప్రస్తౌమి వల్మీకసుతం సతాం వరమ్. 37

శ్లో॥ నిర్వికారమనసో యా వికృతేః కారణే అపి
తాం వన్దే కవితామూలకన్దవాగనుశాసనామ్. 38

శ్లో॥ సిద్ధా దదృష్టచర మశ్రుతపూర్వ మేతం
గ్రన్థం సమాసవిశదఞ్చ చకార వాచ్యమ్
యా గాఢగూఢమపి బాలసరస్వతీ సా
నుత్యా కథన్న న భవే దెలకూచివంశ్యా. 39

శ్లో॥ షడ్దర్శనీలాభరతా మునీన్ద్రా
షడ్దర్శనీజన్మభువో వితన్ద్రాః।
యస్మాత్ప్రవృత్తి మీయు స్త ముదారవిద్యా
ధుర్యం ప్రపద్యే హృది మాధవార్యమ్. 40

శ్లో॥ యత్కీర్తిస్ఫారదీప్త్యా గతవతి నిఖిలే చిత్రవస్త్రే ప్రపఞ్చే
శ్వైత్యం కఞ్జాతజాతో వికృతినిజకృతిప్రేక్షణే లజ్జిత స్సన్
నాభౌ విష్ణో ర్విలీన స్త మిహ బుధమణి స్తోతు మార్యాం క్షమ స్స్యా
త్కో వా శ్రీమాధవార్యం మధురగుణమణీసిన్ధు మార్యాఘబన్ధుమ్. 41

శ్లో॥ యత్కీర్తి రోచిశ్చురితా స్వనద్యా। ప్రస్పర్ధినీ నూర్వ్యనుతా బభూవ
తం పోలురీవంశపయోధిచన్ద్రం। వన్దామహే మాధవవిద్వదిన్ద్రమ్. 42

శ్లో॥ వాణీ కాననదేశస న్తతగతేః ప్రాప్తాజ్ఞఖేదా భువం
యాతా తత్ర పరాఙ్ముఖీ పతికృతస్వాన్వేషణాఽశఙ్కినీ
యస్మాద్రాత్ర్య పరివర్తితా న్తికజనా జాగర్తి సర్వజ్ఞవః
సోఽయం మాధవపణ్డితో విజయతే సత్యస్య నిత్యాలయః. 43

శ్లో॥ యత్పాణ్డిత్యాధిపత్యశ్రవణపరిణతాశ్చర్యతాధూతమ స్తే
శ స్తే చక్షుశ్శ్రవస్సుశ్రవణవిఘటనాజ్జాతతచ్ఛిష్టితాశఙ్కే
భద్రం నిద్రా త్యనిద్రః కలశజలనిధేః శ్రీనిధి స్తీవ్రఘోషాత్
తం శ క్తః కః ప్రణోతుం యది భవతి మతి స్సాహసం వ్యాఘ్ర మూలమ్. 44

శ్లో॥ లోకాలోకధరాధరచ్ఛదివృతే విశ్వమ్భరాఽఽవాలకే
యత్కీర్తిస్ఫుటకల్పభూజలతికా నిర్బాధ ముజ్జృమ్భతే

శ్లో॥ విద్వత్ప్రకాణ్డగణనాకృతిభిః ప్రయుక్తో
యద్వాచి పణ్డితపదా దవధారణే నుః
స న్తం సుధీహృది సతీర్థ్యవనీవస న్తం
భక్త్యా ప్రణౌమి సతతం మమ మాతులం తమ్. 52

శ్లో॥ స్ఫీతాయత స్సకలవేదశిఖావతంసా
యాఽభూ త్తథా ప్యమలరామపదైకవాఞ్ఛా
సా చి ద్యదీయహృదయామ్బురుహేఽలయాఽభూ
ద్రామాభిష క్తమతి రస్తు గురు ర్మదే నః. 53

శ్లో॥ అన్యైః సాన్వయా యాతి వినా యే.. హి భూషణమ్
యన్నుతిప్రవణా వాచో యాష్టాగిల తి.. గు..ం సుమః. 54

శ్లో॥ యః ప్రేమా పణ్డితాగ్రేసరహరిగణికాఖ్యద్వయద్దర్శనీహా
కాపణ్డిత్యోదారలీలాచతురిమకలనా దక్షిణామూర్తిదేశే
పుత్రే తన్నామ్ని తస్మాదపి గురు రుదభూ ద్యస్య మయ్యుత్తభాగ్య
మన్మాతు ర్భ్రాతరం తం సకలగుణనిధిం మాధవం భావయామః. 55

శ్లో॥ యేషాం సుధీకృతిఘటాన్తరసత్పదార్థా
జీవాతవోఽపి సతి చేతరి మూకతైవ
సుస్నేహసౌఖ్యమపి నైవ ముదావహం స్యా
త్తేషాం హి దుష్కవిశునా మిహ న ప్రసఙ్గః. 56

శ్లో॥ నిర్నిమిత్తకృపాధారమానసానాం సుధీమతామ్
ధర్మపుత్రే మయి కథం కరుణా సార్థకా భవేత్? 57

శ్లో॥ దోషోఽపి గుణతాం యాతి పణ్డితానా మనుగ్రహాత్
అయ స్సువర్ణతా మేతి సంస్పర్శా త్స్పర్శవేధినః. 58

శ్లో॥ దోషో మహీయా నణుతాం, గుణోఽత్యల్పోఽ ప్యనల్పతామ్
యన్మహిమ్నా భజే త్తస్య బుధ స్యాఙ్ఘ్రి వహాం లవః. 59

శ్లో॥ యేషాం మతి స్సకలశాస్త్రగహనా స్వగస్తి
యేషాం క్రియా నిగమవాఙ్మహిమానయాత్రీ

యేషాం భవే త్ప్రకృతిరేవ గుణప్రమాత్రీ
తేభ్యో నమోనమ ఇదం బుధసత్తమేభ్యః. 60

శ్లో॥ గ్రన్థేఽస్మి న్స్వగ్రథితే నైవ దుష్టశబ్దాః పిశాచికాః
పణ్డితానుగ్రహోదగ్రదివ్యరక్షాబలం శ్రితే. 61

శ్లో॥ యదజ్ఞానదుర్వ్యాధయ ఏవ మూర్ఖవతంసా
నిర్గూఢణాస్తబ్ధకవితాభరణా భవన్తి
సోఽయం సుధీజనశిరోమణి సన్ధ్యశబ్ద
చిన్తామణి ర్విజయతేఽతిగూఢభావః 62

శ్లో॥ నేయం కృతి ర్వ్యాకులవాదలీలా
ప్రబన్ధకర్త్రాఽఽహితమత్సరేణ
గోదాజలే నాశ మవాపితాఽభూ
దిత్యుద్గతాఽఽసీ ద్ధ్వని కింవదన్తీ. 63

శ్లో॥ శబ్దానుశాసనకృతాదిమపర్వముఖ్య
పర్వత్రయేణ కథితం పదమేవ యోగ్యమ్
నాన్య త్ప్రయోగసరణా వనుశాస్త్రదృష్టే
రేవంకృతో హి నియమః కవిరాక్షసేన. 64

శ్లో॥ శ్రీతిక్కయజ్వప్రముఖవిచక్షణసుధాంశవః
త దభ్యుపగమాయత్త చేతసః కవనే రతాః. 65

శ్లో॥ వాచానుశాసనా ద్భూమిలోకవాచానుశాసనాత్
నిర్మాణకాల ఏవేమం గ్రన్థం జగ్రాహ బుద్ధిమాన్. 66

శ్లో॥ రాజరాజతనూజాత స్సారజ్ఞనరబాలకః
స కృత్తః పాణిపాదేన రహితో జనిహేతునా. 67

శ్లో॥ మత్స్యేన్ద్రనాథసిద్ధేన్ద్రమహిమ్నా సిద్ధతాం గతః
జగ్రాహ వ్యాకృతిం తస్మా త్కవి ర్గ్యాలపగస్వతః. 68

శ్లో॥ ఎలకూచికులామ్భోధి [illegible]
సమస్తకవితాదక్షో వత్సరే కీలకాహ్వయే. 69

శ్లో॥ తత్ర పఞ్చపరిచ్ఛేదా శ్శబ్దశాస్త్రే నియన్త్రితాః
ఆర్యాఖ్యపద్యై స్తత్సఙ్ఖ్యా సమ్మితా స్యా ద్గజైర్గజైః. 70

శ్లో॥ మతిజ్ఞశైలవిప్రేన్ద్రా దన్య ద్వ్యాకృతిపుస్తకమ్
శాకునార్యప్పకవినా గృహీతం తత్ర సద్గతాః. 71

శ్లో॥ పాఠభేదాస్తు బహవో దృశ్యన్తే పుస్తకద్వయే
మయా ప్రాయ స్సరస్వత్యాః పుస్తకం పరిగృహ్యతే. 72

శ్లో॥ అప్పార్యపుస్తకారూఢపాఠభేదా ద్య దుత్థితమ్
మయా సఙ్గృహ్యతే రూపం తద ప్యాథర్వణో క్తితః. 73

శ్లో॥ నియామకత్వ మారూఢా నాత్మదణ్డిముఖాః కథమ్
పూజ్యా భవేయు రాచార్యసరణౌ రతిదూరగాః. 74

శ్లో॥ ప్రసిద్ధసారఙ్గధరేణ టీకామపి స్ఫుటీకర్తు మతీవ మార్గాత్
వాతూలవంశేఽ వతతార భూయ శ్శ్రీనన్నవిద్వా నహమేవ సోఽస్మి. 75

శ్లో॥ టీకా బాలసరస్వతీః విరచితా శుద్ధాన్ధ్రవాగ్గుమ్ఫితా
సూత్రప్రోక్తపదార్థమాత్రకథనప్రక్షీణశక్తి స్తతః
శ స్తుష్యే ద్భువి పణ్డితైః కవివరైః కిఞ్చాన్ధ్రపద్యై ర్మితో
గ్రన్థోఽ ప్యప్పకవే ర్ముదం దిశతు నో విద్వత్కవీనాం ఘనామ్. 76

శ్లో॥ కామం సన్తు పరశ్శతం సుకవయో గమ్భీరవాగ్గుమ్భనా
రమ్భోజ్జృమ్భితవైభవా మదుదితం వాక్యం శ్రుణుధ్వం పరమ్
విద్వాంసః కవయ స్త్వహోబలపతేః కోవాఽఽన్ధ్రభాషామణే
ర్విజ్ఞానే సదృశో విచక్షణమణి స్సర్వావనీమణ్డలే. 77

శ్లో॥ యన్మార్త్యా కవితామూలకన్దవాగనుశాసనా
జాగృతోఽహోబలపతీ రాజతే స విచక్షణః. 78

శ్లో॥ శ్రీమత్పోలూరిమాధవార్యకరుణాప్రాప్తాష్టభాషాస్ఫుర
త్సారశ్శాస్త్రవిదర్చితాఖిలబుధో వాతూలవంశాగ్రణీః
సర్వానన్దదవాగహోబలపతి ర్వ్యాఖ్యాం కరోతి స్ఫుటం
శ్రీమన్నన్నయభట్టసూత్రవితతే శ్రీరామకారుణ్యతః. 79

శ్లో॥ ఖ్యాత్యర్థం హ్యుభయత్ర వాక్యరచనావ్యుత్పత్తిగాఽర్థినే
నేత్రాణాఞ్చ పురాదివర్ణనమపి శ్రేయఃప్రదత్వం తథా
శ్లాఘ్యత్వం భగవద్గుణాదికథనే తద్వర్ణనే శ్లాఘ్యతా
తద్భేదో న పురాణవక్తృకవిరాడ్జల్పాన్యథాసత్కావ్యయోః. 87

శ్లో॥ సీతాం పద్మకరాం స్వవామతలగాం విద్యుత్సకాశాం ముదా
పశ్యన్నీలపయోదసన్నిభతను స్త్విజ్ఞానముద్రాన్వితః
జానున్యస్తకర స్సభూషణగణో మచ్చిత్తసింహాసనే
నిత్యం ప్రస్ఫురతాత్కృపాజలనిధి ర్మత్పుణ్యరాశేః ఫలమ్. 88

శ్రీః



ఓమ్

విఘ్నేశ్వరాయ నమః

# కవిశిరోభూషణవివృతి

## సంజ్ఞాపరిచ్ఛేదము

**1. సూత్రము. విశ్వశ్రేయః కావ్యమ్ :**

**1. సూ.** సర్వాణి గ్రన్థేఽస్మిన్ పద్యాన్యార్యాగీతివృత్తాని "లక్ష్మైతత్సప్త గణా గోపేతా భవతి నేహ విషమే జః" ఇత్యాదిసామాన్యలక్షణాత్. "త్రిష్వంశకేషు పాదో దలయోరాద్యేషు దృశ్యతే యస్యాః। పథ్యేతి నామ తస్యాశ్ఛన్దోవిద్భిస్సమాఖ్యాతమ్" ఇతి విశేషలక్షణాచ్చ; "ఆద్యర్ధసమా గీతిః" ఇతి పైఙ్గలసూత్రాచ్చ; గురులఘుప్రమాణనిశ్చయాదితత్త్రప్రపఞ్చస్తు 'వృత్తరత్నాకరే' తద్వ్యాఖ్యానే 'లలితే' చ ద్రష్టవ్యమ్.

వివృతి:— ఈగ్రంథములోనిపద్యము లెల్ల నార్యాగీతివృత్తములు. వీనికి గురుసహితము లగు నేడుగణములు సగముపద్యమున నుండును. 'వీనిలో ఒకటి, మూఁడు, అయిదు, ఏడుగణములు జగణము కారా'దని సామాన్యలక్షణము. రెండర్ధములయందును మొదటి మూఁడుగణములు నొకపాదమును, మిగిలినవి మఱియొక పాదమును. ఇట్లు మిగిలినసగము నుండును. ఇట్టి లక్షణముతోఁ గూడినదానికిఁ 'బథ్య' యని పేరు. ఆద్యర్ధముతో రెండవయర్ధము సమముగా నున్నచో 'గీతి' యగునని పింగళసూత్రము చెప్పుచున్నది. గురులఘుప్రమాణనిశ్చయాదు లన్నియు వృత్తరత్నాకరమునను దానివ్యాఖ్య యగులలితమునను జూడనగును. 'ఆంధ్రశబ్దచింతామణి'లోని శ్లోకములు తఱచుగ గీతులై యున్నవి. "ఏవ విభక్తికసంజ్ఞాన్గాః" (సంధి 30 సూ) "నిత్యం దారాదేశ్చ" (అజంత 49 సూ.) "అనుతాం స్త్రియామ్" (అజంత 52 సూ) "ప్రథమైకవచనతుల్యమ్" (హలంత. 54 సూ) అను నీనాల్గు నార్యాశ్లోకము లనియు,

"కేషాఞ్చిదుదన్తానాం" (అజంత 51. సూ) "ఆత్మన ఇమనన్తానామ్" (హలంత. 56 సూ) "ద్విగుకర్మధారయా" (హలంత 69. సూ) అను నీమూఁడు నుద్గీతులు. మిగిలిన వన్నియు గీతిశ్లోకములే" యని వైయాకరణపారిజాతము నుడువుచున్నది.

1. సూ 2. కీర్త్యాదిసమస్తశ్రేయస్సాధనం కావ్య మిత్యర్థః. శుద్ధసారోపలక్షణయా అవ్యభిచారేణ కార్యనిష్పాదకత్వం ధ్వన్యతే. కవయతే వర్ణయతీతి కవిః. సచ "సత్కులీనశ్శుచిర్దక్షశ్ఛన్దోవ్యాకరణాదివిత్। ప్రశాన్తస్సుభగాఽకారో దైవజ్ఞశ్చ కవిర్భవేత్" ఇత్యాదివచనోక్తగుణసమ్పన్నః. సచ వివేకివాచికరౌచికార్థికశిల్పికభూషణార్థిమార్దవానుగతాఖ్యాభిస్సప్తవిధః.

వి :– కావ్యము కీర్తి మున్నగుసమస్తశ్రేయస్సులకును సాధనమని సూత్రార్థము. ఈయర్థము లక్షణావృత్తిచే లభించినది. 'కావ్యము విశ్వశ్రేయస్సు' అనునపు డన్వయానుపపత్తి కల్గినది గదా! శుద్ధసారోపలక్షణచేఁ దప్పక కార్యము నిష్పన్న మగునని ధ్వనిత మగుచున్నది. 'కవయతీతి కవిః' అనువ్యుత్పత్తిచే వర్ణించునతఁడు కవి యగును. అతఁడు – కులీనుఁడు – శౌచము కలవాఁడు – దక్షుఁడు – ఛందస్సు వ్యాకరణము తెలిసినవాఁడు – అందగాఁడు–శాంతుఁడు – దైవజ్ఞుఁడు–నయియుండవలయును. అట్టి కవి – వివేకి – వాచికుఁడు–రౌచికుఁడు–ఆర్థికుఁడు – శిల్పికుఁడు – భూషణార్థి– మార్దవానుగతుఁడునని యేఁడు తెఱఁగులుగ నుండును.

1. సూ. 3. "గుణదోషవిభాగజ్ఞో వివేకీ పరికీర్తితః। అనుప్రాససమాబద్ధపదబన్ధస్తు వాచికః॥ ప్రసాదమధురాయత్తవచనో రౌచికో భవేత్। అర్థసఙ్గ్రహచాతుర్యయుక్తస్స్యా దార్థికః కవిః॥ శిల్పికస్తు భవేద్దక్షః కవనే యమకాన్వితే। సాలఙ్కృతిర్భూషణార్థీ, మార్దవీ రసతత్పరః" ఇతి. తేషాం లక్షణాని సంప్రదాయసక్షోవిద్యాం విద్యాచక్రవర్తినా ప్రతిపాదితాని. తస్య కర్మ కావ్యమ్. బ్రాహ్మణాదిత్వాత్ ష్యఞ్. తచ్చ పఙ్కజాదిత్వా ద్యోగరూఢత్వా ద్రసోల్లసితశబ్దార్థఘటనాదిక మేవ. నతు గమనాదికర్మమాత్ర మిత్యాలఙ్కారికాః.

వి :– కవి చేయుపని కావ్యనిర్మాణము. కావ్యకర్త యగుకవి – వివేకి = పదదోషములను వాక్యార్థదోషములను దెలిసినవాఁడు; వాచి

కుఁడు = అనుప్రాస మున్నగు నలంకారములయందుఁ బ్రీతి కలవాఁడు; రాచికుఁడు = అన్వయకాఠిన్యము లేనిమృదుపదములను గూర్చువాఁడు; ఆర్థికుఁడు = అల్పము లగుపదములతో ననల్పార్థమును జెప్పఁగలవాఁడు; శిల్పికుఁడు = యమకగర్భాదికష్టతరకవితావిధానము నెఱుఁగువాఁడు; భూషణార్థి = అలంకారభూయిష్ఠరచన చేయువాఁడు; మార్గవి = రసమునందభినివేశము కలిగి రచన సాగించువాఁడు. ఈ లక్షణములతోఁ గవి యేడువిధములుగఁ జెప్పఁబడుచున్నాఁడు.

1. సూ 4. కావ్యస్యానేకశ్రేయస్కరత్వముక్తం కావ్యప్రకాశకారాదిభిః—"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే। సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే" ఇతి. అత్ర 'కృతే' 'విదే' 'క్షతయే' ఇత్యాదిషు సమ్పదాదిత్వాద్భావే క్విబన్తా బోధ్యాః. అత్ర కీర్త్యాదిబహుప్రయోజనేష్వపి రసాఽఽస్వాదజన్యా సద్యఃపరనిర్వృతిరేవ ముఖ్యం ఫలమితి రహస్యమ్. తదుక్తం లోచనకారేణ—"చతుర్వర్గవృత్తిరప్యత్ర భవతి, తథాపి చాఽఽనన్ద ఏవ పార్యన్తికం ముఖ్యం ఫలం భవతి" ఇతి.

వి :- కీర్తి, ధనము, లోకవ్యవహారము, అమంగళనాశము, కావ్యమువలనఁ గల్గును. మఱియుఁ జదివిన వెంటనే యుత్కృష్టానందము కల్గును. కాంతాసమ్మితముగ నుపదేశించుటకును గావ్య ముపయోగించుచున్నది యని కావ్యప్రకాశకారాదులు కావ్యమునకుఁ బహుప్రయోజనములను నుడివియున్నారు. ఇట్లు బహుప్రయోజనములు కావ్యమువలనఁ గల్గుచున్నట్లు చెప్పఁబడినను రసాఽఽస్వాదమువలనఁ గల్గిన సద్యఃపరనిర్వృతియే ముఖ్యమగుఫల మని యెన్నవలయును. లోచనకారుఁడును 'ధర్మార్థకామమోక్షరూపచతుర్వర్గవ్యుత్పత్తి కావ్యమువలనఁ గల్గినప్పటికి నానందమే దానికి ముఖ్యమగుఫలము' అని చెప్పియున్నాఁడు.

1. సూ. 5. పౌరుషేయమపౌరుషేయం వా కావ్యం శాసనాచ్ఛాస్త్రమిత్యుచ్యతే. తదుక్తమాచార్యైః—"ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేన వా। పుంసాం యేనోపదిశ్యేత తచ్ఛాస్త్రమభిధీయతే" ఇతి.

వి:- పురుషకర్తృకమైనను నపౌరుషేయమైనను గావ్యము శాసించుటవలన శాస్త్రమనిపించుకొనునని "నిత్యకృతకములలో దేనిచేతనైనను బురుషులప్రవృత్తినివృత్తులు బోధింపఁబడినచో నదియే శాస్త్ర" మని యాచార్యులచేఁ జెప్పఁబడినది.

1. సూ. 6. తచ్ఛాస్త్రం త్రివిధమ్. ప్రభుసమ్మితం, మిత్రసమ్మితం, కాన్తాసమ్మితం చేతి. తత్ర ప్రభుసమ్మితం శాస్త్రం వేదః, శబ్దప్రధానత్వాత్. తస్య ప్రాధాన్యం ప్రవర్తకత్వాదేవ భవతి, తత్రార్థస్య ప్రాధాన్యమాత్రపరిత్యాగో న స్వరూపతః. తదభావే తూన్మత్తప్రలపితవదప్రవర్తకతైవ వేదస్య స్యాత్. న చ పురుషప్రవృత్తిరూపభావనాభిధాయిప్రత్యయమాత్రస్యైవ ప్రవర్తకత్వమ్, న వాక్యస్యేతి వాచ్యమ్, కేవలస్యాప్రవర్తకత్వాత్. నహి భావయేదిత్యుక్తే కశ్చిత్ప్రవర్తతే; కిన్త్వంశత్రయవిశిష్టభావనాఽభిధాయిప్రత్యయే శ్రుతేః ప్రవర్తతే. అతోఽన్తతః ప్రత్యయవిశిష్టవాక్యస్యైవ ప్రవర్తకత్వమ్. తదుక్తమాచార్యైః—"కిమాద్యపేక్షితైః పూర్ణః సమస్తః ప్రత్యయో విధేః। తేన ప్రవర్తకం వాక్యం శాస్త్రేఽస్మిం శ్చోదనోచ్యతే" ఇతి. అర్థవాదగతనామాఖ్యాతానామర్థభావనార్థకత్వావిశేషేఽపి "యవాగ్వా జుహుయాత్" ఇత్యాదౌ లిఙాదీనాం సమ్భావనార్థకతయా న విధిస్థలీయరూపేణ ప్రతీతిరితి తన్త్రసమయః. ప్రత్యక్షావిషయమిష్టప్రాప్త్యుపాయం జ్యోతిష్టోమాదికమనిష్టపరిహారోపాయం కలఞ్జభక్షణపరిత్యాగాదికఞ్చ యేన విదన్తి పుమాంసస్స వేదః. వాఙ్మాత్రేణ ప్రభురివ వేదోఽపి పుంసాం ప్రవర్తకో నివర్తకశ్చ. ప్రభుర్విపక్షే దణ్డయతి. వేదస్తు ప్రత్యవాయం జనయతీతి శబ్దప్రధానత్వమ్. ప్రత్యవాయజనకత్వం స్వరవర్ణయోరన్యథోచ్చారణే దురితశ్రవణాదన్యథానుష్ఠానేఽననుష్ఠానే వా కైముతికన్యాయసిద్ధమ్. అన్యయోస్తు ఫలవదర్థావబోధపర్యన్తత్వాదితి వేద్యమ్.

వి :- శాస్త్రము ప్రభుసమ్మితము, మిత్రసమ్మితము, కాంతాసమ్మితము నని మూఁడువిధములు. అందుఁ బ్రభుసమ్మితమగుశాస్త్రము వేదము. శబ్దమునకిందుఁ బ్రాధాన్య ముండును. విధిప్రత్యయముతోఁ గూడినవాక్యమే యిచట శబ్దము. జనుల నది మంచిమార్గమున నడిపించుచుఁ జెడుత్రోవనుండి మరలించును. ప్రభువు శిక్ష చేయును గాన వేదము ప్రభుసమ్మిత మగుశాస్త్ర మగుచున్నదని ఫలితార్థము.

1. సూ. 7. మిత్రసమ్మితం శాస్త్రం పురాణాదికమ్. తథాహి—పురాణాదికం న వేదవ దేవం కుర్యాన్నైవం కుర్యాదితి విధినిషేధబలేన ప్రవర్తకం నివర్తకం వా; కిన్తు శబ్దవ్యాపారేణ పూర్వపురుషనిదర్శనస్తుతిముఖేన రాగద్వేషావుత్పాద్య మిత్రవ

త్ప్రవృత్తిహేతుభూతమతోఽస్య ప్రాధాన్యమ్. తదుక్తం వృద్ధైః—"బాహుళ్యే ఽపి వా దానాం పురాణేతరప్రధానతా । ప్రవృత్తిర్వా నివృత్తిర్వా తన్మూల్యపదశాం గతా" "వాక్యార్థాదేవ తత్రాపి కావ్యనిర్ణీతయోః ప్రాధాన్యే విపరీత్యం స్యాదుభయో-రుభయోరపి" ఇతి.

వి :- పురాణాదులు మిత్రసమ్మితము లగుశాస్త్రములు. "ఇట్లు చేయుము – ఇట్లు చేయకుము" అని పురాణేతిహాసములు విధినిషేధమూలమునఁ గార్యమునందుఁ బ్రవర్తింపఁ జేయున వియు, నివర్తింపఁ జేయు నవియుఁ గావు. కాని యవి శబ్దప్రాధాన్యమును విడిచి యర్థము నాదరించుచుఁ బూర్వపురుషనిందాస్తుతులచేఁ బురుషునకుఁ గార్యవిషయమునందు రాగద్వేషములు పుట్టించి మిత్రునివలె మంచిపనియందుఁ బ్రవర్తింపఁజేయుచుఁ, జెడుగునుండి నివర్తింపఁజేయును. కావున నివి మిత్రసమ్మితములు.

1. సూ. 8. కావ్యన్తు కాన్తాసమ్మితం శాస్త్రమ్. యథా కామినీ కటాక్ష వీక్షణాదివిలాసాదిభిరేవ కామిన మావర్జయన్తీ "మమేద మభిలషితం కురు, అనభిలషితం మాకురు" ఇత్యనుక్త్వాపి సర్వం సమ్పాదయతి, తథా కావ్యశ్రీరపి వ్యఞ్జనా వ్యాపారమాత్రపరత్వే నోపసర్జనీభూతశబ్దార్థప్రధానతయా శబ్దార్థప్రధానాభ్యాం ప్రభుసుహృత్సమ్మితాభ్యాం విలక్షణా సతీ సమ్పాదయన్త్యుపదేశకారిణీ వ్యఞ్జనా వ్యాపారేణైవ రామాదివ ద్వర్తితవ్యం న రావణాదివదితి కర్తవ్యే సదాచారకరణాదౌ ప్రవర్తయతి, నివర్తయతి చాకర్తవ్యాత్పరదారాపహరణాదికాదిత్యస్యాః కాన్తాసమ్మితత్వ మవగన్తవ్యమ్. అత ఏవాస్యా స్స్వాదనాపాదకేన ప్రవర్తకత్వా ద్భయానునయపురస్సరం ప్రవర్తకాభ్యాం వేదపురాణాభ్యాం విశేష వివక్షిత ఇతి రహస్యమ్.

వి :— కావ్యము కాంతాసమ్మిత మగుశాస్త్రము. కామినీమణి తన కటాక్షవిలాసాదులచేఁ గాముకుని వశపఱుచుకొని "నా కిది యభిలషితము; దీనిం జేయుము; ఇది యనభిలషితము; దీనిం జేయకుము;" అని వచింపకుండఁగనే సర్వాభీష్టములను సంపాదించుకొనుచున్నది. కావ్యలక్ష్మియు నట్లే వ్యంజనావ్యాపారము కల దగుటచే శబ్దార్థము లుపసర్జనములై తత్ప్రధానము లగుప్రభుసుహృత్సమ్మితశాస్త్రపురాణములు

నుపసర్జనము లగుచున్నవి. కావ్యము తద్విలక్షణమై సహృదయుల కానంద మొదవించుచు వ్యంజనావ్యాపారముచేతనే "రామాదులవలెఁ బ్రవర్తింపవలెనుగాని రావణాదులవలెఁ గాదు" అని కర్తవ్యాకర్తవ్యములయందుఁ బ్రవృత్తి నివృత్తులను గల్గించుచున్నది. కానఁ గావ్యము కాంతాసమ్మిత మగుశాస్త్రము.

1. సూ. 9. నచ "కావ్యాఽలాపాంశ్చ వర్జయేత్" ఇత్యాదినిషేధశాస్త్రస్యాత్ర మహిమా, తచ్చ ముద్రారాక్షసాద్యసత్కావ్యవిషయత్వాత్. అన్యథా రామాయణాదే రప్యపరిగ్రాహ్యతా స్యాత్. అధికవిచారస్త్వలంకృతిగ్రన్థేభ్య ఏవావగన్తవ్య ఇత్యుపరమ్యతే.

వి :– "కావ్యాఽలాపములను వర్జింపవలయును" అను నిషేధశాస్త్ర మిచటఁ బనికిరాదు. ముద్రారాక్షసము మున్నగునసత్కావ్యములలో దానివినియోగము. అట్లు చెప్పకున్నచో రామాయణము మున్నగువానిని సయితము మనము విడువవలసివచ్చును గదా! ఇంకను విస్తరవిషయము లలంకారగ్రంథములనుండి తెలియవలయును. కాన వ్యంగ్యప్రధానకావ్య ముత్తమము.

1. సూ. 10. మగణస్యాత్యన్తశుభకరత్వా ద్గ్రన్థాదావాచార్యేణ ప్రయోగః కృతః. తదుక్త మాచార్యైః - "శుభవర్ణా శ్శుభగణా శ్శుభశబ్దా శ్శుభప్రదాః" ఇతి. ఆచార్యేణాప్యుక్తమ్ "శుభవర్ణా శ్శుభశబ్దా యేచ శుభగణాః" ఇతి. మగణస్య శుభకరత్వన్తు "మగణస్సర్వదోషఘ్నస్సర్వసౌఖ్యప్రదాయకః, ప్రయుక్తశ్చేత్ప్రబన్ధాదౌ నగణోఽపిచ తాదృశః" ఇత్యాదివచనైః ప్రతిపాదితమ్. అతఏవ "నిత్యప్రత్యూహ మపాస్తుహే" "విద్యాకైరవకౌముదీ" మిత్యాదిషు కృత్యాదిపద్యేషు మురారిమిశ్రాదిభి ర్వ్యాఖ్యాతృశ్రీమద్భిస్తత్ప్రయోగ ఆదావురరీకృతః. ఆచార్యేణాపి "శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతః" ఇత్యాదిపద్యాదిమశ్లోకాదౌ తదభిషేకః కృతః. అన్యైరప్యాన్ధ్రకవయోఽపి "శ్రీ చన్దోండల రెండు నండఁ గొని" ఇత్యాదిషు తమేవాదౌ బహుమన్యతే.

వి :– మగణము మిక్కిలిశుభద మగుటవలన దాని నాచార్యుల వారు గ్రంథాదిని "విశ్వశ్రేయః" అని ప్రయోగించిరి. "శుభశబ్దములు శుభగణములు శుభవర్ణములు శుభప్రదములు" అనియు, "మగణ

నగణములు ప్రబంధాదిని ప్రయుక్తము లైనచో సర్వదోషములు దొలఁగును, సర్వసౌఖ్యములు సమకూరును" అని యాచార్యులు మున్నగు వారు వచించియున్నారు. మగణము సర్వదోషహరము కావుననే "నిత్యప్రత్యూహం" "విద్యాకైరవ" మున్నగురీతిని మురారి మున్నగు మహాకవులు కృత్యాదిపద్యములలో మొదట దాని నుపయోగించిరి. "శ్రీవాణీ" అని నన్నపార్యుఁడును దనభారతభాగాదిని దాని నుపయోగించెను. "శ్రీచన్ద్రొండల" అని యితరమహాకవులును మగణమునే తమగ్రంథాదిమపద్యాది నుపయోగించిరి.

1 సూ. 11. వకారస్య జలబీజత్వా దాదౌ ప్రయోగ శ్శుభదః – "జలాగ్నా శ్శుభదాయకాః" ఇత్యుక్తేః. కిఞ్చ వకారస్య వరుణో దేవతా, సచ శుభప్రదః–"వరుణస్తు శుభప్రదః" ఇత్యుక్తేః. సాచ్కస్య వకారస్య స్త్రీలిఙ్గత్వేన తత్ప్రయోగ ఆదౌ శుభః "సాచ్కా హలః స్త్రియః ప్రోక్తాః స్త్రియశ్చ శ్శుభదాయకాః" ఇత్యుక్తేః. అల్పప్రాణో వకార ఆదౌ శుభదః,–"అల్పప్రాణాః శ్శుభప్రదాః" ఇత్యుక్తేః. "వకారే తు శుభం భవేత్" ఇతి వర్ణఫలమ్.

వి:– వకారము జలబీజ మగుటవలన దానిని గ్రంథాదిని ప్రయోగించుట శుభకరమని చెప్పుచున్నారు. వకారమునకు వరుణుఁడు దేవత. అతఁడు శుభుఁడు. అజ్యోశిష్ట మగువకారము స్త్రీలింగ మగుటచే దాని నాదిని బ్రయోగించుట శుభదము. అల్పప్రాణప్రయత్నము గలవకారమును గ్రంథాదిని బ్రయోగించుట శుభద మని కలదు.

1 సూ. 12. ఇకారసహితస్య వకార స్యామృతబీజత్వేన శుభదత్వమ్. హ్రస్వమాత్ర స్యామృతబీజత్వాభిధానాత్. వకారస్య క్షీరవర్ణత్వా దాచార్యస్యాపి–సితవర్ణత్వ మున్నీయతే – "సితచ్ఛాయో వవర్ణః" ఇత్యుక్తేః.

వి:- హ్రస్వము లన్నియు నమృతబీజములని చెప్పఁబడుటచే 'విశ్వ' శబ్దములోని 'వి' వర్ణము శుభప్రదమగును. వకారము క్షీరవర్ణ మగుటచే నన్నపార్యుఁడును దెల్లనిమైచాయ గలవాఁడని యూహింప నగుచున్నది.

1 సూ. 13. వకారస్య క్షత్రియజాతి రాచార్యస్య విప్రజాతి రితి యద్యపి జాతే రైక్యమ్. తథాఽపి పర్యాయయోగేఽపి న దోషాయే త్యాచార్యాశయః "పర్యాయయోగే నాతీవ దోషః" ఇత్యుక్తేః.

వి :— వకారము క్షత్రియజాతియు నాచార్యునిది బ్రాహ్మణ జాతియు నగుటచే జాత్యైక్యము లేకున్నను బ్రహ్మక్షత్రియవైశ్యజాతులు కలయిక మిక్కిలిదోషము కాదని చెప్పఁబడుచున్నది.

1. సూ. 14. నకారాదిక్రమేణ గణనాయాం వకారస్య సాధ్యసుసిద్ధత్వేన చక్రశోధనమపి కృత మాచార్యేణ. ఆచార్యతారాయా అనూరాధాయా అక్షరతా రాయా రోహిణ్యాశ్చ గణవిరోధోఽపి న. "ఆదిత్యనరయో ర్యోగే ఫలం మధ్యమ ముచ్యతే" ఇత్యుక్తేః. అత్ర దేవగణత్వం రోహిణ్యాః, నృగణత్వ మనూరాధాయాః ప్రసిద్ధమ్. అనూరాధాయా ఏణయోనిః రోహిణ్యా స్సర్పయోని రితి యోనివిరోధోఽపి పరిహృతః. కృత్తికాముఖనక్షత్రా దారభ్య కర్తృనక్షత్రపర్యన్తం గణనాయాం సంఖ్యాయా స్త్రయోదశసంఖ్యాన్తర్భావా న్నక్షత్రదూరతాఽపి విచారితా.

వి :— నకారము మొదలు వకారమువఱకు లెక్కించినచోఁ జక్రశోధనము ననుసరించి సాధ్యసుసిద్ధ మగుచున్నది. ఆచార్యునినక్షత్ర మనూరాధ; అక్షరతార రోహిణి; రోహిణికి దేవగణత్వము ననూరాధకు మానవగణత్వమును బ్రసిద్ధములు. "ఆదిత్యనరయోగమునందు ఫలము మధ్యమముగ నుండు" నని చెప్పఁబడినది. అనూరాధ కేణ యోనియు రోహిణికి సర్పయోనియు నగుటచే యోనివిరోధము లేదు. కృత్తికాముఖనక్షత్రము మొదలు కర్తృనక్షత్రపర్యంతమును లెక్కఁబెట్టినచో సంఖ్య పదుమూఁడు. అది సంఖ్యకు మధ్యమం దుండుటచే నక్షత్రదూరతయు విచారింపఁబడినదని తెలియుచున్నది.

1. సూ. 15. ఆచార్యరాశే ర్వృశ్చిక స్యాక్షరసమ్బన్ధివృషభరా శ్యపేక్షయా సప్తమస్థానే స్థితత్వా ద్రాశికూటోఽపి విచారితః. మేషవృశ్చికయోరేవ విరోధ స్యోక్తత్వా ద్విరోధోఽపి న.

వి:— అక్షరరాశి యగువృషభమునుండి యాచార్యరాశి యగు వృశ్చికము సప్తమస్థానమునం దుండుటచే రాశికూటమును గుదిరినది.

మేషవృశ్చికములకే విరోధము చెప్పఁబడుటవలన నిందు విరోధము లేదు.

1. సూ. 16. :— వకారస్య చన్ద్రో గ్రహః, నకారస్య గురుర్గ్రహః; ఉభయో స్సితవర్ణయో ర్మైత్రీ త్యక్షరగ్రహాణామపి విచారితా. ఆచార్య రాశ్యధిపతి రఙ్గారకః; అక్షరరాశ్యధిపతి శ్శుక్రః: ఉభయోర్విరోధో న విద్యతే. "అఙ్గారకస్య శత్రు శ్శశిజః; శుక్రస్య సూర్యచన్ద్రౌచ శత్రుభావం గతౌ పురా" ఇత్యుక్తేః.

వి:— చంద్రుఁడు వకారమునకును, గురువు నకారమునకును గ్రహములు. గురుచంద్రులు చల్లనివారు కాన గ్రహమైత్రి కుదిరినది. వృశ్చికమున కంగారకుఁడును, వృషభమునకు శుక్రుఁడు నధిపతులు. శుక్రాంగారకులకు విరోధము లేదు. "అంగారకునకు, బుధుఁడును, శుక్రునకు సూర్యచంద్రులును విరోధులు" అని పెద్దలు చెప్పుచున్నారు.

1. సూ. 17. :— జలాకాశబీజయో ర్యోగోఽపి న దుష్యతి. వహ్నివాయుబీజయోగస్యైవ దుష్టత్వకథనాత్.

వి:— వహ్నివాయుబీజయోగమే దుష్ట మనుటవలన జలాకాశ బీజయోగము దుష్టము కాదు.

1 సూ. 18. :— శకారస్య గురుర్గ్రహః. వకారస్య గ్రహ శ్చన్ద్రః. ఉభయోః సౌమ్యయోః పీతధవళగాత్రయో ర్మైత్రీ త్యాగమే. స్వగాక్షరయో ర్గ్రహశోధన మపి కృతమ్. "బృహస్పతే శ్చన్ద్రసూర్యౌ మిత్రాణి పరికీర్తితాః। మిత్రే ధరేశో శశినో బుధశ్చ రవినన్దనః. శుక్రోఽపి నవిరోధ స్స్యా ద్ధ్రువం పఞ్చాఙ్గవేదినః. శశీను ధవళ చ్ఛాయః పీతగాత్రో గురుస్స్మృతః. శుభాస్స్యుః పీతాఙ్గాః" "శుక్రార్కసౌమ్యా స్తస్య సౌమ్యాః" ఇత్యుక్త్యో ర్జ్యోతిర్విదామ్.

వి — శవర్ణమునకు గ్రహము గురువు. వకారమునకుఁ జంద్రుఁడు గ్రహము. పీతధవళగాత్రులు, సౌమ్యులు నైన యీ యుభయులకును మైత్రి కలదు. కానఁ బ్రథమద్వితీయాక్షరగ్రహశోధనమును జేయఁ బడినది.

1 సూ. 19 :— లిఙ్గత్రయసాధారణ శ్శబ్దో ప్యాద్య శుభదః. "నాఽద్యా క్లీబస్య సాధుతా" ఇతి కేవలక్లీబస్యైవ నిషిద్ధత్వాత్. "బ్రాహ్మణేషు హి షట్కాదివిచారస్య ప్రశస్తతా। తత్రాఽపి గ్రహమైత్రీ తు సుప్రశస్తా ప్రకీర్తితా" ఇతి లాక్షణికో ద్ఘోషః.

వి :— లింగత్రయసాధారణ మగువిశ్వశబ్దమును గ్రంథాదిని ప్రయోగించుట శుభదము. గ్రంథాదిని క్లీబము మాత్రమే యుండ రాదని కేవల క్లీబమే నిషేధింపఁబడినది గదా !

1. సూ. 20. :— మగణద్వయయోగోఽపి శుభప్రద ఏవ. తథాహి ఉభయో ర్హారిణయోనిత్వే నైకయోనిత్వం శుభప్రద మేవ.

వి :- గ్రంథాదిని మగణద్వయయోగము శుభప్రద మగుటయే కాక రెండును హారిణయోను లగుటచే నేకయోనిత్వమును శుభప్రదమే.

1. సూ. 21. :— జ్యేష్ఠానక్షత్రస్య పుంలిఙ్గత్వేన పుంలిఙ్గయో రుభయో ర్యోగే యద్యపి ఫలం కలహః, తథాఽపి "వధూస్స్యా త్ప్రథమో గణః" "పుంతారా స్త్రీ శుభాఽవహా" ఇత్యుక్తే ర్వధూగణంప్రతి పుంలిఙ్గతారాయా శ్శుభత్వేన నైవ దోషః.

వి :- మగణమునకు నక్షత్రము జ్యేష్ఠ. జ్యేష్ఠానక్షత్రము పుంలింగము; పుంలింగము లగురెండునక్షత్రములకలయిక కలహకారక మందురు. అయినను రెండుసారులు వరుసగా నొకగణము వచ్చినపుడు మొదటిగణము వధూగణ మగును. అంతియ కాక పుంలింగనక్షత్రము గల స్త్రీగణము మంగళప్రదము కాన దోషము లేదు.

1. సూ. 22. :— గణద్వయస్యాపి దైత్యగణత్వేన తన్మేళనమపి శుభదమ్.

వి :— రెండుగణములును దైత్యగణము లగుటచే నారెంటిసమ్మేళనమును శుభదమే.

1. సూ. 23 :- రాశికూటవిచారే ప్రథమగణరాశే రారభ్య ద్వితీయగణ రాశిపర్యన్తం గణనా కార్యా. తత్రోభయో ర్వృశ్చికరాశిత్వేన సంఖ్యాయాః ప్రథమత్వా దతివైభవం ఫలమ్. ఉభయోః కుజగ్రహకత్వేన సుఖం ఫలమ్.

వి :— రాశికూటవిచారమునఁ బ్రథమగణరాశి మొదలుకొని ద్వితీయగణరాశిపర్యంతమును లెక్కింపఁగా నందు రెంటికిని వృశ్చికరాశియగుటచేతను, సంఖ్య ప్రథమ మగుటచేతను నతివైభవము ఫలము. రెంటికిని గ్రహము కుజుఁడే యగుటచే సుఖము ఫలము.

1 సూ. 24 :— ఖేటకూటవిచారే అఙ్గారకస్య [illegible] సిద్ధమ్. ఉభయోః పాపఖేటత్వేన యద్యప్యశుభం; తథాప్యేకత్వే [illegible] ఉభయో ర్మృగణత్వేన నైసర్గికకూటేఽపి సామ్రాజ్యప్రదః. [illegible] సంతోషః ఫలమ్.

వి :— అంగారకుఁడు రక్తవర్ణము కలవాఁడు [illegible] పాపి యగును. రెండును పాపఖేటకము లగుటచే శుభమే. రెండును మృగణము లగుటచే నైసర్గికకూటము సామ్రాజ్యప్రదము. రెండును [illegible] ములు కావున రెంటికలయికకు ఫలము సంతోషము.

1. సూ. 25 :— యద్యప్యదుష్టకూటవిచారే ప్రథమగణతా[illegible] ద్వితీయగణతారాపర్యన్తం గణనా కర్తవ్యా. తత్రోభయో ర్[illegible]త్వేన, సంఖ్యాయాః ప్రథమత్వేన, త్రయోదశసంఖ్యాప్రాగ్వర్తిత్వేన, ఫల మల్పజీవితత్వమ్. తథాఽపి "దోషమాత్రం నిరాకర్తుం బ్రహ్మణోఽపి నశక్యతే। బలవత్త్వం [illegible] విచార్యం గుణదోషయోః" "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః" ఇతి న్యాయేన బలవదష్టవిధకూటగణైర్ [illegible] పరిహృత ఏవేత్యాది. ఆదిగతమగణస్యోపరి మగణస్య స్థితత్వేఽపి [illegible] మతీవ దదాత్యేవ. ఏవ మన్యేఽపి గుణా న్సూక్ష్మదృష్ట్యా విమర్శనీయాః. [illegible] ప్రయోగాదిస్వల్పదోషా స్త్వకించిత్కరా ఏవేతి సర్వమపి మఙ్గళమ్.

వి :— నక్షత్రకూట పరిశీలనమున రెండునక్షత్రములును [illegible] నక్షత్రములే యగును. సంఖ్య మొదటిదై యది పదుమూఁడు సంఖ్యకుఁ బూర్వమునం దున్నదికాన ఫల మల్పజీవితత్వమని చెప్పఁబడినది. అది దోషరహిత మని చెప్పుట కెవ్వరికిని శక్యము కాదు గదా! కావున గుణబాహుళ్యమునుబట్టి మేలేర్పడవలయును. చంద్రునియందలి మచ్చవలె సుగుణాధిక్యమున నల్పదోష మగపడదు. బలవంతమగునష్టవిధకూటగణములచే నేకకూటదోషము నిరస్త మగుచున్నది. కాన మగణముమీఁద మగణమున్నను శుభఫలములనే యిచ్చుచున్నది. ఇట్లు సూక్ష్మదృష్టితో మిగిలినగుణములఁ బరిశీలింపనగును. [illegible] ప్రయోగాదిదోషము లకించిత్కరములు. కాన నంతయు మంగళమే.

1 సూ. 26 :— "విశ్వశ్రేయః కావ్యమ్" ఇతి వస్తునిర్దేశోఽపి. అతఏవ దణ్డినోక్తమ్ "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాఽపి తన్ముఖమ్" ఇతి. నచ మఙ్గళం కావ్యమాత్రసాధారణమ్. న్యాయశాస్త్రాదిషు శిష్టాచారానుమితశ్రుతిప్రమాణకత్వాత్. నిర్విఘ్నపరిసమాప్త్యర్థం మఙ్గళ మాచరేదితి బహుధా ప్రతిపాదితమ్.

వి :- కావ్యాద్యారంభమునం దాశీర్వస్తునిర్దేశాదిరూప మగు మంగళము నాచరింపవలయునని దండ్యాచార్యులు వచించిరి. కావుననే నన్నపార్యుఁడు గ్రంథారంభమున "కావ్యము విశ్వశ్రేయము" అని వస్తునిర్దేశరూపమంగళము నాచరించెను. ఈమంగళాచరణము కావ్యము నకే గాని న్యాయాదిశాస్త్రములకుఁ గాదని చెప్పరాదు. న్యాయశాస్త్రాదులలో శిష్టాచారానుమితశ్రుతిప్రమాణమువలన గ్రంథము నిర్విఘ్నపరిసమాప్తి నొందుటకు మంగళ మాచరింపవలయునని పెక్కువిధములఁ జెప్పఁబడినది గదా!

1. సూ. 27 :— అతఏవోపనిషత్స్వపి "శం నో మిత్ర శ్శం వరుణః" ఇత్యాదిమన్త్రైర్మఙ్గళ మీరితమ్. భగవతా పతఞ్జలినా "మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని శాస్త్రాణి ప్రథన్తే" ఇత్యాద్యుక్త్వా "వృద్ధిరాదైచ్" ఇతి సూత్రే వృద్ధిశబ్ద ఆదౌ మఙ్గళార్థత్వేన ప్రయుక్త ఇతి ప్రతిపాదితమ్. అతఏ వాచార్యేణాపి మధ్యే మఙ్గళార్థత్వేన తత్ర తత్రాథశబ్దః ప్రయుక్తః. అన్తే మఙ్గళార్థత్వేన విశేషశబ్దశ్చ ప్రయుక్త ఇతి జ్ఞేయమ్.

వి :— "మిత్రావరుణులు మాకు శుభము నిత్తురు గాక" అను రీతిని మంగళ ముపనిషత్తులలోఁ జేయఁబడినది. పతంజలిమహాముని యు "ఆదిమధ్యాంతములలో మంగళవిశిష్టము లగుశాస్త్రములు ప్రసిద్ధి నందుచున్న" వని చెప్పి వ్యాకరణశాస్త్రమున మంగళార్థముగ వృద్ధిశబ్ద మాదియందు "వృద్ధి రాదైచ్" అని ప్రయుక్తమైన దని చెప్పెను. కావుననే నన్నపార్యుఁడు మధ్యమంగళముగ 'అథ' శబ్దమును బ్రయోగించెను. గ్రంథాంతమున 'విశేష' శబ్దమును గూడ మంగళార్థముగనే యుపయోగించెను.

వి:- శబ్దాలంకారములు నర్థాలంకారములు నని యలంకారములు రెండువిధములు. శబ్దాలంకారాదు లనుప్రాసాదులు; ఉపమాదు లర్థాలంకారములు. హీనోపమాదు లుపమాదోషములు. అవియే కొన్నియెడల గుణము లగును. ఆవిషయము లలంకారగ్రంథములవలనఁ దెలియవలయును.

2 సూ. 4. :- పదఞ్చ విభక్త్యన్తమ్. తత్త్రివిధమ్ - వాచకం లాక్షణికం వ్యఞ్జకఞ్చేతి. తదర్థా వాచ్యలక్ష్యవ్యఙ్గ్యాస్స్యుః వ్యాపారాః క్రమేణాభిధాలక్షణావ్యఞ్జనాని ఇన్ద్రియాణామివ శబ్దానాం పదార్థప్రతీత్యనుగుణ పరిస్పన్దపరిణామలక్షణో వ్యాపారోఽఙ్గీకరణీయః. సచ విచార్యమాణ స్మృతిప్రతిసన్ధానాత్మకో బుద్ధివిశేష ఏవ. సచాఽత్మనిష్ఠోఽపి శబ్దధర్మత్వేన వ్యవహ్రియత ఇతి సమ్ప్రదాయవిదః.

వి:— విభక్త్యంతముపదము. వాచకము. లాక్షణికము, వ్యంజకము నను భేదములచే నది మూఁడు విధములు. వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము నని వానియర్థములు. అభిధ లక్షణ వ్యంజన యని వాని వ్యాపారములు. ఆయాజ్ఞానమును గల్గించుట కింద్రియములయందుఁ బరిస్పందపరిణామరూప మగువ్యాపారము సంగీకరించినట్లే శబ్దములకును నాయాపదార్థప్రతీతి కనుకూల మగుపరిస్పందపరిణామరూప మగునొక వ్యాపారము నంగీకరింపవలయును. వాస్తవము నాలోచించినచో నట్టి వ్యాపార మింద్రియములకావిషయమును సమకూర్చుబుద్ధివిశేషమే. అది చేతనాత్మక మగునాత్మయందె యున్నను శబ్దధర్మముగా సంప్రదాయవేత్తలు చెప్పుచున్నారు.

2 సూ. 5 :- లక్ష్యార్థోఽపి సఙ్కేతవిషయ ఏవే త్యన్వితాభిధానవాదినః - "ముఖ్యార్థగోచరా తస్య వ్యాపృతిః కథ్యతేఽభిధా" ఇతి. తత్రాభిధా ద్వేధా - రూఢిపూర్వికా, యోగపూర్వికా చేతి.

వి:— లక్ష్యార్థముసయితము సంకేతవిషయమే యని యన్వితాభిధానవాదు లందురు. వీరిమతమున ముందు వాక్యార్థజ్ఞానమును, పిదపఁ బదార్థజ్ఞానమును గల్గుట సమ్మతము. ముఖ్యార్థమును జెప్పుశబ్దవ్యాపార

మభిధ యగును. అది రూఢిపూర్విక యోగపూర్విక యని రెండు విధములు.

2 సూ. 6 :- "ముఖ్యార్థబాధే తద్యోగే రూఢితో௨థ ప్రయోజనాత్ । యయాఽన్యం బోధయేచ్ఛబ్దో వ్యాపృతి స్సాఽస్య లక్షణా". ఇతి లక్షితా సా ద్వివిధా-రూఢిలక్షణా ప్రయోజనలక్షణా చేతి. తత్ర రూఢలక్షణైకాఽవ్యఙ్గ్యా. ప్రయోజనలక్షణా సప్తవిధా-జహల్లక్షణా అజహల్లక్షణా జహదజహల్లక్షణా శుద్ధసారోపా శుద్ధసాధ్యవసాయా గౌణసారోపా గౌణసాధ్యవసాయా చేతి.

వి:- వాక్యగతపదముల కన్వయము సరిపడనప్పుడు రూఢివలనఁగాని ప్రయోజనమువలనఁగాని వాక్యాన్వయమును సరిచేయునదే లక్షణ. రూఢిలక్షణ ప్రయోజనలక్షణ యని లక్షణ రెండు విధములు. రూఢిలక్షణకు వ్యంగ్యార్థము లేదు. జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ, శుద్ధసారోప, శుద్ధసాధ్యవసాయ, గౌణసారోప, గౌణసాధ్యవసాయ యని ప్రయోజనలక్షణ యేడువిధములు.

2 సూ. 7 :- సాచ ద్వివిధా గూఢవ్యఙ్గ్యా అగూఢవ్యఙ్గ్యా చేతి. తత్ర గూఢవ్యఙ్గ్య ముత్తమం కావ్యమ్; పరస్తు మధ్యమ మితి విశేషః. వ్యఙ్గ్యస్య ద్రుతప్రతీతావగూఢత్వమ్, మధ్యమప్రతీతౌ అగూఢత్వమ్, విలమ్బితప్రతీతా వస్ఫుటత్వఞ్చ. తత్రాద్యన్తయో ర్మధ్యమత్వం, మధ్యమ స్యోత్తమత్వఞ్చేతి ధ్వనిసమయః.

వి:- వ్యంగ్యస్థితినిబట్టి ప్రయోజనలక్షణ గూఢవ్యంగ్యము నగూఢవ్యంగ్యము నని రెండువిధములు. అందు గూఢవ్యంగ్యము త్తము కావ్యము; అగూఢవ్యంగ్యము మధ్యమకావ్యము. వ్యంగ్యార్థము శీఘ్రముగాఁ బ్రతీయమానమైనచో నది యగూఢవ్యంగ్యము. కొంతవిలంబముగాఁ బ్రతీయమానమైనచో నది గూఢవ్యంగ్యము. మిక్కిలియాలస్యముగాఁ బ్రతీయమానమైనచో నది యస్ఫుటవ్యంగ్యము. వీనిలో నగూఢాస్ఫుటములు రెండును మధ్యమకావ్యము లనియు, గూఢవ్యంగ్యము లుత్తమకావ్యము లనియు ధ్వనివాదులనిర్ణయము.

2. సూ. 8 :– నచైవ మస్ఫుటవ్యంగ్యత్వే సాధమస్యాపి మధ్యమత్వం శఙ్క్యమ్. తత్ర వ్యంగ్యస్య విలమ్బితప్రతీత్యా నాస్ఫుటత్వమ్. కిన్తు ప్రతీతస్య దివాచన్ద్రప్రకాశవ చ్ఛబ్దార్థవైచిత్రీబలేన తిరోహితత్వే నాస్ఫుటత్వవ్యపదేశాత్.

వి:– అస్ఫుటవ్యంగ్యము కలదగుటచే నధమకావ్యము మధ్యను కావ్యము కానోపునని శంకింపరాదు. అందు వ్యంగ్యార్థమునకు విలంబిత ప్రతీతి కల్గుటచే నస్ఫుటత్వము కలుగలేదు. ప్రతీతార్థము శబ్దార్థవైచిత్రీ బలముచేఁ బగటిచంద్రకాంతివలెఁ దిరోహిత మగుచున్నది. తత్కారణముచే దాని కస్ఫుటత్వవ్యపదేశము కల్గినది.

2. సూ. 9 :– గౌణవృత్తిరపి లక్షణాన్తర్భూతైవ. తదన్తర్భావనిరూపణన్తు ప్రాచీనగ్రన్థాదౌ విజ్ఞేయమ్. విపరీతలక్షణాఽపి జహల్లక్షణాన్తర్భూతైవ.

వి:– గౌణవృత్తి యనునది లక్షణాంతర్భూతమే. తదంతర్భావన విధానము ప్రాచీనగ్రంథములనుండి తెలియనగును. విపరీతలక్షణ యనునది జహల్లక్షణలోఁ జేరినదే కాని వేఱు కాదు.

2. సూ. 10 :– విద్యానాథ స్త్వాహ–"ముఖ్యార్థస్య హానోపాదానాఽఽరోపాధ్యవసాయలక్షణోపాధివశా చ్చాతుర్విధ్యమేవ లక్షణాయాః. 'ఆయుర్ఘృతమ్' ఇత్యాదావపి గౌణత్వస్యైవ సుకల్పత్వాదితి.

వి:– ముఖ్యార్థమును విడుచుట విడువకుండుట యను వనిచే నవి జహదజహల్లక్షణ లనుపేరఁ బిల్వఁబడుచున్నవి. అట్లే సారోపము సాధ్యవసాయ యని మఱిరెండు భేదములు. ఈతీరున లక్షణ నాల్గువిధములు. "ఆయువు ఘృతము" అనునపుడు గౌణలక్షణ సులభముగఁ గల్పింపఁదగియున్నదని విద్యానాథుఁడు వచించెను.

2 సూ. 11 :– అతఏ వోక్త మలఙ్కారచూడారత్నే–"యత్ర వస్త్వన్తరే వస్త్వన్తరత్వ ముపచర్యతే స గౌణో; యత్ర న తథా తత్ర లక్షణా" ఇతి.

వి:– ఒకవస్తువునందు వేఱొకవస్తు వెచట నుపచరింపఁజేయఁబడునో యది గౌణము. అది లేనిచోట లక్షణ యగును—అని యలంకారచూడారత్నమునఁ జెప్పఁబడినది.

2. సూ. 12 :— కుశలప్రవీణాదిశబ్దానాం సాక్షాత్సంకేతవిషయత్వేన ముఖ్యార్థత్వాన్న రూఢిహేతుకత్వం లక్షణాయా ఇత్యాచార్యహేమచన్ద్రః. రూఢిపక్షాశ్రయణే తు ప్రయోజనలక్షణాపేక్షయా చాతుర్విధ్యం స్యాత్.

వి:— 'కుశాన్ లాతీతి కుశలః'=కుశలుఁడు; 'ప్రకృష్టా వీణా యస్య సః ప్రవీణః'=ప్రవీణుఁడు; ఈమున్నగుశబ్దములు నేర్పరి మున్నగు నర్థములలో సంకేతితము లగుటచే ముఖ్యార్థములే యగుచున్నవి. కావున నిచట రూఢిలక్షణ చెప్పరాదని హేమచంద్రుఁడు నుడువుచున్నాఁడు. రూఢిలక్షణ నాశ్రయించినపక్షమునఁ బ్రయోజనలక్షణ నాల్గువిధము లగుచున్నది.

2. సూ. 13 :— యత్ర శబ్దార్థస్య పరస్పరసమ్బన్ధరూపా లక్షణా సా లక్షితలక్షణా. యథా ద్విరేఫపదే రేఫద్వయసమ్బన్ధో భ్రమరపదే జ్ఞాయతే, భ్రమరపదస్య సమ్బన్ధో భ్రమరే జ్ఞాయత ఇతి కేచి ద్వామనాద్యాః

వి:— వాచ్యార్థమునకుఁ బరంపరాసంబంధముచే వేఱొకయర్థము నందు లక్షణ నంగీకరించిన నది లక్షితలక్షణ యగును. ద్విరేఫపదమునకుఁ 'దుమ్మెద' యర్థము చెప్పుట యట్టిదని వామనాదు లనుచున్నారు.

2. సూ. 14:— వ్యఞ్జనావ్యాపారస్య ప్రకృతోపయోగిత్వాత్ తత్స్వరూపం నిరూప్యతే. "అన్వితేషు పదార్థేషు యోఽన్యార్థాన్తరగోచరః। వాచ్యార్థప్రతిక్రియార్థో స వ్యాపారో వ్యఞ్జనం భవేత్." అభినవగుప్తాచార్యపాదా అపి తల్లక్షణమాహుః— "సమన్వయశక్తిసమర్పితాన్వయవిధురీకరణధురీణత్వాదన్యాయాః స్వేన ప్రాగ్భావినీ వ్యక్తిః" ఇతి.

వి:— వ్యంజనావ్యాపారము ప్రకృతోపయోగి యగుటచే దాని స్వరూపము కొంచెము నిరూపింపఁబడుచున్నది. వాక్యగతపదార్థములు పరస్పరసమన్వయము నొందినపుడు వాచ్యార్థబోధకమై వేఱొక యర్థాంతరమును గోచరింపఁ జేయునట్టి యేవ్యాపారము కలదో యయ్యది యే వ్యంజనా. వాక్యగతపదాన్వయశక్తిచేఁ గల్గినసముదాయార్థమును వేఱుగ మార్చుటకు సమర్థమై, వాక్యార్థబోధ కల్గినపిమ్మట నుండు వ్యాపారము వ్యంజనయని యభినవగుప్తాచార్యపాదులు నుడివిరి.

2. సూ. 15 :— వ్యఞ్జనావ్యాపార స్త్రివిధః శబ్దార్థోభయశక్తిమూలకత్వేన శబ్దశక్తిమూలోఽపి ద్వివిధః, అభిధామూలో లక్షణామూలశ్చేతి. తత్ర ప్రయోజనలక్షణాసు ప్రయోజనప్రతీతికృద్వ్యాపారో లక్షణామూలో వ్యఞ్జనావ్యాపారః. ఏత ద్వ్యఙ్గ్య న్తు వస్తుమాత్రమేవ । అనలఙ్కారం వస్తు జాతిగుణాదిరూపమ్. తదేవ విచ్ఛిత్తి విశేషయుక్త మలఙ్కార ఇత్యాలఙ్కారికసమయః.

వి:- శబ్దశక్తిమూలము నర్థశక్తిమూలము నుభయశక్తిమూలము నని వ్యంజనావ్యాపారము మూఁడువిధములు. అభిధామూలము లక్షణామూలము నని శబ్దశక్తిమూలము రెండు విధములు. ప్రయోజనలక్షణలలోఁ బ్రయోజనప్రతీతిని గలిగించువ్యాపారమే లక్షణామూలవ్యంజనావ్యాపారము. ఇది వస్తువ్యంగ్యము, అనలంకారమైనవ్యంగ్యము, జాతిగుణాదికము. అదే విచ్ఛిత్తివిశేషయుక్తమై యలంకారవ్యంగ్యమగునని యాలంకారికులసంకేతము.

2. సూ. 16 అభిధామూలవ్యఞ్జనస్య లక్షణ ముక్తం కావ్యప్రకాశకారేణ "అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే। సంయోగాద్యై రవాచ్యార్థధీకృద్వ్యాపృతి రఞ్జనమ్" ఇతి. "అత్యర్జునయశోరాశిః కృతిసంరక్తతర్పణః। ఏకవీరోపతాపఘ్నో రామో రాజతి రాఘవః" ఇత్యుదాహరణమ్. అత్రోపమాలఙ్కారో వ్యఙ్గ్యః.

వి:— ఒకశబ్దమున కర్థములు పెక్కు లున్నపు డర్థనిర్ణయోపాయము లగుసంయోగాదులచేఁ బ్రకృతార్థము నియంత్రితమగును. అట్టిచో వాచ్యార్థభిన్నవ్యాపార మేదేని గోచరించినచో నదే వ్యంజన యని కావ్యప్రకాశవచనమున కర్థము. కార్తవీర్యార్జును నతిక్రమించినకీర్తి గలవాఁడును, పితృదేవతలకు రక్తతర్పణము కావించినవాఁడును, ముఖ్యవీరులఁ దపింపఁజేసినవాఁడును, నప్రతిభటశూరుఁడునై ప్రకాశించువాఁడు పరశురాముఁడు. ఇది పరశురామునిపక్షమం దర్థము. తెల్లని కీర్తి గలవాఁడును, దనయం దనురాగము గలవారిని దృప్తి నొందించువాఁడును, సంతాపహారి యైనవాఁడును నగుశ్రీరాముఁడు ప్రకాశించుచున్నాఁడు – అని శ్రీరామునిపక్షమునం దర్థము. ఇందులో నుపమాలంకారము వ్యంగ్యము.

2. సూ. 17. నచైతాదృశస్థలే శ్లేషః. తస్య కేవలప్రకృత [illegible] ప్రకృతపరత్వేన నియమనాత్. అత్ర ధ్వనా వలఙ్కారా [illegible] చాలఙ్కారతా బ్రాహ్మణపరివ్రాజకన్యాయేనేతి ప్రాఞ్చః

వి:- ఈశ్లోకమం దున్నది శ్లేష యనుటకు [illegible] శ్లేష కేవలప్రకృతార్థములకుఁ గాని, కేవలాప్రకృతార్థములకుఁ [illegible] డును. ప్రకృతాప్రకృతార్థములకు శ్లేష యుండినను [illegible] వ్యంగ్యత్వమని ప్రాచీను లనుచున్నారు.

2. సూ. 18. చిత్రమీమాంసాయాంతు ప్రకృతా [illegible] శక్తిరస్త్యేవేతి న వ్యఞ్జనాపేక్షా. ప్రాచీనానా మత్ర [illegible] లఙ్కారే వ్యఙ్గ్యత్వాభిప్రాయేణేతి బహుధా ప్రతిపాదితమ్. "స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః పయోధరోత్సేధనిపాతచూర్ణితాః। వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే. చిరేణ నాభిం ప్రథమోదబిన్దవః." "నిశ్శేషచ్యుతచన్దనం స్తనతటం నిర్మృష్టరాగోऽధరో। నేత్రే దూర మనఞ్జనే పులకితా తన్వీ తవేయం తనుః। మిథ్యావాదిని దూతి బాన్ధవజన స్యాజ్ఞాతపీడాగమే। వాపీం స్నాతు మితో గతాసి న పున స్తస్యాధమ స్యాన్తికమ్" ఇత్యుదాహరణద్వయమ్.

వి:- ప్రకృతార్థమునందు వలెనే అప్రకృతార్థమునందును శక్తి యుండుటచే వ్యంజనాపేక్ష దాని కెందులకు? ఉపమాద్యలంకారముల యందు వ్యంగ్యత్వ ముండు ననునభిప్రాయముతోఁ బ్రాచీనులు దీనిని వ్యంగ్యమనిరి—అని చిత్రమీమాంసయందుఁ బ్రతిపాదింపఁబడెను. "వర్షా రంభవేళయందుఁ బ్రథమవర్షబిందువులు తపస్సు చేయుచున్నపార్వతీ దేవికనుఱెప్పలపై నించుకసేపు నిలిచి, పెదవులమీఁదనుండి యున్నతము లగుపాలిండ్లపైఁ బడి చిందరవందరలై వళులలోఁ జొరఁబడినవై చిర కాలమునకు నాభిదేశము చేరినవి" అని తపస్సుచేయుచున్నపార్వతీ దేవిని గాళిదాసమహాకవి తనకుమారసంభవమున వర్ణించినాఁడు. "ఓ చెలీ! నీకుచములఁ బూసినచందన మంతయుఁ బోయినది. నీపెద వులపై నున్న యెఱుపు పూర్తిగాఁ దుడుచుకొనిపోయినది. నీకంటియందుఁ గాటుక సుంతయు లేదు. సోగ యగునీమేను గగురుపాటు నొందినది. కాన స్నానమునఁ కేగితివి కాని, యానీచునికడకు నీవు పోలేదు" అని

యొకనాయిక తనచెలిక త్తెతో ననుచున్నది. అంతకు మున్నానాయిక తనకడకుఁ బ్రియుని దోడ్కొనిరమ్మని యాదూతి నంపినది. ఆచెలి యాతనితో భోగించి వచ్చినది. అది చూచి నాయిక యసూయతో నిట్లు పలికినది.

2. సూ. 19. అర్థశ క్తిమూలవ్యఙ్గ్యే చిత్రమీమాంసాయా మేతచ్ఛ్లోకార్థః ప్రతిపాదితః. తథాహి—అత్ర తపస్యన్త్యా దేవ్యా దేహోపరి నిపతతాం ప్రథమవృష్టిబిన్దూనాం క్రియాస్వభావవర్ణనేన దేవ్యాస్సమాధ్యుచితావస్థానాభివ్య క్తిద్వారా చిరనిదాఘత ప్తదేహోపరినిపతనేన సుఖపారవశ్యసమ్భ్రమహేతౌ ప్రథమవృష్టావప్యవిహతా సమాధ్యవస్థా వ్యజ్యతే. తథాహి —"నాసాగ్రన్య స్తనయనః సంవృతాస్య స్సునిశ్చలః, ధ్యాయేత మనసా దేవ మురో విష్టభ్య చాగ్రతః" ఇతి సమాధిమతా మవస్థా మాహుః.

వి:— "స్థితాః క్షణం" "నిశ్శేషచ్యుతచన్దనమ్" అను రెండు పద్యములును జిత్రమీమాంసలో నర్థశ క్తిమూలవ్యంజన కుదాహరింపఁబడినవి. తప మాచరించుదేవిశరీరముమీఁదఁ బడుచున్నప్రథమవృష్టి బిందువులక్రియాస్వభావవర్ణనముచేఁ బార్వతీదేవి సమాధ్యుచితావస్థానమును వ్య క్తపఱుచుచుఁ జిరనిదాఘత ప్తమైనదేహముపైఁ బడుటచేఁబ్రథమవర్షపుఁజినుకులు శరీరసుఖపారవశ్యసంభ్రమమునకు హేతువులైనను గొంచెమైన సడలినసమాధ్యవస్థను వ్య క్తము చేయుచున్నది. తపస్సమాధిలో నున్నవారు తమదృష్టిని నాసాగ్రముపై నుంచి, నోరు మూసికొని, ఱొమ్మును ముందునకు నెట్టి, నిశ్చలచి త్తముతో నుండవలయునని తపస్సమాధిలక్షణము చెప్పుచున్నది. ఈయర్థమును గాళిదాసీపద్యమువలన వ్య క్తపఱిచినాఁడు.

2. సూ. 20 :— తత్ర పక్ష్మసు స్థితా ఇత్యనేన నాసాగ్రన్య స్తనయనతారూపమర్ధనిమీలనం వ్యజ్యతే. సర్వథోన్మీలనే పక్ష్మణా మూర్ధ్వాగ్రత్వేన సర్వథా నిమీలనే తేషా మధోఽగ్రత్వేన తేషు బిన్దూనాం స్థిత్యసమ్భవాత్. పక్ష్మభ్య శ్చ్యుతానాం తేషామాస్యేఽప్రవేశేన అధరోష్ఠే నిపత్య తత శ్చ్యుతికథనేన సంవృతాస్యత్వం వ్యజ్యతే. తత శ్చ్యుతానాం తేషాం స్తనోత్సేధనిపతనాదివర్ణనేన ఉరోవిష్టమ్భః. అలసపదవనతాఽవస్థానే హి స్తనయో ర న్తస్సఙ్కుచితాకారావస్థతయా తదుత్సేధయో స్తేషాం పతనం న స్యాత్. కథఞ్చి త్తయోః పతిత్వా వళిత్రయం ప్రాప్తానా మపి వళీషు తిర్య

కలపై క్షణము నిలిచిన వనుటచే తెప్పనెండ్రుకలసాంద్రతయుఁ, గను తెప్పలనున్నఁదనమును సువ్యక్తములు. పక్ష్మపతనశిథిలవేగబిందుతాడనము చెప్పఁబడుటచే నధరసౌకుమార్యమును, స్తనోత్సేధమూర్ఛాభావ వర్ణనముచే స్తనములకాఠిన్యమును, నురోవిష్టంభమున వళులయందానీటిబిందువులు స్ఖలనము చెందినవనుటచే వళులవిస్పష్టతయు, బిందువులన్నియు నాభిప్రవేశము చేసినట్లు వర్ణించుటచే నాభి మిగుల లోతుగ నున్నట్లును వ్యక్తమగుచున్నది. ఇవి యాదేవియొక్క లోకోత్తర సౌందర్యచిహ్నములు.

2. సూ. 22. నిశ్శేషేతి - అత్ర వాపీం స్నాతుం గతాసి నతు తస్యాంతికమితి వాక్యార్థే స్థితే తస్యాంతికమేవ రన్తుం గతాఽసీత్యధమపదేన ప్రాధాన్యేన వ్యజ్యతే. తథాహి-అధమత్వ మపకృష్టత్వం తజ్జాత్యా కర్మణా వా భవతి. తత్ర జాత్యాఽపకర్షం నోత్తమా నాయికా వదతి నాయకస్య. నాపి స్వాపరాధపర్యవసాయిదూతీసమ్భోగాదిహీనకర్మాతిరిక్తేన కర్మణా తాదృశం దూతీసంప్రేషణా త్ప్రాచీనం సర్వం సోఢమేవేతి నోద్ఘాట నార్హమపి. అన్యథా స్వయం దూతీసంప్రేషణానుపపత్తేః. తదనన్తరం స్వప్రేషితదూతీసమ్భోగరూపమేవ స్వయం సన్నిహితచిహ్నైర్జ్ఞాతుం శక్యమ్. హీనకర్మ సమ్భవతీతి తత్పర్యవసాయినాఽధమపదేన తస్యాన్తికమేవ రన్తుం గతాఽసీతి వ్యజ్యతే.

వి:- ఇంక రెండవశ్లోకము వివరింపఁబడుచున్నది - స్నానమునకై నూతి కేగితివి. కాని యాతనికడకుఁ బోలేదు—అనువాక్యార్థ మున్నను 'రమించుటకో యతని వానికడ కేగితి' వనునర్థ 'మధమ' పదప్రాధాన్యముచే వ్యక్త మగుచున్నది. అధమత్వ మనఁగా నపకృష్టత్వము. అది జాతి చేతనైనను, గర్మముచేతనైనను గలుగవచ్చును. నాయకునిజాత్యాపకృష్టత నుత్తమనాయిక పలుకదు. తనప్రియుఁడు తక్కువజాతివాఁడనుట కామె యిష్టపడదుగదా! కర్మాధమత్వమునుగూర్చియే ప్రసంగించినదనక తప్పదు. అది స్వాపరాధ మగుదూతీసంప్రేషణము. దూతీసంభోగముకన్న వ్యతిరిక్త మగుకర్మమే యననొప్పను. దూతి నంపుటకు మున్నున్నహీనకర్మము నంతను సహించినదని చెప్పకయే దూతి నంపుటచేఁ

స్థిరపఱుచుచున్నది. ఉత్తరోష్ఠ మెట్లుగ నుండ నధరోష్ఠముమాత్రము రాగశూన్య మగుట సంభోగసమయమునఁ జుంబనముచేతనే జరుగును.

2. సూ. 25. నేత్రే దూర మనఞ్జనే-ఇత్యత్ర ప్రాతర్దత్త మఞ్జనం కాలేన కిఞ్చి ద్విలుప్త మిత్యన్యథాసిద్ధిపరిహారాయ 'దూరం' ఇత్యుక్తమ్. దూర మత్యర్థ మిత్యాపాతతోఽర్థః. తేన కాలాన్యథాసిద్ధినిరాసః. పున స్స్నానసాధారణ్యావ్యావర్తనేన సమ్భోగచిహ్నోద్ఘాటనాయ దూరం దూరే ప్రాన్తభాగ ఇతి హృదయస్థితోఽర్థః. కాలతః స్నానేనవా సర్వత్రాఞ్జనలోప స్స్యాత్. తవ తు లోచనయోః క్వచిత్ప్రాన్త ఏ వానఞ్జనత్వం చుమ్బనకృత మేవేతి. పులకితా తన్వీ తవేయం తను రిత్యత్రాఽపాతత స్తన్వీతి సహజతానవకీర్తనేన 'పులకితా' ఇతి స్నానచిహ్నోపన్యాసః. పులకితాఽపి తన్వీ వర్తత ఇతి హృదయస్థితోఽర్థః. తేన స్నానేన పులకితా తనుః కిఞ్చిదుచ్ఛ్వసితా భవతి; ఇయం తు న తథేతి రతిక్లేశజనితః పులకోద్గమ ఇతి మర్మోద్ఘాటన మేవ.

వి:- 'కన్నులఁ గాటుక మిక్కిలిదూర మైనది'—అని యనుటచేఁ బ్రాతఃకాలమునం దుంచుకొనినకాటుక యించుకంత పోయినదని చెప్పకుండుటకై 'మిక్కిలి' అనునర్థముగల 'దూరం' అనువిశేషణము వేయఁబడినది. స్నానమువలనఁ గాటుక పూర్ణముగాఁ బోవును గాని ప్రాంతభాగమునమాత్రమే పోదు గదా! నేత్రప్రాంతభాగమునందుఁ గాటుక పోవుట సంభోగసమయమునఁ జుంబనముచేతమాత్రమే సంభవించును. —తన్వీ ! నీతనువు పులకరించినది- అని యనుటచే నది స్నానమువలనఁ గల్గినదని యనవచ్చును. స్నానముచే దేహము కొంచె ముబ్బును. ఇది యట్లు లేదు. కావున నిది రతిసమయపులకోద్గమమే యగునని తెలుచున్నది.

2. సూ. 26. ఏవ మేభిర్వాక్యై రుపస్కృతేనాధమపదేన తస్యాన్తిక మేవ రన్తుం గతాఽసి ఇతి వ్యజ్యతే. ప్రాగ్వాచ్యార్థదశాయాం వాపీం స్నాతుం గతాఽసి ఇత్యేతదనుగుణార్థతయాఽన్వితమ్. 'మిథ్యావాదిని' ఇతి సమ్బోధనం వ్యఙ్గ్యానుగుణ ఏవార్థే పర్యవస్యతీతి.

వి:- ఈవాక్యములతోఁ గూడిన 'అధమ' అను పదముచే— వానికడకు రమించుటకే పోయితివి – అనునర్థము వ్యంగ్యమై, స్నానము

కొలఁకు బావి కేగితివి—అనువాని కనుగుణముగ నన్వయించిన 'మిథ్యావాదిని' మున్నగుసంబోధనములు వ్యంగ్యానుగుణార్థమునఁ బర్యవసించుచున్నవి.

2. సూ. 27. సోఽయం ధ్వని ర్ద్వివిధోఽభిధామూల స్సంలక్ష్యక్రమవ్యఙ్గ్యోఽసంలక్ష్యక్రమవ్యఙ్గ్య శ్చేతి. తత్రసంలక్ష్యక్రమవ్యఙ్గ్యే వ స్త్వలంకారయో ర్వ్యఙ్గ్యత్వ, మితరత్ర రసాదే ర్వ్యఙ్గ్యత్వ మితి వివేకః.

వి:— అభిధామూలధ్వని సంలక్ష్యక్రమవ్యంగ్యమనియు నసంలక్ష్యక్రమవ్యంగ్యమనియు రెండువిధములు. సంలక్ష్యక్రమవ్యంగ్యమున వస్త్వలంకారములు ధ్వనించును. అసంలక్ష్యక్రమవ్యంగ్యమున రసాదులు ధ్వనించును.

2. సూ. 28. :- "పరశుగతిభీషణాత్మా సఙ్గరలీలానుబాహుజక్షోభః। సోఽధారామో రేమే పితృభక్తో విప్రదత్తభూవలయః" ఇత్యుభయశక్తిమూలధ్వన్యా ఉదాహరణమ్.

వి :— "శత్రుశోకమునకై మిగుల భయంకరస్వరూపము గలవాఁడును, యుద్ధవిహారమునందు సుబాహు వనురక్కసునకు క్షోభను గల్గించినవాఁడును, క్షమాగుణముతో నలరినవాఁడును, పితృభక్తుఁడును విడువఁబడినభూరాజ్యము గలవాఁడును నై శ్రీరాముఁడు ప్రకాశించెను" అని దశరథరామునిపక్షమునందర్థము. గండగొడ్డలిచలనముచే భయంకరస్వరూపము కలవాఁడు, యుద్ధవిలాసములయందు క్షత్రియులకు వ్యథ కల్గించినవాఁడు, నెట్టిశత్రువునైన సహించువాఁడు, పితృభక్తుఁడు, విప్రులకు దానముచేయఁబడినభూవలయము కలవాఁడు నై పరశురాముఁ డొప్పెను"— అని పరశురామునివర మగునర్థము. ఈపై పద్య ముభయశక్తిమూలవ్యంజనమున కుదాహరణము.

2. సూ. 29. :— యద్యపి శబ్దార్థయో రుభయోరపి వ్యఞ్జకత్వమితి నాన్యతరస్యైవ. తథాఽపి ప్రాధాన్యేన సహకారిత్వేన చ తథా వ్యపదేశ ఇతి ధ్వనివాదినాం ఘోషః. సకృదుచ్చరిత శ్శబ్దో న వృత్తిద్వయ మర్హతీతి నిషేధస్య త్వభిధాలక్షణాభ్యాం

వ్యఞ్జనస్య యోగా దితరత్రైవ తాత్పర్యమ్ - అనన్యథాసిద్ధకార్యబలేన అభిధాయక లక్షకయో ర్వ్యఞ్జనావ్యాపారవత్వనియమాత్.

వి :- ఆలోచింపఁగా శబ్దార్థములు రెండును వ్యంజకము లే; కాని యం దొక్కటిమాత్రమే కాదు. అయినను ప్రాధాన్యమును బట్టియు, సహకారిత్వమువలనను నట్టివ్యపదేశ మని ధ్వనివాదు లను చున్నారు. "ఒకసారి పలికినశబ్దమునకు వృత్తిద్వయాశ్రయణమువలన రెం డర్థములు రాఁజాలవు" అనునీనిషేధ మభిధాలక్షణావృత్తులతో వ్యంజనమునకు యోగమున్నచోటఁ గాదనియుఁ దదితరస్థలములయందే యనియుఁ దాత్పర్యము. అభిధాలక్షణలకు వృత్తిద్వయము నంగీకరింప కున్నచోఁ గుదురదు. స్వతస్సిద్ధముగనే యభిధాయకలక్షకశబ్దములకు వ్యంజనావ్యాపార ముండవచ్చు నననియమము కలదు గదా !

2. సూ. 30 :- నను "తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలఙ్కృతీ పునః క్వాపి" ఇతి కావ్యప్రకాశలక్షణే కథం 'అనలఙ్కృతీ' ఇతి విశేషణ ముక్త మితిచే త్క్వాచిత్ స్ఫుటాలఙ్కారవిరహేఽపిన దోష ఇతి తదర్థత్వేన తద్విశేషణం న దోషా యేతి యుక్తమేవ సాలఙ్కారత్వకథనం వాగర్థయోః.

వి :- "దోషరహితములు గుణసహితములు నగుశబ్దార్థము లొక్కయెడ నలంకారరహితములైనను గావ్యమే" అనుకావ్యప్రకాశ లక్షణమున "అనలఙ్కృతీ పునః క్వాపి" అని చెప్పఁబడుటచే నొక్క యెడ నలంకారము స్ఫుటముగా లేకున్నను దోషము లేదని చెప్పుటకే వాగర్థములకు సాలంకారత్వకథనము.

2. సూ. 31 :- నను గుణాలఙ్కారయో ర్భేద ఏవ నాఽస్తి. గుణాదీనా మప్య పమాద్యలఙ్కారవ ద్రసోపస్కారకత్వా దితి చే న్నైవమ్. సమవాయవృత్త్యా రసోప స్కారకా గుణా స్సంయోగవృత్త్యా రసోపస్కారకా అలఙ్కారా ఇతి భేద ప్రతి పాదనాత్.

వి :- గుణాలంకారములకు భేదమే లేదు. అలంకారములవలె గుణములును రసోపస్కారకములే గదా యని యందురేమో; సమ వాయసంబంధముచే రసోపస్కారకములు గుణములును, సంయోగ

సంబంధముచే రసోపస్కారకము లలంకారములు నగును. కావున రెంటికి నిట్టిభేదము కలదు.

2. సూ. 32 :- నచ నీరసకావ్యాలఙ్కారేషు వ్యభిచారః; తథావిధస్థలే రసశబ్దస్య వ్యఙ్గ్యవ్యఞ్జకజాతీయయో రభేదాధ్యవసాయేన ప్రవృత్తత్వాత్. న చాచేతనశరీరే హారాదీనా మివ నీరసకావ్యేఽలఙ్కారాణా మలఙ్కారత్వాభావేన హేయతా ప్రసఙ్గః. సువర్ణప్రతిమాఙ్గేష్వివ హారాదీనాం తదలఙ్కారేష్వపి శోభాహేతుత్వే నాలఙ్కారతాయా విద్యమానత్వాదితి ప్రామాణికాః.

వి:- నీరసకావ్యములలోనియలంకారములయందు వ్యభిచారము కల్గునని శంకింపరాదు. అట్టిచోట్ల రసశబ్దమునకు వ్యంగ్యవ్యంజకజాతీయములకును నభేదమును బాటించి వ్యాఖ్యానింపనగును. అచేతనశరీరమునందు హారాదులకు శోభ లేనట్లే నీరసకావ్యములలో నలంకారముల కలంకారత్వ ముండదు గదా యని యెంచినచో సువర్ణప్రతిమాంగమున హారాదులు శోభిల్లినట్లుగ నట్టిచోటులందు నలంకారములయలంకారత్వమున కెట్టియభ్యంతరమును లేదని ప్రామాణికు లనుచున్నారు.

2. సూ. 33. :- యత్తూక్తం దణ్డ్యాచార్యేణ కావ్యాదర్శే - "కాశ్చి న్మార్గవిభాగార్థ ముక్తాః ప్రాగప్యలఙ్క్రియాః" ఇతి. యత్తు తట్టీకాకృతా తరుణవాచస్పతినోక్తమ్. "నను పూర్వే శ్లేషాదయో దశగుణాః" ఇత్యుక్తమ్. కథం తేషా మలఙ్కారతా ఉచ్యత ఇతిచే 'చ్ఛోభాకరత్వం' హ్యలఙ్కారత్వలక్షణమ్. తల్లక్షణయోగాత్తేఽప్యలఙ్కారాః. 'శోభాహేతవో గుణాః, శోభాఽతిశయహేతవోఽలఙ్కారా,' ఇతి కైశ్చిదుక్తమ్. శోభాఽతిశయహేతుత్వస్య వైవక్షికత్వా న్నాయం భేదహేతురితి గుణా అప్యలఙ్కారా ఇత్యాచార్యమత మితి తదనేన పరాస్తమ్. 'కావ్యవ్యవహారహేతవో గుణా స్తచ్ఛోభాహేతవోఽలఙ్కారాః' ఇత్యేవంరూపభేదప్రతిపాదకశ్రీభోజాదిమతనిరసనమపి ప్రాచీనగ్రన్థేష్వేవ ద్రష్టవ్యమితి నేహోచ్యతే.

వి :- గౌడి వైదర్భి మున్నగునానిని వ్యక్తపఱుచుచుఁ గొన్నియలంకారము లివఱకుఁ జెప్పఁబడినవి యని కావ్యాదర్శమునందు దండికవి నుడివెను. శ్లేషాదులు పదియు గుణములని తట్టీకాకర్త తరుణవాచస్పతిచేఁ జెప్పఁబడినది. ఇది యెట్లనినచో శోభాకరత్వమే యలంకారతకు లక్షణము గావున వాని కలంకారత శోభాకరత్వము ననుస

రించి చెప్పఁబడినది. శోభాకరము లగుటచే గుణము లలంకారము లగు ననరాదు. గుణములు శోభాహేతువులు, నలంకారములు శోభాతిశయహేతువులు నని కొందఱనిరి. శోభాతిశయహేతుత్వము వైవక్షిక మగుటచే నిది భేదహేతువు కాఁజాలదు గదా! కాన గుణము లలంకారములే యని నుడువునాచార్యమతము దీనిచేఁ బరాస్తమగుచున్నది. కావ్యవ్యవహారహేతువులు గుణములును దచ్ఛోభాహేతువు లలంకారములు నని భేదమును జెప్పినభోజాదులమతనిరసనము మున్నగునవి ప్రాచీనగ్రంథములనుండి తెలియనగును.

2. సూ. 34 :- గుణాశ్చ మాధుర్యౌజఃప్రసాదా స్త్రయ ఏవ. అన్యేషాం కేషాఞ్చి చ్ఛ్లేషాదీనా మేష్వే వాన్తర్భావః. కేషాఞ్చి ద్దోషత్యాగా యాశ్రితత్వం, కేషాఞ్చి ద్గుణత్వ మితి. తత్ప్రపఞ్చశ్చ స్తు తద్వివేచకగ్రన్థా దవగన్తవ్యమ్.

వి:- ఓజఃప్రసాదమాధుర్యములు మూఁడే గుణములు. మిగిలిన శ్లేషాదులు కొన్నియు వీనియందే యంతర్భవించును. దోషత్యాగమునకై మఱికొన్ని యాశ్రయింపఁబడినవి. ఇంకను గొన్నింటికి గుణత్వము ననువిషయములను వానిని విస్తరించి చెప్పుగ్రంథముల వలనఁ దెలియనగును.

2. సూ. 35. :- తత్ర మాధుర్యం నామాఽహ్లాదకత్వమ్. సమ్భోగశృఙ్గారే ధృతికారణమ్. కరుణే విప్రలమ్భే శాన్తే చ త దత్యన్తధృతిహేతుత్వా దతిశయాన్వితమ్. చిత్తస్య విస్తారరూపదీప్తత్వజనక మోజో వీరరసే భయానకే చ వర్తతే. వీరా ద్బీభత్సే తతోఽపి రౌద్రే సాతిశయ మోజః. శుష్కేన్ధనాగ్నివ త్స్వచ్ఛజలవత్సహసైవ చిత్తం వ్యాప్నోతి య స్సర్వరచనాసు వర్తతే స ప్రసాదః-

వి:- వానిలో మాధుర్యమున కాహ్లాదకత్వ మర్థము. అదిసంభోగశృంగారమునఁ దృప్తిని గల్గించును. కరుణవిప్రలంభశాంతరసములలో మిక్కిలి సంతోషదాయక మగుటచే నీమాధుర్య మచట నధికము. చిత్తవిస్తరదీప్తికి హేతు వగుటచే నోజోగుణము వీరభయానకములలో నుండును. వీరముకంటె బీభత్సమునను, దానికంటె రౌద్రమునను నోజోగుణ మతిశయము నొందును. శుష్కేంధనమునం దగ్నివలెను

స్వచ్ఛజలమువలెను వెంటనే మనస్సున కత్తుకొనునది కావున సర్వరచనలయందును బ్రసాదగుణము సమానప్రవేశము కల దగుచున్నది.

2. సూ. 36. :- ఆకారే శౌర్యాదీనామివ తేషాం గుణానాం గుణవృత్త్యైవ వృత్తి ర్దృశ్యతే హ్యన్యధర్మాణామివ హ్రస్వదీర్ఘాణా మారోపితవర్ణవిశేషత్వం యథార్థవ్యవహారజనకత్వాచ్చ. అతోఽన్యధర్మాణామపి గుణానాం వాక్యవిశేష విశేషణత్వం న విరుధ్యతే. వర్ణసమాసరచనానాం గుణవ్యఞ్జకత్వమ్. తత్ప్రపఞ్చితం కావ్యప్రకాశకారేణ "మూర్ధ్ని వర్గాన్త్యగాః స్పర్శా అటవర్గా రణౌ లఘూ। అవృత్తి ర్మధ్యవృత్తిర్వా మాధుర్యే ఘటనా తథా." ట, ఠ, డ, ఢ వర్ణా కాదయో మాన్తా శ్శిరసి నిజవర్గాన్త్యయుక్తా స్తథా రేఫణకారౌ హ్రస్వాన్తరితాః ఇత్యేతే వర్ణా స్సమాసాభావో మధ్యసమాసో వా తథా మాధుర్యవతీ పదాన్తరయోగరచనా చ మాధుర్యస్య వ్యఞ్జకాః. "యోగ ఆద్యతృతీయాభ్యా మన్త్యయో రేఫతుల్యయోః। టాది శ్శషౌ వృత్తిదైర్ఘ్యం గుమ్ఫ ఉద్ధత ఓజసి" వర్గప్రథమతృతీయాభ్యాం ద్వితీయచతుర్థయో రేఫేణ అధః ఉపరి ఉభయత్ర వా యస్య కస్యచిత్తుల్యయో స్తేన తస్యైవ సమ్బన్ధః. టవర్గో ణకారవర్జ్యః శషౌ దీర్ఘసమాసశ్చ వికటసంఘటనా చ ఓజో వ్యఞ్జకాః.

వి:- ఆత్మధర్మము లైనశౌర్యాదులు దేహధర్మములుగ వ్యవహరింపఁబడినట్లే యీయాగుణములు శబ్దార్థములయం దుండుట గౌణమే యగును. హ్రస్వదీర్ఘాదిసంజ్ఞలు ధ్వనిబోధకము లైనను దద్బోధకము లగు రేఖలయందు విశేషణములుగాఁ జెప్పఁబడుచున్నవి గదా! అట్లే రసధర్మము లగుగుణములను వాక్యమున నుపచరింపఁజేయుటయు సరియే యగును. వర్ణములు, సమాసములు, రచనయు, గుణవ్యంజకము లను విషయము కావ్యప్రకాశమునఁ జెప్పఁబడినది. 'టఠడఢ' అనునవి తప్పఁ దమతమపంచమవర్ణములతోఁ గూడి స్పర్శములును, హ్రస్వము లగు రేఫణకారములును, సమాసరాహిత్యముగాని యల్పసమాసముగాని గల్గినరచనయు, మాధుర్యగుణము గలపదాంతరయోగరచనయు, మాధుర్యగుణస్ఫోరకములు. పరుషసరళములతో వర్గద్వితీయచతుర్థ వర్ణములకలయిక గలవియు, రేఫయుతవర్ణములును, ద్విత్వాక్షరములును, ణకారముతప్ప మిగిలిన టవర్గమును, శషవర్ణములును, దీర్ఘ

సమాసములును, గతినపదబంధము గలరచనలు నోజోగుణస్ఫోరక ములు.

2. సూ. 37. :- "శ్రుతిమాత్రేణ శబ్దానాం యేనార్థప్రత్యయో భవేత్। సాధారణ స్సమగ్రాణాం స ప్రసాదో గుణ స్స్మృతః"ఇతి సమగ్రాణాం రసానాం వర్ణానాం సమాసానాం సంఘటనానాఞ్చ.

వి:— విన్నంతమాత్రముచేత శబ్దార్థములను విశదముగఁ దెలుపు గుణము ప్రసాదగుణము. ఇది సర్వరససాధారణము. మఱియు సర్వ వర్ణములకు సర్వసమాసములకు సర్వరచనలకును గూడ సాధారణమే.

2. సూ. 38. :- ఆనన్దవర్ధనాచార్యేణా ప్యుక్తమ్ - "శషౌచ రేఫ స్సంయోగ ష్టవర్గశ్చాపి భూయసా। విరోధిన స్స్యు శ్శృఙ్గారే నవవర్ణా రసచ్యుతాః" ఇతి. భూయసా బాహుళ్యే నేత్యర్థః.

వి :— 'శ, ష, ర' అనువర్ణములును, సంయుక్తవర్ణములును, 'టఠ, డఢ, ణ' అనునవియు, మొత్త మీతొమ్మిదివర్ణములును శృంగారరసవిరుద్ధములు. కావున నవి శృంగారరసమునఁ బ్రచురముగ రారాదు" అని యానందవర్ధనాచార్యులు వచించిరి.

2. సూ. 39 :- "జవర్ణవర్జితా స్స్పర్శా స్స్వస్వవర్గాన్త్యశేఖరాః। లఘురేఫ ణకారౌ చ కోమలాః పరికీర్తితాః" ఇతి సుకుమారవర్ణసఙ్గ్రహః.

వి :— జకారముతప్ప మిగిలినయనునాసికవర్ణములతోఁ గూడిన స్పర్శవర్ణములును, రేఫణకారములును, గోమలము లగువర్ణములు. ఇది మృదువర్ణసంగ్రహము.

2. సూ. 40 :— "రేఫేణ యస్య కస్యాపి యోగ ఆద్యతృతీయయోః। స్యోత్తరాభ్యాం తుల్యయోర్వా పరుషాక్షరకా శషౌ" ఇతి పరుషాక్షరసఙ్గ్రహః.

వి :— వర్గ ప్రథమ తృతీయాక్షరములలో దేనికైనఁ గలయిక యున్నను, నొకవర్గముననే ప్రథమతృతీయవర్ణములకు వరుసగా ద్వితీయచతుర్థవర్ణములతోఁ గలయిక గల్గినప్పు డవియు, శషవర్ణములును, బరుషాక్షరములు. ఇది పరుషాక్షరసంగ్రహము.

2. సూ. 41 :— యద్యపి గుణపరతన్త్రాః సఙ్ఘటనాదయః, తథాపి “వక్తృవాచ్యప్రబన్ధానా మౌచిత్యేన క్వచి త్క్వచిత్। రచనా వృత్తివర్ణానా మన్యథాత్వమపీష్యతే.” క్వచి ద్వాచ్యప్రబన్ధానపేక్షయా వక్త్రౌచిత్యాదేవ రచనాదయః క్వచిదేవమే వేతరయోః.

వి :— సంఘటనాదులు గుణపరతంత్రములే యైనను నొక్కయెడ వక్తృవాచ్యప్రబంధముల యౌచిత్యముచేతను, నొక్కయెడ రచన వృత్తి వర్ణములను దత్తద్గుణపరతంత్రములు కాక వేఱువిధముగ నుండును. రచనాదు లొకయెడ వాచ్యప్రబంధానపేక్షతను వక్త్రౌచిత్యము ననుసరించియే యుండును. ఇట్లే వాచ్యప్రబంధములయౌచిత్యము ననుసరించి యొక్కొక్కయెడ రచనాదులు నుండునని యూహింపవలెను.

2. సూ. 42 :- రీతి స్త్రిధా- వైదర్భీ గౌడీయా పాఞ్చాలీచేతి. తత్ర సమగ్రగుణా వైదర్భీ; ఓజఃకాన్తిమతీ గౌడీయా; మాధుర్యసౌకుమార్యోపపన్నా పాఞ్చాలీ. విదర్భాదిదేశోపలబ్ధత్వా దేషా మాఖ్యేతి వామనః.

వి :— ‘వైదర్భి, గౌడి, పాంచాలి’ అని రీతి మూఁడువిధములు. వానిలో సంపూర్ణగుణవిశిష్టము వైదర్భి. ఓజస్సు కాంతి యనుగుణములు కలది గౌడి. మాధుర్యసౌకుమార్యగుణములు గలది పాంచాలి. విదర్భాదిదేశములలో నాయారీతు లనుసరింపఁబడుటచే నాపేరులు గల్గినవని వామనుఁ డనెను.

2. సూ. 43 :- వృత్తయస్తు న శబ్దగతాః కిన్తు రచనాశ్రయాః. తా శ్చతస్రః- కైశిక్యారభటీసాత్వతీభారతీచేతి. తత్ర సుకుమారతరశృఙ్గారకరుణయో ర్వ్యఞ్జికా సుకుమారా కైశికీ. ఉద్ధతయో రౌద్రబీభత్సయో ర్వ్యఞ్జికా తాదృగారభటీ. కిఞ్చిన్మృదూనాం హాస్యశాన్తాద్భుతానాం వ్యఞ్జికా తాదృగ్భారతీ. అనతిప్రౌఢయో ర్వీరభయానకయో ర్వ్యఞ్జికా తాదృక్సాత్వతీ.

వి :— వృత్తులు రచనాశ్రయములుగాని శబ్దగతములు గావు. కైశికి ఆరభటి సాత్వతి భారతి యని వృత్తులు నాల్గు విధములు. వానిలో సుకుమారతరము లగుశృంగారకరుణములకు వ్యంజకమైనది

కైశికి; ఔద్ధత్యము గలరౌద్రబీభత్సములకు వ్యంజక మైనది యార భటి. కొంచెము మృదువు లగుహాస్యశాంతాద్భుతములకు వ్యంజకము భారతి. మిక్కిలిప్రౌఢములు గానివీరభయానకములకు వ్యంజకము సాత్వతి.

2. సూ. 44 :— మధ్యమకైశికీ మధ్యమారభటీ చేతి సర్వరససాధారణం వృత్తిద్వయం కేచి ద్వదన్తి. ఈషత్ప్రౌఢబన్ధా మధ్యమకైశికీ; ఈషన్మృదుబన్ధా మధ్యమారభటీ.

వి :— కొందఱు సర్వరససాధారణములని మధ్యకైశికి, మధ్య మారభటి యనువృత్తిద్వయమును జెప్పుచున్నారు. మధ్యమకైశికి యల్పమాత్రప్రౌఢబంధము గలది. మధ్యమారభటి యల్పమాత్రమృదు బంధము గలది.

2. సూ. 45 : పదానాం వినిమయాసహిష్ణుత్వం శయ్యా. అర్థ స్యాభిరూప్యం పాకః. తత్రార్థస్య ద్రుతప్రతీతౌ ద్రాక్షాపాకః; విలమ్బితప్రతీతౌ నారికేళపాకః; మధ్యమప్రతీతౌ రసాలాదిపాక ఇతి వివేకః.

వి :— పదములమార్పును సహింపకుండుట శయ్య యగును. అర్థ మున కనుగుణముగా నున్నది పాకము. అర్థమునకు ద్రుతప్రతీతి యున్నచో ద్రాక్షాపాకము, విలంబితప్రతీతి యున్న నారికేళపాకము. మధ్యమప్రతీతి యున్న రసాలాదిపాకము నని తెలియవలయును.

2. సూ. 46 : వైదర్భ్యాదీనాం రసాశ్రితమాధుర్యాదిశబ్దధర్మపరత్వేన న సాక్షా ద్రసవ్యఞ్జకత్వమ్. వృత్తీనాం రచనాశ్రయత్వేన సాక్షాద్రసవ్యఞ్జకత్వ మితి విశేషః. ఉక్తఞ్చ ధ్వన్యాచార్యేణ- "శబ్దతత్త్వాశ్రయాః కాశ్చి త్కాశ్చి దర్థాశ్రయాః పరే" ఇతి. విభావాదీనా మేవరసవ్యఞ్జకత్వం ప్రాధాన్యేన. రచనాదీనాం తు తత్సహకారిత్వ మేవే త్యాలఙ్కారికసమయః.

వి :— వైదర్భి మున్నగురీతులు రసాశ్రితము లగుమాధుర్యాది శబ్దధర్మము లగుటచే సాక్షాద్రసవ్యంజకములు కావు. వృత్తులు రచ నాశ్రయము లగుటచే సాక్షాద్రసవ్యంజకములని తెలియవలెను. "కొన్నిశబ్దధర్మము నాశ్రయించినవి, మఱికొన్ని యర్థధర్మము నాశ్ర

యించినవి” అని ధ్వన్యాచార్యుఁడు వచించెను. ప్రధానముగ విభావాదులే రసవ్యఞ్జకములు; రచనాదులు తత్సహకారులునని యాలంకారికుల నిర్ణయము.

3. సూ :– సా వా గ్యా రసవృత్తిః

3. సూ. 1 :– యా వా గ్రసవృత్తిః రసప్రత్యాయనప్రవణా రసవ్యఞ్జికా కైశిక్యాదివృత్తి ర్యస్యా మితివా, రసవ్యఞ్జకధ్వనివ్యాపారో యస్యా మితివా రసవృత్తిః. సైవాత్ర వా గిత్యుచ్యతే. “తిఙ్సుబన్తచయో వాక్యం క్రియా వా కారకాన్వితా” ఇతి మీమాంసకాద్యై ర్వాక్యలక్షణ ముక్తమ్. తన్మాత్రం వాక్య మత్ర నాభిప్రేతమ్. కిన్తు రసవ్యఞ్జక మేవ వాక్య మిత్యర్థః.

వి:– వాక్యప్రస్తావమున నిట రసవృత్తి యగునదే వాక్యమని చెప్పఁబడుచున్నది. రసమును ధ్వనింపఁజేయు లేక రసమును స్ఫురింపఁజేయు కైశిక్యాదివృత్తులు గలది యనికాని, రసవ్యంజకధ్వనివ్యాపారము కలది యనికాని రసవృత్తి యనుపదమున కర్థము. కాన రసవ్యంజక వాక్యమునకే యిచట వివక్ష కాని ‘తిఙ్సుబంతసముదాయము వాక్యము; కారకముతోఁ గూడినక్రియ వాక్యము’ అనురీతి గలవాక్యముల కిచట వివక్ష లేదని తెలియవలెను.

3. సూ. 2 :- వ్యఞ్జనాఞ్జనధ్వనిధ్వననవ్యక్తితాత్పర్యాదినామవ్యవహారయోగ్య వ్యాపారావగమ్యో రసాది ర్వ్యఙ్గ్యార్థ మిత్యాలఙ్కారికమతసమయః. యత్తు పదార్థావగమసమనన్తరభావినీ సమన్వయశక్తి స్తాత్పర్యంనామ వృత్త్యన్తర మిత్యలఙ్కారసర్వస్వసఞ్జీవనీకారః; త న్నిరాకృత మన్యైః.

వి:– వ్యంజనము - అంజనము–ధ్వని–ధ్వననము – వ్యక్తి–తాత్పర్యము మున్నగునామవ్యవహారయోగ్యమై, వ్యాపారావగమ్య మగు రసాలంకారవస్తురూపమైనదే వ్యంగ్యార్థమని యాలంకారికాభిప్రాయము. పదపదార్థము లవగతము లైనపిమ్మటఁ గల్గునట్టి సమన్వయశక్తియే తాత్పర్య మనుపేరు గలవృత్త్యంతర మని యలంకారసర్వస్వసంజీవనీకారుఁడనెను. దాని నితరులు నిరాకరించిరి.

3 సూ. 3 :— తాత్పర్యం నామ వృత్త్యన్తరం న సమ్భవతి; వృత్తిత్రయానుస్యూతస్య వృత్త్యన్తరానుపపత్తేః; క్లృప్తేనైవ వృత్తిత్రయేణ సర్వవ్యవహారోపపత్తౌ బాహ్యేన్ద్రియసహకారిణో మనస ఇన్ద్రియాన్తరకల్పనావ త్తాత్పర్యస్య వృత్త్యన్తరత్వకల్పన మయుక్త మేవేతి.

వి :— అభిధ, లక్షణ, వ్యంజన, అనువృత్తులతోఁ గూడిన తాత్పర్యము మఱియొకవృత్తి కాఁజాలదు. బాహ్యేంద్రియములకు సహకరించుచున్నమనస్సున కింద్రియాంతరత్వమును గల్పించినట్లే యది యుండును. అభిధ లక్షణ వ్యంజన యనువ్యాపారములఁ గూడినదానిని మఱియొకవృత్తిగఁ జెప్పుట యుక్తము కాదు గదా !

3. సూ. 4 :— ఆలఙ్కారికమతే తు తాత్పర్యమేవ వ్యఞ్జనమ్. తే త్వేవం వదన్తి. వక్తృబుద్ధిసన్నిధాపితో వాక్యావగమ్యో వాక్యార్థో రసాదిరూప స్తచ్ఛబ్దేనోచ్యతే. తస్మిన్పరా స్తత్పరా స్తదాసక్తా స్తద్విషయా ఇత్యర్థః. తేషాం భావ స్తాత్పర్యమి త్యర్థావగమాత్.

వి :— "వక్తలబుద్ధికి గోచరించినవాక్యమువలనఁ దెలియుచున్న రసాదిరూపమైనవాక్యార్థము తచ్ఛబ్దముచేఁ జెప్పఁబడుచున్నయర్థము. దానియం దాసక్తి గలశబ్దములు తత్పరము లనిపించుకొనును. తదాసక్తములనియుఁ, దద్విషయకములనియు వానినే యందురు. తత్పరముల యొక్క భావము తాత్పర్యము" అని యాలంకారికులు తాత్పర్యమునే వ్యంజనగా నభివర్ణించుచున్నారు.

3. సూ. 5 :— నన్వభిహితానాం పదార్థానా మర్థాభిధాయినాం వా పదానాం విశిష్టార్థప్రత్యాయనశక్తి స్తాత్పర్యమితి మీమాంసకా మతభేదేన వర్ణయన్తి. తన్మతే 'గా మానయే' త్యాదౌ దేవదత్తకర్తృక దణ్డకరణక గోకర్మక ఆనయనరూపో విశిష్టార్థ ఏవ వ్యఙ్గ్యమర్యాదావిధుర స్తాత్పర్యా దాగతత్వా త్తాత్పర్యార్థ ఇత్యుచ్యతే. తత్కథ మస్య వ్యక్త్యేఽన్తర్భావ ఇతి చేత్సత్యమ్. నహి తావన్మాత్రేణ కవీన్ద్రసంరమ్భవిశ్రాన్తిః.

వి :— అభిహితము లగుపదార్థములకు (అన్వితము లగుపదము లకు,) విశేషార్థమును జెప్పుశక్తియే తాత్పర్యమని మీమాంసకులు మతభేదముతో వర్ణింతురు. 'గోవును దెమ్ము' మున్నగుచోట్ల దేవ

దత్తుఁడు కర్తయు, గోవు కర్మయు, దండము కరణముఁగాఁ గల విశిష్టార్థము వ్యంజనావృత్తిసంబంధము లేకుండఁగనే తాత్పర్యమువలననే లభించుచున్నది. దీనికి వ్యంగ్యమునం దంతర్భావ మెట్లని శంకించుట యుచితమే. అంతమాత్రమునఁ గవీంద్రసంరంభమునకు విశ్రాంతి యుండదు గదా!

3 సూ. 6:— కావ్యే శబ్దానా మన్వయవ్యతిరేకాభ్యాం ప్రవృత్తి నివృత్తిహేతుభూతస్య ప్రధానస్య ప్రయోజనస్యాభావాత్. కిన్తు తదర్థస్య వ్యఞ్జనయా ప్రతీయమానే సామాజికానన్దాఽస్వాదఫలే రసాదా వర్థాన్తరే. అత స్సఏవ తాత్పర్యార్థ ఇతి. తత్ప్రత్యాయకపదార్థశక్తిరేవ తాత్పర్యం క విసమయే. తచ్చ నాభిధా సఙ్కేతాభావాత్. న చ లక్షణా ముఖ్యార్థబాధాద్యభావాత్. అతో వ్యఞ్జనాయా ఏవేదం నామాన్తరకరణ మితి. తదర్థస్య వ్యఙ్గ్యార్థత్వం యుక్తమితి వదామః.

వి :— కావ్యగతపదముల కన్వయవ్యతిరేకములచేఁ బ్రవృత్తి నివృత్తులకు హేతుభూత మైనప్రధానప్రయోజన మేదియును లేదు. కాని యాపదములకు వాచ్యార్థమును విడిచి యర్థాంతరముచే సామాజికానందాస్వాదఫలము సిద్ధించుచున్నది. కాన నదియే తాత్పర్యార్థమనియుఁ, దత్ప్రత్యాయక మగుపదార్థశక్తియే తాత్పర్య మనియుఁ గవిసమయము. సంకేతము లేనందున నది యభిధ కాదు. ముఖ్యార్థబాధ మున్నగునవి లేనందున నది లక్షణయుఁ గాదు. ఇది వ్యంజనావృత్తికి నామాంతరము. కావున దానియర్థమునకు వ్యంగ్యార్థత్వము యుక్తమే.

3. సూ. 7 :— తర్హి కావ్యే పదార్థాన్వయరూపో వాక్యార్థః కథం ప్రతీయత ఇతిచే త్తార్కికాణామివ వాక్యమహిమ్నా, న పున స్తాత్పర్యేణ మీమాంసకానామివ. అత ఏవ తార్కికా వదన్తి. ఆకాంక్షాదిమత్త్వే సతి పదానాం పదార్థానాం వా 'సమన్వితానా మవయవశక్తి ర్వాక్యమ్.' తద్బలాయాతో వాక్యార్థః. తాత్పర్యార్థస్తు - పరిణతివిరసం పనసఫలం, పరిణతిసరస మామ్రమఫలం - ఇత్యాది నిన్దాప్రశంసాదివాక్యేషు హానోపాదానాదిరూప ఏవ సాన్యః. తాత్పర్యమపి భావాభిప్రాయాద్యపరపర్యాయ మేవేతి.

వి :- కావ్యమునందుఁ బదార్థాన్వయరూపవాక్యార్థ మెట్లు ప్రతీయమాన మగుచున్న దనినచోఁ దార్కికులు చెప్పిన వాక్యార్థమహిమచేతనే ప్రతీయమాన మగుచున్నదిగాని, మీమాంసకులు చెప్పినతాత్పర్యశక్తిచేఁ గాదు. కావుననే తార్కికులు:- "ఆకాంక్షాదులచేఁ బరస్పరమును సమన్వితము లైనపదములయొక్కగాని పదార్థములయొక్కగాని యవయవశక్తియే వాక్యము; తద్బలముచేఁ గల్గినది వాక్యార్థము; 'ఆరఁబండినచోఁ బనసపండు చెడును, మామిడిపండన్ననో రుచ్యముగా నుండును' అనునిట్టినిందాప్రశంసాదివాక్యములలో హానోపాదానాదిరూపవాక్యార్థమే తాత్పర్యార్థము. భావము నభిప్రాయము నను నవి దీనినామాంతరములే" - అని చెప్పుచున్నారు.

3. సూ. 8 :- అతఏవోక్తం కావ్యప్రకాశే:-తాత్పర్యార్థోఽపి కేషుచిత్-ఇతి-సుధానిధావప్యుక్తమ్;-"అస్మన్మతం "తాత్పర్యవ్యాపారాపేక్షం నభవతి" ఇతి. విద్యాధరవిదుషా ప్యభిహితమ్:-తాత్పర్యంనామవ్యాపారాన్తరం పరై రభ్యుపసంగతమ్-ఇతి. శృఙ్గారభావప్రకాశేఽపి గదితమ్:- "అతో ధ్వన్యాఖ్యతాత్పర్యగమ్యమానత్వత స్స్వతః కావ్యే రసాలఙ్కారాది ర్వాక్యార్థో భవతి స్ఫుటమ్" - ఇతి ధ్వన్యాచార్యేణాపి వ్యాహృతమ్ - "య స్త్వభిప్రాయరూపం విశేషవ్యఙ్గ్యం శబ్దార్థాభ్యాం ప్రకాశ్యతే తద్భవతి వివక్షితం తాత్పర్యేణ ప్రకాశితమ్-ఇతి-ఏతత్సర్వ మభిప్రేత్యోక్తం శబ్దశాసకేన" "సా వా గ్యా రసవృత్తిః"-ఇతి.

వి:- తాత్పర్యార్థమును గొందఱమతమునఁ గలదు-అని కావ్యప్రకాశ మనుగ్రంథమును, - మామతము తాత్పర్యవ్యాపారము నపేక్షింపదు - అని సుధానిధియందుఁ, దాత్పర్య మనువ్యాపారము నితరు లంగీకరించిరి - అని విద్యాధరచక్రవర్తియు, ధ్వని యనుపేర నొప్పు తాత్పర్యము వ్యక్తమగుటచేఁ గావ్యమున స్వతస్సిద్ధముగనే రసాలంకారాదులు కావ్య మగుట స్పష్టము-అని శృంగారభావప్రకాశమును - శబ్దార్థములచేఁ దెలుపఁబడు నభిప్రాయరూపవ్యంగ్యార్థమే తాత్పర్యముచేఁ బ్రకాశిత మగుచున్న దని చెప్పఁబడుచున్నది- అని ధ్వన్యాచా

ర్యుఁడును నుడివిరి. ఈయభిప్రాయముల ననుసరించియే నన్నపార్యుఁడు "సా వా గ్యా రసవృత్తిః" – అని చెప్పియున్నాఁడు.

3. సూ 9 :- శక్త్యా లక్షణయా చ నిర్వాహా న్న వ్యఞ్జనా వృత్త్యన్తరమితి తార్కికాః. తన్నిరసనద్వారా వ్యక్తిసిద్ధ్యాప్రకారస్తు మధురానాథీయగదాధరీయాప్పయదీక్షితీయాదిగ్రన్థేషు ద్రష్టవ్యః రసస్వరూపం తావదభిధీయతే.

రసలక్షణన్తు-"విభావానుభావసాత్త్వికవ్యభిచారిసామగ్రీసముల్లసితస్థాయీభావో రసః ఇతి." భావస్య స్థాయిత్వం నామ సజాతీయవిజాతీయానభిభూతతయా యావదనుభవ మవస్థానమ్. భరతే నాప్యుక్తమ్ - "విభావానుభావసాత్త్వికవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః"-ఇతి.

వి:- అభిధ లక్షణ యనువృత్తులచేతనే తాత్పర్యార్థము లభించుచున్నది, గావున వ్యంజన యనువృత్త్యంతరము సంగీకరింప నక్కఱలేదని తార్కికు లందురు. దాని నిరసించుచు వ్యంజనావశ్యకతను నిరూపించిన రీతి మధురానాథీయము, గదాధరీయము, అప్పయదీక్షితీయమున్నగు గ్రంథములవలనఁ దెలియనగును.

అది విభావము అనుభావము సాత్త్వికభావము వ్యభిచారిభావము ననునాల్గింటిచే సముల్లసిత మగుస్థాయీభావమే రసము-అని రసలక్షణము చెప్పఁబడినది. సజాతీయ విజాతీయభావము లెన్ని కూడిన నను భవము కల్గునవఱకు నిల్చునది స్థాయిభావము. విభావానుభావసాత్త్విక వ్యభిచారిభావసంయోగమువలన రసనిష్పత్తి కల్గునని భరతమునియు వచించెను.

3. సూ. 10 :- విభావాదీనాం సంయోగా ద్వ్యఙ్గ్యవ్యఞ్జకభావలక్షణాత్సమ్బన్ధాద్రసస్య నిష్పత్తిరభివ్యక్తిరిత్యేతేన "రస ఉత్పద్యతే జ్ఞాప్యతే" ఇతి వదతాం భట్టలోల్లటాదీనాం మతం నిరస్తమ్. నిరసనప్రకారస్తు తత్ప్రతిపాదకగ్రన్థాదేవావగన్తవ్యః.

వి :- "విభావాదులసంయోగమువలన రసము నిష్పన్న మగుచున్నది" యనుభరతమునిలక్షణములో నిష్పన్న మగుచున్నది – పుట్టుచున్నది – అభివ్యక్త మగుచున్నది-యని యర్థము చేసినభట్టలోల్లటా

దులమతము నిరసింపఁబడినది. తద్విధ మంతయుఁ దత్ప్రతిపాదక గ్రంథములవలనఁ దెలియనగును.

3. సూ. 11 :– అత్ర విభావానుభావవ్యభిచారిణాం తత్ర తత్ర రసశ్లోకేషు కేవలానా మవస్థితి ర్దృశ్యతే. తథాపి తేషామపి సాధారణానాం పరస్పరావినాభావబలా దన్యోన్యాపేక్షత్వే సతి నానైకాన్తికత్వమితి సూత్రే మిలితానాం గ్రహణమితి బోద్ధవ్యమ్.

వి :– ఈ విషయమున విభావానుభావవ్యభిచారి భావములకుఁ గేవలముగా నాయారసశ్లోకములయం దునికి యగపడుచున్నది. అట్లగపడినను – విభావాదులకుఁ బరస్పరముగా నవినాభావసంబంధబలము వలన నన్యోన్యాపేక్ష కల్గియుండుటచేఁ గేవలములుగా నగపడుచున్నను నవి ప్రత్యేకములుగా నిలిచియుండలేదని తెల్పుటకై సూత్రమునందు "మిళితానాం" అనునది గ్రహింపఁబడినట్లు తెలియవలయును.

3. సూ. 12 :– అయ మసంలక్ష్యక్రమ ఏవ రసః విభావాదివ్యఞ్జనీయతయా క్రమస్య విద్యమానత్వేఽపి రసాస్వాదాతిశయమహిమ్నా తస్యాసంలక్ష్యమాణత్వాత్. తదుక్తం శృఙ్గారతిలకే–రసభావతదాభాసభావశాన్త్యాది రక్రమః. భిన్నో రసాద్యలఙ్కారా దలఙ్కార్యతయా స్థితః – ఇతి.

వి :– ఈరస మసంలక్ష్యక్రమమే. విభావాదులు వ్యంజకములును రసము వ్యంగ్యము ననునట్టిక్రమ మున్నను రసానుభవమునందట్టిక్రమ మున్నట్లు గోచరింపదు - రసము భావము రసాభాసము భావాభాసము భావశాంతి మున్నగునవి యసంలక్ష్యక్రమవ్యంగ్యములు. అలంకార్యము లగునీరసభావాదు లలంకారము లగురసవదాదులకంటె భిన్నములు.

3. సూ. 13 :– అసంలక్ష్యక్రమత్వఞ్చ యత్ర విభావానుభావాదివశా దాశుభావినీ రసాభివ్యక్తి స్తత్రైవ. అన్యత్ర తు రసాదిధ్వనిరపి సంలక్ష్యక్రమ ఏవ. తదుక్తమభినవగుప్తపాదాచార్యైః. "యద్యపి రసభావాది రర్థో ధ్వన్యమాన ఏవ న వాచ్యః కదాపి. తథాపి న సర్వోఽప్యసంలక్ష్యక్రమవిషయః" ఇతి. అత ఏవ ధ్వనికారోఽపి "ఏవంవాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ। లీలాకమలపత్రాణి గణయామాస పార్వతీ" ఇత్యత్ర లజ్జాఖ్యం సఞ్చారిభావ మనురణనవ్యఙ్గ్య ముదాజహార.

వి:— విభావాదులవలన రసాభివ్యక్తి శీఘ్రముగఁ గల్గుచోటుల యందే యసంలక్ష్యక్రమత్వ ముండును. ఇతరస్థలములందు రసాది ధ్వనియు సంలక్ష్యక్రమమే. రసభావాదులు వాచ్యములు కావు, వ్యంగ్యములే. అయినను రసభావాదు లన్నియు నసంలక్ష్యక్రమము లనుటకు వీలులేదు – అని యభినవగుప్తపాదాచార్యులు వచించి యున్నారు. కావుననే – దేవర్షి యగునారదుఁ డిట్లు చెప్పఁగాఁ దన తండ్రిపార్శ్వభాగమున నధోముఖియై నిలిచినపార్వతి లీలాకమలపత్రము లను లెక్కించుచుండెను - అను నిందలిలజ్జాఖ్యసంచారిభావ మనురణన ధ్వనికి సంలక్ష్యక్రమవ్యంగ్యమున నుదాహరించెను.

3. సూ. 14:— తత్ర రసాభివ్యక్తికారణం దయితో జనో విభావః. స ద్విధా– ఆలమ్బనోద్దీపనభేదాత్. ఆలమ్బనశ్చ రతే ర్ద్వివిధమ్ – నాయికానాయకభేదాత్. తత్ర నాయికా సమ్భావితనాయకసామాన్యగుణయోగినీ. సాచ సఙ్గ్రహే ఽష్టవిధా - స్వాధీనపతికా వాసకసజ్జికా విరహోత్కణ్ఠితా విప్రలబ్ధా ఖండితా కలహాన్తరితా ప్రోషితభర్తృకా అభిసారికా భేదాత్.

వి:— అందు రసాభివ్యక్తికిఁ గారణ మగుప్రియజనము విభావము. ఆలంబనోద్దీపనభేదముచే నది రెండు విధములు. నాయికానాయకభేద ముచే రత్యాలంబనమును రెండు విధములు. అందు నాయిక నాయకు నితో సామాన్యగుణసంబంధము కలదియై యుండును - స్వాధీనపతిక వాసకసజ్జిక విరహోత్కంఠిత విప్రలబ్ధ ఖండిత కలహాంతరిత ప్రోషిత భర్తృక అభిసారిక - అని యీనాయిక యెనిమిదివిధములు.

3. సూ. 15 :— ఏతాసాం నాయకానుకూలిన్యః సఖీ, ధాత్రేయికా, ప్రాతివేశినీ, శిల్పినీ, కారు, లిఙ్గినీ, సంజ్ఞా షడ్దూతికాః.

వి :— ఈ నాయికలకు నాయకుల ననుకూలపఱచుటకై – చెలికత్తె, దాదికూఁతురు, పొరుగింటియామె, చిత్రకారిణి, కారువు, యోగిని–అనునార్వురు దూతికలు కలరు.

3 సూ. 16 :— నాయికాసఙ్గ్రహ స్తు విశేషేణ రత్నాపణాదిషు కృతః.

"స్వాన్యా సాధారణా చ స్యాత్, ముగ్ధా మధ్యా ప్రగల్భికా।
ఆద్యైకధా త్రిధాఽన్యే ద్వే ధీరాధీరోభయాత్మికా॥

జ్యేష్ఠాకనిష్ఠాభేదేన తేఏవ ద్వివిధే పునః ।
అన్యా కన్యాపరోఢా చ వేశ్యా త్వేకేతి షోడశ ॥
స్వాధీనపతికాద్యష్టా, వస్థాభి స్తా స్సమన్వితాః ।
ప్రత్యేక మష్టధా ముఖ్యా మధ్యా హీనేతి తా స్త్రిధా ॥
ఇత్యేవం నాయికాభేదా స్సముద్రాష్టాగ్నిసమ్మితాః ।
విరహోత్కణ్ఠితాచైవ విప్రలబ్ధాఽభిసారికా ॥
ఇత్యవస్థాత్రయం ప్రాహుః కేచి త్కన్యాపరోఢయోః ।
చతుః పఞ్చాశదధికత్రిశతీ సమ్మితా భవేత్" — ఇత్యాదినా ॥

వి:- నాయిక స్వీయ, అన్య, సాధారణ అని ముత్త్రివిధములు. అన్యకు భేదములు లేవు. స్వీయ, సాధారణ అనువారు ధీర, అధీర, ధీరాధీర-అనుభేదములచేఁ బ్రత్యేకము మూఁడేసి విధములై యాఱువిధములు గను, జ్యేష్ఠాకనిష్ఠాభేదములచే నీయాఱువిధములు పన్నెండువిధములు గను నగుచున్నవి. ముగ్ధతోఁ బదుమూఁడువిధములై - కన్య, పరోఢ, వేశ్య - అనునవి అన్య నాయికాభేదములు మూఁటితోఁ బదునాఱు విధము లగుచున్నది. ఈపదునాఱుభేదములును స్వాధీనపతికాద్యష్టవిధ భేదములచే భేదింపఁబడి (128) నూటయిరువదియెనిమిది భేదము లగుచున్నవి. వీనిలో నొకొక్కటి — ముఖ్య, మధ్య, హీన—అనువానిచే భేదించి మొత్తము (384) మూఁడువందలయెనుబదినాల్గు భేదముల నొందుచున్నవి - అని నాయికాభేదములు రత్నాపణాదులలో విస్తరించి చెప్పఁబడినవి.

3. సూ. 17 :- పద్మిన్యాదిభేదా శ్చత్వారః — హారిణీ కురఙ్గీ కరిణ్యాఖ్యా స్తదుపజాతయశ్చ కామశాస్త్రే ప్రసిద్ధాః.

'పద్మిని చిత్రిణి శంఖిని హస్తిని' అని మఱినాలుగునాయికా భేదములు కలవందురు. అవియు హరిణి కురంగి కరిణి మున్నగునుపజాతులును గామశాస్త్రప్రసిద్ధములు.

3. సూ. 18. :- "మహాకులీనత్వ ముదారతా చ తథా మహాభాగ్య విదగ్ధభావౌ, తేజస్వితా ధార్మికతోజ్జ్వలత్వ మమీ గుణా జాగ్రతి నాయకస్య॥" నయతి ప్రాపోతి ఫలం వృత్తిష్వితి నాయకపదవ్యుత్పత్తి రాలఙ్కారికైః ప్రదర్శితా.

వి:- మహాకులీనత, ఔదార్యము, మహాభాగ్యము, పాండిత్యము, పరాక్రమము, ధార్మికత, ఉజ్జ్వలత్వము - అనునివి నాయకసామాన్య గుణములు. కథాగమనమునకు మూలమును, ఫలము నొందువాఁడును, నాయకుఁ డగును.

3. సూ. 19. :- "కీర్తిప్రతాపసమ్పన్నః పురుషత్రయతత్పరః। ధురంధరశ్చ గుణవా న్నాయకః పరికీర్త్యతే" అత్ర కీర్తిప్రతాపాదీనాం గుణవత్త్వదేనై వోపాత్తానా మపి పునరుపాదాన మేతేషాం సర్వేష్వపి నాయకే ష్వావశ్యకత్వం ద్యోతయితుమితి రహస్యమ్. స చతుర్విధః - ధీరోదాత్త ధీరోద్ధత ధీరలలిత ధీరశాన్త భేదాత్. ఏతాషాం సర్వరససాధారణ్యేఽపి వీరరౌద్రశృఙ్గారశాన్తరసప్రాధాన్య మస్తీతి రస సమ్ప్రదాయవిదః.

వి:- కీర్తిప్రతాపసంపత్తియు, ధర్మార్థకామాసక్తియుఁ గార్యనిర్వాహణదక్షతయుఁ గలిగి, గుణగరిష్ఠుఁ డైననాయకుఁడు ప్రబంధమున కుండవలయును. ఈలక్షణమందలి 'గుణగరిష్ఠ' శబ్దముచేతనే కీర్తిప్రతాపాదులు గ్రహింపఁబడుచుండ మరల వానిం జెప్పుటచే నాయకసామాన్యమున కీగుణములు ముఖ్యములని తెలియుచున్నది. -ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు - అనుభేదములచే నాయకుఁడు నాల్గువిధములు. ఈనాయకులు సర్వరససాధారణులే యైనను వీరరౌద్రశృంగారశాంతరసములయందు వీరు వరుసగాఁ బ్రాధాన్యము వహింతురని రససంప్రదాయవేత్త లనుచున్నారు.

3. సూ. 20 :- ఏతేషా మేవ శృఙ్గారాశ్రయతయాఽనుకూలాదిభేదేన ప్రత్యేకం చతుర్విధానా ముత్తమమధ్యమాధమభేదేన పునః ప్రత్యేకం త్రైవిధ్యేఽష్టాచత్వారింశ ద్భేదా భవన్తి.

వి :- శృంగారరసాశ్రయముచే ధీరోదాత్తాదినాయకచతుష్టయము-అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు-అను భేదములచే నాల్గువిధముల నొంది పదునాఱువిధము లగుదురు. మరల వీరు ఉత్తమమధ్యమాధమభేదములచేఁ బ్రత్యేకము మూఁడువిధములై నలువదియెనిమిది భేదములతో నొప్పుదురు.

3. సూ. 21. :– "ఉక్తసకలగుణసమ్పన్నః ప్రబన్ధవ్యాపీ, ఫలకరస్య వ్యాపార ఉత్తమః; కతిపయగుణహీనో మధ్యమః; బహుగుణహీనోఽధమ" ఇతి వివేకః. ధీరోదాత్తాదిశబ్దాశ్చ మహావీరచరితాదిమహాప్రబన్ధేషు ఏకస్యానేకరూపాభిధానేన వత్స వృషభమహోక్షాదిశబ్దవ దవస్థావాచినో న జాతివాచిన ఇతి ప్రతిపాదితం దశరూపకే.

వి:– మీఁదఁ జెప్పఁబడిన సమస్తగుణములతోఁ గూడి, ప్రబంధ మంతటను వ్యాపించినవృత్తము గలిగి, చివరకు ఫలసిద్ధి నొందువ్యాపారము కలవాఁడై, యాఫలము ననుభవించునతఁ డుత్తముఁడు. కొన్ని గుణములు తక్కువ యగునతఁడు మధ్యముఁడు; అధికగుణహీనుఁ డధముఁడు. ధీరోదాత్తాదిశబ్దము లవస్థాభేదములచే వత్సవృషభమహోక్షాదిభేదములను బలీవర్దము చెందిన ట్లొందును. ఈ విషయము దశరూపకమునఁ బ్రతిపాదింపఁబడినది.

3. సూ. 22 :– శృఙ్గారనాయక శ్చతుర్విధః – అనుకూలో దక్షిణో ధృష్ట శ్శఠ ఇతి భేదాత్. "ఏకాయత్తోఽనుకూల స్స్యా త్తుల్యోఽనేకత్ర దక్షిణః। వ్యక్తాపరాధో ధృష్ట స్స్యా ద్గూఢవిప్రియకృ చ్ఛఠః"

వి:– అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు–అనుభేదములచే శృంగారనాయకుఁడు నాల్గువిధములుగ నుండును. ఒక్కనాయికయం దనురక్తుఁ డనుకూలుఁడు. పెక్కునాయికలయందు సమానముగ ననురక్తుఁడై వర్తించునతఁడు దక్షిణుఁడు. నాయిక కెఱుకపడు రీతి నపరాధము చేసి, భీతిల్లనియతఁడు ధృష్టుఁడు. రహస్యముగ నాయిక కపచారము చేయునతఁడు శఠుఁడు.

3. సూ. 23 :– తేషాం నాయికానుకూలనే – పీఠమర్ద విట చేట విదూషకా స్సహచారిణః. "కిఞ్చిదూనః పీఠమర్దః కలాసు కుశలో విటః। సన్ధానకుశల శ్చేటో హాస్యప్రాయో విదూషకః" - పాఞ్చాలదత్త భద్రకూచిమారాఖ్యా శ్చత్రస్రః పురుష జాతయః; శకవృషహయాఖ్యా ఉపజాతయశ్చ కామశాస్త్రే ప్రతిపాదితాః.

వి:– వీరికి నాయికల ననుకూలింపఁజేయుటలో– పీఠమర్దుఁడు, విటుఁడు, ఛేటుఁడు, విదూషకుఁడు ననువారు సహకారులు. నాయకున

కించుకతక్కువై నయతఁడు పీఠమర్దుఁడు; సమస్తకలాకుశలత కలవాఁడు విటుఁడు; నాయికానాయకుల ననుసంధించుటలో నేర్పరి చేటుఁడు; హాస్యప్రాయుఁడు విదూషకుఁడు. మఱియుఁ—బాంచాలుఁడు, దత్తుఁడు, భద్రుఁడు, కూచిమారుఁడు—అను పురుషజాతులును, శశహయవృషాద్యుపజాతులును గామశాస్త్రమునఁ బ్రసిద్ధములు

3. సూ. 24 :- "ఉద్దీపనం తదుత్కర్ష హేతుః" తచ్చతుర్విధమ్. ఆలమ్బన గుణచేష్టాఽలఙ్కరణతటస్థభేదాత్. రూపయౌవనాది రాలమ్బనగుణః. హావభావహేలామాధుర్యధైర్యలీలావిలాసవిచ్ఛిత్తివిభ్రమకిలికిఞ్చితమోట్టాయితకుట్టమితబిబ్బోకలలితకుతూహలచకితవిహృతహాస్యాఖ్యాః - తచ్చేష్టా యౌవనోద్భూతాః హారాది రలఙ్కారః. మలయానిలచన్ద్రాద్యా స్తటస్థాః. కార్యభూతకటాక్షభుజాక్షేపాది రవయవవికారవిశేషోఽనుభావః.

వి:- నాయికానాయకులకుఁ గలరతి నుద్దీపింపఁజేయునది యుద్దీపనవిభావము. అది 'యాలంబనగుణము, తచ్చేష్ట, తదలంకరణము, తటస్థము, ననుభేదములచే నాల్గువిధములు. రూపము, యౌవనము—మున్నగునవి యాలంబనగుణములు. - హావము, భావము, హేల, మాధుర్యము, ధైర్యము, లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము. లలితము, కుతూహలము, చకితము, విహృతము, హాసము—అనునీపదునెనిమిదియు నాయికానాయకులయౌవనోద్భూతచేష్టలు. వారు ధరించుభూషణములే తదలంకరణములు. మలయానిలచంద్రాదులు తటస్థములు. కార్యభూతము లగుకటాక్షభుజాక్షేపాదు లనుభావములు.

3. సూ. 25:- 'పరగతసుఖదుఃఖాదిభావనయా భావితాన్తఃకరణత్వం సత్త్వమ్. తద్భవా స్సాత్త్వికాః' ఇత్యాదిప్రకారేణ సాత్త్వికశబ్దప్రవృత్తౌ ప్రాచామాచార్యాణా మనేకధోక్తయో వర్తన్తే. ఏతేషా మనుభావాన్తర్భావేఽపి సత్త్వజత్వేక్షణవిశేషేణ బ్రాహ్మణపరివ్రాజకన్యాయేన పార్థక్యేన పరిగణనమితి రసవాదినాం సమయః.

వి:- ఇతరులసుఖదుఃఖాదులను దనమనసున భావించుటచేఁ గల్గిన మైమఱపునకే సత్త్వ మని పేరు. దానివలనఁ గల్గినవానికి సాత్త్విక

భావము లని పేరు. ఇవి యనుభావాంతర్భూతములే యైనను సత్త్వము వలనఁ బుట్టిన వనువిశేషముచే వేఱుగ వీనికిఁ బరిగణనము జరిగినదని రసవాదులనిర్ణయము.

3. సూ. 26. :- తే చాష్టౌ. 'స్తమ్భః ప్రళయరోమాఞ్చౌ స్వేదో వైవర్ణ్య వేపథూ। అశ్రువైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః.'

వి:- స్తంభము, ప్రళయము, రోమాంచము, స్వేదము, వైవర్ణ్యము, వేపథువు, అశ్రువు, వైస్వర్యము-అనునీయెనిమిదియు సాత్త్విక భావములు.

3. సూ. 27. :- వివిధ మభిత స్సఞ్చర న్తీతి వ్యభిచారిణః. తే చ-
"నిర్వేదగ్లానిశఙ్కా-శ్రమధృతిజడతాహర్షదైన్యౌగ్ర్యచిన్తా
త్రాసేర్ష్యాఽమర్షగర్వస్మృతిమరణమదా స్సుప్తినిద్రాఽవబోధాః।
వ్రీడాఽపస్మారమోహా స్సుమతి రలసతాఽఽవేగతర్కా వహిత్థా
వ్యాధ్యున్మాదౌ విషాదోత్సుకచపలయుతా స్త్రింశ దేతే త్రయశ్చ."

వి:- రత్యాదులకు విశేషసహకారులగుచు వివిధరీతులతో నంతటను సంచరించునవి - అను వ్యుత్పత్తిచొప్పున వీనికి వ్యభిచారిభావములనుపేరు కల్గినది. నిర్వేదము, గ్లాని, శంక, శ్రమము, ధృతి, జడత, హర్షము, దైన్యము, ఉగ్రత, చింత, త్రాసము, ఈర్ష్య, అమర్షము, గర్వము, స్మృతి, మరణము, మదము, సుప్తి, నిద్ర, విబోధము, వ్రీడ, అపస్మారము, మోహము, మతి, అలసత, ఆవేగము, తర్కము, అవహిత్థ, వ్యాధి, ఉన్మాదము, విషాదము, ఔత్సుక్యము, చపలత - అను నీముప్పదిమూఁడును వ్యభిచారిభావములు.

3. సూ. 28.:- రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా। జుగుప్సా విస్మయశమాః స్థాయిభావాః ప్రకీర్తితాః" "శృఙ్గారహాస్యకరుణరౌద్రవీరభయానకాః। బీభత్సాద్భుతశాన్తాఖ్యా రసా నవ సమీరితాః"

| రసము - | స్థాయీభావము. | రసము - | స్థాయీభావము. |
|---|---|---|---|
| 1. శృంగారము - | రతి | 3. కరుణము - | శోకము |
| 2. హాస్యము - | హాసము | 4. రౌద్రము - | క్రోధము |

5. వీరము - ఉత్సాహము
6. భయానకము - భయము
7. బీభత్సము - జుగుప్స
8. అద్భుతము - విస్మయము
9. శాంతము - శమము

3. సూ. 29. :- కేచిత్తు శృఙ్గారమేవ రసం మేనిరే. కేచిత్తు శాన్తం రసం మేనిరే. అపరే వత్సలేనసహ దశరసా నురరీకుర్వతే. అన్యేతు స్నేహాభక్తిభ్యాం ద్వాదశరసా నుపతిష్ఠన్తే. శృఙ్గారస్యేవ కరుణాదీనామపి రసత్వ మస్తీతి ప్రతిపాదనం తదభావప్రతిపాదకమతనిరసనపాటవఞ్చ ప్రాచీనగ్రన్థా దవగన్తవ్యమ్.

వి:— శృంగారమే రసమని కొందఱనిరి. శాంతమును రసమే యని మఱికొంద ఱనిరి. ఇంకఁగొందఱు వత్సలరసముతో రసములు పది యని చెప్పుచున్నారు. వానితో స్నేహాభక్తిరసములను గలిపి పండ్రెండురసములని యింకఁగొంద ఱనుచున్నారు. శృంగారరసమునకు వలెఁ గరుణాదులకును రసత్వము కల దనుటయు, నది సరికా దని నిర సించుపాటవమును, ప్రాచీనగ్రంథములవలనఁ దెలియవలయును.

3. సూ. 30. :- కేచిత్తు శాన్తస్యోత్సాహం స్థాయిన మాహుః. కోహలస్తూత్సాహో నిర్వేదో శమో వాఽస్య స్థాయీ త్యువాచ. కేచి జ్జుగుప్సాం స్థాయిన మాహుః. త దసఙ్గతమ్. రసానాం ప్రతినియతస్థాయికత్వనియమాత్.

వి.— శాంతరసమున కుత్సాహము స్థాయిభావమని కొంద ఱను చున్నారు. కోహలుఁ డనునతఁడు మాత్రము శాంతరసమున కుత్సాహముగాని, నిర్వేదముకాని, శమముగాని స్థాయిభావము కావచ్చునని చెప్పినాఁడు. కొందఱు దీనికి జుగుప్స స్థాయిభావమని చెప్పుచున్నారు. అది యసంగతము. ప్రతిరసము నియత మగుస్థాయిభావమును గల్గి యుండుటచే నది సరికాదు.

3. సూ. 31. :- యద్యపి పిత్రాదేః పుత్రాదిప్రీతిస్థాయికో వత్సలో నామ రసో, మిత్రాది ష్వాదరస్థాయికః స్నేహోఽపి రసః, సేవకానాం సేవ్యగురుదేవాదిగోచర స్తాత్పర్యస్థాయికో భక్తిర్నామ రసశ్చ తథాఽప్యేషాం రతిభావా న్తర్భూతత్వమేవ. విషయభేదమాత్రా ద్భేదవ్యపదేశః. రతిర్హి కామినీవిషయావిభావాదిసముల్లాసితా, శృఙ్గారరసతా మాపద్యతే; సైవ గురుపుత్రమిత్రవిషయా చే ద్భావశబ్దభా గ్భవతి.

ఇమమే వాభిప్రాయ మనుసన్ధాయ కావ్యప్రకాశకార ఆహ. "రతి ర్దేవాదివిషయా; వ్యభిచారిపదాఞ్చితో భావః ప్రోక్తః" ఇతి.

వి :- తండ్రిమున్నగువారికిఁ బుత్త్రాదివిషయక ప్రీతి స్థాయిగాఁ గలవత్సలరసమును, సేవకులయందు సేవ్యగురుదేవాదిగోచర మగు తాత్పర్యస్థాయిక భక్తిరసము నగపడుచున్నవి. కాని యివి యన్నియు రతిభావమునం దంతర్భూతములే. విషయభేదమాత్రముచే భేదవ్యపదేశము. కామినీవిషయక మగుంతియే విభావాదిసముల్లసితమై శృంగారరసత్వము నొందుచున్నది. అదియే గురుపుత్త్రాదివిషయక మైనచో భావ మనువ్యపదేశము నొందుచున్నది. దేవాదివిషయకఁ రతియే వ్యభిచారిపదాంచితమై భావమని పిలువఁబడుచున్నది — అని కావ్యప్రకాశకారుఁ డీవిషయమును జెప్పెను.

3. సూ. 32. :- వికాసవిస్తరక్షోభవిక్షోభాఖ్యాశ్చతుర్విధాః। జాయన్తే చేతసో ధర్మా విభావాదిసమాగమే. వికాసః కుసుమస్యేవ పాదపస్యేవ విస్తరః। చేతసోఽబ్ధేరివ క్షోభో విక్షోభో మరుతో యథా. వికాసమూల శ్శృఙ్గారో వీరో విస్తరమూలకః। విక్షోభోపాధికో రౌద్రో బీభత్సః క్షోభమూలకః. ఏతన్మూలా హాస్యచిత్రభయానకదయాః క్రమాత్. శృఙ్గారహాస్యయో ర్వీరాద్భుతయో రౌద్రభీమయోః। బీభత్సదయయో ర్మైత్రీ స్యా చ్చేతోపాధికత్వతః. రసౌ శృఙ్గారబీభత్సౌ తథా వీరభయానకౌ। రౌద్రాద్భుతౌ తథా హాస్యకరుణౌ వైరిణౌ మిథః."—

వి :- విభావాదులతోఁ గూడినచిత్తమునకు—వికాసము, విస్తరము, క్షోభము, విక్షోభమునను నాల్గుక్రియలు గల్గును. పూమొగ్గవలెఁ జిత్తము వికసించుట వికాసము. వృక్షమువలెఁ జిత్తము వ్యాపించుట విస్తరము. సముద్రమువలె క్షోభ చెందుట క్షోభము. గాలిచేవలెఁ జిత్తము చెదరుట విక్షోభము. వికాసమూలకము శృంగారరసము. విస్తరమూలకము వీరము రౌద్రము విక్షోభమూలకము. బీభత్సము క్షోభమూలకము, హాస్యచిత్రభయానకదయలు వరుసగాఁ బైఁజెప్పిన వికాసాదులే మూలముగాఁ గలవి యగుచున్నవిగాన నేతన్మూలకములే యని

తెలియనగును. ఏకోపాధికము లగుటవలన—శృంగారహాస్యములు, వీరాద్భుతములు, రౌద్రభయానకములు, బీభత్సదయలు పరస్పరమైత్రి కలవి యగుచున్నవి. – శృంగారబీభత్సములు, వీరభయానకములు, రౌద్రాద్భుతములు, హాస్యకరుణములు పరస్పరవిరోధము కలవి.

3. సూ. 33. తత్ర శృఙ్గారవీరరౌద్రాద్భుతానాం లోకోత్తరాశ్రయత్వేన పరిపోషాతిశయః. అత ఏవ శృఙ్గారస్య మ్లేచ్ఛాదివిషయత్వే నాభాసత్వమ్. ఉక్తంహి శృఙ్గారతిలకే– "ఏకత్రై వానురాగ శ్చే త్తిర్యఙ్ మ్లేచ్ఛగతోఽపివా। యోషితో బహుసక్తిశ్చే ద్రసాఽభాస స్త్రిధా మతః" – ఇతి. విభావాద్యజ్ఞానం న రసప్రయోజక మితి తిర్యగాదిష్వపి రసోఽస్త్యేవేతి విద్యాధరః.

వి :– శృంగారవీరరౌద్రాద్భుతరసములు లోకోత్తరనాయకాశ్రయము లగుటచేఁ బరిపోషాతిశయము గలవగుచున్నవి. కాన శృంగారము మ్లేచ్ఛాదివిషయక మైనపు డాభాస మగుచున్నది.– నాయికానాయకులలో నొకరికి మాత్రమె యనురాగమున్నను, నాయనురాగము తిర్యఙ్మ్లేచ్ఛగతమైనను, స్త్రీకి బహునాయకాసక్తి కల్గినను, రసాఽభాస మగును – అని శృంగారతిలకమునఁ గలదు. విభావాదిజ్ఞానము రసప్రయోజకము కానందునఁ దిర్యగాదులయందును రసమున్న– దని విద్యాధరుఁ డనుచున్నాఁడు.

3. సూ. 34 :– శృఙ్గారరసః :– తత్ర శృఙ్గారరసస్య స్థాయీభావో రతి స్సమ్భోగవిషయేచ్ఛావిశేషః. సైవ విభావాదిభి స్స్వాదుతాం నీతా శృఙ్గార ఇత్యుచ్యతే. శృఙ్గం ప్రాధాన్య మియర్తీతి శృఙ్గారః. తత్ప్రాధాన్యం ధ్వనికారేణోక్తమ్. – "శృఙ్గార ఏవ మధురః పరప్రహ్లాదనో రసః। తన్మయం కావ్య మాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి"– ఇతి. తత్రైవకారేణ ప్రాధాన్య మవిసంవాదమితి లోచనకారః.

వి :– శృంగారరసము :– దీనికి రతి స్థాయీభావము. సంభోగవిషయేచ్ఛావిశేషము రతి యని చెప్పఁబడుచున్నది.– అది విభావాదులచేఁ బరిపుష్టమై శృంగారరసత్వము నందుచున్నది. రసములలో నది ప్రధానరస మగుటచే దానికి శృంగారరస మని పేరు. (శృంగమ్=ప్రాధా

న్యమును, ఇయర్తి=పొందుచున్నది-అని దీని వ్యుత్పత్తి)- శృంగారమే మధురమైన రసము. అది మిక్కిలియానందదాయకము - శృంగారమయమైనకావ్యము నాశ్రయించి మాధుర్యము నిలుచును. అని ధ్వనికారుఁడు నుడివెను. శృంగారఏవ - అను చోటి 'ఏవ' కారముచేఁ బ్రాధాన్యమునకు విసంవాదము లేదని లోచనకారుఁడు వచించెను.

3 సూ. 35:- స ద్వివిధః సమ్భోగో విప్రలమ్భ శ్చేతి. తత్ర సమ్భోగో రతిరహస్యే లక్షితః- "అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ। దర్శనస్పర్శనాదీని సస మ్భోగో ముదాన్వితః. సప్తావస్థః- ప్రేమా అభిలాషః రాగః స్నేహః ప్రేమ రతిః స శృఙ్గార ఇతి భేదాత్.

వి :- సంభోగవిప్రలంభభేదముచే శృంగారము రెండువిధములు- సమానానురాగము గల నాయికానాయకు లిరువురును దర్శనాఽలింగన చుంబనాదులచే నానందించుట శృంగారము - అని రతిరహస్యమున శృంగారరసలక్షణము చెప్పఁబడినది. మరల నది - ప్రేమ, అభిలాష, రాగము, స్నేహము, ప్రేమము, రతి, శృంగారము - అనుభేదములచే నేడువిధము లయి యుండును.

3. సూ. 36. స ద్వివిధః - సంక్షిప్తో విస్తృత శ్చేతి. ఆద్య స్త్రివిధః. నవీన, విరహ, మానానన్తరజత్వభేదాత్. విస్తృతోఽపి ద్వివిధః - ప్రవాస, శాపానన్తర జత్వభేదాత్.

వి :- సంక్షిప్తము, విస్తృతము నని విప్రలంభశృంగారము రెండు విధములు. నవీనజము, విరహజము, మానానంతరజము-అనుభేదములచే సంక్షిప్తము మూఁడువిధములు. విస్తృతవిప్రలంభమును-ప్రవాసజము, శాపానంతరజము - అనుభేదములచే రెండువిధములు.

3. సూ. 37 :- వాత్స్యాయనీయేఽస్య ద్వివిధస్య ప్రకారాన్తరేణ ద్వైవిధ్య ముక్తమ్. "బాహ్య మాభ్యన్తరం చేతి ద్వివిధం రత ముచ్యతే। తత్రాఽద్యం చుమ్బనాఽశ్లేషనఖద న్తక్షతాదికమ్. ద్వితీయం సురతం సాక్షా న్నానాకరణకల్పితమ్" ఇతి.

వి :— ఈద్వివిధశృంగారమునకును వాత్స్యాయనీయమునందు మఱియొకరీతిని ద్వైవిధ్యము చెప్పఁబడినది — బాహ్యము, నాభ్యంతరము నని రతి రెండు విధములు. చుంబనాశ్లేషనఖదంతక్షతాదిరూపమైనది బాహ్యరతి, పెక్కుసాధనములచేఁ గల్పితమగు సాక్షాత్సురతము రెండవది—అని.

3. సూ. 38. విప్రలమ్భోఽపి అయోగ, విరహ, మాన, ప్రవాస, శాపహేతుతయా పఞ్చవిధః. తత్రాయోగ ఏవ రతి ర్దశావస్థాఽనతిక్రమా దుపచీయతే.—“దృఙ్మనస్సఙ్గసఙ్కల్పా జాగరః కృశతాఽరతిః। హ్రీత్యాగోన్మాదమూర్ఛాన్తా ఇత్యనఙ్గదశా దశ”—ఇతి కేచిత్తు ప్రలాపసంజ్వరాభ్యాం ద్వాదశావస్థా ఇతి వదన్తి.

వి :— అయోగజము, విరహజము, మానజము, ప్రవాసజము, శాపజము — అని విప్రలంభ మైదువిధములు. వానిలో నయోగజవిప్రలంభము దశావస్థలచే వర్ధిలుచున్నది. నాయికానాయకుల – పరస్పరావలోకనము, ఇరువురిమనసులు కలియుట, సంకల్పము, నిద్రాఽభావము, కృశత్వము, అరతి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, అంతము (మరణయత్నము) - అనునివి పదియును ననంగదశలు. ప్రలాపసంజ్వరములతో ద్వాదశావస్థలని కొంద ఱనుచున్నారు.

3. సూ. 39. సఙ్గమస్య సదా దుర్లభత్వేన ప్రాణత్యాగోద్యోగో మరణమ్. తస్యామఙ్గళత్వా ద్రసవిఘాతత్వా త్సాక్షాదవర్ణనీయత్వమ్. ప్రకారాన్తరేణ వర్ణనఞ్చ- “సాఽశోకసూనసహకారకమల్లికాబ్జనీలోత్పలప్రభృతికామశరాగ్నిశయ్యాః. “ఆలిఙ్గితుం రఘుపతే యతతే త్వదుగ్రవిశ్లేషవహ్నిహతజీవనహీనబుద్ధ్యా - ఇత్యాదౌ ద్రష్టవ్యమ్.

వి :— సంగమము సదా దుర్లభ మగుటచేఁ బ్రాణత్యాగము నకుఁ జేయుయత్నమే మరణము, అది యమంగళ మగుటచేతను, రసవిఘాతక మగుటచేతను, దానిని వర్ణించుట యుచితము కాదు. కావున దానిం బ్రకారాంతరముగా వర్ణింపవలయును. — “ఓ రామా! – సీత నీవియోగాగ్నికిఁ దాళ లేక సహకారాశోకమల్లికాబ్జనీలోత్పలరూప మన్మథబాణములను శయ్యఁ గావించుకొని యందు శయనించి ప్రాణ

త్యాగము చేయఁ జూచుచున్నది" - అని హనుమంతుఁడు రామునకు సీతావిరహవేదనను వర్ణించెను. ఈతీరున వర్ణింపనగును గాని సాక్షాన్మరణమును గావ్యములలో వర్ణింపరాదు. అట్లు వర్ణించుట యమంగళము.

3. సూ. 40. ద్వివిధ స్యాప్యస్య శృఙ్గారస్య వ్యభిచారిభావాః శృఙ్గారతిలకే పరిగణితాః - "శఙ్కాఽసూయాభయగ్లానివ్యాధిచిన్తాస్మృతి ధృత్యౌత్సుక్యవిస్మయవేగ నిద్రోన్మాదమదవిషాదజడతావ్రీడాఽవహిత్థాచాపలమృతయః" - ఇతి. శృఙ్గారహాస్యయోః కార్యకారణభావ శ్శృఙ్గారతిలకే కథితః - "హాస్యో భవతి శృఙ్గారాత్కరుణో రౌద్రకర్మణః। అద్భుతశ్చ తథా వీరా ద్బీభత్సాచ్చ భయానకః" ఇతి.

వి :- సంభోగవిప్రలంభరూపద్వివిధశృంగారమునకును - శంక, అసూయ, గ్లాని, వ్యాధి, చింత, స్మృతి, ధృతి, ఔత్సుక్యము, విస్మయము, వేగము, నిద్ర, ఉన్మాదము, మదము, విషాదము, జడత, వ్రీడ, అవహిత్థ, చాపలము, మృతి - అనునీపందొమ్మిదియు శృంగారరసమునకు వ్యభిచారిభావములని శృంగారతిలకమునఁ గలదు. శృంగారమువలన హాస్యమును, రౌద్రమువలనఁ గరుణమును, వీరమువలన నద్భుతమును, బీభత్సమువలన భయానకమును బుట్టినట్లు వివరించుచు, శృంగారహాస్యములకుఁ గార్యకారణభావ మాగ్రంథమునందే చెప్పఁబడినది.

3. సూ. 41. హాస్యరసః - "హాసో వికాసో మనసో వికృతాకారదర్శనాత్". కుబ్జవామనవికలాఙ్గవిదూషకాదయః స్త్రియః పురుషా శ్చాఽలమ్బనవిభావాః. అసత్ప్రలాపశ్రవణాద్యపి విభావ ఏవ. ఓష్ఠవివరణ, దశనదర్శన, నాసాకపోలవికృతస్పన్దన, దృగాకుఞ్చనాదయో విభావాః, వ్యభిచారిణస్తు — "శ్రమ శ్చపలతా నిద్రా స్వప్నో గ్లాని స్తథైవచ। శఙ్కాఽసూయావహిత్థాశ్చ హాస్యే భావా భవన్త్యమీ" ఇతి. అయం స్మితహసితవిహసితోద్ధసితప్రహసితాతిహసితభేదాత్ షడ్విధః. ద్వౌ ద్వౌ భేదా వుత్తమమధ్యమాధమేషు జ్ఞేయా. తే పున రఙ్గవచననైపథ్యజన్యతయా త్రివిధా భవన్తి.

వి:- హాస్యరసము :- వికృతాకారదర్శనమువలన మనస్సునకుఁ గల్గువికాసమే హాస్యము-అని హాస్యరసలక్షణము. కుబ్జవామనవికలాంగ

విదూషకాదులగు స్త్రీ...నను బురుషులను దీని ... అసత్ప్రలాపశ్రవణమును దీనికి విభావమే. నోరు తెఱచుట, ... చుట, నాసికాకపోలములను వికృతముగఁ గదల్చుట, ... కను లాగికొనుట - మొదలగునవి దీని కుద్దీపనవిభావములు. - ... చపలత, నిద్ర, స్వప్నము, గ్లాని, శంక, అసూయ, అవహిత్థ — అనునీయెనిమిదియు హాస్యరసమునకు వ్యభిచారిభావములు. - స్మితము, హసితము, విహసితము, ఉద్ధసితము, ప్రహసితము, అతిహసితము — అనునాఱువిధములలో స్మితహసితము లుత్తమనాయకునకును, విహసితోద్ధసితములు మధ్యమనాయకునకును, అవహసితాతిహసితములు నీచనాయకునకును వర్ణింపఁదగినవి. అవి వాక్శరీరవేషజన్యములని మూఁడువిధములుగాఁ జెప్పఁబడుచున్నవి.

3. సూ. 42. కరుణరసః— ఇష్టజననాశ స్థానభ్రంశాది విభావః వక్షశ్శిరోవదనతాడన మహీలుంఠన హాహాకార దైవోపాలమ్భాద్యనుభావః సంలసాత్త్వికవాన్, నిర్వేద దైన్యాలస్యోన్మాద వ్యాధిసుప్తిమోహ భ్రమగ్లానిచిన్తా మరణచాపల విషాద జాడ్యౌత్సుక్య శఙ్కా స్మృత్యపస్మృతివ్యభిచారికః శోకః కరుణః.

వి:— కరుణరసము :— ఇష్టజనవినాశనము, స్థానభ్రంశము, మొదలగునవి దీనివిభావములు. ఱొమ్ము, శిరస్సు, నోరు—వీనిపై బాదుకొనుట, నేలమీఁదఁ బొరలుట, హాహాకారముచేయుట, దేవుని నిందించుట, మున్నగునవి దీనియనుభావములు. సాత్త్వికభావము లన్నియు దీని కుండును. —నిర్వేదము, దైన్యము, ఆలస్యము, ఉన్మాదము, వ్యాధి. సుప్తి, మోహము, భ్రమ, గ్లాని, చింత, మరణము, చాపలము, విషాదము, జాడ్యము, ఔత్సుక్యము, శంక, స్మృతి, అపస్మృతి - అనునీపదునెనిమిదియు దీనివ్యభిచారిభావములు. దీనికి శోకము స్థాయిభావము. ఈలక్షణములతోఁ గూడినది కరుణరసము.

3. సూ. 43. రౌద్రరసః- అనుహృద్దర్శనా ద్యాలమ్బనః. దర్పబాధక్షేపావధూననవఞ్చనవాక్పారుష్యాది విభావః. మాత్సర్యోద్దీపనస్వేదనిర్భర్త్సన, భ్రుకుటీకపోల

స్ఫురణముఖరాగభుజోద్యమనబాహ్వాస్ఫోటనాద్యనుభావః. స్తమ్భప్రళయాతిరిక్తసర్వసాత్త్వికః క్రోధస్థాయికో రౌద్రః. వ్యభిచారిణస్తు-"హర్షానూయే తథా గర్వ ఉత్సాహో మద ఏవచ। చాపల్య ముగ్రతాచైవ రౌద్రే భావా భవన్త్యమీ".

వి:- రౌద్రరసము :- శత్రుదర్శనాదులు దీని కాలంబనములు - శత్రుదర్శనము, వారియధిక్షేపము, తిరస్కారము, వంచనము, వాక్పారుష్యము మున్నగునవి దీని కుద్దీపనవిభావములు. మాత్సర్యము పెరుగుట, చెమటపట్టుట, బెదరించుట, బొమముడి వెట్టుట, కపోలములను గదల్చుట, ముఖమెఱ్ఱవడుట, చేతు లెత్తుట, భుజములను జఱచుట మున్నగునవి యనుభావములు. స్తంభప్రళయములుతప్ప మిగిలిన సర్వసాత్త్విక భావములును దీని కుండును. క్రోధము దీనికి స్థాయిభావము. - హర్షము, అసూయ, గర్వము, ఉత్సాహము, మదము, చాపల్యము, ఉగ్రత - అనునవి దీనివ్యభిచారిభావములు.

3. సూ. 44. వీరరసః :- "ఉత్సాహ స్స్యా ద్వీరరసః కార్యే లోకోత్తరే మహాన్." అలౌకసాధారణేషు దుర్జయశత్రుజయాదిషు సాతిశయో యః ప్రయత్న స్స ఉత్సాహః. స ఏవ విభావాదిభి రభివ్యక్తో వీరరసో భవతి. అస్య లోకోత్తమప్రకృతికో రామాదిపరమపురుష ఆలమ్బనవిభావః. శత్రుదర్శన భేరీపటహాది శ్రవణాదయ ఉద్దీపన విభావాః అసమ్మోహాధ్యవసాయా నయవినయబలపరాక్రమ ప్రతాపప్రభావస్థైర్య ధైర్య శౌర్యౌదార్య వైశారద్యాక్షేపవాక్యాదయ అనుభావాః. వ్యభిచారిణస్తు - "అమర్షః ప్రతిబోధశ్చ వితర్కో ఽథ మతి ర్ధృతిః। క్రోధోఽసూయాచ సమ్మోహ ఆవేగ శ్చోపమర్షణమ్. గర్వో మద స్తథోగ్రత్వం వీరే భావా భవన్త్యమీ" - అయం త్రివిధః - యుద్ధవీరో దయావీరో దానవీరశ్చేతి.

వి :- వీరరసము :- లోకోత్తర మగుకార్యమునఁ గలుగుత్సాహమే వీరరసము. లోకోత్తరము లైనదుర్జయశత్రు జయాదుల యందుఁ జేయు గొప్పయత్నమే యుత్సాహము. అది విభావాదులచే నభివ్యక్తమై వీరరస మగుచున్నది. కావున నుత్సాహము వీరరసము నకు స్థాయీభావము. దీని కుత్తమప్రకృతు లగురామాదిపరమపురుషు లాలంబనవిభావము. శత్రుదర్శనము, [illegible]

నవి యుద్దీపనవిభావములు – తిరుగులేని కార్యనిశ్చయము, నయవినయములు, బలపరాక్రమములు, ప్రతాపప్రభావములు, స్థైర్యధైర్యములు, శౌర్యౌదార్య వైశారద్యములు, నాక్షేపవాక్యములు – దీని కనుభావములు – అమర్షము, ప్రతిబోధము, వితర్కము, మతి, ధృతి, క్రోధము, అసూయ, సమ్మోహము, ఆవేగము, ఉపమర్షణము, గర్వము, మదము, ఉగ్రత్వము – అనునివి దీని వ్యభిచారిభావములు. ఈ వీరరసము – యుద్ధవీరము, దానవీరము, దయావీరము – అని మూఁడువిధములై విలసిల్లుచున్నది.

3. సూ. 45. భయానకరసః:– "రౌద్రసన్దర్శనోద్భూత మనర్థాఽఽశఙ్కనం భయమ్। తదేవ చ రసీభావం ప్రపన్నం స్యాద్భయానకః" – శస్త్రాస్త్రక్రూరదృష్టి తర్జనాది భీషణాకార ప్రతిభటవ్యాఘ్రాద్యుద్దీపనవిభావకం, కమ్పకాతరాక్షివిలోకనా ఽనశనా ద్యనుభావకం భయమేవ భయానకరసః. వ్యభిచారిణస్తు – "సన్త్రాసో మరణం దైన్యం గ్లానిశ్చైవ భయానకే" –

వి:– భయానకరసము :– రౌద్రసందర్శనమువలన ననర్థమును శంకించుటయే భయము. అదే రసీభావము నొంది భయానకరస మగుచున్నది. – శస్త్రములు, అస్త్రములు, క్రూరదృష్టి, తర్జనాదికము, భీషణాకారము, ప్రతిభటులు, వ్యాఘ్రాదికము—దీని కుద్దీపనవిభావములు. వణఁకుట, బెదరు చూపు, ఆహారము రుచింపకుండుట మున్నగునవి యనుభావములు. – సంత్రాసము, మరణము, దైన్యము, గ్లాని – అనునివి దీనికి వ్యభిచారిభావములు.

3. సూ. 46. బీభత్సరసః :– "సా జుగుప్సైవ బీభత్సో యా మాంసాఽసాది దృష్టిజా". అస్యా రక్తమాంసాది రాలమ్బనవిభావః. నాసాపిధాన వైవర్ణ్య వైముఖ్యాది రనుభావః. "అపస్మారో విషాదశ్చ భయం గ్లానిః మతి ర్మదః మరణం చేతి విజ్ఞేయా భావా బీభత్ససమ్భవాః"– స ద్వివిధః– క్షోభీ చోద్వేగీ చేతి. రక్తమాంసాదిభి శ్చేత్ క్షోభీ, పూయక్రిమిలాలాదిభిశ్చే దుద్వేగీ.

వి :— బీభత్సరసము :— రక్తమాంసాదులను జూచుటవలనఁ గల్గిన యేవయే బీభత్సము. రక్తమాంసాదులు దీని కాలంబనములు. ముక్కును మూసికొనుట, వెలువరించుకొనుట, విముఖత్వము మున్నగునవి యనుభావములు.— అపస్మారము, విషాదము, భయము, రోషము, మతి, మదము, మరణము—అనునివి దీనివ్యభిచారిభావములు. క్షోభి, యుద్వేగి యని బీభత్సము రెండు విధములు — రక్తమాంసాదులవలన క్షోభియు, చీము, పురుగులు, చొంగ యనువానివలన నుద్వేగియు నభివ్యక్తములు.

3. సూ. 47. అద్భుతరసః:- "విచిత్రార్థేక్షణోద్భూతో హృద్వికాసోఽద్భుతో రసః". అస్య విచిత్రవస్తునిరీక్షణాది ర్విభావః. కమ్పపిర్నిమేషతాది రనుభావః. "ఆవేగో జడతా మోహ స్తర్పణం విస్మయః స్మృతిః। ఇతి భావా నిబధ్యా రస్మై రద్భుతే రసే".

వి :— అద్భుతరసము :— చిత్రవస్తుసందర్శనమువలనఁ గల్గిన హృదయవికాసమే యద్భుతరసము. విచిత్రవస్తుదర్శనాదికము దీనికి విభావము — కంపము, రెప్పవేయకుండుట — మున్నగునవి దీని యనుభావములు,— ఆవేగము, జడత, మోహము, తర్పణము, విస్మయము, స్మృతి — అనునవి దీనివ్యభిచారిభావములు.

3. సూ. 48. శాన్తరసః :- "దుఃఖద్వేషాద్యసమ్బన్ధో భావ శ్శాన్తరసో మతః. అస్యచ భవభఙ్గురతాదయో విభావాః - పుణ్యాఽఽశ్రమాఽఽవాస పుణ్యదృష్టి నిర్నిమేషాదయోఽనుభావాః. స్తంభాదయశ్చ సకలసాత్త్వికాః. జుగుప్సా ధైర్య మతి స్మృతి శమ హర్ష విబోధాదయో వ్యభిచారిణః.

వి:— శాంతరసము:— దుఃఖద్వేషాదులతో సంబంధము లేకుండు భావమే శాంతరసము, దీనికి సంసారముయొక్క యశాశ్వతత్వము మున్నగునవి విభావములు. — పుణ్యాశ్రమావాసము, పుణ్యదృష్టి, నిర్నిమేషత మున్నగునవి యనుభావములు. స్తంభాదిసాత్త్వికభావము లన్నియు దీనికిఁ గలవు. — జుగుప్స, ధైర్యము, మతి, స్మృతి, శ్రమ, హర్షము, విబోధము—మున్నగునవి దీనికి వ్యభిచారిభావములు.

3. సూ. 49. రసాధిదేవతావర్ణాదయః :- శృఙ్గార ఉత్పలాభ స్స్యా ద్విష్ణు రస్యాధిదేవతా। తస్య జన్మతు సామాఖ్య వేదవంశే ప్రకీర్తితమ్. హాస్య స్సితామ్బుజాభ స్స్యా - త్సామవేద స్తదన్వయః। దేవతా తస్యతు ప్రోక్తా భగవా న్కుఞ్జరాననః. కాషాయకాన్తిః కరుణ స్స్యా దథర్వకులే భవః। తస్యాధిదేవతా ప్రోక్తా భగవాన్యమునాగ్రజః. రౌద్రో రక్తామ్బుజాభ స్స్యా న్నీలగ్రీవోఽధదేవతా। అథర్వ నిగమే తస్య సమ్భవః పరికీర్తితః. భవే ద్వీరరసో రక్తః ప్రథమాగమసమ్భవః। తస్యాధి దేవతా ప్రోక్తా పౌలోమీప్రాణవల్లభః. భయానక స్తు ధూమ్రాభో యజుర్వేదసముద్భవః। తస్యాఽధిదేవతా ప్రోక్తా మహాకాలో జగత్పతిః. బీభత్సః కాలవర్ణ స్స్యా ద్యజుర్వేదసముద్భవః। తస్యాధిదేవతా ప్రోక్తా భగవా న్నన్దికేశ్వరః. రసోఽద్భుత స్స్యా దరుణ స్తస్య జన్మాదిమాగమే। తస్యాధిదేవతా ప్రోక్తా భగవాన్ కమలాసనః. శాన్త స్తు చన్ద్రసఙ్కాశః పరబ్రహ్మాధిదేవతా। సహి సర్వోత్తర స్తస్య న మైత్రీ న విరోధితా".

వి:- రసములు. వాని దేవతలు. వాని వర్ణములు. వాని జన్మస్థలము లగు వేదములు.

| | | | |
|---|---|---|---|
| 1. శృంగారము | విష్ణువు | కలువపూవు | సామవేదము |
| 2. హాస్యము | గణపతి | తెల్లతామర | సామవేదము |
| 3. కరుణము | యముఁడు | కావిరంగు | అథర్వవేదము |
| 4. రౌద్రము | రుద్రుఁడు | ఎఱ్ఱతామర | అథర్వవేదము |
| 5. వీరము | దేవేంద్రుఁడు | ఎఱుపు | ఋగ్వేదము |
| 6. భయానకము | మహాకాలుఁడు | పొగరంగు | యజుర్వేదము |
| 7. బీభత్సము | నందికేశ్వరుఁడు | నలుపు | యజుర్వేదము |
| 8. అద్భుతము | బ్రహ్మ | ఎఱుపు | ఋగ్వేదము |
| 9. శాంతము | పరబ్రహ్మము | చంద్రకాంతి | ఋగ్వేదము |

శాంతరసము సర్వరసోత్తరము. దీనికి మైత్రిగాని విరోధముగాని దేని తోడను లేదు.

3. సూ. 50. రససాఙ్కర్యమ్ :- "రస స్సర్వోఽపి సమ్పూర్ణ స్తిరోధత్తే రసాన్తరమ్". ఇతి భారతీయోక్తరీత్యా యద్య ప్యేక ఏవ రస శ్చర్వ్యతే; తథాపిరస సఙ్కరో మహాకవిభి రఙ్గీకృతఏవ. ముఖ్యేఽంశేఽప్యాస్వాదాతిశయవశా త్క్వాచిత్క్వాచి

ద్భావశాన్తిర్భావోదయ భావశబలతా అప్యఙ్గిత్వం భజన్తే. తదుక్తం కావ్యప్రకాశే "ముఖ్యేఽంశేఽపి తేఽఙ్గిత్వం ప్రాప్నువన్తి కదాచన"- తే భావశాన్త్యాదయః. అఙ్గిత్వం చ రాజానుగతవివాహప్రవృత్తభృత్యవదితి ప్రతికూల విభావాది గ్రహాదయో రసదోషాస్సన్తి. తే క్వచిత్తద్గుణభావాశ్చ తత్ప్రతిపాదకగ్రన్థాదేవావగన్తవ్యాః.

వి :— రససాంకర్యము:- "బాగుగఁ బరిపుష్టమైనయొకరసము బాగుగఁ బరిపోషింపఁబడనిరసాంతరమును గప్పివేయు" నని భరతముని వచించిన ట్లొక్కరసమే యాస్వాదింపఁబడుచున్నది. అయినను మహాకవులు రససంకరము నంగీకరించియున్నారు. ముఖ్యరసమునందును నొక్కొక్కయెడ నాస్వాదాతిశయమువలన – భావశాంతి, భావోదయము, భావశబలత యనునవియు నంగిత్వము నొందుచున్నవి. "ముఖ్యరసమునందును భావశాంత్యాదు లంగిత్వము నొకప్పు డొందుచున్నవి" అని కావ్యప్రకాశము చెప్పుచున్నది. అట్టివాని కంగిత్వము రాజుగారు వెళ్ళినభృత్యవివాహమువలె నుండును, అనఁగా భృత్యుని వివాహమున భృత్యునికిఁ బ్రాధాన్య మున్నను వివాహశోభ రాజుగారు వెళ్ళుటచే గల్గినదిగావున వాస్తవముగా వివాహశోభకు రాజే ప్రధానహేతువు. అట్లే భావశాంత్యాదులప్రాధాన్యము రసమునుబట్టి కల్గినదే యని భావము. రసప్రతికూలము లగువిభావాదిరసదోషములును గొన్నియెడల గుణము లగుట మున్నగువిషయములను దద్వివరణగ్రంథముల వలనఁ దెలియనగును.

3. సూ. 51. కావ్యజీవితమ్ :- ప్రకృత మనుసరామః. యద్యపి వస్త్వలఙ్కారరసాత్మనా త్రివిధస్యాపి వ్యంగ్యస్య కావ్యజీవితత్వ ప్రతిపాదనాత్తత్త్రితయప్రధానం కావ్య ముత్తమమ్. తథాఽపి రసజీవితస్య ముఖ్యత్వాత్తత్ప్రధాన మేవోత్తమం కావ్య మత్యన్తాదరణీయమితి వాగనుశాసనానా మాశయః. అత ఏవానుపద మేవ వక్ష్యత్యాచార్యః. "సాధ్యో హి రసో యథాతథం కవిభిః" "సన్తో రసప్రలుబ్ధధియః" ఇతి. స్వాఽత్మమాత్రవిశ్రాన్తత్వేన ప్రాధాన్యాద్రసస్యైవ ముఖ్యం జీవితత్వమ్. వస్త్వలఙ్కారవ్యఙ్గ్యయోస్తు సర్వథా రసపర్యవసానత్వా

ప్రాధాన్యాత్తదభావే వాచ్యాదత్యుత్కృష్టత్వసామ్యే నౌపచారికో జీవితత్వవ్యవహార ఇతి న కశ్చిదపి విరోధ ఇతి ధ్వన్యాలోచనాద్యలఙ్కారరహస్యమ్. తత్రాయం విశేషః. సామాన్యతః కావ్యస్య వాగర్థౌ మూర్తిః, జీవితం వ్యఙ్గ్యమ్. తదుక్త మభియుక్తైః "శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ జీవితం వ్యఙ్గ్యవైభవమ్" ఇతి.

వి:- కావ్యజీవితము:- వస్త్వలంకారరసాత్మక త్రివిధవ్యంగ్యము నకును గావ్యజీవితత్వము చెప్పఁబడుటచే నామూఁడును బ్రధానముగాఁ గలది యుత్తమకావ్యమే యైనను నందు రసజీవితత్వము ముఖ్యముగాన రసప్రధాన మైనదే యుత్తమకావ్యము. అదే యాదరింపఁదగినదని వాగనుశాసనులయాశయము. కావుననే "కవులు యథేచ్ఛముగ రసమును సాధింప నగు" ననియు, "రసప్రలోభబుద్ధి కలవారు సత్పురుషు"లనియు వారు వెంటనే చెప్పుచున్నారు. రసధ్వని స్వతంత్రము గాన నదియే ముఖ్యమగు కావ్యజీవితము. వస్త్వలంకారధ్వనులు రసపోషణము చేయునపుడే వానికిఁ బ్రాధాన్యము. లేనపుడు వాని కించుకంతి వాచ్యార్థాతిశయత్వమే యుండును. దానింబట్టియే వానికిఁ గావ్యజీవితత్వము గౌణ మనుటచే గ్రంథవిరోధము లేదని ధ్వన్యాలోకలోచనగ్రంథములతత్త్వము. 'కావ్యమునకు వాగర్థములు శరీరము; వ్యంగ్యము జీవిత' మని పరినిష్ఠితార్థము. కాన 'శబ్దార్థములు కావ్యమూర్తి; వ్యంగ్యము దాని జీవిత' మని పెద్ద లనుచున్నారు.

3. సూ. 52 :- కావ్యభేదాః- తచ్చ త్రివిధమ్. వ్యఙ్గ్యప్రధాన ముత్తమమ్; గుణీభూతవ్యఙ్గ్యం మధ్యమమ్; అస్ఫుటవ్యఙ్గ్య మధమం చేతి. అధమకావ్యే శబ్దార్థాలఙ్కారయో రేవ కవివివక్షావిషయత్వా ద్విద్యమానోఽపి రసో దివాచన్ద్రప్రకాశవ న్నప్రతీయతే. సర్వథా నీరసత్వే నిర్జీవత్వ మేవ స్యాదితి నిర్జీవశరీరవ దత్యన్తహేయత్వం స్యాత్. 'సగుణౌ శబ్దార్థౌ' ఇతి సామాన్యలక్షణ స్యావ్యాప్తిశ్చ స్యాత్. తదుక్తం కావ్యాలోచనే- "రసభావాదివిషయవివక్షావిరహే సతి। అలఙ్కారనిబన్ధో యస్స చిత్రవిషయో మతః" ఇతి. అలఙ్కారసుధానిధానాదిష్వపి "అనుల్బణత్వా ద్వ్యఙ్గ్యస్యా మవ్యఙ్గ్యం చిత్ర మీరితమ్। వ్యఙ్గ్య స్యాత్యన్తవిచ్ఛేదః కావ్యే కుత్రాపి నేష్యతే" ఇతి. "అవ్యఙ్గ్య మవరం స్మృతమ్" ఇతి కావ్యప్రకా

శేఽపి. 'అనుదరా కన్యా' ఇతివన్నఞ ఈషదర్థత్వే నాస్ఫుటవ్యఙ్గ్యత్వస్య వివక్షితత్వా న్న సిద్ధాన్తవ్యాకోప ఇతి వ్యాఖ్యాతృభి రుక్తమ్. ఏవం చాస్ఫుటత్వేన వ్యఙ్గ్యస్యోపస్కృతత్వం ససమ్బన్ధవతీతి రత్నాకరగ్రన్థోఽప్యవిరుద్ధ ఇతి కృతబుద్ధయో విదాం కుర్వన్తు. అతఏ వాస్ఫుటవ్యఙ్గ్య మధమ మితి తేనాపి లక్షణ ముక్తమ్.

వి:- కావ్యభేదములు:- కావ్యము మూఁడు విధములు. అందు వ్యంగ్యప్రధాన మగుకావ్య ముత్తమము. వ్యంగ్య మప్రధాన మగు నది మధ్యమము. వ్యంగ్యము స్ఫుటముగా లేని దధమము. అధమ కావ్యములయందు శబ్దార్థాలంకారములకే కవి వివక్ష. అందు రస మున్నను బగటిపూట నున్నచంద్రకాంతివలె నగపడదు. సర్వథా నీరసమైనచో జీవరహిత మగును. నిర్జీవశరీరమువలె నాకావ్యము మిగుల హేయ మగును. 'గుణసహిత మగుశబ్దార్థములు కావ్య' మనుసామాన్య లక్షణమున కవ్యాప్తియుఁ గల్గును. 'అలంకారనిబంధనము రసభావ వివక్ష లేనిచోఁ జిత్రవిషయమే యగు' నని కావ్యాలోచనము చెప్పు చున్నది. 'వ్యంగ్య మస్ఫుటముగ నున్నచోఁ జిత్రకావ్య మవ్యంగ్య మనిపించుకొనుచున్నది. 'వ్యంగ్యము లేకుండుట కావ్యములలో నెచ్చట నుండ'దని యలంకారసుధానిధానాదులయందుఁ జెప్పఁబడినది. 'అవ్యంగ్య మధమ' మని కావ్యప్రకాశమునఁ జెప్పఁబడినయది. 'అను దరా కన్యా' అనుచోటి నఞునకుఁ -గొంచెము-అని యర్థము. అట్లే యస్ఫుటవ్యంగ్య మనఁగా నల్పవ్యంగ్య మని యర్థము. కాన సిద్ధాంత విరోధము లేదని వ్యాఖ్యాత లనిరి. 'వ్యంగ్య మస్ఫుట మగుటవలన నుపస్కారకము కా' దనెడిరత్నాకరగ్రంథమును విరుద్ధము కాదని యెఱుంగ నగును.' 'అస్ఫుటవ్యంగ్య మధమ' మని రత్నాకరమును జెప్పినది.

3. సూ. 53 :- మహాప్రబన్ధాదయః:- తత్కావ్యఞ్చ ద్వివిధమ్ - మహాప్రబన్ధ చాటు భేదాత్. అష్టాదశవర్ణనాత్మకం, మతభేదేన ద్వావింశతివర్ణనాత్మకం వా కావ్యం మహాప్రబన్ధః. తేషాం మధ్యే కేషాఞ్చి న్న్యూనత్వేఽపి న మహాకావ్యత్వక్షతి రిత్యాలఙ్కారికాః. చాటునోఽపి ద్వైవిధ్యమ్- అసఙ్ఖ్యాక ససఙ్ఖ్యాక భేదాత్.

తత్రోదాహరణాదీనాం ససఙ్ఖ్యాకత్వమ్. గద్య, రగడ, దండక ద్విపదాదీనా మసఙ్ఖ్యాకత్వమ్. పున స్త్రివిధమ్. (చతుర్విధమ్ కావ్యం-పాదబ ద్ధాపాదబ ద్ధోభయాత్మక మిశ్రభేదాత్. తత్ర పాదబద్ధం కుమారసమ్భవాది; అపాదబద్ధం వాసవదత్తాది; ఉభయాత్మకం చమ్పూరామాయణాది; మిశ్రం శాకు న్తలాది.) ఏషాం వి స్తరేణ విచార స్తు దశరూపక ప్రతాపరుద్రీయాదౌ ద్రష్టవ్యః.

వి:- మహాప్రబంధాదులు:- మహాప్రబంధము, చాటుప్రు-అను భేదముచేఁ గావ్యము రెండు విధములు. పదునెనిమిది సర్గసముులతోఁ గూడినది మహాప్రబంధము. ఇరువదిరెండు సర్గసములతోఁ గూడినది మహాప్రబంధమని మఱికొంద ఱనుచున్నారు. వానికంటెఁ గొన్ని తక్కు వైనను మహాకావ్యత్వమునకు హానిలేదని యాలంకారికు లనుచున్నారు. అసంఖ్యాకము, ససంఖ్యాకము నని చాటుప్రబంధమును రెండు విధములు. ఉదాహరణాదులు ససంఖ్యాకములు. గద్యము, దండకము, రగడ, ద్విపద మొన్నగునవి యసంఖ్యాకములు. కావ్యము పాదబద్ధము, అపాదబద్ధము, ఉభయాత్మకము, మిశ్రము-అని నాల్గువిధములు. కుమారసంభవాదికము పాదబద్ధ మగు పద్యకావ్యము; వాసవదత్తాదికము గద్యకావ్యము; చంపూరామాయణాదిక ముభయాత్మకము; శాకుంతలాదికము మిశ్రకావ్యము. వీనిసవి స్తరవివరణమును దశరూపక ప్రతాపరుద్రీయాదులవలనఁ దెలియనగును.

3. సూ 54. :- కావ్యోత్ప త్తిహేతుః-ఏతాదృశ కావ్యనిర్మాణే శక్త్యాదీనాం త్రయాణాం మిళిత్వా హేతుత్వ ము క్త మాలఙ్కారికైః. ఉ క్తంహి కావ్యప్రకాశే- శ క్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్। కావ్యజ్ఞశిక్షయాఽభ్యాస ఇతి హేతు స్తదుద్భవే” ఇతి. హేతురి త్యేకవచనం మిళిత్వా హేతుత్వకథనార్థ మితి వ్యాఖ్యాతారః.

వి:- కావ్యోత్ప త్తిహేతువు:- ఇట్టికావ్యనిర్మాణమున కభిధా లక్షణావ్యంజనాశ క్తులు మూఁడును హేతువులని యాలంకారికులు చెప్పుచున్నారు. “శ క్తియుఁ, గావ్యశాస్త్రాదికమును లోకమును జూచు

టచేఁ గల్గినవిపుణతయుఁ, గావ్యవిజ్ఞాతలశిక్షాఽభ్యాసము ననునివి కావ్యోత్పత్తిహేతువు" లని కావ్యప్రకాశము చెప్పినది. వీనియన్నింటి మేళనమునకే హేతుత్వమని 'హేతుః' అను నేకవచనముచేఁ దెలియు చున్నదని వ్యాఖ్యాత లనుచున్నారు.

3. సూ. 55:- కావ్యంచ సమ్పూర్ణలక్షణమపి లోకోత్తరపురుషగుణవర్ణనపర మేవ శ్రేయస్సాధనత్వే నాభిమతమ్. ఆదికావ్యస్య శ్రీరామాయణస్య తథావిధ త్వాత్. కింబహునా, శాస్త్రమాత్రస్యాపి తథావిధత్వ మేవ. తథాహి-అఙ్కు రాదికం సకర్తృకం కార్యత్వా ద్ఘటవదితి ప్రమాణై ర్న్యాయవైశేషికయో రీశ్వర ప్రతిష్ఠాపకత్వమ్. ఆత్మనిష్ఠధర్మప్రతిపాదకత్వా ద్వేదస్యాఽపి తథావిధత్వ మేవ. అతఏవోక్తం జైమినినా-'అథాతో ధర్మజిజ్ఞాసా' ఇతి. ధర్మో నామ శ్రేయస్సాధన భూతం యాగాపూర్వ మాత్మనిష్ఠమ్. "శ్రేయస్సాధనతా యత్ర క్రత్వాదౌ విదితో భవేత్। తస్యైవ ధర్మతా జ్ఞేయా ధర్మ స్తత్సాధనం యతః".-అపూర్వఞ్చ యాగాదే రవాన్తరవ్యాపారః. శక్తిర్వేతి భాట్టాః. తన్మతాశ్రయణే తు ధర్మస్యాపూర్వ ద్వారా పురుషాశ్రితత్వం చౌపచారికమ్. ప్రాభాకరాస్తు యాగవ్యతిరిక్తం లిఙ్గాది వాచ్య మపూర్వమేవ ధర్మ ఇతి భేణుః. తేషాం మతే పున స్తస్య గుణత్వ మాత్మ నిష్ఠత్వఞ్చ సంప్రతిపన్న మేవేతి గుణ మాత్మనిష్ఠధర్మప్రతిపాదకత్వం వేదస్య.

వి :- సంపూర్ణలక్షణముతోఁ గూడినను లోకోత్తరపురుష గుణవర్ణనపర మైనపుడే కావ్యము శ్రేయస్సాధన మగుచున్నది. ఆది కావ్య మగు శ్రీరామాయణ మట్టిదేగదా! వేయేల శాస్త్ర మాత్ర మునకే యట్టిలక్షణము గలదు. కార్యకారణసంబంధమునుబట్టి - అంకురాదికమును ఘటమువలె సకర్తృకమే - అనునట్టి ప్రమాణము లను జెప్పి న్యాయవైశేషికశాస్త్రము లీశ్వరప్రతిష్ఠాపకము లగుచు న్నవి. ఆత్మనిష్ఠధర్మమును బ్రతిష్ఠాపించుటచేత వేదము నట్టిదే. కావు ననే "అథాతో ధర్మజిజ్ఞాసా" అని జైమినిముని వచించెను. శ్రేయ స్సాధనభూత మైనయాత్మనిష్ఠ యాగాపూర్వమే ధర్మము. "క్రత్వాది కమునం దెచట శ్రేయస్సాధనత్వము విదిత మగునో దానినే ధర్మ"మని చెప్పవలయును. ధర్మము శ్రేయస్సాధన మగుచున్నదిగదా! నశించు

యాగాదుల స్వర్గాదిఫలజనక మగునపూర్వవ్యాపారమే యపూర్వమని చెప్పఁబడుచున్నది. శక్తి యని దానినే భాట్టు లనుచున్నారు. ఆమతము చొప్పున నం దపూర్వద్వారమున ధర్మమునకుఁ బురుషాశ్రితత్వ మౌపచారికము. యాగాదివ్యతిరిక్తము లిఙాదివాచ్యము నగునపూర్వమే ధర్మమని ప్రాభాకరు లనుచున్నారు. వారిమతమునం దైనచో ధర్మమునకు గుణత్వము, నాత్మనిష్ఠత్వమును సరిపడుచునే యున్న వని వేదమున కాత్మనిష్ఠధర్మప్రతిపాదకత్వము సమంజసమే యగుచున్నది.

3 సూ 56. :- కేచిచ్చ "చత్వారిశృఙ్గా త్రయో అస్య పాదాః" ఇతిమన్త్రస్య సప్తహస్తశ్చతుశ్శృఙ్గ స్సప్తజిహ్వో ద్విశీర్షకః- ఇత్యాద్యుపబృంహణబలేన కైశ్చిదగ్నిపరత్వ ముక్తమ్. తథాఽప్యనేన ప్రణవప్రతిపాద్యత్వం బ్రహ్మణో విధీయతే. అస్య వృషభరూపస్య ప్రణవ స్యాకారోకారమకారనాదాత్మకాని చత్వారి శృఙ్గాణి. విశ్వతైజసప్రాజ్ఞరూపైః విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతాఖ్యా వా త్రయః పాదాః. చిదచిద్రూపే ద్వే శక్తీ మస్తకస్థానీయే. భూరాదిలోకా స్సప్త హస్తస్థానీయాః. త్రిధా బద్ధః. అకారోకారమకారేషు విశ్వతైజసప్రాజ్ఞరూపైః విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతిరూపైర్వా త్రిభిః ప్రకారై ర్బద్ధః స్సంశబ్దితః. ఋషభః ప్రణవః. ప్రణవస్య వృషభత్వం-యశ్ఛన్దసా మృషభో విశ్వరూపః - ఇతి శ్రుతిప్రసిద్ధమ్. మహా న్తేజో-రూపం బ్రహ్మ, గౌరవీ త్యతిశయేన ప్రతిపాదయతీతి శబ్దార్థభగవత్పాదైః ప్రతిపాదితత్వాత్. తథాచ పాతఞ్జలం సూత్రం—తస్య వాచకః ప్రణవః ఇతి.

వి :— చత్వారిశృఙ్గా - అనుమంత్రమునకు- సప్తహస్తశ్చతుశ్శృఙ్గ - అనునుపబృంహణముచేఁ గొందఱు దీని కగ్నిపరముగా నర్థము చెప్పిరి. కాని పరబ్రహ్మము ప్రణవప్రతిపాద్య మనువిషయము వ్యక్తమగుచున్నది. ఈ ఋషభరూపప్రణవమునకు అకారోకారమకారనాదాత్మకము లగునాల్గు శృంగములు. విశ్వతైజసప్రాజ్ఞరూపములుగాని, విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతము లనునవిగాని మూఁడు పాదములు. చిదచిద్రూపశక్తిద్వయము మస్తకస్థానీయము. భూలోక భువర్లోక సువర్లోక మహర్లోక జనలోక తపోలోక సత్యలోకము లనునీయేడును హస్తస్థానీయములు. అకారోకారమకారములయందు విశ్వతైజసప్రాజ్ఞరూపము

లచేతఁగాని, విరాడ్ఢిరణ్యగర్భావ్యాకృతరూపములతోఁగాని మూఁడువిధములుగ సంశబ్దిత మైనది. ఇందు ఋషభము ప్రణవమే. ప్రణవమే ఋషభ మనువిషయము-యశ్ఛన్దసాం-అనుమంత్రము దెల్పుచున్నది. ప్రణవము తేజోరూపపరబ్రహ్మము నతిశయముతోఁ జెప్పుచున్నది - అని శంకరభగవత్పాదులవ్యాఖ్య. ఈయర్థము నే-తస్య వాచకః ప్రణవ- అని పాతంజలయోగసూత్రము చెప్పుచున్నది.

3. సూ. 57 :- తత్రాకారాది ప్రణవమాత్రాణాం వేదరూపత్వం ప్రపఞ్చసారే ప్రతిపాదితమ్ - 'అగ్నిమీళే పురోహితమ్' - ఇత్యాద్యవేదాఽద్యవర్ణస్య 'యోని ష్సముద్రో బన్ధుః' - ఇతి మధ్యమవేద మధ్యమవర్ణస్య - 'అసమానా న్తరమ్' - ఇత్యన్తిమవేదా న్తిమవర్ణస్య చ సమాహృతి రోమితి పద మితి. తథా చ వేదస్య బ్రహ్మప్రతిపాదకత్వం సిద్ధమ్.

వి :- అకారోకారమకారరూప ప్రణవమాత్రలకు వేదరూపతను ప్రపంచసారము నుడువుచున్నది. - "అగ్ని మీళే" - "యోని స్సముద్ర" - "అసమానా న్తరమ్" - అని ప్రథమ ద్వితీయ తృతీయము లగు ఋగ్యజుస్సామవేదము న్త్రిముల ప్రథమమధ్యమా న్తిమ వర్ణములను వరుసగాఁ గలిపిన 'ఓమ్' అను ప్రణవరూప మేర్పడుచున్నది. కాన వేదము బ్రహ్మప్రతిపాదకము.

3. సూ. 58 :- ప్రణవ స్యాన్యత్ర సోఽహ మర్థప్రతిపాదన ముక్తమ్. 'సకారఞ్చ హకారఞ్చ లోపయిత్వా ప్రయోజయేత్। సన్ధిఞ్చ పూర్వరూపాఖ్య స్తతోఽసౌ ప్రణవో మతః' ఇత్యుక్తేః.

వి:- ప్రణవమున కొకయెడ-సోఽహమ్-అనునర్థము చెప్పఁబడినది. అందున్న సకారహకారములను దీసివేసి పూర్వరూపసంధి చేసినచో ఓమ్ అని యగుచున్నది గదా!

3. సూ. 59. :- పఞ్చపాద్యాన్తు - అవతే ష్టిలోపశ్చ ఇతి. 'మన్' ప్రత్యయస్య టిలోపే కృతే, జ్వరత్వరే త్యూఠిచ కృతే, తయో ర్దీర్ఘే కృతే, గుణేచ 'ఓమి త్యవ్యయం నిష్పన్న మిత్యుక్తమ్.

వి:- ఉణాదులలోని-అవతే ష్టిలోపశ్చ-అనుసూత్రముచే వచ్చిన మన్ ప్రత్యయమునకు టిలోపమును జ్వరత్వర అను పాణినిసూత్రముచే అకారవకారములకు ఊఠ్-ను జేసి (ఊ+మ్) గుణమును జేయఁగా ఓమ్ అనునవ్యయరూపము సిద్ధించునని పంచపాదికయందుఁ గలదు.

3. సూ. 60 :- నిరుక్తే త్వయం యజ్ఞపరతయా వ్యాఖ్యాతమ్. చత్వారో వేదాః శృఙ్గాణి. సవనత్రయం పాదాః. ప్రాయణీయోదయనీయే శీర్షే. సప్త ఛన్దాంసి హస్తాః. మంత్రబ్రాహ్మణకల్పైః త్రిప్రకారేణ బద్ధః. వర్షణా ద్వృషభః. రోరవీతి స్వసాధనభూతే వేదఘోషేణ మహో మహాన్ దేవ ఇతి.

వి:- నిరుక్తమునం దిది యజ్ఞపరముగ వ్యాఖ్యానింపఁ బడినది. నాల్గువేదములు శృంగములు. ప్రాయణీయోదయనీయములు రెండును శీర్షములు. ఛందస్సప్తకము హస్తములు. మంత్రబ్రాహ్మణకల్పము లనెడి త్రిప్రకారములచే బద్ధము. వృష్టిని గల్గించునది గాన వృషభము. తనకు సాధనమైన వేదఘోషతో గొప్పగా నొప్పుచున్నది యజ్ఞము.

3. సూ. 61:- ఏతత్పక్షేఽపి యజ్ఞప్రతిపాదకస్యాపి వేదస్య న బ్రహ్మపరత్వం విహన్యతే. వృష త్రిపా చ్చతుః శృఙ్గ స్సప్తహస్తో ద్విమస్తకః। సదాఽరామ త్రిధా బద్ధో మహాదేవ స్త్వమేవ హి-ఇత్యా ద్యుపబృంహణేన పరమేశ్వరాభిన్నత్వ ప్రతిపాదనాత్.

వి:- ఈపక్షమునను యజ్ఞప్రతిపాదకమైన వేదమునకు బ్రహ్మపరత్వము చెడదు. మూఁడు పాదములు, నాల్గు శృంగములు, నేడు హస్తములు, రెండు శీర్షములు గలిగి, నిత్యానందస్వరూపుఁడు, త్రిధా బద్ధుఁడు నగు మహాదేవుఁడవు నీవే అను నుపబృంహణముచేఁ బరమేశ్వరాభిన్నత్వము యజ్ఞమునకుఁ బ్రతిపాదింపఁ బడినది.

3. సూ. 62:- బ్రహ్మప్రతిపాదకత్వేన వేదాన్తోఽపి తాదృశః. అతఏవ బ్రహ్మసూత్రమ్. 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' ఇతి. చిదేకరసతయా నిర్ధర్మకస్యాత్మనః ప్రతిపాదకేషు కథం గుణవత్పురుషవర్ణనమితిచే న్నాయం దోషః. 'సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ' ఇతి సత్యత్వాదీనా మాపచారికాణాం విద్యమానత్వాత్. తదుక్తం పఞ్చ

పాదికాయాం—ఆనన్దో విషయానుభవో నిత్యత్వఞ్చేతి సన్తి ధర్మాః ఇతి. అథవా సచ్చిదానన్దలక్షణబ్రహ్మణో నిర్దోషత్వమేవ గుణః. అపదోషతైవ విగుణస్య గుణః ఇత్యాది వచనాత్. కిఞ్చ సర్వోపనిషదాం ప్రాధాన్యేన లక్ష్యం సత్యజ్ఞానానన్దాద్వయపరం బ్రహ్మ - ఏష సర్వజ్ఞః సైషాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే-ఇత్యాద్యవాన్తరవాక్యైస్సర్వజ్ఞత్వం సర్వశక్తిత్వం నిర్ద్వయత్వఞ్చ సగుణబ్రహ్మణః ప్రతిపాద్యమ్-ఇతి వేదాన్తప్రవాద ఇతి న సర్వథోక్తార్థస్య క్షతిః.

వి :- బ్రహ్మప్రతిపాదక మగుటచే వేదాంతము నట్టిదే. కావున నే - అథాతో బ్రహ్మజిజ్ఞాసా - అని బ్రహ్మమాత్రము చెప్పుచున్నది. జ్ఞానస్వరూప మగుటచే ధర్మరహిత మగునాత్మను బ్రతిపాదించునట్టివానికి గుణవత్త్వరుపవర్ణనపరత్వ మెట్లు సిద్ధించు నని శంకింపరాదు - సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ - అని యౌపచారికసత్యత్వాదు లున్నవి గదా !- ఆనందము, విషయానుభవము, నిత్యత్వము- అను ధర్మములు గలవని పంచపాదిక చెప్పుచున్నది. సచ్చిదానందలక్షణము గలబ్రహ్మమునకు నిర్దోషతయే గుణము. - గుణహీన మగుదాని కపదోషతయే గుణము - అని కలదు గదా ! ఉపనిషత్తుల కన్నింటికిని సత్యజ్ఞానాఽనందాద్వయలక్షణము గలపరబ్రహ్మమే ప్రధానలక్ష్యము గదా ! - ఇతఁడు సర్వజ్ఞుఁడు; ఇతనికిఁ గలయీశక్తి పెక్కురీతుల వినవచ్చుచున్నది - అనునిట్టి యవాంతరవేదాంతవాక్యములచే - సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము, నద్వయత్వము సగుణబ్రహ్మమునకుఁ బ్రతిపాదింపఁదగినవని వేదాంతప్రవాదము గలదు. కావున నుక్తార్థమున కెంతమాత్రమును క్షతి లేదు.

3. సూ. 63 :- వ్యాకరణస్యాఽపి బ్రహ్మప్రతిపాదకత్వమేవ. తథాహి - పస్పశాహ్నికే భగవత్పతఞ్జలినా - చత్వారి శృఙ్గా - ఇతి మన్త్రస్యాఽర్థో వివృతః. నామాఖ్యాతోపసర్గ నిపాత రూపాణి చత్వారి శృఙ్గాణి. భూతభవిష్యద్వర్తమానాఖ్యాః కాలా స్త్రయః పాదాః. నిత్యకార్య శబ్దరూపఞ్చ శిరోద్వయమ్. సప్తవిభక్తయో హా స్తస్థానీయాః. త్రిధా బద్ధ స్త్రిషు స్థానే షూరసి కణ్ఠే శిరసి చ బద్ధః.

వృషభః కామవర్షణా న్మహో మహాన్ దేవః - ఇతి. శబ్ద స్యేశ్వరాభిన్నత్వే - వృష స్త్రీపా చ్చతు శ్శృఙ్గః - ఇత్యా ద్యుక్తమే వోపబృంహణమ్.

వి:- వ్యాకరణశాస్త్రమును బరబ్రహ్మప్రతిపాదకమే. నామాఖ్యాతోపసర్గనిపాతములు నాల్గు శృంగములు. భూత భవిష్య ద్వర్తమాన కాలములు మూఁడు పాదములు. ఔరొమ్ము కంఠము శిరస్సు ననుమూఁడు చోట్ల నిబద్ధము. కామవర్షణమువలన వృషభము మహాదేవుఁడు-అని పస్పశాహ్నికమున భగవత్పతంజలిమునిచే 'చత్వారి శృఙ్గా' అను మంత్రార్థము వివరింపఁబడినది. శబ్ద మీశ్వరాభిన్న మనువిషయమున 'వృష స్త్రీపా చ్చతు శ్శృఙ్గః' అను నుపబృంహణ మీవఱకు వివరింపఁబడినది.

3. సూ. 64 :- కిం బహునా రతిరహస్యాదీనా మప్యతో బ్రహ్మపరత్వమేవ. హేయబుద్ధివిషయతయా వైరాగ్యహేతుత్వాదితి బ్రహ్మవాదినో వదన్తి తస్యాల మాబాలసులభై ర్వచనైః.

వి :- వేయేల, రతిరహస్యాదులును బ్రహ్మపరములే. అవి హేయతాబుద్ధివిషయములై వైరాగ్యహేతువు లగుచుండుటవలన నని బ్రహ్మవాదు లనుచున్నారు. ఆబాలసులభము లగునట్టి వచనములను గట్టిపెట్టి ప్రకృత మనుసరింతము.

4. సూ:- సాధ్యో హి రసో యథాయథం కవిభిః.

4. సూ. 1. :- వాక్యస్య రసవ్యుత్పత్తౌ హేతు మాహ. సాధ్యో హీతి. యథాస్వం యథాయథమ్ - ఇతి నిపాతనా త్సాధు ర్యథాయథ మితి. సాధ్య ఇతి విధిరూప కృత్యప్రత్యయేన సాధనాऽవశ్యకత్వం సూచ్యతే. హీతి ప్రసిద్ధౌ. కవిభి ర్యథాస్వభావం యథాऽऽత్మీయం వా శృఙ్గారాదిరస స్సాధ్యో హి. తత్తద్రసోచితప్రదేశేషు తత్తదుచిత భావాది సామగ్రీ ధురీణ రచనయా సంస్కృతకావ్యే స్వదేశభాషాకావ్యే వా తత్తద్రసస్య సాధనమేవ కవీన్ద్రాణాం స్వభావో లోకప్రసిద్ధి రిత్యర్థః.

వి :- సాధ్యో హి - అనుదానిచే వాక్యము రసవ్యుత్పత్తి యనుటకు హేతువు నిరూపింపఁబడుచున్నది. - యథాయథమ్ - అనురూ

పము - యథా స్వే యథాయథమ్ - అని నిపతించుటచే సాధువు - యథాతథమ్ - అని పాఠాంతరము గలదు. అర్థమున రెంటికిని భేదము లేదు. విధిరూప కృత్యప్రత్యయముచే రసము తప్పక సాధింపఁదగిన దనునర్థము వ్యక్తమగుచున్నది. - హి - అనుదానికిఁ బ్రసిద్ధి యర్థము. సందర్భానుసారముగఁ గవులు తమతమయిష్టము ననుసరించి శృంగారాదిరసములను సాధింప నగును. సంస్కృతాంధ్రకావ్యములలోఁ దత్తద్రసోచితప్రదేశములలో నాయారసములకుఁ దగినభావాది సామగ్రీధురీణరచనతో నాయారసములను సాధించుటయే కవీంద్రస్వభావమని లోకప్రసిద్ధి.

4. సూ. 2 :- అత ఏవోక్తం కావ్యప్రకాశికాయా మాదావేవ గ్రన్థస్య. - నియతికృత నియమరహితాం హ్లాదైకమయీ మనన్యపరతన్త్రామ్ । నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవే ర్జయతి - ఇతి.

వి :- శృంగారాది నవరసనిర్మాణముతో నొప్పుచున్న కవివాక్కునకు దైవకృతమైననియమము లేదు. ఇతరప్రమేయము లేకుండఁగనే యది యానందస్వరూపముఁతో నొప్పుచుండును. అట్టివాక్కు సర్వోత్కృష్టమై యొప్పును - అని కావ్యప్రకాశము నుడివినది.

4. సూ. 3 :- కవిభి స్సాధ్య ఇత్యనేన యథోక్తలక్షణవిశిష్టకవినిర్మితమేవ వాక్యం గ్రాహ్యమి త్యయ మర్థోఽవగమ్యతే. అత ఏవోక్తమ్ - గవి క్షీరమివ గ్రాహ్యం కావ్యం విప్రేణ నిర్మితమ్। న శూద్రస్య వచో గ్రాహ్యం శునోచ్ఛిష్టం హవి ర్యథా - ఇతి.

వి:-కవులచే సాధింపఁదగినది-అని యనుటచే సలక్షణమైన కవినిర్మితమైన కావ్యమె గ్రాహ్య మనునర్థము వ్యక్తమగుచున్నది. కావుననే-విప్రనిర్మితకావ్య మావుపాలవంటిది (ఆదరయోగ్యము); శూద్రనిర్మితకావ్యము కుక్క ముట్టినహవిస్సు వంటిది. (అనాదరింపఁదగినది) —అనునీవచనము శ్రద్ధచేయఁదగినది కాదు గదా! సంస్కారవంతులు వ్రాసినకావ్య ముత్తమమని దానితాత్పర్యము.

4. సూ. 4. :- నను దేశభాషాకావ్యస్య కీర్త్యాదికరత్వేఽపి కథం పాపహరత్వం సిద్ధ్యేత్. దేశభాషాపురాణాని రచితాని చ మానుషైః। శ్రుత్వా కావ్యేతిహాసాంశ్చ భయ మాప్నోతి మానవః - ఇత్యాది నిషేధాత్. తథాచ-విశ్వశ్రేయః కావ్యమ్ - ఇత్యుక్తం కథం సఙ్గచ్ఛత ఇతచే న్నైవమ్ - యత్రకుత్రాపి భాషాయాం గీయతే చరితం శుభమ్। సా భాషా పాపసంహర్త్రీ భవే దత్ర నసంశయః - ఇత్యాభియుక్తో క్తేర్దేశభాషాకావ్యస్యాపి పాపహరత్వం సిద్ధ్యత్యేవ. అతఏవ గుణవత్పురుషవర్ణనపర మేవ కావ్య మాద ర్తవ్య మిత్యుక్తమ్. ఏతదభిప్రేత్యైవ శబ్దశాసనః - భారతః పఞ్చమో వేదః - ఇత్యుక్త్యన్తప్రథితస్య శ్రీమహాభారత స్యాఽఽన్ధ్రీకరణే ప్రావర్తత.

వి :- దేశభాషాకావ్యములవలనఁ గీర్త్యాదిబహుప్రయోజనములు సిద్ధించినను బాపపరిహృతిరూపఫల మెట్లు కల్గును?-దేశభాషాపురాణాదులు మనుష్యవిరచితములు. అట్టికావ్యేతిహాసములను విని మానవుఁడు భయపడుచున్నాఁడు - అనువచనముచే వాని నెవ్వరును జదువరు గదా! అట్టియెడల -కావ్యము విశ్వశ్రేయస్కరము-మున్నగు వచనము లెట్లు సరిపడునని శంకింపరాదు-ఏభాషయందైనను శుభచరిత్రము వినఁబడినచో నాభాష పాపములను దొలఁగించుననుటలో సందియము లేదు-ఇట్టివచనములచే దేశభాషాకావ్యములకును బాపహారత్వము సిద్ధించుచునే యున్నదిగదా! కావుననే గుణవత్పురుషవర్ణనపర మైనకావ్యమే యాదరింపఁ దగినదని చెప్పఁబడుచున్నది. ఈయభిప్రాయముతోడనే శబ్దశాసనుఁడు పంచమవేదమని ప్రసిద్ధిఁజెందిన శ్రీమహాభారతము నాంధ్రీకరించుటకుఁ బ్రవర్తించెను.

4. సూ. 5 :- దేశభాషేతి నిషేధ స్యాతద్వ్యరసాన్యదేశభాషాకావ్యపరిత్యాగ ఏవ తాత్పర్యమ్. కావ్యస్య సద్యః పరనిర్వృతి రేవ ముఖ్యప్రయోజనత్వేనోక్తత్వాత్. అతఏ వోచ్యతే-అన్య దపహాయ-ఇతి. ప్రాకృత స్యాన్యదేశజత్వేఽపి నాటకాదిప్రపఞ్చ స్యాన్ధ్రభాషాయాశ్చ తన్మూలకత్వేన స్వదేశభాషాయామివ తత్రాప్యభినివేశః పణ్డితానా మితి న కశ్చి ద్దోషః.

వి:- 'దేశభాషాపురాణాని'-అనునిషేధమునకు నీరసము లైన యన్యదేశభాషాకావ్యపరిత్యాగమునందే తాత్పర్యము. కావ్యమునకు

సహృదయః పరనిర్వృతియే ఫలమని చెప్పఁబడినది గదా! — అన్యదపహాయ —అనిచెప్పుట యీయుద్దేశముతోడనే. ప్రాకృత మన్యదేశభాష యైనను సంస్కృతనాటకములయందుఁ బ్రాకృత ముపయోగపడుచున్నది. ఆంధ్ర భాషలోఁ బ్రాకృతభవము లున్నవి. పండితులకు స్వదేశభాషయందు వలెనే ప్రాకృతభాషయందును నభినివేశము కలదు — కాన నేదోషమును లేదు.

4 సూ. 6:- నను-తస్మా ద్బ్రాహ్మణేన న మ్లేచ్ఛితవ్యమ్, నాపభాషితవై మ్లేచ్ఛోహ వా యఏష య దపశబ్దః — ఇత్యాది వచనేన, - ఆహితాగ్ని రపశబ్దం ప్రయుజ్య సారస్వతీ మిష్టిమ్ - ఇత్యాదౌ ప్రాయశ్చిత్త శ్రవణేన చ, అవైదికానాం గావీ గోణ్యాది శబ్దానాం అపశబ్దత్వే నోచ్చారణానర్హత్వం నిశ్చితం జైమినీయే; త త్కథం పణ్డిత కవీన్ద్రాః స్వదేశభాషాకావ్యనిర్మితా వుత్సహేరన్. కథం తరాం సహృదయా స్త ద్వ్యాణిపవిషాణయః తత్ర రసాఽస్వాదనార్థం ప్రవర్తేరన్.

వి:— అపశబ్దమునకు మ్లేచ్ఛమని పేరు. ఆహితాగ్ని (అగ్న్యాధానము కావించినయాతఁడు) అపశబ్దము నుచ్చరించిన సారస్వతేష్టి చేయవలయునని ప్రాయశ్చిత్తము కలదు. కాన నపశబ్దోచ్చారణము కావింప రాదని చెప్పుచు—గావి, గోణి—మున్నగునవి యపశబ్దము లగుటచే వానిని నయిత ముచ్చరింపరాదని జైమినీయమునఁ గలదు. కానఁ బండితకవీంద్రులు దేశభాషాకావ్యనిర్మాణమున కేరీతి నుత్సహింతురు? పండితులు తద్దేశభాషాకావ్యములలో రసాస్వాదము నెట్లు చేయుదురు?

4. సూ. 7 :- కిఞ్చ సంస్కృతకావ్యనిర్మాణేనైవ, రసాఽస్వాదనం కవీన్ద్రాణాం భవతీతి న స్వదేశభాషాకావ్యనిర్మిత్యపేక్షా. సరసహృదయానాం పణ్డితానాఞ్చ తత్రైవ రసానుభవ స్సిద్ధ్యతీతి న తదాలోచనాలాలసత్వం సమ్భవత్యేవేతి స్త్రీశూద్రాది హీనాధికారికం వికృతిభాషాకావ్య మిత్యేతదనుశాసనపర మిదం వ్యాకరణం మన్ద ప్రయోజన మేవేతి చే న్నైవమ్.

వి:— మఱియు సంస్కృతకావ్యనిర్మాణముచేతనే రససిద్ధి కవీంద్రుల కగుచున్నది. స్వదేశభాషాకావ్యనిర్మాణాపేక్ష వారి కక్కఱ

లేదు. సరససహృదయు లగుపండితులకు సంస్కృతకావ్యములయందే రసానుభవసిద్ధి కల్గుచున్నది–కానఁ దదాలోకనలాలసత వారి కుండదు. కాన స్త్రీశూద్రాధికారిక మగువికృతిభాషాకావ్యానుశాసన మగు నీవ్యాకరణమునకుఁ బ్రయోజనము శూన్యమని యూహింప రాదు.

4. సూ. 8. :– శ్రుతిగర్హితత్వేఽపి స్వదేశభాషా అవశ్యం వ్యవహారసిద్ధ్యర్థం గ్రాహ్యైవ - తస్మాద్బ్రాహ్మణేన - ఇతి వాజసనేయివాక్యస్య సర్వథా భాషాపరిత్యాగప్రతిపాదనే న తాత్పర్యమ్. తస్య జ్యోతిష్టోమప్రకరణగతత్వాత్ క్రతుమధ్యే బ్రాహ్మణేన న మ్లేచ్ఛితవ్య మిత్యత్రైవ తాత్పర్యాత్. ఆహితాగ్ని రపశబ్ద మిత్యాది ప్రాయశ్చిత్తవిధాయకం వచనమపి నోక్తే బాధకమ్. ఆహితాగ్నిపద స్యాన్వాహితాగ్నిపరత్వేన అగ్న్యన్వాధానానన్తరం కర్మమధ్యేఽపశబ్దప్రయోగ ఏవ ప్రాయశ్చిత్త మితి కావ్యాదిభిః స్వదేశభాషయా వ్యవహారే ప్రత్యవాయాఽప్రసక్తే న ప్రాయశ్చిత్తిరితి తత్తాత్పర్యవివరణాత్.

వి:– వేదము నిందించుచున్నను వ్యవహారసిద్ధికొఱకు స్వదేశభాష తప్పక గ్రహింపఁదగినదే–తస్మాద్బ్రాహ్మణేన–అను వాజసనేయి వాక్యమునకు సర్వథా భాషాపరిత్యాగమునందుఁ దాత్పర్యము కాదు. ఆవాక్యము జ్యోతిష్టోమప్రకరణములోని దగుటచే మ్లేచ్ఛభాషతోఁ గ్రతుమధ్యమున బ్రాహ్మణుఁడు వ్యవహరింపరా దనువిషయమునందే దానికిఁ దాత్పర్యము.–ఆహితాగ్ని రపశబ్దమ్–అనుప్రాయశ్చిత్తమును విధించువచనమునయితే మీవచనమునకు బాధకము కాదు. ఆహితాగ్ని పదమున కన్వాధానకర్మముఁగావించినయాతఁడనియర్థము. కావునఁ నగ్న్యన్వాధానానంతరమున నపశబ్దప్రయోగము జరిగినప్పుడు ప్రాయశ్చిత్తమునకుఁ బ్రసక్తి. కానఁ గావ్యాదులలో స్వదేశభాషకు వ్యవహారము కల్గినపుడు ప్రత్యవాయ ముండదు. ప్రాయశ్చిత్తము లేదని తాత్పర్యము.

4. సూ. 9. :– “వాగ్యోగవి ద్దుష్యతి చాపశబ్దైః”-ఇతి స్మృత్యనుమితశ్రుత్యవగమ్యమానోఽపశబ్దనిషేధోఽపి క్రతువిషయ ఏవ. “వాచా హవ్యఞ్చ మనసా వాచా యజ్ఞఞ్చ ప్రవర్తతే”-ఇతి లిఙ్గదర్శనేన వాగ్యోగశబ్దస్య యజ్ఞపరతయా వాగ్యోగవి

చ్ఛబ్దస్య యజమానఋత్విక్పరత్వాత్. అన్యథా ఆహితాగ్నిమాత్రస్య స్వభాషయా వ్యవహారస్యా ప్యుచ్ఛేదఏవ స్యాదితి తాన్త్రికా వదన్తి. అతఏవ వ్యాకరణమహాభాష్యే – సర్వోప్యపశబ్దనిషేధః క్రతువిషయఏవ; నతు వ్యవహారవిషయః-ఇతి ప్రతిపాదితమ్. తత్స్వదేశభాషాభిమానధారేయాః పణ్డితశిఖామణయః నిశ్శఙ్కం స్వదేశభాషాకావ్యనిర్మాణే ప్రవర్తన్తఏవ.

వి:- వాగ్యోగవిత్-అనుశ్రుతిచేఁ దెలియనగుచున్నయపశబ్దనిషేధము క్రతువిషయకమే-వాచా హ్యపశబ్దా-అనులింగమునుబట్టివాగ్యోగశబ్దము యజ్ఞపరమును-వాగ్యోగవిత్-శబ్దము యజమానఋత్విక్పరము నగుటవలన మీఁదియర్థము స్పష్టము. అట్లర్థము చేయకున్న నాహితాగ్నిమాత్రమునకు స్వదేశభాషావ్యవహారాభావము కల్గునని తాంత్రికులనుచున్నారు. వ్యాకరణమహాభాష్యమందు అపశబ్దనిషేధమెల్లఁ గ్రతువిషయకమేకాని వ్యవహారవిషయకము కాదు-అని చెప్పఁబడినది. కాన స్వదేశభాషాభిమానులగుపండితులు నిశ్శంకముగ దేశభాషాకావ్యనిర్మాణము కావించుచున్నారు.

4. సూ. 10:- తాదృశా స్సహృదయవిచక్షణనికాయా అపి తత్రాపి రసాస్వాదనార్థం నివిశన్త్యేవేతి స్థితమ్. తత్రాపి ప్రాకృతాన్ధ్రయో ర్నాన్యదేశభాషావత్స్వత్రాపశబ్దత్వేనాప్రామాణ్యమ్. తథాహి-ప్రాకృతభాషా త్రిధా తత్సమా తద్భవా దేశ్యాచేతి. తత్ర తత్సమప్రాకృతస్య వేదవేదాఙ్గరూఢత్వేన వైదికత్వే నామ్లేచ్ఛత్వస్య నిర్వివాదత్వాత్.

వి:- సహృదయవిచక్షణులు దేశభాషాకావ్యములలో రసాస్వాదము చేయుచున్నారు. దేశభాషలలోఁ బ్రాకృతాంధ్రముల కితరదేశభాషాకావ్యములలోవలె నపశబ్దాప్రామాణ్యమంతట నుండదు. తత్సమతద్భవదేశ్యాత్మకముగఁ బ్రాకృతభాష మూఁడువిధములు. తత్సమప్రాకృతము వేదవేదాంగరూఢమై వైదికమగుటచే దానికి మ్లేచ్ఛత లేదుగదా!

**4. సూ. 11:- తద్భవస్యాప్యన్యదేశభాషావన్న మ్లేచ్ఛత్వమ్; తస్య సంస్కృతసమ్భవత్వాత్. అతఏవ తస్య ప్రాకృతవ్యపదేశః. కిఞ్చ స్వర్గలోకావతరద్గీర్వాణ**

వాణ్యపూర్వవిక్రమస్థానాయమానసర్వజ్ఞశిఖామణినా సాక్షాచ్చతుర్ముఖేన వల్మీక సమ్భవమహర్షిణా నిర్మితం వ్యాకరణమ్. తచ్చానుక్త మన్యత్ సిద్ధానుశాసనవ దిత్యతి దేశా దాద్యవ్యాకరణస్య వికృతిభూతమ్. తేన నిష్పాదితం చ భవతీ త్యవగమో మహా న్విశేషః.

వి:- అన్యదేశభాషల కున్నట్లు తద్భవభాషకు మ్లేచ్ఛత లేదు. అది సంస్కృతజన్యము గదా! కావుననే దానికిఁ బ్రాకృతమని పేరు. దానికి సర్వజ్ఞుఁ డగువాల్మీకిముని వ్యాకరణమును వ్రాసెనుగదా! దాని మ్లేచ్ఛతను శంకించుట యెట్లు పొసఁగును? 'అనుక్త మన్యత్ సిద్ధానుశాసనవత్' అనునతిదేశముచే నది సంస్కృతవ్యాకరణమునకు వికృతిభూతమే యని తెలియుచున్నది. దానిచేతనే యీప్రాకృతవ్యాకరణనిష్పత్తి జరిగినది గదా!

4. సూ. 12 :- కిఞ్చ అభియుక్తస్మరణపరంపరయా తత్కాలీనవృద్ధప్రత్యక్ష సధ్రీచీనయా తత్తచ్ఛబ్దానాం అత్తదర్థే ష్వనాదివాచకత్వలక్షణం సాధుత్వ మత్రాప్య స్త్యేవేతి న తద్భవ స్యాసాధుత్వమ్. అత ఏవ సర్వదేశీయా స్తన్మిశ్రరూపకావ్యాని ప్రతి యుగ మభియుక్తా స్సంస్కృతకావ్యానీవ బహుమన్యన్తే.

వి:- పెద్దలస్మరణపరంపరనుబట్టి చూడఁగా నాయాకాలములందలి వృద్ధులప్రత్యక్షానుభవమునకు సరిపడియుండుటచే నాయాపదముల కాయాయర్థములు వాచ్యము లనునర్థము తద్భవములకు నుండుటచేఁ దద్భవము సాధువే. కావుననే సర్వదేశములందును దన్మిశ్రమ లగుకావ్యములను సంస్కృతకావ్యములవలెఁ బెద్ద లాదరించుచున్నారు.

4. సూ. 13 :- తేషా మయ మాశయః- నహి వాల్మీకిమహర్షే రన్య స్సన్మార్గో పదేష్టా సర్వజ్ఞః ప్రత్యయితతమోఽస్తి లోకే. తేన ఖలు ప్రాకృతభాషానిష్పాదకం వ్యాకరణం నిర్మితమ్. కావ్యోపయోగాయ భాషావినియోగశ్చ ప్రదర్శితః. నహి మూలశ్రుతిదర్శనమన్తరా మహాత్మన స్తస్య తత్ర ప్రయత్న స్సమ్భవత్యేవేతి తన్నిబద్ధాని తన్మిశ్రాణి చ కావ్యాని కథం న చతుర్విధపురుషార్థప్రయోజనాని భవేయురితి.

వి:- సన్మార్గోపదేశకుఁడు, సర్వజ్ఞుఁడు, నమ్మఁదగినవాఁడును వాల్మీకిమునికంటె నితరుఁ డెవ్వఁడు నీలోకమున లేఁడు. అతఁడే

ప్రాకృతభాషానిష్పాదక మగువ్యాకరణమును వ్రాసెను. ఆప్రాకృత భాషను గావ్యములలో నె ట్లుపయోగింపవలయునో చెప్పెను. మూల శ్రుతి లేకుండ నతఁ డట్టియత్నము చేసియుండఁడు. అందుచేఁ దన్ని బద్ధములు తన్మిశ్రములు నగుకావ్యములు చతుర్విధపురుషార్థప్రదములు కాకుండవు-అని వారియూహ కానోపును.

4 సూ. 14:- అతఏవ తేనైవ మహర్షిణా-'శ్రేష్ఠశాస్త్రసమూహేషు ప్రాప్తవ్యా మిశ్రకేషు సంస్కృతప్రాకృతనాటకాఽలఙ్కారాదిషు చ శ్రీరామదేవస్య జ్ఞానపాటవం ప్రతిపాదితమ్. అతఏవ ద్రవిడభాషా అసంస్కృతానుసారిణ్యపి కుమ్భసమ్భవానుశాసితత్వేన పణ్డితై రాద్రియతే. ఆన్ధ్రభాషాయా అపి సంస్కృతసమాంశే ప్రకృత్యంశస్య వేదవేదాఙ్గేషు ప్రత్యభిజ్ఞాయమానత్వా త్సిద్ధమేవ ప్రామాణ్యమ్. ప్రాకృతసమాంశ స్యాపి తత్త్వేనైవ ప్రామాణ్యమ్. తద్భవాంశయోరపి పృథగనుసారిత్వేన న హేయత్వమ్. అతఏ వానయో ర్వికృతిసంజ్ఞయా వ్యవహార ఇత్యత ఆన్ధ్రభాషాకావ్య నిర్మాణే స్వభాషాఽభిమానినః కవయః ప్రవర్తన్తే. ప్రతియుగం తత్కావ్యేషు రసికా అపి తాదృశరసాఽస్వాదనార్థం ప్రవర్తన్తఏవ. మ్లేచ్ఛభాషా తు సర్వథా అగ్రాహ్యైవ. 'న మ్లేచ్ఛభాషా శిక్షితవ్యా'-ఇతి స్మృతే రభియుక్తవ్యవహారా భావాచ్చ.

వి:- ఆవాల్మీకిముని శాస్త్రసమూహములయందును, సంస్కృత ప్రాకృతభాషాసమ్మిశ్రము లగునాటకాలంకారాదులందును శ్రీరామ దేవుని జ్ఞానపాటవమును బ్రదర్శించెను. సంస్కృతభాష ననుసరింపని ద్రవిడ భాషయు నగస్త్యమునిచే ననుశాసింపఁబడి పండితాదరము నొందు చున్నది. ఆంధ్రభాషలోని సంస్కృతసమము వేదవేదాంగనిరూఢమై యగపడుచున్నది గాన దానిప్రామాణ్యము సిద్ధమే. ప్రాకృతసమమును సంస్కృతజన్యము కాన నదియుఁ బ్రమాణమే. సంస్కృతప్రాకృతము లలోని తద్భవాంశమును వానినే యనుసరించుటవలన హేయము కాదు. అందుచేత నే వానికి వికృతిసంజ్ఞ కల్గినదని వారియాశయము. స్వభాషాభిమానము గలకవు లాంధ్రభాషాకావ్యనిర్మాణమునకై ప్రతి యుగమునను యత్నించుచున్నారు. రసికు లాకావ్యములను రసాఽ

స్వాదనమునకై సేవించుచునేయున్నారు. 'మ్లేచ్ఛభాష యెంతమాత్రమును గ్రామ్యము కాదు - మ్లేచ్ఛభాషను నేర్వరాదు'-అను స్మృతివచనమునుబట్టియు, అభియుక్తులవ్యవహారమందు సిద్ధాంతముగా రాకపోవుటనుబట్టియును మ్లేచ్ఛభాష యెంతమాత్రమును గ్రామ్యము కాదు.

4. సూ. 15 :- న చాఽస్య కావ్యస్య స్త్రీశూద్రాద్యధికారికత్వమ్ అనిబద్ధవ్యవహారోపయోగిభాషామాత్రస్య తదధికారిత్వే ప్యలౌకికవిభావానుభావసాత్త్వికవ్యభిచారిలక్షణరసవ్యఞ్జకసఙ్ఘటితతత్సమాదినానావిధశబ్దసన్దర్భవిచిత్రత్వేన చ విలక్షణం వర్ణనప్రధానం చమత్కారకారికావ్యమపి కథమ్పున రపండితస్త్రీశూద్రాధికారికత్వమాపద్యేత. అతః పణ్డితా ఏవాత్రాధికారిణో భవన్తి.

వి:- ఈకావ్యమును జదువుటకు స్త్రీశూద్రులే యధికారు లని చెప్పరాదు. అలాక్షణికమై వ్యవహారమాత్రోపయోగి యగుభాషామాత్రమునకు వా రధికారులైనను, విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావలక్షణము గల్గి రసవ్యంజకతత్సమాదినానావిధశబ్దసందర్భవిచిత్రితమై వర్ణనప్రధానచమత్కారజనక మగుకావ్య మపండితస్త్రీశూద్రమాత్రపఠనయోగ్య మెట్లగును? కానఁ బండితులే కావ్యపఠనమున కధికారు లని చెప్పక తప్పదు.

4. సూ. 16. :- అయం తు విశేషః. సంస్కృతపురాణపఠనశ్రవణాక్షమాణామీషద్వ్యుత్పత్తిమతాం స్త్రీశూద్రాదీనాం ముముక్షూణాం తు తదర్థోపబృంహణేష్వాన్ధ్రపురాణేషు కథాప్రధానేషు ప్రాధాన్యేనాధికారిత్వమ్. తత్పఠనశ్రవణాభ్యాం వినా తేషాం జ్ఞానోత్పత్తిసాధనాన్తరాభావాత్.

వి:- కాని యొకవిశేషము కలదు. సంస్కృతపురాణములను జదువుటకుఁగాని, విని తెలిసికొనుటకుఁగాని యసమర్థు లగునల్పమాత్రవ్యుత్పత్తి గలముముక్షువు లగుస్త్రీశూద్రాదులకు సంస్కృతపురాణములయర్థమునే చెప్పుచుఁ గథాప్రధానము లగునాంధ్రపురాణములయందుఁ బ్రధానముగ నధికారిత కలదు. వానిని బఠించి వినుట తప్ప వారికి మఱియొకజ్ఞానోత్పత్తిసాధనము లేదు గదా!

4. సూ. 17 :- "న శూద్రాయ మతిం దద్యాత్"–ఇతి నిషేధేన శూద్రస్య బ్రహ్మవిద్యాయా మధికారిత్వాభావప్రతిపాదనాత్కథం తస్య జ్ఞానోత్పత్తిసాధనమితిచేన్నైవమ్. "శ్రావయే చ్చతురో వర్ణా న్కృత్వా బ్రాహ్మణ మగ్రతః" ఇతి వచనేన పురాణాదిశ్రవణే చాతుర్వర్ణ్యస్యాధికారశ్రవణాత్. నిషేధస్య తు వేదపూర్వకవిద్యాదానమాత్ర ఏవేతి న మతిమాత్రదాననిషేధే తాత్పర్యమ్. అన్యథా చాతుర్వర్ణ్యధర్మాణామపి జ్ఞానసాధనత్వాభావేన తత్ప్రతిపాదకవచనానా మననుష్ఠానలక్షణాప్రామాణ్యం స్యాత్. శూద్రస్యాపి వర్ణధర్మాశ్శ్రూయన్తే, "తస్యాపి సత్య మక్రోధ శ్శౌచమ్" ఇత్యాదివచనైః.

వి:– "న శూద్రాయ మతిం దద్యాత్" అనునిషేధముచే శూద్రునకు బ్రహ్మవిద్యయం దధికారము లేనందున వానికి జ్ఞానోత్పత్తి సాధన మెట్లని శంకింపఁజనదు. "బ్రాహ్మణునిముం దుంచుకొని నాల్గు వర్ణములవారికిని బురాణాదులను వినిపింపవచ్చును" అని చెప్పఁబడినది. వేదపూర్వకవిద్యాదానమునందుమాత్రమే నిషేధము కాని మతిమాత్రదానమునందుఁ గాదని దానికిఁ దాత్పర్యము. అట్టి యర్థమును దాని కంగీకరింపకున్నచోఁ జాతుర్వర్ణ్యధర్మములకు జ్ఞానసాధనత్వ ముండదు గానఁ దత్ప్రతిపాదకము లగువచనముల కనుష్ఠానరాహిత్యాప్రామాణ్యము కల్గును. "తస్యాపి సత్య మక్రోధ శ్శౌచమ్" మున్నగువచనములచే వర్ణధర్మములు శూద్రునకును గలవని తెలియుచున్నది గదా!

4. సూ. 18 :- న హ్యత్ర వాక్యే యజ్ఞాదీనాం సముచ్చయః. నిరపేక్షతృతీయాపక్షే శ్రుత్యా వికల్పప్రతీతే శ్రుత్యపేక్షయా వాక్యస్య దుర్బలత్వాత్. "అన్తరా చాపి చ తద్దృష్టేః" ఇతి శారీరకబ్రహ్మమీమాంసాసూత్రే విధురాణాం యజ్ఞానధికారిణామపి బ్రహ్మవిద్యాయా మధికారాఙ్గీకారాచ్చ. న చ తత్ర జన్మాన్తరానుష్ఠితసత్కర్మభిస్తేషా మధికార ఇతి వాచ్యమ్. "విశేషానుగ్రహశ్చ" ఇత్యగ్రిమసూత్రభాష్యే విధురాదీనా మప్యవిరుద్ధైః పురుషమాత్రసమ్బన్ధిభి ర్విశేషై రనుగ్రహో విద్యాయా స్సమ్భవతీతి తదానీంతనకర్మభిరేవోపపాదితత్వాత్.

వి:- ఈవాక్యమునందు యజ్ఞాదులకు సముచ్చయము లేదు. ఇచటితృతీయచే శ్రుతికి వికల్పార్థమే ప్రతీయమానా మగుచుండుటచే శ్రుతిమూలమున వాక్యము దుర్బల మగుచున్నదిగదా! "అంతరా" అనుశారీరకబ్రహ్మమీమాంసాసూత్రమునందు యజ్ఞాదులు చేయుట కధికారము లేనవిధురాదులకు బ్రహ్మవిద్యనభ్యసించుట కధికార మంగీకరింపఁబడినది. జన్మాంతరములయం దాచరించినసత్కర్మలచేతనే వారి కట్టియధికారము కల్గిన దనరాదు. "విశేషానుగ్రహాచ్చ"- అనుసూత్రపుభాష్యమందు విధురాదుల కిప్పటిపుణ్యకర్మవిశేషముచేతనే బ్రహ్మవిద్యయం దధికారము సంభవించునని చెప్పఁబడినది.

4. సూ. 19 :- ఏవం చ ఏకవాక్యతత్వేన వేదానువచనాదీనాం సముచ్చీయతే. తథాఽపీహ ఫలైక్యాన్నైకకర్తృత్వాత్. ధర్మాదివత్ఫలైక్యేఽపి ప్రయోగస్య భిదా శ్రుతేః భిన్నకాలప్రయోగిత్వమే వాత్రాఽప్యుపలక్ష్యతే" ఇతి యజ్ఞాదీనాం సముచ్చయం ప్రతిపాదయతాం నృసింహమిశ్రాణా ముదాహృతసూత్రభాష్యవిరోధో దుర్వార ఇతి స్పష్టమేవ. యథా చాత్ర నైకవాక్యత్వం తథా ఆత్మతత్త్వనిరూపణే ప్రతిపాదితమ్.

వి:- వేదానువచనాదుల కేకవాక్యతయగుటచే సముచ్చితమే. ఫలైక్య మున్నను వ్యాపారము ఒకటి కాదు. -"దర్శపూర్ణమాసాదులవలె ఫలైక్యమున్నను ప్రయోగము భిన్నముగా వినఁబడుటవలన విభిన్నకాలప్రయోగ మచట నిశ్చిత మగుచున్నది"-అని యజ్ఞాదులకు సముచ్చయమును జెప్పుచున్ననృసింహమిశ్రులయభిప్రాయము మీఁది సూత్రభాష్యమునకు విరుద్ధము కాక తప్పలేదు. ఇట నేకవాక్యత లేదని యాత్మతత్త్వమున నిరూపితమైనది.

4. సూ. 20 :- ఏవం శూద్రస్యాగ్నిహోత్రాద్యసమ్బన్ధేఽపి పాపక్షయహేతుత్వేన విహితదానాదిభి రుదితవివిదిషస్య బ్రహ్మవిద్యాయా మధికారో న విరుద్ధ ఏవ.

వి:- శూద్రున కగ్నిహోత్రాదిసంబంధము లేకున్నను పాపక్షయహేతువులైనదానాదులచే నుత్పన్నమైనవివిదిషాశక్తి కలవానికి బ్రహ్మవిద్యయం దధికారము విరుద్ధము కానే కాదు.

4. సూ. 21 :- నన్వేవమపి "బ్రాహ్మణా వివిదిషన్తి" ఇతి బ్రాహ్మణగ్రహణా త్కథం శూద్రస్య తత్రాధికార ఇతిచే న్న. తత్ర బ్రాహ్మణశబ్దస్య విద్యాధికారిమాత్రోపలక్షణత్వాత్. భవతాఽపి క్షత్రియవైశ్యసాధారణ్యార్థ ముపలక్షణత్వ స్యేష్టత్వాత్. తథా చ సురేశ్వరవార్తికమ్ "బ్రాహ్మణగ్రహణఞ్చాత్ర ద్విజాతీనా ముపలక్షణమ్. అధిశిష్టాధికారిత్వా త్సర్వేషా మాత్మబోధనే" ఇతి.

వి:— "బ్రాహ్మణా వివిదిషన్తి"–అనుదానియందు బ్రాహ్మణగ్రహణముచే శూద్రున కెం దధికార మెట్లని శంకింపరాదు. అట బ్రాహ్మణశబ్దము బ్రహ్మవిద్యాధికారిమాత్రోపలక్షణము. ఉపలక్షణత నంగీకరింపకున్న క్షత్రియులకు వైశ్యులకు బ్రహ్మవిద్యాధికారిత యెట్లు?— "ఇచటిబ్రాహ్మణశబ్దము ద్విజుల కెల్ల నుపలక్షణము. వారి కాత్మబోధమునం దధికార మనుశిష్టమై యున్నది" అని సురేశ్వరవార్తికము చెప్పినది.

4. సూ. 22 :- అస్తువా బ్రాహ్మణగ్రహణవివక్షా. తథాఽపి జన్మాన్తరానుష్ఠితయజ్ఞాదిభి రుదితవివిదిషస్య శూద్రస్యా ప్యధికారో న విరుద్ధః. తస్మా ద్యజ్ఞ శూద్రోఽనవక్లృప్త ఇతివద్విద్యాయాం శూద్రోఽనవక్లృప్త ఇతి నిషేధాభావాత్.

వి:— ఉన్న బ్రాహ్మణగ్రహణవివక్ష యుండనిమ్ము; జన్మాంతరములయందుఁ జేయఁబడినయజ్ఞాదులచే నుదితమైనజ్ఞానాభిలాషము గల శూద్రునకు బ్రహ్మవిద్యాధికార ముండుట విరుద్ధము కాదు. –"శూద్రుఁడు యజ్ఞమును జేయరాదు"– అనునట్లు– శూద్రునకు బ్రహ్మవిద్యయం దధికారము లేదు"–అని నిషేధము లేదు గదా!

4. సూ. 23 :- "శ్రావయే చ్చతురో వర్ణాన్" ఇతీతిహాసపురాణాధిగమే చాతుర్వర్ణ్యాధికారస్మరణా ద్వేదపూర్వకస్తు నాస్త్యధికార శ్శూద్రాణామితి సిద్ధమేవ. శూద్రాధికరణభాష్యపర్యాలోచనయా పురాణద్వారా శూద్రస్యాపి బ్రహ్మవిద్యాధికారో భగవత్పాదానామపి సమ్మత ఇత్యనుమీయతే.

వి:— పురాణాదులను –"నాల్గువర్ణములవారికిని వినిపింపవలయును"- అని యనుటచే శూద్రులకు వేదపూర్వకముగ బ్రహ్మ

విద్యాధికారము లేదని తెలియుచున్నది. శూద్రాధికరణోపసంహార భాష్యమును బర్యాలోచింపఁగాఁ బురాణద్వారమున శూద్రునకును బ్రహ్మవిద్యాధికార ముండుట శంకరభగవత్పాదులకు నిష్టమే యని యూహింపఁదగియున్నది.

4. సూ. 24 :- తత్ర శూద్రస్య పురాణశ్రవణేన నిర్గుణబ్రహ్మజ్ఞానే జాతేఽపి తన్న ముక్తిహేతుః. "తన్త్వౌపనిషదమ్" ఇతివాక్యపర్యాలోచనయా వేదాన్తశాస్త్రజన్యబ్రహ్మసాక్షాత్కారస్యైవ మోక్షహేతుత్వావధారణాత్. కిన్తు పురాణశ్రవణేనాభివర్ధితబ్రహ్మజ్ఞానస్య శూద్రస్య విద్యోత్పత్తిద్వారా క్రమేణ ముక్తిః. యథా త్రైవర్ణికానాం క్రమముక్తిఫలకసగుణవిద్యోపాసకానామితి.

వి:— పురాణశ్రవణముచే శూద్రునకు నిర్గుణబ్రహ్మజ్ఞానము కల్గినను నది మోక్షహేతువు మాత్రము కాఁజాలదు. "తన్త్వౌపనిషదమ్" అనువాక్యపర్యాలోచనముచే వేదాంతశాస్త్రజన్యబ్రహ్మసాక్షాత్కారమే మోక్షహేతువని నిర్ధారిత మగుటవలనఁ బైవిషయము నిర్ణయింపఁబడినది. పురాణశ్రవణముచే నభివృద్ధిఁజెందినబ్రహ్మజ్ఞానము గలశూద్రునకును జ్ఞానోత్పత్తిద్వారముననే క్రమముగ ముక్తి గల్గును. సగుణవిద్యోపాసకు లగుత్రైవర్ణికులకువలెనే క్రమముక్తి శూద్రునకును నగునని తెలియుచున్నది.

4. సూ. 25 - విదురాదీనాం తు పూర్వానుష్ఠితసమస్తసాధనకలాపానాం కేనచిన్నిమిత్తేనాసాదితశూద్రశరీరాణాం బ్రహ్మసాక్షాత్కారాన్ముక్తిః కిన్త్వైవ జ్ఞానే సత్యజ్ఞాననివృత్తే రావశ్యకత్వాత్. ఏవం గర్భగతస్యైవ వామదేవస్య జ్ఞానముపపాదనీయమ్. ఏవం చైహికం మప్రస్తుతం ప్రతిబన్ధే తద్దర్శనాదితి తృతీయాపాస్త్యాధికరణే నిర్ణీతమ్. "గర్భస్థఏవ వామదేవః ప్రతిబుబుధే బ్రహ్మాహమ్"ఇతీయం శ్రుతి ర్జన్మాన్తరసమ్పాదితాత్సాధనా జ్జన్మాన్తరే విద్యోత్పత్తిం దర్శయతి. నహి గర్భస్థస్యైహికం కిఞ్చిచ్ఛ్రవణాదికం సమ్భావ్యతే. సాఙ్ఖ్యతన్త్రే చ చతుర్థాధ్యాయస్యాధికరణే రాజపుత్రవ త్తత్త్వోపదేశా దిత్యస్మిన్సూత్రే పురాణద్వారా బ్రహ్మవిద్యాయా మధికారశ్శూద్రస్యాపి యత్నేన సాధితః.

వి :– పూర్వజన్మసంపాదిత మైనసమస్తసాధనకలాపములు గల్గియు నేదో యొకనిమిత్తముచే శూద్రశరీరము నొందినవిధురాదుల కును బ్రహ్మసాక్షాత్కారమువలననే ముక్తి జ్ఞానముచే నజ్ఞాననివృత్తి యగును. గర్భస్థుఁడై యుండఁగనే వామదేవునకు బ్రహ్మజ్ఞానము కల్గిన దని నిశ్చయింపనగును – "ఐహికమప్రస్తుతం ప్రతిషేధే తద్దర్శనాత్"– అని తృతీయాధ్యాయము చివరియధికరణమున నిర్ణయింపఁబడినది. వామదేవుఁడు గర్భమున నుండియే "నేనే బ్రహ్మమును" – అని తెలిసికొనెను. దీనిచే నొకజన్మమున సంపాదించినపుణ్యముచే మఱి యొకజన్మమున బ్రహ్మవిద్య లభించు ననువిషయము తేలుచున్నది. కాకు న్నచో గర్భస్థశిశువునకుఁ బురాణశ్రవణాదిసాధనము నెట్లు చూప నగును? సాంఖ్యశాస్త్రచతుర్థాధ్యాయముగూడ "రాజపుత్రవత్తత్త్వోపదేశాత్" అనుసూత్రము శూద్రునకుఁ బురాణద్వారమున బ్రహ్మ విద్యను సాధించుచున్నది.

4. సూ. 26 - అతఏవ శూద్రస్యాపి మోక్షోపయోగిపురాణాదావధికారో భగవతాఽప్యుక్తః. "మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః। స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి పరాం గతిమ్" ఇతి శూద్రస్యాపి మోక్షం ప్రతిపాదయతా. న హీశ్వరభక్తి రనేకపురాణశ్రవణమన్తరేణ కస్యాఽపి సమ్భవతి.

వి:– "పార్థా! పాపాఽచారులగుస్త్రీలు వైశ్యులు శూద్రులును నన్ను సమాశ్రయించి యుత్తమగతు లగుచున్నారు" అని శ్రీకృష్ణపరమాత్మ శూద్రునకును మోక్షప్రాప్తిని జెప్పెను. పెక్కు పురాణములు వినకున్న నెవ్వానికిని భగవద్భక్తి గల్గదు గదా!

4. సూ. 27:– తస్మాచ్ఛూద్రస్య బ్రహ్మవిద్యాయామధికారోఽస్త్యేవేతి నిశ్చితం భవతి. సంస్కృతపురాణపఠనాక్షమాణాం తచ్ఛ్రవణేఽప్యలాలసానాం ముముక్షూణాం శూద్రాదీనాం ప్రాధాన్యేన జ్ఞానోపయోగీని స్యాన్ధ్రపురాణాని భవన్త్యేవేతి తదీయ శబ్దానుశాసనపరం వ్యాకరణమపి సప్రయోజనమేవే త్యేతత్సర్వం మనసి నిధాయాహ 'స్వస్థాన....' ఇతి.

వి:— శూద్రునకు బ్రహ్మవిద్యయం దధికారము కలదని తేలినది. కాన సంస్కృతపురాణపఠనమున కనర్హులును, వానిని విననైనఁ జాలని ముముక్షువు లగుశూద్రాదులకు జ్ఞానోపదేశము చేయుటకుఁ బ్రధానముగ నాంధ్రపురాణము లుపయుక్తము లగుచున్నవి. కావున నాంధ్రభాష ననుశాసించునీవ్యాకరణమును సప్రయోజనమే. ఈయంశములను మనసున నుంచుకొని "స్వస్థాన" అనుసూత్ర మారంభింపఁబడినది.

5. సూ:— స్వస్థానవేషభాషాభిమతాః సన్తో రసప్రలుబ్ధధియః।
లోకే బహుమన్యన్తే వైకృతకావ్యాని చాన్య దపహాయ.

5. సూ. 1 :- రసప్రలుబ్ధధియో రసాస్వాదనైకప్రవణాః; సన్తః పణ్డితకవయః; స్వస్థానవేషభాషాభిమతాః స్వస్థానే స్వదేశే యే వేషభాషే తయో రభిమతా అభిమానిన స్సన్తః; అన్య దన్యదేశభాషామయం కావ్య; మపహాయ పరిత్యజ్య; లోకే వైకృతకావ్యానిచ బహుమన్యన్తే బహూకరణపూర్వకం కుర్వన్త్యేవేత్యర్థః. ఆస్వాదపక్షే ఆద్రియన్త ఏవేత్యర్థః. సంస్కృతభాషాకావ్యనిర్మాణధౌరేయా అప్యాన్ధ్రదేశనివాసినః కవిచన్ద్రా అన్యదేశభాషాపరిచిత్యభావా త్స్వాచిత్సద్భావే ప్యభిమానాభావాచ్చ విహాయ మద్దేశభాషేయ మిత్యాన్ధ్రభాషామే వాద్యభాషామివ బహుమన్యన్తే బహుమన్యమానా స్తన్మయాని కావ్యాని బహూని కుర్వన్త్యేవ. వ్యవహారోపయోగిత్వేన పురుషార్థసాధనత్వేన చాభిమానాఽస్పదత్వేనాఽన్ధ్రభాషాకావ్యస్యాపి సత్కవీన్ద్రకర్తృకతా న విహన్యత ఇతి భావః.

వి:— ఆంధ్రదేశనివాసు లగుకవిశ్రేష్ఠులు సంస్కృతభాషామయకావ్యనిర్మాణసమర్థు లయ్యు నాంధ్రభాష తమకు దేశభాష యనునభిమానముచే నందుఁ గావ్యనిర్మాణమును గావించుచున్నారు. వ్యవహారోపయోగి యగుటచేతను, పురుషార్థసాధక మగుటచేతను దమ కభిమానాస్పద మగుటచేతను, నాంధ్రభాషాకావ్యమునకును సత్కవీంద్రకర్తృకత విరుద్ధము కాదని తాత్పర్యము.

5. సూ. 2 :- రసప్రలుబ్ధధియో రసైకాయత్తానుభవచిత్తాః పణ్డితా ఆన్ధ్రదేశవాసినో రసాఽస్వాద స్యాన్యదేశభాషాకావ్యపరిశీలనేనైవ నిర్వృత్తత్వేఽప్యన్యదేశ

భాషాకావ్య మనుభవాభావా దభిమానాభావాచ్చ పరిత్యజ్య మద్దేశభాషాకావ్యానీమానీతి సంస్కృతకావ్యానీవ వికృతికావ్యాన్యపి సమ్మాన్య తత్రాపి రసాఽస్వాదం కుర్వన్త్యేవేత్యర్థః. అతఏవ వ్యవహారోపయోగిత్వాదిగుణవిశిష్టత్వేన తత్రాపి తద్రసాఽస్వాదనలాలసతా న విరుధ్యత ఇత్యపరో భావః.

వి:- రసానుభవలాలసచిత్తు లగునాంధ్రపండితులు సంస్కృతభాషాకావ్యములయందు రసాస్వాద మొనరించుటచేఁ దృప్తిని జెందినను, అననుభూతము లగునన్యదేశభాషాకావ్యముల నభిమానము లేకుండుటచే విడిచి, స్వదేశభాషాకావ్యముల సమ్మానించి, సంస్కృతకావ్యములయందువలె వానియందును రసానుభవానందము నొందుచున్నారు. వ్యవహారోపయోగిత యనుమఱియొకగుణము దీనియందుండుటచే నచట రసాస్వాదనలాలసత కల్గుట విరుద్ధము కానేరదని మఱియొక యభిప్రాయము.

5. సూ. 3. :- 'రసప్రలుబ్ధధియో బహుమన్యన్తే' ఇత్యనేన రసజ్ఞానామేవ పణ్డితానాం స్వారసికప్రవృత్తి ర్నకేవలం తర్కకర్కశధియాం సుధియామపీత్యర్థో జ్ఞాప్యతే. తదుక్త మభియుక్తైః-

"రసప్రసరనిర్భరాః కవిగిరాం ప్రసారాః పరం
ముదం విదధతే హృది ప్రదిమభాజికావ్యామృతైః
సుధాకరకరాఙ్కురవ్యతికరేణ చన్ద్రోపలా
ద్రవన్తి శిశిరా శ్చిరాదపి న వన్ధ్యవిన్ధ్యోపలాః"-ఇతి.

వి:- "రసప్రలుబ్ధబుద్ధులు బహుమానించుచున్నారు"-అనుటచే రసజ్ఞు లగుపండితులకు మాత్రమే రసవత్కావ్యప్రవృత్తి కాని, కేవలము తర్కకర్కశబుద్ధు లగుపండితులకుఁ గాదని వ్యక్త మగుచున్నది. "కావ్యామృతముచే మృదుత్వమును జెందినసహృదయులహృదయములకే కవివాక్ప్రసారము లానందసంధాయకము లగును; మఱియొకయెడఁ గావు. చంద్రకిరణప్రసారముచేఁ జంద్రకాంతమణులు స్రవించును

గాని వింధ్యపర్వతమునందలిగండశిలలు కెంతసేపు చంద్రకిరణములు సోఁకి నను నవి యించుకయు ద్రవింపవు గదా—అని పెద్దలు వచించిరి.

6. సూ:— సిద్ధి ర్లోకా ద్దృశ్యా.

6. సూ. సిద్ధి రాన్ధ్రభాషాసిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకవ్యవహారా ద్ద్రష్టవ్యా; లోకవ్యవహారమూలేతి యావత్. లోకస్య తద్ధేతుత్వ మేవ ప్రతిపిపాదయిషతి.

వి:— ఆంధ్రకావ్యవ్యవహారయోగ్య మగుభాష నాంధ్రలోక వ్యవహారమునుండి సంగ్రహింపవలెను. లోకవ్యవహారము దాని కెట్లు మూలమో వివరింపఁబడును.

7. సూ. లోకోఽనన్యాదృశశ్చ నిత్యశ్చ.

7. సూ. 1 :— లోకః అనన్యాదృశః. అన్యాదృశో న భవతీ త్యనన్యాదృశః. అనన్యప్రకారః; ఏకరూప ఇత్యర్థః. నిత్యశ్చ భాషాకవితావర్త్యే నాఽప్రళయం వర్తమానః. తేన లోకా త్తత్సిద్ధి రిత్యర్థః.

వి :— ఈసూత్రమందలి లోకశబ్దమునకు సాదృశ్యరహితము నిత్యము నగులోకమే యర్థమని గ్రంథకర్తయాశయము. కవిపండిత లోకమే యట్టిలోకము. కవిపండితలోకవ్యవహారమునుండియే కావ్య భాష నిర్మింపఁబడునని తెలియుచున్నది. కవిపండితవ్యవహారము రెండు విధములు, కావ్యవ్యవహార మొకటి, రెండవది కావ్యేతరలోకవ్యవహారము. వారికావ్యేతరవ్యవహారమునుండియే కావ్యవ్యవహారము నిష్పన్న మగును. వారు తమలోకసామాన్యవ్యవహారమునుండి పదములను సంస్కరించి కావ్యమున నుపయోగింతు రని యర్థము. 'ప్రయోగమూలం వ్యాకరణమ్' అనుసభియుక్తోక్తి యందువలన నేబయలుదేరినది. కానఁ గావ్యభాషకే వ్యాకరణావశ్యకత కాని వాడుకభాషకుఁ గాదు.

7. సూ. 2 :- తస్మి లోకా త్తత్సిద్ధౌ సన్ద్రప్రయోజన మిదం శాస్త్ర మిత్యాశంక్యాహ.

వి:- లోకవ్యవహారమువలననే భాషాసంస్కారసిద్ధి కలుగునపుడీశాస్త్రమునకుఁ బ్రయోజనమే యుండదని శంకించి చెప్పుచున్నాఁడు.

8. సూ. సంస్కారార్థో నియమః.

8. సూ. I :- నియమో లక్షణం సంస్కారార్థః, సంస్కార శ్శబ్దశుద్ధిః. అర్థః ప్రయోజనం యస్య సః సంస్కారార్థః-వనముకు-రాముకు-ఇత్యాదిప్రయోగే ప్రాప్తే- నః కా-ఇత్యాదిశాస్త్రేణ 'న' కారవిధానపూర్వకం శబ్ద స్సంస్క్రియతే. తేన-వనమునకు-రామునకు-ఇత్యాదిప్రయోగ స్సాధుః. జననీ-కన్యా-ఇత్యాదీనాం హ్రస్వ ఏవ సాధుత్వమ్. లోకపాలాదిశబ్దానాం ర్వాఽదేశ ఏవ జస స్సాధుత్వమ్ - ఇత్యేవమాది సంస్కారార్థో నియమః. ప్రత్యయాదేశానాం లోకా త్సిద్ధత్వేఽపి వ్యవస్థా శాస్త్రేణ క్రియతే. బహ్వన్ధ్రస్యాపి సంస్కృతేన సమాసే ప్రాప్తే 'సంస్కృతపదేన పరిమిత మాన్ధ్రపదం కర్మధారయో భవతి' ఇతి శాస్త్రేణ వ్యవస్థా క్రియతే. అన్యథా బహ్వన్ధ్రస్య సంస్కృతేన సమాసే సంస్కృత స్యాన్ధ్రేణ సమాసే వా కోవా నివారయితా భవేత్? అత స్సంస్కారార్థత్వేన నియమ ఆవశ్యక ఇతి సిద్ధమ్.

వి:-కావ్యభాషాసిద్ధి తెనుఁగున లోకవ్యవహారమువలనఁ గలుగుచున్నదని సూత్రార్థము. అట్టియెడ నీనియమమునకుఁ బ్రయోజనము లేదని తెలియుచున్నది. అయినను నియమమునకుఁ (ఈవ్యాకరణమునకుఁ) బ్రయోజనము కలదని యీసూత్రము నిరూపించుచున్నది. నియమ శబ్దమునకు లక్షణమని యర్థము. లోకవ్యవహారమునం దున్నశబ్దములలో శాస్త్రీయము లగువిధులు కొన్ని ప్రవేశించుట జరుగును. మహాపండితకవులచే లోకమున వ్యవహరింపఁబడు భాషలో నయితము లక్షణ వైరుధ్యము పొడకట్టుచుండును. అట్టివి కావ్యములలోనికి రాకుండ నీలక్షణము నివారించును. ప్రమాదమువలనఁ గొన్ని ప్రవేశించిన వాని నీలక్షణము సంస్కరించును. కాఁగా లక్షణ మనునది కావ్యభాషకే యని స్పష్టము -'రాముకు' -'వనముకు' అనువానిని 'న'గాగమమును విధించి -'రామునకు' -'వనమునకు' అని సంస్కరించినది. -'జననీ' -'కన్యా' -అనువానిని -'జనని' -'కన్య' -అనురీతిని దీర్ఘమునకు హ్రస్వరూప సంస్కారమును గావించినది. మఱియు -'అనేకమాలులు'

-'అల్పదండులు' - అనుసంస్కృతాంధ్రపదములసమాసములను – "పరిమిత మగునాంధ్రపదము సంస్కృతముతోఁ గర్మధారయసమాసము నొందును" -అని వ్యవస్థచేయఁబడినది. ఇట్టినియమము లేకున్న -'దీపగంభములు' -'ముక్కంటిదేవుఁడు' – మున్నగునవియు సాధువు లగును. అట్టివానిని సంస్కరించుటకు నియమ మావశ్యక మగుచున్నది.

8. సూ. 2 – నను నియమో మా స్తు. తదభావే తాదృశప్రయోగోఽప్యస్తు. కో వా దోష ఇత్యాశఙ్క్యాహ.

వి:– నియమము లేకున్నఁ బోనిమ్ము; అది లేనపు డట్టినియమశూన్యప్రయోగ ముండిన నుండనిమ్ము; తప్పేమి? అని శంకించి చెప్పుచున్నాఁడు.

9. సూ :– అనియమా ద్గ్రామ్యం హి.

9. సూ. 1 :– హీతి ప్రసిద్ధౌ. అనియమా న్నియమాభావా త్పదం గ్రామ్యం భవేద్ధి.

వి:– 'హి' అనుదానికిఁ బ్రసిద్ధి యర్థము. శాస్త్రనియమమునకు లోఁగనిపదము గ్రామ్యం బగు ననువిషయము సుప్రసిద్ధమే కదా!

9. సూ. 2 :– గ్రామ్యత్వే కా హానిరితి శఙ్కావ్యాజేన గ్రామ్యాపభ్రంశశబ్దయోః పర్యాయకథనార్థ ముక్తమ్.

వి:– కావ్యప్రయుక్తపదము గ్రామ్య మైనంతమాత్రమునఁ దప్పేమియని శంకించుకొని యీమిషతో గ్రామ్యాపభ్రంశపదములు పర్యాయపదములని చెప్పుచున్నాఁడు. కాని యిది సరికాన ట్లనఁగా నన్నపార్యుని మతము కాన ట్లగపడుచున్నది.

10. సూ :– య త్త్వపభ్రంశః.

10. సూ. 1 :- య త్తు గ్రామ్యమేవ పద మపభ్రంశ ఇత్యుచ్యతే. అపభ్రంశపద స్యాపశబ్దపర్యాయత్వేన సిద్ధత్వా దుభయోః పర్యాయత్వకథనా ద్గ్రామ్యత్వ మపశబ్దత్వమితి. తన్నివారణార్థం నియమ ఆవశ్యక ఇతి భావః.

వి:- గ్రామ్యమైనపదమే యపభ్రంశమని చెప్పఁబడుచున్నది. అపభ్రంశపద మపశబ్దపర్యాయము. కాన గ్రామ్యతాఽపశబ్దతలును బర్యాయములే. అపభ్రంశతను వారించుట కీనియమ మవసరమని కవిశిరోభూషణాభిప్రాయము. "సంస్కారార్థో నియమోఽయమూ ద్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః" అని యేకసూత్రము చేసినచో "శబ్దసంస్కారముకొఱకు నియమము (శాస్త్రము) ఆవశ్యకము. నియమము లేకున్నచో శబ్ద మపభ్రంశరూపగ్రామ్య మగును" -అనియర్థము లభించును. -'అపభ్రంశరూపగ్రామ్య' -మనుటచే గ్రామ్య మనునది 'అపభ్రంశము, ప్రభ్రంశము' -అని రెండువిధములై యుండునని తోఁచుచున్నది. అపభ్రంశము=అపగతమైనభ్రంశము గలది; ప్రభ్రంశము=ప్రకృష్టమైన భ్రంశము గలది;- అని వానియర్థము. మహాకవి గ్రంథమునందుఁ బ్రయోగించినపదము శాస్త్రనియమమునకు లొంగకున్నను దానిని దప్పని చెప్పరాదు. అదియే యపభ్రంశగ్రామ్యము. మిగిలినది యనఁగా నియమవిరుద్ధమై లోకవ్యవహారమున విలసిల్లునది ప్రభ్రంశగ్రామ్యము. ఈయర్థము నథర్వణాచార్యులుగారు వివరింతురు.

10. సూ 2 :- అత్రేదం తాత్పర్యమ్. ఆన్ధ్రభాషాకావ్యనిర్మాణే కవయః ప్రతియుగం ప్రవర్తన్త ఇత్యుక్తమ్. తథా చ తద్గతశబ్దానాం గ్రామ్యతాపరిహారాయ గ్రామ్యాగ్రామ్యవిభాగపరం వ్యాకరణ మేతదావశ్యకమేవ. - "తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కదంచన। స్యాద్వపు స్సున్దరమపి శ్విత్రేణైకేన దుర్భగమ్. గౌర్గౌః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః। దుష్ప్రయుక్తా పున ర్గోత్వం ప్రయోక్తు స్సైవ శంసతి" - ఇత్యాద్యభియుక్తోక్తిభి రపశబ్దత్వసౌశబ్ద్యయో స్త్యాజ్యోపాదేయతాప్రతిపాదనాత్.

వి:- మహాకవిప్రయుక్తమునందలి శబ్దగ్రామ్యతను దొలఁగించుటకు గ్రామ్యాగ్రామ్యవిభాగపర మగునీవ్యాకరణ మావశ్యకమే. -"కావ్యగతదోష మల్పమైనను దాని నెంతమాత్రము నుపేక్షింపరాదు, మిగుల సుందర మగుశరీరమందుఁ జిన్నబొల్లి యున్నచో

నాసొగసు చెడినట్టి సుందరకావ్యమందు గ్రామ్యదోషముచే సొగసు చెడును గదా! గోశబ్దమువలె వాక్యమును ధేను వనియు పర్యాయవాక్కు సుప్రయుక్తమైనచో బాగుగ లాలింపబడుచున్న గోవువలెఁ గోర్కులిడఁ బడునను —అని పెద్దలు చెప్పిరి. దుష్ప్రయుక్తమైనచో నాశబ్దమే ప్రయోక్తకు గోత్వముఁ (పశుత్వమును) జెప్పుచున్నది” —అని పెద్ద లపశబ్దసాధుశబ్దములకు హేయోపాదేయతలను జెప్పిరి.

10 సూ. వి:- అత్ర వార్తికశ్లోకమ్ :-
“శ్రుతేఽపశబ్దే చోక్తే వా ప్రమాదాత్పాణినిం స్మరేత్ ।
అథవా ఫణినాథం చిన్తయేద్బహుశో బుధః” -

అత్ర శ్లోకే “సంస్కృతభాషాయామ్” — ఇతిన్యస్తపదాధ్యాహారేణ పదయోజనా.

“ప్రాకృతే షడ్విధే చాపి వాల్మీకిం వా మహేశ్వరమ్ ।
ధ్యాయే దంధ్రే తు నావేవ స్మరే త్పణ్డితసత్తమః” ఇతి.

వి:— “సంస్కృతభాషయం దపశబ్దము ప్రమాదవశమున విన్నను బలికినను బుడితెలుఁగు పాణినిమునిని స్మరింపవలెను; లేదా పతంజలిని స్మరింప వలయును. అట్లే షడ్విధప్రాకృతమునందును బ్రమాదవశమున శ్రవణవాచనములు జరిగినయెడల వాల్మీకిమునిని గాని మహేశ్వరుని గాని తలంప వలెను. తెనుఁగునం దట్టివి సంభవించినపుడు పండితసత్తముఁడు మమ్మే (నన్నయాథర్వణులనే) స్మరింపవలయును” —అని యథర్వణగ్రంథమున కర్థము. —“ధ్యాయే దంధ్రేతు నావేవ”—అనుట యుక్తమనియు, ‘మామేవ’ అనుపాఠము ప్రక్షిప్తమనియు, వ్యా. సం. స. చెప్పినది. నన్నపార్యుని కారికలకు వివరణమును వ్రాయునథర్వణుఁడు ‘మామేవ’ అని యహంకారముతోఁ జెప్పెననుట నమ్మఁదగినది కాదు. ఆంధ్రగ్రాంథికభాషయం దపశబ్దశ్రవణము చేసినను వచించినను మ మ్మిద్దఱినే (నన్నయాథర్వణులనే) స్మరింపవలెననియర్థము. వారిని స్మరింపవలెననఁగా వారు వ్రాసినవ్యాకరణములను బరిశీలించి యాయపశబ్దతను దొలఁగించుకొనవలె నని తాత్పర్యము.

10. సూ. 4 :- నచ వాచ్యం కవిప్రయుక్తమేవ పదం ప్రయుంజానైః కవిభిరేవాసాధుప్రయోగః పరిహ్రియత ఇతి శాస్త్రస్య ప్రయోజన మదృష్టమితి, క్వాచిత్ప్రయుక్తేష్వపి స్ఖలనదర్శనాత్. అయం సాధు రయ మసాధు రితి విభాగేఽ శాస్త్రజ్ఞస్యాసమర్థత్వాత్. అత ఏవోక్తం దణ్డినా "గుణదోషా వశాస్త్రజ్ఞః కథం విభజతే నరః। కి మన్ధ స్యాధికారోఽస్తి రూపభేదోపలబ్ధిషు".

వి:— "కవిప్రయుక్తపదప్రయోగము గావించుకవులె యసాధుప్రయోగమును బరిహరింతురు. అట్టిచో నీశాస్త్రమునకుఁ బ్రయోజనమగపడదు" అనియందురేమో— ప్రయుక్త మైనవానిలోఁ గొన్నిటియందు దోషము లగపడుటచేతను, శాస్త్రజ్ఞానము లేనివాని కిది సాధువు నిది యసాధువు నను తెలివి యుండదు కావునను మీ రట్లనుటకు వీలు లేదు. "అంధునకు రూపభేదమును నిరూపించుశక్తి లేనట్లే శాస్త్రజ్ఞానహీనునకు గుణదోషవిభాగము చేయుశక్తి యుండదు"అని దండికవియు నుడివెను.

10. సూ. 5 :- ఏవం చానాన్ధ్రాపశబ్దస్యే వాన్యాపి కవిప్రయోగానర్హత్వప్రయుక్తం నాపశబ్దత్వమ్. తస్య చణ్డాలయవనాదౌ వినియోగదర్శనాత్. ప్రయోగానర్హత్వే నాపశబ్దత్వ మస్తు. ఏతద్భాషాయాస్తు శిష్టపరిగృహీతత్వేన న తాదృశ మపభ్రంశత్వమ్. కిన్తు గ్రామ్యత్వే నాపభ్రంశత్వం స్యాత్. తత్తు నియమేన నివార్యత ఇతి.

వి: — అనాంధ్రాపశబ్దమునకువలె నాంధ్రాపశబ్దమునకుఁ గవిప్రయోగానర్హత్వరూపాపశబ్దత లేదు. దేశ్యభాష ప్రవాహరూపము కలదిగదా! దానిని జండాలయవనాదిపాత్రలకు వినియోగింపవచ్చు నని చెప్పఁబడినది. ప్రయోగానర్హ మగుటచే దాని కపశబ్దత యుండుఁ గాక; ఆంధ్రభాషను శిష్టులు పరిగ్రహించుటవలన దీని కది లేదు. గ్రామ్యత యున్నను నియమముచే నది వారింపఁబడును.

ప్రభ్రంశగ్రామ్యమనియు, నపభ్రంశగ్రామ్యమనియు గ్రామ్యము రెండు విధములుగదా! అపభ్రంశగ్రామ్యమునకుఁ బ్రయోగానర్హత లేదని నన్నయాథర్వణులమత మైన ట్లగపడుచున్నది.

10 సూ. 6. అతఏవాథర్వణో నోక్తమ్—

సమ్మూలవత్త్వా ద్దూషత్వా ద్గృహీతత్వా చ్చ సాధుభిః।
నాపభ్రంశత్వ మేతస్య నియమాభావతస్తు తత్॥
నివారణాయ తస్యైవ ప్రవృత్తిర్వ్యాకృషా మభూత్।
తదర్థమేవ హి వయం భూయసా ప్రయతామహే॥
కవితోపాశ్రితం దోషం నైవ కిఞ్చిత్సహామహే — ఇతి

వి:— 'కవితోపశ్రుతం దోషం నైవ కిఞ్చిత్సహామహే' అని పాఠాంతరము. కవితోపశ్రుతమ్ = కవితయందు వినఁబడిన, "కవితోపాశ్రితమ్ = కవిత నాశ్రయించిన" అనియర్థము. భావమున భేదము లేదు. "పండితకవీంద్రులమూలమున వ్యక్తమగుటచేతను, లోకరూఢమగుటచేతను, మహాపండితకవీంద్రులు దీనియందుఁ గావ్యములను వ్రాయుటచేతను దెల్గుభాష కపశబ్దత లేదు. వ్యాకరణనియమము లేకున్నచో దాని కట్టియపశబ్దత సంభవింప వచ్చును. దానిని వారించుటకే పెక్కుఱు మహాపండితులు యత్నించిరి. మేమును (నన్నయాథర్వణులు) భాషావిషయకాపశబ్దదోషనివారణముకొఱకు మిగుల యత్నించుచుంటిమి. కవితయందపశబ్దదోష మగపడినచో మేము సహింపఁ జాలము. దానిని వారించుటకు వ్యాకరణనిర్మాణయత్నము కావించితిమి" అని యథర్వణవచనార్థము. అథర్వణవచనమున సూచింపఁబడిన యపభ్రంశశబ్దమున కపశబ్దమని యర్థము. ఇతనికాలమున కాయర్థమును బండితులు చెప్పిరని తోఁచుచున్నది. 'అనియమా ద్గ్రామ్యం హి యత్త్వపభ్రంశః' అనుచింతామణియందలి—'హి'—'తు' —అనుశబ్దములనుబట్టి చింతామణి —'అపభ్రంశ' —'ప్రభ్రంశ' —శబ్దములయర్థమును సూరిగా రర్థముచేసినట్లు నరుసగా ననింద్యగ్రామ్యనింద్యగ్రామ్యములయర్థమున నుపయోగించినట్లు చెప్పరాక తప్పదు. సూరిగారీవిషయమును "లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు" (బాల. సంజ్ఞ. 22. సూ) "ఆర్యవ్యవహారంబుల దుష్టంబు గ్రామ్యంబు" (బాల. సంజ్ఞ. 23. సూ) అని చెప్పిరి. సూరి

గారు సూత్రించినయీగ్రామ్య మపభ్రంశగ్రామ్యముకాని ప్రభ్రంశగ్రామ్యము కాదు. ప్రౌఢవ్యాకర్త యీసూత్రమ్మువిషయము నాలోచింపక సామాన్యకవులప్రయోగము ననుసరించి యథర్వణకారికను "గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణసంబునం బ్రయోగార్హంబు (ప్రౌఢ. సంజ్ఞ. 12. సూ) అని వ్రాసెను.

10. సూ. 7. నను సంస్కృతప్రాకృతయో రార్షత్వేన ప్రామాణ్యమ్. నన్నయాథర్వణయో రిదానీంతనకవిమాత్రత్వేన కథం తత్ప్రణీతయోః ప్రామాణ్యం స్యాత్. కథన్ను తదనుసారేణ కావ్యనిబన్ధనం భవేత్? కిఞ్చానుశాసన స్యేదానీంతనత్వేన కుత స్తరాం ప్రాచీనాః కవయః కావ్యనిర్మాణే ప్రావర్తన్త ఇతిచే న్నైవం మంస్థాః; తయోరపి ఋష్యంశసమ్భూతత్వాత్. తథాహి నానృషేఃకావ్యకరణధుర్యత్వం సమ్భవత్యేవ ఖలు. "నానృషిః కురుతే కావ్యమ్" ఇత్యభియుక్తోక్తేః—అనితరకవిసాధారణ వ్యాకరణనిర్మాణపటుతయా పణ్డితకవీన్ద్రప్రథమగణ్యత్వేన చ పరిప్రాప్తం సార్వజ్ఞ్యం తయో రధునాతనత్వమాత్రేణ కథం నివార్యేత?

వి:- ఋషిప్రోక్తము లగుసంస్కృతప్రాకృతవ్యాకరణములకుఁ బ్రామాణ్య ముండవచ్చును. నేఁటి కవిమాత్రు లగునన్నయాథర్వణులచేఁ బ్రణీతము లగువ్యాకరణములకుఁ బ్రామాణ్యము కల్గు టెట్లు? తదనుసారముగఁ గావ్యనిబంధన మెట్లు జరుగనగును? ఈయనుశాసన మిప్పటిదే యగుటచేఁ బ్రాచీనకవులు కావ్యనిర్మాణమునం దెట్లు ప్రవర్తించిరి?—అని శంకింతురేమో? నన్నయాథర్వణులును ఋష్యంశము కలవా రగుటవలన నట్టిశంక కవకాశము లేదు. "నా నృషిః కురుతే కావ్యమ్"—అనువచనముచే ఋషి కానియతనికిఁ గావ్యకరణశక్తి కల్గదని తెలియుచున్నది గదా! మఱియు నితరులకు శక్యముకానివ్యాకరణనిర్మాణముచేయుటచేతను బండితకవీంద్రులలో మొదటివా రగుటచేతను సంప్రాప్తించినసర్వజ్ఞత యధునాతను లయినంతమాత్రమున వారినుండి తొలఁగునా?

10. సూ. 8. అతఏవ బ్రహ్మా దేవానాం పదవీః కవీనామ్-ఇత్యుపనిషదే వచనే పదజ్ఞస్య విశిష్యైశ్వర్యసత్తా ప్రతిపాదితా. కిఞ్చ యది తయో రసాధారణవైదుష్యం న స్యాత్తర్హి వాగనుశాసనకవితామూలకన్దనామ్నా వ్యవహారః కుత స్సిద్ధ్యేత్? కథం నామ తద్వచనం పాణిన్యాదివచనమి వాభియుక్తసముదాయగ్రాహ్యం స్యాత్? తద గ్రాహ్యత్వే కథ మభియుక్తకావ్యాని తద్వచనానుసారీణి భవేయుః?

వి:- వ్యాకరణశాస్త్రజ్ఞున కీశ్వరవిభూతి యుండునని - "బ్రహ్మా దేవానామ్" -అనునుపనిషద్వాక్యము విశేషించి చెప్పుచున్నది. అసాధారణవైదుష్యము లేకున్నచో వారికి -'వాగనుశాసన' మున్నగు ప్రసిద్ధి యెట్లు కల్గును? వారివచనముల నభియుక్తులు పాణిన్యాదివచనములవలె నెట్లు గ్రహింతురు? అట్లు గ్రహింపనిచో మహాకవులకావ్యములు వారివ్యాకరణముల నెట్లనుసరించును?

10. సూ. 9 :- న చ వ్యాకరణ స్యేదానీంతనత్వమేవ, యేన వా ప్రాచీనప్రబన్ధౄణాం కావ్యనిర్మాణే ప్రవృత్తి ర్నస్యాత్; కిన్తు ప్రాగ ప్యనుశాసనస్య సత్త్వాత్. అతఏవ శబ్దశాసనేన స్వగ్రన్థే "కవిభల్లటైః క్రియాణామ్" "ముఖ్యప్రాచామ్" "దుశీత్యన్యే" "విదుః కేచిత్" ఇత్యాదిసూత్రై ర్బహవః ప్రాచీనాచార్యాః ప్రకాశితాః. ఆథర్వణగ్రన్థేఽపి పురాతనాన్ధ్రశిక్షకాః కవిశిఖామణ్యాదయః కథితాః. యథా పాణినీయే "లోప శ్శాకల్యస్య" "ఋతో భారద్వాజస్య" "గురో రనృతోఽన న్త్యస్యాప్యేకైకస్య ప్రాచామ్" ఇత్యాదౌ. తత్ప్రథమప్రవక్తృవ్యపదేశస్తు ఖిలకవితానుశాసనయోరాజనాఽపేక్షయేతి జ్ఞేయమ్.

వి:- వ్యాకరణము ప్రాచీనమైనదే కాని యిప్పటిది కాదు. అట్లు కానిచోఁ బ్రాచీనప్రబంధకర్తలు ప్రాచీనకావ్యముల నెట్లు నిర్మించిరి? ప్రాచీనకాలమున నాంధ్రానుశాసనము లున్నవి. కావుననే చింతామణి కవిభల్లటుఁడు మున్నగుప్రాచీనాచార్యులను బేర్కొనినది. అథర్వణాచార్యుఁడును కవిశిఖామణి మున్నగుప్రాచీనాచార్యులను బేర్కొనెను. పాణినీయమునను శాకల్యుఁడు మున్నగువారు పేర్కొనఁబడిరి గదా; అయినచోఁ బాణిని నన్నయలు సంస్కృతాంధ్రవ్యాకరణము

లకుఁ బ్రథమప్రవక్తలనుట యెట్లని శంకింపరాదు. ఖిలమైనవ్యాకరణ ములను బునరుద్ధరించుటచే వారి కట్టిప్రసిద్ధి కల్గినదని యూహింప వలయును.

వ్యాకరణము శాస్త్రము. ఇది యనాదిసిద్ధమే కాని కవికల్పితము కాదు. ప్రాచీనసిద్ధాంతములను గ్రంథకర్త తనమాటలతోఁ జెప్పుచుండును. —"శాస్త్ర మపౌరుషమ్" —అనుదాని కిదే యర్థము. అపౌరుషేయమన నిదియే. ఇవి యేకకర్తృకములు కాక పెక్కుఱు మేధావులచే నూహింపఁబడుచు స్థిరపడుచుండును.

10. సూ. 10 :- నను "ఉతత్వః పశ్య న్న దదర్శ వాచ ముతత్వ శ్శృణ్వ న్న శృణో త్యేనామ్। ఉతత్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసా" ఇతి మన్త్రేణ పూర్వార్ధే శబ్దానభిజ్ఞనిన్దా ఉత్తరార్ధే తదభిజ్ఞప్రశంసా చ క్రియతే. త్వః కశ్చి ద్వాచం పశ్యన్నుత పశ్యన్నేవ న దదర్శ. కశ్చి దేనాం శృణ్వన్నపి న శృణోతి। ఉశతీ కామయమానా సువాసా జాయా పత్య ఇవ వాక్త్వస్మై కస్మైచిత్తన్వం స్వతనుం విసస్ర ఉతో వివృణో త్యేవేత్యర్థావగతేః. ఏవమాదిశ్రుతీనాం "ఏకః శబ్దః స్సమ్యగ్జ్ఞాత స్సుష్ఠుప్రయుక్త స్స్వర్గే లోకే కామధు గ్భవతి" ఇత్యాదిస్మృతీనాఞ్చ ధర్మాధర్మ ఫలకఋశబ్దాపశబ్దప్రయోగస్తుతినిన్దాపరాణాం విద్యమానత్వాత్. శబ్దసాధుత్వా సాధుత్వవివేచనపరం సంస్కృతవ్యాకరణం సమూలశ్రుతికమితి ప్రామాణ్య మశ్నుయాత్. ఏతద్వ్యాకరణస్య మ్లేచ్ఛేన ప్రతిపాదితత్వేన కథం మూలశ్రుతి స్స్యాత్. కథంతరాం తదభావే ప్రమాణ ముపపన్నం స్యాత్. న చ న్యాయవైశేషికయోరివ తదభావేఽపి ప్రామాణ్య మితి వాచ్యమ్. పదవాక్యవిచారస్య "స్వాధ్యాయోఽధ్యేతవ్యః"— ఇత్యధ్యయనవిధ్యధీనత్వా ద్వ్యథా సమూలత్వం తద్వ ద్వేదార్థవిచారస్యాపి తదధీనత్వ మేవేతి తదాత్మకయో స్తయోరపి సమూలత్వం నిర్విచికిత్సిత మేవ. అతఏవైతద్వ్యాకరణ స్యాధ్యయనవిధ్యధీనత్వాభావేన సమూలత్వాభావా త్ప్రామాణ్యం న సమ్భవత్యేవేతి చే న్నైవమ్.

వి:- త్వః=ఒకానొకఁడు, వాచం=వాక్కును, పశ్యన్నుత= చూచుచున్నవాఁడయ్యు నదదర్శ=చూడఁడు. త్వః=ఒకానొకఁడు ఏనాం=దీనిని, శృణ్వన్నుత=వినుచున్నవాఁడయ్యు, నశృణోతి=వినఁడు

ఉశతీ=కామించుచున్న, సువాసాజాయా=శుభ్రవసనములను ధరించిన భార్య, పత్యేఇవ-తనభర్తకువలె, నీవాక్కును-త్వస్మై=ఒకానొకనికి, తన్వం=తనశరీరమును, విసస్రేఉశ=వ్యక్తపఱచుచున్నది -అనునీమంత్ర మునందుఁ బూర్వభాగమున శబ్దశాస్త్రము నెఱుఁగనివానినిందయు, రెండవభాగమున దాని నెఱింగినవాని స్తుతియుఁ జేయఁబడినవి. శబ్ద శాస్త్ర మెఱింగినవానికిఁ గావ్యార్థము చక్కఁగాఁ దెలియుననియు, దాని నెఱుఁగనివానికిఁ గావ్యార్థము దెలియదనియుఁ దాత్పర్యము. ప్రియునకుఁ బ్రియురాలు వశపడినట్లు పదశాస్త్రజ్ఞునకు వాక్కు వశ పడునని భావము -"శబ్దస్వరూపము బాగుగ నెఱింగి ప్రయోగించినచో నది యిహపరలోకములయందు సమస్తకోర్కులను దీర్చును"-అని "ఏక శ్శబ్దః" -అనుస్మృతి చెప్పుచున్నది. దీనినిబట్టి సుశబ్దప్రయోగము చేయఁగుననియు నపశబ్దప్రయోగము చేయరాదనియుఁ దాత్పర్యము. శబ్దసాధుత్వాసాధుతలను జెప్పుసంస్కృతవ్యాకరణము నకు మూలశ్రుతి కలదు గాన దానికిఁ బ్రామాణ్యము కలదనియు, నీ తెల్గువ్యాకరణము మ్లేచ్ఛప్రతిపాదితమగుటచే దీనికి మూలశ్రుతిప్రామాణ్యము లేదనియు, నట్లై నను దీనికి న్యాయమై శేషికములకువలెఁ బ్రామాణ్య ముండుననియు నందురేమో-అట్లనరాదు. "స్వాధ్యాయము నధ్యయనము చేయ వలెను" - అని చెప్పుశ్రుతి పదశాస్త్రమునకు వలె న్యాయమై శేషిక శాస్త్రములకును మూల మగుచున్నది గదా! 'ఈ తెల్గువ్యాకరణ మధ్యయనవిధి కధీనము కాదు గావున దీనికి మూలశ్రుతి లేదు. కాన దీనికిఁ బ్రామాణ్యము లేదు" అనియు ననరాదు.

10. సూ. 11 :- ప్రాకృతాన్ధ్రయో ర్నాస్త్యేవ మ్లేచ్ఛత్వ మన్యదేశభాషావ దిత్యుక్తమ్. తథాచాస్యాపి మూలశ్రుతిసద్భావ స్సూపపాదఏవ. కావ్యవిషయధర్మా ధర్మఫలకసుశబ్దాపశబ్దప్రయోగావలమ్బిస్తుతినిన్దయో రభియుక్తపరంపరయా ప్రతిపాది తత్వాత్. న చాపశబ్ద శ్రుతివిరోధః. తస్య క్రతుమాత్రవిషయత్వేన నియతత్వా మిత్యు క్తత్వాత్. నన్వేవమపి హోలాకాధికరణం విరుధ్యేదితిచే న్మైవమ్. తత్ర స్మృతీనాం

సాధారణ్యేనాఽచారవిధాయకత్వాత్. నచ విశేషవిషయశ్రుతికల్పనా సమ్భవతి. శ్రుతికల్పనస్య స్మృత్యధీనత్వాత్. అనుమానేన స్మృతికల్పనాపి న సమ్భవతి. "బ్రాహ్మణో బృహస్పతిసవేన యజేత" ఇత్యాదావివ జాత్యాదేరసమ్భవా దిత్యాదిదూషణ ముపన్యస్య హోలాకాద్యాచారాణాం న శ్రుతిమూలకత్వ మితి ప్రతిపాదితం జైమినీయే. అత్ర తు న తథా. విశిష్య స్మృతే స్సత్వాత్. తదనుసారేణ శ్రుతికల్పనస్య నిర్బాధత్వాత్. కిఞ్చ హోలాకాధికరణం శబ్దప్రయోగాచారవ్యతిరిక్తవసంతోత్సవాద్యాచారవిషయక మేవేతి న తన్న్యాయో ఽత్ర ప్రవర్తత ఇత్యపి సువచమ్.

వి:— ప్రాకృతాంధ్రముల కన్యదేశభాషలకు వలె మ్లేచ్ఛత లేదు గదా! దానికిని మూలశ్రుతిసద్భావము చూపవచ్చును. కావ్యమున సుశబ్దప్రయోగముచే ధర్మము ఫలించి యాశబ్దము స్తుతింపఁబడుననియు, నపశబ్దము ప్రయోగింపఁబడిన నధర్మము ఫలించి నిందింపఁబడుననియుఁ బెద్దలు చెప్పిరి గదా! అయినను నపశబ్దప్రయోగము శ్రుతివిరుద్ధము కాదు. అపశబ్దము క్రతుమాత్రమునఁ బ్రయోగింపరా దనుట నియతమని ప్రతిపాదింపఁబడినది. అట్లు చెప్పిన హోలాకాధికరణము విరోధించు నందురేమో? అచటిస్మృతు లాచారాధీనములు. విశేషవిషయముగ శ్రుతికల్పనము చేయుటయు నిట సంభవింపదు. శ్రుతికల్పనము స్మృత్యధీనము గదా! అనుమానప్రమాణముచే శ్రుతికల్పనము చేయుటయు సంభవింపదు. "బ్రాహ్మణో బృహస్పతిసవేన యజేత" మున్నగువానియందు వలె 'జాత్యాదికము సంభవింపదు' మున్నగుదూషణముల నుపన్యసించి హోలాకాద్యాచారములు శ్రుతిమూలకములు కావని జైమినీయమునందుఁ బ్రతిపాదింపఁబడినది. ఇది యట్టిది కాదు. ఇట విశేషస్మృతి కలదు. తదనుసారముగ శ్రుతికల్పనము నిర్బాధము. మఱియు హోలాకాధికరణము శబ్దప్రయోగాఽచారవ్యతిరిక్త మగు వసంతోత్సవాద్యాచారవిషయమే కాన నాన్యాయము నిట ప్రవర్తింపఁ జేయకుండుట మంచిది.

10. సూ. 12 :- నను దేశభాషాకావ్యస్యాగ్రామ్యస్యాపి ప్రత్యవాయజనకతా సమ్భావితేతి చేన్నైవమ్. తథాత్వే నాన్నయాథర్వణాపేక్షయాపి ప్రాచీనానాం తదనుశాసనే ప్రవృత్తానాం కవిభల్లటాదీనాం బహూనాం శిష్టానాం ప్రయాసస్య వైఫల్యాఽఽపత్తేః. ద్రవిడభాషానుశాసనే ప్రవృత్తస్య సర్వజ్ఞాగ్రసరస్యాగస్త్యమహామునేః ప్రాకృతవ్యాకరణనిర్మాణే ప్రయత్నవతో భగవతో వల్మీకసమ్భవమహర్షిశిఖామణేశ్చ సర్వజ్ఞత్వస్యాప్రయోజకత్వాపాతాచ్చేత్యలమ్.

వి:- దేశభాషాకావ్య మగ్రామ్యమైనను ప్రత్యవాయజనకమే యగునని చెప్పరాదు. అదే నిజమైనయెడల నన్నయగారికంటెఁ బ్రాచీనులైనకవిభల్లటాదులు తదనుశాసనరచన కుపక్రమించినారుగదా! వారి ప్రయాసము వ్యర్థము కాదా! మఱియు ద్రవిడభాషాఽనుశాసన కర్త యగుసర్వజ్ఞమూర్తి యగస్త్యమహామునియొక్కయుఁ, బ్రాకృత వ్యాకరణనిర్మాత వాల్మీకిమహామునియొక్కయు సర్వజ్ఞతకు భంగము వాటిల్లును గదా! దేశభాషాకావ్యములు మ్లేచ్ఛము లనువారికి సమాధానముగాఁ బై విషయములు ప్రస్తావింపఁబడినవి.

10. సూ. 13 :- వస్తుతస్తు వాఙ్మాత్రానుశాసనస్య బ్రహ్మజన్యత్వమేతేనాన్ధ్రభాషాతదనుశాసనయో ర్బ్రహ్మకారణత్వమేవ "యతో వా ఇమాని భూతాని జాయన్తే, సోఽద్భ్య ఏవ పురుషం సముద్ధృత్యామూర్ఛయ త్తమభ్యవద త్తస్యాభితప్తస్య ముఖం నిరభిద్యత. తథా తస్మాన్ముఖా ద్వాచోఽగ్నిః స యథార్ద్రైధాగ్నే రభ్యాహితస్య పృథగ్ధూమాది వినిశ్చర న్త్యేవం వా ఽరేఽస్య మహతో భూతస్య నిశ్శ్వసితా దృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వాఙ్గిరస ఇతిహాసః పురాణం విద్యా ఉపనిషద శ్శ్లోకా స్సూత్రా ణ్యనువ్యాఖ్యానా న్యస్యైవైతాని సర్వాణి నిశ్శ్వసితాని-జన్మాద్యస్య యతః—శాస్త్రయోనిత్వాత్-న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్" ఇత్యాదిక మత్ర మానమ్.

వి:- నిజమునకు వాక్కులు తదనుశాసనములును బ్రహ్మజన్యములే యగుటవలన నాంధ్రభాషకుఁ దదనుశాసనమునకు బ్రహ్మమే కారణమని చెప్పవలయును. ఈవిషయము "యతో వా" మున్నగు

గ్రంథములవలన విదిత మగుచున్నది కానసీశ్వరుఁడే యన్నింటికిని గర్త యనక తప్పదు.

10, సూ. 14 :- అతఏవ బ్రహ్మ మాయాశబలమ్. తదేవ సర్వకార్యోపాదానమ్ తత్ర ప్రకృతిసమసత్తాకత్వాత్ప్రకృతేః పరిణామః. బ్రహ్మసమానసత్తాకత్వాద్బ్రహ్మణో వివర్తః ప్రపఞ్చః. కారణసమసత్తాకోఽన్యథాభావః పరిణామః. తదసమసత్తాకోఽన్యథాభావో వివర్తః-ఇతి వివర్తపరిణామయో ర్భేదః-ఇత్యౌపనిషదః పన్థాః. ఏవం వ్యాసాదీనామివ శబ్దశాసనాదీనా మపిహేతుత్వమాత్ర మేవేతి నాస్యవ్యాకరణస్య వ్యావహారికాప్రామాణ్యశఙ్కాఙ్కురస్యాపి ప్రసక్తి రిత్యలం విస్తృత్యేన.

వి:- మాయతోఁ గూడినబ్రహ్మము సృష్టి కంతటికి నుపాదానకారణము. అందుఁ బ్రకృతి సమానసత్త కలది కావునఁ బ్రకృతియొక్క పరిణామము ప్రపంచము. బ్రహ్మసమానసత్త కలది కావున బ్రహ్మమునకుఁ బ్రపంచము వివర్తము. కారణముతో సమానసత్త కల్గిమఱి రూపముతోనుండుట పరిణామము. కారణసమసత్త లేక మఱియొకరీతిని మాఱుట వివర్తము. పరిణామవివర్తములకు భేద మిది. ఇది యుపనిషన్మార్గము. కాన వ్యాసాదులవలె నన్నయాదులును కేవల నిమిత్తమాత్రులే కాని స్వతంత్రకర్తలు కారని దీనింబట్టి తేలినది. కాఁబట్టి యీ తెల్గు వ్యాకరణమునకప్రామాణ్యశంకాంకుర మైనను లేదు. దీని కివిస్తృతి చాలును.

10 సూ. 15 '- ప్రకృత మనుసరామః. ఆలఙ్కారికాస్తు గ్రామ్యత్వ మన్యథోచుః. తదుక్తం దణ్డ్యాఽచార్యేణ – "కామం సర్వోప్యలఙ్కారో రస మర్థే నిషిఞ్చతు। తథాఽప్యగ్రామ్యతైవైనం భారం వహతి భూయసా. కన్యే కామయమానం మాం త్వం న కామయసే కథమ్। ఇతి గ్రామ్యోఽయ మర్థాత్మా వైరస్యాయైవ కల్పతే. కామం కన్దర్పచణ్డాలో మయి వామాక్షి నిర్దయః. త్వయి నిర్మత్సరో దిష్ట్యేత్యగ్రామ్యోర్థో రసావహః, శబ్దేఽపి గ్రామ్యతాస్త్యేవ సాసభ్యేతరకీర్తనాత్। యథా యకారాదిపదం రత్యుత్సవనిరూపణే. పదబన్ధానువృత్త్యా వా వాక్యార్థత్వేన వా పునః। దుష్ప్రతీతికరం గ్రామ్యం యథా యాభృతః ప్రియా ఖరం ప్రహృత్య విక్రాన్తః పురుషో వీర్యవానితి. ఏవమాదీని శంసన్తి మార్గయో రుభయోరపి। భగినీ భగవత్యాది సర్వత్రైవానుమన్యతే" - ఇతి. ఉభయోర్మార్గయో ర్గౌడీవైదర్భిమార్గయో రిత్యర్థః. -

"పామరాదిప్రయుక్తం యత్తద్గ్రామ్యమభిధీయతే"– ఇతి గ్రామ్యపదస్య లక్షణముక్త్వా గల్లాదయశ్శబ్దా గ్రామ్యా ఇత్యూచుః కేచిత్. గల్లశబ్దో గణ్డశబ్దపర్యాయత్వేన పామరైః ప్రయుజ్యత ఇత్యేకే. ప్రాకృతవ్యాకరణనిష్పన్నత్వేఽపి తస్యాద్యభాషామధ్యే ప్రయోగో గ్రామ్యత్వం జనయతీతి కేచిదాహుః.

వి :– ఇందు శబ్దార్థోభయగ్రామ్యత చెప్పఁబడినది. సంస్కృతాలంకారికులు వానిం జెప్పియున్నారు. తెనుఁగునకును వాని పరిజ్ఞానమవసరమే. అట్టిగ్రామ్యత లేకుండఁ గావ్యరచనము సాగింపవలసియున్నది. పామరాదులకుఁ గావ్యములలోఁ బ్రయోగింపఁబడెడు భాష గ్రామ్య మగును. ఇది యపభ్రంశగ్రామ్యముగదా! కావ్యప్రతిపాద్యములగునలంకారము లన్నియు రసపరిపోషణమును గావించుచున్నను గ్రామ్యదోషవివర్జితము లని కావలెను. – ఓ కన్యా ! నిన్ను నేను గామించుచున్నను, నీ వేల నన్నుఁ గామింపవు" – అనునిది యర్థగ్రామ్యము. ఇట్టివి కావ్యములలో నుండరాదు. – "వామాక్షి ! మన్మథహతకుఁడు నాయెడ నిర్దయుఁడైనను, నీయెడ మాత్రము మచ్చరముఁ జెందలేదు" – అనినచో రసావహము నగ్రామ్యము నగును. – "ఎవతె నీప్రియురాలు" – అనునర్థమున సంస్కృతభాషలో – "యాభవతః ప్రియా' – అని చెప్పినచో గ్రామ్య మగును. – 'యభమైథునే' – అను ధాతువుమీఁద –'యాభవత్' –శబ్దము నిష్పన్నమైనది. –అందు 'యాభవతః ప్రియా' – అనునర్థ మున్నను బదబంధానువృత్తిచే గ్రామ్యార్థప్రతీతి యింకుఁ గల్గుచున్నది. తెనుగులో – 'తూపుకు' – మున్నగునవి యిట్టివి. పైరీతిని బదబంధానువృత్తిచేఁ గాని, వాక్యార్థముగా – 'గాడిదమీఁదఁ బరాక్రమించినవాఁడు వీర్యవంతుఁడు' – అని వాక్యార్థముగాఁగాని దుష్ప్రతీతిని గల్గించునదియు గ్రామ్యమే. – 'భగిని' – 'భగవతి' – మున్నగునవి శబ్దగ్రామ్యములైనను బ్రయోగార్హములే – 'కావ్యములలో నీచపాత్రలకుఁ బ్రయుక్తమగునది యెల్ల గ్రామ్యమే'– అని లక్షణముఁ జెప్పి 'గండ'శబ్ద పర్యాయముగా 'గల్ల' శబ్దమును

ప్రయోగించుట గ్రామ్య మనుచున్నారు కొందఱు. అది ప్రాకృతవ్యాకరణనిష్పన్నమైనను దానిని గావ్యములలోఁ బ్రయోగించుట గ్రామ్య మనుచున్నారు కొందఱు.

**11. సూ. ఆద్యః ప్రకృతిః ప్రకృతి శ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః।**
**కేవలతయాఽనుసర్ప త్యుభే చ యేయం యథాతథం భాషా॥**

**11. సూ. 1 :-** సర్వభాషామూలకత్వేన ఆన్ధ్రభాషాహేతుత్వేన చ ఆద్యా సంస్కృతభాషా షడ్విధప్రాకృతభాషా చోభే ఆద్యప్రకృతిః ప్రకృతి రితి క్రమా దుచ్యేతే. ఆద్యా చ సా ప్రకృతి శ్చాద్యప్రకృతిః సంస్కృతభాషా. తస్యా స్సకలభాషానిదానత్వాత్. అతఏవ - "శాస్త్ర మపౌరుష మాద్యం ప్రాయికనిత్యప్రయోగలక్ష్మైతత్। దృశ్య మతిస్థవిరం యద్ జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః" - ఇతి క్వచిత్పుస్తకే సరస్వతీకవికరలిఖిత ఏవ శబ్దానుశాసనప్రణీతత్వేన పద్యం స్థితమ్. ఆర్షసమః వైదికశబ్దతుల్యః ప్రామాణిక ఇతి యావత్. శేషం సుగమమ్. అతోఽ స్వార్థమాద్యప్రకృతి రితి నామ. ప్రకృతి రిత్యాఖ్యా ప్యన్వర్థా. సంస్కృతాపేక్షయా శుద్ధప్రకృత్యాః శౌరసేన్యాదీనాం ప్రాకృతాపేక్షయా షడ్విధప్రాకృత్యాః ప్రకృతిత్వం సమ్భవత్యేవ. ఆన్ధ్రభాషాయా షడ్విధానుసారిత్వాత్.

వి:- సర్వభాషామూలకమును నాంధ్రభాషకు హేతువు నగుట వలన సంస్కృతభాష యాద్యప్రకృతి యనియు షడ్విధప్రాకృతభాష ప్రకృతి యనియుఁ జెప్పఁబడుచున్నది. 'ఆద్యా చ సా ప్రకృతి శ్చ' -అనువ్యుత్పత్తి చొప్పున నాద్యప్రకృతి యనుపదమునకు సంస్కృతభాషయని యర్థము, సంస్కృతభాష సకలభాషానిదానము. బాలసరస్వతికరలిఖితముగ నొకానొకపుస్తకమునందు "శాస్త్ర మపౌరుషమ్" -అనుపద్య మగపడుచున్నది. అది నన్నపార్యప్రణీతమే యని చెప్పఁదగియున్నది. "సామాన్యపురుషకర్తృకము కాక ఋషిప్రోక్తమైనట్టియుఁ, బ్రాయికము నిత్యము మున్నగాఁ గలవిధులలక్షణములు గల్గినట్టియు, మిగులఁ బ్రాచీనమైన యీసంస్కృతవ్యాకరణశాస్త్రము ముందుగా నాంధ్రవ్యాకరణజిజ్ఞాసువులచేఁ దెలియఁ దగినది, సంస్కృత

వ్యాకరణము నెఱింగి ప్రయోగించిన శబ్దము ఋషిప్రయోగమువలెఁ బ్రామాణిక మగుచున్నది" అని దానికిఁ దాత్పర్యము. "ప్రాలమ్బ్యకనిత్య ప్రయోగలక్ష్మైతత్" అనుపాఠము ఛందోభంగదూషితము. "ప్రాయిక నిత్యప్రయోగలక్ష్మైతత్" అనుపాఠము సమంజసము.

11. సూ. 2. ఏషా తయో ర్భవే ద్వికృతిః. ఏషా ఆన్ధ్రభాషాతు తయో రాద్య ప్రకృతిప్రకృత్యో ర్వికృతి ర్భవతి. ఉభయానుసారిత్వే నోభయవిలక్షణత్వేన చోభయా పేక్షయా విలక్షణత్వమ్. వికృతిత్వవ్యపదేశా త్ప్రకృతివ ద్వికృతి రితి న్యాయే నానుక్త కార్యస్యాత్ర తాభ్యాం ప్రాప్తి రిత్యాచార్యాశయః. తేన 'హాలన్త్యమ్' 'సానునాసికో చ్చారణం జిత్' ఇత్యాదికార్యం వర్తతే. ఇమ మర్థం సూచయితు మేవో త్తరత్ర తత్ర తత్ర నుమ్సుసాదివ్యవహారోఽప్యవలమ్బ్యత ఇతి జ్ఞేయమ్.

వి:— ఇది సంస్కృతప్రాకృతభాషలకు వికృతి. ఉభయానుసారి యగుచు నిది యుభయవిలక్షణ మగుచున్నది గదా! వికృతిపదవ్యవహారముచే –'ప్రకృతివ ద్వికృతిః'–అనున్యాయముచొప్పున నిం దనుక్తము లగుకార్యము లెల్ల సంస్కృతప్రాకృతవ్యాకరణములవలనఁ బ్రాప్తించునని యాచార్యాశయము. కాన 'హాలన్త్యమ్' –'సానునాసికోచ్చారణం జిత్' అనురీతికార్యము లిందుఁ బ్రవర్తిల్లుచున్నవి, 'నుమ్' 'సున్' మున్నగువ్యవహార ముత్తరగ్రంథమునఁ జేయఁబడుట యీయంశమునే సూచించుచున్నది గదా!

ఈకారికలోని –'ఏషా' –అనుదానికిఁ గవిశిరోభూషణ 'మాచ్ఛికాంధ్రభాష' యని యర్థము చేసినది. ఇట్టియర్థమున కాధార మగపడదు. 'వైకృతకావ్యాని' –'ఏషా తయో ర్భవే ద్వికృతిః' మున్నగువానిం బట్టి 'వికృతి' –అనుదానికిఁ దత్సమాచ్ఛికాంధ్రభాష యనునర్థము తేలుచున్నది. కాని దీని కిం దాధార మగపడదు. క్రిస్త్వబ్దమునకు మున్నాంధ్రజాతివ్యవహారమునం దున్నభాష యని తెలియుచున్నది. అప్పటియాంధ్రభాష ప్రాకృతభాషాభేదము. అప్పటియాజాతితో

నాభాష యంతరించినది. అయినను నాంధ్రజాత్యంతర్గతు లగువాళుక్యు లాంధ్రులనియు, వారు వ్యవహరించినది తెనుఁగుభాష యనియు, దాని నాంధ్రమని వ్యవహరించియుందురనియుఁ దోఁచుచున్నది. కాన 'తెనుఁగు' –'తెలుఁగు'–'ఆంధ్రము' అనునవి పర్యాయపదము లైనవని తోఁచుచున్నది. చింతామణి తత్సమాంధ్రసాధక మనకతప్పదు. ఈ యూహ యర్వాచీనము.

11. సూ. 3 :- అతఏవో క్తం ద్వితీయాచార్యేణ "ఆద్యా మహాద్యా సా మూలం సర్వాస్యేతి నిగద్యతే। తదను క్తస్య కార్యస్య వక్తా భవతి పాణినిః" ఇతి. అనుశిష్ట వికృతిత్వనిర్వాహార్థ ముత్తరార్ధమ్. కేవలతయేతి - కేవలతయా పార్థక్యేన యథాతథం యథేచ్ఛం యేయం భాషా వికృతిత్వేన ప్రసిద్ధా సా భాషా ఉభే చ ఆద్యే. తత్సమాది రూపే ణానుసర్ప త్యనువర్తతే.

వి:- "ఆద్యభాష మిక్కిలి గొప్పది. అది తెనుఁగుభాషకు మూలము. కాన నిందుఁ జెప్పఁబడనికార్యములు పాణినీయాదులనుండి తెలియ నగును" అని యథర్వణకారిక కర్థము. ఇత్సంజ్ఞ మున్నగునవి చింతామణిలోఁ జెప్పఁబడలేదు. కాన నవియును సంక్షిప్తముగఁ జింతామణి యందుఁ జెప్పఁబడిన కారకసమాసకృత్తద్ధితాది వ్యాకరణసంజ్ఞలును సంస్కృతవ్యాకరణమునుండియే తెలియఁదగియున్నవి.

11. సూ. 4. నచాత్రేదం శబ్ద స్తచ్ఛబ్దార్థ మభిదధాతి. "కరవాలకరాళదోస్సహాయో యుధి యోఽసౌ విజయార్జునైకమల్లః। యది భూపతినా స తత్ర కార్యే వినియుజ్యేత తతః కృతం కృతం స్యాత్" ఇత్యాదికవిప్రయోగవిరోధాత్. న చ "యో వికల్ప మిద మర్థమణ్డలం పశ్యతీశ నిఖిలం భవద్వపుః। స్వాత్మపక్షపరిపూరితే జగత్యస్య నిత్యసుఖినః కుతో భయమ్" ఇత్యాదావపి వాక్యభేదః; యేన తదర్థ మభిదధ్యాత్. తతో యచ్ఛబ్దనికటస్థిత ఇదంశబ్దః ప్రసిద్ధం పరామృశతి. ఏతచ్చ కావ్యప్రకాశే స్పష్టమ్.

వి:- "కేవలతయానుసర్ప త్యుభే చ యేయం యథాతథం భాషా" అనుదానియందున్న 'ఇయం' అను 'ఇదం' శబ్దము తచ్ఛబ్దార్థమును

బరామర్శింపదు. 'కరవాల' మున్నగుసంస్కృతవాక్యములచే నాయంశము తెలియుచున్నది. యచ్ఛబ్దగమిూపమునందున్న 'ఇదం' శబ్దము ప్రసిద్ధిని బరామర్శించునని కావ్యప్రకాశమును జెప్పుచున్నది.

11. సూ. 5. అనుసరణప్రకారస్త్వేవమ్-'చంద్రుఁడు, వనము, ధనము, ముఖము' ఇత్యాద్యాస్సంస్కృతసమాః. 'చందురుఁడు, సంద్రము' ఇత్యాద్యాస్తద్భవాః. 'జడ, జముఁడు, మేర, మట్టి, రాణి' ఇత్యాద్యాః ప్రాకృతసమాః. రాణీశబ్దో రాజ్ఞీశబ్దాన్నిష్పన్నః. జ్ఞో ణ ఇతి ణాదేశానుశాసనాత్. 'కంబము, అలఁది, నాణెము, విన్నాణము, చిన్నె, బోనము' ఇత్యాద్యాస్తద్భవాః. ప్రాకృతే తు చ తథా 'ఖంభో, హాలద్దీ, ణాణం, విణ్ణాణం, చిణ్ణం, బోణం' ఇత్యేవంరూపసిద్ధిః. అప్పకవినా తు చంద్రాదిశబ్దేషు దకారస్య "శేషాదేశస్యాఽహచో ఘోః" ఇతి సూత్రేణ ద్విత్వముక్తమ్; తద్భ్రాన్తిమూలకమేవ. తస్య బిన్దోః పరత్వే నాచః పరత్వాభావాత్. నచ బిన్దోరప్యచ్త్వమ్. ప్రాకృతవ్యాకరణే తథా వ్యవహారాభావాత్.

వి:- వికృతిభాష సంస్కృతప్రాకృతభాషల ననుసరించురీతి యిట్లుండును.

| సం. | సం.సమ. | సం. | సం.సమ. | సం. | సం.సమ. | సం. | సం.సమ. |
|---|---|---|---|---|---|---|---|
| చంద్రః | చంద్రుఁడు | వనమ్ | వనము | ధనమ్ | ధనము | ముఖమ్ | ముఖము |

ఇట్టివి సంస్కృతసమములు.

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి | |
|---|---|---|---|---|
| చంద్రః | చందురుఁడు | సముద్రః | సంద్రము | ఇట్టివి సంస్కృతభవములు |

| సం. | ప్రాకృతము | ప్రా.సమము | సం. | ప్రాకృతము | ప్రా.సమము |
|---|---|---|---|---|---|
| జటా | జడా | జడ | యమః | జమో | జముఁడు |
| మిరా | మేరా | మేర | రాజ్ఞీ | రాణీ | రాణి |

| ప్రాకృతము | వికృతి | ప్రాకృతము | వికృతి | ప్రాకృతము | వికృతి |
|---|---|---|---|---|---|
| ఖంభో | కంబము | హాలద్దీ | అలఁది | ణాణం | నాణెము |
| విణ్ణాణం | విన్నాణము | చిణ్ణం | చిన్నె | బోణం | బోనము |

చంద్రాదిశబ్దములలో ద్విత్వము వచ్చునని యప్పకవి చెప్పినమాట భ్రాంతిమూలకము. ఇచట బిందువు పరముగా నున్నదికాని యచ్చు పరముగా లేదుగదా! బిందువునకు 'అచ్చను వ్యవహారము ప్రాకృతము నందు లేదు.

11. సూ. 6. కిఞ్చ లచ్ఛిత్యత్ర 'మనయాం' ఇతి సూత్రేణ మకారలోపే కృతే 'క్షః' ఇతిసూత్రేణావశిష్టస్య ఛాఽఽదేశ ఇత్యుక్తమ్. తదప్యపరిశీలనమూలకమ్. లక్ష్మీ శబ్దస్య స్పృహాదిత్వేన "స్పృహాదౌ" ఇతి సూత్రేణ సంయుక్తస్యైవ ఛాదేశప్రాప్తేః. వ్యాకరణే 'క్షః' ఇతి సూత్రస్య ఛాదేశవిధాయకస్యైవాశ్రుతత్వాత్. అథర్వణేన "వర్ణ లోపాఽఽగమా నైకే సర్వస్మింస్తద్భవే పదే" ఇత్యుక్త్వా పునః స్పష్టార్థం "భిన్నత్వం యుక్తవర్ణస్య లోపాదేశాగమాస్తథా। తద్భవే సంస్కృతీయే స్యు రాదేశాద్యాస్తద న్యతః. స్యాద్వర్ణస్య వ్యత్యయశ్చ కుత్రచిత్కవిసమ్మతః" ఇత్యుక్తమ్. యుక్త వర్ణస్యసంయుక్తవర్ణస్యేత్యర్థః. లోపః 'సత' ఇత్యాదౌ పకారాదీనామ్. ఆదేశాః ప్రాణ రూపాః ప్రాణిరూపాశ్చ, తే చ చందమామేత్యాదౌ ద్రష్టవ్యాః. ఆగమా శ్చోభయ విధాః. తేచ 'దేవర, చందురుఁడు' ఇత్యాదౌ జ్ఞేయాః. తదన్యతః సంస్కృతతద్భవ వ్యతిరిక్తప్రాకృతాదితద్భవ ఇత్యర్థః. ఆదేశాద్యా ఇతి-శుద్ధాంధ్రసంబంధిన శ్చకార ఖకారాదీనాం చకారకకారాద్యా ఆదేశాః. తేచ 'లచ్చి, లచ్చనము, కంబము' ఇత్యాదౌ జ్ఞేయాః. ఆదిశబ్దేన లోపాగమౌ, తేచ 'జక్కులు, మూఁగ' ఇత్యాదౌ జ్ఞేయౌ. 'జక్కులు' ఇత్యాదౌ జిహ్వామూలీయస్య లోపః. 'క్షః కః' ఇతి మాగధీ సూత్రాత్. కేచిత్తుప్రాకృతతద్భవత్వం మేనిరే, 'ప్రేరించెన్' ఇత్యాదౌ 'ప్రేరేచెన్' ఇత్యాకారవ్యత్యయః. అత్రేకార స్యైకారాదేశ స్తద్భవమూలక ఇతి జ్ఞేయమ్. ఏవ మన్యేఽపి పెరిమాదిశబ్దా జ్ఞేయాః.

వి:- తద్భవము లన్నింటియందును వర్ణలోపవర్ణాగమవర్ణాదేశాది కార్యములు పలువిధములుగఁ గల్గుచున్నవి యని యథర్వణవచనమున కర్థము. వర్ణలోపాదివికారములు గల్గునపుడు ప్రకృతిశబ్దముతో నర్థము నను నాకారమునను బల మగుపోలిక యుండవలయును. మఱియు నథర్వణుఁడు "హల్సంయుక్తవర్ణములకు విశర్షమును నల్లే వర్ణలోపా దులు నగును; సాంస్కృతికతద్భవమునందుఁ గొన్నియెడలఁ బ్రకృతి

పదములోనివర్ణక్రమము తారుమారు అగుటయు వర్ణలోపాదులు గల్గుటయు జరుగును" అని చెప్పిరి. 'సప్త' అనునపుడు పకారలోపము కల్గి 'సత' అని యగును. ఇది లోపమున కుదాహరణము. 'చందమామ' మున్నగువానిలో నచ్చులయు హల్లులయు నాదేశమును జూడనగును. పైరీతినే యాగమములును రెండువిధములు. వానిని 'దేవర, చందురుఁడు' మున్నగువానియందుఁ జూడనగును. ప్రాకృతతద్భవములలో ఛకారఖకారములకు 'చకారకకారము' లాదేశము లగును. 'లచ్చి, లచ్చనము, కంబము' మున్నగువానియందు వానిం దెలియనగును. "ఆదేశాద్యా స్తదన్యతః" అనునధర్వణవచనమునందలి 'ఆది' పదముచే లోపాగమములు సంగ్రహింపఁబడును. 'జక్కులు, మూఁగ' మున్నగువానిలో వానిం దెలియనగును. 'జక్కులు' అనునపుడు జిహ్వామూలీయమునకు లోపము 'క్షః కః' అనుమాగధీసూత్రమువలనఁ గల్గును. ఇది ప్రాకృతభవమని కొంద ఱనుచున్నారు. 'ప్రేరించెన్' అనునపుడు 'ప్రేరేచెన్' అనునది మార్పు. అం దికారమున కేకారాదేశము తద్భవమూలకము. ఇట్లే 'పెరిమ' మున్నగువానిం దెలియనగును.

11. సూ, 7 :- "కుక్క గోరెం బోలిఁ గూళ గుండము కంతి
గుజ్జు కరాటంబు గజ్జె కట్టె
సిగ చేఁతి చిక్కంబు చిన్ని సింగము సెజ్జ
లక్క లచ్చన సుద్ది లయ్య లాఁగు
ప్రోడ పాత్రము పోఁక పుడమి బన్నము బూది
బీరంబు బికిరంబు పిట్టు పుటము
పడిసె పెన్నుఁడు వంక వడుగు వీడెము వన్నె
రక్కసి రవణంబు రిక్క పగ్గె
పీఁట దయ్యము తోరంబు పెట్టె మట్టి
బత్తి జతనము జాతర ముత్తియంబు
దాది కుప్పస మిటిక నిద్దంబు పెరిమ
ఇవము దెస డిగ్గి యనఁగఁ దద్భవము లయ్యె." ఇత్యప్పకవిః.

| | | | |
|---|---|---|---|
| కుర్కురశబ్దాత్-కుక్క | కాష్ఠాత్-కట్టె | లజ్జాయాః-లజ్జ | భిక్షాయాః-బికిరము |
| గోళాత్-గోలెము | శిఖాయాః-సిగ | లఙ్ఘాయాః-లాఁగు | పిష్టాత్-పిట్టు |
| ఆళేః-ఓలి | చేష్టాయాః-చేఁత | ప్రౌఢాత్-ప్రోడ | స్ఫుటాత్-పుటము |
| క్రూరాత్-కూళ | శిక్యాత్-చిక్కము | పుస్తకాత్-పొత్తము | వధూన్యాః-వదినె |
| కుండాత్-గుండము | చిహ్నాత్-చిన్నె | పూగాత్-పోక | విష్ణుశబ్దాత్-వెన్నుఁడు |
| గ్రన్థేః-కంతి | సింహాత్-సింగము | పృథివ్యాః-పుడమి | వక్రాత్-వంకర |
| కుబ్జాత్-గుజ్జు | శయ్యాయాః-సెజ్జ | భగ్నాత్-బన్నము | వటుశబ్దాత్-వడుగు |
| కరండాత్-కరాటము | లాక్షాయాః-లక్క | భూతేః-బూది | వీటీశబ్దాత్-వీడెము |
| ఖర్జ్వాః-గజ్జి | సూక్తేః-సుద్ది | వీరాత్-బీరము | వర్ణాత్-వన్నె |
| రక్షస్శబ్దాత్-రక్కసి | ప్రజ్ఞాయాః-పగ్గె | స్థూలాత్-లోరము | భక్తేః-బత్తి |
| రమ్యాత్-రవణ | పీఠాత్-పీఁట | పేట్యాః-పెట్టె | యత్నాత్-జతనము |
| ఋక్షాత్-రిక్క | దైవాత్-దయ్యము | మృత్తికాయాః-మట్టి | యాత్రాయాః-జాతర |
| మౌక్తికాత్-ముత్తియము | కార్పాసాత్-కప్పసము | స్నిగ్ధాత్-నిద్దము | దిశాయాః-దెస |
| ధాత్రేః-దాది | ఇష్టికాయాః-ఇటిక | ప్రేమ్ణః-పెరిమ | దీర్ఘికాయాః-డిగ్గియ |

ఇత్యాద్యశబ్దా ద్వికృతిశబ్దో నిష్పన్నః. ఏవ మన్యే వూహ్యాః.

వి:- కుక్క గోళెం బోలి అనుపద్యములోఁ దద్భవములను గొన్నింటి నప్పకవి సమకూర్చినాఁడు. వాని కన్నింటికిని కవిశిరోభూషణము మూలప్రకృతులను సమకూర్చినది. ఇట్టి వాని నూహింపనగును.

11. సూ. 8 :- యథా ప్రాకృతే ప్రథమశబ్దస్య ప్రత్యాదిత్వా ద్ధత్వే 'పడిమా' - ఇతి స్థితే – "గజడదబఘఝఢధభాం కచటతపఖఛఠథఫాః" - ఇతి చూళికాపైశాచీసూత్రేణ టత్వే 'పటిమా' - ఇతి రూపమ్. తథా కథే త్యస్యాపి- తద్దథోః - ఇతి పైశాచీసూత్రేణ తకారే పైశాచీతత్సమత్వ మేవేతి సూత్రదృష్ట్యా అవధేయమ్ - 'జక్కులు' - మాగధీతద్భవః. - 'గొనములు' - పైశాచీతద్భవః. - 'రాచకొలము' చూళికాతద్భవః. 'మాఁగ' - అపభ్రంశతద్భవః. - 'జాదము' శౌరసేనీతద్భవః; నతు తద్భవః. తథాహి - శేషం ప్రాకృతవత్" – ఇత్యతిదేశాత్ - ద్యయ్యర్యాం జః- ఇతి జాదేశః.- "ద స్తస్య శౌరసేన్యామఖ్యోచోస్తోః".ఇతిసూత్రేణ,

తస్య - "ప్రాకృతే తద్భవే చాపి చజౌ దన్త్యభవౌ స్మృతౌ" - ఇత్యథర్వణాచార్యేణోక్తత్వాత్. ప్రాకృతే ప్రాకృతసమ ఇత్యర్థః.

వి:- ఇందుఁ బ్రాకృతభవములు వివరింపఁబడుచున్నవి. ప్రథమశబ్దము పైశాచీతద్భవముగా 'పఠెమ' అని యగుచున్నది. కథాశబ్దము 'కత' అని పైశాచీతద్భవ మగును. 'జక్కులు' మాగధీతద్భవము. 'గోనములు' పైశాచీతద్భవము. 'జూదము' శౌరసేనీతద్భవము. ద్యూతశబ్దమునుండి 'జూదము' అని యుత్పన్న మైనది. ఇందలి జకారమునకు దంత్యత "ప్రాకృతే తద్భవేచాపి" అనుచోవ్యాఁ గల్గినది. అథర్వణకారికయందలి ప్రాకృతశబ్దమునకు 'ఆంధ్రదేశ్య' మని యర్థము. 'ఆంధ్రదేశ్య తద్భవములలోఁ గలచజలు మాత్రమే దంత్యములు' అని యథర్వణాశయము. దీనిచేఁ దత్సమములందలి చజ లేయచ్చుతోఁగూడినను దాలవ్యములే యని తెలియుచున్నది. ఈయథర్వణకారిక 'అద్దన్త్య' అనుదానికి వివరణము. 'రాజు' అనుదానిలోని జకారముమాత్రము దంత్యము.

**11.** సూ. 9 :- నన్వేవం మూఁగేత్యాదీనామపి తత్సమత్వాపాతః. యత్ర వర్ణాన్తరాగమవర్ణలోపయోః శాస్త్రతో విశిష్య న ప్రాప్తిః తత్రైవ తద్భవత్వం నాన్యత్రేతి నియమాఙ్గీకారాత్. దన్త్యజకారస్య తు శాస్త్రతః ప్రాప్తత్వాన్న నియమవిరోధః. అన్యథా 'రాముఁడు, లక్ష్మి, మేరువు' ఇత్యాదీనా మపి తత్సమత్వం న స్యాదితి.

వి:- శాస్త్రవిహితము లగువర్ణలోపవర్ణాగమము లెచటఁ బ్రాప్తించునో యచటనే తద్భవత్వ ముండుననియు నితరస్థలమున నుండదనియుఁ జెప్పిననియమమువలన 'మూఁగ' మొదలైనవి తత్సమము లనుటకు వీలు లేదు. కాన 'జూద'శబ్దము తద్భవమే. కానిచో 'రాముఁడు, లక్ష్మి, మేరువు' మున్నగునవి తత్సమములు కాకపోవలసివచ్చునుగదా.

**11.** సూ. 10 :- ఏవం స్థితే జూదశబ్దః శౌరసేనీతద్భవ ఇతి సరస్వత్యోక్తమ్; తద్విచారమాద్యేనైవ. ఏవ మన్యేపి జ్ఞేయాః. - "ప్రాకృతే తద్భవేచాపి" - ఇత్యథ

ర్వణసూత్రే ప్రాకృతశబ్దస్య ప్రాకృతసమపరత్వం నృసింహగ్రన్థరీత్యా వ్యాఖ్యాతమ్. వస్తుతస్తు ప్రాకృతశబ్దస్య ప్రాకృతపరత్వమేవ. - "చజౌ తజ్జే ప్రాకృతే చ దన్త్యావేవ న సంశయః" - ఇత్యథోక్షజాచార్యవచనాత్.

వి:- జూదశబ్దము శౌరసేనీతద్భవ మని బాలసరస్వతి చెప్పుట సరికాదు. మిగిలినవాని నిట్లే యూహింపవలెను. "ప్రాకృతే తద్భవే చాపి" అనుదానియందలి ప్రాకృతశబ్దమునకు నృసింహగ్రంథము ననుసరించి ప్రాకృతసమపరముగ వ్యాఖ్యానింపఁబడినది. ప్రాకృతశబ్దమునకుఁ బ్రాకృతదేశ్యమని యే యర్థము. "చజౌ తజ్జే ప్రాకృతే చ" అనుకారికకును "ప్రాకృతే తద్భవే చాపి" అనుదానికిని నర్థము సమమే. కావున నీయథోక్షజాచార్యు లాంధ్రవైయాకరణుఁడు కానోపును. ఏలయన దంత్యతాలవ్యచజలప్రమేయము తెలుఁగునందుమాత్రమే కాని ప్రాకృతమునందు లేదుగదా!

**11.** సూ. **11** :- ప్రసఙ్గతః ప్రాకృతాదీనాం స్వరూపం వినియోగశ్చ కథ్యతే. ప్రకృతిప్రత్యయాదివ్యుత్పత్తిమత్ప్రకృతం సంస్కృతమ్. తత ఆగతమితి ప్రాకృతశబ్దవ్యుత్పత్తిః. తత్త్రివిధమ్. తత్సమం తద్భవం దేశ్యం చేతి. "తత్సమం సంస్కృతసమం జ్ఞేయం ప్రాకృతలక్షణాత్। దేశ్య మార్షఞ్చ రూఢత్వా త్స్వతన్త్రత్వాచ్చ భూయసా. లక్ష్మ నాపేక్షతే తస్య సమ్ప్రదాయో హి బోధకః। ప్రకృతే స్సంస్కృతా త్సాధ్యమానం సిద్ధఞ్చ తద్భవమ్ దేశ్య మవ్యుత్పత్తిమత్త్వా త్ప్రాకృతత్వేన కథ్యతే। సంస్కృతీ ప్రాకృతీ చేతి భేదా ద్భాషా ద్విధా మతా." తత్ర సంస్కృతీలక్షణం దణ్డినోక్తమ్ - "సంస్కృతీనామ దైవీ వాగన్వాఖ్యాతా మనీషిభిః" - ఇతి.

వి:- ప్రసంగవశమునఁ బ్రాకృతాదులస్వరూప వినియోగములు చెప్పఁబడుచున్నవి. ప్రకృతిప్రత్యయాదివ్యుత్పత్తి కలది ప్రకృతము-అనఁగా సంస్కృతమని యర్థము. 'తత ఆగతః=ప్రాకృతమ్' ప్రకృతమునుండి పుట్టినది ప్రాకృతమని వ్యుత్పత్తి. అది-తత్సమ తద్భవ దేశ్య భేదముచే మూఁడువిధములు. ప్రాకృతలక్షణమునఁ దత్సమమనఁగా సంస్కృతసమమనియర్థము. దేశ్యప్రాకృత మార్షము రూఢము స్వతంత్రము నగుటచే

దానికిఁ దఱచుగా లక్షణాపేక్ష లేదు. దానివిశేషములను సంప్రదాయమే బోధించును. ప్రకృతి యగు సంస్కృతమునుండి సాధింపఁబడి సిద్ధమైనది తద్భవప్రాకృతము. వ్యుత్పత్తివిరహిత మగుటచే దేశ్యము ప్రాకృతమని యే చెప్పఁబడుచున్నది. 'సంస్కృతిప్రాతికృతి' అనుభేదముచే భాష రెండువిధములు. "సంస్కృతి యనునది దైవీవాక్కని పండితులు నుడువుచున్నారు" అని దండ్యాచార్యులు వచించిరి.

11. సూ. 12 :- భాషాప్రదీపేచోక్తమ్ - "కౌమారపాణినీయాది సంస్కృతా సంస్కృతీ భవేత్। సా దేవతావిశేషాణాం నాయకానాం తపస్వినాం॥ ప్రశస్తచాతుర్వర్ణ్యానాం మన్త్రిణాం ప్రతిహారిణామ్। లిఙ్గినాఞ్చ విటాదీనా మన్యేషాం లలితాత్మనామ్ ॥ప్రయుజ్యతే నాటకేషుత్వన్యేషా నపరా మతా। ప్రకృతి స్సంస్కృతా భాషా వికృతిః ప్రాకృతీ భవేత్॥ షడ్విధేయం ప్రాకృతీ చ శౌరసేనీ చ మాగధీ। పైశాచీ చూళికాపైశా చ్యపభ్రంశ ఇతిక్రమాత్। మహారాష్ట్రోద్భవా భాషా ప్రాకృతీ పరికీర్త్యతే। శూరసేనోద్భవా భాషా శౌరసేనీతి గీయతే॥ ప్రచక్షతే మాగధీం తాం యా భాషా మగధోద్భవా। పిశాచదేశసమ్భూతం పైశాచీద్వితయం భవేత్॥ ఆభీరాదికజాం భాషా మపభ్రంశం ప్రచక్షతే" – ఇతి.

వి:- కౌమారపాణినీయాదివ్యాకరణములచే సంస్కరింపఁబడిన భాషను సంస్కృతి యందురు. అది దేవతావిశేషములకు, నాయకులకు, మునులకుఁ, జాతుర్వర్ణ్యశ్రేష్ఠులకుఁ, బ్రతీహారులకు, భిక్షుకులకు, విటులకు నిట్టిసుకుమారుల కందఱకును నాటకములలోఁ బ్రయోగింపనగును. ఇతరులకుఁ బ్రాకృతి నుపయోగింపవలెను. సంస్కృతప్రాకృతభాషలకుఁ 'బ్రకృతి, వికృతి' అని పేర్లు. 'ప్రాకృతి, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికాపైశాచి, యపభ్రంశము–నని యిది యనఁగా వికృతి యాఱువిధములు. ఇవి వరుసగా మహారాష్ట్రము, శూరసేనము, మగధ, పిశాచదేశములు నాభీరదేశము ననువానిలో నుత్పన్నము లగుచున్నవని భాషాప్రదీపము చెప్పినది.

11 సూ. 13 :- షణ్ణాం భాషాణాం ప్రాకృతమిత్యేవ వ్యవహారః. దణ్డినాఽపి "శౌరసేనీ చ గౌడీ చ లాటీ చాన్యాపి తాదృశీ। యాతి ప్రాకృత మిత్యేవం వ్యవహారేషు సన్నిధిమ్॥ ఆభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశ ఇతి స్థితిః। శాస్త్రేషు సంస్కృతా దన్య దపభ్రంశత యోదితమ్" ఇత్యుక్తమ్. ఆభీరదేశో నా మాభీరప్రాయః పశ్చిమ సముద్రపార్శ్వవర్తీ జనపదః. ఆదిశబ్దేన ఘూర్జరాదయః.

వి:- పై యాఱువిధము లగుభాషలకును ప్రాకృతమనియే పేరు. శౌరసేని గౌడి లాటి యిట్టియితరములు ప్రాకృతవ్యవహారము కలవి. కావ్యప్రయుక్తము లగునాభీరాదివచనము లపభ్రంశము లనిపించుకొనును-అని దండి యనెను. పశ్చిమసముద్రపార్శ్వవర్తి యగుదేశమున కాభీరదేశమని పేరు. ఆదిశబ్దముచే ఘూర్జరాదులును గ్రహింపఁదగును.

11. సూ. 14 :- వివరణే చాప్యుక్తమ్. "తత్ర తు ప్రాకృతం స్త్రీణాం సర్వాసాం నాటకాదిషు। క్వచిత్ప్రశ స్తనారీణాం యోగినీనాఞ్చ సంస్కృతమ్॥ యే నీచాః కర్మణా జాత్యా తేషాం ప్రాకృత ముచ్యతే। ఛద్మలిఙ్గవతాం తద్వ జ్జైనానా మితి కేచన॥ మధ్యమస్యాధమస్యాపి శౌరసేనీ ప్రయుజ్యతే। కైవ ర్తభిల్లముఖ్యానాం మాగధీ వినియుజ్యతే॥ రక్షోఽసురపిశాచానాం పైశాచీద్వితయం భవేత్। చణ్డాలయవనాదీనా మపభ్రంశః ప్రయుజ్యతే॥ నాటకాదా వపభ్రంశవిన్యాస స్యాసహిష్ణవః। అన్యే చణ్డాలకాదీనాం మాగధ్యాధి ప్రయుజ్యతే॥ సర్వేషాం కారణవశా త్కార్యో భాషావ్యతిక్రమః। మాహాత్మ్యస్య పరిభ్రంశం యథా లిఖితవాచనమ్॥ ప్రచ్ఛాదనఞ్చ విభ్రాన్తిం మదస్యాతిశయం తథా। కదాచి దనువాదఞ్చ కారణాని ప్రచక్షతే॥ బాహ్లీకసహ్యానేపాళపాణ్డ్యకేకయకు న్తలాః। చోళలాటకగాన్ధారసుధేష్ణద్రవిడాదయః॥ పిశాచదేశా స్తద్దేశ్యం పైశాచీద్వితయం భవేత్। ప్రాకృతం షడ్విధ ఞ్చాపి భారత్యా బాలభాషితమ్॥ భాషాణాం ప్రాకృతాదీనాం వాల్మీకి ర్మూలసూత్రకృత్" ఇతి.

వి:- "నాటకాదులలో స్త్రీల కందఱకును బ్రాకృతమునే వాడవలెను. ఉత్తమస్త్రీలకు యోగినులకు నొకచో సంస్కృతమును వాడవచ్చును. జాతిచేతఁగాని కర్మముచేతఁగాని హీనులగువారికిఁ బ్రాకృతమును వాడవలెను. వేషధారులకు, జైనులకుఁ బ్రాకృతమును వాడవలెనని

కొందఱందురు. మధ్యమాధములకు శౌరసేని నుపయోగింప నగును. భిల్లకైవర్తాదులకు మాగధిని వాడనగును. రాక్షసాసురపిశాచజాతుల వారికిఁ బైశాచిని జూళికాపైశాచిని వాడనగును, చండాలయవనాదుల కపభ్రంశమును వినియోగింపనగును. నాటకాదులలో నపభ్రంశము నుపయోగించుట కిష్టపడనికొందఱు చండాలయవనాదులకు మాగధి మున్నగువాని నుపయోగింతురు. కారణ మున్నపు డందఱకును భాషా వినిమయము చేయవచ్చును. మహత్త్వము చెడినపుడును, వ్రాసిన దానిం జదువునపుడును, వ్యక్తి మఱుఁగుపడియున్నపుడును, భ్రాంతిఁ జెందినపుడును మదాతిశయము గల్గినపుడును భాషలను మార్పుచేయ వచ్చును. ఒకనిమాట ననువదించునపుడు నిట్టిమార్పు జరుగవచ్చును. భాషావ్యతిక్రమమున కివి కారణములు. బాహ్లీకసహ్యనేపాళపాండ్య కేకయకుంతలచోళలాటకగాంధారసుధేష్ణద్రవిడదేశములను బిశాచదేశ ము లందురు. తద్దేశ్య మగుభాష పైశాచీద్వితయ మగుచున్నది. ఈ షడ్విధప్రాకృతమును భారతీదేవి బాలభాషితము. వాల్మీకిముని వీనికి వ్యాకరణమూలసూత్రములను విరచించెను" అనునీవిషయములు భాషా ప్రదీపవివరణమునఁ గలవు.

12. సూ. :- ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః.

12. సూ. 1 :- సంస్కృతభాషాశబ్దానాం పఞ్చాశద్వర్ణైస్సిద్ధి ర్భవతి. అత్ర కేచిత్ "అఆ, ఇఈ, ఉఊ, ఋౠ, ఌ, ఏఐ, ఓఔ" వర్ణాః అనుస్వారవిసర్గౌ చాచ స్స్వరా ఇతి చ కథ్యన్తే; స్పర్శా అన్తస్థాః క్షకారవర్ణసహితా ఊష్మాణశ్చ హాల ఇత్యు చ్యన్తే- మిళిత్వా పఞ్చాశద్వర్ణా భవన్తి" ఇతి వదన్తి. తేషాం మతే ప్రకృతే స్తు తే ధశోనా ఇత్యత్ర "ఋౠ,ఌ,ఐఔ,జఞ,శష"వర్ణావర్గశ్చ న్యూనా భవన్తి. కేషాఞ్చిన్మతే ఌవర్ణస్య దీర్ఘగ్రహణం, ళవర్ణస్యాగ్రహణం చ సమ్మతమ్.

వి:- ఆద్యాయాః-పంచాశద్వర్ణాః-అని ఛేదము. సంస్కృత భాషాశబ్దము లేఁబదివర్ణములతో సిద్ధించుచున్నవని సూత్రార్థము. "అఆ, ఇఈ, ఉఊ, ఋౠ, ఌ, ఏఐ, ఓఔ, ం, ః" అనువానికి సంస్కృతవ్యాక

రణమువలన 'అచ్చులు' అను పేరు కల్గినది. 'స్వరములు, ప్రాణములు' అని నామాంతరములు. "కఖగఘఙ (కవర్గము) చఛజఝఞ (చవర్గము) టఠడఢణ (టవర్గము) తథదధన (తవర్గము) పఫబభమ (పవర్గము)" ఈయిరువదియైదువర్ణములకును స్పర్శములని పేరు. "యరలవ (అంతస్థములు శషసహ (ఊష్మములు) క్షళ" అనువర్ణములతోఁ గూడిన పైవర్ణములను 'హల్లులు' 'వ్యంజనములు', 'ప్రాణులు' అని పిలుతురు. అచ్చులు 15, హల్లులు 35, మొత్తమేఁబదివర్ణములు సంస్కృత భాషకుఁ గలవని కొందఱందురు. వారిమతమున "ప్రకృతేస్తు తే దశోనాః" అనుదానికి "ఋౠ,ఌ,ఐఔ,ఙఞ,శష,విసర్గము" అను 10 వర్ణములు తక్కువ. ళ్ళాకారమును గ్రహించి 'ళ' వర్ణమును విడుచుట కొందఱకు హితము.

12. సూ. 2 :- అత్ర సమ్ప్రదాయాభిమానినో వదన్తి. "ఆదిక్షాన్తాః స్మృతా వర్ణా అక్షరాః పరికీర్తితాః" - ఇత్యాగమజ్ఞవ్యవహారమాత్రేణ న క్షకారస్య వర్ణాన్తరత్వేన గణనా. అన్యథా సంయుక్తత్వావిశేషాత్ స్తాదీనామపి వర్ణాన్తరత్వేన గణనా స్యాత్. క్షస్య వర్ణాన్తరత్వాభావే ధాతుపారాయణికైః ఋక్షాదిధాతూనాం షాన్తమధ్యే పాఠ ఏవ మానమ్.

వి:- 'అకారము మొదలు క్షకారమువఱకు నుండుటచే నక్షరములైనవి' అని యాగమశాస్త్రజ్ఞు లందురు. తన్మాత్రముచే క్షకారమును వర్ణాంతరముగఁ బరిగణింపరాదనియు, నట్లు పరిగణించినచో దానివలెనే సంయుక్తవర్ణము లగు 'స్త' మున్నగు పెక్కువర్ణములను బరిగణింపవలసి యుండుననియు, 'భిక్ష' మున్నగుధాతువులు ధాతుపాఠమునందు షాంతములలోఁ బఠింపఁబడినకారణముచే క్షకారము సంయుక్తవర్ణమే కాని వర్ణాంతరము కాదనియు సంప్రదాయాభిమాను లనుచున్నారు.

12. సూ. 3 :- నచైవం ళకారస్యాప్యవర్ణాన్తరత్వమ్. తస్య మాహేశ్వరసూత్రానుక్తత్వేఽపి లళయో ర్డడయో రేకత్వం శాబ్దికశిఖావతంసై రుక్తత్వా ల్లోళ

ఇతి వాల్మీకిభి రుక్తత్వా ల్లళయో రుచ్చారణస్య లోకవేదయో ర్భిన్నత్వేన ప్రతీయ మానత్వాచ్చ ళస్య వర్ణాన్తరత్వం వక్తుం శక్యతే.

వి:- క్ష కారమువలె ళ కారముకూడ వర్ణాంతరము కాదని చెప్ప రాదు. మాహేశ్వరసూత్రములలోఁ జెప్పఁబడకున్నను 'లడళ' అనువా నికి భేదము లేదని శాబ్దికులు చెప్పుటవలనను, 'లోళః' అని వాల్మీకిముని సూత్రించుటవలనను, 'లళ' లయుచ్చారణము లోకవేదములలో భిన్న ముగాఁ బ్రతీయమాన మగుటవలనను, 'ళ'కారము క్షకారమువలె వర్ణాంతరము కాదని చెప్పరాదు. అది వర్ణాంతరమే.

12. సూ. 4 :- యద్యప్యనుస్వారవిసర్గజిహ్వామూలీయోపధ్మానీయయమానా మకారోపరి శర్షు చ పాఠ స్యోపసఙ్ఖ్యాన మితి కాత్యాయనవ్యవహారా దనుస్వారవిస ర్గయో ర్హల్త్వం చాప్యస్తి. తథాపి వర్ణపరిగణనదశాయాం తయో రచ్త్వేనైత ప్రామాణికై ర్వ్యవహారః కృతః. అత ఏవ 'హరిం వన్దే', 'హరిః కరోతి' ఇత్యాదా త్రిపాదిగతత్వే నానుస్వారవిసర్గకార్యయో రసిద్ధత్వా న్న యణాదేశప్రసక్తి రిత్యాద్య వ్యాకరణపారీణాః ఫేణుః.

వి.- అనుస్వారవిసర్గాదు లచ్చులు హల్లులు నగునని కాత్యా యనుఁ డన్నను వర్ణపరిగణనదశలో నవి యచ్చులుగనే వైయాకరణు లచేఁ జెప్పఁబడినవి. అయినను ననుస్వారవిసర్గకార్యములు త్రిపాది గతములుకాన నసిద్ధము లగును. కావున 'హరి+ః వన్దే' 'హరి+ః కరోతి' మున్నగుచోట్ల యణాదేశప్రసక్తి కల్గలే దని శాబ్దికలు నుడువు చున్నారు.

12. సూ. 5 :- జిహ్వామూలీయోపధ్మానీయయోస్తు నోభయత్రాపి పరిగణనమ్. తయో ర్విసర్గా న్తత్వేన వర్ణాన్తరత్వాభావాత్.

వి:- జిహ్వామూలీయోపధ్మానీయము లగు 'ఃక,ఃప' అనునవి విసర్గాత్మకము లగుటచే వాని కచ్చులయందును హల్లులయందును గూడఁ బరిగణనము లేదు.

**12.** సూ 6 :- శస్య గ్రాహ్యత్వే షస్యాగ్రాహ్యత్వే ఌవర్ణస్య ద్వైవిధ్యే "ద్విధాకఏచో౽నుస్వారో విసర్గ ష్షోడశస్వరాః। స్పర్శా అన్తస్థ ఊష్మాణ శ్చతుస్త్రింశ ద్ధల స్స్మృతాః॥ సిద్ధి స్సంస్కృతశబ్దానాం భవే త్పఞ్చాశదక్షరైః। ప్రాకృతానాఞ్చ సిద్ధి స్స్యా త్తై శ్చత్వారింశదక్షరైః" "ఋఌవర్ణౌ వినైకారౌకారాభ్యాఞ్చ దశ స్వరాః శషౌ చ దశ తే న్యూనాః ప్రాకృతోక్తిషు సర్వతః" ఇత్యాదివరరుచిహేమచన్ద్రాదివ్యాకరణ ప్రవణోక్తి ర్మానమ్-ఇతి.

వి:- దీనియర్థ మీవలకు వివరింపఁబడినది. వరరుచిహేమచంద్రులు సంస్కృతభాష కంగీకరించినవర్ణములను దెనుఁగువైయాకరణులు నంగీకరించిరి. తెనుఁగునఁ దత్సమశబ్దములలో నీయేఁబదివర్ణములే యుండును. ప్రాకృతతత్సమముల కట్లు కాదు. తెన్గుప్రాకృతతత్సమములకు మిక్కిలిభేదము గలదు. తెన్గుతత్సమములలో వికృతిచిహ్నములు శబ్దాంతముననే చేరును. కావున శబ్దమధ్యవర్ణములకు మార్పుండదు. ప్రాకృతతత్సమములలో శబ్దమధ్యవర్ణములును మాఱుచుండును. కానఁ బ్రాకృతతత్సమములకు వర్ణములు నలువదియే యగును.

**12.** సూ. 7 :- ఌవర్ణస్య ద్వైవిధ్య మిత్యత్ర తస్య దీర్ఘాభావా త్ప్లుతేనైవ ద్వైవిధ్యమితి కేచి దూచుః. తస్య దీర్ఘాభావే౽పి ఋవర్ణసవర్ణత్వేన తద్దీర్ఘ మాదాయ దీర్ఘవత్త్వ మితి కేచి దవదన్.

వి:- ఌవర్ణమునకు దీర్ఘము లేనందున హ్రస్వప్లుతభేదముచే నిది ద్వివిధ మగుచున్నదని కొంద అనుచున్నారు. ఋ వర్ణమునకు నిది సవర్ణమగుటచే దానిదీర్ఘముతో దీర్ఘవంత మగునని మఱికొంద అను చున్నారు. కాని తెల్గుదేశమునఁ బ్రసిద్ధిఁ జెందిన భాషావర్ణములలో మిలిగినస్వరములతోపాటుగ ౡకారమును బఠింపఁబడుచున్నది. కాన ౡకారమును గ్రహించుటయే యుచితము. కాని దానికిఁ బ్రయోగ మగపడదు.

**12.** సూ. 8 :- అత్రేయం చిన్తా-హ్రస్వస్యేవ దీర్ఘస్యాపి సిద్ధత్వేన ద్వయోః పార్థక్యేన గణనా. ప్లుతస్య తు విధివిషయత్వా న్న పరిగణనేతి హి సంప్రదాయః

ఏవం స్థితే ఌకారప్లుతస్యైవ విశిష్య గ్రహణ మిత్యప్రామాణికమేవ. నవా తేనప్రయోజనమితి ఋవర్ణదీర్ఘేనైవ దీర్ఘవత్త్వం ప్రామాణికమ్. “అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః” ఇతి గ్రహణకశాస్త్రానుగతా దృకార స్త్రింశత స్సంజ్ఞా, ఌకారశ్చ తథావిధః ఇతి సిద్ధాన్తాత్. అత ఏవ ‘హోతృ+ఌకారః, ఇత్యత్ర సవర్ణదీర్ఘే హోతౄకారః ఇతిసిద్ధమ్.

వి:– హ్రస్వమువలెనే దీర్ఘమును సిద్ధించుటచే రెంటికిని వేర్వేఱుగఁ బరిగణనము జరిగినది. ప్లుతము శాస్త్రవిహితము కాన దానిని వేఱుగఁ బరిగణింపలే దనునది సంప్రదాయము. ఇట్లుండ ఌకారప్లుతమునకు మాత్రమే విశేషగ్రహణ మనుట ప్రామాణికము కాదు. దానివలనఁ బ్రయోజనము లేదనియు ఋవర్ణదీర్ఘముచేతనే దీర్ఘవంతమనుట ప్రామాణిక మనియు నాలోచింపవలెను. “అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః” అని గ్రహణకశాస్త్రానుగతమైన ‘ఋకారము ముప్పదింటికి సంజ్ఞ; ఌకారము నట్టిదియే’ అని సిద్ధాంతము కలదు. కాన ‘హోతృ+ఌకారః=హోతౄకారః’ అని సవర్ణదీర్ఘముచే రూపము సిద్ధించినది.

12. సూ. 9 :– అత్ర కేషాఞ్చి ద్వర్ణానా మభిన్నతావ్యవహారః “లడయోర్లళయో ర్వైవ రలయో ర్వబయో ర్భిదా” ఇత్యుక్తే., తత్రాపి లడయో ర్లళయో రభేద స్తు వైయాకరణవ్యవహారేణ గరీయాన్. వబయో రభిన్నత్వం తు ప్రాకృతవ్యాకరణరూఢమ్. తథాహి– “నీవిస్వప్నే వా” ఇత్యత్ర వస్య మాదేశో విధీయతే. తత్ర చ వస్య స్థానిత్వం మస్యాదేశత్వం “బోమశ్శబ్దే” ఇతి పూర్వసూత్రా దున్నేతవ్యమ్. ఏతచ్చ వబయోరభేదం వినా దుర్ఘటమితి స్పష్టమేవ. తేన‘అబ్దం’ ఇత్యత్ర “దవలామధశ్చ” ఇతి బలోపః ఫలమ్, ప్రపఞ్చ స్తు చన్ద్రికాదే రవగన్తవ్యః. రలయో రభిన్నతా తు చిన్తామణౌ “రామచన్ద్రేణ సూర్యేణ తమః పార స్త్యదేశజమ్” ఇత్యాదౌ కవిభిరేవ వ్యవహ్రియతే త్యవగన్తవ్యమ్. తదుక్తం శ్రీభోజరాజేన “రలయో ర్లడయో స్తద్వ ల్లళయో శ్శసయోరపి। వబయో ర్నణయో శ్చాన్తే సవిసర్గావిసర్గయోః సబిన్దుకాబిన్దుకయో స్స్యా దభేదేన కల్పనమ్” ఇతి.

వి:– ‘రలయోః’– అనువచనముచొప్పునఁ గొన్నివర్ణముల కభిన్నతావ్యవహారము కలదు. అందును ‘లడ, లళ’ అనువానియభేదము గొప్పది. వబల కభేదము ప్రాకృతవ్యాకరణమునఁ గలదు. “నీవిస్వ

ప్నైవా" అనుచోట వకారమునకు మాదేశము విధింపఁ బడినది. ఈ సూత్రములోనికి వకారమకారములు పూర్వసూత్రమునుండి యను వృత్తములు కావలయును. వబల కభేదము నంగీకరింపకున్న నది దుర్ఘటము. ఇట్లు చెప్పుటవలన 'అబ్దమ్' అనునపుడు "దవలాఽప్యథశ్చ" అను చోప్పున బలోపము సిద్ధించును. ఇంకను దీనివిస్తరము షడ్భాషా చంద్రిక మున్నగువానివలనఁ దెలియనగును. "రామచంద్రుఁ డను సూర్యునిచేఁ బౌరస్త్యదేశజమగుతమస్సు పోఁగొట్ట బడెను" అనునపుడు 'పౌరస్త్య' పదములోని రేఫమునకు లకారోచ్చారణ మభిన్నతవలనఁ గల్గుచున్నదిగదా! అపు డది 'పౌలస్త్య' అని మాఱును- 'ముందున్న చీఁకటిని సూర్యుఁడువలెఁ బౌలస్త్య (రావణ) దేశములోని తమోరూప రక్షోగణమును రామచంద్రుఁడనుసూర్యుఁడు నశింపఁజేసెను.' ఇట్టియెడ 'ర-ల'ల కభిన్నత. "రల, లడ, లళ, శస, వబ, నణ" అనువాని కభేదము పాటింపనగును" మఱియుఁ 'బదాంతమున విసర్గము కలదానికి లేనిదానికిని బిందువు కలదానికి నదిలేనిదానికి నభేదకల్పన చేయనగునని భోజరాజుగా రనిరి.

12. సూ. 10:- ఏవం స్థితే అప్పకవినా యదుక్తం "యత్తు రలయోర్మైత్రతాఽస్తీతి లాక్షణికానా ముక్తి ర్నప్రామాణికీతి" 'లీలామకరాంకచంద్ర రేఖాంకురచూడాలంకారపదాంబురుహాలింగింతమహీతనిర్మలాంతఃకరణా' ఇత్యాదౌ రేఖాశబ్దస్య లాదిత్వమపి నైఘణ్టికై రుక్తత్వా న్నరేఫాదిత్వ మితి తదవిచారితాభిధానమే వేతి స్పష్టమేవ. ఏతేన 'రాయంచకాళ్ళఁ దొలకయమున్న' ఇత్యాదికవిప్రయోగాణాం న కిఞ్చిద ప్యసామఞ్జస్య మితి జ్ఞేయమ్. ప్రాసే తు తదభిన్నత్వం కవిభి ర్న వ్యవహృత మితి జ్ఞేయమ్.

వి.- "లీలామకరాంక చంద్రరేఖాంకుర' అనునపుడు రలలకు యతిమైత్రి చేయఁబడినది. కాని 'రేఖా' శబ్దమునకు 'లేఖా' అను రూపము కలదని నిఘంటుకారు లంగీకరించియున్నారు. కాన "రలలకు మైత్రత కల" నెడి లాక్షణికోక్తి ప్రామాణికము కాదు" అనినయప్పకవి

మాట సరికాదు గదా! 'రాయంచ కాళ్ళఁ డాలకయున్న' మున్నగు కవిప్రయోగములు సముచితములే. ప్రాసములలో మాత్రము రలల కభిన్నతను గవు లంగీకరింపలేదు.

**13.** సూ :— ప్రకృతేస్తు తే దశోనా స్స్యుః.

13. సూ. 1 :— దశవర్ణా ఊనా యేషాం తే దశోనాః. ప్రాకృత్యాం దశోనా స్తే పఞ్చాశద్వర్ణా భవన్తి. ప్రకృతిశబ్దనిష్పత్తి శ్చత్వారింశద్వర్ణై ర్భవతీత్యర్థః. తత్రోనా దశవర్ణాః ఋౠ, ఌౡ, ఐఔ, వర్ణా అసంయుక్తఙఞా శషా చేతి. ఉక్తఞ్చ భాషానుశాసనే- "శషా వసంయుక్తఙఞా" ఇతి. తేన 'ఙు క్రేఙ్గం' ఇతి సూత్రనిష్పాదితానాం 'సుఙ్గో, మఞ్జులో' ఇత్యాదిరూపాణాం సంయుక్తవర్ణాన్విత త్వేఽపి నకశ్చి ద్దోషః. శషవర్ణనిషేధస్య సంస్కృతీయవిషయత్వేన "స్తోస్తా" ఇతి మాగధ్యాం శవర్ణస్య విద్యమానత్వేఽపి నవిరోధః. ప్రాకృత్యాం విసర్గస్య సాక్షా దభావేఽపి "ఙ్కఃకః" ఇతిసూత్రే తత్ స్థానికస్య జిహ్వామూలీయస్య సత్వా త్తస్యాపి విద్యమానతుల్యతేతి ఏతావన్మాత్రాశయేన భాషాశబ్దానుశాసనగ్రన్థే "దశస్వరాః" ఇత్యుక్తమితి తత్తాత్పర్యం తత్తాత్పర్యవిదో విదాంకుర్వన్తు.

వి:— ప్రకృతేః-తు-తే-దశోనాః-స్యుః- అనిఛేదము. సంస్కృత భాషావర్ణము లేఁబదింటిలోఁ బ్రాకృతభాషకుఁ బది వర్ణములు తక్కువ యని యర్థము. అవి ఋౠ, ఌౡ, ఐఔ, ఙఞ, శష-అను పది వర్ణములు. ఋగ్వేదకాలమందు వ్యవహారములో నున్న భాష సంస్కరింపఁబడి సంస్కృతభాషారూపమున నిష్పన్నమైనది. తరువాతఁ గొంత కాలమునకు వైయాకరణులు నాఁటివ్యావహారికభాషను నాటకోపయోగమునకై సంస్కరింపఁగా నది ప్రాకృత మైనది. ఆర్యావర్తములోని నేఁటివ్యావహారిక భాష లాప్రాకృతభాషనుండి నిష్పన్నమైనవి. ఈవిషయముల నాంధ్రవ్యాకరణసంహితాసర్వస్వము నుడివినది. సంస్కృత భాషాపదములకుఁ దెనుఁగునందుఁ దత్సమరూపమునఁ బ్రవేశ మున్నట్లు ప్రాకృతభాషాపదముల కన్నింటికిని లేదు. ఆంధ్రవర్ణఘటితములకుమాత్ర మేకలదు. కావుననే తెల్గునందలిప్రాకృతసమములను సంస్కృతభవము

లననొప్పు ననుచున్నారు. కావుననే "సంస్కృతసమేతరం బయినయీ భాష 'అచ్చ' యనంబడును" అని బాలవ్యాకరణము చెప్పినది. (బాల ఆచ్ఛిక-1.)

సూరిగా రీపై విషయములనే సంస్కృతభాషకు వర్ణంబు లేఁబది" (బాల-సంజ్ఞ-1) "ప్రాకృతమునకు వర్ణములు నలువది" (బాల సంజ్ఞ. 2) అని తెనుఁగునఁ జింతామణికారునియభిప్రాయమును వివరించినారు.

14. సూ:- షట్త్రింశ దత్ర.

14. సూ. 1 :- అత్ర శుద్ధవికృతౌ షట్త్రింశద్వర్ణానాం వ్యవహారః 'ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః' ఇతి రేఫస్య ద్వైవిధ్యకథనేన గురురేఫస్యాపి వర్ణమధ్యే పరిగణన దశాయాం "సప్తత్రింశదిహేష్యే" ఇత్యప్పకవిపుస్తకపాఠోఽపి సాధురేవ. తస్య రేఫభేదత్వేన వర్ణాన్తరత్వా పరిగణనదశాయా మయంఽపాఠ ఇతి విశేషః.

వి:- షట్త్రింశత్-అత్ర-అని చేదము. సూత్రములోని-అత్ర అను దానికి "శుద్ధవికృతి" అని కవిశిరోభూషణ మర్థము చెప్పినది. దీనిచే 'శుద్ధవికృతి' దేశ్యతద్భవాత్మక మనియు, 'వికృతి' తత్సమతద్భవదే శ్యాత్మకమనియు నర్థ మగుచున్నది. కాఁగా సంస్కృతమునకుఁ జెప్పిన వర్ణములు సంస్కృతసమములందును, ప్రాకృతమునకుఁ జెప్పినవర్ణములు ప్రాకృతసమములందును నిలువఁగాఁ దద్భవదేశ్యాత్మక మగు తెలుఁగు నకు ముప్పదియాఱువర్ణములని తేలినది. కాని ప్రాకృతసమమునుసంస్కృత వికృతి (సంస్కృతభవము) కానోపును. "సంస్కృతసమేతర మగునీభాష 'అచ్చ' యనంబడు" అని బాలవ్యాకరణము.

బాలసరస్వతీయచింతామణియందు 'షట్త్రింశ దత్ర' అను పాఠము వెలయుచుండఁగా నప్పకవీయచింతామణియందు 'సప్తత్రింశ దిహ' అనుపాఠ మగపడుచున్నది. ఈపాఠముచొప్పున శకటరేఫమును గూడ వర్ణమాలలో నొకప్రత్యేకవర్ణముగాఁ బరిగణింపవలెనని కవి శిరోభూషణాభిప్రాయము తెల్లమగుచున్నది. కాని లఘ్వలఘుభేదయుత

వర్ణములను వర్ణమాలలో రెండుగాఁ బరిగణింపరాదని సంప్రదాయ వాదులయుద్దేశము. "అనుప్రదాన మనుబాహ్యప్రయత్న భేద మున్నపుడు, నుచ్చారణమున వాయుసంసర్గాతిశయము కల్గినపుడు, వర్ణోత్పత్తి స్థానభేద మున్నపుడుఁ, గరణభూత మగుజిహ్వకుఁ బ్రచారభేద మున్నపుడు, స్వరోచ్చారణమున మాత్రాభేదము కల్గినపుడును వర్ణాంతరకల్పన చేయవచ్చు ననుచు" "అనుప్రదానా త్సంసర్గాత్ స్థానా త్కరణవిభ్రమాత్ జాయతే వర్ణవైశేష్యం పరిమాణాచ్చ పఞ్చమాత్" అనివర్ణాంతరకల్పనముచేయఁదగినట్లులను బెద్దలు వచించియున్నారు. "తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు" (బాల. సంజ్ఞ 3) అని సూరిగారు దీనిని వివరించిరి.

"లఘవోఽలఘవశ్చేతి" అనుచోఁ బ్రోక్తవ-యరలవ-అను నాల్గిటికిని లఘ్వలఘు భేదము కలదు, వానిలో నలఘురేఫలకారముల రెంటిని వర్ణమాలలోఁ బఠించుట సంప్రదాయము కాదు. సంస్కృతమున-యవ-అను వానికిని ప్రాకృతమున-ల-అనుదానికిని—యవ-లకును లఘ్వలఘుభేదము కలదు. పై సంప్రదాయానుసారముగనే వర్ణమాలలో వారు లఘువులనే పఠించిరి. అలఘువులను బఠింపలేదు. అట్టిచోఁ దెనుఁగున రేఫను (అ) మాత్రమే వర్ణమాలలోఁ బఠింపనగు ననుట యుక్తిశూన్యము. లకారము ద్రావిడమూర్ధన్యము. అలఘురేఫము తెనుఁగునమాత్రము గలదు. కావున నప్పకవీయచింతామణిపాఠము— 'సప్తత్రింశ దిహ' అనునది సరికా దనుట కెట్టియభ్యంతరమును లేదు.

**15. సూ. తేఽన్యే చానుప్రవిశన్తి శబ్దయోగవశాత్.**

15. సూ. 1:- అన్యే చ షట్త్రింశదక్షరవ్యతిరిక్తా స్తే వర్ణాశ్చ శబ్దయోగవశాత్తత్సమాదిశబ్దయోగవశా దనుప్రవిశన్తి. స్వాతన్త్ర్యేణ శాద్యక్షరాణాం ప్రవేశో నాస్తి; కిన్తు 'షణ్ముఖుఁడు, శరీరము, భళి, మజ్జ' ఇత్యాదితత్సమాదిద్వారా ప్రవేశస్సమ్భవతీత్యర్థః.

వి:— "ఋౠఌౡఖఛఠథఫఘఝఢధభఙఞశషలు సంస్కృత సమంబులం గూడి తెనుఁగున వ్యవహరింపఁబడు" (బాల సంజ్ఞ-4) అని సూరిగారీసూత్రమును వివరించిరి. కావుననే 'షణ్ముఖుఁడు, శరీరము' మున్నగుచోటులందు షాదివర్ణములకుఁ దత్సమపదములమూలమున దెల్గునఁ బ్రవేశము కల్గుచున్నదని విశదమగుచున్నది.

**15.** సూ. 2 :— న చ త్రిలిఙ్గదేశవ్యతిక్తదేశీయానాం భళ్యాదీనాంప్రవేశే విరోధః. అహేయ మన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే ఇత్యథర్వణోక్తిః. శ్రీశైల ద్రాక్షారామకాళేశ్వరమధ్యవర్తిత్వే సాన్ధ్రదేశస్య త్రిలిఙ్గదేశ ఇతి ప్రసిద్ధిః. త్రీణి లిఙ్గాని యస్మిన్స త్రిలిఙ్గోదేశః. ద్రాక్షాఽఽరామాణాం భూయిష్ఠత్వా ద్ద్రాక్షాఽఽరామసంజ్ఞేతి ప్రౌఢోక్తిః. వస్తుతస్తు దక్షస్య సంబంధా ద్ద్రాక్షాఽఽరామ ఇతి తన్నామ. తదుక్తం స్కాన్దే "దక్షస్యాఽఽరామభూమిత్వా ద్ద్రాక్షాఽఽరామ ఇతీర్యతే" ఇతి. ఏత త్సర్వం రత్నాపణే కుమారస్వామియజ్వనా ప్రతిపాదితమ్.

వి:— త్రిలింగదేశవ్యతిరిక్తదేశీయములగు 'భళి' మున్నగు వానికిఁ దెనుఁగునఁ బ్రవేశము విరుద్ధము కాదు. "కవిప్రయుక్తమై యన్యదేశీయ మున్నచో నది హేయము కాదు" అని యథర్వణులు వచించిరి. శ్రీశైలము ద్రాక్షారామము కాళేశ్వరము అను త్రిలింగ క్షేత్రములకు మధ్యదేశమున నుండుటచే దీనికిఁ 'త్రిలింగదేశ' మను ప్రసిద్ధి కల్గినది. ఇందు ద్రాక్షపండ్లయారామము లధికముగ నుండుటచే దీనికి ద్రాక్షారామ మనుపేరు కల్గినదనుట ప్రౌఢోక్తి. దక్షప్రజాపతి కిది యారామ మగుటచేఁ గల్గినదనుట లెస్స. రత్నాఽఽపణగ్రంథమున నీవిషయ మిట్లే యున్నది. 'శబ్దయోగవశాత్' అనుదానికిఁ దత్స మాదిశబ్దయోగవశాత్' అని కవిశిరోభూషణము వ్యాఖ్యానించినది. ఇందలియాదిశబ్దముచే నన్యదేశ్యమును గ్రహించినట్లు తెలియుచున్నది. "ఆంధ్రదేశమునఁ బ్రసిద్ధిఁజెంది వ్యాకరణవిరుద్ధముకాని 'రోజు'మున్నగు శబ్దములు తెలుఁగునందుఁ బ్రయోగింపఁబడుచునే యున్నవి" అని 'అహేయమ్' అను దానికి వ్యా.సం.స. అర్థము చేసినది. 'ఆంధ్రమునఁ

బర్యాయపదము లేనందున విఁకపరానియన్యదేశ్యము 'మలకలు'మఁన్న గునపి ప్రయోగింపఁబడుచునే యున్నవి' అనియర్థముచేయుట సముచిత మని తోఁచుచున్నది. నన్నపార్యునికాలమున నన్యదేశ్యము కవిప్రయు క్తము కాకున్నను నథర్వణాచార్యునినాఁటికిఁ గవిప్రయుక్తము లగు చుండుటచే వాని కతఁడు సాధుత్వమును గల్పించెనని యూహింపనై యున్నది. చింతామణి యన్యదేశ్యము నంగీకరింపకున్నను దరువాతఁ గవిప్రయోగ మగపడుటచే నథర్వణుఁడు దాని నంగీకరించుటచే సూరిగా రంగీకరించుట సముచితమని తోఁచుచున్నది. కాని వా రట్లు చెప్పలేదు.

15 సూ. టీ '- త్రిలిఙ్గశబ్దాదేవ భవతి 'తెలుఁగు' ఇతి పదమ్. నకారమధ్యకమపి పదం తద్భవమేవేతి వ్యవజహార ఆచార్య ఆదిసర్వజ్ఞః. "ఆంధ్రవిషయపురస్థాయు లైన సకల, జనములగును మఱుంగు వేశంబు లేక, తేఁటతెల్లముగాఁ బల్కుమాటలెల్ల, వవని శుద్ధాంధ్రదేశ్యంబులగును గృతుల" "పాలను బెఱుఁగును నెయ్యిన్, వాలా యము చట్టిఁబట్టి వంచుక త్రావెన్, ఆ గెత్తుక నీబిడ్డఁడు, జోలిఁక నేమున్న దనఁగ శుద్ధాంధ్ర మగున్." "ఁ కేశవ! యాంధ్రులు నానా దేశంబులయందు నిలిచి తెలుఁగువె త్తి, ద్దిశో క్తులట్లు పలికిననాశబ్దము లన్యదేశజాంధ్రములయ్యెన్. "సీ. ఆలంబు చివ్వ కయ్యము పోరు బవరంబు దుర మని యొంటరి దొమ్మి కలను। వెలఁది యింతి పడంతి యొలనాగ చెలి బోటి పొలఁతి తొయ్యలి నాఁతి మెలఁత నెలఁత। మేను వేనవి మోవి కాను డెందం బక్కు వీను బల్లము కేలు వెన్ను నొసలు। వావిరి యే ర్తెర వరలుట కొట్టి లుట నలి నొగి మెఁగి పర్వి నలుపు సొలుపు। గీ. నెల తునక వాఁక వలవంత నెమ్మి కొలఁకులారజము సోయగము గొనయంబు చిలువ, యొల్లి చెచ్చెర మక్కువ తెల్లమి యనఁదనరు నిటు లన్యదేశజాంధ్రములు కృతుల" "ఆ. తవర రవిర తవయ రావుస ఘాకయు, మొదలుగా ద్వితీయములు చతుర్థ। వర్ణములును గల్గువాక్యంబు లన్యదే, శ్యములు గాని వైకృతములు గావు" ఇత్యప్పకవిః.

వి:_ త్రిలింగశబ్దమునకు 'తెలుఁగు, తెనుఁగు' అనునవి తద్భ వములని కవిశిరోభూషణము తలంచినది. వీనిని నన్నపార్యుఁడు తన భారతమున నుపయోగించెను. త్రిలింగశబ్ద మర్వాచీన మగుటచే 'తెలుఁగు, తెనుఁగు' అనునవి దేశ్యములేకాని తద్భవములు కావని

కొందఱు పరిశోధకు లనుచున్నారు. నన్నపార్యుని ప్రయోగము ననుసరించి సూరిగారు "తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱు" (బాల-సంజ్ఞ—3,) అని చెప్పిరి. ఇం దప్పకవి యన్యదేశ్యములనుగుఱించి విపులముగాఁ జెప్పెను. ఆంధ్ర దేశమున స్థిరనివాసము గలసకలజనులకును దేటతెల్లముగా నుండుమాటలు శుద్ధాంధ్రములనియు నాంధ్రులు నానాదేశములలో నివసించి చిత్రము లగుతద్దేశోక్తులవలెఁ దెలుఁగుపలుకులను బలికిన నవి యన్యదేశజాంధ్రము లనియుఁ జెప్పెను. ఇవి కాక యన్యదేశ్యము లన్నవి మఱికొన్ని కల వనెను. శుద్ధాంధ్రదేశ్యమునకుఁ జెప్పినలక్షణ మాతనికాలమున సరిపడినదేమో కాని నేఁ డాంధ్రదేశ్యమున కాలక్షణము చాలదు. తెలుఁగుదేశమం దొకప్రాంతమందలివ్యవహార మింకొకదేశములోనివారికిఁ దెలియదు. ఒక్కొక్కజాతిభాష కొక్కొక్కరీతియుచ్చారణ ముండును. ఆజాతులు సహజోచ్చారణముతోఁ దెలుఁగుపలుకులను బలికినపుడట్టి వాని నన్యదేశజాంధ్రము లనెను. ఇప్పు డాభేదము నెవ్వరుఁ జెప్పలేదు. తెలుఁగుశబ్దములు దేశ్యములు; తదితరము లన్యదేశ్యము లనుటయు సరికాదు. —కావు—మున్నగువానిలో ద్వితీయచతుర్థాక్షరముల నిల్పుటకు నాధారములు లేవుగదా.

అప్పకవి "సప్తత్రింశదిహ" అనుపాఠము నంగీకరించెను. శకటరేఫముతో ముప్పదియేడువర్ణము లనుట సరికాదు. లఘ్వలఘుభేదము 'యరలవ' యనునాల్గువర్ణములకును గలదు. మిగిలినమూఁడువర్ణములకు వర్ణాంతరత్వకల్పనము లేనపుడు శకటరేఫమునకుమాత్ర ముండుట సమంజసము కాదు గదా! 'యవ' అనువర్ణముల లఘ్వలఘుతలకు లిపిభేదము లేదు. రలలకు మాత్రము కలదు. లిపిభేదము కలవానిలో ల(ళ)కారము వర్ణమాలలోఁ బరిగణింపఁబడినది. దానివలెనే లిపిభేదము గలశకటరేఫనుగూడ వర్ణాంతరముగఁ బరిగణించుట యుచితమే కావున 'సప్తత్రింశ దిహ' అనుపాఠము సమంజసమే యని యప్పకవి

యూహించినట్లు తోఁచుచున్నది. ఇదిసరికాదు. వర్ణసమామ్నాయమం దలి ళకారము వర్ణాంతరళకార మగునుగాని యలఘుళకారము కాదు. 'ఈళే' మున్నగుఋగ్వేదమంత్రములలో నున్న ళకార మొకటియు, 'గయ్యాళి' 'కూళ' మున్నగుద్రావిడపదములలో నున్నది రెండవదియు, బహువచనము పరం బగునపుడు రలడల కాదేశ మైనది మూఁడవదియు నని ళకారము మూఁడువిధములుగ నున్నది. ఇందు మూఁడవదికాక మిగిలినళకారము వర్ణసమామ్నాయమునందుఁ బరిగ్రహింపఁబడినదని తెలియనగుచున్నది. కాన నప్పకవియభిప్రాయము ననుసరించి శకట రేఫమును వర్ణాంతరముగఁ బరిగణించుట సరికా దనక తప్పదు.

**16.** సూ .— ద్వివిధా ఽ దిదుదేదోతో ఽ చో వక్రతమా చాప్యనుస్వారా చ.

16. సూ. 1 :- ద్వివిధేతి:- ద్వివిధాః హ్రస్వదీర్ఘభేదేన ద్విప్రకారా అకారా దయః; వక్రతమా చ ఐకారౌకారౌ వక్ష్యమాణసంజ్ఞా పూర్ణార్ధభేదేన ద్వివిధా వను స్వారా చ ఏతే చతుర్దశ అచః.

**17.** సూ. :— కగచజయుగటడణతదనపబమయరలవసహాళస్తు హల్వర్గః.

17:— 'యరలవసహాళ స్తు హల్వర్గః' అనుచోటి 'ళ' కార మలఘు ళకారమని కొందఱు భావింతురు. అది సరికాదు. ఈ 'ళ' కారము ద్రావిడభాషావర్ణము. నేఁడు తమిళమున నిది గలదు. మూలద్రావిడ భాషలోనియీవర్ణమును నేఁడు తెనుఁగువారు కొందఱు వింతయక్షర మనుచున్నారు. ఏతద్వర్ణఘటితమూలపదములు కొన్ని 'డ ళ' కార రూపముగను, గొన్ని 'ఱ'కారరూపముగను దెనుఁగులో మాఱినవి. కావున నీ 'ళ'కారమును ద్రావిడమూర్ధన్య 'ళ'కారమని వ్యవహరించు చున్నారు. అలఘుళకారము దీనియుచ్చారణముతో వ్యవహరింపఁ బడుటవలన ద్రావిడమూర్ధన్యమును గూడ నలఘుళకారమనుట తట స్థించినది. కాన నిది వేఱు; అది వే ఱని తెలియవలయును.

గ్రంథప్రారంభమునందు వ్యాకరణములలో వర్ణమాలను బఠించుట ప్రాచ్యభాషలసంప్రదాయము. స్వరములు, వ్యంజనములు, నీ రెంటియొక్క-కలయిక యని మూఁడువిధములతో నక్షరము లేర్పడి, వానితోఁ బదములు; వాక్యములు, మహావాక్యములు నేర్పడుచున్నవి. కావున వ్యాకరణమునకు మొదట వర్ణమాలను బఠించుట యవసరమే. సంధిసమాసాదికార్యములలో వర్ణలోపవర్ణాగమాదికార్యములు వ్యాకరణమువలన జరుగునుగాన వ్యాకరణజిజ్ఞాసువులకు వర్ణమాలాపరనము తొల్త నావశ్యకమే. కావునఁ జింతామణియు మొదట వర్ణమాలను బఠించినది. వికృతివివేకము చింతామణికి వివరణ మగుటచే నందు వర్ణమాల పఠింపఁబడ లేదు.

ఆంధ్రులు కర్ణాటులు నొక్క-లిపినే యాశ్రయించిన ట్లగపడును. ఈలిపి దేవనాగరినిగాని దానికిఁబూర్వమం దున్నలిపినిగాని యాశ్రయించినదని యూహింపనగును. మనదేశములోని ప్రాకృతభాష లన్నియు నాలిపినే యాశ్రయించినవి. వాని ననుసరించి యాంధ్రకర్ణాటలిపులు నేర్పడినవని యూహింపక తప్పదు.

సంస్కృతప్రాకృతభాషలవలె వానిలిపులును వానిసంప్రదాయములు కొన్నియుఁ దెలుఁగువ్యాకరణములలో నగపడుటవలన వీనిసంబంధము విడఁదీయరాని దైనది. కాఁగా నాంధ్రవ్యాకరణముల మొదట సంస్కృతప్రాకృతవర్ణమాలయుఁ దెనుఁగువర్ణమాలతోఁ పాటుగాఁ బఠింపఁబడుచున్నది. సంస్కృతభాషనుండి తత్సమతద్భవరూపమునఁ దెనుఁగులోనికి శబ్దములు వచ్చినట్లే ప్రాకృతములోనికిని దత్సమతద్భవరూపమునఁ బదములు వచ్చినవి. అవి యటనుండి తెనుఁగులోనికిఁ గొన్ని వచ్చినవి. అట్టివానిపరిజ్ఞానము వానివర్ణస్వరూపము తెలియనిదే తెలియదుగానఁ దెనుఁగువ్యాకరణము మొదట సంస్కృతప్రాకృతవర్ణములు ముందుఁ జెప్పి పిదపఁ దెనుఁగుభాషా వర్ణములను జెప్పుట

తటస్థించినదని యూహింపనగును. ఋఋూ ఌౡః ఖఛఠథఫఘఝఢ ధభజఞశషయను వర్ణములు పందొమ్మిదియు సంస్కృతమునఁగలవు; తెనుఁగున లేవు. మిగిలినముప్పదియొక్క వర్ణములును దెనుఁగునను గలవు. ప్రాకృతమునఁ గూడ ఋఋూఌౡఐఔఙఞశష అనుపదివర్ణములును లేవు. విచిత్రమేమన సంస్కృతమం దున్న యీఁదిపందొమ్మిదివర్ణము లును దెనుఁగున లేవు గానఁ దద్భవదేశ్యపదములలో నీవర్ణములుండవు. సంస్కృతసమములతోఁ గూడి తెనుఁగున వ్యవహరింపఁబడవచ్చును. ప్రాకృతమున లేనిపదివర్ణములు నేరూపమునను బ్రాకృతభాషలో నుపయోగింపఁబడవు. సంస్కృతమున నిత్యమైనపరసవర్ణ శాస్త్రము ప్రాకృతమునను దెనుఁగునను గూడ వర్తింపదు. కానఁ దెనుఁగునఁ బర సవర్ణముల వ్రాయరాదు. సంస్కృతమునఁ బరసవర్ణము చేసియే వ్రాయవలయును.

17. సూ 1. వృత్తి:- చయుగం జయుగ ఇత్యేతద్ద్వయమత్ర యుగశబ్దస్యాన్వయః. తస్యచజయో ర్వక్ష్యమాణత్వా ద్ద్వైవిధ్యమ్. సహాళన్త్వి త్యత్ర సర్వో ద్వంద్వో విభా షైకవద్భవతీ త్యేకవద్భావే 'సనపుంసకమ్' ఇతి నపుంసకత్వమ్. ఏతే వర్ణాస్తుహల్వర్ణః. హల్సమాహః. సప్తత్రింశదితి పాఠానుసారే అప్పకవిపుస్తకే "రయుగలయుగవస హాళ్చ హల:" ఇతి పాఠాన్తరం జాగర్తి. తత్ర గురుజకార మాదాయ రస్య ద్వైవి ధ్యమ్.

వి:- ద్వివిధావిదు దేదో౽ఽతః-అచః-వక్రతమా-చ-అపి-అనుస్వా రౌ-చ-కగచజయుగటడణతదనపబమయరలవసహాళమ్-తు-హల్వర్ణః- అని 16, 17 సూత్రములకు భేదము. "అఆ,ఇఈ,ఉఊ,ఎఏ,ఒఓ,ఐఔ,ంఁ," అనునీపదునాల్గును నచ్చులు. పూర్ణార్ధభేదముతో ననుస్వారము రెండు విధములని ముందు (18.సూ.) చెప్పఁబడును. "కగచచజజటడణతదన పబమయరలవసహాళ" అనునిరువదిరెండును హల్లులు. అప్పకవి పాఠాను సారముగా "కగచచజజటడణతదనపబమయరఱలళవసహ" అని యిరు

పదిమూఁడు హల్లులు. మిగిలినవి యచ్చులు. "అచ్చులు-హల్లులు" అనునవి సంస్కృతవ్యాకరణప్రత్యాహారలబ్ధ సంజ్ఞలు. వీనికి 'స్వర ములు, వ్యంజనములు, అని ప్రసిద్ధి,

వర్ణసమామ్నాయమునందు లఘువులకే పాఠము కాని యల ఘువులకుఁ బాఠములేదు. అట్లు పాఠము చేయుట సంప్రదాయవిరుద్ధము. లఘ్వలఘుభేదము నాల్గువర్ణముల కున్నదిగదా! అట్టిచో రేఫలకారము లను లఘ్వలఘువులను వర్ణసమామ్నాయమునఁ బఠించి, మిగిలినవానిని విడుచుట సరికాదు గదా! వర్ణసమామ్నాయమునందలిళకార మలఘు లకారము కాదు గద. అది వర్ణాంతరలకారము. కాఁగా నలఘురేఫమును మాత్రము వర్ణాంతరమనుట సరి కాదు. సూరిగారును ళకారమును వర్ణాంతరమని యసందిగ్ధముగ వచించిరి. దీనికిఁ గొందఱపవ్యాఖ్య చేసిరి. అది సరికాదు.

18. సూ :- సిద్ధ స్సాధ్య శ్చానుస్వారః పూర్ణార్ధభేదతో ద్వివిధః॥
ప్రహ్స్వా త్పూర్ణోఽపి భవే ద్దీర్ఘాచ్చే త్ఖణ్డ ఏవ స జ్ఞేయః॥

18 సూ. 1:- సిద్ధఇతి:- సిద్ధస్సాధ్యశ్చానుస్వారః పూర్ణః అర్ధశ్చేతి ప్రత్యేకం ద్వివిధః. "కలంగి, చెలంగి, తలఁగి, తొలంగి" ఇత్యాదౌ సిద్ధానుస్వారః, అలాక్షణి కత్వాత్. 'రాముఁడు, కృష్ణుఁడు' ఇత్యాదౌ సాధ్యానుస్వారః, లాక్షణికత్వాత్. సిద్ధ స్సాధ్యశ్చఖణ్డానుస్వారః ప్రహ్స్వా ల్లఘ్వక్షరా త్పరశ్చే త్పూర్ణోఽపి భవేత్. అపిశబ్దాత్స్వరూపేణాపి స్థితో భవేత్. అర్ధానుస్వార ఏవ ఖణ్డానుస్వారః 'కలఁగి, కలంగి' ఇత్యాది.

వి:- సిద్ధః-సాధ్యః-చ-అనుస్వారః -పూర్ణార్ధభేదతః - ద్వివిధః, ప్రహ్స్వాత్ -పూర్ణః-అపి-భవేత్ -దీర్ఘాత్-చేత్ -ఖండః-ఏవ-సః-జ్ఞేయః అని ఛేదము. ఈకారికయంతయు నొకటేసూత్రము. సిద్ధసాధ్యభేదముగల పూర్ణార్ధానుస్వారముల స్వరూపస్వభావవినియోగము లీసూత్రమునఁ జెప్పఁబడినవి. 'కలంగి, తలంగి, చెలంగి, తొలంగి' అనువానియందలియను

స్వారములు సిద్ధములని కవిశిరోభూషణమునఁగలదు. వీనిలోనిపూర్ణాను స్వారములు 'హ్రస్వా త్పూర్ణోఽపి భవేత్' అనుచెప్పున సిద్ధించినవగుటచే నవి సాధ్యములేకాని సిద్ధములు కావు. హ్రస్వా ల్లఘ్వక్షరా త్తని వ్రాయుటచే "హ్రస్వం లఘు" అనుదాన సిద్ధించినలఘు విచట గ్రహింపవలయు నని తెలియుచున్నది. వీనియందలియర్ధములు సిద్ధములు, పూర్ణములు సాధ్యములు నగు నని తెలియ వలెను. మఱియు సూత్రమందలి సః అనుదాని కర్ధానుస్వార మని కవిశిరోభూషణముచే నర్థము చేయఁబడి నది. అట్టియర్థమున కాధార మగపడదు. 'సః' అనునది తచ్ఛబ్దము. పూర్వాపరామర్శచే దీనికి బిందువని యే యర్థము చేయనగును. కాఁగా 'సః' అనుదానికి 'అనుస్వారము' అని యర్థము చెప్పవలెను. హ్రస్వాక్షరముకంటెఁ బరమగుననుస్వారము పూర్ణార్ధ రూపములతో నిలుచుననియు, దీర్ఘముకంటెఁ బరమైనయనుస్వారము ఖండరూపముననే యుండుననియు దాని కర్థము. పూర్ణము ఖండము కానోపును. ఖండము పూర్ణము కాఁజాలదుగదా.

18 సూ. 2 :— దీర్ఘాత్పరశ్చే త్ఖణ్డ ఏవ న తు పూర్ణః 'వాఁకతోఁక, పీఁక, పోఁక' ఇత్యాదయః 'విందు, ముందు, పొందు, కందు' ఇత్యాదౌ కేవలపూర్ణానుస్వారః. వికృతివివేకే తు 'కెందమ్మి, చెందొవ' ఇత్యాదా వనుస్వారస్య సాధ్యస్యా ర్ధబిన్దుతాయాం ప్రాప్తాయాం "న ఖణ్డః ప్రథమా ద్ధ్రస్వా ద్వైకృతేఽత్ర కదాపిచ" ఇత్యుక్తమ్. హ్రస్వశబ్దేన హ్రస్వాజన్తో హల్వివక్షిత ఇతి. ఇఁక, ఇంకేత్యాదౌ న దోష ఇతి జ్ఞేయమ్. తత్రైవ

> తృతీయే ప్రథమే వర్ణే పర ఏవహి దృశ్యతే
> బిన్దు ర్వైకృతమధ్యేఽత్ర నాన్యవర్ణే పరేతు సః॥

వి:— "న ఖణ్డః ప్రథమాద్ధ్రస్వా న్నస్య లోప శ్చ నేష్యతే" అని పాఠాంతరము. పదము మొదటిహ్రస్వముకంటెఁ బరముగ నర్ధబిందు వుండదు. అట్టియెడ ద్రుతమునకు లోపమునయితము రాదు. ద్రుత కార్యము లగుబిందుసంశ్లేషసత్వలోపములలోఁ బ్రథమహ్రస్వముమీఁద

ఖండబిందు వుండదు; ద్రుతలోపము నుండదు; మిగిలినపూర్ణ బిందు స్వాస్వసంశ్లేషములు పదము తొలిహ్రస్వము మీఁద నుండ నగునని "న ఖణ్డః" అనుదాని కర్థము. వికృతిభాషయందు వర్గప్రథమ తృతీయవర్ణములనఁగా 'కచటతపగజడదబ' అనునవి పరమగునపుడే బిందు వగపడుచున్నది. ఇతరవర్ణములు పరమగునపు డగపడలేదు" అని "తృతీయే" అనుదాని కర్థము. పరుషసరళములు పరమగునపుడే ద్రుతమునకు బిందురూపము కల్గనగును గాని స్థిరవర్ణములు పరమగునపు డట్టిమార్పు కల్గదని తాత్పర్యము. ఇట్టి నియమమున్నను భోజరాజీయము నందు 'కంసాల' అనియు, నాంధ్రభాషార్ణవమున 'కంసాలి' అనియుఁ బ్రయోగము లగపడుచున్నవి. ఇట్లు స్థిరపరకబిందువు ప్రాచీనప్రయోగములలో మఱి యెచ్చట నగపడదు. భోజరాజీయములోని యీ పాఠము కవిప్రయుక్తము కాదనియు "వారు నట్లు చేసినచ్చొట్లుగఁ గమ, సాలజాతివాఁడు చాలగీడు" అని కవిప్రయుక్తమై యుండుననియు వ్యా.సం-స- చెప్పుచున్నది. ఆంధ్రభాషార్ణవములోని 'కంసాలి'పదము వ్యావహారికము కానోపును. బాల. సంజ్ఞ. 14, 15, సూత్రములచే సూరిగారీపై విషయములను సంగ్రహించినారు.

సిద్ధపూర్ణము, సిద్ధఖండము, సాధ్యపూర్ణము, సాధ్యఖండము ననుభేదములతో నాల్గువిధములుగాఁ దెనుఁగునందు బిందు వుండునని చింతామణి చెప్పినది. అథర్వణాచార్యులుగారు వికృతిపదమధ్యము నందు బిందు వున్నపు డది పరుషసరళవర్ణములకు ముందే యుండును గాని స్థిరవర్ణములకు ముం దుండదనియుఁ, బదముతొలిహ్రస్వము మీఁదఁ బూర్ణబిందు వుండనగునుగాని ఖండబిందు వుండదనియుఁ జెప్పి వివరించినారు. ఈసందర్భమునందలియథర్వణకారిక "న ఖణ్డః ప్రథమార్ధిస్స్వాద్వైకృతేఽత్ర కదాపిచ"అని కలదు. "న ఖణ్డః ప్రథమార్ధిస్స్వాన్నస్య లోపశ్చ నేష్యతే" అని దీనికిఁ బాఠాంతరము కలదు. "అఁట, ఇఁక, చుఁడు, శబ్దములందప్ప నుడితొలిహ్రస్వముపై ఖండ

బిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" (బాల-సంధి-22 సూ) అను బాలవ్యాకరణసూత్రమునుబట్టి సూరిగారికి రెండవపాఠమే లభించినదని తోఁచుచున్నది. ఈపాఠము సమంజసముగా నగపడుచున్నది. 'ముంగొంగు-క్రొంబసిఁడి' మున్నగువానిలో 'ముఁగొంగు-క్రొఁబసిఁడి' అను ననిష్టరూపములు వారింపఁబడుటయేగాక 'కదోయి' అను ననిష్టరూపమును నీపాఠము వారించుచున్నది.

18 సూ. 3 :- అద్యప్రకృత్యామపి సన్దతి త్ర్యంహా తీర్యాదౌ సిద్ధసాధ్యభేదవానుస్వారోఽస్త్యేవ. పూర్ణార్ధభేదావత్ర విశేష ఇతి జ్ఞేయమ్ "దీర్ఘ స్సంయుక్తాద్యః పూర్ణానుస్వారపూర్వవర్ణశ్చ, ఏతే గురవః శేషా స్సర్వే లఘ్వక్షరా ఇతి జ్ఞేయాః" ఇతి శ్లోకో ఽప్యవిపుస్తకే స్థితః. సంయుక్తాద్యః సంయుక్తవర్ణస్యాద్యో వర్ణః శేషం సుగమమ్.

వి:- "దీర్ఘ"-అను కారికయప్పకవీయములోనిదే యైనను దీని నథర్వణాచార్యులుగారు వివరించియుండుటచే నిది నన్నయప్రోక్తమని యంగీకరింపకతప్పదు. ఈకారిక ఛందోవిషయకగురులఘువులను నిర్ణయించుచున్నది. 'దీర్ఘవర్ణము, సంయుక్తవర్ణమునకుముందున్నవర్ణము పూర్ణానుస్వారముతోఁగూడినవర్ణము గురువగును. తక్కినది లఘువు' అనియీకారికకర్థము.

18. సూ. 4 :- వికృతి విశేషే :-

"సంయుక్తే సంస్కృతాద్యే స్యాత్సర్వ మాన్ధ్రపదం లఘు।
భవే దాద్యసమాసేఽపి రేఫయోగా త్పదం తథా ॥
పదేఽపి చ తథాత్వం స్యా త్క్వాచి న్నైవ సరేఫయోః."

ఇతి స్థితమ్. 'రావణుని ద్రోహిఁ జంపఁగా రాదటయ్య' 'నిన్న ప్రామిన్కగములెల్ల నెన్నునయ్య' ఇత్యాది తత్సమసమాసే రేఫయోగే పరే పూర్వపదస్య లఘుత్వే 'శతతాళదఘ్నహ్రదంబునఁ బడియె' ఇత్యాది కవిప్రయోగ ఉదాహరణమ్. 'అద్రువన్, విద్రువన్' ఇత్యాదావేకపదేఽపి సంయుక్తే పరే పూర్వవర్ణస్య లఘుత్వమ్. రేఫద్వయసంయోగే పరే తు న కదాచిదపి లఘుత్వమ్. 'వెఱ్ఱి, మఱ్ఱి' ఇత్యాదిక మత్రోదాహరణమ్.

వి:- 'తత్సమశబ్దాది నున్నసంయుక్తాక్షరము పరమైనపుడు పూర్వమం దున్నయాంధ్రపదముతుదివర్ణము లఘువే యగును, సంయుక్తవర్ణమునకుఁ బూర్వమునం దుండుటచేఁ గలుగవలసిన గౌరవముచటఁ గలుగదు. సిద్ధసమాసమునను రేఫసంయుక్తపూర్వవర్ణము లఘువే యగును' అని యథర్వణావచనమున కర్థము. ఈవిధి -'ప్ర,ప్రా' అను వర్ణములకుఁ బూర్వమునం దున్నవానికి మాత్రమే పాక్షికముగ వర్తించునని వ్యాఖ్యానింపనగును. కొన్నిసమాసపదములలో రేఫసంయోగము పరమం దున్నను లఘువు గురువు కాదని 'పదేపి' చ అనుదాని కర్థము. కొన్నియెడల నట్లు కాదు. రేఫద్విత్వము పరముగునపుడు పూర్వాక్షరము లఘువు కాదు. గురువే యగును. తక్కిన రేఫసంయోగము పరమైనపుడు అనఁగా 'వట్రువ', అబ్రము' మున్నగుచోట్ల రేఫసంయోగపూర్వవర్ణము లఘువుగనే యగపడుచున్నది.

18. సూ. 5 - వృత్తరత్నాకరే ప్యుక్తమ్ - "సానుస్వారో విసర్గాన్తో దీర్ఘో యుక్తపరశ్చ యః। వా పాదాన్తస్త్వసౌ గ్వక్రో జ్ఞేయోఽన్యో మాత్రికో లృజుః॥ పాదాదా విహ వర్ణస్య సంయోగః క్రమసంజ్ఞితః పురస్థితేన తేన స్యా ల్లఘుతాపి గురోః క్వచిత్" ఇతి. తద్వ్యాఖ్యాయాం కనకసభాపతినా ప్రోక్తమ్. వా పాదాన్త ఇతి :- పాదాన్తే యో లఘు స్తిష్ఠతి సోఽప్య పేక్షాయాం గురు ర్భవతీ త్యర్థః, పాదాదా వితి - ప్రథమపాదే తృతీయపాదే వా య దన్త్యాక్షరం లఘుభూతం యుక్తపరతయా గురుభూతమపి క్వచిద పేక్షాయాం లఘు ర్భవ త్యేవేత్యర్థః. "తరుణం సర్షపశాకం నవౌదనం పిచ్ఛిలాని చ దధీని, అల్పవ్యయేన సున్దరి గ్రామ్యజనో మృష్ట మశ్నాతి" ఇత్యుదాహరణమ్. అత్ర 'సున్దరి' ఇతి తృతీయపాదాన్తే య దక్షరం లఘుభూతం తదక్షరం 'గ్రామ్య' ఇతి యుక్తపరతయా గురుభూతమ ప్యపేక్షాయాం లఘు ర్భవతి. ద్వితీయపాదాన్తే చతుర్థపాదాన్తే వా యత్ - 'ని' - 'తి' - ఇత్యక్షరద్వయం తదపేక్షితత్వా ద్గురుత్వ మేవ ప్రాప్నోతి. అత్రార్థే న తాత్పర్య మితి సారావళ్యాం విశిష్యోక్తమ్. "సర్వాస్వపిచ భాషాసు రహాయుక్తే క్షరే పరే, పూర్వవర్ణస్య లఘుతా వేష్టా మల్లాదికేఽపి చ" ఇతి.

వి:- "అనుస్వారముతోఁ గూడినదియు, విసర్గాంతమగునదియు, సంయుక్తవర్ణము పరమైనదియు నగువర్ణము గురు వగును. పాదాంత్య వర్ణము వికల్పముగ గురువగును. 'ᑌ' అని దానిలేఖనము. రెండుమాత్రల కాలములో నది యుచ్చరింపఁబడును. తక్కినది లఘువు. దానిలేఖనము '।' అని యుండును. ఇది మాత్రాకాలికము. పాదాదియందున్న సంయోగమునకు 'క్రమము' అనిపేరు. అది పరమగునపుడు గురువర్ణమును లఘువేయగును" అని వృత్తరత్నాకరమునఁ గలదు. దానివ్యాఖ్యలోఁ గసకసభాపతి యిట్లనెను. 'పాదాంతమున నున్న లఘువర్ణము కావలయునన్న గురువగును. లఘుభూత మగుప్రథమతృతీయపాదాంత్యవర్ణములు లఘువులైనను యుక్తము, (పాదాదిసంయోగము పరమగునపుడు కావలసియున్నచో గురువగును' 'తరుణం' అనుపద్యమునందలి తృతీయపాదాంతమున నున్న 'రి' అను వర్ణము 'గ్రా' అను సంయుక్తవర్ణము పరమగుటచే గురువు కావలసియున్నను లఘువే యచట నపేక్షితమగుటచే లఘు వగుచున్నది. తృతీయచతుర్థపాదాంతమున నున్న 'సి, తి' అనువర్ణములు గురువులైనవి. 'ర, హ' అనువర్ణముల సంయోగము పరమగునపుడు పూర్వవర్ణము వికల్పముగ లఘువగును' అని సారావళి విశేషించి చెప్పుచున్నది. ఇది యంతయు సంస్కృతభాషాకవితకు సంబంధించినది. తెనుఁగుకవిత కుపచరింపదని తెలియవలెను.

సంస్కృతమున అనుస్వారవిసర్గజిహ్వామూలీయోపధ్మానీయము లనునవి గలవు. తెనుఁగునం దర్ధానుస్వారము కలదు. సంస్కృతమున నకారమకారములచోట బిందువు కల్గును. మకారస్థానమున జనించుననుస్వారము "మోఽనుస్వారః"అని పదాంతముననే కల్గును. నకారస్థానికమగుననుస్వారము - "నశ్చాపదాంతస్య ఝలి"-అని పదమధ్యమునను - "వాఽవసానే" - అని పదముచివర వికల్పముగను గల్గును.

తెనుఁగునందు బిందువు పదాంతమునందలి నకారమునకే కల్గును. కాని 'రక్షింపఁగలఁడు' మున్నగుచోటఁ బదమధ్యమునను నగపడుచున్నదని కొంద అందురు.

బాలవ్యాకరణము చింతామణి చొప్పున సంస్కృతప్రాకృతములను దెనుఁగునకును వర్ణములను జెప్పియుండఁగ – 'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియైదు' – అని ప్రౌఢవ్యాకరణము చెప్పినది. దీనిచేఁ దత్సమ తద్భవ దేశ్యాత్మక మగుదాని నాంధ్రభాష యనియుఁ, దద్భవ దేశ్యాత్మకమగు భాషను దెనుఁగనియు వ్యవహరింపనగునని తలఁచి నట్లు తెలియుచున్నది. 'ఎఒచజఁ' అనువానిని సంస్కృతభాషావర్ణము లతో జోడించినచో 55 వర్ణము లగుచున్నవి. దీని కాధారమేమో!

**19.** సూ:– లఘవోఽలఘవశ్చేతి ద్వేధా న్యస్థా న్విదన్తి శాస్త్రారః ।
అన్యేఽన్యవ్యాకరణస్పష్టా రస్త్వత్ర గృహ్యతే ద్వివిధః॥

19. లఘవోఽలఘవశ్చేతి:– శాస్త్రారః వ్యాకరణశాస్త్రకర్తారః, అన్యస్థాన్ యరల వాన్ లఘవః అలఘవశ్చేతి ద్వేధా విదన్తి జానన్తి. వర్ణానాం గురుత్వం లఘుత్వ ఞ్చోచ్చారణ గౌరవేణ తల్లాఘవేన చ సిద్ధ్యతి.

వి:– లఘవః – అలఘవః – చ – ఇతి – ద్వేధా – అన్యస్థాన్ విదన్తి – శాస్త్రారః – అన్యే – అన్యవ్యాకరణస్పష్టాః – రః – తు అత్ర – గృహ్యతే – ద్వివిధః అని ఛేదము. 'యరలవ' అనువర్ణములు లఘ్వలఘుభేదముచే రెండువిధములని వ్యాకరణశాస్త్రజ్ఞులనుచున్నారు. గురుత్వము లఘుత్వము ననునవి వర్ణోచ్చారణభేదముచేఁ గల్గును.

19. సూ. 2:– నన్వేతేషాం వర్ణానాం లఘుత్వం గురుత్వం కుత్ర ప్రసిద్ధమిత్యాశ ఙ్క్యాహ. అన్యేఽన్య ఇతి:– అన్యేరేఫవ్యతిరిక్తా యవలా అన్యవ్యాకరణస్పష్టాఃలఘ్వ లఘుభేదా వాన్ధ్రవ్యాకరణవ్యతిరిక్త సంస్కృతప్రాకృతవ్యాకరణస్పష్టాః. తథాహి :– "వ్యోర్లఘుప్రయత్నతర శ్శాకటాయనస్య" ఇతిపాణినీయవ్యాకరణసూత్రే యవయో ర్లఘ్వలఘుభేదేన ద్వైవిధ్యం స్పష్టమ్. యస్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలా

వాం శైథిల్యం స లఘూచ్చారణః, యస్యోచ్చారణే తేషా మశైథిల్యం స గురూచ్చారణ ఇతి రాద్ధాన్తః.

వి:— 'యరలవ' అనువాని కంతస్థములని పేరు. లఘ్వలఘుభేదముచే నివి రెండువిధములు. ఉచ్చారణము ననుసరించి వీని కీభేదము కల్గుచున్నది. ఏవర్ణము నుచ్చరించుటలో నాలుకయొక్క చివరదానిసమీపభాగమున మధ్యమూలమును శిథిలమగునో యావర్ణము లఘువనియు, నట్టిశిథిలత లేకున్నచో నట్టిది యలఘువనియుఁ జెప్పఁబడినది. వీనిలో 'యవ' లకు సంస్కృతముననే లఘ్వలఘుభేదము కలదు. ఇది తెనుఁగునను గలదు.

సంస్కృతప్రాకృతాంధ్రములు మూఁటియందును—య.ల.వ—అను వర్ణములకు లఘ్వలఘుభేదము గలదు. ఈభేద ముచ్చారణగౌరవలాఘవములచే నేర్పడును. కావుననే వర్ణసమామ్నాయమున నివి వేఱువేఱు వర్ణములుగఁ బఠింపఁబడలేదు. రేఫమున కీద్వైవిధ్యము తెనుఁగుననే కలదు. సంస్కృతప్రాకృతములలో లేదు. కావున రేఫమున కలఘూచ్చారణము ద్రావిడభాషలలోనే కలిగినదని యూహింపవలయును. మూలద్రావిడభాషలో నొకవింతయక్కరము న్నదనియు, నది-డ-ళ-ఱ- అను వర్ణముల యుచ్చారణముతో వివిధద్రావిడభాషలలోను నిల్చినదనియు, చోడ-చోళ-చోఱ అనురీతిని దెనుఁగునందుఁగూడ నావర్ణము మాఱినదనియు విమర్శకు లనుచున్నారు. కావుననే రేఫడకారములతోపాటు -ళ- కారమును మూర్ధస్థానిక మగుచున్నది. ఇది ద్రావిడమూర్ధన్యళకారము. దీనియాకృతినే యగపడుచున్నను నలఘు ళకారము వేఱు. అది దంతస్థానికము. వీని నిట్లు వివేచింపవలెను.

19. సూ. 3 :- అస్య ద్వైవిధ్యం "ఉరోళః" – ఇతి వాల్మీకియసూత్రే స్ఫుటమ్. రస్తు రేఫస్తు అత్రైవ ఆన్ధ్రవ్యాకరణే ద్వివిధః లఘ్వలఘుభేదేన గృహ్యతే. అన్యవ్యాకరణస్పష్టయవలానాం ద్వైవిధ్య మత్రాప్యస్తి. రేఫస్య ద్వైవిధ్య మ్యత్రైవ గృహ్యతే. గసడదవాన్ప్ర్య కలిసూత్రేణ పస్య యో వకార స్సోఽత్ర లఘువకారః.

స చ 'అతఁడు వలికె' నిత్యాదౌ స్ఫుటః. యత్రుతి మార్యా ఇతి సూత్రేణోక్తో లఘుయకారః. స చ మేనయత్త ఇత్యాదౌ స్పష్టః. 'బెళుకుంజూపులు, తళుకుం గజ్జలు, పొలఁతి, చెలువ' ఇత్యాదౌ లస్య ద్వైవిధ్యమ్.

వి:- లకారమునకు ద్వైవిధ్యము "లోళః" అని వాల్మీకిముని వ్రాసినప్రాకృతవ్యాకరణసూత్రమున స్పష్టపఱుపఁబడినది. రేఫ మీఁ తెలుఁగువ్యాకరణమున మాత్రము "ర స్త్వత్ర గృహ్యాతే ద్వివిధః" అనుచింతామణిచే ద్వైవిధ్యము నొందుచున్నది. "గసడదవా స్స్యుః" అనుసూత్రముచే 'వ' కారమునకు వచ్చువకారము లఘువకారము. 'అతఁడు వలికెన్ (అతఁడు+పలికెన్)' మున్నగుచోట్ల స్పష్టమగుచున్నది. "యత్రుతి మార్యా" అనుసూత్రముచేఁ జెప్పఁబడినయకారము లఘువు. అది మేనయత్త (మేన+అత్త) మున్నగునెడ స్పష్టము. బెళుకుంజూపులు, తళుకుం జెక్కులు, పొలఁతి, చెలువ మున్నగుచోట్ల లకారమునకు ద్వివిధత్వము మూలమునఁ గలదు. ఇది సరికాదు, 'తళుకు' మున్నగు చోట్ల నున్న 'ళ' కారము ద్రావిడమూర్ధన్యము. బహుత్వమున రల డల కాదేశమైనదే యలఘులకారముగదా!

19. సూ. 4 :- "మెఱుఁగు, మఱుఁగు, కరుఁగు, పొరుగు" ఇత్యాదిషు రేఫస్య ద్వైవిధ్యం రూఢమ్. తచ్చ తద్వివేచకగ్రన్థా దవగన్తవ్యమ్. క్వచిత్ తస్యైవ గురుత్వం లఘుత్వం చాప్యస్తి.

"లఘుర్భవే ద్గురుః క్వచి ద్గురుశ్చ లఘు స్తథా ।
ఉచ్చారణస్య కల్ప్యత్వా న్నిదానం తత్ర సద్వచః॥

ఇత్యథర్వణవచనాత్, — 'పరమాత్మపదములఁ దొరఁగి పారెడునేటికెరగల్పై శిల దాటి దాటి' 'పొగడ్తమాకులమొదలను బుష్పరసము, లొలఁగి నెత్తావియందున నెఱయ నొప్పె' ఇతి నృసింహపురాణే ప్రయోగః. ఏవం తత్ర తత్ర సుకవిప్రబన్ధేషు ద్వైరూప్యం ద్రష్టవ్యమ్.

వి:- 'మెఱుఁగు, కరుగు' మున్నగుచోట్ల రేఫమునకు ద్వైవిధ్యము. 'ఒక్కశబ్దములో నున్న రేఫము లఘువుగను గురువుగను నుండ

నగును. ఉచ్చారణము మానవకల్పిత మగుటవలన నొకశబ్దములో నున్న రేఫ మొకచో గురువుగను వేఱొకచో లఘువుగను నుండనగును' అనియథర్వణవచనము చెప్పినది. దీనికి నృసింహపురాణ ముదాహరింపఁబడినది. ఇట్లే యచ్చటచ్చటఁ బ్రబంధములలో ద్వైరూప్య మున్నదని కవిశిరోభూషణము చెప్పినది. కాని 'నెరయ' అనుదానిలో రేఫము లఘువే యన్నచో బాధ యేమియు లేదుగదా!

ఒక్కశబ్దమునందలి రేఫమును గురువుగను లఘువుగను బ్రయోగించుట సరికాదు. రేఫశకటరేఫములనుగుఱించి యీవఱకుఁ బలువురు లాక్షణికులు పరిశ్రమకావించియున్నారు. వారు పరిశ్రమించి వ్రాసిన గ్రంథములకు మూల మథర్వణకారికలే. అథర్వణకారికలకు నన్నపార్యునియొక్కయుఁ దత్సమకాలికులయొక్కయుఁ బ్రయోగము లాధారములు. కాలము గడువఁగా నానియమములు సరిగఁ బాటింపఁబడిన ట్లగపడదు. 'రేఫవ్యతిరిక్తములగు యవలలకు లఘ్వలఘువుల విధర్మత లేదుగాని రేఫములకుమాత్రము విధర్మత నిత్యము' అని "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అని చింతామణి చెప్పినది. ఈనియమము కాలక్రమమున సరిగఁ బాటింపఁబడిన ట్లగపడదు. కాని రెండర్థములు గలపద మొకట లఘువు నొకట నలఘువు కానోపును. కావుననే యొక్కశబ్దములోని రేఫము రెండురకములుగఁ బ్రయోగించుట తటస్థించిన దని తోఁచుచున్నది. ఒక్కయర్థముననే యట్లుండరాదు. అయినను గవిప్రయోగము లట్లు కలవని కవిశిరోభూషణ ముదాహరించినది.

క్రియాన్తే చాన్యవర్ణే చ లఘురేఫాః ప్రకీర్తితాః।
ద్వివిధా దిదుకశ్చ స్యు రయవౌ చ కగౌ తథా ॥
చజౌ పజౌ తదౌ వర్ణౌ సమవా అససంయుతౌః ।
ఏతే ద్వితీయసంయుక్తా రేఫోఽన్యత్ర తు సమ్మతః ॥
లఘు ర్నాస్తి జకార స్యాలఘు స్సస్య కదాఽపి చ ।

లఘవ శ్శిఖిశైలాగ్నయో ఽన్యే ఖగజ ఖర్విషః ॥
వేద్యాశ్చైతే ప్రయోగేషు స్యు రుచ్చారణభేదతః ।
యథాయథం ప్రయోగార్హా రేఫా స్సర్వే ప్రయోగతః ॥
అన్యేఽ న్తరిక్షఖద్యోతో ఽన్యేన యుక్తాః కదాఽపి చ ।
కేచిద్వద న్తి చ లఘూన్ బిన్దుబాణశిలీముఖాన్ ॥
తథా వద న్తి కేచిత్తు హార్యక్షేః ఖశరా న్వరాన్ ।
అనిశ్చయో భవేదత్ర గ్రామమానుషనామసు ॥
రేఫయో ర్నిశ్చయ స్తత్ర రేఫమాత్రైకగోచరః.

ఇతి విశేషా స్తస్మై వోక్తాః. అన్యవర్ణ ఇత్యత్ర 'అద్రువ, చిద్రుప, వట్రుచు' ఇత్యాద్యు దాహరణం ద్రష్టవ్యమ్. అత్ర హార్యక్షేశబ్దో గగనపరత్వేన బిన్దువాచకః.

వి:- ఈయధర్వణకారికలు పాఠభేదదూషితములని వైయాకరణ పారిజాతము చెప్పుచున్నది. అందు సవరింపఁబడినపాఠ మీ క్రిందరీతి నున్నది.

క్రియా న్తే చాన్యవర్ణే చ లఘురేఫాః ప్రకీర్తితాః ।
ద్వివిధా దిదుతశ్చ స్యు రయవౌచ కగౌ తథా ॥
చసౌ పజౌ తదౌ వర్ణా నమవా అసంయుతాః ।
ఏతే ద్విత్వయసంయుక్తా రేఫోఽన్యత్ర తు సమ్మతః ॥
లఘు ర్నాస్తి ఖకార స్యాలఘు స్సస్య కదాపి న ।
లఘవ శ్శిఖిశైలాగ్నయోఽ న్యే ఖగతిఖర్విషః ॥
వేద్యా శ్చైతే ప్రయోగేషు స్యు రుచ్చారణభేదతః ।
యథాయథం ప్రయోగార్హా రేఫా స్సర్వే ప్రయోగతః ॥
అన్యేఽ న్తరిక్షసదృశోఽ న్యేన యుక్తాః కదాపి చ ।
కేచిద్వద న్తి చ లఘూన్ బిన్దుబాణశిలీముఖాన్ ॥
తథా వద న్తి కేచిత్తు హార్యక్షేఃఖశరా న్వరాన్ ।
అనిశ్చయో భవే దత్ర గ్రామమానుషనామసు ॥
రేఫయో ర్నిశ్చయ స్తత్ర రేఫమాత్రైకగోచరః" ఇతి.

వి:- క్రియాపదములతుదిని నిర్బ్రాడిబహువచనప్రత్యయములందును, గ్రియేతరంబు లగునామసర్వనామబహువచనప్రత్యయములందును, లఘు

రేఫములే ప్రయుక్తములై యున్నవని చెప్పఁబడుచున్నది. నన్నపార్యుని భారతభాగమునం దట్లే ప్రయుక్తములై యున్నవని తాత్పర్యము. 'చొచ్చిరి, పుట్టిరి, పూజించిరి, వారు, మీరు, వీరు, తారు, నృపాలురు, వేల్పులారు' మొదలగునవి లఘురేఫముల కుదాహృతులు. 'హ్రస్వ దీర్ఘములగు—అఇఉఎఒ—అనువర్ణములును—కగచజవబతదనమువ - అను నవి హలంతరసంయుక్త రేఫములు పరమందు లేనివైనపుడు రేఫఅకారము లలో నేదేని బిందుమందుఁ గలది కానోపును. మిగిలిన చోటులందు లఘు రేఫములే యుండును. జకారముపైనఁ బిదప లఘురేఫము లేదు. సకా రమునకుఁ దరువాత నలఘురేఫము లేదు. ఈనియమములు నన్నపార్యుని భారతగ్రంథమునందలియతిప్రాసప్రయోగములకే పరిమితములు. ఈ విషయములు వైయాకరణపారిజాతమునందు సవిస్తరముగ వివరింపఁబడి నవి. కావున నన్నయేతరకవిప్రయోగములలో నీనియమము వ్యత్య యముగా నగపడిన నది ప్రాచీనకవిసమ్మతము కాదు. అనఁగా 'ర ఱ' అనునవి యొకదాని చోట మఱియొకటి నిలువవచ్చు ననుదాని కుచ్చా రణము కవికల్పిత మగుటయే కారణము. వానినిర్ణయమునకు మహాకవి ప్రయోగ మాధారము.

తరుపర్వతాగ్నివాచకము లగు తెలుఁగుశబ్దములలోని రేఫములు లఘువులే యని కొందఱనుచున్నారు. 'ఉసిరిక, నేరేడు, తరిగొండ, ఎరగలి' మొదలగునవి యుదాహరణములు. మఱికొందఱు తిర్యగ్వా చకములును ద్రుణవాచకములును లఘురేఫయుతములే యనుచున్నారు. 'తగరు, అగురు, పూరి' మొదలగునవి. ఇంకను మఱికొందఱు వ్యోమ సాదృశ్యవాచకములలోని రేఫములు లఘురేఫము లనుచున్నారు. 'ఉప్పు రము, సరి, దారి, కరణి' మొదలగునవి. ద్విత్వాక్షరములు లఘువులు కానేరవు. 'ఇఱ్ఱి, తోఱ్ఱి, మఱ్ఱి, గొఱ్ఱె' మొ. ఇంకనుగొందఱనుస్వార ఘ్రాణభ్రమరవాచకశబ్దములలో లఘురేఫము లుండునని చెప్పుచున్నారు. అరసున్న, జిరా, బరిగోల, మొగరంబము, మరునల్లె' మొ. ఇట్లే యిం

కను మఱికొందఱు సింహపాదానుస్వారకాశతృణవాచకశబ్దములలో నలఘురేఫము లుండునని చెప్పుచున్నారు. 'తెఱనోటిమెకము, అఱకాలు, అఱసున్న, నెఱసున్న, ఱెల్లు' మొ. ఈ రేఫఱకారములు పండితులయుచ్చారణభేదమువలనఁ బ్రయోగములనుబట్టి తెలియఁదగియున్నవి. ఈ రేఫఱకారములు యథాస్వరూపముగాఁ బ్రయోగార్హము లగును. గ్రామమనుష్యాదులనామములు కవిప్రయోగసిద్ధములు కానపుడు రేఫములుగనే గ్రహింపవలయును. ఱకారముగా నిశ్చయించుకవిప్రయోగము లభింపనపుడు రేఫముగనే తెలియనగును గాని శకటమునుగా నూహింపరాదని తాత్పర్యము.

ఈకవిశిరోభూషణవిషయమును సూరిగారు (బాల. సంజ్ఞ-18సూ. ప్రకీర్ణము 24 సూ.) రెండుసూత్రములచే వివరించిరి. అప్పకవి సనుసరించి కవిశిరోభూషణము లఘ్వలఘురేఫలకారములను వర్ణసమామ్నాయమునఁ బఠించెను. సూరిగారా విషయము నంగీకరింపలేదు. శకటరేఫ మలఘురేఫమని చెప్పి యిది దేశ్యమున మాత్రమే యుండు ననియుఁ దత్సమతద్భవములయం దుండదనియు వచించిరి. బహుళత్వమున రలడవర్ణముల కాదేశముగా వచ్చినది యలఘుళకారమనియు, వర్ణసమామ్నాయమునఁ బఠింపఁబడినది వర్ణాంతరళకారమనియు వచించిరి. వకారము పకారమున కాదేశమైనపుడే లఘు వగునని చెప్పెను. కాని యది సరికాదని వై. పారిజాతము చెప్పినది. 'అసా+ఆదిత్యః= అసావాదిత్యః' మున్నగువకారము లఘువని చెప్పఁబడినట్లే 'రవుతు. చివురు, గెలువన్' మున్నగురీతివకారమును లఘువకార మనుట సయుక్తికముగ నుండునని వ్యా. సం. స. వచించినది.

శకటరేఫము తత్సమతద్భవములయందు లేదని యప్పకవియుఁ దదనుసారముగ సూరియుఁ జెప్పియున్నను ప్రౌఢవ్యాకర్త-'తద్భవములందును నలఘురేఫము గలదు' (ప్రౌఢ-సంజ్ఞ-9 సూ) అని వచించెను.

నన్నయాథర్వణుల కీవిషయము సమ్మతము కాకున్నను గవిశిరోభూషణము తద్భవములలో శకట ముండవచ్చునని చెప్పినది.

"కఱకంఠా క్షమియింపుము" అనునన్నపార్యుని ప్రయోగమునందు మిశ్రబహువ్రీహి చేయఁబడినది. అది మహాకవిప్రయోగమగుటచే నట్టివి ప్రయోగార్హములని యథర్వణాశయము గోచరించుచున్నది. "అనియమాద్గ్రామ్యం హి య త్త్వపభ్రంశః" అని చింతామణి చెప్పినది. కావున నిది యపభ్రంశగ్రామ్య మగును. బాలవ్యాకరణమిట్లే భావించినట్లు "ఆర్యవ్యవహారంబులదృష్టంబు గ్రామ్యంబు" అనువచనమునుబట్టి తెలియుచున్నది. త్రిలింగలక్షణశేష మీయభిప్రాయము నంగీకరింపక "కఱకంఠుఁడు బహువ్రీహి" అని సూత్రించి, "గరకంఠ (గర కంఠే యస్య సః) అనుదాని వికృతి" యని చెప్పెను. అపుడు నవాంధ్రవర్ణయుక్తతయును నపభ్రంశత దానియందు నిలిచియే యున్నదిగదా!

'గరకంఠః' అనుదాని తద్భవరూపము 'కఱకంటు' అని యగుననియు దానిసంబోధనము 'కఱకంటా' అనురీతిని నన్నపార్యుఁడు ప్రయోగించెననియు వ్యా.సం.స. చెప్పినది. ఇందలి 'ఱ' కారము ప్రాసనిబద్ధమై దొఱకినపుడే కాని దీని ననింద్యగ్రామ్య మనుట కవకాశము లేదని యభిప్రాయము తేలుచున్నది. లాక్షణికు లందఱు మిశ్రబహువ్రీహిని మిశ్రద్వంద్వమును నిరసించియున్నారు. త్రిలింగలక్షణశేషాభిప్రాయము చొప్పున నవాంధ్రవర్ణమగు 'ఱ' కారము తద్భవమునం దుండునని యంగీకరింపవలసి వచ్చుచున్నది. కాన, వ్యా.సం.స. చెప్పినయభిప్రాయము సమంజసమని తోఁచుచున్నది.

'కఱ' శబ్దమునకు 'కంఠ' అనుదానితో సమాసముచేయుట సరి కాదనియు నది నన్నపార్యప్రయుక్తము కావున నది యనింద్యగ్రామ్యమనియుఁ జిన్నయసూరిమున్నగువారియభిప్రాయము. "కఱకంఠముఖాహితాః" అనునథర్వణవచనమునుబట్టి యది "మిశ్రబహువ్రీహి"

యని కవిశిరోభూషణమును, "అదియట్లగుట దుర్ఘటము" అని త్రిలింగ లక్షణ శేషమును జెప్పినవి. ప్రౌఢవ్యాకరణము తద్భవములలో శకట రేఫము నంగీకరించి "కఱకంఠుఁడు" అని యుదాహరించినది. అధర్వణుని పాఠము – కఱకంటుముఖా హితాః – అని యుండవోపుననియు నప్పుడు సామాసికగ్రామ్యత తొలంగుననియు యన్నాంధ్రవర్ణయుక్త తాదోషము వ్యా.సం.స. చెప్పుచున్నది.

ఇందు 'ప్ర. కంఠః–వి. కంటము. కఱశబ్దమునకు – కంటము–అను దానితో బహువ్రీహిసమాసముచేయఁగా – కఱకంటు – అనురూపము సిద్ధించుననియు వ్యా.సం.స. అభిప్రాయము.

"కఱకంఠా క్షమియింపుము" మున్నగునన్నయాదిప్రయోగములలో కఱకంటా–అనురూపమే ప్రయుక్తమైనను లేఖకపారకులయజాగరూకత వలన నందు ఠకారము ప్రవేశించియుండునని వ్యా.సం.స. వివరించినది. ఇది సయుక్తికముగా నున్నది కాన సముచితమే యగును.

**20.** సూ.– అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః.

20. సూ. 1 :- క్రియాసు భూతార్థప్రకాశకం నామాద్యగస్చ యకారం వినా యః అత్ అకారవాన్భవతి; తయో స్త్వేత్వ మిత్యర్థః; "యెవ్వఁడు, యెప్పుడు, చని యెన్-కనియెన్" ఇత్యాద్యుదాహరణమ్. తత్ర క్రియాయాం "క్త్వాభూతయోః క్రియా న్తస్యేత్" ఇతీత్వమ్, "వర్ణాగమో విశేషః" ఇతి యత్వమ్, "ప్రథమైక స్యే ద్భవేచ్చ భూతార్థే-ఇతి ఎత్వమ్.

వి:– అత్ – యః– క్రియాసు భూతార్థద్యోతినం – ఆద్యగం వినా–సర్వః – అని ఛేదము. 'యెవఁడు' మున్నగుపదములలో మొదట యకార ముండుననియు, నది ఎత్వముతోఁ గూడి యుండుననియు, మఱియు భూతార్థక్రియలలో మధ్యభాగమున నెత్వవిశిష్ట మగు యకారముండుననియుఁ దెనుఁగుపదములలోని మిగిలినపదాదిపదమధ్య యకారము లెత్వముతోఁగాక, అత్వముతోఁగూడియుండుననియు

త్రమున కర్థము. తెనుఁగుపదములలోఁ బదాదియకారమును, భూత క్రియలమధ్యయకారము నెత్వముతోఁ గూడియుండునని తాత్పర్యము, 'యెవ్వఁడు, 'యెప్పుడు, చనియెను. కనియెను' మున్నగునవి యుదాహృతులు. ఈక్రియలలో 'చను+తి, కను+తి' అనియుండఁగా నిచట "క్త్వాభూతయోఃక్రియాంతస్యేత్" అనుసూత్రముచే నిత్వము క్రియాంతమునకు వచ్చునని మూలమునఁ గలదు. కాని దేశ్యక్రియలలో నాసూత్రము వర్తిల్లదు. కాన "ఇత్త్వాద్యూతబహుత్వేతు దేశ్యేతూభయతో భవేత్" అని ఇత్వము కలిగి 'కను+ఇ+తి, చను+ఇ+తి' అనియగును. "డుడ్వాదివర్ణేభూతార్థేచాపి తస్యైర్భవే త్సదా" అని 'తి' ప్రత్యయమున కెత్వముగల్గును. "యస్యాద్దేశ్యక్రియాన్త్యేతు భూత ఏకత్వవాచకః" అని యత్వమును జేయఁగా కనియెన్. చనియెన్, మున్నగురూపములు సిద్ధించును. దేశ్యక్రియలను జింతామణిసూత్రముల చేతసాధింపరాదు, ఆవిషయమును జింతామణి "అత్త్వాదితత్త్వమానామివదేశ్యానాం క్రియాపదానాఞ్చ, వర్ణాగమో విశేషః పురుషేష్వర్థేషు చాపివచనేషు" అనుకారికచేత స్పష్టపఱిచినది.

20. సూ. 2 :– 'చనెన్, వినెన్' ఇత్యాదిప్రయోగోపి ప్రబంధేషు వర్తతే. తత్ర "ఏదన్తతా చ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్" ఇతి సూత్రం న ప్రవర్తతే. నామ్నా మితి నామమాత్రస్యైవ గ్రహణాత్. కిన్తు వికృతివివేకసూత్రేణ తన్నిర్వాహః "యస్యాద్దేశ్య క్రియాన్త్యేతు భూతఏకత్వవాచకః" ఇతి యః. "ఇత్వాద్యూతబహుత్వేఽపి దేశ్యే తూభయతో భవేత్" ఇతీత్వమ్. డుడ్వాదివర్ణే భూతార్థే చాఽపి తస్యైర్భవేత్సదా" ఇతి ఏత్వమ్. 'చనియెన్, కనియెన్, వినియెన్' ఇత్యాది. "ఇయాన్తా స్సాధవ శ్శబ్దాః క్వచి దేదన్తతాపి వా" ఇతి వా ఏత్వమ్. "అచోఽచి క్వచిల్లోపో బహుళం స్యాత్ప్రయోగతః" ఇతీకార లోపః 'చనెన్' ఇత్యాది.

వి:– చింతామణి 'చనెన్' మున్నగు రూపములను సాధింపలేదు. కావుననే వికృతివివేకము వానిని సాధించినది. క్రియాపరిచ్ఛేదమునందు

వానిం దిలకింప నగును. 'చనియెన్' అనునపుడు 'ఒకప్పుడు కొన్ని నామముల 'ఇయ' అనుదాని కేదంతత్వము వికల్పముగా నగును. అనుచొప్పున నెత్వము రాదు. దానిచే నామములకే వచ్చును. "దేశ్యక్రియాంతమున భూతపకత్వవాచకమైన యకారము వచ్చును" అని 'కను+య్' అని యకారము 'భూతబహుత్వమున–ఇ–అనునది తత్సమక్రియలకు వచ్చును. దేశ్యమునందైన నేకబహువచనములయందు నగును' అని – యథర్వణుఁడు, కని+య్ అని యుండగా. 'డుడిమున్న గువర్ణములు పరమగునపుడును భూతార్థమందును యకారమున కెత్వము వచ్చును, అని కనియెన్ అని యగును. 'ఇయాంతశబ్దములు సాధువులే; క్వాచిత్కముగ నేదంతము లును సాధువులే' అనుచొప్పున 'కనెన్' కనియెన్' అని రూపద్వయ మథర్వణవచనములచే సిద్ధించునని కవిశిరోభూషణము వ్రాసినది. వికృతివివేకము చింతామణికి వివరణము కానఁ జింతామణిచే సాధింపఁబడక మహాకవిప్రయుక్తము లైనవానిని వికృతివివేకము సాధించును. చింతామణి వికృతివివేకములకుఁ గలయీ సంబంధము గురుతింప నందునఁ గవిశిరోభూషణ మిట్లు వ్రాసినదని తోఁచుచున్నది.

20. సూ. 3:- అత్రేయం చిన్తా - వాఁడెవ్వఁడు - ఇత్యాదౌ సర్వత్రా జంకిన సంధిశ్రవణాత్ - 'ఎవ్వనివాకిట నిభమదపంకంబు' - ఇత్యాదౌ ఎకారం ప్రత్యేవ ఇకారవశేః ప్రయుక్తత్వా త్ప్రయోజనాభావాచ్చ ఆద్యగయకారస్య ప్రాణ్యంశో ఽనుపపన్న ఇతి తత్త్వాగో వక్తవ్యః. వికృతివివేకేఽపి శ్రీకవిమతే ప్రాణ్యంశత్యాగ ఏవ విహితః—

"వికృత్యాది గలోయోఽత్ర స్యా చ్ఛబ్దాన్తరయోగతః
ప్రాణమాత్రావశేష స్స్వ దత్ర శ్రీకవిసమ్మతేః."

వి:— వాఁడు ఎవ్వఁడు – అనునపుడు - ఎవ్వఁడు - అనుదాని మొదట నచ్చే యున్నది కాని హ ల్లగపడనందునను, ఎకారమున కికారమువళి వేయఁబడుచుండుటచేతను, బదాదిని యకార మున్నదని యంగీకరించుటవలనఁ బ్రయోజనము లేకుండుటచేతను బదాదిని

యకార మున్నదని యంగీకరించుట సరికాదఁని యూహింపనగునని చెప్పి కవిశిరోభూషణము వికృతివివేకమును దాని కాధారముగాఁ జూపుచున్నది —వికృతిపదాదినున్న యకారము పూర్వశబ్దముతో సంధించునపుడు యకారమునందలి స్వరముమాత్రమే మిగులును — అను నీవిషయము శ్రీకవికి సమ్మతము - అని వికృతివివేకకారిక కర్థము. - సర్వత్రాజ్వత్కార్యం యస్య ద్రుతప్రకృతికేభ్యః = ద్రుతప్రకృతికముల కంటెఁ బరమైన పదాదియకారమున కజ్వద్భావము కల్గును - అని చింతామణి చెప్పియుండఁగా వాఁడు + యెవ్వఁడు - మున్నగుచోట్ల నయితము పదాదియకారమున కజ్వద్భావము వచ్చునని వికృతివివేకము వివరించినది. దానిని దనమతమున కనుకూలముగాఁ గవిశిరోభూషణము వ్యాఖ్యానించుట సరికాదు. శ్రీకవియనఁగా నన్నపార్యుఁడే యని కొందఱు పెద్దలు చెప్పుచున్నారు. తమిళమున - యాన్ = ఎవ్వఁడు - అనుచోట నేటికిని యకారమే వినఁబడుచున్నది. తమిళము తెలుఁగును సోదరభాషలు. కానఁ దెనుఁగునను బదాదియకారము ద్రావిడభాషాసహజ మని చెప్పనగును.

20. సూ. 4 :- శబ్దశాసనస్యాపి హలంశత్యాగో౽భిమతఏవ సర్వత్రాజ్వత్కార్యమితి పూర్వసూత్రేణ లుక్సంశ్లేషయోః ప్రాప్తయోః - లుక్సంశ్లేషౌ వాచి ద్రుతస్య - ఇతి సూత్రేణ విహిత మచి లుక్సంశ్లేష భావలక్షణం ద్రుతప్రకృత్యపరిస్థితస్య యస్యాతిదిశ్యతే. అచి లుక్సంశ్లేషాభావే ద్రుతస్యాచా సహ నిత్యసంబంధః క్లుప్తః. స చాత్రాపి ప్రాప్త ఏవ. సో౽ప్యత్ర ప్రాణ్యంశత్యాగమంతరా న సిద్ధ్యతీతి- 'వారల కెగ్గుచేసినఁ జెడు నిహాముం బరంబు' - ఇత్యాదితత్ప్రయోగ శ్చాత్ర మానమ్.

వి:- 'వారల కెగ్గు, రాముఁ డెవఁడు' ఇత్యాదులయందు—యెగ్గు—యెవఁడు—అని పదాదిస యకారమున్నను—సర్వత్రాజ్వత్కార్యమ్—అని యకారమున కజ్వద్భావము కల్గిఁ వారలకున్ + ఎగ్గు—అని కాఁగా—అనాదిషు విభక్తిషూతో వా—అని సంధిచేయఁగ-'వారల కెగ్గు, వారలకు నెగ్గు' అని రూపద్వయము సిద్ధించినది. రాముఁడు+యెవఁడు—అను

నపుడు-వికృత్యాది గతో యోఽత్ర-అని యకారపూర్ణాంశము లోపించి -సంధి ర్వా చోఽచ్యుతః - అని సంధిచేయఁగా - రాముఁ డెవఁడు - అని యగుచున్నది. పై చింతామణి వికృతివివేకకారికలను కవిశిరో భూషణము తనయభిమతము చొప్పున నన్వయించినది. సర్వత్రాజ్వాత్ - అనుటచే శబ్దశాసనునకును పూర్ణాంశత్యాగము - యెవ్వఁడు - మున్నగుచోట్ల నిష్టమే యనుచున్నది. ఇది సరికాదు. నన్నయాధర్వణు లిద్దఱును సంధిసమయమున నే పదాదియకారమునకు పూర్ణాంశ త్యాగము నంగీకరించిరి. మఱియొకచోఁ గాదు.

'సర్వత్రాజ్వత్కార్యం' "వికృత్యాదిగతో యోఽత్ర" అని చింతామణి "వికృతివివేకములు పదాదిని 'య'కార మున్నదని యంగీకరించినవి. ద్రుతప్రకృతికములకుఁ బిదప వచ్చెడు పదాది యకారమునకు మాత్రమే యజ్వద్భావము వచ్చునని చింతామణి వచించినది. 'రాముఁడు+యెవఁడు' మున్నగుచోట్లఁ బదాంతరయోగమునందును యకార మజ్వద్భావమునొందునని వికృతివివేకము చెప్పినది. ఇం దొక దాని నొకటి సమర్థించుచున్నవి. నన్నపార్యుఁడు ద్రుతప్రకృతికముల మీఁదిపదాదియకారము ప్రాణమాత్రావశేషమగునని చెప్పఁగా వికృతి వివేకము పదాదియకారమునకు శబ్దాంతరయోగమునం దంతటను ప్రాణమాత్రావశేషత సంభవించునని వచించినది. చింతామణికి వివరణముగా వ్రాయఁబడిన వికృతివివేకకారికను కవిశిరోభూషణము వేఱు విధముగా సమన్వయించి ప్రాచీనమహాకవి సమ్మతము, ప్రాచీనసంప్ర దాయసమ్మతమునగు పదాదియకారమును ద్రోసిపుచ్చుటకపపాఠము లతో నిండినయప్పకవీయపాఠము నంగీకరించినది. చింతామణికి వికృతి వివేకము వివరణగ్రంథమైనను నావిషయమును బాఠకులు తలంపకుందు రను కైయీరీతిసమన్వయము నాతఁ డాశ్రయించిన ట్లూహింపవలసి యున్నది.

20. సూ 5 :- యద్యపి - పోయెదన్ - ఇత్యాదితద్ధర్మక్రియాగతస్య - పయ్యెద - ఇత్యాదిశబ్దస్థితస్యాపి యస్యైత్వమేవ. తథాఽపి తత్రైత్వసద్భావసాధకం మూలసూత్ర మిదమితి మన్తవ్యమ్. తత్రప్రబన్ధే - పోయెద ఇత్యాదిపదప్రయోగః స్ఫుట ఏవ. అథర్వణాగ్రన్థే తు - పోయెదన్ - ఇత్యాదౌ - భావిక్రియాసు యస్య స్యాదేత్త్వమేవ ప్రయోగతః - ఇతి భావిక్రియావ్యవహారేణ ఏత్వం విహితమ్ - పయ్యెద - ఇత్యాదినామ్నాంత్వపి - డోలాభూషోత్తరీయాణి విన్యైత్వం నాస్తి మధ్యయః - ఇతి పృథగేత్వం విహితమేవ.

వి:- 'పోయెద, (పయియెద) పయ్యెద మున్నగువానిలో మధ్య యకారమున కేత్వమే కలదు. పనికి నన్నపార్యునిభారతమునఁ బ్రయోగము గలదు. ఏత్వంపాదకమూలసూత్ర మిదే, అనునీమాట సరికాదు. నన్నపార్యునిమూలసూత్రము లేకుకాన నథర్వణాచార్యులుగారు - భావిక్రియలలోనియకారమునకుఁ గవిప్రయోగానుసారముగ నేత్వమే యుండును-అని చెప్పిరి. డోల-భూష-ఉత్తరీయార్థక శబ్దములలోని యకారము ఏత్వవిగిహితముగ నుండదు. - అని ఊయెల-పయ్యెద - తాయెతు-మున్నగువానింగూడ సాధించియున్నాఁడు. నన్నయగారు చెప్పియున్నచో నిట్లు వికృతివివేకము చెప్పవలసినపని యుండదు గదా! వికృతివివేకము చింతామణికి వివరణమని యూహించియున్నచో నీతఁ డిట్లు వ్రాసియుండఁడు గదా!

20. సూ. 6 :- అప్పకవిస్తు పయ్యెద ఇత్యాదావత్త్వం యశ్రుతిత్వం చాహ. తదేతత్సూత్రప్రామాణ్యాత్స్వకపోలకల్పితమేవేత్యనుసన్ధేయమ్. తద్గ్రన్థేతు —

"ధరణి నయ్యెలపయ్యెద తాయెతులను
గలయుకారంబులకు వక్రములు నిజంబు
మద్దరాజారామన వీని మూఁటిని బద
మధ్యయాలని చెప్పె నమ్మాట మిథ్య"

"ఊఁచునెల కాకగుటచేత నూయెలయ్యెఁ
బయిని రొమ్మెద నునికి వక్రోక్తిఁ బయ్యెదయ్యెఁ

> దల్లి కాపునకై గట్టడగినయెత్తు
> తేలఁ బల్కఁగఁ దాయెతు ల్దేశ్యమనను”

హేలాశబ్దా న్నిష్పన్నో ఏల శబ్దః. తస్య హ్రస్వే కృతే ఎత్ద్రూపమ్. హృదయ శబ్దాత్ - ఎద - శబ్దో నిష్పన్నః. అత్ర శబ్దత్రయే స్వరాదిత్వం నిర్వివాదమ్. ఉక్త రీత్యా సన్ధివేళాయాం లఘుయకారత్వం. నహి తావన్మాత్రేణ యాదిత్వమ్. “తాయెతునయ్యెలయుఁ బయ్యెదయును దక్కఁ

> గలుగ దేత్వంబు మధ్యయకారమునకుఁ
> దుదిని గ్రియఁ దక్క నేత్వంబు గదియ దాది
> నత్వమొందదు తెనుఁగున నబ్జనాభ”

ఇతి రామకవేః పద్యమితిహి స్థితమ్. పాఠోఽయం బాలసరస్వతీపుస్తకే స్థితః. ఇమ మనుసృత్యైవం వ్యాఖ్యాత మేవమ్. సతు యథాశ్రుతం వ్యాఖ్యాయ యేమా నుపపత్తిం నోద్ధధార.

వి:- అప్పకవిమతమున-ఊచు+ఎల, పై+ఎద, తాయి+ఎతు అనునవి లఘుయకారముచే - ఊయెల, పయ్యెద, తాయెతు - అని యైనవి. కాని పదాదియకారములు కావు. కవిశిరోభూషణ మీాయప్పకవి యభిప్రాయముతో నేకీభవించినది. అప్పకవీయచింతామణి ప్రక్షిప్తమని విమర్శకులయభిప్రాయము. కాని నన్నయాథర్వణుల పదాదియకారాజ్వ్యద్భావమునకు వై యర్థ్యమును జూపలేదు. చూపిన పేంతు వొకటియు బలమైనది కాదు.

20. సూ. 7 :- అప్పకవిపుస్తకే - అద్యః క్రియాను భూతాద్యర్థసముద్భూతం వినా సర్వః - ఇతిపాఠః స్థితః. ఆదిశబ్దేన - పోయెదన్ - చనియెదన్ - ఇత్యాదావేత్వం సిద్ధమ్. పూర్వపాఠే త్వేత న్న దృశ్యతే. కల్పనాగౌరవ మతీ వాపాద్యతే. న చోచ్చారణలాఘవమేవ తస్యైత్వే ప్రయోజనమ్. తదర్థం కల్పనాగౌరవ మంగీకార్యమితి వాచ్యమ్. తదభావేఽపి బాధకాభావేన తదపేక్షయాఽతికల్పనాగౌరవాఙ్గీకార స్యానుచితత్వాత్. - ఆద్యవర్ణాస్తు హ్రస్వేన గృహ్యన్తే కదాఽపిచ - ఇత్యథర్వణాఽచార్యస్య స్వసిద్ధాన్తవచనాచ్చ. తస్మా దప్పకవిపుస్తకపాఠ ఏవ సాధు

రితి ప్రతిభాతి - సర్వత్రాజ్వత్కార్య మితిసూత్ర స్తు తత్పుస్తకే నదృశ్యతఏవ. తేన ఎవ్వఁడు - ఇత్యాదౌ యత్వమాదౌ న పండితహృదయఙ్గమమ్.

వి :- అద్యః క్రియాసు - అనునది బాలసరస్వతీయ చింతామణి పాఠ మొకరీతిగను నప్పకవీయచింతామణిపాఠ మొకరీతిగను నగపడు చున్నది. అప్పకవీయచింతామణిలో - అద్యః క్రియాసు భూతాద్యర్థ సముద్యోతినం వినా సర్వః - అని కలదు. ఇందలి - ఆదిశబ్దముచే - పోయెదన్ - కనియెదన్ - ఇత్యాదులలో నెత్వము సిద్ధించుచున్నది. ఇవి తద్ధర్మార్థకరూపములు. వీని నథర్వణుఁడు భావిక్రియలని యనెను. బాలసరస్వతీయపాఠ మీవిషయమును సంగ్రహింపలేదు. కల్పనాగౌర వముమాత్ర మం దధికముగఁ గలదు. - యెవఁడు - మున్నగువానిలో యత్వము నంగీకరించుట కుచ్చారణలాఘవమే ప్రయోజనమని యం దురేమో ? అది లేకున్నను బాధలేదు కాన దానికై యతికల్పనా గౌరవము నంగీకరించుట యుచితము కాదుగదా ! ఆద్యవర్ణముల నెన్నఁడును హల్లులుగ గ్రహింపరాదు - అని యథర్వణాచార్యులు చెప్పిరి. కావున నప్పకవిపుస్తకపాఠమే సాధు వని తోఁచుచున్నది. సర్వత్రా జ్వత్కార్యమ్ - అనుసూత్ర మప్పకవిపుస్తకమునం దగపడ లేదని కవిశిరోభూషణసారాంశము.

క్రియలలో భూతము మున్నగునర్థములను వ్యక్తముచేయునవి తప్ప మిగిలినయకారము లన్నియు నకారంవత్తులే - అని యప్పకవీయచింతా మణి కర్థము. ఇందలి - ఆది - పదముచే - వినియెదన్ - మున్నగు తద్ధర్మక్రియ గ్రహింపఁబడునని చెప్పఁబడినది. బాలసరస్వతీయపాఠము లోని - ఆద్యగం - అను పదమిందు విడువఁబడినది. - తెనుఁగుపదము లలో మొదట యకార ముండును- అనునంశము దీనినుండి పోయినది. నిజమునకు - అద్యః క్రియాసు - అనునది విధినిషేధములను జెప్పుటకై యుత్పన్నము కాలేదు. సందేహానిర్ణాయకముగా నగపడుచున్నది -

యవఁడు - యప్పుడు - కనియును - అనురీతి యుచ్చారణము లేఖనము తటస్థింపఁగా - వదాదియకారములు క్రియామధ్యయకారములు తప్ప మిగిలినయకారము లకారవర్తులగును - అని వచింపఁబడినది. ఇట్లనుటచే - యెవఁడు - కనియెఁ - మున్నగునవి యకారవిశిష్టము లగునని తెలియుచున్నది - పోయెదన్ - ఆయెడిన్ - మున్నగుతద్ధర్మ క్రియలయం దిట్టిసందియము కల్గకుండుటకై యథర్వణాచార్యులు - భావిక్రియాసు - అనుకారికతో వివరించిచెప్పిరి. భావిక్రియ యనఁగాఁ దద్ధర్మక్రియ యని యర్థము. నన్నపార్యునికాలమున - పోషించుచున్నాఁడు, పోషింపఁగలఁడు మున్నగురీతిరూపములు వర్తమానభావ్యర్థములలోఁ బ్రయోగింపఁబడలేదు - పోషింతురు - పోషించెదరు - అనురీతి తద్ధర్మార్థకరూపములు వర్తమానభవ్యర్థములలో నుపయోగింపఁబడినవి. - భావిక్రియాసు' - అనుకారిక - ఆద్యః క్రియాసు - అనుచింతామణిని వివరించుచున్నది గాన - పోయెదన్ - మున్నగునవియే దీనికి లక్ష్యములు. భూతక్రియలయందును బదాదియందును గల యకారములపై నత్వముండదని చింతామణి చెప్పఁగా - భావిక్రియాసు - డుడ్యాదివర్ణే - అనుసూత్రములచే నచట నెత్వము నిలుచునని వికృతివివేకము చెప్పినది. మఱియుఁ బదాదిని యకార ముండుననుటచే - అతఁడు - ఆతఁడు - ఇతఁడు - ఈతఁడు - మున్నగువానినిగూడ - యతఁడు - మున్నగురీతి నుండునని యనుకొందురేమో యని వికృతివివేకము - ఆద్యవర్ణాస్తు హాత్వేన న గృహ్యాన్తే కదాచన -పదాదిగతము లగు అవర్ణాదులను హల్లులుగా నెన్నఁడును గ్రహింపరాదు -అని వివరించినది. దీనింబట్టి కవిశిరోభూషణము పకారవాదము చేసినదని స్పష్టమగుచున్నది. అది నన్నయాథర్వణసమ్మతము కాదు.

ఈ కవిశిరోభూషణమును సూరిగారును "యకారంబును, వు వూ వొ వో లును దెలుఁగుమాటలకు మొదట లేవు." (బాల - సంజ్ఞ.

17. సూ.) అని వ్రాసిరి. అప్పకవీయచింతామణిలో-వికృతిపదాదౌ ప్రథమా స్తస్తృతీయానునాసికా నస్తః క్వచిదపి న స్త ఉదూతౌ దన్త్యోష్ఠ భవస్య వికృతిశబ్దాదౌ - అని కలదు. బాలవ్యాకరణము దీని ననువదించినది. "వోఢృవోఢవ్యశబ్దములు తప్ప సంస్కృతసమంబులయందును వువూవొవోవర్ణాదు లగుశబ్దములు లేవు." (బాల. సంజ్ఞ. 17 సూ. వృత్తి) అని ఖండితముగ వ్రాసెను. కాని శబ్దరత్నాకరమునందు 'వోళిక, మున్నగుశొన్నితత్సమశబ్దము లగపడుచున్నవి. సూర్యాప్పకవులమును శాసనములఁబట్టి యవి విడిచివేయవలసినవేనా?

బాలసరస్వతీయ చింతామణిపాఠమును గ్రహించియుఁ గవిశిరోభూషణము 'అద్యాః క్రియాసు భూతాద్యర్థసముద్యోతినం వినా సర్వాః' అనునప్పకవీయపాఠమే సమంజస మనుచున్నది. అట్లనుటకు హేతువులు :-

1. బాలసరస్వతిపాఠము 'పోయెన్-చనియెన్' మున్నగు భూతక్రియలలోని యకారమే 'ఎ' కారవిశిష్టమని చెప్పుచున్నదికాని 'పోయెదన్-చనియెదన్' మున్నగుతద్ధర్మక్రియలలోని 'య' కార మెత్వవిశిష్టమని చెప్పలేదు. ఆవిషయము నప్పకవీయచింతామణి-ఆది-పదముచేఁ జెప్పుచున్నది.

2. కల్పనాగౌరవము మిక్కిలి కలదు. (పదాదిని యకార ముండు ననియు నది ద్రుతప్రకృతికమునకుఁ బరమైనచో నజ్వద్భావ మొందు ననియుఁ జెప్పుటయే కల్పనాగౌరవము) ఉచ్చారణలాఘవమునకై యీ కల్పనాగౌరవము నంగీకరింపనగునని చెప్పరాదు. ఉచ్చారణలాఘవమునకై యత్యధిక మగుకల్పనాగౌరవము నంగీకరించుట భావ్యము కాదుగదా! ఆకల్పన లేకున్నను బాధ లేదు.

3. 'ఆద్యవర్ణాస్తు హ త్త్వేన న గృహ్యన్తే కదాఽపిచ' అని యథర్వణాచార్యులు చెప్పిరిగదా!

4. ప్రయోజనము లేదు. ఈపైకారణములచే నప్పకవిపుస్తక పారము సాధువని కవిశిరోభూషణము చెప్పుచున్నది.

1. 'పోయెదన్-చనియెదన్' మున్నగుతద్ధర్మక్రియలలోనియకార మెత్వసహితమని చింతామణి చెప్పలేదు. కావుననే వికృతివివేకము 'భావిక్రియాసు యస్యా స్యా దేత్వ మేవ ప్రయోగతః' అని భావిక్రియావ్యవహారముతో వానిని జెప్పినది. ఈవిషయమును జింతామణియే చెప్పినచో వికృతివివేకము దానిం జెప్పవలసినపని లేదుగదా! కావున నీవికృతివివేక విషయమునుబట్టి యప్పకవీయచింతామణికారిక ప్రక్షిప్తమేకాని నన్నపార్యసమ్మతము కాదని తేలుచున్నదిగదా!

2. ఇంక రెండవయూపత్తియు సరికాదు. కల్పనాగౌరవము మిక్కిలియున్నను వ్యవహారహాని కల్గుననిశంకించి నన్నయ్యగారు పదాదియకారము నంగీకరించుచు ద్రుతప్రకృతికమునకుఁ బరముగ నున్నదాని కజ్వద్భావమును "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః" అని చెప్పి "చూచెన్+యెవనిని=చూచె నెవనిని" మున్నగు రూపములను సాధించెను. 'వాఁడు+యెవఁడు' మున్నగుచోట్ల నజ్వద్భావసిద్ధికై యథర్వణాచార్యులుగారు "వికృత్యాదిగతో యోఽత్ర స్యా చ్ఛబ్దాన్తరయోగతః। ప్రాణమాత్రావశేష స్స్యా దత్ర శ్రీకవిసమ్మతేః" అని వచించియున్నారు. దీనిచే 'వాఁ డెవ్వఁడు' మున్నగురూపము లన్నియు సిద్ధించుచున్నవి.

'కవి యతఁడు' మున్నగువానిలోనియకారము 'యశ్రుతి మాహ్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్" అనుచోవ్వున వచ్చిన యకారమేకాని పదాదియకారము కాదని విశదపఱుచుచు, వికృతివివేకము "ఆద్యావర్ణాస్తు హాత్వేన న గృహ్యన్తే కదాపిచ" అనియు, "ప్రాణా త్ప్రాణో లఘు ర్య స్స్యా త్స హ ల్పాచ్చ భ వేత్క్వచిత్, చే ద్యత్వం తస్య (ఆయతివసుశోభనాకృతియు మున్నగుశ్లేషస్థలము

లలో) కల్ప్యం స్యాత్" అనియు వచించినది. వీనింబట్టి కల్పనాగౌరవ మున్నను బ్రాచీనవ్యవహారహానికి వా రంగీకరింపలేదని తెలియుచున్నది గదా! ఇది బ్రాచీనులయభిప్రాయము. అప్పకవీయచింతామణి ప్రక్షిప్త పాఠమును జూచినవారికిఁ బ్రాచీనపాఠములలోనిలోపములు పొడకట్టి వారు దాని నంగీకరింపలేదని తోఁచుచున్నది.

3. "పదాదియందున్న 'అ' కారాదిస్వరములనుహల్లులని భావింపరాదు"అని లఘుయకారములను బురస్కరించుకొని వాని హల్లాదులుగా నెన్నరాదని తెలియుచుండుటచే నీహేతువును బాలసరస్వతీయ చింతామణిపాఠమునె సమర్థించుచున్నదిగదా!

4. 'ప్రయోజనాభావాత్' అని కవిశిరోభూషణము మఱియొక హేతువును జూపినది. భాషాపదములస్వరూపనిర్ణయమునకు వ్యవహారమే మూలహేతువగుటచే వ్యవహారహాని లేకుండుటకు మించిన ప్రయోజన మేముండును? ఈహేతువులచే బాలసరస్వతీయచింతామణి పాఠము సమంజసమనియు నప్పకవీయచింతామణిపాఠము ప్రక్షిప్త మనియు నూహింపకతప్పదు.

21. సూ :— యశ్రుతి మార్యా లఘుయం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్.

21. సూ. 1 :- యశ్రుతిమితి. ప్రాణతః పరం ప్రాణం యకారస్య శ్రుతి రివ శ్రుతి ర్యస్య సః యశ్రుతిః; తం ప్రవదన్తి ఆర్యాః పండితాః. యశ్రుతిత్వం సంహితాయా ముచ్చారణసౌకర్యార్థమ్. అర్థప్రకార స్తు ప్వరూపేణైవేతి స్పష్టమ్ తమేవ లఘుయకారం ప్రవదన్తి.

వి:— యశ్రుతిం—ఆర్యాః – లఘుయం— ప్రవదన్తి – ప్రాణతః— పరం – ప్రాణమ్ అని ఛేదము. హరి+అతఁడు='హరియతఁడు' సంధి లేనందున సంహితలో సుఖోచ్చారణమునకై స్వరముకంటెఁ బరమైన

స్వరమునకు యకారశ్రవణము లఘుయకారత్వము నీసూత్రము చెప్పుచున్నది. దీనినే లఘుయకార మని యందురు.

21. సూ. 2. :- ఏతచ్చ విధాన మస్యా లఘుయకారేణ సాకం సావర్ణ్యార్థమ్. యశ్రుతిత్వవిధానమాత్రేణ న సావర్ణ్యసిద్ధి స్స్యాత్. తేన ప్రాసమైత్రీ ఉభయో ర్న భవేదితి తద్విధానం సార్థకమితి జ్ఞేయమ్. అతఏవానుపదమే వోచ్యతే నాన్యేషామితి. అథర్వణగ్రన్థే తు-

ప్రాణాత్ప్రాణో లఘు ర్య స్స్యాత్స హ ల్లాఽచ్చ భవే త్క్వచిత్.
చే ద్యత్వం తస్య కల్ప్యం స్యా ద్వికృత్యాదౌ భవే న్నణః.

ఇత్యుక్తమ్, - ఆయతివసుశోభనాఽకృతియును - ఇత్యాదా వర్థభేద ఉభయవిధత్వమితి జ్ఞేయమ్.

వి:- యశ్రుతిత్వమును విధించుసూత్రముచే దీని కలఘుయకారముతో సావర్ణ్యము సిద్ధింపదు. కావున నారెంటికిని ప్రాసమైత్రి సిద్ధింపదు. అది సిద్ధించుట కీవిధాన మవసరము. కావుననే నాన్యేషామ్—అను సూత్రముచే నీవిషయము స్పష్టము చేయఁబడుచున్నది, యని యథర్వణాచార్యులుగారు పైచింతామణిని వివరించుచుఁ - 'ప్రాణముఁకంటెఁ బరమైన ప్రాణమునకు లఘుయకారతయు యశ్రుతిత్వమును వచ్చునని చింతామణి చెప్పినది. ఇది శ్లేషాదులలోఁ గొన్నియెడల హల్లుగను మఱికొన్నియెడల నచ్చుగను వ్యవహరింపఁబడనగును. - హల్త్వము కావలసివచ్చినపు డది కల్పింపఁదగినదగును. 'వికృతిపదాదిని ణకార ముండ' దని వచించెను.

సూరిగా రీవిషయమును — సంధి లేనిచోట స్వరంబుకంటెఁ బరంబైనస్వరంబునకు యడాగమం బగు — (బాల - సంధి - ౩. సూ. అని యనువదించిరి. హరియతఁడు - మున్నగునవి యుదాహృతులు. ఆయతివసుశోభనాకృతియు - అనునపుడు - ఆ - అతివ - అనియు, ఆ - యతివసుశోభనాకృతియు — అను నిట్టిశ్లేషలలో యకారమును గల్పించుకొనవలెననియు, నట్టికల్పితయకార మలఘువనియు నథర్వణుల

యభిప్రాయము - నేద్యత్వం తస్య కల్ప్యం స్యాత్ - అనుపాఠము సరి కాదు. - చే ద్యత్వం తస్య కల్ప్యం స్యాత్ - అనుపాఠము సరియైనది. యరలవ - అనువాని నంతస్థము లందురు. ఇవి లఘువులు నలఘువులు నని రెండు విధములు. ఈభేద ముచ్చారణవశమునఁ గల్గినదిగాని స్థాన ప్రయత్నమూలకము కాదు. ఈ యంశము - యవల -అను మూఁడిం టికే వర్తించును. వర్ణములమైత్రికి స్థానప్రయత్నములు కారణము. ఇట్టిమైత్రిని సాధర్మ్య మందురు. రేఫములకుఁ దప్ప మిగిలినయవలలకు వైధర్మ్యము లేదు. అనఁగా సాధర్మ్య (మైత్రి) మున్నది. కావున వీనిలఘ్వలఘువులకు యతిప్రాసమైత్రి కలదు. రేఫములకు వైధర్మ్యము నిత్యమగుటచే లఘ్వలఘురేఫములను యతిప్రాసమైత్రిలేయని తెలియు చున్నది. ప్రాసమునకు స్వరమైత్రి యావశ్యకము కాదు. కాని యతి యందు స్వరమైత్రి ముఖ్యము. కాఁగా - యెవఁడు - హరియతఁడు - వీనియందు యకారములు స్వరమైత్రి కలవగుటచే వీనికి మైత్రి చేయ నగును. కాని - యెవఁడు - హరియతఁడు - అనువానిలోనియకారము లకు యతిమైత్రిని గూర్పరాదు. కాఁగాఁ గొందఱు ప్రాచీనకాలమున నే- యెవఁడు - పోయెను - మున్నగువాని యందలియకారములను - యవఁడు - పోయును - అనురీతి నుచ్చరించి యుండుటచే వానికి యతి మైత్రియు సమకూడినది. అట్టి యుచ్చారణము దుష్టమగుటచే నావిష యమును 'అద్యః క్రియాసు - అనుసూత్రము వ్యక్తముచేయుచున్నది.

ద్రావిడమూర్ధన్యళకారము నట్టిదేయైనను దానికి లఘ్వలఘుల కారములతోఁ గవులు యతిప్రాసమైత్రి నంగీకరించినారు. దీనికిఁ గారణ మగపడదు. మఱియు దీనికి డకారముతోఁగూడ మైత్రి కలదు. రెం డును మూర్ధస్థానికములే కావున వానిమైత్రి యుక్తిసహామే. లఘ్వ లఘుయకారవకారముల కుచ్చారణమున భేదము లేదు. లేఖనము నను భేదము లేదు. వీనిలఘ్వలఘుతలను గుర్తించుట కష్టము. "యత్రశ్రుతి మార్యా లఘుయుం ప్రవదన్తి ప్రాణతః పరం ప్రాణమ్" అని

చింతామణియు, "ప్రాణాత్ప్రాణో లఘు ర్య స్స్యా త్సహాల్పాచ్చ భవే త్క్వచిత్" అని వికృతివివేకమును నలఘుయకారస్వరూపమును జూపి నవి. ఇతరయకారములు లఘువులని చెప్పకయే తెలియుచున్నది. వకారముయొక్క లఘ్వలఘుతలు ప్రాచీనకాలమునుండియు విశదములై యున్నను నేడు వానిం దెలిసికొనుట కష్టముగా నున్నకారణమున నాంధ్రవైయాకరణులు 'పాదేశవకారము లఘువు' అని గుర్తు తెలిపి యున్నారు.

ద్రావిడమూర్ధన్యళకార మెట్లో ప్రాచీనకాలముననే సంస్కృత ప్రాకృతభాషతోఁ జేయుటయేకాక పరమప్రాచీనమగు ఋగ్వేదమంత్ర ములలోనికిఁగూడఁ జొచ్చుకొనిపోయినది. "అగ్ని మీడే పురోహితమ్" అనుమంత్రమును "అగ్ని మీళే పురోహితమ్" అనురీతిని గొందఱు పఠించుచున్నారు. దీనింబట్టి ద్రావిడమూర్ధన్యళకారము పరమప్రాచీన మనుచున్నారు. తమిళులు దీనిం బురస్కరించుకొని తమ భాష, జాతియు ఋగ్వేదకాలముననే గలదనుచున్నారు.

**22. సూ :- నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్.**

22. సూ. :- అన్యేషాం రేఫవ్యతిరిక్తానాం లఘ్వలఘూనాం యవలానాం వైధర్మ్య మన్యోన్యవిరోధో నాస్తి. యతిప్రాసమైత్రీ భవతీత్యర్థః. - భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు పుట్టెఁగఁ దోడనె పుట్టున్ - ఇత్యాద్యాచార్యవచనమ్. రయోః గురు లఘ్వో రేఫయోస్తు నిత్యం వైధర్మ్యం స్యాత్. కదాచిదపి యతిప్రాసమైత్రీ నాస్తీ త్యర్థః. వికృతివివేకేఽపి

కశ్చి ద్వదతి సాజాత్యం యతావేవా నయో స్తథా
అవద చ్చాత్ర సాజాత్యం ప్రాసేష్వపి చ కశ్చన-

ఇత్యుక్త్వా కయోశ్చి న్మైత్రీకల్పకయో ర్మత మధియత్ర కశ్చి చ్ఛబ్ద ప్రయోగే జాత్యన్తపణ్డితమ్మన్యతాధ్వననద్వారా పరాకృత్య తేన

అనయో స్సఙ్గతిం యస్తు కరోతి కవితా కృతౌ
అస్యా అత్యన్తదుష్టత్వా ద్దుష్కవి స్సహి కథ్యతే.

ఇతి స్వమతం ప్రకాశితమ్. ఏవం స్థితే - పురసతులవిలోకనములు, పరసాఽ లాపములు నర్మసంభోగములున్, మఱేఁగి హరి మనల నొల్లఁడు, నరవరు లోయమ్మ నూతనప్రియులు గదే. గ్రక్కునఁ జని వ్రాలుదునో, ఱెక్కలుఁగట్టుకొని దేవరిపు మేడలపై - ఇత్యాదిపద్యేషు పోతన్న సూరన్నప్రముఖైః కైశ్చి దుభయో ర్మైత్రీ ప్రోక్తా. సాఽ నాకరత్వా దప్రామాణికీతి సుధీపురోగమై రనుసన్ధేయమ్.

వి:— యరలవ — అనునాల్గింటికిని లఘ్వలఘుభేద మున్నను — యవల — అనువానిలఘ్వలఘువులకుఁ బరస్పరము మైత్రి కలదనియు, రేఫముల కట్టిమైత్రి లేదనియు వానికి వైధర్మ్యము నిత్యమనియు సూత్రార్థము. — భూనుత — అనునుదాహరణమున — ఫుట్టఁగ — అనుదానిపకారమునకు వకారము వచ్చినది. అది లఘువకారము. దీని కలఘువకారముతోఁ బ్రాసమైత్రి యుండనగును. యతి మైత్రి యుండు నని వేఱుగఁ జెప్పఁ బని లేదు. పకారాదులతోను యతి చెల్లును. కొందఱు లఘ్వలఘు రేఫములకు మైత్రి యతిలోఁ గల దనుచున్నారు. మఱికొందఱు ప్రాసమునను మైత్రి కల దనుచున్నారు. కాని యది సరి కాదని వికృతివివేకాభిప్రాయము. కావుననే — 'లఘ్వలఘు రేఫములకుఁ బ్రబంధములలో మైత్రిని గూర్చుట దోషము; అట్టిపని చేసినయతఁడు దుష్కవి యనిపించుకొనును' అని వికృతివివేకము వచించినది. వానికిఁ బ్రాసమైత్రి మిగులదూష్యమని వేఱుగఁజెప్ప నక్కఱలేదని తాత్పర్యము. కాని పోతన్న సూరన్న మున్నగువారు తమకృతులలో నట్టి మైత్రిని బాటించినారు. కావుననే లాక్షణికులు వారిగ్రంథములను బ్రమాణీకరింపలేదు. శ్రీబహుజనపల్లి సీతారామాచారిగారు ప్రమాణీకరించి యుదాహరించి యున్నారు. నిజ మాలోచింపఁ బోతనాదుల గ్రంథములలోనియట్టిప్రయోగములలో శకటరేఫమును సాధించుట కాధార మగపడలేదు. అవి లఘువులే యనవలెను.

సూరిగారు - యవలలు లఘ్వలఘువులు మైత్రిం బొరయు; రేఫంబులు పొరయవు (బాల.ప్రకీర్ణ.24. సూ) అని చెప్పిరి. ప్రౌఢవ్యాకరణము 'దీర్ఘపూర్వక మగులఘురేఫము హ్రస్వపూర్వకమగుచో సలఘురేఫం బగు' (ముక్తలక్షణవివేచనము 1 సూ) అనియు- 'అలఘురేఫము లుప్తాచ్కమగుచో లఘురేఫం బగు' (ము క్త- 2 సూ) అనియు వచించినది. ఇంతగ వైయాకరణులు చెప్పుచుండఁగ వానిమైత్రిని బాటించిన కవులను దుష్కవులనుట సమంజసమే యగును.

**23 సూ :- అద్దన్త్య స్తాలవ్య శ్చు ర్వక్ర స్సాన్య న్మిధ స్సవర్ణ శ్చ.**

23 సూ. 1 :- అద్దన్త్య ఇతి – అత్ర వికృతౌ దన్త్యశ్చు శ్చవర్గః అత్ అకారవాన్భవతి. చవి-చమురు-చాన-చప్పుడు-ఇత్యాది. తాలవ్యశ్చు శ్చవర్గః అత్ర వక్రస్సాన్యత్; ఏకారవాన్ భవతి. జేవురు-చెమట - చెలువు - ఇత్యాది. చురిత్యస్య చవర్గసంజ్ఞాత్వం అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః – ఇత్యాద్యవ్యాకరణసిద్ధమ్. మిథ స్సవర్ణశ్చ అత్ర త్యో దన్త్యశ్చు రాద్యాయాం తాలవ్య శ్చుశ్చ మిథః అన్యోన్యం యతిప్రాసయో స్సవర్ణశ్చ భవేత్. చదలేటిబం గారుజలరుహంబులతోండ్లు భోజనంబులు మాకుఁ బువ్వుబోఁడి - ఇత్యాదిక మత్రోదాహరణమ్. వక్రచవర్గస్య తు సంస్కృతచవర్గేణ దంత్యచవర్గేణ చ ప్రాసమైత్రీమాత్ర మస్తి. ప్రాసే స్వరమైత్ర్యపేక్షాయా అభావా దితి జ్ఞేయమ్.

వి:— అత్ –దంత్యః– తాలవ్యః– చుః– వక్రః– సాత్ –మిధః–సవర్ణః చ–అని ఛేదము. ఈసూత్రముచేఁ దెనుఁగుమాటలలోనిదంత్యతాలవ్య చజలు చెప్పఁబడినవి. దంత్యతాలవ్యతలు లఘ్వలఘువులవలె నుచ్చారణభేదసిద్ధము లగుటచే నీసూత్రము 'అద్యః క్రియాసు' అనుదానివలె సంశయనివారకమే కాని విధినిషేధాన్యతరవిధాయకము కాదు. చేట–జేన మున్నగునవి–చాట–జాన–అనునిట్టియుచ్చారణలేఖనములతో విలసిల్లుట సంభవింపకుండ–దంత్యచజ లకారవత్తులు తాలవ్యచజలు, వక్రవంతములు నగును–అని చెప్పెను. అట్లుకానిచో నోకారముకూడ వక్రమే యగుటచే–జొన్న–జోలి – మున్నగువానిని దాలవ్యములే యనవలసి యుండును గదా! మఱియు బాలవ్యాకర్తవలె దంత్యతాలవ్యతలను స్పష్టపఱుపకుండునా?

సూరిగారు చింతామణిసూత్రమును విధిసూత్రముగా నెంచి యిట్లు విస్తరించియున్నారు. 'దంత్యతాలవ్యంబు లైనచజలు సవర్ణంబులు (బాల-సంజ్ఞ-7. సూ) ఇఈఎఏలం గూడినచజలు తాలవ్యములు (బాల-సంజ్ఞ-8. సూ). అఆ, ఉఊ ఒఓఔలం గూడినచజలు దంత్యములు (బాల-సంజ్ఞ-9 సూ). 'స్యా న్మిథ స్సవర్ణ శ్చ'-అనునది విధి. మిగిలినది సందేహనిర్ణాయక మని యూహింపవలయును. తత్సమపదములలోనిచజ లేస్వరముతోఁ గూడియున్నను దాలవ్యములే. వానికిని దెనుఁగు లోనిదంత్యతాలవ్యచజలకును బ్రాసమైత్రి కలదు. ప్రాసమున స్వరమైత్రి లేదు. స్వరమైత్రి యతి కవసరము. కాన స్వరమైత్రి లేనపుడు వానికి యతి చెల్లదు.

ప్రౌఢవ్యాకరణము-ఒకానొకచో జకారం బుభయంబు నగు -(ప్రౌఢ-సంజ్ఞ-5. సూ) అని వచించినది-'అకటపాండురాజయశమెన్నవైతి'అనురాఘవపాండవీయపద్యములో 'పాండురాజ, యశము, అని భారతార్థమునను, 'పాండురాజయశము' - అని రామాయణార్థమునను ఛేదము. ఇందు భారతార్థమున జకారము దంత్యమును రామాయణార్థమునఁ దాలవ్యము నగును. దంత్యతాలవ్యచజలకు మైత్రి యుండుటచే నిట్టిరీతి సంభవించినదని యూహింపనగును. 'పాండురాజు' అనునది సంజ్ఞావాచకము కాన నదియుఁ దత్సమమే యననొప్పునని కొందఱు. 'రాజు' అనునది తత్సమము. సంబోధనమున దంత్యముగఁ బరిణమించినది. కావుననే సూరిగారు "రాజశబ్దంబొక్కటి దంత్యయుక్తంబు కానంబడియెడి" అని వచించిరి. దీనికిఁ బ్రమాణము 'డుస్స్యా త్సదా రాజ్ఞః' అనునది.

24. సూ :- ప్రాతిపదికం హి నామ.

24 సూ. 1 :- అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్ - ఇత్యాద్యవ్యాకరణసూత్రోక్తప్రాతిపదిక మత్ర నామసంజ్ఞకో భవతి.

వి:- ప్రాతిపదికం - హి - నామ అని ఛేదము. ధాతువు, ప్రత్యయము, ప్రత్యయాంతము కాక మిగిలినవానిలో నర్థవంత మగుశబ్ద స్వరూపమునకు సంస్కృతవ్యాకరణము ప్రాతిపదికమని పేరిడినది. దానికిఁ దెనుఁగున-నామము - అని పేరు. ఈసంజ్ఞల కీవ్యాకరణమున బ్రసిద్ధి కలదు. నామమనఁగాఁ బ్రాతిపదికము -అని బాలవ్యాకరణమును వివరించినది. అచ్చతెన్గువాని కిది యుపలక్షణమని యూహింపనగును.

**25 సూ :- ప్రత్యయ ఇహ వర్ణకః.**

25. సూ. :- పాణినీయోక్తప్రత్యయ ఇహ వర్ణకసంజ్ఞకో భవతి.

వి:- ప్రత్యయః-ఇహ-వర్ణకః, అని ఛేదము. ప్రతీయతే=విధింపబడుచున్నది కానఁ బ్రత్యయము - అని పాణినీయులయర్థము. అట్టి దానికిఁ దెనుఁగున వర్ణక మని పేరు. వర్ణో వర్ణకః - అనుచో వ్వున వర్ణమనియు దాని నందురు. 'ప్రత్యయమును వర్ణకమని ప్రాచీనులు వ్యవహరింతురు' అని బాలవ్యాకరణము.

**26. సూ :- క్రియా ధాతుః.**

26. సూ. :- భూవాదయో ధాతవః - ఇతి సూత్రవిహితో ధాతు రత్ర క్రియాసంజ్ఞో భవతి.

వి:- క్రియా-ధాతుః - అనిఛేదము. భూప్రభృతులు వానసదృశములు నగువానికి సంస్కృతమున ధాతువులని పేరు. దానికిచటఁ గ్రియయని పేరు. క్రియావాచకము లగు-భూ-మున్నగునవి సంస్కృత ధాతువులు. అవి యిచటఁ గ్రియ లనిపించుకొనుచున్నవి. అచ్ఛికక్రియల కిది యుపలక్షణమని తెలియనగును.

**27. సూ:- ప్రాణా స్సమాసతోఽచః.**

27. సూ. :- అచ స్సంస్కృతవ్యాకరణోక్తప్రత్యాహారమధ్యగతవర్ణా అకారాదయ ఇహ సమాసత స్సంగ్రహేణ ప్రాణా ఇతి సామాన్యసంజ్ఞాం ప్రాప్నువన్తీత్యర్థః.

వి:— ప్రాణాః – సమాగతః – అచః. అని ఛేదము. అఇఉణ్ – ఋఌక్ – ఏఓజ్ – ఐఔచ్ – అనుమాహేశ్వరసూత్రములలోని తొలి – అ – కారమును జివరనున్న – చ – కారముతోఁ గలుపఁగా – అచ్ – అనియగుచున్నది. మధ్యనున్న హ్రస్వదీర్ఘములగు — అఆ, ఇఈ, ఉఊ, ఋౠ, ఌౡ, ఏఐ, ఓఔ – అనునవి — అచ్ — అను దానిచే సంగ్రహింపఁబడుచున్నవి. ఈపదునాల్గింటికి నచ్చులని పేరు. ఇది సామాన్యసంజ్ఞ. విశేషసంజ్ఞలును గలవు. వీనికిఁ దెనుఁగున – ప్రాణములు – అని పేరు – స్వరములు – అని మఱియొక పేరు గలదు. శరీరమునకుఁ బ్రాణమువలె నివి వ్యంజనవర్ణములపై నిలిచి వానికిఁ జైతన్యమును గల్గించుచున్నవి కానఁ – బ్రాణములు – అను పేరు వీనికి సార్థకమగుచున్నది. శబ్దించుచున్నవి కాన స్వరము లను పేరుగూడ సార్థకమే. అచ్చులెన్గునవాని నీపేరుతో వ్యవహరింపఁదగును.

28. సూ :— బిన్దు రనుస్వారః.

28. సూ. :— అనుస్వారః బిన్దురితి విశేషసంజ్ఞో భవతి.

వి:— బిన్దుః – అనుస్వారః – అని ఛేదము. – ద్వివిధాఽదిదు 'సిద్ధస్సాధ్య శ్చానుస్వారః – అనుసూత్రములతో స్వరూపస్వభావములను స్వారమునకుఁ జెప్పఁబడుచున్నవి. దానికిచట – బిందువు – అని విశేషసంజ్ఞ విధింపఁబడుచున్నది.

29. సూ :. ఏజథో వక్రః.

29. సూ. :- అథశబ్ద స్యాత్ర ప్రయోగ ఐచ్ఛిక శ్ఛన్దోఽనుసారీ మధ్యేమఙ్గళార్థో వా. అత్ర విశేషసంజ్ఞావిధిప్రారమ్భార్థో వా. ఏజ్ప్రత్యాహారగతా వేకారౌకారౌ చ వక్రావితి విశేషసంజ్ఞకౌ భవతః

వి:— ఏజ్ – అథః – వక్రః అని ఛేదము. – ఏఓజ్ – అనుమాహేశ్వర సూత్రమునఁ బేర్కొనఁబడిన ఏ ఓ అనువానికి ఏజ్ అనునది ప్రత్యా

హారలబ్ధమైనసంజ్ఞ. వీనికి — అచ్చులు అని సామాన్యసంజ్ఞ కలదు ఏజ్ అనునది విశేషసంజ్ఞ. వీనికిఁ దెనుఁగున వక్రములు అని పేరు ఇవి వంకరగా నుండును గదా !

**30. సూ:- వక్రతమ ఐచ్.**

30 — సూ. ఐకారౌకారౌ చ వక్రతమావితి విశేషసంజ్ఞా భవతః.

వి:— వక్రతమః —ఐచ్ —అని ఛేదము. ఐఔచ్ —అను మాహేశ్వర సూత్రమునఁ బ్రత్యాహారలబ్ధమైనది యీ - ఐచ్ - అనుసంజ్ఞ. ఐచ్ ప్రత్యాహారములోని - ఐఔ - అను వానికి, వక్రతమములని పేరు. ఇవి ఏఓలకన్న మిగులవంకరగ నుండుటచే వీని కీపేరు సార్థక మగుచున్నది.

**31. సూ:- హల స్స్యు స్సమాసతః ప్రాణినః.**

31 - సూ. :— హలో హకారాదయః సమాసతః ప్రాణిన ఇతి సామాన్య సంజ్ఞకా భవన్తి

వి:— హలః — స్యుః — సమాసతః — ప్రాణినః — అని ఛేదము. హాయవరట్ — లణ్ — ఞమఙణనమ్ — ఝభఞ్ — ఘఢధష్ — జబ గడదశ్ — ఖఫఛఠథ చటతవ్ — కపయ్ — శషసర్ — హల్ — అను మాహేశ్వరసూత్రములందు — హల్ — అనునది. ప్రత్యాహారలబ్ధము. హల్లులని వీనిం దెలుఁగున నందురు. వీని కీసూత్రము — ప్రాణులు —అని సామాన్యసంజ్ఞ చేయుచున్నది. అచ్చులకుఁ బ్రాణములనియు, హల్లులకుఁ బ్రాణులనియు సంజ్ఞలు. ప్రాణములకును బ్రాణులకును నిత్యసంబంధము లోకమునఁ బ్రసిద్ధము. ఇందును నట్లేయని యూహింపనగును. బాలవ్యాకరణ మీవిషయములను జెప్పలేదు; కాని యిందలి యీసంజ్ఞలఁ గొన్నింటి నుపయోగించినది. సంస్కృతవ్యాకరణము చదివినవారి కివి సులభములే. కాని కేవలము తెనుఁగువ్యాకరణమే చదువువారి కీవిషయములు తెలియవు. కేవలము తెలుఁగు చదువువారికి వీనిందెలుపుట యవసరముగదా!

**32. సూ :- ద్రుతాఖ్యో నః.**

32 సూ. :- నః నకారః ద్రుతాఖ్యః ద్రుత ఇత్యాఖ్యా యస్య సః ద్రుతాఽఖ్యః. ద్రుత ఇతి విశేషసంజ్ఞో భవతి.

వి :- ద్రుతాఖ్యః – నః– అని ఛేదము. నకారమునకు ద్రుత మని పేరు. నః — అనుదానికి నకారమని యర్థము. అనఁగా 'న్' – అనునది. హాకారాదిష్వకారః ఉచ్చారణార్థః అనుచెప్పిన వర్ణ సమామ్నాయమునందలి వ్యంజనవర్ణములు అకారవిశిష్టముగ నగపడినను వానినిజస్వరూపము – క్, గ్–అనియే యుండును. కాఁగా వర్ణసమామ్నాయమునందలినకారమునకు ద్రుతసంజ్ఞ విధింపఁబడుటచే ద్రుతమనఁగా వ్యంజననకారమని యర్థము. చింతామణివికృతివివేకముల మతమునందు – న్ – అనునదే ద్రుతసంజ్ఞక మగుచున్నది. స్వరలోపముఁ జెందిననకారము శబ్దావయవమైనను ప్రత్యయాగమావ్యయాత్మక మైనను ద్రుతసంజ్ఞ దాని కుండునని తెలియనగును. స్వరము లోపింపకున్నచో దానికి ద్రుతసంజ్ఞ యుండదు. తాను – నేను – కను – మున్నగువానిలోనినకారస్వరము లోపించి – తాన్ – నేన్ – కన్ – అని యేర్పడినపుడే వానికి ద్రుతకార్యములు వచ్చును. తాఁజదివె – నే వింటిని – కందోయి. మొ. స్వరలోపము లేనపుడు నకారమున సంజ్ఞయు నుండదు.

బాలవ్యాకరణము – నకారంబు ద్రుతంబు – (సంజ్ఞ. 11. సూ) అని చింతామణిని వివరించినది. కాని యుత్వముతోఁ గూడిననకారమునకే ద్రుతకార్యములను జూపినది. ప్రౌఢవ్యాకరణము – నకారం బసాధారణంబు ద్రుతంబు – (సంజ్ఞ. 7. సూ.) అనిసూత్రించి – ప్రత్యయాగమావ్యయాత్మకమై యుత్వవిశిష్టమైననకారము ద్రుతసంజ్ఞకము– అనిదానియసాధారణత్వమును వివరించినది. ఈపద్ధతిచెప్పిన – కందోయి – నాలుగేఁ బోఁడికత్తులు – మున్నగురూపములు ప్రౌఢవ్యాకరణమతమున సిద్ధించుట దుర్లభము.

బాలవ్యాకరణవ్యాఖ్యాతలు - కందోయి - అనురూపమును సాధించుటకుఁ బడినయవస్థ లసంఖ్యాకములు. అందేదియు సూరిమత మునకు సరిపడదు - కన్ను + దోయి - అనియుండఁగాఁ బ్రౌతాది లోపనుగాగమములను 'అన్యంబులకుసయితము' అనుసూత్రము చొప్పునఁ జేసి రూపసిద్ధి నొందుట సూరి కభిమతమైనట్లు తోఁచు చున్నది. లుప్తశేషమునకుఁ బరుషములు పరము లగునపుడు నుగా గమం బగు - (బాల-సంధి-37. సూ.) అనుసూత్రమున కీయభిప్రా యము విరుద్ధమని కొంద అనుచున్నారు. కాని నెఱ+తఱి= నెత్తఱి, అనుచోట - నెందఱి - అని కాన్లే యిట సహజసరళపరకత్వమున నుగాగమసిద్ధి యని తెలియనగును. కావుననే యిట్టిరూపములు 'అన్యంబులకు సయితము' అనుసూత్రమునకు విషయములు.

నకారమునకు ద్రుతసంజ్ఞవలెనే స్థిరసంజ్ఞయుఁ గలదు. కాన - మెచ్చెన్+నలినాక్షుఁడు=మెచ్చెనలినాక్షుఁడు - అని నకారపరకత్వ మున ద్రుతలోపమును గల్గినది. ద్రుతాఖ్యో నః, కచటతపాః పరు షాఖ్యాః, గజడదబాస్తు సరళాః స్థిరా ఇతరే - అనుకారికకుఁ బ్రౌఢ వ్యాకర్త పరుషసరళనకారవ్యతిరిక్తవర్ణములకు స్థిరసంజ్ఞ యగునని యర్థముచేసి, శబ్దశాసనుఁడు 'ద్రుతాఖ్యో నః' అని కేవలనకార గ్రహణము చేయుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని తెలియవల యును. (సంజ్ఞ-7.సూ) అని వివరించియున్నాఁడు - ప్రత్యయాగమా వ్యయాత్మకమై యుత్వవిశిష్టమైన నకారమునకే ద్రుతసంజ్ఞయైన చో - ద్రుతాఖ్యో నః - కేవలనకారగ్రహణముచేయుట విరోధింపదా యని శంకించుకొని నకారమునకు స్థిరసంజ్ఞాసిద్ధికొఱ కట్లుచెప్పె నని సమర్థిం చెను. నకారము పరుషసరళములు తప్ప మిగిలినహల్లులకే స్థిరసంజ్ఞ యని యితఁ డాసూత్రమునకర్థము చేయుట సరికాదు. సంస్కృత పద్యములలోఁ బూర్వార్ధము నుత్తరార్థము నని వాక్యద్వయము. - ద్రుతాఖ్యోనః - అనునది పూర్వవాక్యములోనిది. దాని కుత్తరవాక్య

ముతో నన్వయము లేదు. కాన బరుషసరళవ్యతిరిక్తము లగుహల్లు లకే స్థిరసంజ్ఞ యని తేలినది. అట్టిచో నకారమునకు స్థిరసంజ్ఞ లేకుం డుట యెట్లు? మఱియుఁ జింతామణి – ద్రుతాఖ్యో నః – అని కేవలన కారగ్రహణము చేసినచో దానికి స్థిరసంజ్ఞ సిద్ధించుట యెట్లు? ఇదియంతయు స్వమతస్థాపనమునకై చేయఁబడిన యభూతకల్పనమని స్పష్టపడు చున్నదిగదా!

**33. సూ :– కచటతపాః పరుషాఖ్యాః.**

33. సూ :– కచటతపాః పఞ్చ పరుషా ఇతి విశేషసంజ్ఞా భవన్తి.

వి:– కచటతప – అనువర్గపంచకప్రథమాక్షరములకుఁ బరుషము లని విశేషసంజ్ఞ చేయఁబడినది. మిథ స్సవర్ణ శ్చ – అనుచోప్పాన నీ సూత్రమునను గ్రమముగా దంత్యచజలకును గ్రహణము కలదు. వానికి నీసంజ్ఞలు వర్తిల్లును.

**34. సూ :– గజడదబాస్తు సరళాః.**

34. సూ. :– గజడదబాః పఞ్చ సరళా ఇతి విశేషసంజ్ఞా భవన్తి.

వి:– అయిదువర్గములలోను దృతీయవర్ణము లగు 'గజడదబ' లును దంత్యజకారమును సరళసంజ్ఞ కలవి యగుచున్నవి.

**35. సూ:– స్థిరా ఇతరే.**

మా. 1. ఇతరే పరుషసరళవ్యతిరిక్తా స్సర్వే ప్రాణినః స్థిరసంజ్ఞకా భవన్తి. తేన నస్య ద్రుతాఖ్యస్యాపి పునః స్థిరసంజ్ఞా తేన 'మెచ్చె నలినాక్షుఁడు' - ఇత్యాదౌ నలోప స్సిద్ధ్యతీతిజ్ఞేయమ్.

వి:– స్థిరాః–ఇతరే–అని భేదము. పరుషసరళములు తప్ప మిగిలిన హల్లులు స్థిరములని చెప్పఁబడుచున్నవి. నకారమునకు ద్రుతసంజ్ఞయు నీసూత్రముచే స్థిరసంజ్ఞయుఁ గల్గుచున్నవి. మెచ్చెన్+నలినాక్షుఁడు – అనునపుడు నకారపరకత్వమునందు ద్రుతలోపము కల్గినది, కవిశిరో

భూషణబాలవ్యాకరణములు చింతామణ్యనుసారము సంప్రదాయసిద్ధ మగు నర్థమును వివరింపఁగాఁ జింతామణికి వికృతార్థకల్పనమును ప్రౌఢ వ్యాకరణము చేయుట సరికాదు గదా! "శబ్దశాసనుఁడు 'ద్రుతాఖ్యో నః' అని చెప్పుట ద్రుతమునకు స్థిరత్వసిద్ధికై యని యెఱుంగునది" అని ప్రౌఢవ్యాకర్త వచించుట సరికాదు.

**36. సూ:- ఇంద్రాద్యా అపిచ గణాః.**

36. సూ. :- ఇంద్రాద్యా గణా అపిచాత్ర సన్తి. యరతాదయో గణా ఆద్యాయామివాత్రాపి సన్త్యేవేత్యపి చేతి శబ్దార్థః. ఆద్యశబ్దేన సూర్యేందుగణా గృహ్యన్తే.

వి:- ఇంద్రాద్యాః, అపి, చ - గణాః అని ఛేదము. సంస్కృత మందున్న యరతాదిగణములును దెనుఁగునందుఁ గలవు. మఱియు సూర్యేంద్రచంద్రగణములును దెనుఁగునఁ గలవు.

**37. సూ :- వళి రాద్య మనన్తరాక్షరం ప్రాసః.**

37. సూ. 1 :- వళిరాద్యం పాదాద్యక్షరం వళిసంజ్ఞ స్స్యాత్. ద్వితీయాక్షరం ప్రాససంజ్ఞ స్స్యాత్. అప్పకవిపుస్తకే తు —

ఆద్యో వళి ర్ద్వితీయో వర్ణః ప్రాసో౽త్ర పాదపాదేషు
స్వస్వచరణేషు పూర్వః ప్రాప స్సర్వేషు చైక ఏవ స్యాత్.
శుభవర్ణా శ్శుభశబ్దా యేచ శుభగణా స్తఏవ కావ్యాదౌ
గ్రాహ్యాః పురాన్త్రరపగిరిరుద్రే ష్వకచటతపా మాతృకా నిన్ద్యాః.
వృత్తం జాతిశ్చేతి ద్వివిధం పద్యం గణై ర్నిసర్గాఖ్యైః
సంబద్ధం వృత్తం స్యా దుపగణమాత్రాభి రన్వితా జాతిః.
శాస్త్రార ఏకమాత్రాం లఘుం ద్విమాత్రే గురూరితి వదన్తి
గౌ తౌ గగ లల సంజ్ఞౌ గ్లౌహగణో లఘుగురూ లగౌ వగణః
గత్రితయం లత్రితయం మనసంజ్ఞా వాద్యమధ్యమాన్త్యార్ణాః

గురవశ్చ భ్యజసగణా లఘవో యది యరతసంజ్ఞకాః క్రమశః
మిత్రౌ నగలౌ విన్ద్రా నలనగసలభరతా శ్చన్ద్రా మలఘుః
రలరగతలతగనవనహా భలభగసలలనలలనగగసవసహాః
ఇతి పద్యాని స్థితాని.

వి:— వళిః – ఆద్యం — అనంతరాక్షరం – ప్రాసః. పద్యపాదాద్యక్షరమునకు 'వళి'యని పేరు. ప్రతిపాదద్వితీయాక్షరమునకును బ్రాసమని పేరు. అప్పకవిపుస్తకమున నిట్లున్నది. – పద్యములలోఁ బ్రతిపాదమునందును మొదటివర్ణము వళి, ద్వితీయవర్ణము ప్రాసము, తొలిపాదమునందలిప్రాసవర్ణమే యన్నిపాదములయందును బ్రాసవర్ణముగా నుండును. శుభవర్ణములు శుభగణములు శుభశబ్దములు మాత్రమే కావ్యాదిని గ్రహింపఁదగినవి. 3, 5, 7, 9, 11, చోట్లఁ గృత్యాది పద్యాదిమపాదములో – అకచటతప – అనువర్ణము లుండరాదు. వృత్తము, జాతి, అని పద్యము రెండువిధములు. నిసర్గగణము లగు యరతభజసమన, అనుగణములతో నేర్పడినవి వృత్తములు. (మూఁడవఛందస్సును బ్రస్తరింపఁగా నీగణము లేర్పడును.) మాత్రాగణములగు నినేంద్రచంద్రగణములతో నేర్పడునవి జాతులు. ఒకమాత్రాకాలమున నుచ్చరింపఁదగినవర్ణమును లఘువనియు, రెండుమాత్రలకాలములో నుచ్చరింపఁదగినవర్ణమును గురువనియు శాస్త్రకర్తలు చెప్పుచున్నారు. గా– అనునది రెండుగురువులకును, –లా– అనునది రెండులఘువులకును సంజ్ఞలు. –గ్లో– (గురులఘువులు) హగణమనియు, లఘుగురువులకు వగణమనియు సంజ్ఞలు. మూఁడుగురువులకు మగణమని పేరు. మూఁడు లఘువులకు నగణమని పేరు. గణములలోని యాదిమధ్యాంతవర్ణములు గురువులైనచో నవి వరుసగా భజసగణము లగును. లఘువులైన యరతగణములగును. నగణహగణములకు మిత్రగణములనియు, నల, నగ, సల, భరతగణముల కింద్రగణములనియు, మల, రల, రగ, తల, తగ, నవ,నహ,భల,భగ,సలల,నలల,నగగ,సవ,సహ అనునవి చంద్రగణములనియు-విశేషము లప్పకవీయమునఁ గలవు.

37. సూ. 2 :– పురాస్త్రేతి తృతీయపఞ్చమసప్తమనవమైకాదశస్థానే వ్వాకారాదయో న ప్రయోజ్యాః. క్రమస్తు స్థానానాం న వివక్షితః. తథైవ ఛందోగ్రన్థేషు వ్యవహారాత్ - శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతః- ఇత్యాదిపర్వాదిమపద్యే సప్తమస్థానే సంహితాయాం సంయుక్తత్వే నాచార్యేణ చకారః ప్రయుక్తః.

తృతీయోఽచ్చ తృతీయోష్మా తృతీయసరళా స్త్రయః
షోడశ వ్యఞ్జనం చాపి షష్ఠస్థానే న యుజ్యతే.

ఇత్యథర్వణః. తృతీయే తృతీయే స్థానే, సరళా స్త్రయ ఆద్యాః. వృత్తం జాతి శ్చేతి పద్యం ద్వివిధమ్. తత్ర ప్రస్తారనిష్పన్నై ర్మగణాదిభి స్సంయుక్తం వృత్తమిత్యుచ్యతే. మిత్రేన్ద్రచన్ద్రగణై ర్నిబద్ధం పద్యం జాతిరి త్యుచ్యతే. అక్కరాదయో జాతయః ప్రసిద్ధాః. విశేషత ఏతేషా మర్థప్రపఞ్చన స్తత్రైవ కృతమితి నేహ క్రియతే.

వి:– పురాస్త్రరసగిరిరుద్రేషు–అనుపాఠము వ్యా. సం. స. లో– పురాస్త్రగిరిరసరుద్రేషు–అని సవరింపఁబడినది. ఆపాఠ మిందు గ్రహింపఁబడినది.మఱియు–తృతీయోచ్చ తృతీయోష్మా తృతీయసరళాస్త్రయః– అనుపాఠముకన్న–తృతీయసరళ స్త్రయః – అను పాఠము సమంజసము. మూఁడవయచ్చగు, ఇ–వర్ణమును, ఊష్మములలో మూఁడవది యగు, స–వర్ణమును, సరళములలో మూఁడవది యగు, డ–వర్ణమును, హల్లులలోఁ బదునాఱవది యగు, త–వర్ణమును గృత్యాదిపద్యప్రథమపాదమునాఱవచోట నుండరాదని యాకారికకర్థము. భారతాదిపర్వాది పద్యప్రథమపాదమున నన్నపార్యునిచే సప్తమస్థానమున సంయుక్తముగా 'చ' కార ముపయోగింపఁబడినది.

38. సూ.– న పదా న్యవ్యయసుప్తిఙ్క్త్వాతుమునామ్.

38. సూ. 1. న పదానీతి అవ్యయస్య ప్రాతర స్తరిత్యాదేః సుప్తిఙ్క్త్వాతుమున్నన్తానాఞ్చ, హారిణా భవతి గత్వా రన్తు మిత్యాదీనాం ప్రయోగపదాని నాత్ర సన్తి. ఏషాం ప్రయోగో నాత్రాస్తీ త్యర్థః.

వి:– న, పదాని, అవ్యయసుప్తిఙ్క్త్వాతుమునామ్–అని ఛేదము. సంస్కృతభాషయందు దున్నశబ్దముల కన్నింటికిఁ దెనుఁగునఁ దత్సమముగఁ

ప్రయోగము లేదు. కాన నట్టివాని నీసూత్రము విశదపఱుచు చున్నది. సంస్కృతావ్యయములకును, సుబంతతిజంతక్త్వాంతతుము న్నంతములకును దెనుఁగునందుఁ బ్రయోగము లేదని సూత్రార్థము. ఇం దవ్యయనిషేధము నిట్లు నిర్ణయింపవలయును. సంస్కృతావ్యయము లలోఁ గొన్ని యవ్యయములుగాఁ దత్సమములు కావు. ప్రాతిపదికము లుగా వచ్చి తెనుఁగువిభక్తిప్రత్యయముల నొంది నామములుగాఁ బ్రయుక్తము లగును. ఇహము-ఇహమునందు మొ. అచ్చ తెన్గున నవ్య యములు లేవు. ప్రాతః, అంతర్ మున్నగునవ్యయములకును, హరిణా మున్నగుసుబంతములకును, గత్వా మున్నగుక్త్వాంతములకును రంతుం మున్నగుతుమున్నంతములకును దెనుఁగునందుఁ దత్సమరూపమునఁ బ్రయోగమే లేదు. సర్వత్ర వృథా మున్నగుకొన్నింటికిఁ దెనుఁగునందుఁ దత్సమములుగాఁ బ్రయోగ ముండవచ్చునని తెలియుచున్నది. అప్పు డవి క్రియావిశేషణము లగునని తోఁచుచున్నది. అవ్యయములని వాని ననరుగదా!

**39.** సూ:- అనుకృతేఽస్తి వాక్యం తు.

39. సూ. 1 :- అనుకృతఇతి. అనుకృత మనుకరణమ్. తుశబ్దో భిన్నక్రమః. అనుకరణే తు వాక్యం సుప్తిఙన్తాదిపదకదంబక మస్తి; ప్రయోగార్హం భవతి. యద్యపి వాక్యమిత్యుపాదానా ద్వాక్యస్యైవానుకరణే ప్రయోగ ఇతి ప్రతీయతే. నతు పదస్య. తథాఽపి పూర్వసూత్రే పదానీతి బహువచనేన పదవాక్యయోః ప్రయోగనిషేధ విజ్ఞానాత్పదస్య వాక్యావయవత్వాచ్చ. 'నమ' ఆదికే విసర్గస్య-ఇతి సూత్రస్వరసాచ్చ. అథర్వణవచనానుసరణాచ్చ పదస్యాప్యనుకరణే ప్రయోగానుజ్ఞా భవత్యేవ. పురత యని, అంత రని, హరిణా యని, రామేణ యని-ఇత్యాది పదస్యానుకరణే ఉదాహర ణమ్.- 'నరకే సతి కో దోషో మరణే సతి కిం భయ' మనిసచదువు చదువంబోలున్- ఇత్యాది వాక్యస్యానుకరణే ఉదాహరణమ్.

వి:- అనుకృతే, అస్తి వాక్యమ్, తు-అని ఛేదము. అను-అను ధాతువునుగాని దాని రూపములలో దేనినైనఁగాని సంస్కృతప్రాకృత

పదములచివర నిలిపి తెనుఁగునఁ బ్రయోగించినచో నది యనుకరణ మనిపించుకొనును. కేవలసంస్కృతపదములకును వాక్యములకును దెనుఁగునఁ బ్రయోగ ముండరాదనియు ననుకరణమునం దుండవచ్చుననియు మీఁదిగ్రంథమునకుఁ దాత్పర్యము. న పదా న్యవ్యయ సు ప్తిఙ్త్వాతు మునా మనుకృతేఽ స్తి వాక్య స్తు-అనురెండుసూత్రములును గలిసి కారికలో నుత్తరార్థమై యున్నవి. సంస్కృతశ్లోకములలోనిపూర్వార్థ మొకవాక్యము నుత్తరార్థ మొకవాక్యము నై యుండును గదా. ఏకవాక్యగతము లైనసూత్రములకుఁ బరస్పరాన్వయ ముండుట విరుద్ధము కాదు. కావున సంస్కృతావ్యయసుప్తిఙ్త్వాతుమున్నంతములకును సంస్కృతవాక్యములకును ననుకరణ మున్నచోఁ దెనుఁగునఁ బ్రయోగ ముండవచ్చుననియు నది లేనినాఁ డుండరాదనియు స్పష్టమగుచున్నది. అధికారము-అనువృత్తి మున్నగువానిం జింతామణి యంగీకరింపదు. చ, అపి..మున్నగువానిసార్థక్యమును జెప్పుటయుఁ జింతామణి కంగీకారయోగ్యము కాదు. చింతామణి కారికలలోఁ బాదపూరణమునకై వేయఁబడిన -తు హి చ స్మ హ వై- మున్నగువానికిఁ గవిశిరోభూషణము విశేషార్థములను గల్పించియుండెను. అట్లుచేయుట సరికాదు. చింతామణియందుఁ గొదువపడినవిషయముల నథర్వణాచార్యులుగారు వివరించియున్నారు గదా! చింతామణికిని వికృతివివేకమునకును గలసంబంధమును గుర్తించుట కవిశిరోభూషణమునకు సమ్మతము కాదేమో!

39. సూ. 2 :- అనుకరణం చాన్త్యపదే నాకారాదినకారా న్తేనైవేతి నాఽగ్రహః. కిన్తు సంస్కృతపదే నాపీత్థ మిత్యాదినా భవత్యేవ. అతఏవ ద్వితీయాచార్యేణోక్తమ్.

సజీర్ణత్వం వికృత్యాద్యాఽనుకృత్యా మఞ్జులం భవేత్ ఇతి. ఏతత్సూత్ర మనుసృత్యైల్లసాని పెద్దన్నకవినా 'ఆముక్తమాల్యదాయాం' – అద్ధా! వాగ్వైబుధం, ఖహో! వచనకవ్యాపారం, మాహా! వచ, స్సిద్ధమ్మః! కృతతాం గతః కవిరితి శ్రీనూక్తి

విద్యాధరమ్మ - ఇత్యాది పద్యే ఇద్ధోద్ధత్య మగా ల్లయం హి కుధియా మిత్థం వదత్కిన్న రంబు - ఇత్యాద్యు క్తమ్. న చాత్రాఽపి ద్విత్వప్రసఙ్గః. ఇత్యాది శబ్దై రనుకరణేఽపి సఙ్కీర్ణత్వం యు క్త మిత్యత్రైవ వచనతాత్పర్యావధారణాత్. కిన్తు వైకృతపదానుకరణ ఏవ పదా న్తే ద్విత్వమితి విశేషః.

వి:— తెనుఁగుపదమగు 'అను' అను దానిచేతనే కాక 'ఇత్థం' మొదలగుసంస్కృతపదములతోఁగూడ ననుకరింపవచ్చునని యథర్వణాచార్యులుగా రనుచున్నారు. తెలుఁగుకావ్యములలో సంస్కృతవిభక్త్యంతప్రయోగరూపసంకీర్ణత, 'అను' మున్నగు తెనుఁగుశబ్దములయు, ఇతి, ఇత్థం, మున్నగుసంస్కృతశబ్దములయు ననుకరణముచే నిర్దోషమగును—అని యథర్వణాచార్యులుగారు వచించిరి. కావుననే 'ఇద్ధోద్ధత్యమగా ల్లయంహి కుధియామ్' అనుసంస్కృతివాక్యము, 'ఇత్థం' అనుదానిచే ననుకరింపఁబడి యేకసమాసమై 'ఇద్ధోద్ధత్యమగా ల్లయంహికుధియా, మిత్థంవదత్కిన్నరంబు', అనిచెప్పఁబడినది.

39. సూ. 3 :- ఏతన్నిషేధ ఆంధ్రపదసంకీర్ణతాయామేవ నాన్యత్ర. కేవలానాం ప్రయోగో నిర్బాధ ఏవ. అతఏవో క్తం వికృతివివేకే - ప్రబన్ధే కేవలాద్యస్య ప్రయోగస్తు న దోషకృత్ ఇతి.

సీ. 'దంభోళిధరసతీతాంబూలపేటీషు
దహనబింబాధరా స్తనభరేషు'
'హారయే జితమురుదరయే,
తిరయే భవవారిధేశ్చ ధన్యజనానామ్
సురతరవే స్మరగురవే
స్థిరవేదమయాయ దేవదేవాయ నమః' -

ఇత్యాదిప్రయోగాః ప్రబన్ధేషు బహవః ప్రవర్తన్తే. కిఞ్చ తత్రైవ -
వినాఽనుకరణం కేచి దాద్యశబ్దం ప్రయుఞ్జతే
ప్రత్యయార్థావ్యయస్యాపి ప్రయోగః కుత్రచి ద్భవేత్
అవ్యయ స్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా
కథిత స్తద్భవస్యాపి దీర్ఘా న్తత్వం క్వచి ద్భవేత్ - ఇత్యు క్తమ్. అతఏవ

రామాభ్యుదయే రామభద్రకవినా - ఆర్తుల నీవ నేర్తు వరయంగ – ఇత్యాదిపద్యే-కర్త మకర్తు మన్యథాకర్తు ముదారశక్తివి - ఇత్యుక్తమ్. కవితాపితామహాదిభిరపి - సర్వత్ర నిలింపకామినులవాడవుc గాపులు వోదురు. 'ఆబాలగోపాల మఖిలసత్త్వజయమును నానందమగుమన్కి నతిశయిల్లె' 'జయ శీతాంశుకులావతంస నిషధస్వామీ' ఇత్యాదీని వాక్యాని ప్రయుక్తాని.

వి:– ప్రబంధములయందు సంస్కృతవిభక్త్యంతములయుc దద్ఘటితవాక్యములయుc బ్రయోగము దుష్టము కాదు–అని విశ్కృతివివేక మనుచున్నది. ఇద్ధోద్ధత్యమగాల్లయంహికుధియా మిత్థంవదత్కిన్నరంబు–అనునది సంకీర్ణత కుదాహరణము. ఇద్ధోద్ధత్యమగాల్లయం హికుధియాం – అనువాక్యము– ఇత్థం అనుదానిచే ననుకరింపcబడి సమాసగర్భితమైనది. ప్రబంధములలో సంస్కృతపదప్రయోగము దోషము కాదు. కొందఱు మహాకవు లట్లు ప్రయోగించియుంకుటయే దానికిc గారణము. కొందఱు మహాకవు లనుకరణవిరహితముగ సంస్కృతవిభక్త్యంతమును దెనుcగునc బ్రయోగించి యున్నారు. సాధారణముగా ననుకరణముతో డనే సంస్కృతపదవాక్యములు తెనుcగునc బ్రయోగింపనగు నను నియమమున్నను గొన్నియెడల సంస్కృతవిభక్త్యంతములును దద్ఘటితము లగు వాక్యములును శ్లోకములును సంస్కృతశబ్దానుకరణమువలనc గాని యాచ్ఛికశబ్దానుకరణమువలనcగాని ప్రయుక్తములు కాక, యనుకరణవిరహితప్రయోగము క్వాచిత్కముగా నుండు నని కొందఱనుచున్నారు. రామశబ్దము (రామ ఇతిశబ్దః) అని ప్రయోగింపcబడుచున్నది. ఇందు 'ఇతి' అనుకరణశబ్దము లోపించినది. సంస్కృతావ్యయములకుc దెనుcగునc బ్రయోగము లేదు కాని యందుc గొన్ని తెనుcగుప్రత్యయములతోcగూడి ప్రయుక్తములు కానోపును – అని విశ్కృతివివేకము. ఇహ పరాదిశబ్దములు దాని కుదాహృతులు. ప్రత్యయాగ్రమము కా నిసంస్కృతావ్యయమునకును దెనుcగునc బ్రయోగ ముండవచ్చునని విష్ణుశర్మయభిప్రాయము. పల్లకీ శబ్దము – పల్యంకికాశబ్దభవమనియు దీనికిc దద్భవ

త్వమున దీర్ఘాంతత యుండుననియు వికృతివివేశమే చెప్పుచున్నది. దీనికి హ్రాస్వమును గలదు. వృథా అనుదానితద్భవరూపము, విత అనునది. ఇదియు దీర్ఘాంతమే. దీనికి హ్రస్వము కల్గిన విత అనియగును. కాని సంస్కృతముననే వృథా-వృథ అను రెండురూపములు నగపడుచున్నవి.

ఈవిషయములను బాలవ్యాకరణము సంగ్రహింపలేదు. కాని ప్రౌఢవ్యాకరణముమాత్రము 'ఒకానొకచో ననుకరణవిరహితముగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి, (ప్రౌఢ–సంజ్ఞ. 15 సూ.) అనియు, 'జయపదం బనుకరణవిరహితంబ తెలుచుగ నగు' (ప్రౌఢ-సంజ్ఞ-16సూ) అనివ్రాసి యుదాహరించినది. ఇందు మొదటిది – ప్రబన్ధే కేవలా ద్యస్య ప్రయోగస్తు న దోషకృత్ – అనుదానికిని, వినాఽనుకరణం కేచి దాద్యశబ్దం ప్రయుంజతే అనుదానికి రెండవదియు వివరణములు. మిగిలినవాని నితఁడును సంగ్రహింపలేదు.

40. సూ 1 :— తిఙ్మధ్యశేషషష్ఠీసుప్కర్మప్రవచనీయజవిభక్తిః కిఞ్చిత్ప్రశంసనాద్భుత సన్తాపయదాతదాకిమేవాంశ్చ । క్త్వాకిలతూష్ణీమాద్యా నభిదధతి కళా ద్రుతో న యేషాం స్యాత్.

40. సూ. 1:- తిఙ్మధ్యా మధ్యమపురుషా రమూన్తాశ్చ శేషషష్ఠీ యొక్కష ష్ఠీసుప్ ప్రథమావిభక్తిః, సుప్స్వాది రస్త్యహాలా ఇతి ప్రాకృతసూత్రాత్. కర్మప్రవచనీయజ విభక్తిః కూర్చితి విభక్తిః. ఏతాంశ్చ కిఞ్చిత్ కించిదర్థాః కాసంతాదయః. ప్రశంసన ప్రశంసనార్థా భళీత్యాదయః. అద్భుత అద్భుతార్థా ఓహోఇత్యాదయః. సన్తాప సంతాపార్థాః అయ్యో అక్కట ఇత్యాదయః. యదాతదార్థా ఎప్పుడు అప్పుడు ఇత్యేతే శబ్దాః. నే నెప్పుడుఁ గొల్చెద నిత్యాదౌ సదాపర్యాయో ద్రుతప్రకృతికసంజ్ఞః. కిమర్థః ఏమీతిశబ్దః. ఏవ ఏవార్థాః నిన్నె నన్నె ఇత్యాద్యాః ఏతాంశ్చ క్త్వార్థాః పోయి వచ్చి ఊఁకొక చేయక ఇత్యాద్యాః. కిల కిలార్థాః పోయెనఁటవచ్చెనఁట ఇత్యాద్యాః. తూష్ణీం తూష్ణీమర్థాః ఊఁకొక మిన్నక ఇత్యాదయః ఆదిశబ్దేన పట్టి కై ఇతివిభక్తీ. సుమ్మీ కదా ఏల మఱి ఇత్యాద్యా గృహ్యన్తే. ఏతాంశ్చ శాస్త్రకర్తారః కళాసంజ్ఞకా నభిదధతి వదన్తి. యేషా మన్తే ద్రుతో నకారో న స్యాత్. కూర్చిరి కీర్తీత్యాదా వించు

న్నాడు, ఘటింపఁగలఁడు చనఁడు-ఇత్యాదీనాంతిజ్మధ్యత్వాభావేఽపి ప్రథమాసమత్వేన సంగ్రహ ఇతి జ్ఞేయమ్. నిబంధనేషు ప్రాచాం చే చ్ఛబ్దోఽన్యః ప్రదృశ్యతే। సూత్ర స్థితాదిశబ్దేన గ్రాహ్యసంఖ్యావదుత్తమైః.

వి:- తిజ్మధ్య శేషషష్ఠీసుకర్మప్రవచనీయజవిభక్తిః, కిఞ్చిత్ప్రశంస నాద్భుతసన్తాపయదాతదాకిమేవాన్, చ క్త్వా కిల తూష్ణీ మాద్యాన్, అభిదధతి, కళాః, ద్రుతః, న, యేషాం, స్యాత్ అని ఛేదము. తిజ్మధ్య నామకా స్స్యు ర్మధ్యమపురుషాశ్చ యే రమాన్తాశ్చ-అనుచో ప్వాన, 'వచ్చితివి' మున్నగుమధ్యమపురుషక్రియలును, 'వచ్చిరి, వచ్చితిమి' మున్నగు రేఫాంతమాంతక్రియలును, దిజ్మధ్యములని చెప్పఁబడుచున్నవి. అవియు శేషార్థమున వచ్చిన, 'యొక్క' అనుషష్ఠియుఁ, బ్రథమావిభక్తి రూపములును, 'కూర్చి, గుఱించి, గుఱిచి' మున్నగుకర్మప్రవచనీయా ర్థకప్రత్యయాంతములును, 'కాసంత' మొదలగుకించిదర్థకములును, ఆహా మున్నగు ప్రశంసనార్థకములును, 'బాపురే' మున్నగునాశ్చర్యార్థకము లును, 'అయ్యో . అక్కట', మున్నగు సంతాపార్థకములును, అప్పుడు, ఇప్పుడు, ఏమి' అనునవియును 'వచ్చి, రాక, అఁట, ఊఱక, మిన్నక' మున్నగునవియును, గళలని చెప్పఁబడుచున్నవి. వీనిచివర ద్రుత మగు నకార ముండదు. వీనిచివర నకారమగపడినచో నది సముచ్చయాద్యర్థ కమేగాని శబ్దసంబంధి కాదు. సముచ్చయాద్యర్థకము ప్రత్యేకపదము కదా! అవి ఊఱకన్, రాముఁడున్, రాఁడున్-మున్నగునవి.

వించున్నాఁడు, ఘటింపఁగలఁడు, చనఁడు - అనునవి పైసూత్ర మున సంగ్రహింపఁబడలేదు. పైమూఁడును వర్తమానభావివ్యతిరేకా ర్థకప్రథమపురుషైకవచనరూపములు. ఇవి తిజ్మధ్యములుకావు. ప్రథమా సమము లగుటచేఁ గళలుగా గ్రహింపనగునని కవిశిరోభూషణము వివ రించినది. వీనిలో మొదటి రెంటికి నన్నయగారినాఁడు ప్రయోగము లేదు. మూఁడవది యాదిపదగ్రాహ్యము. ప్రాచీనమహాకవి ప్రబంధము లయం దగపడినచో మఱియు నిందుఁ జేర్కొనఁబడని కళయగు శబ్దము

దానింగూడ సూత్రమునందలియాదిపదముచే సంగ్రహింపవలయును-కాని, కాక యొ. 'ఏని' అనుశబ్ద మొకటి యగపడుచున్నది. దీని, 'ఇ' వర్ణము లోపించినపు డిది (ఏన్) ద్రుతప్రకృతిక మగుచున్నది. 'అపి శబ్దార్థ స్యేతః' అని దీని, ఇ-కారమునకు లోపము. ఈలోపము లేనపుడు నిది కళ కాక ద్రుతప్రకృతిక మనుటయే లెస్స. 'తాను, నేను, కను, చను' అనువీని నకారమునకు స్వరలోపము కల్గినచో ద్రుతప్రకృతికము లగుచున్నవి గదా! మఱికొందఱు, ఏని — శబ్దముద్రుతప్రకృతికతను మఱియొకరీతిని సాధించిరి. సముచ్చయార్థము గల, ఏని శబ్దము 'ఏని యున్' అని యుండుననియు, దీని, యు, ని - వర్ణములకు లోపము కల్గి నపుడు, 'ఏన్' అనియుఁ, గేవల యు వర్ణలోపము కల్గిన 'ఏనిన్' అని యుండుననియుఁ జెప్పుచున్నారు. సముచ్చయార్థకమగు, 'నున్' అను నది ప్రత్యేకశబ్దము. అది ద్రుతప్రకృతికమే.

41. సూ:- అన్యే ద్రుతప్రకృతయో యే స్యు ర్హ్యనుజీవితద్రుతా నిత్యమ్.

41. సూ. 1 :- అన్యే ఏతద్వ్యతిరిక్తా శ్శబ్దా ద్రుతప్రకృతయః ద్రుతప్రకృతికా భవన్తి. అన్యే శబ్దా నిత్య మనుజీవితద్రుతా అనుసృతా న్తనకారా స్స్యుర్హి భవేయుర్హి. శాస్త్రమహిమ్నా లోపాదేశప్రాప్తావప్యదో ద్రుతాన్తత్వేన స్థితాః ప్రసిద్ధా ఇతి తాత్పర్యమ్.

వి:- అన్యే, ద్రుతప్రకృతయః, యే, స్యుః, అనుజీవితద్రుతాః, నిత్యమ్—అని ఛేదము. కళలు కానివి ద్రుతప్రకృతికములని సూత్రార్థము. ద్రుతప్రకృతికము లనుజీవితద్రుతములై యుండును. శబ్దము పదత్వము నొందునప్పటికి దానితుదిని నకారము నిలిచి యుండును. శాస్త్రము చొప్పున లోపము కల్గినను ద్రుతము చివర నున్నట్లే భావింపవలయునని తాత్పర్యము. ద్రుతోపజీవిశబ్దములు కొన్ని కలవు. రాముఁడున్, రాఁడున్, మున్నగునవి. కళాశబ్దములచివర ద్రుతము నిలిచిన నవి ద్రుతోపజీవులగును. వీనికిఁ దుదిని సముచ్చయాద్యర్థక, నున్, వర్ణకము నిలుచును.

సూరిగారీవిషయమును నూతనమార్గమున వివరించియున్నారు. చింతామణి కళలను జెప్పి మిగిలినవి ద్రుతప్రకృతికము లనెను. బాల వ్యాకరణము ద్రుతప్రకృతికములను జెప్పి మిగిలినవి కళలని చెప్పినది. "ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికములు" (బాల–సంజ్ఞ.12)

తిఙ్మధ్యములు –మధ్యమపురుషక్రియలును రేఫమకారాంతక్రియలును సమాపకక్రియలలోఁ గళలు. వచ్చితివి, వచ్చితిరి, వచ్చిరి, వచ్చితిమి, వత్తురు, వచ్చెదరు, వత్తువు, వచ్చెదవు, వత్తుము, వచ్చెదము; అన్ని కాలములయందును ప్రథమమధ్యమోత్తమపురుషబహువచనరూపములును, మధ్యమపురుషైకవచనరూపములును గళలు. మిగిలినప్రథమోత్తమపురుషక్రియ లన్నికాలములందును ద్రుతప్రకృతికములు. కాని వర్తమానభావివ్యతిరేకప్రథమపురుషైకవచనములు ద్రుతప్రకృతికములు కావు. వీనిం జింతామణియు నథర్వణకారికలును జెప్పలేదు. ఇప్పుడున్నవర్తమానభావ్యర్థకరూపములు నన్నపార్యునినాఁడు లేవు. వ్యతిరేకార్థక మున్నది. అది యాదిపదగ్రాహ్యమై కళ యగుచున్నది. రక్షింపుము–రక్షింపుఁడు–అనునవి మధ్యమపురుషములేకాన నివియుఁ జింతామణిచే సంగ్రహింపఁబడినవి. భూతతద్ధర్మార్థకప్రథమపురుషైకవచనములు ద్రుతప్రకృతికములు. సూరియు నట్లే చెప్పెను –రక్షించెదున్, రక్షించుతన్ – అనునవి తిఙ్మధ్యములు కానందున ద్రుతప్రకృతికములే. శేషషష్ఠి యనఁగా యొక్క–ప్రత్యయము చేరినషష్ఠి. రామునియొక్క–మొ॥ ప్రథమావిభక్తిరూపములు కళలు, కర్మప్రవచనీయార్థకములగు–కూర్చి – మున్నగు ప్రత్యయాంతములు కళలు. 'కర్మప్రవచనీయకే కూర్చిః' – అని చింతామణి చెప్పినది. కాని పట్టి–అనుదానింగూర్చి యేమియుఁ జెప్పిన ట్లగపడదు. పట్టీతి తు పఞ్చమీగుణే హేతౌ–అని మాత్రము చింతామణి వచించినది. ఇదియుఁ గర్మప్రవచనీయార్థకమని చింతామణియభిప్రాయము కానోపును. కించిత్ప్రశంసనాద్భుత

సన్నాపయదాతదాకిమేవార్థకశబ్దములును గళలే. ఇందు యదా తదార్థకశబ్దములు - ఎప్పుడు - అప్పుడు—అనునవి. 'అప్పుడిప్పుడెప్పుడనుశబ్దములు నిత్యైకవచనాంతములు. వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుంగునది' అని (బాల-సంధి-13 సూ) సూరిగారు వ్రాసిరి. నిత్యైకవచనాంతము లనుదాని కవ్యయములని వారు చేసినయర్థము. అవ్యయములకు 'అవ్యయాదాప్సుపః' అని ప్రథమైకవచనలోపము కల్గుననియు నవు డవి ప్రథమైకవచనములేమై, సున్—అనుదానిచే సంగ్రహింపఁబడుచుండఁగా మరల వానిని జెప్పుట ప్రపంచార్థ మనఁగా స్పష్టతకే యనియు సూరిగారి యాశయము. కాని తెనుఁగునం దవ్యయములు లేవు. అప్పుడు మున్నగు వానిచివర నర్థభేదములో ద్రుత మగపడుచుండుటచే ద్రుతప్రకృతికము లనుభ్రాంతిని దొలఁగించుటకై యవి గ్రహింపఁబడిన వనుట లెస్స. అసమాపకక్రియలగు క్త్వార్థవ్యతిరేకక్త్వార్థశతృతుమానంతర్యచేదాద్యర్థకము లాటెంటిలో మొదటి రెండును గళలు - మిగిలినవి ద్రుతప్రకృతికములు. కవి...ణము 'నేను, తాను' పదములు కళలనినది. కాని కళలుగా వానికి మహాకవిప్రయోగప్రసిద్ధి లేదు. ఉకారలోపము నొంది ద్రుతప్రకృతికములుగనే ప్రసిద్ధి కలదు. విశేషణములు చింతామణిమతమున ద్రుతప్రకృతికములు; సూరిగారిమతమునఁ గళలు. సూరిగారు, 'ను', అను దానిని ద్రుతముగా నంగీకరించిరి. చింతామణి పొల్ల (వ్యంజన) నకారమునే ద్రుత మనెను.

**42. సూ :— తజ్జా సమా చ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి।**
**ప్రకృతిద్వయజా తజ్జా తుల్యా తు సమా ప్రవాహినీ దేశ్యా।**

42. సూ. 1 :— ఇయం వికృతిభాషా తజ్జాదిభేదేన చతుష్ప్రకారా భవతి। ఆద్యప్రకృతిప్రకృతిజా తజ్జేత్యుచ్యతే। తత్తుల్యా సమేత్యుచ్యతే। నితోఽనస్యాద్యలో లోకః ప్రవాహః; సోఽస్యాస్తీతి ప్రవాహినీ దేశ్యా। లోకవ్యవహారవేద్యేతి యావత్। అనియమాద్గ్రామ్యా 'అనియమా ద్గ్రామ్యమ్' - ఇత్యుక్తత్వాత్। వనము,

జముఁడు - ఇత్యాద్యా స్సంస్కృతప్రాకృతసమాః. నిండుచలిముద్ద, పండువెన్నెల పొదరిల్లు - ఇత్యాద్యా దేశ్యాః. అత్రేదం విచార్యమ్. 'త్రివిధైవ వికృతిః; అనియమా ద్గ్రామ్యా భవతి. వర్ణన్యూనత్వాధికత్వాన్యాదృశత్వలక్షణా. తథా చ చతుర్విధా భాషేతి గ్రామ్యయా సాకం వికృత్యా శ్చాతుర్విధ్యం వదత శ్శబ్దానుశాసనాచార్యస్య కుత్రచిద్వినియోగ ఇష్టఏవ. అన్యథా తత్పరిగణనం ముధా స్యాత్. వినియోగోఽపి నాన్యత్రేతి తత్తత్స్వభావవర్ణనే కార్యః. అతఏవోక్త మథర్వణేన—

గ్రామ్యం తత్తద్విధౌ సాధు కఱకంఠముఖా హితాః ఇతి.

వి:— తజ్జా, సమా, చ, దేశ్యా, గ్రామ్యా, చ, ఇయం, చతుర్విధా, భవతి, ప్రకృతిద్వయజా, తజ్జా, తుల్యా, తు, సమా, ప్రవాహినీ, దేశ్యా- అని ఛేదము. ఈ తెలుఁగుభాష తజ్జ, సమము, దేశ్యము, గ్రామ్యము అని నాల్గువిధములు. సంస్కృతప్రాకృతప్రకృతిద్వయమునుండి వచ్చినది తజ్జ యనియు, వానితో సమమైనది సమ మనియు, దేశ్యము ప్రవాహిని యనఁగా లోకవ్యవహారమువలనఁ దెలియఁదగినదనియు, వానికి లక్షణములు. గ్రామ్యమున కీవఱకు లక్షణము చెప్పఁబడుటచే నిటఁ బునరుక్తము చేయఁబడలేదు. (చూ. 9, 10. సూ.) లక్షణ మనునది, గ్రంథప్రయుక్తశబ్దములకే. దానికి గ్రాంథికభాష యని పేరు. గ్రామ్య మపభ్రంశము ప్రభ్రంశము నని రెండు విధములు. గ్రంథప్రయుక్త గ్రామ్య మపభ్రంశము. రెండవది ప్రభ్రంశము. కావున నే, 'అనియమా ద్గ్రామ్యం హి యు త్త్వపభ్రంశః' అని చెప్పఁబడినది. 'తత్తద్విధియందు గ్రామ్యము సాధువే' యని యథర్వణాచార్యులు చెప్పిరి. తత్తద్విధి యనఁగా నుత్తరోత్తరపండితకవీంద్రసమ్మతి గాని యుత్తరోత్తరప్రామాణికవ్యాకరణసమ్మతిగాని కల్గియున్నపుడని యర్థము. ఈపక్షమున గ్రామ్యపదమునకుఁ బూర్వపూర్వవ్యాకరణవిరోధమువలనఁగాని మహాకవిప్రయోగవిరోధమువలనఁగాని యపశబ్దత గల్గును. అది మహాకవి ప్రయుక్తమైన నపభ్రంశగ్రామ్య మగును. కాన మిశ్రబహువ్రీహి యగు

టచే నసాధువనఁదగిన, 'కఱకంఠుఁడు' అనునది నన్నయప్రయుక్త మగుటచే సాధు వగుచున్నదని తాత్పర్యము. సూరిగారు పై విషయమును "సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు" (బాల. సంజ్ఞ. 19) "సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు" (బాల. సంజ్ఞ. 20). అని వివరించిరి.

తత్సమతద్భవములలక్షణమును బాలవ్యాకరణము చింతామణి చెప్పినట్లే చెప్పినది. దేశ్యగ్రామ్యములలో భేద మగపడుచున్నది. త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు (బాల–సంజ్ఞ–21. సూ) అనియందుఁ ద్రిలింగదేశవ్యవహారమని చెప్పఁబడినది. దేశవ్యవహారమునందున్నది వ్యావహారికభాష. దానికి వ్యవహారమే ప్రయోజనము. అనన్యాదృశము నిత్యము నగుపండితకవీంద్రవ్యవహారము దేశ్యమని చింతామణి చెప్పినది. సామాన్యలోకవ్యవహారమున కిందుఁ బ్రయోజనము లేదు. మహాకవీంద్రకవితావ్యవహారమునకే ప్రసక్తి కలదు. మహాకవులు తమకవితావ్యాపారమున నుపయోగించినదేశీయభాషకు దేశ్యమని పేరు గదా! సూరిగారు "త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు" (బాల. సంజ్ఞ, 21) అని పై విషయమును వివరించుట సరికాదు.

బాలవ్యాకరణము, కటు శబ్దవికృతి, 'కారము' అనిచెప్పినది. అది సరికాదని శబ్దార్థసారూప్య మున్నదనుచు, 'క్షార' శబ్దమునుండి, కారము జనించినదని ప్రౌఢవ్యాకరణము చెప్పినది. ఆపస్తంబధర్మసూత్రములో క్షారలవణవర్జఇ్చ–అనియుండుటచే లవణశబ్దసాహచర్యముతో 'క్షార' శబ్ద ముపయోగింపఁబడుటచే, క్షార కార, శబ్దముల కర్థసారూప్య మున్నదని వారియూహ. కాని పండితలోకవ్యవహారములో, 'కారము' అనుదాని కట్టిరీతి యగపడదు. క్షారము, అనునది లవణార్థకముగనే వినఁబడుచున్నది గదా! కాన దీనిని 'కటు' శబ్దపర్యాయ మనుటయే లెస్స.

మఱియుఁ గోటపేటలు దేశ్యములని బాలవ్యాకరణము చెప్పఁగా నవి వైకృతములుగాని దేశ్యములు కావని ప్రౌఢవ్యాకరణము ప్రవచించినది. వీనికి, కోట్ట, పింఠా శబ్దములు ప్రకృతులనుచున్నది. కోట-అను దానిని దత్సమముగను వైకృతముగను దేశ్యముగను సాధింపవచ్చును. తెనుఁగువారికిని గోటలుండుటచే దీనిని దేశ్యమనుటయే సమంజసము. పింఠా శబ్దభవము, 'పేఁట' అనుటయు సరికాదు. పేఁట=వీధి; పేట=ముత్యాలకోవ-అని రెండర్థము లగపడుచున్నవి. సూరిగారిపేటలో నర్ధబిందువు లేదు. దీనికి ముత్యాలకోవలో నొకభాగమని యర్థము. సీతారామాచార్యులుగారి పేఁటలో నర్ధబిందు వున్నది గాన నిది, పింఠా శబ్దమునకు వికృతి యనవచ్చును.

సూరిగారు 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' (బాల-సంజ్ఞ-22. సూ) అని లక్షణము చెప్పి, వస్తాడు, తెస్తాడు, మున్నగురీతిని బామర జనవ్యవహారము నుదాహరించిరి. ఇది సరి కాదు. లక్షణవిరుద్ధ మైన భాష యపభ్రంశగ్రామ్య మగునని చింతామణి వచించినది. గ్రాంథిక భాషకే లక్షణముగాని వ్యావహారికభాష కుండదు గదా! అట్టిచో సూరిగారియుదాహృతులు సరిగావనక తప్పదు. 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రామ్యంబు' (బాల-సంజ్ఞ-23. సూ) అనియు సూరిగారు చెప్పిరి. వీరియార్యవ్యవహారపదమునకు మహాకవులకవితావ్యవహారమే యర్థము. దానిలో లక్షణవిరుద్ధపద మగపడినచో దానిం బరిగ్రహింప వలెనని తాత్పర్యము. కఱకంఠుఁడు-అనుదానిని నన్నపార్యుఁడు భారతమున నుపయోగించెను. ఇది మిశ్రబహువ్రీహి. మిశ్రబహువ్రీహి లక్షణవిరుద్ధము. కావుననే వికృతివివేకము - కఱకంఠముఖాహితాః అని వివరించినది. ప్రౌఢవ్యాకరణము దీనిని గరకంఠ శబ్దవికృతిగా నంగీకరించి యిది యగ్రామ్యమని సాధించినది. కాని "కఱకంటుముఖాహితాః" అనుపాఠాంతరమునుబట్టి యిది సరికాదు. ఈసందర్భమును బురస్కరించుకొని బాలవ్యాకరణములోని యీసూత్రోదాహృతుల

నెల్ల నగ్రామ్యములుగా సాధించుటమాత్ర మిచితము కాదు. 'ప్రాణకుట్టక' శబ్దవికృతి ప్రాణగొడ్డ మని ప్రౌఢ చెప్పినది. ఇది సహజ మగు పద్ధతి కాదు. కృత్రిమము. ప్రాణకుట్టకశబ్దము కృత్రిమముగాఁ గల్పింపఁబడినది. జీవగఱ్ఱ – ఇది యాదృచ్ఛికసమాసము. వీణ సితారు మున్నగువానితీగెలక్రింద నూలుదారముల నుంచి యొకచిన్నకఱ్ఱపై నాపోగులను నిల్పుదురు. ఆకఱ్ఱముక్కకు జీవగఱ్ఱ యని పేరు. ఇది సంజ్ఞావాచక శబ్దము. దీనిని సూరిగా రారయకుండుట వింత. – కపిల – శబ్దవికృతి కవిల, శబ్దమనుట నిజము. – అవసరజ్ఞుండై –(భార–ఆది–౭ఆ. ౨౫౨వ.) అనుపద్యమునందు – పవప్రాస నన్నపార్యునకు సమ్మతమని చెప్పుటకై "అవసరజ్ఞుండై వ్యాసుఁ డేతెంచె నంత నత్తపసి, కపిలగడ్డంబును గపిల జడలును, గపిలకన్నులును, దపసియన్నవనల్లనైన దీర్ఘపుఁ దనువును జూచి, యువిద కన్నుంగవ మొగిచి తెలివక యుండె భయమున" అను పాఠము నెవ్వరో ప్రక్షిప్తముచేసిరి. వవ ప్రాసమును ప్రాచీనచ్ఛందః కర్తలుగాని మహాకవులుగాని యంగీకరింపలేదు. ఈవిషయమును ప్రౌఢ వ్యాకరణము స్పష్టము చేసినది. సూరిగా రీవిషయము నాలోచింపక – కపిలకన్నులు – మున్నగువాని నప్పకవిమతముచొప్పున ననింద్యగ్రామ్యములుగా నంగీకరించిరి.

**43.** సూ :– విరళా నేచోపాదికశబ్దా న్ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః.

ఇహ తు ప్రవ్యాహార్యం సజ్జేతితసుప్రసిద్ధమేవ పదమ్.

43. సూ. 1 :– శబ్దజ్ఞాః శబ్దశాస్త్రవేత్తారః విరళాన్ లోకే అప్రసిద్ధానపి పేచోపాదికశబ్దాన్ పేచేతి డుపచిష్పాకే ఇతి ధాతో ర్లిణ్మధ్యమపురుషబహువచనరూపమ్. ఊషేతి వస నివాసే ఇతి ధాతో ర్లిణ్మధ్యమపురుషబహువచనరూపమ్. ఏతదాదికశబ్దాన్ క్వచి త్సంస్కృతభాషాకావ్యేషు ప్రవ్యాహరన్తు ప్రయోజయన్తు. ఇహ త్వాన్ధ్రభాషాయాంతు సజ్జేతితసుప్రసిద్ధమేవ. సజ్జేతితం సుష్ఠు ప్రసిద్ధం ప్రామాణికకవిప్రయోగారూఢఞ్చ యత్పదం తదేవ ప్రవ్యాహార్యమ్. అత్రేదం తాత్పర్యమ్. పేచోపాదికశబ్దానాం లోకే అప్రయుక్తత్వేఽపి వేదేషు తత్ప్రయో

గస్య విద్యమానత్వా న్నాప్రయుక్తతాఽస్తి. అస్త్యప్రయుక్త ఇతి వార్తికే మహాభాష్యకారోక్తేః, లోకవేదాధికరణే లోకవేదయో రేకత్వప్రతిపాదనాచ్చ। శబ్దసాధుత్వమాత్రాభిమానమణ్డితాః పణ్డితాః క్వచిల్లోకేఽపి కావ్యేషు పేచాదిశబ్దాన్ప్రయోజయన్తు న ప్రయోజయన్తు వా, నాస్మాక మాగ్రహః. అసఙ్కేతిత మప్రసిద్ధం పదం న ప్రయోక్తవ్యమ్. వివక్షితార్థప్రతిపాదకం ప్రసిద్ధం చ యదేవ పదం తదేవాత్ర ప్రయోక్తవ్య మిత్యస్మాక మభిమానః. ఏవకారేణాన్యనిషేధో విధిరూప కృత్యప్రత్యయేన ప్రయోగావశ్యంభావిత్వం చ ద్యోత్యతే.

వి :— విరళాన్ — పేచోషాదికశబ్దాన్ — ప్రవ్యాహారన్తు— శబ్దజ్ఞాః—ఇహ—తు—ప్రవ్యాహార్యమ్—సంకేతితసుప్రసిద్ధం — ఏవ — పదమ్ —అని భేదము. సంస్కృతాంధ్రవ్యాకరణములకుఁ గలభేదము నీ సూత్రము స్పష్టము చేయుచున్నది. వ్యాకరణసాధుత్వము గలయేపదమునైనను గ్రంథములలోఁ బ్రయోగింపవచ్చునని సంస్కృతవ్యాకరణ శాస్త్రజ్ఞులమతము. సంకేతితసుప్రసిద్ధ మనఁగా వివక్షితార్థప్రతిపాదనక్షమములు, ప్రసిద్ధములు నైనపదములుమాత్రమే ప్రయోగార్హములగునని చింతామణ్యాద్యాంధ్రవైయాకరణులమతము. దీనిచే సంస్కృతమునందలిమాఱుమూలపదములను దత్సమములుగాఁ దెనుఁగునఁ బ్రయోగింపరాదని స్పష్టమగుచున్నది.

43. సూ. 2 :- నను సంస్కృతభాషాకావ్యేషు క్వచిదప్రసిద్ధపదప్రయోగశ్చే ద్దుష్టం పదం శ్రుతికటు చ్యుతసంస్కృత్యప్రయుక్తపదప్రయోగమపి దోషత్వేన పరిగణయ్య-యథాఽయం దారుణాఽచార స్సర్వదైవ విభావ్యతే। తథా మన్యే దైవతోఽస్య పిశాచో రాక్షసో భవేత్ -ఇత్యుదాహరణే దైవతశబ్దస్య పుంలిఙ్గత్వేన ప్రయోగోఽప్రసిద్ధ ఇత్యుక్తం కావ్యప్రకాశే. అన్యత్రాఽపి తత్ప్రయోగో దోషత్వే నోక్తఏవే తద్విరోధ స్స్యాదితిచే న్సత్యమ్. క్వచిదపి తాదృక్పదస్య ప్రయోగాభావేఽపి - బృన్దారకా దైవతాని - ఇత్యమరసింహకృతినామలిఙ్గానుశాసనం వృథా స్యాత్. అత ఏవ క్లీబత్వం ప్రచురప్రయోగవిషయమితి స్వామ్యాదిభి రుక్తమేవే త్యాలంకారికో దోషః ప్రచురప్రయోగవిషయః, నతు క్వాచిత్కప్రయోగవిషయోఽపీతి న విరోధః

వి :— దుష్టపదము, శ్రుతికటువు, చ్యుతసంస్కారము, అప్రయుక్తము, అసమర్థము మున్నగువానిని సంస్కృతాలంకారికులు దోషములుగఁ బరిగణించిరి. 'దైవత' శబ్దము పుంలింగముగఁ బ్రసిద్ధము కాదు. తథా మన్యే దైవతోఽస్య పిశాచో రాక్షసో భవేత్ — అనుచోట బుంలింగముగ నెట్లు ప్రయోగింపఁబడినదని కావ్యప్రకాశము శంకించుచున్నది. మఱి యెచటను దీనికిఁ బ్రయోగము లేకున్నను, 'బృందారకా దైవతాని పుంసి వా' అనునామలింగానుశాసనము విరోధించుచున్నదనియు, దీనికిఁ గ్లీబత్వము ప్రచురప్రయోగవిషయ మని క్షీరస్వామి వ్యాఖ్యానించెననియుఁ గవిశిరోభూషణము సమర్థించినది. ఈచర్చ సంస్కృతభాషకు సంబంధించినది. సంకేతితసుప్రసిద్ధపదమునే ప్రయోగించు తెనుఁగువారికి దీనితో నిమిత్తము లేదుగదా!

43. సూ. 3 :- దణ్డినాఽపి కావ్యప్రకాశే ప్రసాదవిపర్యయలక్షణ ముక్తమ్. 'వ్యుత్పన్నమితి గౌడీయై ర్నాతిరూఢమ పీష్యతే' ఇతి. అథర్వణాఽఽచార్యేణ తు

సర్వే శబ్దాః ప్రయోక్తవ్యా యది దోషవివర్జితాః
అప్రయుక్తత్వదోషస్తు న విరుద్ధో హరే ర్మతే.

ఇతి హరిసూరిమత ముద్ఘాట్య, 'ప్రమాణం త్వత్ర సద్వచః' ఇత్యాదివచనైస్తత్రతత్ర కవీనాం మహాకవిప్రయోగైకశరణతా మాపాద్య' —

'శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే
అనిష్పన్నే పదే తేన ప్రయోగాఽఽశ్రయణం హితమ్'

ఇత్యుక్తమ్. యత్ర శాస్త్రేణ విశిష్య కార్య ముచ్యతే తత్ర శాస్త్రం బలవద్భవతి. యత్ర శాస్త్రేణ సామాన్యవిధానం, తత్ర ప్రయోగో బలవా నితి తదర్థః.

వి:— అతిరూఢముకాని శబ్దమునుగూడ వ్యుత్పత్తి కలదని గౌడీయు లంగీకరించుచున్నారు—అని దండి కావ్యాదర్శమున నుడివెను. చ్యుతసంస్కారదోషము లేనిచో సంస్కృతశబ్దము లన్నియుఁ బ్రయోగింపఁదగినవే. కవిప్రయుక్తము కానిశబ్దమును బ్రయోగింపరాదు, అను

నాలంకారికదోషము హరిపండితునిమతమున విరుద్ధము కాదు – అని యథర్వణాచార్యు లనిరి. అప్రయుక్త మనునాలంకారికదోషమును సంస్కృతవైయాకరణులు నిరసించిరి. సంస్కృతవ్యాకరణము సమ్మతించి నచో నన్నిశబ్దములు ప్రయోగార్హములే యని వారియభిప్రాయము. మఱియు సంస్కృతవ్యాకరణము, కవిప్రయోగము, వ్యాకరణము అను వానిలో వ్యాకరణము బలమైనది. దానిచే నిష్పన్నము కానిశబ్దమువిషయమునఁ గవిప్రయోగము ననుసరించి సాధుత్వము నంగీకరింపనగును– అనియు నదియే వచించినది. ఈనియమము సంస్కృతభాషకు సంబంధించినది. వికృతిశబ్దవిషయమున మహాకవిప్రయోగమున కున్నప్రాముఖ్యము వ్యాకరణములకు లేదు. 'ప్రయోగశరణా వైయాకరణాః, ప్రయోగమూలం వ్యాకరణమ్' అనునవి తెలుఁగువారికి ధ్యేయములు.

43 సూ. 4 : 'వర్ణలోపాऽగమా నైకే సర్వస్మిం స్తద్భవే పదే। వచనే పురుషే చార్థే లోపో వర్ణాగమో మతః'-ఇత్యాది. 'వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు' ఇత్యాదికం చ శాస్త్రం సామాన్యమ్.

వి :– కవిశిరోభూషణము "సర్వే శబ్దాః, శాస్త్రప్రయోగ వచసోః" అనువానికి వికృతిభాషాపరముఁగ నర్థము చేసినది. అది సరి కాదు. వానియర్థము 43 సూ. 3. లో విశదపఱుపఁబడినది.

43. సూ. 5 :– ఏవం స్థితే మహాకవిప్రయోగప్రసిద్ధేః ప్రయోగనిదానత్వాకథనేన మహాకవిప్రయోగరూఢంచే ద్గ్రామ్యమపి ప్రయోగార్హ మిత్యాచార్యతాత్పర్య మితి బాలసరస్వ త్యోక్తమ్. ఇదమేవ తాత్పర్య మభివర్ణ్యాప్పకవినాऽపి "వినెన్, కనెన్, చనెన్" ఇత్యాది శబ్దానాం గ్రామ్యత్వేऽపి మహాకవిప్రయోగరూఢత్వా త్సాధుత్వ మిత్యుక్తమ్. తన్న; చనె నిత్యాదిశబ్దానాం శాస్త్రరూఢత్వేన 'అద్యాః క్రియాసు' ఇతిసూత్రే ఉక్తత్వాత్. 'వందనఁ గనెనఁట మఱచితిన్' ఇత్యాది ప్రయోగా దాచార్యస్యా ప్యేతాదృశప్రయోగోऽపేక్షిత ఏవ. తత్ర 'నీవెత్తి బంగారు గాను' ఇత్యాదీనాం గ్రామ్యత్వేऽపి ప్రయోగార్హతేతి సరస్వత్యాశయో వర్ణనీయః.

వి:— 'మహాకవిప్రయోగప్రసిద్ధి యున్నపుడు దానిం బ్రయోగింప వచ్చు ననుటచే మహాకవిప్రయుక్త మైనగ్రామ్యమును బ్రయోగార్హ మగునని యాచార్యతాత్పర్యము' అని బాలసరస్వతి వచించెను. దీనిచొప్పున నే యప్పకవి—వినెన్, కనెన్, చనెన్—మున్నగునవి కవిప్రయోగరూఢము లగుటవలన సాధువు లగుచున్న వని యనెను. అట్లనుట సరికాదు. చనెన్ మున్నగునవి సాధువులని 'అద్యఃక్రియాసు' అనుసూత్రమునఁ జెప్పఁబడినది గదా! నందనుఁ గనెనఁట మఱచితి—అని ప్రయోగించుటచే నిట్టిప్రయోగము లాచార్యులవారికి సమ్మతములని తెలియ నగును. 'కనియెను' అనురీతిప్రయోగములే యాచార్యసమ్మతములు. పై ప్రయోగము సన్నపార్యునిది కాదు. 'నీ వెట్టి బంగారుగాను, మున్నగునవి గ్రామ్యములైనను బ్రయోగార్హము'లని సరస్వత్యాశయమును సరిపెట్ట నగును. నిజమునకు, చనెన్—మున్నగునవి చింతామణిచే సాధ్యములు కావు. సన్నపార్యునికిఁ దరువాతికవులు వానిం బ్రయోగించిరి. వికృతివివేకము వానిని సాధించినది.

43 సూ. 6 :— అనేనైవ 'అపాంగమాలిక ల్మెఱుఁగులు గ్రక్కి' ఇత్యాదీనామపి ప్రయోగాణాం సాధుత్వమ్. ఏతద్గ్రామ్యత్వం తు 'నిష్ఠ్యూతోద్గీర్ణవాన్తాదిగౌణవృత్తివ్యపాశ్రయమ్। అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే' ఇతి దణ్డినా ప్రతిపాదితమ్. గుణవృత్త్యైవైషాం సాధుత్వ మితి నృసింహః.

వి:— 'మెఱుఁగులు క్రక్కి' అనుదానిలోని - క్రక్కి - అనునది 'నిష్ఠ్యూతోద్గీర్ణవాంతాది' అను దండివచనమువలన గ్రామ్య మగుచున్నదని చెప్పఁబడినది. తెనుఁగున నివి గ్రామ్యములు కానేరవు.

అప్పకవిపుస్తకే స్థిత మాన్ధ్రలిప్యుద్ధారకం శ్లోకత్రయం తదత్ర విలిఖ్య వ్యాఖ్యాయతే-

44. సూ :— బాలేన్దుపరిధిశృఙ్గాఽవర్తకుశగ్రన్థిదాత్రపరశుసమాః
ఆద్యా ఇభకరతుల్యా స్తద్దీర్ఘా శూలసన్నిభా వన్యే
దరశార్ఙ్గపిప్పలదళాఙ్కుశపన్నగసన్నిభాః క్రమా త్పరుషాః

స్తమ్భవిలేఖాఽధిక్యై స్తఏవ వర్గద్వితీయవర్ణాద్యాః
కీరనౌహ స్తిమ స్తకబ క్తితులాసనవితర్దిసీరసమాః
అ న్తస్థా శ్చోష్మాణో ద న్త్యచజౌ గురురలౌ చ బిన్దుయుతౌ॥

44. సూ. 1 :- ఆద్యాః అఇఉఋౡఎఒవర్ణాః, తద్దీర్ఘా స్తేషాం దీర్ఘాః ఆకారాదయో గజహ స్తతుల్యాః. అన్త్యౌ ఐఔవర్ణౌ శూలసన్నిభౌ శూలసదృశౌ- 'ఏఓఙ్, ఐఔచ్' ఇతి మాహేశ్వరసూత్రయో రేదోతో రైదౌతోశ్చ సమ్బన్ధస్య క్లృప్తత్వాత్. తత్ర ఆద్యానాం మధ్యే ఏదోతో ర్గ్రహణమ్. ఆద్యశబ్దే నైదౌతౌ గృహ్యేతే ఇతి వివేకః. తద్దీర్ఘా ఇతి సామాన్యప్రయోగాత్. ౡవర్ణస్యాపి వ్యాప్తః వినా దీర్ఘో లిఖితః. అత్రేద మవధేయమ్. ౡవర్ణస్య సాక్షా న్న దీర్ఘః. ఋవర్ణదీర్ఘేణ దీర్ఘవత్త్వమిత్యుక్తమ్. శుద్ధాన్ధ్రే తు విశిష్య తస్య దీర్ఘకల్పనే వా ప్రయోజన మదృష్టమ్. "సాలూలు" ఇత్యాదౌ ఊకారవిశిష్టలవర్ణేనైవ లిపే శ్చరితార్థత్వా దితి స్తమ్భవిలేఖాఽధిక్యై స్తంమ్భ స్తంభాఽకారరేఖా స్తద్విలేఖసాధిక్యై స్తఏవ ప్రథమవర్ణా ద్వితీయతృతీయచతుర్థపఞ్చమవర్ణా భవన్తి. శేషం స్పష్టమ్.

వి:- నన్నపార్యుఁడు తననాఁటి కున్నయాంధ్రకర్ణాటలిపిని సంస్కరించి యిట్లుపదేశించిన ట్లగపడుచున్నది. అఇఉఋౡఎఒ - అను వర్ణములు క్రమముగా బాలచంద్రునితోడను, బరివేషముతోడను, వృషభాదులకొమ్ముతోడను, నీటిసుడితోడను, దర్భముడితోడను, గొడవలితోడను, గండ్రగొడ్డలితోడను సమానాకారములు గల వగుచున్నవని 'బాలేన్దుపరిధిశృంగాఽవ ర్తకుశగ్రన్థిదాత్ర పరశుసమా ఆద్యాః' అనుదాని కర్థము. వీనిస్వరూపముల ననుబంధమున స్వరములలోఁ జూడనగును. పైవర్ణములమీఁద గజహస్తాకారము గల గుర్తును వ్రాసిన వానివానిదీర్ఘము లేర్పడునని 'ఇభకరతుల్యా స్తద్దీర్ఘా శ్శూలసన్నిభా వన్త్యౌ' అనుదాని కర్థము. వానిస్వరూప మనుబంధమునఁ జూచునది. 'ఏ,ఓ,ఐ,ఔ' అనువానిగుర్తులును ననుబంధమునఁ గలవు. కచటతప-అనునవి వరుసగా శంఖముతోడను, ఎక్కిడినవింటితోడను, రావియాకులోనిసగముతోడను, గజాంకుశముతోడను, పడగ విప్పిన

పాముతోడను, దుల్యము లగునాకారములు గలవగునని 'దరశార్ఙ్గపిప్పల దళాంకుశపన్నగసన్నిభాః క్రమా త్పరుషాః' అనుదాని కర్థము. మఱియు స్తంభాఽకారరేఖలవిలేఖనాధిక్యముచే నా-కచటతప-లయాకృతులు తత్తద్ద్వితీయవర్ణాదులయాకృతులు గలవై యుండునని 'స్తంభవిలేఖాఽధిక్యే స్తఏవ వర్గద్వితీయవర్ణాద్యాః' అనుదాని కర్థము. 'యరలవ' అనునవి వరుసగాఁ జిలుకతోడను, ఓడతోడను, గజశిరస్సుతోడను, మత్స్యపుఁజిప్పతోడను, సమానాకారముగలవనియు, శషసహ అనునవి వరుసగాఁ ద్రాసుతోడను, వేత్రాసనముతోడను, వేదికతోడను, నాగటితోడను, సమానాకారములు గలవనియు 'కీరనౌహ స్తిమ స్తకశు క్తితులాసనవితర్ది సీరసమాః। అ న్తస్థాశ్చోష్మాణః' అనుదాని కర్థము. చజఅళ-అనువర్ణములు వరుసగా చజరల, అనువానికిఁ బైని బిందువు చేర్చిన నేర్పడునని 'ద న్త్యచజౌ గురురలౌ చ బిన్దుయుతౌ' అనుదాని కర్థము. వానియాకృతులు క్రమముగా ననుబంధమునఁ జూచునది. ఈవిషయమంతయు వ్యా. సం. స. లో ౨౯ కల్పతరువు ననుసరించి వ్రాయఁబడినది. ఈలిపి వ్యవహారమునం దెన్నఁడును లేదని శాసనలిపి నాధారముగాఁ జేసికొని వివరింపఁబడినది.

44. సూ. 2 :– "అత్ర ద్వితీయాచార్యేణో క్తమ్.—

పఞ్చవర్గాదయో వర్ణా శ్శఙ్ఖశార్ఙ్గాదిసన్నిభాః
తిర్యగ్రేఖాయుజ శ్చోర్ధ్వం దణ్డరేఖాన్వితా అధః
త ఏవ చ ద్వితీయా స్స్యు స్తృతీయా స్తే చతుర్థకాః
రేఖాద్వయాఽధో దణ్డేన యుక్తా స్స్యు రనునాసికాః
మిశ్రద్దణ్డద్వయోపేతాః ప్రథమా లిపయః స్మృతాః" ఇతి.

తిర్యగ్రేఖాయుజ శ్చోర్ధ్వ మిత్యస్య పూర్వేణాన్వయః. అధోదండరేఖాన్వితా స్తఏవ ప్రథమవర్ణా ద్వితీయవర్ణా స్స్యుః ప్రథమాఏ వోర్ధ్వరేఖాద్వయాన్వితా స్సంతః తృతీయా శ్చతుర్థా భవ న్తి. మిశ్రద్దణ్డరేఖాయుగాన్వితాః ప్రథమాః పఞ్చమవర్ణా భవ న్తీ త్యర్థః.

'పూర్ణేన్దుసదృశః పూర్ణ స్త్వర్థ స్త్వర్ధేన్దుసన్నిభః'

ఇత్యథర్వణోక్తేః. పూర్ణార్ధబిన్ద్వోః పూర్ణార్ధచన్ద్రతుల్యత్వేన లేఖనమ్. కపయోరాగ క్ష ఇతి చ తస్య పార్థక్యేన కథనమ్. విశిష్యాకథనా త్పూర్వస్మృబిన్దుయుగళరూపేణైవ విసర్గస్య లేఖనం జ్ఞేయమ్.

వి:- అథర్వణాచార్యులుగారివివరణము ననుసరించి 'బాలేన్దు' మున్నగుకారిక లప్పకవీయమున నుండి బాలసరస్వతీయమును లేకున్నను గవిశిరోభూషణము వ్యాఖ్యానించినది. కవిశిరోభూషణమే యథర్వణ కారికలను వెలుఁగులోనికిఁ దెచ్చినది. ఇందున్నవానికి భిన్నముగా నున్న యథర్వణకారికలు ప్రక్షిప్తములని యూహింపవలయును. కారికావళి మున్నగువానిలో నున్న వివిధవిభిన్నకారికలు పాఠభేదములు అవి యథర్వణసమ్మతములు కావు. నన్నపార్యప్రోక్త మగులిపి నథర్వణా చార్యులుగారు తననాఁటిలిపితో సరిచేసి వివరించియున్నారు. అయిదు వర్గముల మొదటివర్ణములు నన్నపార్యోపదిష్ట మైనరీతినే శంఖశార్ఙ్గాద సమానాకారముగల వగుచు మీఁద నొకతిర్యగ్రేఖతోఁ గూడి యుండు నని 'పంచవర్గాదయో వర్ణా శ్శంఖశార్ఙ్గాదిసన్నిభా స్తిర్యగ్రేఖాయుజశ్చోర్ధ్వమ్' అనుదానికర్థము. అవియే క్రింద నొకదండాకారరేఖతోఁ గూడి నవై వర్గద్వితీయవర్ణము లగుచున్నవని 'తఏవచ ద్వితీయా స్స్యు ర్దండ రేఖాఽన్వితా అథః' అనుదానికర్థము. ఆప్రథమవర్ణములే మీఁదను రెండుతిర్యగ్రేఖలు గలవగుచు వర్గతృతీయవర్ణము లగునని 'ఊర్ధ్వరేఖా ద్వికాఽన్వితా స్తఏవ చ తృతీయా స్స్యుః' అనుదాని కర్థము. అతృతీయలిపులు క్రింద నొకదండరేఖతోఁ గూడినచో వర్గచతుర్థలిపు లగు చున్నవని 'తే చతుర్థకా రేఖాద్వయాధోదండేన' అనుదానికర్థము. ప్రథమలిపులు మిళద్దండద్వయోపేతములై వర్గపంచమలిపు లగుచున్నవని 'అనునాసికా మిళద్దండద్వయోపేతాః ప్రథమాలిపయః స్మృతాః" అను దానికర్థము. నిందుసున్న పూర్ణచంద్రునివంటి యాకారము కలదనియు నర్ధబిందువు అర్ధచంద్రాకారము గలదనియు 'పూర్ణేందుసదృశః పూర్ణ

_స్వర్థ _స్వర్ధేనుసన్నిభః' అనుదానికర్థము. వీనియాకృతుల ననుబంధ మునఁ జూడనగును.

44. సూ. 3 :- అత్రాప్యకవినోక్తాని పద్యాని కానిచిత్ స్పష్టప్రతిప_త్తయే విలిఖ్య_న్తే.

గీ॥ ఎన్నిహల్లులు జడ్డలై యున్న నేమి
హల్లులనుమీఁద నుండెడిహల్లు లెల్ల
గడపటను వ్రాయుద్విత్వ మొక్క_టియె తాల్చు
వానితలకట్టు మొదలగువాని నెల్ల॥

గీ॥ మొదట రేఫాక్షరంబు నాపిదప దాని
జడ్డయును గూర్చి యొకటిగాఁ జదువుకొనుచు
ముందుజడ్డయు వెస రేఫమునకు బదులు
గిలుక విభజించి లిఖియింతు రిలఁ గుమతులు॥

సీ॥ విదియచందురుమాడ్కి_ వెలయు నత్వము దాని
కుడివంక శృంగంబుకొన గుణింపఁ
బ్రభవించుఁ దక్కి_నప్రాణంబు లెల్లను
నడిమికి గుడిపట్టి విడువ నిత్తు
కుడి నావుకొమ్మ్కై వడి వ్రాయ నుత్వంబు
క్రిందను నుడి నిల్ప ఋత్వ మయ్యె
వలపల మీఁదికి మెలిగొన్న ఇస్వర
మెడమ నెత్వం బొప్పుఁ గొడవలిక్రియ

గీ॥ యామ్యమున గంద్రగొడ్డలియ ట్లొనర్పఁ
గాలు నొత్వ మన్నింటిదీర్ఘములు కుడిని
గరికరాకృతి నిలుపంగ వరుసఁ దనరు
నమరు నైత్వౌత్వములు త్రిశూలములకరణి॥

---

నాకడనున్న కవిశిరోభూషణము వ్రాఁతప్రతియందు ల, అయు మకారః, చి, అయ మికారః, అనురీతి నర్థసందర్భము కుదురనికొంత గ్రంథ మగపడుచున్నది. అది ప్రక్షి_ప్త మనుశంకచే దానిని వదలితిని.

సీ॥ శంఖశార్ఙ్గద్విపాశనదశాంకుశపన్న
గాకృతులను మీఁద నడ్డరేఖ
వలపల నొక్కటి నిలుపంగఁ బరుషంబు
లై దును వరుసఁ జెప్పారుచుండుఁ
గ్రిందఁ గంబముపోల్కి గీటొక్కటిడిన నా
ద్యములు రెండవలిపులై పొసంగుఁ
బై నున్నగీటు లిబ్బడి సేయఁ బ్రథమాక్ష
రంబులు పరశవర్ణంబు లగును

గీ॥ గంబ మొక్కటి రేఖాయుగంబు క్రింద
వ్రాసినఁ దృతీయములు చతుర్థంబు లగును
నిలువుగీటులు రెండును గలిసి తమ్ముఁ
గదియఁ దొల్లిటి వను నాసికంబు లగును.

గీ॥ శుకతరిమతంగభవకుంభకు క్తిసన్ని
భంబు లంతస్థములు తుద భద్రపీఠ
వేదికాహలనిభములు శాదిలిపులు
దంత్యచజగురురలలకుఁ దనరు బొట్లు॥

వి:— ఈయప్పకవిపద్యము లిప్పటిహల్లుల గుణితక్రమమును వివరించుచున్నవి. చింతామణినాఁటి శాసనలిపికిని దీనికిని సంబంధ మగపడదు. వికృతివివేకో క్తవిషయము లిం దొకటియు లేవు. కావున నీతని కవి లభింపలేదని తలంపవలెను. చింతామణివికృతివివేకములలిప్యుద్ధారక విషయములు మీఁద వివరింపఁబడినవిగదా !

గ ద్య ము

ఇతి శ్రీ సీతారామచరణారవిందమిళిందాంతఃకరణేన శ్రీమతోప్పలూరిమాధవ
యజ్వచంద్రసముజ్జ్వలత్కృపోక్షిత కటాక్షాసాదితసాధుపాండిత్యా
భరణేన ప్రభంజన వంశాబ్ధిరాకాశశాంకేన నిరంతరారాధిత
విచక్షణశశాంకేన అభినవ నన్నయభట్టాఽఽచార్యేణ
హోబలపత్యాచార్యేణ విరచితాయా మాంధ్ర
శబ్దచింతామణివ్యాఖ్యాయాం కవిశిరోభూష
ణాఖ్యాయాం ప్రథమ స్సంజ్ఞాపరిచ్ఛేదః.

వి:- 'కవిశిరోభూషణ'మని గ్రంథము పేరు. ఇది చింతామణికి వ్యాఖ్యానము. దీనిని రచించినయాతఁ డహోబలపతి. ఇతని కభినవ నన్నయభట్టారుకుఁడని ప్రసిద్ధి కలదు. వీరిగృహనామము 'ప్రభంజనము' వారు. ఇతఁడు పోలూరిమాధవయజ్వశిష్యుఁడు—అనునీవిషయములు పై గద్యమునుబట్టి విశదమగుచున్నవి. 'ప్రభంజనము' అనుగృహనామము నేఁడెచ్చటను నగపడకుండుటచే నిది—గాలి—అనుదానికి సంస్కృతీకరణమనియు, దీని సాహచర్యముచేత—అహోబలపతి—అను పేరుకూడ నిట్టిదే యనియు, దాన వీరియింటిపేరు-'గాలివా'రనియు, నీతని పేరు నరసయ్య యనియు విమర్శకు లూహించుచున్నారు. ఇప్పుడును గాలివారుండుటచేతను, గవిశిరోభూషణకర్త తమవంశమునకుఁ జెందినవాఁడే యని యావంశీయులలోనివారు చెప్పుచుండుటచేతను బైయూహ సమంజసమే యని నిశ్చయింపకతప్పదు. సాధారణముగ నిట్టిగద్యములలో జననీజనకులనామములను గదియించుట కాన నగుచున్నది. ఇందు మాత్ర మది లేదు. ఇంతేకాక పీఠికాశ్లోకములలోఁగూడ నీవిషయమే కాని తలిదండ్రులపేర్లు లేవు.



ఓమ్

విఘ్నేశ్వరాయ నమః

# కవిశిరోభూషణ వివృతి

## సంధిపరిచ్ఛేదము

శ్లో॥ వన్దే వన్దారుసన్దోహమన్దారం రఘునన్దనమ్ ।
సదా భజే సుదేహాం తాం విదేహాధిపనన్దనామ్ ॥

వి:- ప్రణమిల్లుభక్తసందోహమునకుఁ గల్పవృక్షసదృశుఁడైన రఘునందనునకు నమస్కరించుచున్నాఁడను. సౌందర్యరాశి యగు సీతాదేవిని సదా భజింతును—అని గ్రంథకర్త తన యిష్టదైవతములను సంధిపరిచ్ఛేదారంభమునఁ బ్రశంసించినాఁడు.

**45. సూ :- సన్ధిర్నాచోఽచ్యనుతః.**

45, సూ. 1 :- ఉకారాద్వ్యతిరిక్తస్యాచోఽచి పరే సన్ధిర్న భవతి. మేనయత్త-సిరియన్న-వన్నెయొల్లె - గోయీవి-మైయెఱువు-గ్లా యుదయించెన్; ఇంపగు, సొంపగు, రాముఁ డతఁడు, సోముఁ డితఁడు—ఇత్యాద్యుదాహరణమ్. యద్యప్యనుత ఇత్యనేన 'రాము నభిరాముఁ దలఁచెద' ఇత్యాదా వుకారస్య సన్ధిః ప్రాప్తః. తథాపి వివక్షితద్వితీయార్థప్రతీత్యభావప్రసఙ్గస్స్యా దితి స నివార్యః. 'ప్రాంశుపయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారుఁన్' ఇత్యాది ప్రయోగాత్.

వి:- సంధిః, న, అచః, అచి, అనుతః—అని ఛేదము. హ్రస్వోకారవ్యతిరిక్త మగు నచ్చున కచ్చు పరమగుచుండఁగ సంధి రాదనిసూత్రార్థము. సంధి లేనిచోట రెండుస్వరములకును నడుమ లఘుయకారము వచ్చును 'మేనయత్త' మున్నగునవి యుదాహరణములు. హ్రస్వోకారమునకు సంధి నిత్యమని ఫలితార్థము. 'ఇంపగు' మున్నగునవి

యుదాహృతులు. 'రామున్+అభిరామున్' అనునపుడు సంధి ప్రాప్తించుచున్నదనియు నచట సంధి జరిగినచో 'రాముభిరామున్' అని యగుననియు 'రాము' అనునపుడు వివక్షితమైనద్వితీయావిభక్త్యర్థ మచట విశదము కాదు కాన సంధి వారింపవలెననియుఁ గవిశిరోభూషణ మనుచున్నది. ఇది సరికాదు. 'రాము నభిరామున్' అనుచోట 'అనుతః' (45) అనుదానిచేత నిత్యసంధి ప్రాప్తింపదు. 'అనాదిషు విభక్తిషూతో వా' (47) అనువిశేషసూత్రముచే వికల్పసంధి యటఁ బ్రాప్తింపవలయును. కాని యదియు రాదు. విభక్తిసంజ్ఞ 'విభక్తిశ్చ' అనుపాణినీయసూత్రముచే సంస్కృతమున స్వాదులకుఁ గల్గి యది స్వాదుల కాదేశములైన డుమ్వాదులకుఁ గ్రియాప్రత్యయములగు 'డురువు, రుసుము' అనువానికిని గలుగుచున్నది. 'అనాదిషు' అనుసూత్రమునకు అనాదిసువ్విభక్తిప్రత్యయములోని యుకారమున కచ్చు పర మగునపుడు సంధి వికల్పముగాఁ గల్గును—అని యర్థము. 'రామున్' అను దానియుకారము విభక్తిస్థము కాదు. కాన నిట సంధికిఁ బ్రాప్తియే లేదు. దానిని వారించుకొనుటకై యత్నము చేయుట నిరర్థకము. కాన దానికొఱకుఁ జేయునీక్రిందిప్రసంగ మంతయు వినోదప్రాయము.

ఈ కవిశిరోభూషణ పర్యవసానమును సూరిగారు 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు" (బాల. సంధి. 1. సూ) అని సంక్షేపముగా సూత్రించిరి.

45. సూ. 2 :- న చానుత ఇతి ద్రుతపూర్వోకారవ్యతిరిక్తవిషయ ఇతి వాచ్యమ్. "అనాదిషు విభక్తిషూతో వా" - "చోర్వా స్యాత్" – ఇతి ప్రాప్తే విభాషారంభేణ ద్రుతపూర్వప్రాణసన్ధే రిష్టత్వేన జ్ఞాపనాత్. నచ సా అప్రాప్తైవేతి వాచ్యమ్. "న స్యాత్తద్ధర్మ్మతః" ఇతి తత్సన్ధ్యనుజ్ఞావిజ్ఞానాత్. నహి ప్రాప్తిమంతరా నిషేధః క్రియతే. నను 'లుగ్వా ద్రుతప్రకృతికాత్' ఇతి సూత్రేణ పరశే స్థిరేచ పరతః నస్య లుక్చ, తదుత్తరసూత్రేణ సంశ్లేషశ్చ విహిత ఇతి ప్రాణే పరే నస్య లుక్సంశ్లేషయోః ప్రాప్తి రేవ నాఽస్తి. "లుక్సంశ్లేషౌ నాచి" ఇతి తత్ర నిషేధః

కృత ఇతి. తన్న్యాయే నాత్రాపి నిషేధః కృత ఇతిచేత్సత్యమ్. తత్సూత్రం నిర్గళితార్థానువాదకమేవే త్యవధేహి. ఏవం బహువచనే – 'రాముల నభిరాముఁ న్' ఇత్యాదౌ "వాఽతః"–ఇత్యనేన విరోధాభావా త్సన్ధిః ప్రాప్తః. సోఽ ప్యేవమేవ నివార్యః. 'పరమండలంబుల ధరణిపతుల నడిమి' 'అల్కతోఁ జూడిచిన నుత్తమద్విజులం పూజ్యులు' - ఇత్యాదౌ తదుక్తేః. ద్వితీయాచార్యేణ—

"సన్ధిస్తు ద్రుతపూర్వస్య ప్రాయశో న భవే దతః"

ఇత్యుక్తమ్. ద్రుతా త్పూర్వస్యాకారస్య సన్ధిః ప్రాయశో నభవే దితి తస్యార్థః. ప్రాయోగ్రహణస్యతు 'ఇంకెప్పుడు - ఇంక నెప్పుడు' –ఇత్యాదిఫల మనుసన్ధేయమ్. 'పడగ నున్నహాను మ భయవిహ్వలుఁడు గాఁడు; అరదమునకు నూతుఁ దచ్యుతుండు'- ఇత్యాదౌ సన్ధ్యభావో న దోషాయ భవతి.

"న స్యా ద్వాక్యవిరామే తు సన్ధ్యభావోఽపి దోషకృత్ ||"

ఇత్యథర్వణోక్తేః. ఆద్యభాషాకావ్యేషు తు పూర్వోత్తరార్థయో స్సన్ధ్యభావ స్యా దోషత్వేఽపి, అర్థే సన్ధ్యభావో దోషాయ భవత్యేవేతి జ్ఞేయమ్.

వి:- 'తత్సూత్రం నిర్గళితార్థానువాదక మేవే త్యవధేహి' అనునంతవఱకు నున్నగ్రంథము వినోదప్రాయము. తెనుఁగున నట్టివిచారణము చింతామణ్యభిప్రేతము కాదు. చింతామణి చెప్పనిదానిని వికృతివివేకము వివరించుచునే యున్నది. ఆవిషయము నంగీకరించినచో నిట్టి గ్రంథవిస్తరమున కవకాశ ముండదు. కావుననే కవిశిరోభూషణము వికృతివివేకమును వేఱుగ్రంథముగాఁ జెప్పుచున్నది.

పాఠకుల కది కొంత వినోదకరముగ నుండునని దానింగూడ నిట వివరించుచున్నాఁడ. 'అనుతః' అనునది 'అచః' అనుషష్ఠ్యేకవచనమునకు విశేషణము. కాఁగా హ్రస్వోకారభిన్న మగునచ్చునకు సంధి రాదు- అని దానియర్థము. హ్రస్వోకారము ద్రుతపూర్వము కానపుడే సంధి కల్గునని యర్థము చెప్పరాదా యని శంకించియు, సూత్రకర్త 'అనాదిషు విభక్తి షూతో వా; చో ర్వా స్యాత్' అనుసూత్రములచే ద్రుతపూర్వప్రాణసంధి తన కిష్టమని వ్యక్తముచేసెనుగాన నట్టి

యర్థమును జెప్పరాదని కవిశిరోభూషణము చెప్పినది, 'రాముఁన్+అభిరాముఁన్' అనునపుడు 'సంధి ర్నా చోఽచ్యుతః' అనుదానిచే నిత్యసంధి ప్రాప్తింపఁగా మరల 'ఉ' కారమునకు 'అనాదిషు విభక్తి ష్వాతో వా' 'చోర్వా స్యాత్' అనువానిచే వికల్పించినాఁడు గదా! దీనినే ప్రాప్తవిభాష యందురు. ఈవిభాష నప్రాప్తవిభాషయే యనరాదా యని శంకించి 'న స్యా త్తద్ధర్మోతః' అను సూత్రముచే ద్రుతపూర్వ ప్రాణసంధిని నిషేధించుటవలనఁ బ్రాప్తవిభాష యని చెప్పరాదనియుఁ, బ్రాప్తి లేనినిషేధ ముండదనియు వచించెను.

ద్రుతప్రకృతికద్రుతమునకు సరళస్థిరవర్ణములు పర మగునపుడు లోపసంశ్లేషములను సూత్రకర్త "లుగ్వా ద్రుతప్రకృతికాత్పరత స్సరళే స్థిరేచ నస్య స్యాత్" "అలుకి చ సంశ్లేష స్స్యాత్" అనుసూత్రములచే విధించెను. కాన స్వరము పరమైనపుడు ద్రుతమునకు లోపసంశ్లేషములు ప్రాప్తింపవు. అయినను 'లుక్సంశ్లేషౌ నాఽచి' అనుసూత్రముచే నిషేధించినాఁడు. అట్లే 'నస్యా త్తద్ధర్మోతః' అనునపుడు నిషేధించెనని యూహింపరాదా యని శంకించియు 'తత్సూత్రం సిద్ధసిద్ధార్థానువాదక మేవే త్యవధేహి' యనెను. సిద్ధసిద్ధార్థమనఁగా నొకసూత్రముచే సిద్ధించినయర్థము నే యీసూత్ర మనువదించుచున్న దేకాని క్రొత్తవిషయమును జెప్ప లేదని చెప్పి యీవాదమును గవిశిరోభూషణ ముపసంహరించినది. ఇట్టిరీతి శంకాసమాధానములు సంస్కృతవ్యాకరణశాస్త్రమునఁ గలవు. వానిం గవిశిరోభూషణ మిటఁ బొందుపఱిచినది.

'ధరణిపతులన్+అధిప' - 'పొడిచినన్+ఉత్తమద్విజులు' మున్నగుచోట్ల 'వాఽతః అనుచింతామణిచోప్పునఁ బ్రాప్తించుచున్న వికల్పసంధిని వికృతివివేకము ప్రాయికముగ నగునని వివరించినది. ప్రాయికశబ్దమునకుఁ బెక్కుస్థలములలోఁ సంధి కల్గుటయు నలంతిస్థలములలోఁ గల్గకుండుటయు నర్థము. 'కానఁ బ్రాయికార్థమును 'వా' అనుదానికిఁ జెప్పరాదు. 'ఇంకెప్పుడు' మున్నగునవి యుదాహృతులు.

'పడగ నున్నహనుమ' అనుచోట 'కాఁడు + అరదము నకు' అనుచోట రావలసిన నిత్యసంధియు రాలేదు. వాక్యాంత పాదాంత స్థలమున సంధి చేయకున్నను దోషము లేదని వికృతివివేకము "స స్యా ద్వాక్యవిరామే తు సన్ధ్యభావోఽపి దోషకృత్" అని చెప్పినది. ఒకటి రెండు పాదములకు మూఁడు నాల్గు పాదములకు మధ్యమున సంధి నిత్యమనియుఁ బూర్వోత్తరార్ధములకు మధ్యమున సంధి మానినను దోషము కాదనియు దానియర్థము.

వాక్యావసానసంధినిగుఱించి "వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్యు లండ్రు" (బాల. సంధి. ౬౨. సూ) అని సూరి గారు చెప్పిరి. వృత్తములు జాతులు నని పద్యములు తెనుఁగున రెండు విధములు గదా! వృత్తము లగుచంపకోత్పలాదులలోఁ బూర్వార్ధోత్త రార్ధములు రెండు వాక్యములు. కాన నట్టిపూర్వార్ధోత్తరార్ధములకు మధ్య సంధి మానిన మానవచ్చును; జేసినం జేయనగును. ఒకటి రెండు పాదముల మధ్యను మూఁడునాల్గుపాదములమధ్యను సంధి మానరాదు. జాతు లగు సీసము గీతము మున్నగువానిలో నేపాదమున కాపాదమే వాక్యము. కావున నచట నయితము సంధి వైచ్ఛికమే. గద్యములలో నన్నపార్యుఁడు సంధిచేసిన ట్లగపడుచున్నది. కాని యచట సంధి మాను టయే శ్రుతిహితమని పెక్కు అట్టిసంధిని జేయలేదు. యోగ్యత, ఆ కాంక్ష, ఆసత్తియుఁ గల్గినపదసముదాయమే వాక్యమని "వాక్యం స్యా ద్యోగ్యతాఽఽకాంక్షాఽఽసత్తియుక్తః పదోచ్చయః' అని యాలం కారికులు వచించిరి. ఈ విషయమునే ప్రౌఢవ్యాకరణము చెప్పినది. (ప్రౌఢ. వాక్య. 1. సూ). పద్యపాదమధ్యములో నిట్టివాక్యము సమా ప్తమైనను సంధి మానరాదు. పద్యపూర్వార్ధోత్తరార్ధములమధ్యములో నిట్టివాక్యమును బూర్తి కావలయును. అపుడే సంధి మానవచ్చును. లేకున్న మానరాదని నిర్ణయము.

**46. సూ:- వాఽతః.**

46. సూ. 1 :- అకారస్య సంధి ర్వా స్యాత్. అప్రాప్తే విభాషేయమ్. 'లెస్సగు – లెస్సయగు, మేనత్త - మేనయత్త, ఎల్లప్పుడు, ఎల్లయప్పుడు' ఇత్యాది. - 'పొన్నాకు, చందమామల్లుఁడు, ఆవంత, తగినట్లు, వంటలక్క - ఇత్యాదీనాం సంధేరేవ సుందరత్వా ద్వ్యవస్థితవిభాషయా సంధే ర్నిత్యత్వం జ్ఞేయమ్. అతఏ వాథర్వణేనోక్తమ్ "భవన్తి కేచి చ్ఛబ్దాస్తు సాఙ్గత్యేనైవ సాధవః" - ఇతి. ఏతద్వచన సామర్థ్యాదేవ 'చింతాకంత నెపంబు' ఇత్యాదేః 'నిలుచున్నవాఁడు' ఇత్యాదేశ్చ సాధుత్వమ్. అన్యథా - 'షష్ఠ్యా ఉతోఽచి నుమ్సేచ' ఇతి ప్రాప్త్యనుమాభావాత్ 'క్త్వార్థేతో న భవే త్సదా' ఇతి సంధినిషేధా చ్చాసాధుత్వ మేవ స్యాత్. ఏతదాథర్వణ వచనబలాదేవ 'తమ్ముకుఱ్ఱలు' ఇత్యాదా వుత్వం సాధుత్వ మశ్నుత ఇతి ధ్యేయమితి నృసింహః. వస్తుతస్తు 'నిలుచున్నవాఁడు' ఇత్యత్ర ధాతో రవయవ శ్చుః. క్త్వార్థేతస్తు సంధి ర్నైవ.

వి:- వా, అతః-అని ఛేదము. హ్రస్వమగు 'అ'కారమునకు సంధి వికల్పమని సూత్రార్థము. 'లెస్స+అగు=లెస్సగు' మున్నగునవి యుదాహృతులు. దీని నథర్వణాచార్యులుగారు 'కొన్నిశబ్దములు నిత్యసంధి సాంగత్యముచేతనే సాధువులగు' అని 'భవన్తి' అనుకారికచే వివరించినారు. దీనిచే 'చింతాకంత నెపంబు' మున్నగునవి సాధుత్వము నొందుచున్నవి. చింత+ఆకు=చింతాకు; ఆకు+అంత=ఆకంత మున్నగు చోట్ల 'చింతయాకంత' అని యుండ రాదని విదితమగుచున్నది. 'ఆకు+అంత' అనునపుడు "షష్ఠ్యా ఉతోఽచి నుమ్సేచ (61)" అనుచొప్పున రావలసిన సంధివ్యవధాయకమగు నుమ్ము రాక యుత్వసంధి కల్గినది. 'నిలిచి + ఉన్నవాఁడు = నిలుచున్నవాఁడు' అనునదియు భవన్తీత్యాదిచేతనే సాధువని యందురు. అది సరికాదు. అథర్వణాచార్యులు గారు క్త్వార్థకేకారమునకు సంధి రాదని చెప్పిరిగదా! కాన నిలుచు+ ఉండు= నిలుచుండు అని యిది శబ్దపల్లవము. చింతయాకు' అనురీతి ప్రయోగములు నన్నయాదాథర్వణసమ్మతములు కావు. 'తమ్మికుఱ్ఱలు' అనునది కుఱ్ఱలైనతమ్ములు అని విశేషణోత్తరపదకర్మధారయము.

సమాసము పరినిష్ఠితరూపమునందుఁ బ్రాతిపదికము నిలువవలెను. 'తమ్మ' అని ప్రాతిపదికము. సమాసమున నిది 'తమ్మకుఱ్ఱలు' అని యుండక యుత్వముతో 'తమ్ముకుఱ్ఱలు' అనియుండుట యీసూత్రసామర్థ్యముచేతనే యని నృసింహపండితుఁ డనెను. కాని 'అన్నమ్మ' మున్నగువానిని దీని కుదాహరింప నగును.

46. సూ. 2 :— సంస్కృతసమాంతస్థిత స్యాచోఽపి క్వచి త్సన్ధిః. 'గంగను కానె', ఈరంగభర్తంచు, శౌరిచ్చుశుభములు-ఇత్యాది కవిప్రయోగాత్. అతఏవ వాథర్వణగ్రన్థే - "కుత్రచి త్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవేత్" ఇతి స్థితమ్.

వి:— 'గంగ+అను=గంగను, శౌరి+ఇచ్చు=శౌరిచ్చు, రంగభర్త+అంచు=రంగభర్తంచు' మున్నగుసంస్కృతసమముల యకారేకారములకు సంధివికల్ప తదభావములు గలుగుచుండుటచే నథర్వణాచార్యులుగారు 'ఒకానొకయెడ సంస్కృతీయప్రాణమునకును సంధి యగును' అని 'కుత్రచిత్' అనుకారికచే వివరించిరి. సంస్కృతీయప్రాణమను దానికిఁ దత్సమస్వరమనియుఁ, జ్యుతమగు నను దానికి సంధి కల్గు ననియు నర్థము. ఈయథర్వణవివరణము ననుసరించి, 'వాఽతః' అను సూత్రముచేఁ దత్సమాకారమున కంతటను సంధి రాదనియుఁ గొన్నియెడల సంధి వచ్చుట కవిసమ్మతమనియుఁ దెలియుచున్నది. ఇంతేకాక స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకుఁ జివరనున్న 'అ'కారమునకు సంధి రాదని కవిప్రయోగములనుబట్టి వ్యాఖ్యానింపనగును. చిన్నయసూరిగారట్లే వివరించిరి. కాని యథర్వణునిపై సూరిగారు (బాల. సంధి. 4. సూ) చేసిన విమర్శ సరికాదు. ప్రామాణికుఁ డగుశ్రీకృష్ణదేవరాయలు తనకుఁ బూర్వము ప్రామాణికకవిప్రయోగముగాని లక్షణముగాని లేకున్నచో నట్లు ప్రయోగించియుండఁడు. ఈయథర్వణలక్షణమందులకు నిదర్శనము, కవిప్రయోగములు దొరకకుండుటకుఁ గారణ

ములు పెక్కులు గలవు గదా! అప్పకవీయమునుబట్టి వీ రిట్లూహించి రేమో? చింతామణి 'అ'కారసంధిని 'వాఽతః'అని సామాన్యముగా వికల్పమని వచింపఁగా నథర్వణాచార్యులుగారు ప్రయోగానుసారముగాఁ బలురీతులని వచించిరి. "ద్రుతపూర్వాకారమునకుఁ బ్రాయికముగా సంధి రాదు" "మిశ్రతత్సమసమాసములలో ద్రుతలోపము కలిగినపుడు 'ల' వర్ణమునకే సంధి యగును; దక్కినస్థలములలో రాదు" "కొన్ని శబ్దములు సంధి నిత్యత చేతనే సాధువు లగును" "ప్రత్యయాచ్చునకును, ఆర్యాద్యర్థకశబ్దాచ్చులకును సంధి నిత్యము. కొన్నియెడల నచ్చునకచ్చు పరమగునపుడు సంధి బహుళము." "కొన్నియెడల సంస్కృతశబ్ద సంబంధాచ్చునకును సంధి కల్గును"అని వచింపఁగా సూరిగారు "అత్తునకు సంధి బహుళము" (బాల-సంధి-4) అని సూత్రించి పై యథర్వణప్రోక్తవిషయములను బహుళపదముచే సంగ్రహించుచు "బహుళగ్రహణముచే స్త్రీవాచక తత్సమ సంబోధనాంతములకు సంధి లేదు"—అని వ్రాసిరి. మఱియు "సంస్కృతీయములకు సంధి యగునని యథర్వణాచార్యులు చెప్పిరి కాని, దానికిం బూర్వకావ్యములయందుఁ బ్రయోగంబు మృగ్యంబు" అని వ్రాసిరి. 'మల్లన, సిద్ధన' మున్నగు నత్వసంధులును, 'జయతనియె' మున్నగునకారేతర స్వరసంధులును, 'క్వచిత్సంస్కృతీయోఽపి' అనుదానికి లక్ష్యము లన నొప్పును. మఱియు సంబోధనాకారసంధికి 'అమ్మలక్కలు, అప్పలప్పలు, అన్నలారన్నఁడు, కుచములారనుచు - మున్నగునవి యుదాహృతులు. ప్రౌఢవ్యాకరణము "శ్లేష్మతావాచకంబులగు నార్యాద్యర్థకశబ్దంబులు పరంబు లగుచో నన్ని యచ్చులకును సంధి నిత్యము" (ప్రౌఢ. సంధి. 1. సూ) అని వివరించెను. 'గంగనుకాసె' మున్నగునాముక్తమాల్యదలోని ప్రయోగము లథర్వణ సమ్మతములని యూహింపవలసియున్నది.

**47. సూ :— అనాదిషు విభక్తి షూతో వా.**

**47. సూ. 1 :— ప్రథమావిభక్తివ్యతిరిక్తవిభక్తిగతోకారస్య వా సంధి స్స్యాత్**

దచి. అత్ర వాశబ్ద స్సముచ్చయార్థే. పూర్వసూత్రాదేవ వికల్పార్థక వా శబ్దాను వృత్తేః ప్రాప్తే విభాషేయమ్. 'నన్నేలుఁన్ మమ్మేలుఁన్ - మూకొంటి కిచ్చు నాయువు - కీర్తియుం దనురక్తి' - ఇత్యాది. సంధ్యభావే - "మమ్ము నేలుఁన్" ఇత్యాది జ్ఞేయమ్. సంధివిధానసామర్థ్యాదేవ సంధివేళాయాం ద్రుతస్యాదృశ్యతా జ్ఞాపితా. అథర్వణ స్తు-

> "అచాం సన్ధౌ ద్రుతోఽదృశ్య స్సితోఽపిచ భవే త్సదా;
> క్వచి త్ప్రత్యయయోగేఽపి తథాత్వ మభిధీయతే"

ఇత్యువాచ. ప్రత్యయయోగే 'మిక్కిలియుఁన్' ఇత్యా ద్యుదాహరణమ్.

వి:- అనాదిషు, విభక్తిషు, ఉతః, వా- అని ఛేదము. ప్రథమా విభక్తితప్ప మిగిలినవిభక్తులలో నున్న యుకారమునకు స్వరపరకత్వము నందు సంధి వికల్పమని సూత్రార్థము. పూర్వసూత్రమునుండి 'వా' శబ్ద మనువృత్త మగుచుండ నీసూత్రమున 'వా' శబ్దమును నిలుపుటచే నిం దనువృత్తులు మున్నగునవి లేవని సూచిత మగుచున్నది. అయినను గవి శిరోభూషణము సంస్కృతవ్యాకరణములోవలె ననువృత్తుల నంగీక రించి యన్వయించుట సరికాదు. సంస్కృతవ్యాకరణపద్ధతు లిం దను సరింపవలసినవానిని నన్నయాథర్వణులు సూచింతురు. వానినిమాత్రమే గ్రహించుట యుక్తము. 'నన్నేలుఁన్' మున్నగువానిని గవిశిరోభూష ణము దీని కుదాహరించినది. అట్లుదాహరించుట నన్నయాథర్వణసమ్మ తము కాదు. నన్నున్+ఏలున్ అనునపుడు న్నున్ అనుదానిలోనున్న యుకారము విభక్తిప్రత్యయస్థము కాదు. దేశ్య మగు నస్మచ్ఛబ్దము 'నా' అనునది. దేశ్యమగు యుష్మచ్ఛబ్దము 'నీ' అనునది. వీనికిఁ బ్రథమావిభక్త్యేకవచనబహువచనములు పరము లగునపుడు 'ను, ము' అనునవి యస్మచ్ఛబ్దమునకును, యుష్మచ్ఛబ్దమునకు 'వు-రు' అనున వియుఁ గ్రమముగా నేకబహువచనములయందు వచ్చును. ఈ 'నుము వురు' అనునవి వానియేకవచన బహువచనముల కాదేశము లగును. 'దేశ్యా దస్మద్యుష్మచ్ఛబ్దా త్సుజసో ర్నుము వురూ చ స్తః' అనుదాని కర్థము. 'ఈయస్మద్యుష్మచ్ఛబ్దములకు ద్వితీయైకవచన బహువచనములు

పరమగునపుడు పూర్వమునకు 'న్ను మ్ము' అనునవి యాగమము లగును' అని 'న్ను మ్మూ హ్రస్వ శ్చాదే రమి శసి చ' అనుదానికర్థము. కవిశిరోభూషణము 'అమి, శసి' అను వాని సప్తమీవిభక్తిని షష్ఠీవిభక్తిగ మార్చి యర్థముచెప్పి వాని నాదేశించినది. ఆదేశములే యైనచో 'నన్నున్' మున్నగునవి ద్వితీయావిభక్తులై సంధి వికల్పముగా జరుగ వచ్చును. అట్లనుట సరికాదు గదా! "యదాగమా స్తద్గుణీభూతా స్తద్గ్రహణేన గృహ్యన్తే" అను న్యాయ మిం దుపచరింపదు. 'న్ను మ్ము'లు ద్వితీయైకవచనబహువచనప్రత్యయములు పరమగునపుడు ప్రకృతి కాగమములు గదా! కావున నన్నున్ అనుదానిలోని తుది యుకారము విభక్తిప్రత్యయగతము కానందున "అనాదిషు" అనుదానికి 'నన్నేలున్' అని యుదాహరింపరాదు.

నన్నయాథర్వణులసమ్మతిచొప్పున 'నన్నేలున్' మున్నగునవి సాధువులే యగును. వానిప్రక్రియ నీరీతి నూహింపనగును. 'నన్ను+అమ్, నిన్ను+అమ్, తన్ను+అమ్' అనియుండఁగా "ను" అనుద్వితీయా ప్రత్యయము 'అమ్' అనుదాని కాదేశమై 'అన్యే ద్రుతప్రకృతయః' అని ద్రుతము చేరి "నన్నునున్, నిన్నునున్, తన్నునున్' అని యగును. 'నన్ను నున్+ఏలెను=నన్ను నేలెను, నన్నును నేలెను'-అని సంధితదభావరూపములుండును. ఇందలి చివరద్రుతము, నాపిమ్మటి నువర్ణకోకారము లోపింపఁగా "నన్నున్"అని యుండును. మరల ద్రుతలోపము ద్విత్వలోపము కల్గి 'నను' అనియగును. దానిస్వరమునకు లోపము వచ్చి-'నన్, నిన్, తన్'-అను రూపము లేర్పడును. 'నన్+ఏలెను' అనునపుడు "నో వా ద్విత్వం క్వచిత్ శ్లిష్టః పరప్రాణేన సజ్జతేః" అనుచొప్పున 'నన్నేలెన్'-అని యగును. ఇంక 'నన్నున్' అనుదాని యుకారము ద్వితీయాప్రత్యయస్థము కానపుడు 'మమ్మున్'అనుదానియుకారమును ద్వితీయాప్రత్యయస్థము కాదేమో యని శంకింపఁ జనదు. 'మమ్ము+శస్' అనియుండఁగాఁ బ్రక్రియ పూర్తియగుటచే "నపదా న్యవ్యయ" అనుచొప్పున శస్సు

లోపించును. తరువాత ద్రుతము చేరును. కావున నాయు కారము ద్వితీయాప్రత్యయస్థమే యగును. కాఁబట్టి 'మమ్మేలున్, మమ్ము నేలున్' - అని రెండురూపములును 'అనాదిషు' అనుచోప్పున సిద్ధించును. కాన 'నన్నేలున్' మున్నగురూపములను దీని కుదాహరించుట సరికాదు గదా !

48. సూ :- నిత్య మను త్తమపురుషక్రియా స్వితః.

48. సూ. 1 :- నిత్యగ్రహణం వాఽనువృత్తినివృత్త్యర్థమ్. ఉత్తమపురుషేతర క్రియాగత స్యేకారస్యాచా సహ నిత్యం సన్ధి స్స్యాత్ - 'రాముని వినుతించి రమరులు, చేసితి వచ్యుతుపూజ, కంటి వతనిరూపము' ఇత్యా ద్యుదాహరణమ్. ఉత్తమ పురుషే తు 'ప్రాయస్తు స్యా త్క్రియాదిక స్యేతః' - ఇతి వక్ష్యమాణసూత్రేణ ప్రాయ స్సన్ధిః - 'చేసితి నచ్యుతార్చనము - చేసితచ్యుతార్చనము' - ఇత్యాది.

వికృతివివేకకారస్తు -
"ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవే చ్ఛ్యుతిః ।
నిత్య మన్యస్య వికృతౌ క్త్వార్థతో న భవే త్సదా."

ఇతి ప్రథమపురుషే సన్ధే ర్వికల్ప మాహ. అత ఏవ - 'బలభిద్వహ్నిపరేతరాజవరుణుల్పర్యుత్సుకత్వంబు సంధిలఁ గూర్చుండిరి యొండొరు న్గదిసి, సిద్ధిం గాంచిరి యవిముక్తసీమయందు' ఇత్యాదయ శ్శ్రీనాథాదిమహాకవిప్రయోగా స్సంగచ్ఛన్తే. కానునార్యప్పకవి స్త్వేతద్గ్రన్థసమ్పాదనవైధుర్యేణ శ్రీనాథస్య భ్రాన్తత్వ మాహ.

వి:-నిత్యం, అను త్తమపురుషక్రియాసు, ఇతః-అని ఛేదము. ఉత్తమపురుషేతరక్రియల (ప్రథమమధ్యమపురుషక్రియ), లోని 'ఇ' కారమునకు సంధి నిత్యమని సూత్రార్థము. 'చేసితిరి+అపుడు=చేసితిరపుడు, చేసితివి+అపుడు =చేసితివపుడు, చేసితిమి+అపుడు =చేసితిమపుడు' అని యుదాహరణములు. భూతకాలమునందుఁ బ్రథమపురుషైకవచనమునఁ దప్ప మిగిలినవానిలోఁ దుది ఇకార మున్నది. ప్ర. ఏ. చేసెను, బ.చేసిరి; మ.ఏ. చేసితివి, బ.చేసితిరి; ఉ.ఏ.చేసితినిన్, బ.చేసితిమి-అనునవి భూతకాలికక్రియలు. ఉత్తమపురుషక్రియ (చేసితిఁన్, చేసితిమి)ల

'ఇ' కారమున కచ్చు పరమగునపుడు 'చేసితిసిన్+అచ్యుతార్చనము = చేసితినచ్యుతార్చనము, చేసితినినచ్యుతార్చనము, చేసితిన్+అచ్యుతార్చనము = చేసితచ్యుతార్చనము, చేసితినచ్యుతార్చనము' అని 'ప్రాయ స్తు స్యా త్క్వా-మాదికస్యేతః' అని ప్రాయికసంధి కల్గును. దీని నథర్వణాచార్యులుగారు ప్రథమోత్తమపురుషక్రియలలోని 'ఇ' కారమునకు సంధి వికల్పము; మధ్యమపురుషక్రియల 'ఇ' కారమునకు సంధి నిత్యము; క్త్వార్థకేకారమునకు సంధి రాదు – అని తననాఁటికిఁ బ్రథమపురుష క్రియేకారమునకు సంధి వికల్పముగాఁ గవిప్రయోగము లగపడుటచే నిట్లు వివరించినారు. శ్రీనాథుఁడు కూర్చుండిరి + ఒండొరుంగడసి = కూర్చుండిరి యొండొరుం గడసి– అని యథర్వణవచనానుసారముగాఁ బ్రయోగించెను. అథర్వణగ్రంథము నెఱుంగని యప్పకవి "విరచించెను శ్రీనాథుఁడు, ధరణిని శృంగారనైషధంబునఁ 'గూర్చుండిరి యొండొరు' నని కానక, పరపురుషక్రియలఁ బ్రకృతిభావము గలదే" అని యాక్షేపించెను. అప్పకవి యీయథర్వణకారికను జూడలేదు గానఁ జింతామణికి విరుద్ధముగానున్న శ్రీనాథునిప్రయోగము నాక్షేపించుట యుక్తమే. చింతామణికి నథర్వణకారికలకుఁ గల మూలవివరణసంబంధమును గుర్తింపని కవిశిరోభూషణ మప్పకవిని "కాకునూర్యప్పకవి స్త్వేతద్గ్రంథసమ్పాదనవైధుర్యేణ శ్రీనాథస్య భ్రాన్తత్వ మాహ" అని వ్రాయుటమాత్ర మంత సమంజసముగా లేదు.

బాలవ్యాకరణము వికృతివివేకము ననుసరించి యీవిషయములను "క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు" (బాల–సంధి–6.సూ.) "మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగు"–(బాల–సంధి–7. సూ) "క్త్వార్థంబైన ఇత్తునకు సంధి లేదు" (బాల–సంధి–8. సూ) అని మూఁడుసూత్రములతో వివరించెను.

ప్రౌఢవ్యాకరణము ప్రాచీనలాక్షణికులకు విరుద్ధముగా "ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడు" (ప్రౌఢ–సంధి 2. సూ)

అని ప్రామాణిక ప్రయోగములలో నీ - ఇ - ప్రత్యయాంతావ్యయ (క్త్వార్థకేకార) మునకు సంధి యగపడుచున్నదని వివరించినది. ఉదాహృతులలో అందిమ్ము = అంది + ఇమ్ము (భారత—విరా.4.ఆ.112ప) వెలుచిట్లు (నిర్వ - 5.ఆ. 88.వ) ఎత్తింగెత్తింగి (భాగ.9.స్కం.115.వ) చెప్పుంపఁడే (ప్రభా-4.ఆ.146.వ) అని యుదాహరణములఁ జూపెను. ఇందు మొదటిది శబ్దపల్లవధాతువు. అందు + ఇచ్చు = అందిచ్చు. దీనిమధ్యమముజ్వాంతము అందిమ్ము అనునది. ఇది దీనికుదాహరణము కాఁజాలదు. రెండవదానికి వెలునిట్లు అని పాఠాంతరము కలదు. అదే కవిప్రయుక్తపారము కానోపును. నాల్గవ దానికి 'చెప్పింపఁడే' అని పాఠాంతరము. మూఁడవది భాగవతములోనిది. ఇట్టియలాక్షణిక ప్రయోగము లుండుటచేతనే లాక్షణికులు భాగవతమును బ్రమాణీకరింపలేదు. కాలమహిమచే నేఁ డన్నియు సాధువులే. అసాధువు లనునవే లేవు గదా! "అపశబ్దభయం నాస్తి వ్యాప్తులాచార్యకన్నిధౌ" అని గదా యిప్పటి కొందఱుపండితుల ధ్యేయము.

**49. సూ :- పరిమితౌ సమస్తానామ్.**

49. సూ. 1 :- పరిమాణార్థకే వర్ణకే పరే తత్సంబద్ధిప్రాణేన సహ సర్వప్రాణానాం నిత్యం సన్ధి స్స్యాత్ 'బారెఁడు, మూరెఁడు, పట్టెఁడు, తూమెఁడు, గంపెఁడు' ఇత్యాది. "మానార్థా న్నిత్య మేకత్వే ఎఁడు స్స్యా త్పరిమాణకే" ఇత్యథర్వణే నోక్తమ్.

వి:- పరిమితౌ, సమస్తానామ్—అని ఛేదము. పరిమాణార్థకప్రత్యయము పరమగునపు డన్నియచ్చులకును సంధి నిత్యము-అని సూత్రార్థము. 'బారెఁడు' మున్నగునవి యుదాహృతులు. 'ఏకవచనమున 'ఎఁడు' అనునది మానవాచకశబ్దమునకుఁ బరముగాఁ బరిమాణార్థమున నిత్యముగా వచ్చును' అని 'మానార్థాత్' అను దాని కర్థము.

పరిమితే సమస్తానామ్—అని పఠించుట యుక్తమని—వ్యా.సం.స. చెప్పుచున్నది. ఇది సమంజస మని తోఁచుచున్నది. నిత్య మనుత్తమ

పురుషక్రియా స్వితః పరిమితే సమస్తానామ్' అనునది యేకవాక్యము కావునను, క్రియ యనఁగా ధాతువు కావునను, ధాత్వంతమున నిల్చు నవి ప్రత్యయము లగుటచేతను 'బరిమితే' అనుదానికిఁ గొన్ని ప్రత్యయాగమముల యచ్చులని యర్థమగును. కావున 'బారెఁడు' మున్నగు నవియే కాక దీనికి 'రామునందు, అర్థించు, ఎనిమిదవది' మున్నగున వియు నుదాహరణము లగును. కావుననే సూరిగారు అంద్వవగాగమం బులం దప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధి యగు — (బాల — సంధి—11. సూ) అని వివరించియున్నారు. పరిమితే సమస్తానామ్ అనుపారమే సూరిగారికి లభించిన టీకసూత్రమును బట్టి యూహింప వలసియున్నది.

**50. సూ :— న స్యాత్తద్ధర్మేతః.**

50. సూ. 1 :— సంధిరితి సర్వత్రానువర్తతే. తద్ధర్మేకార స్యాచి సన్ధిర్న స్యాత్. తద్ధర్మపదేన తద్ధర్మక్రియా తద్ధర్మవిశేషణఞ్చ గృహ్యతే. 'వెలయు నతనికీర్తి సకలదిగ్వలయమునను, రక్షణ మొనర్చు నంబుజాతాక్షుఁ గొలుతున్' ఇత్యాద్యుదాహరణమ్,

వి:— న, స్యాత్, తద్ధర్మేతః—అని ఛేదము. తద్ధర్మేకారమునకు సంధి రాదని యర్థము. తద్ధర్మకాలమునందుఁ గ్రియారూపము లీక్రింది రీతి నుండును.

| ఏకవచనము | బహువచనము |
|---|---|
| ప్ర.పు. రక్షించెడున్, రక్షించెడిన్, రక్షించున్ | రక్షించెదరు, రక్షింతురు |
| మ.పు. రక్షించెదవు, రక్షింతువు, రక్షింతు | రక్షించెదరు, రక్షింతురు |
| ఉ.పు. రక్షించెదనున్, రక్షింతునున్, రక్షింతున్ | రక్షించెదము, రక్షింతుము |

పై వానిలో 'రక్షించెడిన్' అనుదానియందుఁ దప్ప మిగిలిన యన్నింటితుదియందు ఉకారములు వెలయుచున్నవి. ఇవి యన్నియును దద్ధర్మకారములైనచో 'న స్యాత్తద్ధర్మకః' అనుచెప్పిన సంధినిషేధము తగిలి రక్షించెదమపుడు, రక్షించెదరపుడు-మున్నగురూపములు సిద్ధింపకపోవలసివచ్చు. కాన దీనినిట్లు వివరింపనగు. 'తద్ధర్మవర్తమానాతీతాఽగామ్యర్థకాః క్రియాః జ్ఞేయాః' అనుచెప్పునఁ దద్ధర్మసంజ్ఞ ధాతువునకే కలదు. ప్రత్యయాంతమునకు లేదు. కాఁగా 'న స్యాత్తద్ధర్మకః' అను సూత్రములోని 'తద్ధర్మకః' అనుదానికిఁ దద్ధర్మధాతూకారమునకని యర్థము. ఆవక్షమునఁ దద్ధర్మధాతూకారము 'రక్షించున్' అనుదానియందుఁ గలదు. తద్ధర్మార్థక విశేషణముకూడ నిట్లే యుండును. కావుననే కవిశిరోభూషణము 'తద్ధర్మపదముచేఁ దద్ధర్మక్రియయుఁ దజ్జన్యవిశేషణమును గ్రహింప నగు' నని వివరించియున్నది. కావున వీనికిమాత్రమే సంధి నిషేధము. మిగిలినవానికి సంధి కలుగును. 'వెలయునతనికీర్తి' అనునది తద్ధర్మక్రియకును, "ఒనర్చునంబుజాతాక్షున్" అనునది తద్ధర్మార్థక విశేషణమునకును నుదాహరణములు. 'రక్షించెదున్' అనునది యాథర్వణము. అయినను దీనికిని సంధిరాదు. ఆవిషయమును 'ప్రథమశ్చోత్తమశ్చైవ' అనుకారిక వివరించినది.

తిఙ్మధ్యసూత్రములో విశేషణములు పఠింపఁబడలేదు గానఁ జింతామణి చెప్పిన నవి ద్రుతప్రకృతికములు.

సూరిగారు ద్రుతప్రకృతికములను జెప్పి మిగిలినవి కళ లనుటచేతను, ద్రుతప్రకృతికములలో విశేషణములను బేర్కొనకుండుటచేతను వారిమతమునం దన్నిరకము లగు విశేషణములును గళలే యగును. కావున 'చేయు+అతఁడు' మున్నగుచోట్ల సంధిని వారించుకొనుటకై "ఉదంత మగుతద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు 'ను'గాగమం బగు" (బాల - సంధి - 33. సూ) అని నుగాగమమును విధించు

కొనవలసి వచ్చినది. అప్పకవీయచింతామణిలో "ధాతుపదసంభవానాం విశేషణానా ముత స్తథా ను మచి" అని కలదు. దాని ననుసరించి సూరిగారు పై మార్గము నాశ్రయించిరి. విశేషణములను గళలుగా నంగీకరించుటవలన ననర్థములు పెక్కు వాటిల్లినవి. అవి యాయాచోట్ల వివరింపఁబడును. ఇచటఁ గొందఱు — న స్స్యా త్తద్ధర్మోతః—అనిపఠింతురు. ఆపాఠము సరికాదు.

51. సూ :— చో ర్వా స్యా ద్వ ర్తమానవిహితస్య.

51. సూ :— వ ర్తమానార్థే విహితస్య చువర్ణక స్యోతః అచి పరే వా సన్ధిః. పూర్వసూత్రా దుత ఇత్యభిన్నమపి పద మత్రానువ ర్తతే. పాణినీయే 'అనుస్వారస్య యయి పరసవర్ణః' ఇతి సూత్రా దభిన్న స్యాపి సవర్ణపదస్య — "ఉదః స్థాస్త మ్భోః పూర్వస్య" ఇతి సూత్రేఽ నువృ త్తే ర్భాష్యాదిక శిఖామణిభి రూరీకృతత్వాత్. న చ తత్ర 'స్వరితేనాధికారః' ఇతి స్వరితత్వ ప్రతిజ్ఞామహిమ్నా అనువృ త్తిః; న తథాత్రేతి వాచ్యమ్. 'ఏషా తయో ర్వికృతిః' ఇతి వికృతిసంజ్ఞాం కుర్వతా శబ్దానుశాసనే నా ను క్తకార్యమాత్రస్య ప్రా ప్తే రభ్యనుజ్ఞానా దితి పూర్వమే వో క్తమ్. ప్రా ప్తే విభాషేయమ్ 'నగుచిట్లనిరొ, నగుచునిట్లనియె, కన్నియలతోడ నాడుచు నున్నదాని' నిత్యా చార్య ఆదిపర్వణి వ్యాజహార. అస్మిన్నేవ పద్యే చతుర్థచరణే 'అడుచుచుండఁ బ్రమద్వర యవనిఁ ద్రెళ్ళెన్' ఇత్యాద్యుదాహరణమ్.

వి:— చోః, వా, స్యాత్, వ ర్తమానవిహితస్య — అని ఛేదము. వ ర్తమానార్థమునందు విహితమైన చు వర్ణకమునకు స్వరము పర మగునపుడు సంధి వికల్పముగ నగునని సూత్రార్థము. 'చురితి క్రియాపదానాం సర్వేషాం వ ర్తమానకాలే స్యాత్' అను సూత్రముచే వ ర్తమానార్థమునందు 'చు' అనునది ధాతువునకు విధింపఁ బడినది. దాని కీసూత్రముచే సంధి వికల్పముగా నగును. చువర్ణమునం దున్నది 'ఉ' కారమే కావున 'ఉ' కారమును దీనిలోని కనువృ త్తిగా 'తద్ధర్మోతః' అనుసమాసైకదేశము నంగీకరింపఁ బనిలేదు. కవిశిరోభూషణ మట్టిపనికి యత్నించి సమాసైకదేశ మనువృ త్తిచేయుట యసంగతమని భావించి దానిని

సంగతముగాఁ జూపుటకు సంస్కృతవ్యాకరణసాక్ష్యమును సంపాదింపఁ జూచుట నిరర్థక మనిసెంపఁబోదు. 'నగుచున్ + ఇట్లనియెన్ = నగుచిట్లనియెన్, నగుచునిట్లనియెన్-మున్నగునవి యుదాహరణములు. ఇట సూరిగారు - "ప్రథమేతర విభక్తిశత్రర్థక చువర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును". (బాల. సంధి. 2. సూ) అని ప్రకృతచింతామణిసూత్రమును వివరించిరి.

52. సూ :- తద్వత్తదాదిజస్య.

52. సూ :- ఉత్తరసూత్రాదిత ఇత్యపకృష్యతే. తదాదిపర్యాయా యేఽత్ర అదిత్యాదయః. తజ్జన్యస్య తదన్తస్యేత స్తద్వద్వా సన్ధిస్స్యాత్. అదేమి, అదియేమి ఇదేమి, ఇదియేమి - ఏదయ్య, ఏదియయ్య - ఇత్యాది.

వి:- తద్వత్, తదాదిజస్య - అని ఛేదము. అది - అవి - మున్నగునవి తదాదులు. తదాదుల 'ఇ' కారమునకచ్చు పర మగునపుడు ప్రకృతసూత్రముచే వికల్పముగా సంధి యగునని సూత్రార్థము. "తద్వత్తదాదిజస్య ప్రాయస్తు స్యాత్క్వమాదిక స్యేతః" అనునది శాస్త్రసంప్రదాయానుసారముగ నొకటే వాక్యము. ఏకవాక్యగతము లగు పదములు ముందువెనుకల కన్వయింప వచ్చును. కావున 'ఇతః' అను దాని నుత్తరసూత్రమునుండి యపకర్ష చేసికొనన క్కరలేదు. కవిశిరోభూషణ మపకర్ష చేసి యన్వయించుట సరికాదు. ఇట్లుచేయుట నన్నయాథర్వణులకు సమ్మతము కాదుగదా! పాణినీయము మున్నగు సూత్రగ్రంథములలోనివి కారికలు కావు; సూత్రములు. కాన వాని కనువృత్తులు నపకర్షములు గ్రంథకర్తలచే సమన్వయసౌకర్యమునకై యంగీకరింపఁ బడినవి. చింతామణివికృతివివేకములు కారికలు. వీనియందట్టివాని నంగీకరించుట సంప్రదాయము కాదు. పూర్వసూత్రములలోని పదముల నుత్తరసూత్రములలోనికిఁ దెచ్చికొనుట ననువృత్తియనియు, నుత్తరసూత్రమునుండి పూర్వసూత్రములోనికిఁ దెచ్చికొనుట నపకర్షమనియు నందురు.

**53. సూ :- ప్రాయస్తు స్యాత్కిమాదిక స్యేతః.**

53. సూ :- కిమాదిపర్యాయో ఽత్ర ఏమ్యాదిః. తస్యేతస్తు బహుళం సన్ధిస్స్యాత్. ప్రాయోగ్రహణాత్ "క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా" 'కంచంతికాపురము - మగవాలు' ఇత్యాదిషు ప్రవృత్తిః. 'అరుగుదెంచి యతఁడు వారినిఁ గనియె, తింటి నతిమధురఫలములు. కంటి నంబుజాతాక్షున్' – ఇత్యాదావప్రవృత్తిః. 'కొలిచితి నద్భిజన్-కొలిచితద్భిజన్. ఏమయ్య – ఏమియయ్య' ఇత్యాదౌ విభాషేతి ప్రయోగతో ఽవగన్తవ్యమ్. 'క్త్వార్థాతో న భవే త్సదా'-ఇత్యథర్వణో నాప్యుక్తమ్. 'రాముని కభిరామగుణారామునికి నతులు, అనలజ్యోత్యుండె నీళ్ళందఁగా' ఇత్యాదీనా మేతద్గణత్వేనైవ సాధుత్వ మవగన్తవ్యమ్, కిమాదీనామపి తదాదిత్వేన సిద్ధత్వా త్పృథగ్గ్రహణం స్పష్టప్రతిపత్త్యర్థమ్ - "ఆద్యన్తవర్ణయో రైక్యం సన్ధి రిత్యుచ్యతే బుధైః। పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భవేత్" ఇత్యథర్వణో నోక్తమ్. అనుస్వారే పరే త్వత్ర న సన్ధిః ఏకపదే సంధ్యభావాత్; "సన్ధిస్త్వపదే" ఇతిప్రాకృతసూత్రాత్. పరరూపలక్షణసన్ధే రసమ్భవా చ్చేతి జ్ఞేయమ్.

వి :- ప్రాయః - తు - స్యాత్ - కిమాదికస్య - ఇతః - అని ఛేదము. కిమాదిగణ మనఁగా నేమ్యాదిగణము. ఈగణములోని శబ్దములతుది 'ఇ' కారమున కచ్చు పర మగునపుడు సంధి ప్రాయికముగా నగునని సూత్రార్థము. కవిశిరోభూషణము ప్రాయశ్శబ్దమునకు బాహుళకార్థమును వచించినది. ఒకచోని త్యముగాఁ బ్రవర్తించుటయు నొకచోఁ బ్రవర్తింపకుండుటయు నొకచో వికల్పముగాఁ బ్రవర్తించుటయు నర్థముగల "క్వచిత్ప్రవృత్తిః క్వచి దప్రవృత్తిః క్వచి ద్విభాషా" అనుదానిచే సంస్కృతవైయాకరణులు బహుళపదమునర్థమును వివరించి చెప్పియున్నారు. దీనికిఁ బ్రాయికార్థము సరికాదు. 'కంచి' మున్నగుశబ్దములు కిమాదులలోనివి కావు. 'అరుగుదెంచి యతఁడు' అనునది క్త్వార్థకము 'క్త్వార్థాతో న భవే త్సదా' ఇత్యథర్వణేనాప్యుక్తమ్ – అనునది కవిశిరోభూషణాశయము. చింతామణిక్త్వార్థకేకారసంధిని నిషేధించియుండలేదు. అట్టి సంధిని నన్నపార్యుఁడు చెప్పలేదు. అచటిసంధినిషేధము బహుళార్థకమగు ప్రాయ

శ్శబ్దము చేతనే సంగ్రహింపనగునని దానియభిప్రాయము. కవిశిరోభూషణము చింతామణి కథర్వణకారికలు వివరణగ్రంథమనియుఁ జింతామణి చెప్పని వానినే వికృతివివేకము చెప్పెననియు నంగీకరింపలేదు. కావుననే క్త్వార్థకేకారములు కిమాదులలోనివని చెప్పెనది. తింటి నతిమధురఫలములు, కంటినంబుజాక్షున్' అనుచోటి 'తింటిన్, కంటిన్' అను నుత్తమపురుషైకవచనక్రియలు కిమాదులలోనివే. వీనికి 'తింటతిమధురఫలములు, కంటంబుజాక్షున్' అనురూపము లుండవు. పలుచోట్లఁ గార్యము జరుగుటయుఁ గొన్నిచోట్ల జరుగకుండుటయు 'ప్రాయః' అనుదాని కర్థము. కవిశిరోభూషణాదులు 'తింటి నతిమధురఫలములు, కంటి నంబుజాక్షున్' అనురూపములను సంధిరానందుల కుదాహరించినవి. కాని యచట సంధి నిత్యముగనే వచ్చినదని యూహింపవలయును.

'కను, తిను' ధాతువుల కుత్తమపురుషైకవచనమునందు 'కంటినిన్ తింటినిన్' అనియుండును. దీనికచ్చు పరమైనపుడు 'కంటినిన్ + అతనిరూపము, తింటినిన్ + అతిమధురఫలములు, అని యుండఁగా "ప్రాయ స్తు స్యాత్కిమాదికస్యేతః" అని వికల్పముగా సంధి కల్గినపుడు కంటి నతనిరూపము, తింటి నతిమధురఫలములు' అనియగును. సంధి రానపుడు 'కంటిని నతనిరూపము, తింటినినతిమధురఫలములు' అనియగును. కంటినిన్, తింటినిన్' అనువానితుదిద్రుతము లోపించినపుడు 'కంటిని, తింటిని' అనియుండును. వీనితుదినున్న 'ని' వర్ణములోని స్వరమునకు లోపము రాఁగా 'కంటిన్, తింటిన్' అని యగును. ఇవియు నుత్తమపురుషైకవచనరూపములే యైనను సూత్రమునందలి 'ప్రాయః' అనుదానివలన నిట సంధి రాదు. కావున 'కంటతనిరూపము, తింటతిమధురఫలములు' అనురీతిరూపములు లేవు. ఇట్టియన్వయముతో వీనిని సమర్థించి సరిపుచ్చుకొనవలయును. కిమాదులలో నుత్తమపురుషైకవచనపరిస్థితరూపము గ్రహింపఁబడునని యైనను వ్యాఖ్యానింపవలయును. 'కొలిచితినిన్, కొలిచితిన్' అనునవి రెండు నుత్తమపురుషైకవచనరూపములే. 'కొలిచితినబ్ధిజన్,

కొలిచితద్బిజన్' అనునవి సంధి కల్గినరూపములు 'కొలిచితివినద్బిజన్' అనునది సంధి రానిరూపము. ఈరీతిని గిమాదిసంధి ప్రాయికమని తెలియవలయును. ఏమయ్యె-అనునది కిమాది సంధి. అట సంధి వికల్పము. 'రామున కభిరామగుణా రాముఁడికిన్' అనుచోటి 'కిన్' అనునదియుఁ గిమాదికమే. దీనికిని సంధి వికల్పమే. 'అనలజ్యోతి+ఉండెన్—అనలజ్యోతుండెన్'—ఇదియుఁ గిమాదిగణములోనిదే. దీనికి సంధి నిత్యముగా నగును కిమాదులను దదాదులతోఁ గలుపవగునని కవిశిరోభూషణాభిప్రాయము. కాని యిది సరికాదు. అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, - అనునవి తదాదులు. వీనికి సంధి వికల్పము. కిమాదులసంధి ప్రాయికము. కిమాది తదాది సంధులొకదానిచే నొకటి గతార్థములు కావని చింతామణి యాశయము. "పరపదము మొదటివర్ణమును బూర్వపదము తుది వర్ణము నేకీభవించుటయే సంధియని చెప్పఁబడుచున్నది. ఏకీభవించుట యనఁగా నారెంటిచోట నుచితమగు గుణవృద్ధ్యాది రూపమగు నక్షర మేకాదేశ మగుటయని యర్థము. ఇట్టిస్థితి స్వరసంధిలో సంస్కృతపదముల మధ్యముననే సంభవించును. ఈ తెలుఁగుభాషలో మాత్రము పూర్వపరాక్షరములకుఁ బరాక్షర మేకాదేశమగుట నియతముగ జరుగును" అని యథర్వణాచార్యు లనుచున్నారు. 'మంచి+అది' అనుచోట నీనియమము వర్తింపదు. 'మంచిది' అనిపూర్వరూపసంధియే యుచటఁ గల్గును. 'మంచది' అని పరరూపము రాదు. అనుస్వారవిసర్గములకు స్వరములలోఁ బేరము కలదు కాని వానికి స్వరకార్యములు వ్యంజన కార్యములును రావు. కాన వాని నుభయములని కొంద ఱనిరి కాని వానిననుభయము లనుట లెస్స.

"కిమాదీనామపి తదాదిత్వేన సిద్ధత్వా త్పృథ గ్గ్రహణం స్పష్టప్రతిపత్త్యర్థమ్" అనుకవిశిరోభూషణము ననుసరించి సూరిగారు రెంటిని గలిపి - ఏమ్యాదులు - అని చెప్పి "ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగ నగు" (బాల. సంధి. 5. సూ) అని సూత్రించియున్నారు.

చింతామణియభిప్రాయమును వారు సరిగ నూహింపలేదని తోఁచెడిని. సూరిగారు "పూర్వపరస్వరంబులకుఁ బరస్వరం బేకాదేశంబగుట సంధి యనంబడు"అని"పూర్వస్య పరరూపత్వ మత్రైవ నియతం భ వేత్"అని తెనుఁగుసంధిని వివరించిరి.

54. సూ :- అపిశబ్దార్థస్యేతః.

54 సూ. :- లుగ్వే త్యుత్తరసూత్రా దపకృష్యతే. అపి శబ్దార్థోఽత్ర ఏని శబ్దః. అస్యేతో లుగ్వా స్యాత్. 'హరినే నద్ధిజనేనిఁ గొల్చెద, హరినేని నద్ధిజనేనిఁ గొల్చెద' ఇత్యా ద్యుదాహరణమ్. అత్రేయం చిన్తా 'రామునే సీతనేఁ గొల్తు' నిత్యా ద్యర్థ మిదం సూత్రమ్. అన్యథా కిమాదిత్వేనైవ రూపసిద్ధే స్సూత్రం ముధా స్యాదితి.

వి:- అపిశబ్దార్థస్య, ఇతః-అని ఛేదము. ఏనిన్, అనునది అపి శబ్దార్థకము. దాని ద్రుతస్వరమునకు లోపము చేసిన -ఏన్-అనియుండును. ఇకారలోపము రానపుడది ద్రుతప్రకృతికమే, కాదని కొందఱనుచున్నారు, కాని వారిమతమునను ద్రుతప్రకృతికమే యనువారిమతమునను 'ఏనిన్' 'ఏన్' అనురూపము లుండును. కళ యనువారు 'ఏని' శబ్దమునకు సముచ్చయాద్యర్థములలో 'యును' అనునవి చేరి 'ను, వర్ణస్వరలోపము చేతను, 'యు' వర్ణలోపముచేతను నారూపములు సిద్ధించు ననుచున్నారు. సముచ్చయా ద్యర్థములున్నను లేకున్నను 'ఏని' శబ్దము ద్రుతప్రకృతికమే యని కొందఱనుచున్నారు, నిజమునకుఁ గళ ద్రుతప్రకృతికము ననునవి విభిన్నవిషయములు, ద్రుతప్రకృతికములు కానివి కళలగును, కళలు కానివి ద్రుతప్రకృతికములగునని యాంధ్రలాక్షణికసంప్రదాయముగదా. 'నేను, తాను' పదములు స్వరలోపము కల్గినపుడును లేనపుడును ద్రుతప్రకృతికములే. కావుననే – ఏనువిడవ – అనునన్నపార్యుని ప్రాసప్రయోగము సరికాదనియు 'ఏను వెనుక' అనుపాఠము సరియైనదనియుఁ బండితులు నుడువుచున్నారు. 'ఏని' శబ్దము ద్రుతప్రకృతికమే; కళ కాదు. 'రాముడుఁన్, కృష్ణుఁడున్' మున్నగునవి ద్రుతోపజీవిశబ్దములు. ద్రుతప్రకృతికములు కావు.

**55. సూ :— చౌ రే రుపధాత్మనశ్చ లు గ్వా స్యాత్.**

55. సూ. :- ఉపధాభూతరివర్ణసమ్బన్ధీ యఇత్ తస్యచ లుగ్వాస్యాచ్చివర్ణే పరే 'అమరిచి, అమర్చి. తనరిచి, తనర్చి, తనర్చెన్' ఇత్యాది. చోఽత్ర సముచ్చయే.

వి:— చౌ, రేః, ఉపధాత్మనః, చ, లుక్, వా, స్యాత్—అని ఛేదము. చౌ, అనునది సప్తమీవిభక్తి కావున–చి–వర్ణము పరమగునపుడని దాని కర్థము కల్గినది. ఉపధయనఁగాఁ దుదివర్ణమునకు ముం దున్నవర్ణము. కాన 'చి' వర్ణము పరమగునపు డుపధాభూతమగు రివర్ణేకారమునకు లోపము వికల్పముగా నగునని దాని యర్థము. 'అమరు తనరు, పొసరు, ఒనరు' మున్నగు రువర్ణాంత ధాతువులకుఁ బ్రేరణార్థకమగు 'చు' వర్ణకము చేరి, 'అమరుచు' మున్నగు ప్రేరణార్థక ధాతురూపము లేర్పడును. వానికిఁ గ్త్వార్థమునందు 'ఇ' వర్ణము చేరి 'అమరిచి' మున్నగు రూపము లేర్పడును. అట్టివానియందే 'చి' వర్ణము పరమగును. ప్రకృతసూత్రముచే రివర్ణేకారమునకు లోపము కల్గిన 'అమర్చి అమరిచి' అని రూపద్వయము సిద్ధించును. ఇచట 'చౌ రో రుపధాత్మనశ్చ లుగ్వాస్యాత్'– అని గ్రంథకృదభిప్రేత మగుపాఠమై యుండునని వ్యా.సం.స. ఊహించుచున్నది. అదియే సమంజసమని తోఁచుచున్నది. ఆపాఠ మంగీకరించిన 'అమర్చు' మున్నగుధాతురూపములుకల్గి, అమర్చి అనురూపమే కాక 'అమర్చెన్, అమర్చున్, అమర్చుచున్' మున్నగు రీతి రూపము లన్నియుఁ గల్గుచున్నవి. శత్రర్థక చువర్ణ పరకత్వమునం దీకార్యము రాదని కవిశిరోభూషణము ననుసరించి యూహింపనగును. 'అమర్చుచున్' మున్నగురూపములును నేఁడు వినవచ్చుచున్నవి.

**56. సూ :— శత్రర్థే తూత శ్చౌ నోః.**

56. సూ. :- వర్తమానార్థకే చువర్ణకే పరే ఉపధాత్మనో నో రుకారస్య చ వా లుక్స్యాత్. తు శబ్దోఽత్ర చార్థే. 'అనుచున్, అన్చున్, వినుచున్, విన్చున్, కనుచున్, కన్చున్' ఇత్యాది.

వి.- శత్రర్థే - తు - ఉతః - చౌ - నోః - అని ఛేదము. శత్రర్థక చువర్ణకము పరమగునపుడు పూర్వమందున్న నువర్ణోకారము నకు లోపము వికల్పముగా నగునని సూత్రార్థము. అన్చున్ - అనుచున్, కన్చున్ - కనుచున్, విన్చున్ - వినుచున్, మొ. ప్రేరణార్థక చువర్ణము పరమగునపుడు నువర్ణోకారలోపము రాదు. శత్రర్థక చువర్ణము పరమగునపుడు రివర్ణేకారమునకు లోపము రాదు. అను - కను - మున్నగు కొన్ని ధాతువులమీఁదఁ బ్రేరణార్థమునందు చువర్ణము రాకున్నను, విను - మను - మున్నగు కొన్ని నువర్ణాంత ధాతువులమీఁదఁ బ్రేరణార్థమునందు - చు - వర్ణము వచ్చి - విన్చెన్ - మన్చెన్ - మున్నగురూపములు గల్గుచున్నవి. ఇట్టివాని నువర్ణోకారలోపము "నలడాదేర న్తరుత శ్చాన్యేషాఞ్చ ప్రయోగమగహితానామ్" అనుచోవ్వునఁ గల్గినదని చెప్పినను జెప్పనొప్పును.

57. సూ:- తస్య స్యాచ్చ పూర్ణబిన్దురపి.

57. సూ. :- తస్య నకారస్య పూర్ణబిన్దుశ్చ స్యాదపి. 'అంచు, వించు, కంచు' ఇత్యాది. 'వంచించి పట్టుకొనియెద నంచున్' ఇతి శ్రీనాథః. బిన్దోరపి వైకల్పికత్వేన రూపత్రయ మత్ర సిద్ధ్యతి 'అనుచున్, అన్చున్, అంచున్' ఇత్యాది. అపి శబ్దాత్ - 'చనుచున్, ఎన్నుచున్, పూనుచున్' ఇత్యాదౌ నైతత్కార్యమితి జ్ఞేయమ్. 'అలవరించి' ఇత్యాదౌ 'నహి స్వాఙ్గం స్వవ్యవధాయకమ్' ఇతిన్యాయేన బిన్దునా వ్యవధానేఽపి ఇతో లం శ్స్యాదితి తద్వ్యావృత్త్యర్థ ముపధాత్మన ఇతి విశేషణమ్.

వి:- తస్య - స్యాత్ - చ - పూర్ణబిన్దుః - అపి - అని ఛేదము. తస్య - అనుదానికిఁ బూర్వసూత్రముచే నుత్వలోపము చేయఁగా మిగిలిన వ్యంజననకారమున కీబిందువు కల్గును. పై విధమున నుత్వలోపము కల్గినపిదప మిగిలిన వ్యంజననకారమునకు ద్రుతసంజ్ఞయున్నను దద్విశిష్టము పదము కానందున ద్రుతప్రకృతికము మాత్రము కాదు. - 'అనుచున్ - అన్చున్-అంచున్' అని శత్రర్థమునను - మనుచున్ - మన్చున్ - మంచున్-అని ప్రేరణార్థమునను రూపత్రయము

సిద్ధించును 'అలవరించి' అనుదానికి "చొరేరుపధాత్మనశ్చ" అను చొప్పున రేఫముమీఁది ఇకారమునకు లోపము కల్గి 'అలవర్చి' అని యగుననియు 'తనయవయవము తన కడ్డు తగులదు' అనునర్థముగల 'నహి స్వాంగమ్' అనున్యాయముచే బిందువ్యవధానము తొలఁగుననియు 'అలవర్చి' అనురీతియనిష్టరూపవారణకై 'ఉపధాత్మనః' అను విశేషణము వేయఁబడినదనియుఁ గవిశిరోభూషణ మనుచున్నది. నిజమునకు 'అలవరించి' అనుదానికి 'అలవర్చి' అని కవిప్రయోగము కనుపడదు కావున నీలోప మిటరాదు. ఈసందర్భమును బురస్కరించుకొని కవిశిరోభూషణము సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధమగు నీన్యాయమును దెనుఁగువారి కెఱుకపఱిచినది.

సూరిగా రీవిషయమును "'చు' వర్ణంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందు వేని విభాష నగు" (బాల - క్రియ- 55 -సూ) అనివివరించిరి. శత్రర్థకప్రేరణార్థక చువర్ణములలో నేది పరమైనను నీకార్యము వచ్చునని సూరిగారియభిప్రాయము.

**58. సూ :- శబ్దా త్తచ్ఛబ్దాతః.**

58. సూ. :- శబ్దా త్కాఁప్వాదిశబ్దా త్పర స్యాదీత్యస్య అకారస్య వా లుక్స్యాత్. 'కాఁపుది, కాఁపది, బాపనది, బాపనయది, కోమటిది, కోమటియది, అట్టిది, అట్టియది, ఇట్టిది, ఇట్టియది' - ఇత్యాది.

వి :- శబ్దాత్, తచ్ఛబ్దాతః-అని ఛేదము. ప్రకరణబలముచే లోపము కల్గుననునర్థ ముపస్థిత మగును. "శబ్దా త్తచ్ఛబ్దాతః" అనుటచే 'అది, అవి' మున్నగుశబ్దములు పూర్వపదముతో సమసించునపుడు వాని 'అ'కారమునకు లోపము వికల్పమని యర్థము. 'అది'మున్నగువాని యకారమునకు లోపము కల్గినపుడు 'కాఁపు+అది=కాఁపుది' అనియు, లోపాభావపక్షమునందు నిత్యసంధికల్గి 'కాఁపది' అనియు నగును. మిగిలినవాని నిట్లే యెఱుంగునది. 'ది స్స్యా త్సప్ప్వన్తార్థే' అను సూత్రమున

(27)

కిచటఁ బ్రవృత్తి లేదు. 'కాఁపుది-కాఁపది' మున్నగువానికి శూద్ర జాతికిఁ జెందిన స్త్రీయని యర్థము. 'నాది, నీది' మున్నగువానికి 'నాయొక్క, నీయొక్క' అని యర్థము. కావున 'శబ్దాత్తచ్ఛబ్దాతః' 'ది స్స్యాత్స్వమ్యర్థే' అను రెండును విభిన్నవిషయములని యెఱుంగ వలయును.

సూరిగారీవిషయమును "అది యవి శబ్దములయత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు" (బాల-సంధి-45. సూ) అని వివరించిరి. సమాసమునఁగల్గు 'అది' మున్నగువాని 'అ'కారలోపమును, సంబంధార్థమునందు యొక్కషష్ఠి కాదేశముగ వచ్చు 'ది' వర్ణమును గలిపి వీరు చెప్పినారు. వీరిట్లు చెప్పుటకు 'బహుత్వే తు వివర్ణకః' అనునది మూల మని తోఁచుచున్నది. సూరిగారి 'నాది-నావి' అనునిట్టి యుదాహృతులు నన్నయాథర్వణసమ్మతములు కావు. 'బహుత్వే తు వివర్ణకః' అనునథ ర్వణవచనమునకు 'మావి' అని యుదాహరింపవలెను. 'మావి' అను దానికి 'మాయొక్క' అనియర్థము. 'నావి' అనుదానిలోని యస్మచ్ఛబ్ద మునకు బహుత్వము లేదు కావున నట్టియెడ 'వి' వర్ణకము వచ్చుట నన్నయాథర్వణసమ్మతము కాదు.

**59. సూ :— పోశ్చ తదాద్యర్థవాచకే షూతః.**

59. సూ. :- తదా-యదా-ఇదానీమ్ ముఖశబ్దవాచకా యేఽత్ర 'అపుడు' ఇత్యాదయః, తేషు యః పుకారః, తస్యోకారస్యచ వా లుక్స్యాత్. 'అప్డు, అపుడు, అప్పుడు, ఇప్డు, ఇపుడు, ఇప్పుడు, ఎప్డు, ఎపుడు, ఎప్పుడు' – ఇత్యాద్యుదాహరణమ్.

వి:— పోః, చ, తదాద్యర్థవాచకేషు, ఉతః—అని ఛేదము. ప్రక రణబలముచే లోపము కల్గు ననునర్థ ముపస్థితమగును. తదాద్యర్థవాచ కము లగు 'అప్పుడు' మున్నగు వానిలో నున్న–ప–కారమునకును, దదు త్తరవర్తి యగునుకారమునకును లోపము వికల్పముగా నగునని యర్థము. పకారమున కొకసారియు 'పకారోకారమున' కొకసారియు లోపము

కల్గును. 'అపుడు' అనునపుడు వకారలోపము, 'అప్డు' ఉకారవకారములు రెంటికిని లోపము. ఈరెండును వికల్పము కాన 'అప్పుడు' అని మఱి యొక రూపము నగును.

'కృత్యర్థే తూంత శ్చా నోః' అనుసూత్రము 'అన్యేషాఞ్చ ప్రయోగమహితానామ్' అనుసూత్రముచేతను 'చారేరుపధాత్మనశ్చ లుగ్వా స్యాత్' 'పాశ్చ తవాద్యర్థవాచకే ష్వాతః' అను రెండుసూత్రములును 'నలడాదే ర న్తరుతశ్చ' అను సూత్రముచేతను స్వరలోప విషయము నందు గతార్థములైన ట్లగపడుచున్నను "నలడాదేర న్తరుత శ్చాన్యే షాఞ్చ ప్రయోగమహితానామ్" అను రెండుసూత్రములును ప్రయోగానుసారముగాఁ దెలియఁ దగినవగుటచేతను, "చారేరిత్యాదులు పాక్షికస్వరలోపవిషయమున ధారాళప్రవృత్తి" గలవగుటచేతను ప్రత్యేకముగాఁ జెప్పఁబడినవని యెఱుంగ నగును.

ఈపై విషయములను మఱికొన్నింటిని గలిపి సూరిగారు ప్రకీర్ణపరిచ్ఛేదమున 'ఊయేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనం బొండె నగు' 'అకారంబుక్రింద అకారంబునకును దుది నులులక్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు' 'అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు' (బాల - ప్రకీర్ణము — 6 - 7 - 8. సూ) అని వివరించి యున్నారు. వీనిలోఁ గొన్నింటికిఁ బ్రాచీనప్రయోగములు లేకున్నను గొన్నింటికిఁ గలవు.

**60.** సూ:- ప్రథమావైభక్తికమో ర్బిన్దుశ్చ మహా న్వతిక్రియార్థేషు.

60. సూ. 1. పతిధాత్వర్థాభిధాయకశబ్దే పరే తు ప్రథమావిభక్తిర్వైవ వ్యవహృతస్య మువర్ణకస్య లుగ్వా స్యాత్. లోపాభావపక్షే బిన్దుశ్చ. తస్య మహాన్పూర్ణో వా స్యాత్. 'సంలోషపడి, సంతోషంపడి, సంతోషముపడి' ఇతి రూపాణి. ఏవం 'సంకటపడి, పదంపడి' ఇత్యాది బోధ్యమ్.

వి :- ప్రథమావైభక్తికమోః, బిన్దుః, చ, మహాన్, పత్క్రియార్థేషు-అని ఛేదము. పతిధాత్వర్థమును జెప్పుశబ్దము 'పడు' అనునది. అది పరమగునపుడు ప్రథమావిభక్తిసంబంధమగు మువర్ణకమునకు లోపమొకసారియుఁ బూర్ణబిందు వొకసారియు వికల్పముగా నగునని సూత్రార్థము. 'సంకటము+పడి=సంకటపడి సంకటంపడి, సంకటముపడి; సంతోషము+పడి=సంతోషపడి, సంతోషంపడి, సంతోషముపడి' మున్నగునవి యుదాహరణములు. ఇందు 'పదంపడి, పదపడి, పదముపడి' అనురూపము లగపడు చున్నవి. వీనికిఁ దరువాతనని యర్థము. ఇది శబ్దపల్లవ మనియు, దీని కీకార్యము వర్తింప దనియుఁ గొందఱనుచున్నారు. వీరియభిప్రాయముచొప్పున 'శబ్దపల్లవము లలో నీకార్యము కాదని యూహింప వలసి యున్నది. 'పదంపడి' అనునది శబ్దపల్లవము కాదు. ఈసూత్రముచేతనే యిచటఁ బూర్ణబిందులోపరూపకార్యములు వచ్చును.

'పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు' (బాల. సంధి. 46. సూ) అని సూరిగారు వివరించిరి. 'పత్క్రియార్థేషు' అను మూలము 'పడ్వాదులు' అని యనువదింపఁబడినది. పడ్వాదులలో పడు, పెట్టు అనునవి యుదాహరింపఁబడినవి. ఇట్లుదాహరించుట నన్నయాథర్వణులకు సమ్మతము కాదని మఁదున్న గ్రంథము చెప్పుచున్నది.

60 సూ. 2. "ఆదన్తపాదిశబ్దేతు పత్యర్థే బిన్దులోపకౌ
వర్ణక స్స్యాత్ర కథితౌ క్వచి త్సుకవిసమ్మతేః"

ఇత్యథర్వణోక్తౌ 'ఆదన్తపాది' ఇతి నియమాజ్ఞీకారాత్ సంతోషపెట్టితి రూపన్త్వసజ్గతమేవ. 'పరగు వీథులు పురి నూత్రపట్టినట్లు' ఇత్యాంధ్రకవితాపితామహః. అ, ఆత్, ఇతి ఛేదః. 'సంతోషపాటు' ఇత్యాది.

వి:- "పడుధాత్వర్థము వాచ్య మగుచుండఁగా నకారాంతాకారాంతములును, ప-కారాదులును నగు 'పడు, పఱుచు, పాటు'మున్నగు

శబ్దములు పరములైనచో మువర్ణకమునకుఁ బూర్ణబిందులోపములు మహాకవిప్రయోగసమ్మతి ననుసరించి యగును" అని యథర్వణకారికార్థము. ఈయథర్వణవివృతి ననుసరించి 'పడు' ధాత్వర్థకరూపములు పరము లగునపుడే మువర్ణకమునకు లోపపూర్ణబిందువు లగునని తేలుచున్నది. ఇది సన్నయాథర్వణుల సిద్ధాంతము. 'సూత్రపట్టినట్లు' అని యున్న కవితాపితామహునిప్రయోగము పైసిద్ధాంతమునకు విరుద్ధము. అయినను బాలవ్యాకరణము దీని నంగీకరించి యుదాహరించినది. 'సంతోసపాటు' మున్నగునవి యథర్వణవచనానుసారు లగుటచే సాధువులే యగును.

60. సూ. 3 :- నను 'సంతోషంపడి' ఇత్యాదౌ "తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్" ఇతి ప్రథమాత్వే సతి అనుస్వారస్య స్థానివత్త్వేన మువర్ణకాంతత్వే 'గసడదవాస్స్యుః ప్రథమామాత్రాత్' ఇతి పకారస్య వకారస్స్యాత్. ప్రథమామాత్రాదితి మాత్రగ్రహణాత్ లుక్యపి స్యాత్. నచ వాచ్యం స్థానివద్భావ ఆన్ధ్రవ్యాకరణే న ప్రసిద్ధ ఇతి. "క్వచిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవేత్" ఇత్యథర్వణోక్త్యా తత్ప్రసిద్ధేః. అన్యథా - 'గంగనుకాసె' ఇత్యత్ర స్థానివద్భావమన్తరా కథం దీర్ఘస్థానికస్య హ్రస్వస్య సంస్కృతీయతా సిద్ధ్యేదితిచేత్సత్యం. అకారవిధేరల్విధిత్వేన తదభావాన్నోక్తదోషప్రసక్తిః 'స్థానివదాదేశోఽనల్విధౌ' ఇతి పాణినీయసూత్రే 'అలి విధిః, అలా విధిః, అలో విధిః అలః పరస్య విధిః' ఇతి చతుర్ధా వ్యాఖ్యానమూరీకృతం పదశాస్త్రపారీణైః. తత్తత్రైవ ద్రష్టవ్యమ్. నచ లుక్యపి పకారస్య వకారః. మాత్రశబ్దస్య 'అప్పుడు దా వచ్చె, ఘటింపుచున్నాఁడు గదా' ఇత్యాది విషయత్వేన క్లృప్తత్వాత్. ఆదన్తపాదీత్యథర్వణోక్తిశ్చాప్యత్ర మానమితి సువచమ్. 'గంగనుకాసె' ఇత్యత్ర నాల్విధిరితి స్థానివద్భావేఽపి నోక్తదోష ఇతి విశేషః. 'సంతోసపడి' ఇతిరూపే తు పకారస్య వకారాదేశో భవత్యేవ. పకారశ్రుతిస్త్వథర్వణవచనాదితి జ్ఞేయమ్. 'సంతసంబు వడి దుర్వి నైవ్యోష్య లిప్తంబునన్' ఇత్యాచార్యః. హ్రస్వాత్పరత్వే నార్థత్వమపి స్యాదితి మహానితి విశేషణం దత్తమనుస్వారస్యాచార్యేణ.

వి:- సంతోషంపడి అనునపుడున్న 'పడు'ధాతువు ప్రాప్త్యర్థకమగుటచే సంతోషమునుబొంది అని దాని కర్థ మగును. 'సంతోషమును'

అనుచోట నున్న ద్వితీయావిభక్తికి 'ఇతరత్ర చ ద్వితీయా తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్' అనుచొప్పున ద్వితీయకుఁ బ్రథమ వచ్చి 'సంతోషముపడి' అనురూపము కల్గినది. ఆ ముపర్ణకమునకుఁ బూర్ణబిందువు కల్గి 'సంతోషంపడి' అని యైనది. ఇచటఁ గవిశిరోభూషణము సంస్కృతవ్యాకరణశాస్త్రప్రసిద్ధమగు స్థానివద్భావరూపచర్చను బెద్దగఁ జేయుచున్నది. అది నన్నయాథర్వణసమ్మతము కాదు. అయినను వినోదమునకుగానుండును గాన నావిషయ మిట వివరింపఁబడుచున్నది. 'సంతోషంపడి' అనునపుడు ముపర్ణత్వమును బిందువునందు స్థానివద్భావముచే సంపాదించినచో 'సంతోషం' అనునది 'సంతోషము' అనియగును. అపుడు 'గసడదవాస్స్యుః ప్రథమామాత్రాత్' అనుచొప్పున 'ప'కారమునకు 'వ'కారము ప్రాప్తించుచున్నది. మఱియు 'ప్రథమామాత్రాత్' అని మాత్రశబ్దముచే 'సంతోషపడి' అని ముపర్ణలోపము కల్గినయెడఁ గూడ గసడదవాదేశమునకుఁ బ్రాప్తి యున్నది. అని చెప్పుచు స్థానివద్భావమున కాంధ్రవ్యాకరణమునఁ బ్రసిద్ధి లేదని శంకింపరాదు. 'కుత్రచిత్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర చ్యుతో భవేత్' అను నథర్వణవచనమునం దది ప్రసిద్ధమై యున్నదని వచించినది. అట్లంగీకరింపకున్నచో 'గంగనుకాసె' అనుచోట దీర్ఘస్థానమున వచ్చిన హ్రస్వమునకు స్థానివద్భావము లేకున్న సంస్కృతీయత సిద్ధింపదని యును నాశంకించి సమాధానము దానికి వచించినది. నిజమున కిది యంతయు వినోదదాయక కల్పనమే. సంస్కృతీయ మనుదానికిఁ దత్సమమని యే యర్థము. సంస్కృతశబ్దమని యర్థము కాదు. కాఁగా 'గంగ' అనునదే సంస్కృతీయము. 'గంగా' అనునది సంస్కృతమే కాని సంస్కృతీయము కాదు. సంస్కృతీయప్రాణమనుదానికిఁ దత్సమస్వరమని యర్థమగునుగాన 'సిద్ధ' మున్నగువాని 'అ'కారము సంస్కృతీయమగును. 'సిద్ధన'మున్నగునవి దానియుదాహృతు లగును. 'గంగ' అనుదానియందు స్థానివద్భావముచేత సంస్కృతీయతను సంపాదింపవలసినయవసరము లేదుగదా!

ఇక శంకకుఁ జెప్పినసమాధానమును జిత్రమైనదే. అది సంస్కృతవ్యాకరణప్రసిద్ధము. స్థానివద్భావమును జెప్పినపాణినీయసూత్రము "స్థానివదాదేశో௨నల్విధౌ" అనునది "ఆదేశము స్థానివంటి దగును. కాని స్థాన్యల్లు నాశ్రయించినవిధి చేయునపుడు కాదు" అని దానియర్థము. ప్రకృతమున 'సంతోషంపడి' అనుచోటిబిందువు మువర్ణమునకు వచ్చిన యాదేశము. ఇది స్థానివంటిదగు ననఁగా బిందువు మువర్ణమువంటి దగు ననియర్థము. స్థానియగు అల్లు మువర్ణము కాన దాని నాశ్రయించిన పకారమునకు వకారాదేశము చేయునపుడును స్థానివద్భావము రాదని 'అనల్విధౌ' అను పర్యుదాసము చెప్పుచున్నది. కాన స్థానివద్భావము రాదని నిర్ణయించినది. గ్రంథవిస్తరహేతువులగు నీశంకాసమాధానములు ప్రకృతమున కెంతమాత్రమును సంబంధించినవి కావు. కాన నిది యస్థానసంరంభ మగును. 'సంతోషంపడి' అనునపుడు స్థానివద్భావము లేనట్లే 'సంతోషపడి' అనునపుడును స్థానివద్భావము రాదు. కాన, పకారమునకు వకారాదేశము రాదు. లోపపూర్ణబిందువులు కల్గినచోట నిజమైన ప్రథమాంతత్వము లేకున్నను సూత్రమున 'మాత్రాత్' అని యుండుటచే మాత్రశబ్దస్వారస్యముచే వచ్చునని చెప్పి, మాత్రశబ్దమునకుఁ బ్రయోజనము 'అపుడు దా వచ్చెన్' 'ఘటించుచున్నాఁడుగదా!' అను చోట గకారదకారములు వచ్చుట ప్రయోజనమని విశదపఱుపఁబడినది. 'ఆదంతపాది' అను నథర్వణనియమముచే గసడదవాదేశము వారింపఁబడినది. ఇంతగాఁ జర్చించియు 'సంతసంబు వడి దుర్విన్ వైశ్యులిష్టంబునన్' అనునాచార్యప్రయోగముచే పకారమునకు వకారాదేశము వచ్చుననియు, నథర్వణవచనముచే 'సంతోషవడి' అను రూపము సిద్ధించుననియు కవిశిరోభూషణము నిష్కర్ష చేసినది. ఈసందర్భమునందు వికృతివివేకము చింతామణికి వివరణమని యొకప్రక్క నంగీకరించుచునే మఱియొకప్రక్కను రెండును విభిన్నగ్రంథములని వ్యక్తము చేయుట వింతగా నగపడక మానదు. బిందు వగునని సామాన్యముగా

వచించినచో 'ప్రాస్వా తూర్వ్రోఽపి భవేత్' అని యర్ధబిందువును గల్గును. అది రాకుండుటకై 'మహాన్' అనువిశేషణము వేయఁబడినదని తెలియవలయును. 'సంతసంబువడిరి' అనుపాఠము నన్నపార్యసమ్మతమని నిశ్చయించుటకుఁ దగినయాధార మగపడనందున నిట గసడదవాదేశము రాదనియే నిశ్చయించుట లెస్స. 'సూత్రపట్టు' అనునది యథ ర్థ్వాణనియమమునకు సరిపడినను 'అవమాన పెట్టంగ, భంగపెట్టునే, జయపెట్టన్' అను కవిప్రయోగము లథర్వ్వాణనియమమునకును లోంగకున్నవి.

పత్రిక్రియార్థములకు సూరిగారు పడ్వాదులని పేరిడిరి. తెనుఁగునందున్న 'పడు' ధాతువు సకర్మకాకర్మకత్వములను గల్గియున్నది. అకర్మకపడుధాతువునకుఁ బతన మర్థము. సకర్మకమునకుఁ బ్రాప్తి యర్థము. ఈసూత్రమునందు సకర్మకప్రాప్త్యర్థక 'పడు' ధాతువునకే గ్రహణము. పతనార్థక 'పడు' ధాతువునకుఁ గాదు. కావున భయపడు - భయంపడు - భయముపడు - అనుచోట నున్నపడుధాతువు ప్రాప్త్యర్థకముగాన భయమును బొందు - అని దానికర్థము - గజము పడెనుమున్నగుచోట్లనున్న - పడు - అకర్మక మగుపతనార్థకము. దాని కీకార్యము రాలేదని తెలియవలయును. భయపడుమున్నగుచోట్లనున్న - భయము - మున్నగునది ద్వితీయార్థప్రథమయనియు నాధాతువున కది కర్మవాచకపదమనియుఁ దెలియనగును.

సూరిగారు - 'పడ్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాషనగు' అనిసూత్రించి వివరణములో 'ఈకార్యము కర్తృవాచిమువర్ణమునకుఁ గలుగదు' - అనివ్రాసిరి. రెంటికిని ఫలితము సమానమేకాని సూరిగారివివరణమువలన 'పడు' ధాతువునకుఁ గలసకర్మకాకర్మకభేదభావము స్పష్టపడదు.

**61. సూ :- షష్ఠ్యా ఉతోఽచి నుమ్వేచ.**

61. సూ. :- షష్ఠ్యేకవచనసమాసే ఉకారాన్తపదస్య నుమ్వాస్యా దచి. స ఇతి సమాసస్య సంజ్ఞా. 'సస్సమాసః'ఇతి ప్రాకృతవ్యాకరణసూత్రాత్. 'రాజునెదుట,

పాము నెమ్ములు, మోమునందము' ఇత్యాద్యుదాహరణమ్. 'తమసాధునియతిముద్దకొమరునెదన్' ఇతి ప్రయోగః. 'మోమందము' ఇత్యాది ప్రయోగస్త్వసాధురేవ. అత్రనమోమిత్యేనోదన్తావయవత్వాల్లుప్తద్రుతద్వితీయాయాః షష్ఠ్యర్థప్రత్యాయక ప్రతిబన్ధో నివార్యతే.

వి - షష్ఠ్యాః, ఉతః, అచి, నుమ్, సే, చ - అని ఛేదము. సమాసమునందు షష్ఠ్యన్తోకారమునకు స్వరపరకత్వమున ను మాగమమగునని సూత్రార్థము. 'రాజుయొక్క+ఎదుట' అనునపుడు 'షష్ఠీ భవే ద్వితీయా తుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్' తత్పురుష సమాసమం దున్నప్రాతిపదికములషష్ఠి ద్వితీయాతుల్య మగును-అను చొప్పున 'రాజున్+ఎదుట' అనియగును. ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' సమాసములలో నున్నద్రుతమునకు లోపము కల్గును—అను చొప్పున ద్రుతము లోపించి ప్రకృతసూత్రముచే నుమ్ము చేయఁగా 'రాజును+ఎదుట' అని యగును. సంధిచేయఁగా 'రాజునెదుట' అని యగును. ఇట్లే మిగిలినరూపములప్రక్రియ నెఱుంగ నగును. 'పాము యొక్క+ఎమ్ములు' అనునపుడు 'లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యాత్సమాసకాంగేషు' ఆచ్ఛికసమాసావయవము లగుశబ్దములవిభక్త్యాదులకు లోపము కల్గును-అనుచొప్పున విభక్తిప్రత్యయము లోపించి ప్రకృత సూత్రముచే నుమ్ము వచ్చి సంధిచేయఁగా 'పామునెమ్ములు' అను రూపము సిద్ధించును. మిశ్రతత్సమసమాసములయందును జ్ఞాపకసిద్ధములగుకొన్నియాచ్ఛికసమాసములయందును షష్ఠికి ద్వితీయాతుల్యత కల్గి ద్రుతము లోపించును. జ్ఞాపకసిద్ధములు కాక మిగిలిన యాచ్ఛికసమాసములలో "లోపశ్చ విభక్త్యాదేః" అనుచొప్పున విభక్తిలోపము కల్గునని తెలియనగుచున్నది. 'మోముయొక్క+అందము' అనునపుడు పై రీతిని 'మోమునందము' అనియగును. విభక్తిలోపము కల్గినపిమ్మట నుమ్ము చేయక సంధిచేసినచో 'మోమందము' అనురూప ముండును. నుమ్ము నిత్యమగుటచే నది రాని 'మోమందము' అనురూపము సాధువు

కాదను నభిప్రాయమును గవిశిరోభూషణము భంగ్యంతరముగా నుడువు చున్నది. 'మోముసందము' అనుదానిలో 'మోమున్' అనుచోట నున్నద్రుతము షష్ఠ్యర్థమును జెప్పుచున్నది. 'మోమందము' అనుదానిని సాధువుగ సంగీకరించినచో లోపించినద్రుతమునకు షష్ఠ్యర్థమును జెప్పు నిర్బంధము కల్గును. దానిని సాధువుగా నంగీకరింపకున్న నట్టి నిర్బంధము తొలఁగుచున్నది. కాన దానిని సాధువుగా నంగీకరింపరాదు—అని కవి శిరోభూషణము వ్రాసినదానియభిప్రాయము.

మోముయొక్క+అందము—అనునపుడు 'లోపశ్చ విభక్త్యాదేః' అనుచొప్పున విభక్తిలోపము కల్గి పిమ్మటఁ బ్రకృతసూత్రముచే నుమ్ము వచ్చి, 'మోముసందము' అనికావలసియున్నది. కాని - మోమందము- అని నుమ్ము లేని కవిప్రయోగ మగపడుటచే దానిసాధనకుఁ గవిశిరో భూషణము వక్రమార్గము ననుసరించినది. ఇచట నుమ్ము మిత్తగుటచే నుదంతమున కవయవమనియు, (మోము—అనుదాని కవయవమనియు) ఆనుమ్ము షష్ఠీవిభక్త్యర్థమున వచ్చినదనియు, నది లోపించినచో షష్ఠ్యర్థము రాదనియుఁ, గాన - మోమందము - అనునది సాధువు కాదని యభిప్రాయము — 'రాముఘనశ్యాముఁన్' అనునపుడు ద్రుతలోపము కల్గినను లుప్తద్రుతమునకు ద్వితీయార్థప్రతీతిప్రతిబంధము తప్పినదా? మోమందము—అనునది యర్వాచీనముకావున దాని నీసూత్రమునకు నుదాహరింపరాదని తలంపవలయును.

"సవిత్రునట్లు" (సభా - 1 ఆ. 161ప.) అను నన్నపార్యప్రయో గముసుబట్టి ఋకారమునకును నీనుమాగమము కల్గునుగాన నావిషయ మును సూరిగారు సంగ్రహించిరి. ప్రౌఢవ్యాకరణమును సంగ్రహించినది. (చూ. ప్రౌఢ — సమా — 38. సూ)

సూరిగారు 'షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పర మగునపుడు నుగాగమంబగు' (బాల—సంధి-34. సూ) అని వివరించిరి.

విధాత్రునానతి–మున్నగునది ఋకారోదాహరణము. ఋకారాంతములకు షష్ఠీ సమాసమున నుగాగమమును నన్నపార్యుఁడు ప్రయోగింపకున్నను దిక్క–నామాత్యుఁడుమున్నగువారు ప్రయోగించిరి. 'గోడుగీగి–దీపముట్లు–గోకుల మిల్లిల్లు–నిషధరాజంతవాని–మొదలగునవి. ప్రౌఢ వీనిని సాధించెను. 'సె' అనుదానికి సమాసమునందు అని యర్థము. సస్సమాసః – అనుచోప్పున స అనుదానికి సమాసమని సంజ్ఞ. సమాసమునందే ఈ నుగాగమ మగును. వ్యస్తతలో రాదు.

62. సూ :- ఆద్య స్యామ్రేడితేఽన్త్యలోపశ్చ.

62. సూ. :- శబ్దే అద్భుతాద్యర్థే ద్విరుక్తే సతి ఆద్యశబ్ద స్యాన్త్యవర్ణలోప స్స్యాత్. 'ఓహో హో – ఔరౌర – అన్నన్న – అయ్యయ్యో' ఇత్యాది. యద్యపి "ఆమ్రేడితం ద్విస్త్రి రుక్తం" ఇత్యమరవచనాత్ త్రిరుక్త స్యాప్యామ్రేడిత సంజ్ఞాఽస్త్యేవ. తథాపి తస్య ప్రయోగాభావా ద్ద్విరుక్తస్యేత్యుక్తమ్. ద్విరుక్త స్యాపి ప్రయోగేఽజాదిత్వమేవ. అచీతి పదానువృత్తి రత్ర మానమ్. 'తస్య పర మామ్రేడితమ్' ఇతి వ్యాకరణ మనుసృత్య 'ఆమ్రేడితే పరే' ఇతి వ్యాఖ్యేయమ్.

వి:-ఆద్యస్య, ఆమ్రేడితే, అన్త్యలోపః, చ–అని ఛేదము. ఆమ్రేడితము పరమగునపుడు తొలిపదముచివరస్వరమునకు లోపము కల్గునని సూత్రార్థము. 'తస్య పర మామ్రేడితమ్ =ద్విరుక్తముయొక్క–రెండవరూపమున కామ్రేడిత మని పేరు' అనుచోప్పున ఆమ్రేడితసంజ్ఞ. 'ఆమ్రేడితే' అనుటచే నామ్రేడితము పరమగునపు డని యర్థము. అజాద్యామ్రేడితము పరమగునపుడు పూర్వపదాంత్యస్వరమునకు లోపమగునని భావము. లోపమనఁగా నన్నయాథర్వణులమతమున సంధియని యర్థము. కొన్ని యెడల నదర్శనమనియు నర్థము. 'ఆమ్రేడితం ద్విస్త్రి రుక్తమ్' అనుచోప్పున ద్విరుక్తమునకుఁ ద్రిరుక్తమునకును నామ్రేడిత సంజ్ఞ కలదు కాని సంస్కృతవైయాకరణుల ద్విరుక్తామ్రేడితమునకే యిచట గ్రహణము. 'ఓహో+ఓహో = ఓహోహో, ఔర+ఔర= ఔరౌర, అన్న+అన్న = అన్నన్న, అయ్యో+అయ్యో = అయ్యయ్యో,'

మొదలగునవి యుదాహరణములు. 'అచ్చున కామ్రేడితము పరమగు నపుడు సంధి తఱచుగ నగు' (బాల. సంధి. 10. సూ) అనిసూరిగారివివరణము, 'తఱచుగ' అనుటచే ఏమి+ఏమి =ఏమేమి, ఏమియేమి" అని రెండురూపము లుండ నగునని వివరించిరి. (బాల. సంధి. 5. సూ.) "ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగ నగు" అని యీవఱకు 'ఏమి' శబ్దమునకు వికల్పసంధిని విధించియున్నారు. మరల నిచట నేమి శబ్దమునకు వికల్పసంధి కల్గుటకై సూత్రమున 'తఱచు' శబ్దము నుపయోగించిరి. ఇది వింతగ నగపడుచున్నది. ఏమి శబ్దమున కేమ్యాది సూత్రమే వర్తించును. తదితరములకు మిగిలినవి వర్తిల్లును గదా!

**63. సూ :- అహమాదీనాం ద్విత్వమ్.**

63. సూ. 1:- యోగ్యతాబలా దచీ త్యనువర్త్యాచా సహానుకరణ ఇతి లభ్యతే. వాక్యాన్తర్గతానా మహమాదీనాం పృథగ్భూతానా మన్త్యవర్ణస్య ద్విత్వం స్యాదనుకరణే. 'దాసోఽహమ్మని, జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెదు వాచారూఢి సత్యమ్మగన్' ఇత్యాద్యుదాహరణమ్. 'అహమ్మని' ఇత్యాది. అత్రాథర్వణేనోక్తమ్ -

"అన్త్యగస్య హలో ద్విత్వం భవే దనుకృతౌ పరే।
తత్రాచ్యుతో భవే న్నిత్య మత్ర తత్క్వాచి దిష్యతే" - ఇతి.

వి:— అహమాదీనామ్, ద్విత్వమ్-అని ఛేదము, 'అహమ్' మొదలగు శబ్దములు సంస్కృతసుబంతము లగుటచే వాని కీతెనుఁగునందు స్వతంత్రప్రయోగ ముండదు; అనుకరణమునం దైనచో నుండును. కాన అహమాదుల కనుకరణమున ద్విత్వము కల్గునని సూత్రార్థము. అనుకరణమునం దనుధాతువు పరమగునపుడు అహమాదుల తుదిహల్లునకే కాక పదముతుదినున్న హల్లునకును ద్విత్వము కల్గునని యథర్వణ వివరణమున కర్థము. అహమాదిమకారమునకే ద్విత్వము కల్గునని చింతామణి చెప్పియుండఁగ నట్లు మకారమునకే కాక పదము తుది నున్న హల్లుల కనుకరణమునందు ద్విత్వము కల్గునని వికృతివివేకము వివరించినది. చింతా

మణివికృతివివేకముల కిట్లవినాభావరూపసంబంధము వెలయుచుండ దానిం గవిశిరోభూషణము గుర్తింపకుండుట సమంజసము కాదు. ఈయథర్వణ కారికయందలి యుత్తరార్థము – "సామానాధికరణ్యే తూదన్తానాం టుగాగమోఽపి స్యాత్" అను చింతామణి కారికకు వివరణము సమానాధికరణేతరములకు నాయాస్థలములం దుకారమునకు స్వరపరకత్వమున నిత్యముగఁ బరరూపసంధి కల్గును. ఈసమానాధికరణసమాసమునందుఁ బరరూపసంధికార్యము కొన్నియెడలమాత్రమే సమ్మత మగుచున్నది–యని దానికర్థము. ఈయథర్వణకారికార్థమునకు 'అహమాదీనాం ద్విత్వమ్' అనుచోట సమన్వయము కుదురదు. 'తత్రాచ్యుతో భవే న్నిత్య మత్ర తత్క్వాచి దిష్యతే' అనుదానిలోని 'తత్ర' అనుదానికి సమానాధికరణేతరసమాసమునం దనియు, 'తత్' అనుపదమునకు 'పరరూపసంధి' అనియు, 'అత్ర' అనుదానికి 'సమానాధికరణసమాసమం' దనియు నర్థము చేయవలయును. 'తత్రోతో వుర్భవే న్నిత్య మస్య తత్క్వాచి దిష్యతే' అనుపాఠాంతరము వెలయుచున్నది. "ఉకారాంత నామమున కనుకరణమునందు –వు– వర్ణకం బగు" (బాల–సంధి–54 సూ) అని దానిని సూరిగారు వివరించిరి. అట్టివి మహాకవిప్రయోగ ప్రమితములు కానందువలన నుపేక్ష్యములని యెన్నవలయును.

63. సూ. 2 :– బాలసరస్వత్యా త్వత్ర అహమాదిశబ్దానా మన్త్యగస్యానుస్వారస్య ద్విత్వాయోగా త్తత్స్థానే మకారం కృత్వా తస్య ద్విత్వ మిత్యుక్తమ్. ద్వితీయాఽచార్యేణాపి –

శబ్దానా మన్త్యభాగేషు యోఽనుస్వారః ప్రదృశ్యతే
తస్యాఽపి పరతో మ స్స్యా త్సర్వత్ర కవిసమ్మతేః॥
కేచి ద్వద న్త్యభేదత్వ మనుస్వారమకారయోః –

ఇతిచోక్తమ్ సర్వత్ర సంస్కృతాన్ధ్రయోరిత్యర్థః. అనుస్వారమకారయో రభిన్నత్వాచ్చ మకారే పర ఏవ. 'కమ్మని లతాంతములకు మ్మొనసి వచ్చు మధుపమ్ములను' ఇత్యాచార్యస్యాపి ప్రయోగః.

వి:- అహం - అనుదానికి - అహమాదీనామ్ - అనుచోఁ ప్వాన ద్విత్వము రావలయునుగదా! సున్నకు ద్విత్వ మెట్లువచ్చును?-అని శంకించి బాలసరస్వతి 'సున్నకు మకారముచేసి ద్విత్వము చేయవలయును' అని యనెను. అథర్వణాచార్యులుగారును శబ్దాంతిమభాగమునం దనుస్వార మున్నయెడల దాని కనుకరణాచ్చు పరమైనచో మకారము వచ్చును; ఇట్లు వచ్చుట మహాకవిసమ్మతము - అని చెప్పి, మఱికొను అనుస్వారమకారములకు భేదము లేదని కొందఱనుచున్నారు-అనియుఁ జెప్పియున్నారు.

63. సూ. 3 :- అత్రేయం చిన్తా - రామదాసోఽహమిత్యాది సంస్కృత వాక్యానాం హల్పరత్వాభావే మాంతత్వం నిర్వివాద మితి న తేషా మనుకరణే ఏతదావశ్యకమ్. కిన్తు - 'ఝుంఝుం' - ప్రముఖావ్యక్తానుకరణశబ్దానా మనుకరణేఽ ప్యస్య వినియోగ ఇతి బోద్ధ్యమ్. వ్యాఖ్యాయాం తథైవోదాహృతశ్చ. తేన 'ఝుం ఝుమ్మని, కిమ్మని' ఇత్యాది. నచ తేషామపి మాన్తత్వమ్. తథాత్వే బాధకాభావే ప్యథర్వణవచనస్య నిరాకర్తు మశక్యత్వాత్. నను కథం - 'కృపయాభోక్తవ్య మన్పల్కులన్, మరణేసతి కింభయ మనినచదువు చదువం బోలున్' ఇత్యాది ప్రయోగః—

"పదేతు తవ్యదాద్యన్తే వా ద్విత్వం హరిసమ్మతేః"

ఇత్యాథర్వణ వచనారూఢ హరికవిమతే సాధుః.

వి :- 'రామదాసోఽహమ్' అనుచోట హల్లు పరముగా లేనపుడు మాంతత్వమే యుండును. కావున నట్టివానికొఱకై యనుస్వారమునకు మకారము చేయుట మున్నగుకార్యములు చెప్పఁబడలేదు. కాని 'ఝుంఝుం' మున్నగు నవ్యక్తధ్వన్యనుకరణమునందును, కిం మున్నగువాని యనుకరణమునందును, 'రామేసుం' మున్నగు ప్రాకృతశబ్దానుకరణమందును గల బిందువునకు మకారము వచ్చుటకై యీసూత్రమావశ్యకమని తెలియనగును. 'తవ్యత్' మున్నగుప్రత్యయము లంతమునఁ గల శబ్దములయనుకరణమునందు ద్విత్వము వికల్పముగ వచ్చుట హరికవికి సమ్మతము-అని యథర్వణాచార్యులుగారు నుడివి

యున్నారు. కాన 'తత్కర్తవ్యమ్+అనె = తత్కర్తవ్యమ్మనె, తత్కర్తవ్యమనె' అని ద్విత్వము వికల్పముగా నగును.

ఈయనుకరణద్విత్వవిషయమునఁ జింతామణివికృతివివేకములు చెప్పిన 'అహామాదులను, దవ్యాదాదులను' గలగలుపుచేసి సూరిగారు, 'అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు (బాల. సంధి. 52. సూ) అనుకరణంబునం దహామాదులమకారమునకు ద్విరుక్తి విభాషనగు' (బాల. సంధి. 53. సూ) అని వివరించియున్నారు.

64. సూ :- లోపో నమఆదికే విసర్గస్య.

64. సూ. 1 :- అత్రాప్యనుకరణ ఇతి లభ్యతే. నమఆదీనా మన్త్యభాగే యో విసర్గ స్తస్య లోపస్స్యా దనుకరణే - 'రామాయ నమోనమ యని - రామ స్స్వహాయ యని' ఇత్యాద్యుదాహరణమ్. 'ధర్మ స్స్వహాయని' - ఇత్యాదౌ సన్ధి రాథర్వణే ప్రసిద్ధః. 'రామేషని' ఇత్యాదౌ వైకృతాచా సహ సన్ధిః ప్రసిద్ధఏవ.

వి :- లోపః, నమఆదికే, విసర్గస్య - అని ఛేదము. 'నమః' మొదలైన శబ్దములవిసర్గమున కనుకరణమునందు లోపము గల్గునని సూత్రార్థము. 'ధర్మ స్స్వహాయః' అనునపుడు విసర్గమునకు దీనిచే లోపము గల్గి పరరూపసంధి చేయఁగా 'ధర్మ స్స్వహాయని' యగుచున్నది. విసర్గలోపప్రసక్తి లేనిచోటను బరరూపసంధి కల్గును. - 'రామేషు+అని = రామేషని' - అని యగును. 'ఇయం ధేనుః+అని= ఇయంధేను వని, రామేషువని, మున్నగురూపములు సూరిమున్నగువారి మతమునఁ గల్గుచున్నవి. ఇట్టియుపరూపములకు - "తత్రోత్తో వుర్భవే న్నిత్య మత్ర తత్క్వాచి దిష్యతే" -అను నథర్వణకారికావళ్యపపాఠము మూలమని తెలియనగును. ఈపాఠము ననుసరించి కొందఱాధునిక కవులు ప్రయోగమును జేసియున్నారు. అవియు నివియుఁ గూడ నిర్మూలములే యని యూహింపవలయును.

64. సూ. 2 :- అత్ర నృసింహేనోక్తమ్ 'హరయే జితమురుదరయే' ఇత్యాది రామాభ్యుదయపద్యే 'దేవదేవాయ నమో' ఇతి ప్రయుక్తమ్, అత్ర- 'నమో' - ఇత్యోదన్త మవ్యయమ్. యద్యప్యథర్వణగ్రన్థే -

"నమశ్శబ్దవిసర్గస్య లోప ఓత్వ మపీష్యతే" ఇత్యుక్తమ్. తథాపి శుద్ధసంస్కృతే తదయోగాత్పృథగవ్యయమేవేతి జ్ఞేయమ్. వైకృతపదప్రయోగే సత్యనుకృతౌ ఓదన్తావ్యయస్య ప్రయోగో నాస్తీతి జ్ఞాపయ త్యాథర్వణ మోత్వవిధానమ్. అన్యథా ఫలైక్యే సత్యోత్వవిధానం వృథా స్యాదితి. తేన 'హరయే జితమురుదరయే' ఇత్యాది పద్యేషు తస్య ప్రయోగేఽపి 'పాశహస్తాయ నమోనమో యనుచు దక్షతవారికి మ్రొక్కి వెండి యున్' ఇత్యాదా వోత్వమేవేతి నిర్ణయ ఇతి. వస్తుతస్తు ఓదన్తావ్యయస్య కుత్రచిద్వ్యవహారాభావా ద్రామభద్రకవిపద్యే విసర్గాన్తఏవ నమశ్శబ్దః. అనుకరణే త్వాథర్వణ మోత్వం వైకల్పిక మిత్యేవం నిష్కర్షః.

వి:- 'దేవదేవాయనమో' అనురామాభ్యుదయపద్యమునందలి 'నమో' అనునది యోదంతావ్యయ మని నృసింహుఁడు వచించెను. 'నమశ్శబ్దవిసర్గమునకు లోపము నోత్వమును గల్గును' అని యథర్వణాచార్యులు వచించిరి. విసర్గలోపము వచ్చినపుడు నమ యనియు రానపుడు నమో యనియు నుండును. అథర్వణాచార్యులుగా రిట్లు వచించినను శుద్ధసంస్కృతమునం దోత్వలోపములు సంభవింపవు గావున 'నమో' అనునది పృథగవ్యయమని యంగీకరింపవలయును. వైకృతపదముతో ననుకరించినపు డోదంతావ్యయమునకుఁ బ్రయోగము లేదని యథర్వణుని యోత్వవిధానము జ్ఞాపనము చేయుచున్నది. ఇట్లగ్రహము చేయకున్న ఫలభేదము లేనందున నోత్వవిధానము వ్యర్థ మగుచున్నది గదా! రామాభ్యుదయపద్యమునం దోదంతావ్యయమునకుఁ బ్రయోగ మున్నను 'పాశహస్తాయ నమోనమో యనుచు' మున్నగుచోట్ల నోత్వమే యని నిర్ణయింపవలసియున్నది గదా! నిజ మాలోచింపఁగా నోదంతావ్యయమున కెచటను బ్రయోగము లేనందున రామభద్రకవి పద్యములోనిది విసర్గాంతమగు నమశ్శబ్దమే యనియు ననుకరణమునం దాథర్వణోత్వము వికల్పమనియు నిష్కర్ష చేయవలయును.

'నమః' మున్నగుశబ్దముల విసర్గమున కేకారక యెల్లశబ్దముల విసర్గమునకును ననుకరణమున లోపము కల్గునని 'విసర్గంబున కనుకరణమున లోపంబగు' (బాల-సంధి-50. సూ) 'అనుకృతిని నమశ్శబ్దము తుదియత్తున కోత్వము విభాష నగు' (బాల-సంధి-51. సూ) అనియు సూరిగారీపై విషయములను వివరించిరి.

**65. సూ:-పరుషా ద్రుతప్రకృతికా త్సరళాస్స్యు స్తద్ద్రుతఞ్చ బిన్దుస్స్యాత్.**

65. సూ. :- ద్రుతప్రకృతికేభ్యః పరే పరుషా స్సరళాః క్రమా త్స్యుః. తద్ద్రుతస్యచ బిన్దు స్స్యాత్. 'రాముఁగొలిచెద, మిగులఁజక్కనివాఁడు, వచ్చెఁదక్కరి, రాముఁ దండ్రిగ భావింతు, అతనిం బరమపావను భజింతున్' ఇత్యాద్యుదాహరణమ్.

వి — పరుషాః, ద్రుతప్రకృతికాత్, సరళాః, స్యుః, తద్ద్రుతమ్, చ, బిన్దుః, స్యాత్ – అని ఛేదము. 'కచటతప' అను వర్గప్రథమాక్షరములకుఁ బరుషములని పేరు, ప్రకృతి సిద్ధముగ ద్రుతాంతమైన పదమునకు ద్రుతప్రకృతిక మని పేరు. 'గజడదబ' అను వర్గతృతీయాక్షరములకు సరళములని పేరు. అనుస్వారమునకు (సున్నకు) బిందువని పేరు. ద్రుతప్రకృతికమున కవ్యవహితపరముగ నున్నపరుషములు సరళము లగును. ఆద్రుతమునకు బిందువు వచ్చును-అని సూత్రార్థము. ద్రుతమని పొల్లు (వ్యంజన) నకారమునకుఁ బేరు. ఇది నాదప్రయత్నవంతము. దీనితాకిడిచే శ్వాసప్రయత్నవంతములగు 'కచటతప' అనునవి నాదప్రయత్నముగల 'గజడదబ' లుగా మాఱుపాటు నొందుచున్నవి. 'మిథ స్సవర్ణాశ్చ' అనుటచే దంత్యతాలవ్యచజలు సవర్ణములుగానఁ దాలవ్యములకు విధించినకార్యము దంత్యములకు నగును. 'రామున్+కొలిచెదన్ = రామున్ గొలిచెదన్' – (రామున్గొలిచెదన్) అని యగును. బిందువు పూర్ణార్ధభేదముచే ద్వివిధముగాన –'హ్రస్వాత్పూర్ణోఽపి భవేత్' – అనుచొప్పునను – "తద్ద్రుతఞ్చ బిన్దు

స్యాత్" – అనుచోప్పునను బూర్ణార్ధబిందువులతో 'రాముఁగొలిచెద, రాముంగొలిచెద' అని రెండురూపములు సిద్ధించును. ద్రుతప్రకృతికమునకుఁ బరమైనపరుషములకు సరళములు నిత్యములనియు, బిందువు వికల్పమనియుఁ దెలియుచున్నది. కాఁగా 'రాముఁగొల్చెద, రాముంగొలిచెద' అని బిందుద్వయముతో రెండురూపములును, బిందువు రానపుడు 'రామున్గొల్చెద' (రామున్గొల్చెద) అని యొకరూపమును మొత్తము మూఁడురూపములు కల్గునని తెలియుచున్నది.

సూరిగారు 'ను' అనుదానిని ద్రుతమనియు ద్రుత మంతమందుఁ గల పదములు ద్రుతప్రకృతికములనియుఁ జెప్పిరి. (బాల – సంజ్ఞ–11, 12. సూ) – 'ద్రుతప్రకృతికముమీఁదిపరుషములు సరళము లగు" – (బాల – సంధి – 16. సూ.) అనియు–"ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు" – (బాల – సంధి – 17. సూ) అనియును జెప్పి 'పూచెఁగలువలు, పూచెంగలువలు, పూచెన్గలువలు, పూచెనుగలువలు' అని నాల్గురూపములు కల్గునని యుదాహరించినారు. ఇట్టిపిరియూహ కాధార మగపడదు. అట్లుదాహరించుట శాస్త్రీయమును గాదు. ఉత్స్వరసహితనకారమును ద్రుతముగా నంగీకరించుటచే నాదశ్వాసములకు సంయోగమే యుండదు. అట్టిచోఁ బరుషములు సరళములుగా మార్పుచెందుట దుర్ఘటము. అట్లు ప్రవచించుట యశాస్త్రీయమని యెఱుంగునది.

**66. సూ :– అవికారగతే తస్మిన్నపి సరళా ఏవ సన్తి తే పరతః.**

66. సూ. 1 :- తస్మిన్నకారే అవికారగతే బిందుత్వమప్రాప్తేఽపి తే పరపరుషాస్సరళా ఏవ స్యుర్నతుపరుషాః. 'సీతన్గొల్చెదన్, రామున్దలఁచెదన్' ఇత్యాద్యుదాహరణమ్. అత్ర నకారస్య స్వత్వసంశ్లేషా వుభావపి సంభవత ఏవ. యద్యపి వర్తమానరీత్యా అథర్వణమతే పరుషే పరతః శ్లిష్టత్వం న సమ్భవత్యేవ. తథాపి ప్రాచీనకాలే స్వత్వసంశ్లేషయోః స్వరకస్థిరవర్ణయోః తరత శబ్దానుశాసనేన విహితత్వాత్.

పరుషేష్వపి సరళస్థానిషు 'భారతీవంశవివర్ధనుం ద్రిదశవందితు, విజయుం బోలితి సద్గుణంబుల' ఇత్యాదా వాచార్యస్యాపి ప్రయోగే బిందుసంశ్లేషయో రుభయోరపి శ్రుత్యఙ్గీకారే బాధకాభావా దన్యకవిప్రయోగాచ్చ తదపి తస్యేష్టమేవేతి ప్రతిభాతి.

వి :— అవికారగతే, తస్మిన్, అపి, సరళాః, ఏవ, సన్తి, తే, పరతః—అని ఛేదము. ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు రూపవికారము కలుగకున్నను బరుషములకు సరళములు నిత్యముగా నగునని సూత్రార్థము. ద్రుతప్రకృతికమునకుఁ బరముగా నున్న పరుషములకు సరళాదేశమును, నాద్రుతమునకు బిందువును జెప్పి, బిందువు రాకున్నను బరుషములు సరళములే యగునని చింతామణి చెప్పుటచేఁ బరుషములకు సరళములు నిత్యమనియు ద్రుతమునకు బింద్వాదేశము వికల్పమనియుఁ దెలియుచున్నది. బిందువు రానపుడు స్వత్వసంశ్లేషములు రెండును వచ్చునని కవిశిరోభూషణము వ్యాఖ్యానించినది. అథర్వణుని మతమునకును నన్నపార్యుని మతమునకును భేద మున్నట్లు వివరించినది. అది సరికాదు. చింతామణికి వికృతివివేకము వివరణగ్రంథ మగుటచే నారెంటికిని మతభేద ముండదు. బిందువు రానపు డథర్వణవివరణము చెప్పిన స్వత్వసంశ్లేషములు వచ్చు ననుటయే సమంజసము. స్వత్వసంశ్లేషములకు నామభేదమే కాని రూపభేద మించుకయు లేదు. 'సీతన్గొల్చెదన్ (సీతన్గొల్చెదన్) రామున్దలఁచెదన్ (రామున్దలఁచెదన్)' అని యుదాహృతులు. మనము వ్రాయుటలో భిన్నమార్గము గోచరించును. నిజమున కచటిసంయోగమును గలుపుటయు మానుటయుమాత్రమే కలదుగదా ! ఇది యిటీవలఁ గలిగినభేదమని తోఁచుచున్నది. కావుననే చింతామణి దానికి నామకరణము చేయలేదు. 'సీతన్ కొలిచెదన్-రామున్ తలఁచెదన్' మున్నగురీతిరూపము లుండవని చింతామణివికృతివివేకములు రెండును నంగీకరించినవి.

**67. సూ :— గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్మాన్మదో ర్వినై వైతే.**

67. సూ :— ప్రథమామాత్రా త్పరే ఏతఏవ పరుషా గసడదవా స్స్యుః

క్రమశః. ఆత్మన్శబ్దాభ్యాం తు ఏతే న స్యుః 'సిరి గలవాఁడు, దానము సేయున్, ఒరుఁడు దక్కులఁ బోవున్, తనయిల్లు దామరతంపర, నిజము వల్కెన్' ఇత్యాద్యుదాహరణమ్. ఆత్మాస్మచ్ఛబ్దాభ్యాం తు 'తాఁజెప్పెన్, నేఁజగిలితిన్' ఇత్యేవ. ప్రథమా మాత్రా దిత్యత్ర యథాకథఞ్చిత్ ప్రథమాతుల్యానామపి గ్రహణమ్. మాత్రశబ్దః కార్త్స్న్యార్థకః - 'మాత్రం కార్త్స్న్యేఽవధారణే' - ఇతి నామలిఙ్గానుశాసనాత్. తేన 'అతఁడు ఘటింపుచున్నాఁడు గదా' ఇత్యాదిరూపం సిధ్యతి. అత్ర యథాకథఞ్చిత్ ప్రథమాతుల్యత్వే దుజన్తత్వం ప్రథమాసామానాధికరణ్యఞ్చ ప్రయోజకమ్. 'అప్పుడు చనియెన్, ఇప్పుడు దా వచ్చెన్' ఇత్యాదిషు మధికరణార్థత్వేఽపి 'సర్వస్య త్రిసమస్య చ సులోపః' ఇతి సులోపే ప్రథమాసమత్వ మక్షతమ్. 'అవ్యయా దాప్సుపః' ఇతిసూత్రం 'సర్వత్రోత్సర్గతః సుః ప్రవర్తతే' ఇతి సిద్ధాన్తఖ్యాపనపరత్యా "సర్వస్య త్రిసమస్య చ సులోపః" ఇత్యసూత్రి.

వి:- గసడదవాః, స్యుః, ప్రథమామాత్రాత్, ఆత్మాస్మదోః, వినా, ఏవ, ఏతే—అని ఛేదము. ఆత్మాస్మచ్ఛబ్దములు తప్ప మిగిలిన ప్రథమామాత్రముకంటెఁ బరమైన కచటతపలకు గసడదవలు వచ్చునని సూత్రార్థము. ఆత్మాస్మచ్ఛబ్దము లైనను ప్రథమైకవచనము లేయందుఁ బర్యవస్తము లగుటచే వానికి మాత్రమే గసడదవాదేశము రాదు. వానిబహువచనములమీఁద నున్నపరుషములకు గసడదవలు రావచ్చును. తాను-నేను శబ్దముల నువర్ణమునకు స్వరలోపము కల్గిన పిమ్మట నవి ద్రుతప్రకృతికములై ద్రుతకార్యముల నందుచున్నవి. 'ప్రథమామాత్రాత్' అని మాత్ర శబ్దమును జెప్పుటచే 'ఘటించుచున్నాఁడు గదా' మున్నగుచోట్లఁ గ్రియలమీఁద సయితము గసడదవాదేశము రావచ్చునని వ్యాఖ్యానింపఁబడినది. సత్వఘటితరూప మప్రసిద్ధ మగుటచే 'ఘటింపుచున్నాఁడుగదా' అని యుదాహరించుట సరికాదు. 'అప్పుడు, ఇప్పుడు' మొదలైనవి యధికరణవాచక శబ్దములు. వీని నవ్యయములని యందురు గాని యట్లనుట సరికాదు. సంస్కృతావ్యయములు తెనుఁగునకుఁ దత్సమములుగా రావు. తెనుఁగునం దవ్యయములే లేవుగదా! కొన్ని సంస్కృతావ్యయములకు విభక్తు లన్నియుఁ జేరును.

కాన వీనిని ప్రథమాంతములనుట కెట్టియభ్యంతరమును లేదు. వీనిపైఁ బరుషములకు గసడదవాదేశము వచ్చును, సంస్కృతావ్యయములు గాని, యవ్యయీభావసమాసములుగాని, తత్సమముగ నవ్యయరూపమునఁ దెనుఁగులోనికి రావని నన్నయాథర్వణుల సిద్ధాంతము. 'అపుడు ఇపుడు' అనువాని నధికరణశక్తిప్రధానావ్యయములుగాఁ గవిశిరోభూషణము చెప్పుట సరికాదు గదా! అవి ప్రథమాంతము లగుటచే వాని మీఁది పరుషములకు గసడదవాదేశము వచ్చినది గాని మాత్రశబ్దగ్రహణస్వారస్యముచేత వచ్చినది కాదు. 'తాను, నేను' అనువాని నకారస్వరమునకు లోపము కల్గినపుడే యవి ద్రుతప్రకృతికము లగును. స్వరలోపము రానపు డవి ద్రుతప్రకృతికములు కావు. వానిపై నున్న పరుషములకు గసడదవాదేశమును రాదు. 'తానుసెప్పె, నేనుసెప్పితి' అనురీతిరూపములు తెనుఁగునం దగపడవు. 'ఏను విదప' అని నన్నపార్యునిప్రయోగ మున్నదని ప్రాసప్రయోగమును గొంద ఱుదాహరించుచున్నారు. అది యర్వాచీనప్రక్షిప్తపాఠము. అచట 'ఏను వెనక' అని పాఠాంతరముగా నగపడుచున్నదే నన్నపార్యప్రయుక్తము. ప్రాచీనకాలమునం దీగసడదవాదేశము నిత్యము. కావుననే చింతామణి నిత్యముగ విధించియున్నది. భారతమున నన్నయ్యగారు గసడదవాదేశమును నిత్యముగనే చెప్పియున్నను వికృతివివేకకాలమునాఁటి కది లేఖకప్రమాదమువలనఁ బలురీతుల గోచరించి ప్రాచీనప్రయోగమును నిర్ణయించుటకు వీలుకాని స్థితికి వచ్చినది. కావున నథర్వణాచార్యులుగారును దన నాఁటికిఁ బ్రసిద్ధములై యున్నపలుమతములను బ్రదర్శించి యనిశ్చితముగా నొకపద్ధతిని సూచించి విడిచిరి.

68. సూ :— న వికృతిశబ్దాత్పరత స్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః.

68. సూ. 1 :- వికృతిశబ్దాత్సంస్కృతసమవ్యతిరిక్తశబ్దాత్పరత స్సాంస్కృతికానాం సంస్కృతశబ్దాదిగతానాం పరుషాణాం గసడదవా న స్యుః. 'దొర

కరుణించెన్, సిరి చంచలము, మాయయ్య టంకాయుధుఁడు, నాకల్ప తోయాధిపతి, వీఁడు పావనుఁడు' ఇత్యాద్యుదాహరణమ్. సంస్కృతసమా త్సాంస్కృతికానా న్తు భవత్యేవ 'రాముఁడు గరుణించెన్' ఇత్యాది. సంస్కృతసమాత్పరస్య శుద్ధాన్ధ్రపదస్య తు తత్ప్రాప్తి ర్నిర్వివాదైవ - 'సత్యము వల్కెన్' – ఇత్యాది.

వి :— న, వికృతిశబ్దాత్, పరతః, సాంస్కృతికానాం, భవన్తి, గసడదవాః — అని ఛేదము. వికృతిశబ్దమునకుఁ బరముగా నున్న తత్సమశబ్దాదిమపరుషములకు గసడదవలు రావని సూత్రార్థము. సంస్కృతసమములకుఁ బరమైన సంస్కృతసమాదిమపరుషములకు గసడదవ లగును. సంస్కృతసమమునకుఁ బరమగు శుద్ధాంధ్రపదాదిపరుషములకు గసడదవాదేశప్రాప్తి నిర్వివాదమే - యని యీకవిశిరోభూషణ సారాంశము. వీని కన్నింటికి నుదాహరణములు మూలమునఁ గలవు.

ఈకవిశిరోభూషణవ్యాఖ్య ప్రాచీనకవిలాక్షణికమతమునకు విరుద్ధమని కొందఱు పెద్ద లనుచున్నారు. నన్నయాథర్వణులమతమునం దీ గసడదవాదేశము నిత్యమైనను బాలసరస్వతి మొదలు బాలవ్యాకరణము వఱకు నున్నవ్యాఖ్యాత లందఱు నొక్కరీతిగనే బహుళమని వ్యాఖ్యానించియున్నారు. దాని కాధార మగపడదు. సూత్రములోని వికృతిశబ్దమున కచ్చతెనుఁగుశబ్దమని యర్థముచేసి దానికిఁ బరమైనతత్సమశబ్దాదిమ పరుషములకు గసడదవ లెంతమాత్రమును రావని యర్థము చేసిరి. 'ఎంతగుమతులైన' అనుతిక్కనసోమయాజి ప్రాసప్రయోగమును బట్టి యట్టి వ్యాఖ్య సరికాదని తెలియుచున్నది.

న వికృతిశబ్దాత్ =వికృతిచిహ్నము చేరనిశబ్దమునకుఁ బరమైన సాంస్కృతికశబ్దమునకు గసడదవలు నిత్యముగ నగును-అని యర్థము చేయుట ప్రాచీనుఁ డగు నన్నపార్యునకు సమ్మతము కానోపు ననియు నట్టిప్రాచీనప్రయోగము లున్నట్లు కొన్నినిదర్శనము లగపడుచున్నవ నియు — వ్యా - సం — స. - చెప్పుచున్నది. 'మందయాన గామనీయ

శము, మందయాన ననుదెంచెన్' మున్నగునవి యుదాహరణములు. ఇట్టియెడ గసడదవాదేశము నిత్యమని తాత్పర్యము.

68. సూ. 2 :- నన్వేవం చేత్ అఖిలభువనములలోన వారణనగరి పురమతల్లి ఇత్యాద్యా న్స్వారస్యాదికవిప్రయోగాః కథం సఙ్గచ్ఛన్త ఇతిచే దథర్వణోక్త్యా తత్సాధుత్వ మవేహి. తద్గ్రన్థే తు—

పరుషా వా స్వరూపేణ ప్రథమాన్తోపరి స్థితాః

కాకా సమ్బోధనే చాఽపి హ్యవ్యయే కర్మధారయే

అచేతనార్థకే శబ్ద ఇతి శృఙ్గారభూషణః

ఇతి సంస్కృతాసంస్కృతసాధారణ్యే నార్థవిశేషే వికల్ప ఉక్తః. నినుఁగొనియాడ శక్యమగునే తాపసమందార, ..దాపసమందార, రామా కొనియాడెద నిను, గొనియాడెద నిను, రామ తమాలనీల, ...దమాలనీల. రామ చిరంతనోక్తినుత, ... నిరంతనోక్తినుత, రామసంసారభీతుండనైనకర్కుశు నను, గర్కుశు నను,.. నీదుపదభక్తి పటువు,.... వటువు, ఇత్యాద్యుదాహరణమ్.

వి:- అఖిలభువనములలోన్, అవారణన్, నగరిపురమతల్లి —అని రామాయణార్థమునందు ఛేదము. అఖిలభువనములలోనన్, వారణనగరి పురమతల్లి-అని భారతార్థమున ఛేదము. 'వారణనగరి + పురమతల్లి' అనునపుడు పరుషమగు పకారమునకు వకారాదేశము రాలేదు. ఇది యెట్లు సిద్ధించునని శంకించి యథర్వణవచనముచే దానిని సాధించుకొనవలెనని కవిశిరోభూషణ మనుచున్నది. చింతామణిమతమున గసడదవాదేశము నిత్యముకానఁ దన్మతమునం దది కుదురదనియు, నథర్వణమతముచొప్పున సాధింపనగుననియుఁ గవిశిరోభూషణాశయము గోచరించుచున్నది. గసడదవాదేశము నన్నపార్యునినాఁటికి నిత్యముగనే యున్నను నథర్వణాచార్యులుగారినాఁటికి మతభేదము లధికముగ నేర్పడినవి. అవి నన్నపార్య భారతసమ్మతములు కావు. అవి యీక్రిందఁ బొందుపఱుఁబడుచున్నవి. అ, ఆ, మొదలగు కాకాదిస్వరములమీఁదను, సంబోధనప్రథమావిభక్తి మీఁదను, అవ్యయములమీఁదను, గర్మధారయసమాసమం

దును, జడవాచకశబ్దముమీఁదను నిల్చిన కచటతపలు ప్రథమావిభక్తిపై నిల్చినచో గసడదవలు వికల్పముగా నగునని శృంగారభూషణునిమతము. తత్సమ ప్రథమాంతము మీఁది పకారము వకారము కాదు, కాని యతియందు వికల్పముగ నగునని కొందఱును, యతిప్రాసములు రెంటియందును వికల్పమని కొందఱును వచించుచున్నారు. యతియందు నిత్యముగా వకారము పకారమున కగునని మఱికొందఱు నుడువుచున్నారు. వికృతిశబ్దప్రథమావిభక్తిమీఁద నిల్చిన సంస్కృతశబ్దాదిగతపరుషములు గసడదవలు నిత్యముగ నగుచున్నవి. ద్వంద్వసమాసముఁ దప్ప మిగిలిన సమాసములయందుఁ బ్రథమాసమములైన శబ్దములమీఁద నయితము గసడదవలు రావు. వ్యస్తతలోఁ బ్రథమాసమములమీఁదను బ్రథమావిభక్తిమీఁదను గలపరుషములు గసడదవలగును కావున హరికవి మతమున ద్వంద్వేతరస్థలమున వ్యస్తతయందే గసడదవ లగునని చెప్పఁబడినది. అథర్వణుఁడు వచించిన యీమతభేదములు బాలవ్యాకరణ కారాదులు చెప్పిన బాహుళకతకుఁ గారణములని యూహింపవచ్చును. శ్లేషకావ్యములలోఁ గొన్ని వ్యతిక్రమములు గల్గవచ్చునని పెద్దలు చెప్పియుండుటచేత 'వారణనగరి పురమతల్లి' మున్నగు చోట్ల గసడదవాదేశము లేకుండుట దోషము కాదు.

68. సూ. 3 :- కేచి దాద్యస్య పో వ స్స్యా న్న చ ప్రాసే యతౌ తు వా
కేచి ద్ద్వయో ర్వికల్పత్వం యతౌ సర్వత్ర కేచన"

ఇతి కేషాఞ్చిత్ప్రాచాం మత మాద్దీపితమ్. ఆద్యస్య సః సంస్కృత సమశబ్దసమ్బన్ధినః పకారస్యేత్యర్థః. కిఞ్చ —

"న వో గసదడా స్స్వపి పరుషాః ప్రథమాహితాత్
స్యు ర్భిన్నాదేవ తస్మాత్తే వినా ద్వంద్వం మతే హరేః" ఇతి చోక్తమ్.

వి:- తత్సమశబ్దముమీఁదనున్న పకారము ప్రాసమునందు మాత్రమే వకారము కాకుండుననియు, యతియందు వికల్పముగా నగునని

యుఁ గొందఱు చెప్పుచున్నారు. మఱికొందఱు యతిప్రాసములు రెంటియందును గసడదవాదేశవైకల్పికత నంగీకరించుచున్నారు. ఇంకఁ గొందఱు యతియందు నిత్యమని తలంచుచున్నారు – అని "కేచి దా ద్యస్య... కేచన" అనుదాని కర్థము. ఇది కేచిత్కారులమత మని తెలియుచున్నది. 'ఆద్యస్య పః సంస్కృతసమశబ్దసంబంధినః పకారస్యే త్యర్థః.' ఇచట సంస్కృతశబ్ద మనుదానికిఁ దత్సమశబ్ద మర్థమని చెప్పఁ బడినది. 'వికృతా త్పరుషాశ్చ స్యు స్సుర ఆద్యపదాదిగా' అనుపారము సరియైనదని వ్యా.సం.స. వచించినది. గ్రంథస్థపాఠమున కన్వయము లేదు. వికృతిశబ్దప్రథమాంతముకంటెఁ బరమైయున్న సంస్కృతసమశబ్దాది గతము లగుపరుషములు గసడదవ లగుచున్నవి. ద్వంద్వసమాసము నందుఁ బ్రథమ యనుటకు హితముకాని శబ్దమునకుఁ బరమైన పరుషము లకు గసడదవలు రావు. ఆకారణముచే హారికవిమతమునందు ద్వంద్వే తరస్థలములలో వ్యస్తపదముకంటెఁ బరముగా మాత్రమే యవి యగు నని 'వికృతాత్పరుషాశ్చ...మతే హారేః' అనుగ్రంథమున కర్థము. అథ ర్వణాచార్యులుగారు తననాఁటికే యీ యాదేశమునకు బాహుళ కత గలదని మతాంతరవ్యక్తీకరణపూర్వకముగా వచించిరని తోఁచు చున్నది.

68. సూ. 4 :– 'ఏషా తయో ర్వికృతిః' ఇత్యాన్ధ్రభాషామాత్రస్య వికృతి సంజ్ఞావత్త్వాత్ 'న వికృతిశబ్దాత్' ఇతి సూత్రేపి వికృతిపదేన సంస్కృతసమశబ్దమపి సంగృహ్య వ్యాఖ్యేయమితిచే త్సత్యమ్. న వికృతిశబ్దాదితి వికృతిశబ్దప్రయోగస్యా రస్యా దేవం వ్యాఖ్యాతమితి విచారయ. అన్యథా పూర్వసూత్రా త్ప్రథమామాత్రా దిత్యనువృత్త్యా–'సాంస్కృతికానాం న భవన్తీ'త్యే వాలం సూత్రమ్.

వి:– 'ఏషా తయో ర్వికృతిః' అనుచోప్పున నాంధ్రభాషామా త్రమునకు వికృతిసంజ్ఞ యుండుటవలన 'న వికృతిశబ్దాత్' అనుసూత్ర ములోని వికృతిపదముచే సంస్కృత సమశబ్దమునుగూడ సంగ్ర హించి వ్యాఖ్యానించినచో 'వారణనగరి పురమతల్లి' అనునది

సరియగును గదా యని శంకించి కవిశిరోభూషణమున 'న వికృతి శబ్దాత్' అనుదానిలోని వికృతిశబ్దస్వారస్యముచే నట్లు వ్యాఖ్యానింపఁబడినదిగాని మఱియొకటి కాదు. దీని నంగీకరింపకున్నచోఁ బూర్వసూత్రము నుండి ప్రథమామ్రేడితాత్ అనుపద మనువృత్తమగుచుండఁగా "సాంస్కృతికానాం న భవన్తి" అని సూత్రించినఁ జాలునుగదా యని వివరించినది. చింతామణి యనువృత్తిపద్ధతి నంగీకరింపదు గదా! ఇది యంతయుఁ బాండిత్యప్రకర్ష ప్రదర్శనమే యగును. - వారణాసగరిపుర మతల్లి - అనుచో గసడదవాదేశాభావమునకుఁ గారణము శ్లేషస్థల మగుటయేయని యీవఱకే వచింపఁబడినది.

బాలవ్యాకరణము మీఁదిచింతామణ్యథర్వణగ్రంథములను, వానికి భాష్యమగు కవిశిరోభూషణమును గ్రిందిరీతిని దెనుఁగున వివరించెను. 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు' (బాల. సంధి. 13 సూ.) "తెలుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు" (బాల. సంధి. 14 సూ.) "ద్వంద్వంబునం బదంబుపైఁ బరుషములకు గసడదవ లగు" (బాల. సంధి. 15 సూ.) త్రిలింగ లక్షణశేషము - తెలుఁగు శబ్దములమీఁద నున్న పరుషముల కన్నింటికిని గసడదవలు రాకపోవని, తెలుఁగుశబ్దముల మీఁది చతపలకు మాత్రము సదవ లగపడుచున్నవని కొన్నిప్రయోగములను జూపుచున్నది. ఆప్రయోగములను గావించినపండితకవులు 'న వికృతి శబ్దాత్' అనుసూత్రమునకు బాలవ్యాకరణకారాదులవలె నర్థము చేయలేదనియు, సిం దాసూత్రమునకు వ్రాయఁబడినయర్థమునే వారు చేసియుండిరనియు నూహింపక తప్పదు.

**69. సూ.- లుగ్వా ద్రుతప్రకృతికా త్పరత స్సరశే స్థిరేచ నస్య స్యాత్.**

69. సూ :- ద్రుతప్రకృతికాత్పరస్య నస్య లుగ్వా స్యా త్సరశే స్థిరేచ పరే 'రాము గంభీరుఁ డలఁచెద, రాము జగదీశుఁ బ్రార్థించెద, రాము నాగేంద్రశయను

దలఁచెద' - ఇత్యాది. ఋకారస్య రేఫావయవత్వేన తస్మిన్పరే ద్రుతస్య లుక్. రేఫస్య తదవయవత్వఞ్చ 'ఋతి సవర్ణే ఋవా' ఇతి వార్త్తికే ప్రసిద్ధమ్. తత్ర 'అచట ఋషులపూజ లమర సలిపి' ఇత్యుదాహరణమ్. 'క్రతువున ఋత్విజుల్' ఇత్యాచార్య ప్రయోగ ఏవాత్ర మానమ్. అతఏవ తస్మిన్పరే న సన్ధిః. రూపవైరుద్ధ్యప్రసక్తేశ్చేతి జ్ఞేయమ్.

వి:— లుక్, వా, ద్రుతప్రకృతికాత్, పరతః, సరళే, స్థిరే, చ, సర్వ్వ, స్యాత్ - అని ఛేదము. ద్రుతప్రకృతికమునకు సహజ సరళస్థిరవర్ణములు పరమగునపుడు నకారమునకు (ద్రుతమునకు) లోపము వికల్పమని సూత్రార్థము. 'రామున్ + గంభీరున్' అనునపుడును, 'రామున్ + జగదీశున్' అనునపుడును సహజసరళములు పరమైనవి కావున ద్రుతమునకు లోపము కల్గినది. 'రామున్ + నాగేంద్రశయనున్' అనునపుడు స్థిరవర్ణమగు నకారము పరమైనది కాన ద్రుతమునకు లోపము వచ్చినది. ఇట్లే మిగిలినవానిం దెలియవలెను. 'క్రతువునన్ + ఋత్విజుల్' అను నన్నపార్యుని ప్రయోగమునందు ద్రుతమునకు సరళస్థిరవర్ణములు పరముగ లేకున్నను ద్రుతమునకు లోపము కల్గినది. కాన స్వరవర్ణమగు ఋకారము పరమగునపుడు తత్ప్రయోగప్రామాణ్యముచే నచట స్వరకార్యములు జరుగక స్థిరకార్యమగు ద్రుతలోపము కల్గినదని యూహింపవలయును. ఇట్లే 'తెచ్చెన్ + త్సరువు, వచ్చెన్ + క్షత్రియుఁడు' మున్నగు చోట్లఁ దకారకకారములకు సరళాదేశబిందురూపద్రుతకార్యములను రాలేదు. ద్రుతలోపము వచ్చినది. ఇవి మహాకవిప్రయోగప్రమితములు. కావున సమ్మతములే యని యంగీకరింపక తప్పదు. 'క్రతువున ఋత్విజుల్' మున్నగుచోట్ల నున్న ఋకారమునకు వ్యంజనత్వసంపాదనమునకుఁ గవిశిరోభూషణము సంస్కృతవ్యాకరణసామ్యము చూపినది. 'ఋతి సవర్ణే ఋవా' అను సంస్కృతవ్యాకరణవార్త్తికముచే ఋకారము రేఫావయవ మనియు, రేఫము స్థిరవర్ణము కాన ద్రుతలోపము కల్గినదనియుఁ జెప్పి 'క్రతువునన్ + ఋత్విజుల్' మున్నగుచోట్ల స్వరసంధి చేసినచో విరుద్ధరూపము లుత్పన్నము లగును గాన ద్రుతలోపమే కల్గునని మఱి

యొక్క కారణముఁను జూపుచుఁ గవిశిరోభూషణము సిద్ధాంతము కావించినది.

బాలవ్యాకరణము "ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషములు విభాష నగు" (బాల. సంధి. 18) అని వివరించినది. చింతామణి ద్రుతప్రకృతికద్రుతమునకు సరళస్థిరవర్ణ పరకత్వమున లోపము వికల్పముగా నగునని చెప్పియుండఁగా బాలవ్యాకరణము ద్రుతమునకు లోపము కల్గునని వచించినది. ఇట్లనుటచేత – కన్గొను – చన్వాఁడు – కందోయి – మున్నగుచోట్ల ద్రుతలోపము ప్రాప్తించుచున్నది. దానిని "అఁట – ఇఁక – చుఁడు శబ్దములం దప్ప నుడితొలి ప్రాస్వముమీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు" (బాల. సంధి. 22) అని ఖండబిందులోపముఁలను సూరిగారు వారించిరి. అయినను 'చవాఁడు – కంగొను' అను ననిష్టరూపములు సూరిమతమున దుర్వారము లగుచున్నవి. శబ్దావయవనకారము ద్రుతము కాదని బాలవ్యాకరణమునం దెచ్చటను లేదు గదా. కాన 'ద్రుతప్రకృతిక ద్రుతమునకే లోపము కల్గునని చెప్పుట సముచితముగా నగపడుచున్నది.

**70. సూ :- అలుకి చ సంశ్లేష స్స్యాత్.**

70. సూ :- లంగభావే నస్య పరవర్ణేన సాకం సంశ్లేషశ్చ భవేత్. చకారేణ స్వరూపే ణావస్థితిః వర్ణాన్తరత్వేన సన్దర్భవేళాయాం పృథక్పరిగణనం తస్య ఫలమ్ అత ఏవ "అమలినతారకానసముదయంబుల నెన్నను సర్వవేదశాస్త్రముల యశేషసారము మదంబునఁ బొందను బుద్ధిబాహువి। క్రమమున –" ఇత్యాది పద్యస్యాచార్యేణ వర్ణాన్తరత్వ ముపపాదితమ్. ఏతచ్చ సమాసే న సమ్భవతి; ప్రయోగాభావాత్.

"స్వత్వం ప్రశ్లేషతా భిన్న స్సమాసే న ప్రయోగతః"

ఇత్యథర్వణవచనాచ్చ. "సీతన్ గజరాజగమన సేవింతున్" ఇత్యాద్యుదాహరణమ్.

వి:- అలుకి, చ, సంశ్లేషః, స్యాత్ –అని ఛేదము. పూర్వసూత్రము లోపమును వికల్పముగాఁ జెప్పినది కావున నాలోపము రానపుడు

ద్రుతమునకుఁ బరవర్ణముతోఁ సంశ్లేషమును గల్గునని యీసూత్రము చెప్పుచున్నది. చకారముచే స్వరూపావస్థితియుఁ గల్గును. అవసరమైనపుడు ద్రుతము వర్ణాంతరముగాఁ బరిగణింపఁబడుట స్వరూపావస్థితికి ఫలమని కవిశిరోభూషణము వచించినది. 'సీతను గజరాజగమన' అను రీతి 'ను' స్వరూపము ద్రుతమునకు స్వత్వరూపమనియు, 'సీత న్గజరాజగమన' అనురీతిరూపము సంశ్లేషమనియుఁ గవిశిరోభూషణాభిప్రాయము వ్యక్తమగుచున్నది. దీనికి నన్నపార్యుని 'అమలిన' అనుపద్యములోని 'ఎన్నను, పొందను, ఈఁదను' అనువానిని ప్రమాణముగాఁ జూపినది.

బాగుగ నాలోచింప నీయూహ సరికాదని తోఁచుచున్నది. 'ఎన్నన్' అను తుమున్నంతమునకు సముచ్చయార్థములలో 'ఉవర్ణకశ్చోద్యన్తాత్తు నువర్ణక ఉతో భవేత్' అనుచొప్పున 'ఉన్' అనునది చేరి 'ఎన్ననున్' అని యై ద్రుతలోపము కల్గినపిమ్మట 'ఎన్నను' అనురూపము సిద్ధించును. సముచ్చయార్థకమగు 'ఉన్' అనుదాని సంయోగమువలన నేర్పడిన 'ను' అనుదానిని ద్రుతస్వత్వరూప మనుట సరికాదుగదా! 'ను' వర్ణస్వరమునకు లోపము కల్గినపు డవశిష్టనకారపుఁ బొల్లునకే నన్నయాథర్వణులమతమున ద్రుతసంజ్ఞ కాన 'ను' అనునది ద్రుతస్వత్వ రూపమనుట నన్నయాథర్వణులకే కాక ప్రాచీనప్రామాణిక కవిపండితుల కెవ్వరికిని సమ్మతము కాదని చెప్పకతప్పదు. ద్రుతము పరవర్ణముతోఁ గూడుకొనుట సంశ్లేషమని కవిశిరోభూషణము వచించినది. ఇది సరికాదు. స్వరములు కూడ వర్ణములే కావున 'ఎన్నన్+ఉన్=ఎన్ననున్ అనునది కూడఁ గవిశిరోభూషణమతమునందు సంశ్లేషము కావలసియున్నది. అట్లనుట సరికాదుగదా! పర మగువ్యంజనముతో ద్రుతము కూడుట సంశ్లేషమని కవిశిరోభూషణము చెప్పవలసియున్నది. అదియును సరికాదు. సూత్రమున సంశ్లేషమునకు సహజసరళస్థిరవర్ణములే నిమిత్తములని చెప్పుటచే వానితో ద్రుతము కలియుట సంశ్లేషమని కవిశిరోభూషణాభిప్రాయము నభివర్ణించుట యుక్తము-

ఇదియు సరికాదు. ద్రుతము పూర్వాచ్చు నానుకొని యుండుట సంశ్లేష మని ప్రాతిశాఖ్యలనుబట్టి వ్యక్తమగుచున్నదని వ్యా.సం.స. చెప్పుచున్నది. నన్నపార్యుఁడు ప్రాతిశాఖ్యలమతము ననుసరించి చెప్పిన ట్లూహింపక తప్పదు. నన్నపార్యునిమతమున వ్యంజనసకారము ద్రుతము కదా! — "పరుషా ద్రుతప్రకృతికా త్సరళా స్స్యు స్తద్ద్రుతశ్చ బిన్దు స్స్యాత్. అలుకి చ సంశ్లేష స్స్యా ద్బిన్దుం ప్రవద న్తి తం క్వచి త్కేచిత్"— అని చింతామణి ద్రుతప్రకృతికద్రుతమునకు బిందుసంశ్లేషములను జెప్పుచున్నది. చింతామణిమతమునందు వ్యంజనసకారము [ద్రుతము]-అను జీవితద్రుతము ద్రుతప్రకృతికము లగుచున్నవిగదా! బిందువు రానపుడుండునట్టిరూపము 'పూచెన్, వచ్చెన్' అని యుండును. 'పూచెన్ విరులు, వచ్చెన్ విష్ణువు' అనురీతిరూపములు సంశ్లేషములని చింతామణి యభిప్రాయము వ్యక్తమగుచున్నది. సహజసరళస్థిరవర్ణములే సంశ్లేషమునకు నిమిత్తములుగదా!

"పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్య కథ్యతే"

అని యథర్వణాచార్యులుగారు చెప్పిరి. పద్యభేదావసాన మను దానికిఁ గందము వృత్తములు నను వానిలోఁ బూర్వోత్తరార్ధము లని యర్థము. వానిపూర్వోత్తరార్ధములచివరద్రుతము పూర్వాచ్చు నానుకొని నిలుచునట్టిసంశ్లేషము ప్రసిద్ధమే కదా! నన్నయాథర్వణులమతమున ద్రుతముస్వపూర్వాచ్చు నానుకొని నిల్చుట సంశ్లేషమని తెలియుచుండఁగా ద్రుతము నుస్వరూపముతో నిల్చుట స్వత్వ మనుటయు సరికాదు. చింతామణియందు సంశ్లేషము వచింపఁబడినది గాని స్వత్వమునుగుఱించి చెప్పఁబడలేదు. నిజమునకు స్వత్వసంశ్లేషరూపము లొక్కతీరుననే యుండును. 'పూచెన్+గలువలు' అనునపుడు 'పూచెన్' అనునది సంశ్లేష మగుచుండఁగా 'పూచెన్గలువలు' అనునది ద్రుతస్వత్వ మని యూహింపవలసి యున్నది. ద్రుతము పూర్వస్వరమును సంశ్లే

మించియుండుట సంశ్లేషమనుట యుక్తమగును. వ్యంజనవర్ణము పరస్వరముతోఁగాని వ్యంజనముతోఁగాని కలియుట సహజవిషయమే. కాని పూర్వస్వరముతో వ్యంజనవర్ణము కలియుట స్వాభావికము కాదు. అస్వాభావికవిషయమునకుఁ బ్రత్యేకముగాఁ జింతామణి నామకరణ మొనరించినదనుట సముచిత మగునా? సూత్రమునందలి చకారముచే ద్రుతమునకు స్వరూపావస్థితి కల్గుననియు, స్వరూపావస్థితియం దున్న ద్రుతమున కవసరము కల్గినచో వర్ణాంతరస్థితి కల్గుననియుఁ జెప్పి కవిశిరోభూషణము దానికి నిదర్శనముగా నన్నపార్యుని 'అమలినతారకా సముదయంబుల' అనుపద్యమునందలి 'ఎన్నను, పొందను, ఈఁదను' అను వానిం జూపినది. అచట నున్నది సముచ్చయార్థక నుశబ్దము కావున నది ద్రుతస్వత్వరూప మనుట సరికాదు గదా! ఈయహోబలపతిపండితునిసిద్ధాంతమునే బాలప్రౌఢవ్యాకరణము లనుసరించినవి. అప్పకవియును స్వరూపద్రుతసిద్ధాంతము ననుసరించినవాఁడే యగుటచే నప్పకవికిఁ బిమ్మట వ్రాయఁబడిన ప్రాచీనానేక ప్రబంధప్రతు లన్నియు దాని ననుసరించి సవరింపఁబడినట్లు తోఁచుచున్నది. తరువాత రచింపఁబడినగ్రంథము లన్నియు నప్పకవిసిద్ధాంతమునే యనుసరించినవని చెప్పక తప్పదు. ఈరీతిని నువర్ణద్రుతసిద్ధాంతము నూరిగారినాఁటికి బలపడినదని తోఁచుచున్నది.

**71. సూ :— బిన్దుం ప్రవదన్తి తం క్వచి త్కేచిత్.**

71. సూ :— క్వచి త్తం నకారం పూర్ణబిన్దుం వదన్తి కేచి త్పణ్డితాః. 'సీతం గజరాజగమన సేవింతున్' ఇత్యాద్యుదాహరణమ్. 'కల్మిం జనియించు' ఇతి కవితాపితామహః. క్వచిద్గ్రహణే నాస్య ప్రచురప్రయోగాభావ మాహాఽచార్యః. అక్కన్నదళి తేత్యత్ర "అనుస్వారస్య యయి పరసవర్ణః" ఇతి సాధుత్వ మూహ్యమ్. అత్రాథర్వణః.

"ద్రుతస్య హలి బిన్దు స్స్యా చ్ఛిష్టత్వాచ్చ క్వచి త్స్వతా
లోప శ్చాద్యతృతీయా తు న యుక్తా శబ్దవిస్మృతే

ఆద్యే తృతీయే చ కపా స్తృతీయా స్స్యుః కపేతరే
ఆద్యే ద్వితీయే తుర్యే చ ప్రాప్నువన్తి నిమిత్తతామ్"

కపాః కచటతపాః, తృతీయా గజడదబాశ్చ బిన్దుస్వత్వయో ర్నిమిత్తతాం ప్రాప్నువన్తి. కచటతపేభ్య ఇతరే వర్ణా స్సర్వే బిన్దుసంశ్లేషలోపేషు నిమిత్తతాం ప్రాప్నువన్తీత్యర్థః.

"పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్య కథ్యతే
అపరాన్తే సమాసే చ శబ్దే నో బిన్దు రిష్యతే
ధూర్వహస్య మతే తత్ర కవివా జ్మ్నేన ముచ్యతే"

పద్యభేదావసానే నస్య శ్లిష్టతా. "ఏతాదృశగుణమహిమ, ఖ్యాతాసమసమరవిధికిఁ గరుణాంబుధికిన్" ఇత్యాది తల్లోదాహరణమ్. అపరాన్తః పద్యసమాప్తిః, తత్ర స్థితస్య నస్య బిన్దుః, తస్య న ప్రయోగప్రసిద్ధిః. సమాసే 'కెందమ్మి' ఇత్యా ద్యుదాహార్యమ్. ఏతద ప్యరూఢమ్. 'వించు, కంచు' ఇత్యాదికం శబ్దోదాహరణమ్. ఏవంస్థితే "వైజయంతీనవాంశుకవ్యాజమునను" - ఇత్యాదిషు జైమినిభారతాద్యుక్తేషు సమాస్తే స్వత్వ మసఙ్గత మేవ. ద్వితీయాదిచరణాదివర్ణేషు పరేషు తు స్వత్వం నిర్బాధ మేవ. నచాత్ర వాక్యాన్తగతేతి సూత్రవ్యాపారః.

"పద్యావసానే సర్వేషాం స్వత్వం నాఽప్నోతి సాధుతామ్"

ఇత్యథర్వణనిషేధాత్. సర్వేషాం సర్వేషాం మత ఇత్యర్థః.

"శ్లేషే సఖణ్డనిర్బిన్ద్వో ర్మేళనం క్వచి న్మతమ్
ప్రశ్నార్థకస్య చాన్యస్య స్వరయో శ్శ్లిష్టతా మతా - ఇతి 'అనఘశ్రీధర

బీకుఁడొప్పెసఁగురూఢాపూర్వ సత్కీర్తితోన్" "వేడుకగా వరించితి ఖ్యాతిగా దేవరన్యాయము" - ఇత్యాదిరూపాణి నిర్బాధాని.

వి:- బిన్దుం, ప్రవదన్తి, తం, క్వచిత్, కేచిత్ - అని ఛేదము. సహజసరళస్థిరవర్ణములు పరము లగునపుడు ద్రుతమునకుఁ గ్వాచిత్కముగా లోపము కల్గును - అని కొందఱనుచున్నారని యర్థము. లోపము రానపుడు సంశ్లేషమును, ఆద్రుతమున కొకానొకచో బిందువును వచ్చునని కొందఱు చెప్పుచున్నారు. 'కల్మిం జనియించు' (కల్మిన్+జనియించు) అనియుదాహరణము. 'కల్మిన్' అనునది సప్తమ్యర్థకద్వితీయ. ఆద్రుతమునకు బిందువు వచ్చినది. 'అకుంఠిత' అనునప్డు

'అనుస్వారస్య యయి పరసవర్ణః' అనుస్వారమునకు యయ్ ప్రత్యాహార ఘటకవర్ణములు పరమైనపుడు పరసవర్ణము కల్గును-అనుసంస్కృతవ్యాకరణసూత్రముచొప్పున సాధుత్వము నూహించుకొనవలయునని కవిశిరోభూషణము ప్రవచించినది. 'ఆ+కందళితాపత్యానురక్తిన్'-అని రామాయణార్థమున ఛేదము. 'అక్కన్+దళితాపత్యానురక్తిన్' అని భారతార్థమున ఛేదము. ఇచట భారతార్థమున సంశ్లేషమనియు 'ఆ+కందళిత' అనురామాయణార్థమునఁ బరసవర్ణము చేయకున్నచో శ్లేష కుదురదనియుఁ గవిశిరోభూషణాభిప్రాయము పొడకట్టుచున్నది. తత్సమపదమధ్యమునఁ బరసవర్ణశాస్త్రము ప్రవర్తింపకున్నను బ్రయోగప్రామాణ్యమునుబట్టి పరసవర్ణముచేయుట యుక్తమని దానియభిప్రాయము గోచరించెడిని. కాని "బిన్దుం ప్రవదన్తి తం క్వచిత్కేచిత్" అను నియతిననుసరించి, బిందువు చేసి, 'అక్కం, దళితాపత్యానురక్తిన్' అని పఠించినచో రెండుపక్షములయందును సరిపడుచున్నది గదా! అట్లుపఠించుట సమంజసము

సంస్కృతమునందుఁ బరసవర్ణశాస్త్రము నిత్యమైనను నాపరసవర్ణముతోఁ గూడిన సంస్కృతపదములు తత్సమములై తెనుఁగులోనికి వచ్చినపు డవి బిందుయుతములే యగును. తెనుఁగునఁ బరసవర్ణశాస్త్రము వర్తింపదు. నన్నయ్యగారు 'నిండు' అనుదానికి 'ఆఖండల' అనియే ప్రాస నిల్పిరి. తిక్కనగారు 'సింగంబు' అనుపూర్ణబిందుప్రాసమున 'మాతంగ' అనియే ప్రాసమున నిల్పినారు. మహాకవులందఱు నిట్లే నిల్పిరి. పరసవర్ణప్రాస మగపడ లేదు. ఆకారణముచే 'అక్కందళిత' అని నిల్పుటయే కవిప్రయుక్తపాఠమని యూహింపవలయును.

కవిశిరోభూషణము 'అక్కన్దళిత' అనుప్రయోగమును గుఱించి చేసినచర్చను సూరిగారు "ఋౠఌౡఙఞఖఛఠథఫఘఝఢధభజ్ఞశషలు సంస్కృతసమంబులంగూడి తెలుఁగున వ్యవహరింపఁబడు" (బాల-సంజ్ఞ

4. సూ) అను సూత్రోదాహరణములలో సూచించిరి. అందు 'కంఠము, పఙ్క్తి, షండము' అనుమూఁడుదాహరణములలో 'పఙ్క్తి' అనుదానిలోఁ దత్సమత్వమునఁ బరసవర్ణముచేసి మిగిలినవానిలోఁ బరసవర్ణము చేయలేదు. దీనింబట్టి "సంస్కృతమునందు నిత్యమగుపరసవర్ణశాస్త్రము తత్సమములలో వికల్పముగ వర్తిల్లవచ్చును" అని సూరిగారూహించినట్లు తోఁచుచున్నది. ఇది నిజమగునేని వారట్లూహించుట సరికాదు. దాని కాధార మీాయహోబలపతివచనముతప్ప మఱేదియు లేదుకదా! "అలుకి చ సంశ్లేష స్స్యా ద్భిన్నం ప్రవదన్తి తం క్వచి త్కేఁచిత్" అనుచింతామణిచొప్పున నిది నసాధమని తెలియవలయును.

"శబ్దశాస్త్రజ్ఞులమతమున హల్లు పరమగుచుండఁగా వ్యంజన నకారరూప మగుద్రుతమునకు ఖండపూర్ణబిందువులలో నేదే నొకటి యాదేశమగును. ఒకప్పు డాద్రుతమునకు సంశ్లేషము నగును. (నన్నయాథర్వణులమతమున ద్రుతము స్వపూర్వాచ్చు నత్తియుండుట సంశ్లేషము.) అది రానపుడు స్వత్వముసైతము నగును. (పరహల్లుతో ద్రుతము సంయోగించుటయే స్వత్వము) లోపము నగును". ఈ కార్యము లన్నియు వ్యస్తపదవిషయములు, సమాసవిషయములు కావు. 'సమాసమునందు బిందుస్వత్వసంశ్లేషము లుండవు' అని 'ద్రుతస్య హాలి...న యుక్తౌ శబ్దవిన్మతే' అనుదాని కర్థము. ఆద్య మనుదానికి బిందువని యర్థము. తృతీయమనఁగా సంశ్లేష మనియర్థము. సమాసమున ద్రుతము లోపించుటచే ద్రుతికార్యములు రావని యర్థము.

"ఆద్యే తృతీయే చ కపా స్తృతీయే స్యుః కపేతరే
ఆద్యే ద్వితీయే తుర్యే చ ప్రాప్నువన్తి నిమిత్తకామ్"

అనుపాఠమును వ్యా.సం.స. అంగీకరించినది. కవిశిరోభూషణము

"ఆద్యే తృతీయే చ కపా స్తృతీయా స్స్యుః కపేతరే"

అనుపారము నంగీకరించినది. ఈపాఠ మర్థవంతముగా నగపడదు. ఆదేశసరళములు ఖండపూర్ణాన్యతరబిందువువిషయమునను, ద్రుతము పరహల్లుతో సంయోగించుట యనులక్షణము గలస్వత్వవిషయమునను, నిమిత్తత్వము నొందుచున్నవి. 'కచటతపలకన్న నితరము లగు సహజ సరళస్థిరరూపము లగుహల్లులు బిందుస్వత్వసంశ్లేషలోపములవిషయ మున నిమిత్తత్వము నొందుచున్నవి' అని 'ఆద్యే తృతీయే చ కపాః' అనుదాని కర్థము. 'కందము మున్నగు కొన్నిపద్యములయంతమునం దున్న ద్రుతమునకు సంశ్లేషము చెప్పఁబడుచున్నది' అని 'పద్యభేదావ సానేషు' అనుదాని కర్థము. 'పద్యము నాల్గవచరణముతప్ప మిగిలిన పద్యచరణములతుదియందును, సమాసమునను, శబ్దపరకత్వమునను ద్రుతమునకు ఖండపూర్ణాన్యతరబిందువు ధూర్వహునియతమున సమ్మత మగుచున్నది' అని 'అపరాన్తే సమాసే చ' అనుకారిక కర్థము. 'ఏతా దృశగుణమహామఖ్యాతాసమసమరనిధికిఁ గరుణాంబుధికిన్' అనుదానిని గవిశిరోభూషణము సంశ్లేషమున కుదాహరించినది. ద్రుతము పరహ ల్లుతో సంయోగించుట సంశ్లేషమని యొకచోట నిదివఱకే చెప్పి, యిచట నిట్లుదాహరించుట విరుద్ధముగ నగపడుచున్నది. అపరాంత మనఁగాఁ బద్యముయొక్క నాల్గవచరణముతప్ప మిగిలినచరణములని యర్థము చెప్పవచ్చును. సాధారణముగా వృత్తములలో రెండునాల్గు పాదములచివరను బరాంతమనియు, నొకటిమూఁడుపాదముల నపరాంత మనియుఁ జెప్పుట యుచితము. పరాంతములలోని ద్రుతమునకు బిందు వుండనగును. కాని కొందఱు కవులు పద్యమురెండవపాదముచివర నున్న ద్రుతమునకును బిందురూపద్రుతకార్యము చేయుట యగపడుచుండుట చేత నపరాంతశబ్దమునకుఁ బద్యముతుదిపాదముతప్ప మిగిలినమూఁడు పాదములచివర యనియర్థముచేయుట యుచితమే కానోపును. పద్యము తుదిభాగమని యపరాంతశబ్దమున కర్థముచెప్పి దానికిఁ బ్రయోగప్రసిద్ధి లేదని కవిశిరోభూషణము వచించుట వింతగా నున్నది. విపరీతార్థము

చేసి, దానికిఁ బ్రయోగప్రసిద్ధి కలుగవలయునన్న నెట్లు? 'వైజయంతీ నవాంశుకవ్యాజమునను' అనునది ద్రుతస్వత్వరూపమని తలఁచి యట్టి ప్రయోగ మసంగతమని కవిశిరోభూషణము చెప్పినది. 'వ్యాజమునను' అనుచోటి ను వర్ణము సముచ్చయార్థక నుశబ్దము. దీనికిఁ బిమ్మట ద్రుత ముండును. దాని కవసానద్రుతలోపము కల్గినది. కావున దీని నసంగత మనరాదు. 'పద్యముతుది నున్నద్రుతమునకు స్వత్వ ముండుట యెవరిమతమునను సాధువు కాదు' అని 'పద్యావసానే సర్వేషామ్' అను దానికర్థము. 'శ్లిష్టార్థసంఘటనసందర్భమున సార్ధబిందునిర్బిందుకశబ్దద్వయ సమ్మేళనము కొన్నియెడల సమ్మతమగును'–అని 'శ్లేషే సఖండనిర్బిన్ద్వో శ్మేళనం క్వచి న్మతమ్' అనుదాని కర్థము. ఇది సఖండాఖండప్రాసా దుల కుపలక్షణము. 'ఒప్పెసఁగు రూఢాపూర్వసత్కీర్తితోన్' అనున పుడు 'ఒప్పెన్, సగురూఢాపూర్వసత్కీర్తితోన్' అని భారతార్థము నను, 'ఒప్పు, ఎసఁగున్, రూఢాపూర్వసత్కీర్తితోన్' అని రామాయ ణార్థమునను ఛేదము. 'ఎసఁగున్' అనుదానిలో రామాయణార్థము సం దరసున్న కలదు. భారతార్థమందు లేదు. శ్లేషలో సఖండనిర్బిందు మేళనమున కిది యుదాహరణము. దీనింబట్టి యీయథర్వణకారిక యర్వాచీనమని భావింప రాదు. ప్రాచీనప్రయోగము మనకు లభింప లేదు. "ప్రశ్నార్థక మగుస్వరమునకును దద్భిన్నస్వరమునకును గూడ శ్లేషయందు సమ్మేళనము సమ్మత మగును"అని "ప్రశ్నార్థకస్య చాన్య స్య"అనుదాని కర్థము. 'ఖ్యాతిగా దేవరన్యాయము' అని యుదాహర ణము. 'ఖ్యాతిగాదే, వరన్యాయము' అని యొక యర్థమునను, 'ఖ్యా తిగాన్, దేవరన్యాయము' అని వేఱొకయర్థమునను ఛేదము. ఇది 'ప్రశ్నార్థకస్య' అనుదాని కుదాహరణము.

సూరిగారు పైవిషయములను "ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు" (బాల – సంధి – 18. సూ)అనియు, "వర్గయుక్సరళంబులు పరంబులగుచో ద్రుతంబు

నకుఁ బూర్ణబిందువును గానంబడియెడి" (బాల – సంధి – 19) అనియు వివరించిరి మఱియు "సంస్కృతసమేతరము లైన తెలుఁగుశబ్దముల యందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడియెడి" (బాల. సంధి. 16. సూ) అని – "ద్రుతస్య హాలి" అనుదానిని విస్తరించిరి. ఇందుఁ గలతక్కిన యథర్వణకారికలను సూత్రరూపమునఁగాక వివరణ రూపమున నక్కడక్కడఁ గొన్నింటిని వివరించిరి.

72. సూ :– సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః.

72. సూ :– ద్రుతప్రకృతికేభ్యః పరస్యాచఇవ యస్య సర్వత్ర కార్యం జ్ఞేయమ్. పూర్వసూత్రేణ స్థిరత్వా ద్యస్య లుక్సంశ్లేషయోః ప్రాప్తయో స్తన్నిషే ధార్థ మిదం సూత్రమ్. అచి లుక్సంశ్లేషాభావా త్తద్వత్కార్య మిత్యుక్తే ర్లుక్సంశ్లేషా వభావపి యకారే పరే న సంభవత ఇత్యర్థః. 'కలిగెనెమ్మె' ఇత్యాదికం తత్రోదాహ రణమ్.

వి:– సర్వత్ర, అజ్వత్కార్యం, జ్ఞేయం, యస్య, ద్రుతప్రకృతి కేభ్యః–అని ఛేదము. ద్రుతప్రకృతికమునకుఁ బర మైనపదాదియకార మున కజ్వద్భావము కల్గునని సూత్రార్థము. యకారము స్థిరవర్ణ మగు టచే లుక్సంశ్లేషములు ద్రుతమునకు వచ్చుచుండఁగా నజ్వద్భావవిధాన ముచే యకార మచ్చువంటిదైనది. కాఁగా నచట లుక్సంశ్లేషములకుఁ బ్రాప్తియే లేకపోయినది. వచ్చెన్+యెవఁడు – అనునపుడు ద్రుత ప్రకృతికమునకుఁ బరమైన పదాది యకారమునకుఁ బ్రకృతసూత్రముచే నజ్వద్భావము కల్గి 'వచ్చెనెవఁడు' అనిమైనది. 'కలిగెనెమ్మె' మున్నగు వాని నిట్లే యెఱుంగునది. తెనుఁగుపదముల మొదట 'అద్యః క్రియాసు' అనుచోఫ్పున 'య' కార ముండునను టనీసూత్రము స్థిరపఱుచుచున్నది.

73. సూ. :– లుక్సంశ్లేషౌ నాచి.

73. సూ. :- లుక్సంశ్లేషౌ, నస్య న స్తోఽచి- 'కొల్తునచ్యుతున్, తలఁతు నవనిజన్'-ఇత్యాదిక ముదాహరణమ్.

వి:— లుక్సంశ్లేషౌ, న, అచి—అని ఛేదము. అచ్చు పరమగునపుడు ద్రుతమునకు లుక్సంశ్లేషలు రావని యర్థము. పైసూత్రముచేత నజ్వద్భావము నొందిన యకారము పరమగునపుడు ద్రుతమునకు లోపసంశ్లేషలు రావని భావము. తెల్గుపదాది నున్న యకారము పరమగునపుడు ద్రుతమునకు (యకారము స్థిరవర్ణము కాన) లోపసంశ్లేషలు రాకుండుటకై యజ్వద్భావము విధింపఁబడినపుడు దానిచే నది గతార్థ మగుచుండ మరల 'లుక్సంశ్లేషౌ నాచి' అని వచించుట యవసరము కాదు, స్పష్టప్రతిపత్తికొఱ కట్లు వచింపఁబడిన దని యెన్నఁగు. బాగుగ నాలోచించినచో నీకారికను వికృతివివేకము విభాగించినట్లు కాక, సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య—ద్రుతప్రకృతికేభ్యో లుక్సంశ్లేషౌ నాచి—ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు—అని విభాగించుట యుక్తమని చింతామణివిషయపరిశోధనము వచించినది. పదాదియకారమునఁ అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః—అను చొప్పున సిద్ధించినపదాదియకారమున) కు సర్వత్ర (అజ్ఝల్లులలో నేది పరమైయున్నను లేకున్నను) అజ్వద్భావము కల్గును. ద్రుతప్రకృతికములకుఁ బరమైనదాని కీయజ్వద్భావవిధానముచే నీయకారము హల్లైనను లోపసంశ్లేషలు రావు—అని యర్థముచేసినచోఁ బునరుక్తిదోషము పరిహరింపఁబడుటయే కాక 'రాముఁడు+యెవఁడు' మున్నగుచోట్ల నజ్వద్భావముచేత 'రాముఁడెవఁడు' అనురూపము సిద్ధించుచున్నది. ఇట్లె 'కలిగెనెమ్మె' అనురూపసిద్ధియుఁ గల్గుచున్నది. కావున నిట్లే విభజించి యర్థము చేయుట యుక్తమని తోఁచుచున్నది. అథర్వణాచార్యులుగారు "సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య—ద్రుతప్రకృతికేభ్యః" అని సూత్రవిభజనము చేయుటచే

"వికృత్యాదిగతో యోఽత్ర స్యాచ్ఛబ్దాన్తరయోగతః
ప్రాణమాత్రావశేష స్స్యా దత్ర శ్రీకవిసమ్మతేః"

అని యాచింతామణి కారికను వివరింపవలసివచ్చినది. 'వికృతిపదాది గతమగు యకారమునకు మఱియొక శబ్దముతో యోగము కల్గినపుడు దానియందున్న హల్భాగము నశించి స్వరభాగము మాత్రము శేషించు' నని శ్రీకవి (శ్రీకవి యనుదానికి నన్నపార్యుఁడని యాతనియభిప్రాయము కానోపును.) యంగీకరించెను–అని దాని యర్థము. ఇంతియకాక;

"ఆద్యవర్ణాస్తు హ_త్త్వేన న గృహ్యా_స్తే కదాచన
ప్రాణా_స్త్వాణో లఘు ర్య స్స్యా త్స హల్చాచ్చ భవే త్క్వచిత్
చేద్యత్వం తస్య కల్ప్యం స్యా ద్వికృ త్యాదా భవే న్నణః"

అనియు వచించెను. "పదాదినున్న 'అతఁడు' మున్నగు వానిలోని 'అకారము' పదాంతరముతోఁ గలిసి 'హరి యతఁడు' అను చోటి అవర్ణము యడాగమముతోఁ గూడినను దాని నెన్నఁడును హల్లుగాఁ బరిగణింపరాదు. స్వరముకంటెఁ బర మైనస్వరము లఘు యకార మగును. అది యొకయెడ హల్లుగను నొకయెడ నచ్చుగను నుండును. 'య' త్వము కావలసినచో శ్లేషాదులలో దానిం గల్పించు కొనవలెను. వికృతిపదాదియందు ణకార ముండదు" అని దాని యర్థము. పై వానివలనఁ దెలుఁగు పదాదిని యకార ముండవచ్చునని సిద్ధాంతిత మగుచున్నదిగదా!

అప్పకవ్యహోబలపతిపండితులయభిప్రాయము ననుసరించి సూరి గారు 'యకారంబును వృవూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు' (బాల–సంజ్ఞ–17.సూ) అని వ్రాసినారు. దీని కప్పకవీయము లోని ప్రక్షి_ప్తపాఠమగు–

వికృతిపదాదౌ ప్రథమా_స్తత్ర తృతీయానునాసికా న_స్తః
క్వచిదపి న_స్త ఉదూతా దన్త్యోష్ఠభవశ్చ వికృతిశబ్దాదౌ.

అను కారిక మూలము కానోపునని యూహింపవలయును. పదాదియకారము నంగీకరింపనివారీపాఠమును బ్రక్షేపము చేసియుం దురు.

**74. సూ :-** ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు.

74. సూ. 1 :- తత్సమసమాసే మిశ్రసమాసకయోశ్చ విభక్తిసంబన్ధినో ద్రుతస్య లుక్స్యాత్. 'ఆతనియాకృతి, రామునిగుణములు, వారలయాకృతి, సీతారాముల ప్రాపు' ఇత్యాది. తత్సమమిశ్రతత్పురుషేచ 'ముద్దులగుమ్మ, ఒప్పులకుప్ప, వారలనేర్పు' ఇత్యాది. సమాసక బహువచన తత్పురుష శ్చాత్రోదాహరణమ్. 'వారిపెంపు, వీరి సొంపు, ముద్దుగుమ్మ, పడగతాల్పు, మాటనేర్పు' ఇత్యాదిసమాసకానాం "లోపశ్చ విభక్త్యాదే రిత్యనేనైవ సిద్ధిః. ఉదన్తషష్ఠీతత్పురుషేఽచి లుకి కృతేఽనన్తరం నుమ్.

వి:- ద్రుతస్య, సర్వత్ర, లుక్, సమాసేషు—అని ఛేదము. సమాసములలో ద్రుతమున కంతటను లోపము కల్గునని సూత్రార్థము. తత్సమములు, మిశ్రములు, నాచ్ఛికములు నని తెలుఁగునందలి సమాసములు మూఁడు విధములు. రెండు తత్సమపదములకుఁ గల్గిన సమాసములు తత్సమములు. ఒకతత్సమపదమునకు నొకయాచ్ఛికపదమునకుఁ గలిగినసమాసములు మిశ్రమములు. ఆచ్ఛికపదములు రెంటికిఁ గలిగిన సమాసములు సమాసకము లనియు నాచ్ఛికసమాసము లనియుఁ జెప్పఁబడును. తత్సమసమాసములలో 'రామునియొక్క+గుణములు' అని యుండఁగా —

"షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్"

'షష్ఠీతత్పురుషసమాసములయందలి షష్ఠీవిభక్తి ద్వితీయాతుల్యమగును' అని దానియర్థము. ఈశాస్త్రముచే యొక్క యనుప్రత్యయమునకు ద్వితీయాతుల్యత కలిగి 'రామునిన్+గుణములు' అనియగును. ఈద్రుతమునకుఁ బ్రకృతిసూత్రముచే లోపము రాఁగా 'రాముని గుణములు' అనురీతిని దత్సమసమాసము లేర్పడును. తత్సమమిశ్రతత్పురుషసమాసముల నిట్లే తెలియనగును. తత్సమమిశ్రసమాసములలో షష్ఠికి ద్వితీయాతుల్యత కల్గునని యెఱుంగునది. ముద్దులగుమ్మ మున్నగు సమాసకబహువచనములలోఁగూడ 'ముద్దులయొక్క+గుమ్మ' అను చోటిషష్ఠికిని ద్వితీయాతుల్యతయే కల్గి ద్రుతమునకు లోపము కలుగును.

మఱి 'వారియొక్క+సొంపు, వీరియొక్క+పెంపు' మున్నగు సమాసకము లలో షష్ఠికి ద్వితీయాతుల్యత రాదు—

లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యా త్సమాసకాఙ్గేషు

'సమాసకాంగము లైనశబ్దముల విభక్త్యాదులకు లోపము కలుగును'- అను శాస్త్రముచొప్పున విభక్తిలోపము కల్గుచుగాన 'వారిపెంపు' మున్నగురూపములు సిద్ధించుచున్నవి. ఉదంతషష్ఠీతత్పురుషము నందుఁ గూడ నచ్చు పరముగునప్డు షష్ఠికి ద్వితీయాతుల్యతయు నాద్రుతమునకు లోపమును జేసి, పిమ్మట 'షష్ఠ్యా ఉతో ఽచి నుమ్వేచ' అనుచొప్పున నుమ్ము చేయవలయును.

74. సూ. 2 :- నను 'నెలఁతముద్దుమోము నెఱికురు ల్గుబ్బలు' ఇత్యాదిప్రయోగే వ్యసమాసే షష్ఠీ ద్వితీయాతుల్యైవ వర్తతే. తత్ర కిం మూలమితి చేత్ 'మహాత్ము లైన భూపతులయు విప్రముఖ్యులసభన్' 'ఎవ్వనియేని ముఖామృతాంశుబింబంబునన్' ఇత్యాచార్యవచన మేవ మూలమ్. ఏని శబ్దప్రయోగేష్వేవ భిన్నతా స్పష్టీక్రియతే. తత్ర తద్వచనమహిమ్నైవ ద్రుతస్య లుగితి ధ్యేయమ్. 'ఇరుల గెలిచినయంతఃపురేందు ముఖులకురులు; వసుమతికేయిపాదములవానికిఁ బుట్టినచాయపట్టికిన్' ఇత్యాది సమాసస్య ఫలమి త్యనుసన్ధేయమ్. 'నెలఁతముద్దుమోము' ఇత్యాదౌ సంబంధస్య గమ్యత్వేఽపి సాధుత్వం బోధ్యమ్. వస్తుత స్త్వాచార్యప్రయు క్తస్యై వైతాదృశవాక్యస్య నిపాతన్యాయేన ప్రామాణ్యమ్. అన్యేషా న్తు నైవ సాధుత్వమి త్యనుసన్ధేయమ్. క్వచి ద్ద్రుతప్రకృత్యా కర్మధారయే ద్రుతస్య లోపస్తు 'మిక్కిలిచేతులును వానిమిక్కిలి కన్నున్' ఇత్యాది వాగనుశాసనవచనా ద్బోధ్యః సమ్బన్ధస్య గమ్యత్వే పీద మేవ మానమ్. 'మించుఁగ్రొమ్మించు' ఇత్యాది క్రియాజన్యవిశేషణసమాసే ద్రుతస్య క్రియాపదావయవత్వేన న లుగ్విషయత్వమ్. తేన ద్రుతకార్యం సర్వమత్ర ప్రవర్తత ఏవ.

వి:— నెలఁతముద్దుమోము నెఱికురు ల్గుబ్బలు' అనుచోట 'ముద్దుమోము, నెఱికురుల్, గుబ్బలు' అనుమూఁడుపదములకును 'నెలఁతయొక్క' అనుదానితో సంబంధ ముండుటచే దానితో నన్వయము కలదు. నెలఁతయొక్క ముద్దుమోము, నెలఁతయొక్క నెఱికురుల్, నెలఁత

**74. సూ :— ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు.**

74. సూ. 1 :- తత్సమసమాసే మిశ్రసమాసకయోశ్చ విభక్తిసంబన్ధినో ద్రుతస్య లు క్స్యాత్. 'ఆతనియాకృతి, రామునిగుణములు, వారలయాకృతి, సీతారాముల ప్రాపు' ఇత్యాది. తత్సమమిశ్రతత్పురుషోచ 'ముద్దులగుమ్మ, ఉప్పులకుప్ప, వారలసేవ' ఇత్యాది. సమాసక బహువచన తత్పురుష శ్చాత్రోదాహరణమ్. 'వారిపెంపు, వీరిసొంపు, ముద్దుగుమ్మ, పడగతాల్పు, మాటనేర్పు' ఇత్యాదిసమాసకానాం "లోపశ్చ విభక్త్యాదే రిత్యనేనైవ సిద్ధిః. ఉదన్తషష్ఠీతత్పురుషేఽచి లుకి కృతేఽనన్తరం నుమ్.

వి:— ద్రుతస్య, సర్వత్ర, లుక్, సమాసేషు—అని ఛేదము. సమాసములలో ద్రుతమున కంతటను లోపము కల్గునని సూత్రార్థము. తత్సమములు, మిశ్రములు, నాచ్ఛికములు నని తెలుఁగునందలి సమాసములు మూఁడు విధములు. రెండు తత్సమపదములకుఁ గల్గిన సమాసములు తత్సమములు. ఒకతత్సమపదమునకు నొకయాచ్ఛికపదమునకుఁ గలిగినసమాసములు మిశ్రమములు. ఆచ్ఛికపదములు రెంటికిఁ గలిగిన సమాసములు సమాసకము లనియు నాచ్ఛికసమాసము లనియుఁ జెప్పఁబడును. తత్సమసమాసములలో 'రామునియొక్క+గుణములు' అని యుండఁగా —

"షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్"

'షష్ఠీతత్పురుషసమాసములయందలి షష్ఠీవిభక్తి ద్వితీయాతుల్యమగును' అని దానియర్థము. ఈశాస్త్రముచే యొక్క యనుప్రత్యయమునకు ద్వితీయాతుల్యత కలిగి 'రామునిన్+గుణములు' అనియగును. ఈద్రుతమునకుఁ బ్రకృతసూత్రముచే లోపము రాఁగా 'రాముని గుణములు' అనురీతిని దత్సమసమాసము లేర్పడును. తత్సమమిశ్రతత్పురుషసమాసముల నిట్లే తెలియనగును. తత్సమమిశ్రసమాసములలో షష్ఠికి ద్వితీయాతుల్యత కల్గునని యెఱుంగునది. ముద్దుగుమ్మ మున్నగు సమాసకబహువచనములలోఁగూడ 'ముద్దులయొక్క+గుమ్మ' అనుచోటిషష్ఠికిని ద్వితీయాతుల్యతయే కల్గి ద్రుతమునకు లోపము కలుగును.

మఱి 'వారియొక్క+సొంపు, వీరియొక్క+పెంపు' మున్నగు సమాసము లలో షష్ఠికి ద్వితీయాతుల్యత రాదు—

లోపశ్చ విభక్త్యాదేశ్శబ్దేషు స్యాత్సమాసకాఙ్క్షేషు

'సమాసకాంగము లైనశబ్దముల విభక్త్యాదులకు లోపము కలుగును'- అను శాస్త్రముచొప్పున విభక్తిలోపము కల్గుటుగాన 'వారిపెంపు' మున్నగురూపములు సిద్ధించుచున్నవి. ఉదంతషష్ఠీతత్పురుషము నందుఁ గూడ వచ్చు పరమగునప్పుడు షష్ఠికి ద్వితీయాతుల్యతయు నా ద్రుతమునకు లోపమును జేసి, పిమ్మట 'షష్ఠ్యా ఉతోఽచి నుమ్సేచ' అనుచొప్పున నుమ్ము చేయవలయును.

74. సూ. 2 :- వను 'నెలఁతముద్దుమోము నెఱికురులు గుబ్బలు' ఇత్యాదిప్రయోగే వ్యసమాసే షష్ఠీ ద్వితీయాతుల్యైవ వర్తతే. తత్ర కిం మూలమితి చేత్ 'మహాత్ములైన భూపతులయు విప్రముఖ్యులసభన్' 'ఎవ్వనియేని ముఖామృతాంశుబింబమునన్' ఇత్యాచార్యవచన మేవ మూలమ్. ఏని శబ్దప్రయోగేణైవ భిన్నతా స్పష్టీక్రియతే. తత్ర తద్వచనమహిమ్నైవ ద్రుతస్య లుగితి ధ్యేయమ్. 'ఇరుల గెలిచినయంతఃపురేంద్రముఖులకురులు; వసుమతిశోయిపాదములవానికిఁ బుట్టినచాయపట్టికిన్' ఇత్యాది సమాసస్య ఫలమి త్యనుసన్ధేయమ్. 'నెలఁతముద్దుమోము' ఇత్యాదౌ సంబంధస్య గమ్యత్వేఽపి సాధుత్వం బోధ్యమ్. వస్తుత స్త్వాచార్యప్రయుక్తస్యై వైతాదృశవాక్యస్య నిపాతన్యాయేన ప్రామాణ్యమ్. అన్యేషా న్తు నైవ సాధుత్వమి త్యనుసన్ధేయమ్. క్వచి ద్వృత్తప్రకృత్యా కర్మధారయే ద్రుతస్య లోపస్తు 'మిక్కిలిచేతులును వానిమిక్కిలి కన్నున్' ఇత్యాది వాగనుశాసనవచనా ద్బోధ్యః సమ్బన్ధస్య గమ్యత్వే పీద మేవ మానమ్. 'మించుఁగ్రొమ్మించు' ఇత్యాది క్రియాజన్యవిశేషణసమాసే ద్రుతస్య క్రియాపదావయవత్వేన న లుగ్విషయత్వమ్. తేన ద్రుతకార్యం సర్వమత్ర ప్రవర్తతఏవ.

వి:— నెలఁతముద్దుమోము నెఱికురు లుబ్బలు' అను చోట 'ముద్దు మోము, నెఱికురుల్, గుబ్బలు' అనుమూఁడుపదములకును 'నెలఁతయొక్క' అనుదానితో సంబంధ ముండుటచే దానితో నన్వయము కలదు. నెలఁతయొక్క ముద్దుమోము, నెలఁతయొక్క నెఱికురుల్, నెలఁత

రొయొక్క గుబ్బలు, అని 'నెలఁత' అనుదానితో నన్వయించుచున్నవి. కావున నిట్టివి సమాసములు కావేమో యనితోఁచును. కాని యిచటి షష్ఠికి ద్వితీయాతుల్యత కల్గి ద్రుతలోపము కల్గుటచేతను సామర్థ్య ముం డుటచేతను సమాసము లే యని వీని నంగీకరింపక తప్పదు. ముద్దుమోము, నెఱికురుల్, గుబ్బలు—అనువానికి ద్వంద్వముచేసి యాపిమ్మట 'నెలఁత' అనుదానితో షష్ఠీతత్పురుషము చేయనగును. ఇట్టివి సంస్కృతమున లేకున్నను, తెన్గునం గలవు. కాన నివి సమాసము లే యనవగును. 'మహో త్కృష్టులైన భూపతులయు విప్రముఖ్యులసభన్' (భూపతులయొక్కయు, విప్రముఖ్యులయొక్కయు సభన్) ఎవ్వనియేని ముఖామృతాంశుబింబ మ్మునన్ (ఎవ్వనియొక్క+వీని) మున్నగునాచార్యులవారిప్రయోగము లలో 'ఉన్, ఏనిన్' అను వ్యవధానముచే వీనివ్యస్తత వ్యక్తమగు చున్నదిగదా. కావుననే ప్రౌఢవ్యాకర్త 'యొక్కకు లోపంబు బహు ళంబు' (ప్రౌఢ–కార–16. సూ) అని వ్యస్తతయందును లోపమును విధించియున్నాఁడు. నన్నపార్యునిప్రయోగమహిమచే యొక్కకు వ్యస్త తలో లోపము కల్గునని కవిశిరోభూషణము వచించినది. సూత్రములోని 'సర్వత్ర' అను పదసామర్థ్యముచేఁ గల్గిన దనుట లెస్సయని తోఁచుచు న్నది. ఇట్టివ్యాఖ్యానముచే 'ఇరులు గెలిచినయంతఃపు రేందుముఖుల కురులు', 'వసుమతి వేయిపాదములవానికిఁబుట్టినచాయపట్టికిన్' మున్నగు వానికి సమాససిద్ధియుఁ గల్గుచున్నది. ఇట్టియెడ సంబంధము వాచ్యము కాకున్నను గమ్యమైనను సమాసము కల్గినది. 'సర్వత్ర' అనుదానిసామ ర్థ్యముచేత షష్ఠికి ద్వితీయాతుల్యత కల్గినపుడు మాత్రమే కాక, యితర సమాసములలోఁగూడ ద్రుతమునకు లోపము రావచ్చును. వ్యస్తత యందును రానగు ననుటీవిషయము 'మిక్కిలిచేతులును వానిమిక్కిలి కన్నున్' అనునన్నపార్యునిప్రయోగము సూచించుచున్నది. ఇట విశేష ణమగు 'మిక్కిలిన్' అనునది నన్నయాథర్వణులమతమునందు ద్రుత ప్రకృతికము. ఆద్రుతమునకు లోపము కల్గును.

ప్రక్రుతచింతామణికారికను (బాల - సంధి - 24. సూ) సూరిగారు "సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు" అని సూత్రించిరి. సంస్కృతవ్యాకరణానుసారముగా సమాసవిభక్తిలోపము నంగీకరించినవీరి కుదాహరణమే మృగ్యమైనది. ఎట్టకేలకు "ఎల్లకలుషములు - ఎల్లయర్థములు" అనురెండింటి నుదాహరించిరి. ఈయుదాహరణములను సమర్థించుటకై "సర్వపర్యాయంబైన 'ఎల్ల' శబ్దము ద్రుతాంత మైన యవ్యయంబు. దీని కసమాసమున విశేష్యమునకు ముందు ప్రయోగము లేదు" అని వివరించిరి. ఇది యంతయు నభూతకల్పనమే. అవ్యయములనునవి తెనుఁగున లేవు. సంస్కృతముననే గలవు. మఱియు-ఎల్లన్ - ఎల్లఅన్ - ఎల్లయందున్ - ఎల్లయుదియు - అనురీతిని 'ఎల్ల' శబ్దమునకు విభక్తిరూపములు వెలయుచుండుటచే దీని నవ్యయ మనుట సాహసమేకదా! కావుననే త్రిలింగలక్షణశేషము (సంధి - 7. సూ) "సర్వపర్యాయం బయినయెల్లశబ్దమునకు సప్తమియు, నసమాసంబున విశేష్యమునకు ముందుఁ బ్రయోగంబునుం జూపట్టెడు" అని యీవిషయమును సోదాహరణముగ విమర్శించినది.

సంస్కృతమునం దున్నసమాసము లన్నియుఁ దెనుఁగున సాధ్యసమాసములయందు లేవు. కేవలషష్ఠీతత్పురుషముమాత్రమే కలదు. వానియందలిషష్ఠికి ద్వితీయాతుల్యత కల్గి యాద్రుతము లోపించునని చింతామణివికృతివివేకములయాశయము. ఔజ్మధ్యసూత్రమునఁ బేర్కొన కుండుటచేత విశేషణము లన్నియు ద్రుతప్రకృతికము లగుచుండఁగా సూరిగారు వానిని గళలుగఁ బేర్కొనిరి. ఈకారణముచేత సాధ్యకర్మధారయసమాసములలోని ద్రుతము సూరిగారి కందలేదు. విభక్తిలోపము నంగీకరించుటచేఁ దత్పురుషసమాసములలోని ద్రుతమును జిక్కలేదు. మఱియేసమాసముననను నడిమిని ద్రుత ముండదుగదా! సమాసద్రుతలోపమునకు వీరి కుదాహరణ మెట్లు లభించును? చింతామణిలోని సమాసద్రుతలోపశాస్త్రమును విడువక భాషాంతరీకరించుకొనిరి

గదా! దానికై వారిన్ని తెనుఁగుసంప్రదాయవిరుద్ధనియమముల నంగీకరింపవలసివచ్చినదని తోఁచుచున్నది.

**75. సూ :- నుమ్చోతః.**

75. సూ. 1 :- ఉకారాన్తాచ్ఛబ్దాన్నుమ్స్యాత్సమాసే. అంచు-పట్టి-కూర్చి విభక్తికేషు చ. సమాసశ్చాత్ర లక్ష్యపథఏవ గృహ్యతే. తత్రచ సరళపరుషవర్ణేష్వేవ. 'గండుంగోయిల, ననుపుంజెక్కులు, మురువుందెక్కులు, సొగసుందలిరులు, కలంకుంబలుకులు, తళుకుంజెక్కులు, అలరుంజొంపము, పాలుపుండాలు, చివురుంబల్లెము' ఇత్యాది షష్ఠీతత్పురుషసమాసకే. స్త్రీసమాత్తు 'అఱరుందావి, చివురుంజొంపము, చిగురుందావి, వేలుపుందేజువ, చన్నుందోయి, కన్నుంగవ' ఇత్యాదీని రూపాణి. 'పునుగుందావి నవోదనంబు' ఇత్యాదయః కవీనాం ప్రయోగాః. అత్ర "లోపశ్చ విభక్త్యాదేః" ఇత్యనేనైవ విభక్తిలోపః. వికారాత్ 'మిఱ్ఱెంపుంబోడి, కుందనంపుంజాయ' ఇత్యాది. 'మిఱ్ఱెంపుంబోళ్ళతోఁ జేచుఱుక్కను నేయి' ఇత్యాదయః కవీనాం వాచః. 'వనమునందు, రామునందు, పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు' ఇత్యాద్యాచార్యప్రయోగః. 'జపముంగూర్చి పర్షము, జ్ఞానముంబట్టి ముక్తుండు, నీదురాకంబట్టి నెగడె మేలు' ఇత్యాది. 'సొగసుందనము, పాలుపుందనము' సమాసేష్వితి బహువచనానువృత్తిమహిమ్నాత్రాన్ద్వాది లాభః. చకారాదుదన్తవ్యతిరిక్తాదపి. 'చక్కందనము, తియ్యందనము, చక్కన, తియ్యన' ఇత్యాద్యదన్తమపి దేశ్యం రూపమ్.

వి:- నుమ్, చ ఉతః-అని ఛేదము. ఉదంతశబ్దములకు సమాసమున నుమ్మువచ్చునని సూత్రార్థము. విధానసామర్థ్యముచే నీద్రుతమునకు లోపము రాదు. పరుషసరళవర్ణపరకత్వముననే యీద్రుతకార్యములు జరుగునని తెలియనగును. 'గండున్+కోయిల' అనునపుడు ద్రుతమునకు సామాసికలోపము కల్గి 'గండు+కోయిల' అగును. దీనిచే నుమాగమము వచ్చి మరల గండున్+కోయిల' అని యగును. ఇపు డీద్రుతమునకు యథాసంభవముగా లోపము తప్ప మిగిలినద్రుతకార్యము లన్నియుఁ గలుగవచ్చును. ఇచట సంబంధము గమ్యమగు

చున్నదికాని వాచ్యముగా లేదని యూహింపవలయును. గండుంగోయిల, (గండున్ + కోయిల) నునుపుంజెక్కులు, (నునుపున్ + చెక్కులు) మురుపుండెక్కులు (మురుపున్ + చెక్కులు) సొగసుందలిరులు (సొగసున్ + తలిరులు) కులుకుంబలుకులు (కులుకున్ + పలుకులు) అని తత్పురుషసమాసములు పరుషవర్ణ పరకత్వమున నుదాహరణములు. సహజసరళపరకత్వమునం దిచ్చినయుదాహరణములలోఁ గవిశిరోభూషణమున 'తళుకుంజెక్కులు' అని యుదాహరించుట సరికాదు - కులుకుంగుబ్బలు (కులుకున్ + గుబ్బలు) మున్నగురీతిని గకారాదిపద ముదాహరింపవలయును. అలరుంజొంపములు (అలరున్ + జొంపములు) పొలుపుండాలు (పొలుపున్ + డాలు) చివురుంబల్లెము (చివురున్ + బల్లెము) మొదలగునవి సరళపరకత్వమున కుదాహృతులు. ఇందు 'ద' కారమున కుదాహృతి యగపడదు - పెనుపుందడములు (పెనుపున్ + దడములు) అనురీతి నుదాహరింప నగును. ఇవి షష్ఠీతత్పురుష సమాసకములు. ఈమీఁదియుదాహరణములలో స్త్రీసమముకంటె నుమాగమము వచ్చినరూపము లుండుటచే స్త్రీసమాత్తు అలరుందావి, చిప్పురుంజొంపము, చిగురుండాల, వేలుపుందెఱవ, చన్నుందోయి, కన్నుందోయి-అని మఱిఁ జెప్పుటకు హేతు వేమియు నగపడదు. వీని యన్నింటియందును 'లోపశ్చ విభక్త్యాదేః' అనుచోప్పున విభక్తిలోప మేర్పడి, పిదపఁ బ్రకృతసూత్రముచే నుమ్ము వచ్చును. మిరియంపుంబోడి, కుందనపుఁజాయ-అనునవి పుంప్వాదివికారములపై నీనుమ్ము వచ్చుట కుదాహరణములు. 'వనమునందు, రామునందు' మొదలగునవి 'అందు' పరమగునపు డీనుమ్ము వచ్చుట కుదాహృతులు. 'భారత ఘోరరణంబునందు' అనినన్నపార్యుని ప్రయోగము. 'జపముంగూర్చి-జ్ఞానముంబట్టి' మున్నగుచోట్ల 'పట్టి, కూర్చి' అనునవి పరమగునపు డీనుమ్ము వచ్చినది. నీదురాకఁబట్టి అనుచోటఁ బట్టివర్ణకము పరమగునపు డీనుమ్ము వచ్చినదని కవిశిరోభూషణ మీసూత్రమున కుదాహరిం

చుట సరికాదు. రాక యనునది యుకారాంతము కాదు గదా! అథ ర్వణవచనముచే సిద్ధించువానిని జింతామణిసూత్రములోని చ-మున్నగు వానిచేఁ గ్రిందియథర్వణవివరణముతో జోడించి 'నుమ్మోచ్చతః' అనుదానిని వివరించి సాధింప యత్నించుట సరికాదు. అథర్వణవచనము వానిని సాధించినది. తాను స్వయముగా వివరించినట్లును, దనవలెనే యథర్వ ణుఁడుకూడఁ జెప్పినట్లును జదువరులకుఁ దోఁచుటకై కవిశిరోభూష ణము 'అత్రాఽథర్వణః' అని వచించినది. పరిశీలించిన గ్రంథమంతట నిట్టి రీతియే గోచరించును.

75 సూ. 2 :- అత్రాథర్వణః—

"సరళే పరుషే చైవ సమాసే నుముతో భవేత్
అద్రుతా త్సరసా దన్య పట్టి కూర్చి విభక్తిషు
తనేచ క్వచి దతో వికారా చ్చాపి కేచన
అమిశ్రే స్త్రీసమా త్కేచి త్ప్రయోగ శ్శరణం కవేః"

ఇత్యాహ. వికారా త్పుంప్వాదేశవికారా దిత్యర్థః. సామానాధికరణ్యా భావేఽపి 'గ్రామనామ్నోఽపి మోః పు స్స్యాత్' ఇతి తద్వచన గత 'అపి' శబ్ద మహిమ్నా తయోః ప్రాప్తి రిత్యవగన్తవ్యమ్. కేచిదిత్యుక్తేః 'పునుఁగుంబావి, కుంద నంపుఁజాయ' ఇత్యాదీని రూపాణి సిద్ధాని. సరసా దిత్యనేన 'నలుఁగడలు' ఇత్యాదివ్యా వృత్తిః. "హాల్యథర్వణమత" ఇత్యప్పకవిపుస్తకపారస్తు నైతత్పారసామంజస్యం లభత ఇత్యుపేక్షితః. అత్ర నుమో మిత్యేవ ప్రకృత్యవయవత్వా ద్ద్రుతప్రకృతికత్వే తత్కార్యమ్.

వి:- అందు, పట్టి, కూర్చి—అనువిభక్తులు పరమగునప్పుడుదంత ములకు నుమ్ము వచ్చును. ఈనుమ్ము సమాసమునఁ బరుషసరళములు పరమగునపుడు వచ్చును. ద్రుతప్రకృతులు కాని యుదంతతత్సమములకు 'పట్టి, కూర్చి, గుఱిచి, గుఱించి' మున్నగునవి పరము లగునప్పుడును నీ నుమ్ము వచ్చును. ఒకానొకచో 'తన' అనునది పరమగునప్పుడదంత శబ్దముకంటెను వచ్చును. పుంప్వాదివికారములకంటెసయితమువచ్చును. అమిశ్రసమాసమునందు స్త్రీసమముమీఁదఁ గూడ నీనుమ్ము వచ్చు

నని కొందఱనుమతము. కవిప్రయోగానుసారముగాఁ దన్మతము పాటింపఁ బడఁదగినది—అని "సరళే పరుషేచైవ" అను గ్రంథముచే నథర్వణాచార్యులుగారు 'నుమ్వోత్రః' అను చింతామణికారికను వివరించినారు. స్త్రీసమవిశేషణద్రుతమునకు లోపము కల్గినపిమ్మటఁ గవిప్రయోగసమ్మతి యున్నస్థలములలోమాత్రమే నుమ్ము వచ్చు ననుచింతామణియాశయము నీకారిక వివరించుచున్నది. అమిశ్రసమాసమం దనఁగా నాచ్ఛికసమాసమున నుకారాంతస్త్రీసమశబ్దములకుఁ బరముగాఁ బరుషసరళవర్ణము లున్నపుడు మాత్రమే నుమాగమము వచ్చునని కొందఱ యాశయము. సామాసికద్రుతలోపము కల్గినపిమ్మట నే కవిసమ్మతి గలయుదంతస్త్రీసమములకుమాత్రమే నుమాగమ మగుననిచింతామణియాశయమని "అద్రుతాత్...ప్రయోగ శ్శరణం కవేః" అనునథర్వణవచనము నుడువుచున్నది. అందు పట్టీత్యాదులు పరమైనపుడును నుమాగమ మగునని 'అందుపట్టీ'త్యాదికర్థము. హ్రస్వాకారాంతశబ్దమునకు 'తన' వర్ణకము పరమగునపుడు నుమ్ము కల్గునని "తనేచ క్వచిత దతః" అనుదాని కర్థము. 'పు, ంపు' అను వికారములకుఁ బిమ్మటమాత్రమే కాక, యీ నుమ్ము

శబ్దానా మాదిభాగేషు నూతనత్వాదిబోధకాః
ఏకద్వివర్ణకా శ్శబ్దా అర్థభేదోఽపి చ క్వచిత్"

అను నథర్వణవచనోక్త ప్రదేశములయందును వచ్చును—అని "వికారాచ్చాపి కేచన" అనుదాని కర్థము. 'సరసాత్' (తత్సమాత్) అనుటవలన 'నలుగడలు' అనునపు డీయాగమము రాదు. "హల్యథర్వణాచార్యమతాత్" అనునప్పకవీయచింతామణిపాఠ మీబాలసరస్వతీయచింతామణిపాఠసామంజస్యము నంద లేదు కావున నదియిచట వ్యాఖ్యానింపఁబడలేదు. నుమ్ము మిత్తుగానఁ "మి దచోఽన్త్యాత్పరః" అనుచొప్పునఁ దుదియచ్చునకుఁ బరముగ వచ్చునుగాన ద్రుతప్రకృతికమై ద్రుతకార్యముల నందుచున్నది.

సూరిగారీవిషయములను సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళంబులు పరంబులగునపుడు నుగాగమం బగు. (బాల.సంధి.25సూ) "సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు" (బాల.సంధి.26.సూ) "ఉదాత్తస్త్రీసమంబులకును బుంపులకు నదంతగుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమం బగు" (బాల.సంధి.35 సూ) "సమాసంబునం బ్రాంతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు" (బాల.సంధి.36.సూ) "లుప్తశేషంబులకుం బరుషములు పరములగునపుడు నుగాగమం బగు" (బాల-సంధి.37.సూ) "క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు" (బాల.సంధి.38.సూ) 'అన్యంబులకు సహిత మిట్టి కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' (బాల.సంధి.39.సూ) అని యీరీతిని బై విషయములను వివరించిరి. ప్రౌఢవ్యాకర్తయు 'సమాసమందుఁ దత్సమంబు పరంబగునపుడు నుగాగమాదులు గానంబడియెడి' (ప్రౌఢ—సంధి.12) 'నెన్నడాదులన్నెఱిదగు' (ప్రౌఢ-సంధి—14) 'పూపూవు' (ప్రౌఢ-సంధి—11) అని బాలవ్యాకరణ విషయముల విమర్శించెను.

**76. సూ :— పరుషాణాం గసడదవా స్స్యుః పదా ద్ద్వన్ద్వే.**

76. సూ. 1 :- పదాత్పరేషాం గసడదవా స్స్యు ర్ద్వన్ద్వసమాసే - 'అరిగోరులు, కాలుసేతులు, టక్కుటెక్కులు, తల్లిదండ్రులు' — ఇత్యాద్యుదాహరణమ్. 'నలుగడలు, పలుదెఱఁగులు, వెలిదమ్మి, వెలిదామర' ఇతి రూప మాథర్వణ మాచార్యస్యాపి సమ్మత మేవ. 'నల్గడల' నిత్యాదిత్రప్రయోగాత్. ఏతత్సూత్రారంభసామర్థ్యా దేవ గసడదవా స్స్యురితి సూత్రస్యాసమస్తవిషయతాఽవధార్యతే.

వి:— పరుషాణామ్, గసడదవాః, స్స్యుః, పదాత్, ద్వన్ద్వే—అని ఛేదము. ద్వంద్వసమాసములోఁ బదమునకన్నఁ బరమైనపదాదిపరుషమునకు గసడదవాదేశము నిత్యముగా నగునని సూత్రార్థము. ఉదాహ్రా

తులు కచటతలకే మూలమునఁ గలవు. పకారమునకు లేదు. అది లేఖకప్రమాదముచేఁ బోయియుండును. 'ఊరువల్లెలు' అని దాని కుదాహరణము. మిగిలినయుదాహరణములను మూలమునందుఁ జూడ నగును. 'నలుగడలు' మున్నగునవి యథర్వణవచనముచేఁ గుదురు ననునని కవిశిరోభూషణము చెప్పినది. ద్వంద్వసమాసమునందే గసడదవాదేశమును జింతామణి వచించినను నితరసమాసములలో నట్టి వగ వడినపుడు వానిని సమాసాశ్రయవిధులుగా భావింపవలెనని నన్నపార్యుని యాశయము. అథర్వణాచార్యులుగారు దానినే వివరించిరి.

సూరిగారు 'ద్వంద్వంబునం బదంబుపైఁ బరుషములకు గసడదవలగు' (బాల-సంధి-15సూ) అని యీసూత్రమును వివరించిరి. దీనిని విమర్శించుచుఁ బ్రౌఢవ్యాకర్త "కొన్నియెడల ద్వంద్వంబునం బదంబు మీఁది చతపలకు సదవలు కానంబడవు" (ప్రౌఢ-సంధి-6 సూ) అని వ్రాసెను.

77. సూ :- సామానాధికరణ్యే షూదన్తానాం టుగాగమోఽచి స్యాత్.

77. సూ. :- ఉదన్తాత్పదాట్టుగాగమ స్స్యాదచి కర్మధారయే. 'చిగురుటాకు, కలికుటమ్మ' సామానాధికరణ్యేష్వితి బహువచనజ్ఞాపకా దసామానాధికరణ్యే ష్వపి క్వచిత్. తేన 'చెక్కుటద్దములు' ఇత్యాది సిద్ధ్యతి-"జ్ఞాపకసిద్ధం న సర్వత్ర"- 'చిగురమ్మ' టుగాగమ ఇతి వద న్నిత్య మాగమశాస్త్రమితి పరిభాషాం జ్ఞాపయత్యాచార్యః. తేన 'చిగురాకు' - ఇత్యాది సిద్ధ్యతి. టుకః కిత్త్వేవ ప్రకృత్యవయవత్వాత్ప్రకృత్యర్థైన వార్థవత్త్వమ్.

వి:- సామానాధికరణ్యేషు, ఉదన్తానాం, టుగాగమః, అచి, స్యాత్ - అని ఛేదము. సమానాధికరణ మగుశబ్దము పరమగునపు డుదంతముల కచ్చు పరమగుచో టుగాగమము వచ్చునని సూత్రార్థము. సామానాధికరణ్య మనఁగా విశేషణవిశేష్యభావము, తదధికరణవృత్తిత్వము సామానాధికరణ్యమని శాస్త్రపరిభాష. సమాసము

లోని రెండుపదములకు విశేషణ విశేష్యభావ ముండుట యనియర్థము. 'నీలవస్త్రము' అనునపుడు నీలత్వవస్త్రత్వములు వస్త్రమునం దున్నవి గావున నారెండు పదములును సమానాధికరణము లగుచున్నవి. అట్టి వానికిఁ గల్గిన సమాసమే సమానాధికరణసమాసము. చింతామణి టుగాగమమును నిత్యముగాఁ జెప్పినది. కాని కొన్ని కవిప్రయోగములలో 'చిగురమ్మె' మున్నగురీతిని టుగాగమ మగపడనందున నట్టివానిని సాధించుటకొఱకుఁ గవిశిరోభూషణము సంస్కృతవ్యాకరణమునందలి "ఆగమశాస్త్ర మనిత్యమ్" "జ్ఞాపకసిద్ధం న సర్వత్ర" మున్నగు పరిభాషల నాశ్రయించినది. అట్టివి నన్నపార్యునకు సమ్మతములు కావు. ఈసూత్రమును "సామానాధికరణ్యే తూదన్తానాం టుగాగమోఽపి స్యాత్' అని పఠించుట సమంజసము. 'ద్వంద్వసమాసమునందుఁ బరుషములకు గసడదవాదేశము కల్గును; సమానాధికరణసమాసమందన్నచో యచ్చు పరమగునపు డుదంతములకు టుగాగమ మగును' అనునర్థము లభించును. ఇట్లనుటచే 'తు' శబ్దసామర్థ్యమువలనఁ బరుషపరకత్వము నందు ద్వంద్వేతరసమాసములలోఁ గొన్నియెడలఁ బరుషములకు గసడదవలు రావచ్చు ననునర్థము లభించును. దానిచే 'పలుదెఱఁగులు' మున్నగునవి సాధింపఁ బడవచ్చును.

సూరిగా రీవిషయములను "కర్మధారయమునం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు" (బాల-సంధి-28 సూ) "కర్మధారయమునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చు పరంబగునపుడు టు గాగమంబు విభాషనగు" (బాల-సంధి.29 సూ) అని వివరించినారు.

78. సూ :- దారార్థేఽత ఊదపి రః.

78. సూ. :- అకారాంతపద స్యాకారస్య ఊకారాదేశ స్స్యాత్. తత్పరతో రేఫోఽపి స్యా దాలుశబ్దే పరే. 'ధీరురాలు, శూరురాలు, జవరాలు' "వ్యతిరిక్తా భూయాంస" ఇత్యాచార్యోక్తేః -

"వర్ణలోపాగమా నైకే సర్వస్మిం స్తద్భవే పదే"

ఇత్యథర్వణోక్తేశ్చ నస్య లోపః. లోపాభావే నవర్ణకే - 'జవ్వనురాలు, ముద్దురాలు' క్వచి దుకారే స్థితే రేఫమాత్రవిధానమ్. 'గొడ్డురాలు, విద్యాపురాలు' ఇత్యాది. 'గొడ్రాలు' ఇత్యత్ర విశేషవిధిత్వాద్రేఫే కృతే అనంతర ముల్లోపః. సామానాధికరణ్యస్యాభావాత్ 'వెలయాలు, ఇల్లాలు' ఇత్యాదౌ నాయం విధి రిత్యవగన్తవ్యమ్. "అవయవప్రసిద్ధే స్సముదాయప్రసిద్ధి ర్బలీయసీతి" న్యాయేన సముదాయోఽత్ర తత్తద్గుణవిశిష్ట స్త్రీమాత్రపర ఇతి జ్ఞేయమ్. యద్వా ఆలుశబ్ద స్యాన్యత్ర భార్యావాచిత్వేఽ ప్యత్ర స్త్రీమాత్రపరత్వం వృత్తిస్వాభావ్యాత్. నచ వృత్త్యవృత్త్యో శ్శబ్దస్య భిన్నార్థకత్వ మయూఢమ్. 'బ్రాహ్మణచేల, బ్రాహ్మణబ్రువా' ఇత్యాదౌ - "చేలాదీని వృత్తివిషయే కుత్సనవాచీని" - ఇతి శాబ్దికై రుక్తత్వాత్. నచ విశేషవాచకశబ్దస్య సామాన్యోపలక్షకత్వమపి విరుద్ధమ్ - "విభాషౌషధివనస్పతిభ్యః" - ఇతిసూత్రే వనస్పతిశబ్దస్య విశేషవాచకస్య వృక్షమాత్రోపలక్షకత్వ ముపపాద్య 'శిరీషవణ' మిత్యాదౌ ణత్వ మిత్యుక్తం పాణినీయపారీణైః. వనస్పతిశబ్దస్య వృక్షవిశేషవాచకత్వం "వానస్పత్యః ఫలైః పుష్పా త్తై రపుష్పా ద్వనస్పతిః"-ఇత్యమరేణోక్తమ్. - "వనస్పతి ర్వృక్షమాత్రే వినా పుష్పైః ఫలద్రుమే" ఇతి విశ్వప్రకాశవచనము ప్యుపలక్షకత్వ మేవాశ్రిత్య ప్రవృత్తమ్. ఆలఙ్కారికైరపి విశేషస్య సామాన్యలక్షకత్వ మఙ్గీకృతమేవ నచ వికృత్యా మప్యపూర్వ మిదమ్ – 'ఇల్లాలు, ముగ నాలు' ఇత్యాదావపి స్త్రీమాత్ర పరత్వావగమాత్. 'ఎల్లప్పుడు' ఇత్యత్రాసమ్బన్ధే తదాద్యర్థకస్య సమ్బన్ధే కాలమాత్రపరత్వాచ్చ. 'ఇల్లాలు' పదం గృహిణీపర్యాయమ్, 'ముగనాలు' పదం సాధవతీపర్యాయమ్. యది ద్వితీయస్య వీరపత్నీపర్యాయత్వం తదా 'ఆలు' శబ్దస్య స్వార్థపరత్వమే వేతి జ్ఞేయమ్. అథర్వణేనాప్యుక్తమ్.

"సమ్బన్ధే క్వచి దర్థ స్స్యా దసమ్బన్ధే విలక్షణః"

ఇతి. సామానాధికరణ్య ఏవేదం రూపమ్. సామానాధికరణ్య మేకార్థకత్వం విశేషణ విశేష్యయోః, 'తచ్చ నీలోత్పల' మిత్యాదౌ సిద్ధమ్.

వి:– దారార్థే, అతః, ఉత్, అపి, రః– అని ఛేదము. ఆలు శబ్దము దారార్థకము; అనఁగా భార్యావాచకమని యర్థము. ఈ 'ఆలు' శబ్దము పరమగునపు డకారమున కుకారమును బిదప రేఫాగమమును వచ్చునని సూత్రార్థము. ధీరురాలు, గుణవంతురాలు మొదలగునవి యుదాహరణములు. 'ధీర, గుణవంత, మొదలగునవి అకారాంతము

లగుటచే వీని కాలుశబ్దముతో సమాసము గల్గినపు డీసూత్రముచే నుత్వ రత్వములు గల్గి రూపసిద్ధి యగుచున్నది. 'ఆలు' శబ్దమునకు భార్య యని యర్థమైనను సమాసమునం దది స్త్రీమాత్రబోధకమే యగును. 'ధీరురాలు, బుద్ధిమంతురాలు' అనునపుడు ధైర్యము గలయాఁడుది, బుద్ధిగలయాఁడుది—అని యర్థము. కాని 'ధీరునిభార్య, బుద్ధిమంతుని భార్య' అని కాదు. 'ఇల్లాలు, మగనాలు' అనుసమాసములలో నాలు శబ్దమునకు భార్యావాచిత్వ మున్నట్లగపడుచున్నను నవి వరుసగా గృహిణి, భర్తృమతి అను నర్థములతో విలసిల్లుచున్నవి. సమాసము లేనపుడు దారార్థకమైన యాలుశబ్దమునకు సమాసమందు స్త్రీమాత్ర పరత్వ మొకప్పుడు కల్గుచున్నది. 'ధీరురాలు' మున్నగుసమాసములందు మాత్రమే యిట్టియర్థవైలక్షణ్యము గల్గుననియు, 'మగనాలు'మున్నగు సమాసములలోఁ గల్గదనియు, 'క్వచిత్' అనుపదమువలనఁ దెలియు చున్నదని "సంబంధే క్వచిదర్థ స్స్యాత్" అనుకారిక చెప్పుచున్నది. 'యావనురాలు'అనునపుడు "వర్ణలోపాగమా నైకే సర్వస్మిం స్తద్భవే పదే" అనుచొప్పున నకారమునకు లోపము గల్గి 'జవనురాలు', 'జవ రాలు' అనురూపము సిద్ధించినది. 'యావన, జవన, జవ్వన, జవ' అనురీతిని వీనిక్రమము నరయవలయును. 'జవ' శబ్దమున కాలుశబ్దము తో సమాసము చేసిన 'జవరాలు' అని రేఫాగమ మాత్రముచే సిద్ధించుచున్నది. 'యావనురాలు, జవనురాలు' మున్నగురూపములు ప్రసిద్ధములు కావు. అట్లే 'ముద్దురాలు' అనునదియు నప్రసిద్ధమే. గొడ్డు రాలు' అనునపు డుత్వలోపము గల్గినచో 'గొడ్రాలు' అని యగును. 'వెలయాలు=వెలకుదొఱకునాఁడుది' అనుచోట రేఫోత్వములు రెండును రాలేదు. 'ఇల్లాలు=గృహిణి' పైస్థలములలో సామానాధికరణ్యము లేనందున నీకార్యము కలుగలేదని తెలియవలెను. అసమాసమున భార్యావాచి యగునాలుశబ్దమునకు సమాసమున స్త్రీమాత్రపరత గల్గుట వృత్తిస్వభావము. 'అవయవప్రసిద్ధికన్న సముదాయప్రసిద్ధి బలీ

యము అనుచోట్నున ఆలుశబ్దము స్త్రీమాత్రపరమైనదనియుఁ జెప్ప వచ్చును. శబ్దమునకు వృత్తియందొకయర్థము, అవృత్తియందొక యర్థము రూఢము కావచ్చునని చెప్పుటకు వీలులేదు. సంస్కృతవ్యాకరణమున "చేలాదిని వృత్తివిషయే కుత్సనవాచీని" అని చెప్పుటచే శాబ్దికులు వృత్త్యవృత్తులలో భిన్నార్థకములై యుండునని చెప్పియున్నారు కదా! విశేషవాచకశబ్దమునకు సామాన్యోపలక్షకత్వ మగుటయు విరుద్ధము కాదు. 'విభాషౌషధివనస్పతిభ్యః' అను సూత్రమున విశేషవాచక మైనవనస్పతి శబ్దము సామాన్యవృక్షవాచక మగుట చెప్పఁబడుచున్న దని పాణినీయు లనుచున్నారు. పుష్పములు పూచి ఫలించిన చెట్లు వానస్పత్యములనియు, పూలు లేకే ఫలించుచెట్లు వనస్పతు లనియు నైఘంటికు లనుచున్నారు. ఆలంకారికులును విశేషము సామాన్యమున కుపలక్షక మగునని యంగీకరించియున్నారు. కావునఁ దెనుఁగునను నిట్లుండనగును. 'అపుడు=ఆసమయమునందు' 'ఎల్లపుడు—ఎల్లకాలము' అనునపుడు వృత్త్యవృత్తులలో నర్థము మాఱినది గదా! సమాసమున నొకయర్థమునఁ బ్రసిద్ధ మగుశబ్ద మసమాసమున వేఱొకయర్థము నిచ్చు నని 'సంబంధే క్వచి దర్థ స్స్యా దసంబంధే విలక్షణః' అనుదాని కర్థము. సూరిగారు పైవిషయములను 'పేదాదిశబ్దముల కాలుశబ్దము పరంబగు నపుడు కర్మధారయంబునందు నుగాగమం బగు' (బాల. సంధి.30 సూ) 'కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వం బున కుత్వంబును, రుగాగమంబు నగు' (బాల.సంధి.31 సూ) అని వివ రించియున్నారు.

"తత్రాద్యత్తో భవే స్సత్వ మత్ర తత్వ్కాచి దిష్యతే" అను నథర్వణకారికను గవిశిరోభూషణము 'అహమాదీనాం ద్విత్వమ్' అను చింతామణికి వివరణముగా వ్రాసినది. అది సరికాదు. 'సమానాధికర ణేతరసమాసములలో నుకారముమీద కచ్చు పరమగునపుడు నిత్యముగఁ బరరూపసంధి కల్గును. సమానాధికరణసమాసములలోఁ బరరూపసంధి

కొన్నియెడలమాత్రము జరుగును" అని దానియర్థము. పేరురము - పేరుటురము, పేరోలగము - పేరుటోలగము, మున్నగునవి యుదాహృతులు. 'వాలమ్ములు, వాలుటమ్ములు' అనుచోట 'వాలురమ్ములు' అని యగపడుచున్నది. ఇచట రేఫము వచ్చుట కాధార మగపడదు. షష్ఠీతత్పురుషసమాసములలోఁ గొన్నియెడల మువర్ణకమునకుఁ బుంపులును, వాని కచ్చు పరమగునపుడు టుగాగమమును నగు, 'పట్టపేనుంగు నిబ్బరపుబ్బు' అనుచోట్ల టుగాగమ మగపడలేదు. 182-6 విభాగము లోని 'అజ్ఝలో రాలుశబ్దేన' అనునథర్వణవివరణ మిచట నుండనగును.

79. సూ :- మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ.

79 సూ :- అకారాన్తాత్ప్రథమావిభక్త్యేకవచనే విహితస్య మోస్తు పుంపూ ఇత్యాదేశౌ స్తః సామానాధికరణ్యే. పూర్వః కేవలపుకారః; ద్వితీయః పూర్ణానుస్వారపూర్వకః పుకార ఇతి విశేషః 'సరసపుఁబలుకు, సరసంపుఁబలుకు' ఇత్యాద్యుదాహరణమ్. అతఏవ ద్వితీయాచార్యేణోక్తమ్.

"సామానాధికరణ్యే తు బహుత్వార్థే పరేఽపి చ
ముమ్వో ర్భవేతాం పుంప్వాఖ్యా వాదేశా వత్ర సర్వదా" ఇతి.

బహుత్వార్థే బహువచనే పరేపి, ముమ్వోరితి బువర్ణకగ్రహణేన మువర్ణకోపరి విహితయో ర్ముమ్వోః స్థానిత్వం సూచ్యతే. అతఏవ విభక్త్యేకవచన ఇతి విశేషణం సార్థకమ్. 'సరసంపుఁబల్కులు' ఇత్యాది. 'కందనపుఁజాయలు' ఇత్యాది రూప మ్త్వనాకరమ్.

వి:- మోః, తు, విభక్త్యేకవచనకే, పుంపూ-అని ఛేదము. అకారాంతామహచ్ఛబ్దములకుఁ ప్రథమావిభక్త్యేకవచనరూపార్థములో విధింపఁబడిన మువర్ణకమునకుఁ 'బుంపు'లు వచ్చునని సూత్రార్థము. ఇట్లను టచే నాగమముగా బహువచనమున వచ్చిన మువర్ణకాదులకు రాకుండు టచే 'సమానాధికరణసమాసమున బహువచనాంతశబ్దము విశేష్యమైన పుడుసయితము 'ము,మ్ము,ంబు' అనువానికిఁ బుంపు లాదేశములగుచున్నవి'

అని యథర్వణాచార్యులుగారు 'సామానాధికరణ్యే తు' అనుదాని చే
జింతామణిని వివరించినారు. చింతామణి ప్రథమైకవచనమువర్ణకమ
నకే పుంపులను విధించియుండఁగా నీయథర్వణకారిక యాగమ 'ము'
వర్ణకమునకును బుంపులను విధించుచున్నది. దీనింబట్టి చింతామణి
వికృతివివేకములసంబంధము సుస్పష్టమగుచున్నది. 'ఉగ్రపుబలములు'
మున్నగునవి యుదాహరణములు. బాలవ్యాకరణ మీవిషయమును
'కర్మధారయములందు మువర్ణకంబునకుం బుంపు లగు' (బాల–సంధి–
32. సూ) 'మువర్ణకమునకు విధించుకార్యములు ముగాగమమునకు నగు'
(బాల.తత్స.41 సూ) అని వివరించినది.

**80. సూ :— ప్రథమలుగపి ద్విసులోర్వః.**

30. సూ. :- సద్విత్వయో ర్న్లలోర్వః ప్రథమవర్ణస్య లుగపి స్యాత్. అపి
శ్వికల్పే 'కన్నుదోయి, కనుదోయి-చన్నుగవ, చనుగవ' ఇత్యాదిసువర్ణోదాహరణమ్.
ద్వయీశబ్దోద్భవో 'దోయి' శబ్దః. 'ముల్లుకంప, ములుకంప-కల్లుకుండ, కలుకుండ'
ఇత్యాదికం లుకారోదాహరణమ్. "విలువిద్య గఱచుచుండిరి" ఇత్యాద్యాచార్య
వచనం మిశ్రసమాసే ఉదాహరణమ్. అత్ర సామానాధికరణ్యేష్వితి బహువచన మహి
మ్నైవ సమాసాంతరలాభ ఇతి జ్ఞేయమ్.

"అన్యత్రాపి భవే ద్వైక్యమ్ క్వచి త్సుకవిసమ్మతేః"

ఇత్యథర్వణోక్త్యా "తలివంద్రుల నుఱుఁగొట్టఁగవలయు నిల్లుచేరిన వేగన్" ఇత్యాది
వచనానాం సాధుత్వమ్. ఐక్యమిత్యస్య అద్విత్వమర్థః. ఏతేన 'విలుకాఁడు'ఇత్యాది
రూపసిద్ధి న్నిర్బాధై వేత్యవగన్తవ్యమ్.

వి:— ప్రథమలుక్, అపి, ద్విసులోర్వః—అని ఛేదము. ద్విత్వయు
క్తము లగు న్ను–ల్లు—అనువర్ణములలోని తొలిదానికి లోపము కల్గునని
యర్థము. ఈసూత్రమునకు మీఁదనున్నసూత్రములును దీనితరువాత
నున్నసూత్రములును సమాసములలో వచ్చుచుండుటచే 'న్ను, ల్లు'
అనువానిలో మొదటివర్ణమునకు లోపమును సమాసముననే వచ్చునని
యర్థముచేయుకతప్పదు. కవిశిరోభూషణము "సద్విత్వయో ర్న్లలోర్వః

ప్రథమవర్ణస్య లుగపి స్యాత్. అపి ర్వికల్పే కన్నుదోయి’ అని చెప్పి నను సమాసములనే యుదాహరించుటవలన సమాసమందే చింతామణిచొప్పున నీకార్యము కల్గు ననునభిప్రాయ మున్న ట్లూహింపవలెను. మఱియు నీ కార్యము మిశ్రసమాసమునను నాచ్ఛికసమాసమందును జరుగుననియు ‘విలువిద్యఁగఱచుచుండిరి’ అనుదాహృతిచే నూహింపవలసియున్నది. దీని నథర్వణాచార్యులుగారు ‘అన్యత్రాఽపి భవే ద్వైక్యం క్వచి త్సుకవిసమ్మతేః’ అని వివరించిరి. ఇందలి ‘అన్యత్రాపి’ అనుదానికి సమానాధికరణసమాసమున నేగాక యితరసమాసమందును నీకార్యము కల్గునని “తలిదండ్రులచుఱఁగొట్టఁగ వలయు నిల్లుచేరిన వేగన్” అనునుదాహరణమునుబట్టి తెలియుచున్నది. కాని ‘న్ను, ల్లు- అనువానిద్విత్వమున కేకాక యితరద్విరుక్తవర్ణములకును, సమాసమునందే కాక వ్యస్తతయందును నొకహల్లునకు లోపము కల్గును’ అని ‘కొట్టిక—కొటిక, మజ్జ—మజ, అఱ్ఱు—అఱు, గొఱ్ఱియ—గొఱియ’ మున్నగు ప్రయోగములనుబట్టి వ్యాఖ్యానింపవచ్చును.

సూరిగారీవిషయమును “అకారనముక్రింది అకారంబునకుం దుదిను, ల, ల క్రింది న, ల లకు లోపంబు బహుళంబుగా నగు” (బాల. ప్రకీర్ణము. 7సూ.) అనియు, ‘అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు’ (బాల—ప్రకీర్ణము 8 సూ) అనుసూత్రములచే వివరించియున్నారు.

81. సూ :— ఇచ్చ విభక్త్యన్తిమస్య.

(81. సూః-) విభక్త్యన్తిమాక్షరస్య ఇకారాదేశశ్చ స్యాత్. విభక్తయశ్చ తోడ, చేత, వలనాఖ్యా గ్రాహ్యాః. ఉక్తంచ ద్వితీయాచార్యేణ-

“అల్యాగమ స్స్యా దన్ద్విన్ద్వో ర్భవే దిజ్జని చేతయోః
తథా తోడవిభక్తౌ చ సమాసే కవిసమ్మతేః”

ఇతి. జసీత్యనేన వలనేతి విభక్తే గ్రహణమ్. ‘జసిన ఉచ్యతే వలనః’ ఇతి వాగనుశాసనోక్తేః. నీచేతిప్రాపు, నీతోడిచెలిమి, నాతోడివాఁడు, నావలనినేరమి’ ఇత్యాద్యుదాహరణమ్.

వి:- ఇత్, చ, విభక్త్యన్తస్య-అని ఛేదము. విభక్త్యంతిమ వర్ణమునకు ఇకారాగమ మగునని సూత్రార్థము. సమాసమున నిదాగమవిధానముచే నివి యలుక్సమాసము లనవలెను. ఇదాదేశ మగునని కవిశిరోభూషణము చెప్పినది. కాని యథర్వణాచార్యులు దీని నాగమ మనియే వచించిరి. నన్నపార్యునియభిప్రాయము నదియే యనుటకు సందియము లేదు. ఆదేశమనుటకుఁ బ్రయోజన మగపడ లేదు. "మహాకవిప్రయోగసమ్మతి గల్గియుండుటవలన నుత్తరపదలోపసమాసమందును 'అందు, ఇందు' అనురెంటికిని 'అలి' అను నాగమము వచ్చును. 'పంచమీవిభక్తిప్రత్యయమగు 'వలన' వర్ణకమునకును 'చేత, తోడ' అను వానికిని హ్రస్వేకారాగమము కల్గును" అని యథర్వణునివచనము నర్థము. 'చేత, తోడ, వలనల కిత్వంబు సమాసంబునం దగు' (బాల.సంధి 43 సూ) అని యీవిషయమును బాలవ్యాకరణము వివరించినది.

82. సూ :- జే రలి చ.

82. సూ :- జేః అంద్విత్యాది సప్తమ్యాః అలీ త్యాగమశ్చ స్యాత్. నీయందలి కరుణ - ఇత్యాది. అలుక్సమాసా ఇమే. అత్ర సామానాధికరణ్యానువృత్తేః తదను గుణార్థా అగమార్థత్వే నోహ్యాః. సూత్రద్వయే చద్వయం సముచ్చయే, నతు వికల్పార్థకమ్; లక్ష్యవిసంవాదా దాథర్వణవచనవిరోధాచ్చ. అతఏవ నాపే రస్వరితత్వ మితి జ్ఞేయమ్.

వి:- జేః, అలి, చ-అని ఛేదము. 'అందున్' అను సప్తమీ విభక్తిప్రత్యయమునకు 'అలి' అనునది యాగమముగా వచ్చును. 'నీయందున్+అలి+కరుణ=నీయందలికరుణ.' ఈసమాసములలో విభక్తిప్రత్యయము లోపింపకుండుటచే నివి యలుక్సమాసము లగుచున్నవి. స్వరితత్వప్రతిజ్ఞ యనునది "స్వరితేనాధికారః" అనుపాణినీయముచొప్పున నధికారము మున్నగుపద్ధతు లున్నచోట నావశ్యక మగును. తెనుఁగునం దావశ్యకము కాదు. ఇచ్చటఁ బ్రకరణబలముచేతనే యది సిద్ధించును. తెన్గువ్యాకరణములో ననువృత్తు లంగీకరింపఁబడ లేదు కదా!

ఈవిషయమును బాలవ్యాకరణము "అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు" (బాల.సంధి.44సూ) అని వివరించినది.

83. సూ :- ఔపవిభక్తికసంజ్ఞా వర్ణా ష్టింట్యాదయో భవన్తీహ. రుల్వాదేర్నామ్నాం స్యు స్తే హి విభక్తౌ సమాసే చ.

83. సూ :- ఇహాన్ధ్రభాషాయాం యే టింట్యాదయో వర్ణా స్తే ఔపవిభక్తిసంజ్ఞా స్స్యుః. తే టింట్యాదయో నామ్నాం రుల్వాదే స్స్యు ర్విభక్తౌ పరే సమాసేచ. పూర్వవాక్యగ తాదిష్టేన 'తి, త్తి,' ప్రముఖవర్ణా గృహ్యన్తే. ద్వితీయేన 'డు, లి,' ముఖ్యా వర్ణా గృహ్యన్తే. తేచ కుత్రచిత్సమాసవిభక్త్యో రుభయోరపి భవన్తి. క్వచిత్సమాస ఏవ క్వచి ద్విభక్తావేవ. క్వచి దుభయోర్న భవన్తీత్యాదికం వర్ణేషు వైచిత్ర్యం వర్తతే 'ఏటికి, ఏటి కాలువ-వింటికి, వింటికొప్పు-తాటికి, తాటిచెట్టు-కూటికి, కూటికుండ-అంబటికి,అంబటినీళ్ళు-నేతికి, నేతిముంత-మిత్తికి, మిత్తిచేను-కత్తికి, కత్తిమొన-కంటికి, కంటితుద-మంటికి.మంటికుండ-గొడ్డంటికి, గొడ్డంటిచిప్ప' ఇత్యాదావుభయోః. పాముకు పాపఱేఁడు, వేముకు వేఁపచెట్టు, ఇత్యాదౌ సమాసఏవ. పైరుజొంపము, కల్లుకుండ, ఎన్నుగంటు' ఇత్యాదౌ నోభయోః. 'ముంటికి, ముల్లుకంప - మింటికి, మిన్నేఱు-పుడిసెఁడు, పుడిసెంటికి' ఇత్యాదౌ విభక్తావేవ. 'బండికంటిరును' ఇత్యాదౌ వర్ణభేదానుసరణి నాऽऽదేశః, 'నీటికి, నీటిచూలి' ఇద్యాదౌ సంస్కృతసమేత్యాదేశప్రవృత్తిః. అత్రాథర్వణే నోక్తమ్,"విభాషయా భవన్త్యత్ర భవన్త్యుపవిభక్తయః। భవన్తి కుత్రచిన్నైవ నిదానం తత్ర సద్వచః" ఇతి. ఏతేన 'అంపకాఁడు' ఇత్యాది రూపం నిర్బాధమ్, సామాన్యప్రవృత్తత్వాత్.

"బహవోऽత్రాన్ధ్రభాషాయాం వర్ణా ఔపవిభక్తికాః
ప్రవృత్తి శ్చాప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచి ద్భవేత్.
తద్వివేకః ప్రయోగైకశరణ స్స్యాద్ధి శబ్దతః
యత్రైతే తత్ర తత్సంజ్ఞా నామ్నా మన్యత్ర చాన్యథా" ఇతి

హిశబ్దతః ప్రసిద్ధ్యర్థక హిశబ్దప్రయోగాత్. ఏతే ఔపవిభక్తికవర్ణాః. అన్యత్ర తదభావస్థలే, అన్యథా అనౌపవిభక్తిక సంజ్ఞేత్యర్థః.

వి.- ఔపవిభక్తికసంజ్ఞా, వర్ణాః, టింట్యాదయః, భవన్తి, ఇహ, రుల్వాదేః, నామ్నాం, స్యుః, తే, హి, విభక్తౌ, సమాసే, చ-అని

ఛేదము. ఈవికృతిభాషయందు 'టి, ంటి, తి, ్రి' మున్నగునవి యూా విభక్తిసంజ్ఞకములు. ఇవి విభక్తి పర మగునపుడును, సమాసమందును 'రు-లు-డు-లి' మున్నగునవి యంతమునఁ గలనామములకు వచ్చున సూత్రార్థము. 'ఈవికృతిభాషలో నౌపవిభక్తికములు కొన్నియెడఁ వైకల్పికముగా నగును; కొన్నిచోట్ల నిత్యముగా నగును; కొన్నితావు లలో రానే రావు. ఇట్టివివిధస్థితులవిషయమున మహాకవిప్రయోగ ములు మూలము లగును' అనియు, 'ఈవికృతిభాషయం దౌపవిభ ప్రత్యయములు పెక్కు గలవు. వాని కొకచోట నిత్యప్రవృత్తియు నొకచోటఁ బ్రవృత్తి లేకుండుటయు, నొక్కయెడ వైకల్పికముగా వచ్చుటయుఁ గలదు. చింతామణిసూత్రమునఁ గలప్రసిద్ధ్యర్థక హి శబ్ద ప్రయోగమహిమచే నీయర్థము లభించినది. కావున నివి మహాకవి ప్రయోగైకవేద్యములు. ఏశబ్దమున నివి నిలుచునో యచ్చట వాని కౌపవిభక్తిసంజ్ఞయు నవి లేనపు డాశబ్దముల కనౌపవిభక్తి సంజ్ఞయునుం డును. 'ఇ-టి-ఇటి-ంటి-తి-ఇతి-్రి-అటి-ఁప-ంప' మున్నగునవన్నియు నౌపవిభక్తిప్రత్యయములే యని యథర్వణవివరణమును బట్టిఁ యూా హింపవలసియున్నది. ఉదాహృతులు మూలమునఁ గననగును. ఇట్లింత స్పష్టముగా నథర్వణాచార్యులుగారు తనగ్రంథము చింతామణికి వివరణ మని చెప్పుచుండఁగాఁ గవిశిరోభూషణము దాని నాలింపకుండుట యత్యంతము నన్యాయమగును గదా!

సూరిగా రీవిషయములను బాల.ఆచ్ఛిక.సూ.26 నుండి 37 సూ. వఱకు వివరించిరి.

84. సూ :- వాఽఽత్మాస్మదో ర్ద్రుతస్య స్యా ల్లుక్.

84 సూ :- ఆత్మాస్మచ్ఛబ్దయో ర్ద్రుతస్య వా లుక్స్యా త్స్వరశే స్థిరే చ పరే- 'తాను ఘనుఁడు, తాఘనుఁడు-నేను వింటిని, నే వింటిని' ఇత్యాద్యుదాహరణమ్. య ద్వాలుగ్వేతిసూత్రేణ వాలుకః ప్రాప్తావపి బిందుసంశ్లేషయో రనిష్టత్వేన తన్నివారణార్థ మిదంసూత్రమ్. లుగ్వేతి సూత్రే వాలుకః పరకస్థిరనిమిత్తకత్వేన క్లుప్తత్వా దత్రాపి

తన్నిమిత్తోపస్థితేః. "సడదవా స్స్యురితి సూత్రే పరుషాణాం పరత్వేన జ్ఞాపితత్వాత్, అత్రతద్వ్యతిరిక్తవర్ణగ్రహణ స్యోచితత్వా ల్లక్ష్యానురోధాచ్చ ద్వయో ర్నిమిత్తత్వమ్. నలోలోక్త్వితి చకారే ణోత్వలోపే కృతేఽవశిష్టస్య ద్రుతస్యాత్ర గ్రహణాత్. యథాసంయోగాన్తలోపే కృతే చావశిష్టస్య పుమఃఖయ్యమ్పర ఇతి లుగ్విధిపర్యుదా సయో స్సామర్థ్యాద్భవ త్యల్లోప ఇతి సువచమ్. నచ పర్యుదాసస్య 'తానుచెప్పె నేనుచదివితి' నితి రూపద్వయసంపాదన ఏవోపక్షీణశక్తికత్వ మితి వాచ్యమ్. తాదృశప్రయోగస్య కుత్రచి దప్యభావాత్. కిఞ్చ బిన్ద్వాదేశప్రాప్తావపి తత్ర పర్యుదాస ఏవ మానమ్. అతఏవాథర్వణోఽప్యూహ.

"వినా ద్వితీయం స్యా దస్మదాత్మనో స్స్వన్తయో రపి
నో రన్యస్యాపి సర్వం స్యా ద్బహుళం సత్ప్రయోగతః" ఇతి.

వినా ద్వితీయం నకారస్య శ్లిష్టత్వేన వినేత్యర్థః. కిఞ్చ నువర్ణకే ప్యల్లోపే ద్రుతప్రకృతికత్వం సిద్ధ్యతీతి - "చెడు నిహుముం బరంబు నది సిద్ధముగావు కెటెంగి, ఇష్టుఁడు నుపాధ్యాయుఁడు" - ఇత్యాద్యాచార్యవచనా దవగమ్యతే. తేన కళా సంజ్ఞకానాం సర్వేషా ముదన్తానాం విశేషార్థే విహితేన నువర్ణేన ద్రుతప్రకృతిత్వం సిద్ధమ్. అనుతాం యువర్ణాన్తత్వమేవ. తదుపరి నువర్ణక ఇతి వివేకః. "అమగుద మిదియుఁ జేయుదము ననియుఁ గొందఱు మతనికిఁ గూర్చు మంత్రులమునై" "ఉన్నత గుణాఢ్యుఁడవు స్ఫురతాన్వయావలంబనుఁడవు" - ఇత్యాద్యాచార్యప్రయోగః. కళా న్యతిరిక్తస్థలేషు - "వినియు నొకరీతి నొకభంగి వినఁడు వయ్యె, "మఱి కన్నీర్నించుఁ గాని మగువ పలుకదున్" - ఇత్యాదివచనానాం ద్రుతాన్తత్వేఽపి నకిఞ్చిద్బాధకమ్. ఏతేన "కర్తవు భర్తవుం దలఁప హర్తవు" ఇత్యాదివచనాని వ్యాఖ్యాతాని. "అర్థుల నీవ నేర్తు వరయంగఁ ద్రిమూర్తివిలాసవర్తివిన్ - ఇత్యాదిరూప న్త్వసజ్గత మేవ - కిన్తు - 'భర్తవు ఇత్యేవ పాఠ్యమ్.

వి:- వా, ఆత్మాస్మదోః, ద్రుతస్య, స్యాత్, లుక్ - అని ఛేదము. ఆత్మాస్మచ్ఛబ్దములద్రుతమునకు లోపము వికల్పముగా నగునని సూత్రార్థము. లోపమునకు నిమిత్తములు సరళస్థిరవర్ణములు. అవి పరముగు నపుడే ఆత్మాస్మచ్ఛబ్దముల ద్రుతమునకు లోపము కలుగునని యూహింపనగును. 'తాను, నేను' అనునవి ఆత్మాస్మచ్ఛబ్దప్రథమైకవచన రూపములు. కవిభల్లటసూత్రముచే నకారములోని యుకారమునకు

లోపము చేయఁగా 'తాన్, నేన్' అనురూపము లేర్పడును. వానిలోని ద్రుతమునకు సరళస్థిరవర్ణములు పరమగునపుడు వికల్పముగా లోపము కల్గునని తాత్పర్యము. ఆత్మార్థకశబ్దముల ద్రుతమునకు సరళస్థిరవర్ణ పరకత్వమున "లుగ్వా ద్రుతప్రకృతికాత్" అను సూత్రముచే లోపమును, సంశ్లేషమును ధారాళముగా వచ్చునవియు, స్వత్వముగూడ నుండున నియుఁ దెలియుచున్నది. అట్టిచో నీసూత్రమునకుఁ బ్రయోజన మేమియని శంక గలుగకపోదు. లుగ్వేతిసూత్రముచే లోపము కలిగినపుడు లోపాభావపక్షమున స్వత్వసంశ్లేషాదులుగూడఁ గల్గును. వానిని వారించు కొనుటకై యీసూత్రము చెప్పఁబడినది. ప్రథమైకవచనాంతములే యైనను 'నా, తా' శబ్దముల ప్రథమైకవచన 'ను' ప్రత్యయసంబంధమైన యుకారమునకు లోపముఁ జేయఁగా నేర్పడిన 'నేన్, తాన్' అను వానిద్రుతమునకు సంశ్లేషము తప్ప మిగిలినబింద్వాదికార్యజాతము కలుగును. 'నేను, తాను' శబ్దములతుది యుకారము లోపింపనియెడల 'ను' అనుదానికి ద్రుతత్వమే లేదుగాన ద్రుతికార్యవిధానసామర్థ్యముచేత నే కవిభల్లట సూత్రమువలననుత్వలోపమును జెందిన నకారము లీసూత్రమునకు విషయములని తెలియవలయును. ఇది దీర్ఘముమీఁది ద్రుతము గాన దీనికి నిండుసున్న రాదు. 'తాను, నేను' అనువాని నువర్ణోకార లోపమునకుఁ గవిశిరోభూషణము వివిధమార్గముల నాశ్రయించినది. కవిభల్లటసూత్రము ప్రాతిపదికములయందే వర్తిల్లునని భ్రాంతిపడినది. కవిభల్లటసూత్రోత్తరార్ధము 'ప్రథమైకవచనమాత్రమునఁ దెనుఁగునందు నాంతాదులును నిలుచును' అని కలదు. దానిచే ఉకారలోపము నిస్సంశయము. 'సలోలోశ్చ' అను సూత్రములోని 'చ'కారమహిమచే 'తాను, నేను' అనువానిలోని యుకారమునకు లోపమగునని వచించుయది సరికాదని యెంచి కావలయును "గసడదవా స్స్యుః" అను సూత్రములోని 'ఆత్మార్మదో ర్వానై వై తే' అనువర్యుదాసముచే నిట నువర్ణోకారలోపము కల్గునని వచించెను. ప్రథమావిభక్తితో నుండు

'తాను, నేను' అనువానిం దప్పించుటచేఁ బ్రథమావిభక్తిత్వము వాని నుండి తొలఁగిపోయి ద్రుతప్రకృతికత్వ మీపర్యుదాసముచేఁ దాను మున్నగువానికిఁ గల్గినది కాన నాద్రుతప్రకృతికత్వ ముత్వలోపముచేసి నపుడే కాని సిద్ధింపనందునఁ బర్యుదాససామర్థ్యముచే నుత్వలోపము వచ్చునని వచించి 'వాత్మాస్మదో ర్ద్రుతస్య స్యా ల్లుక్' అనుసూత్రము లోని లుగ్విధిసామర్థ్యముచేతనైన నుకారలోపము కల్గునని నిర్ణయము కావించినది. నిజమున కివి సరియగుమార్గములు కావుకదా! 'చెడు నిహాముం బరంబు నిది' 'తన కిష్టుఁడున్ సహాధ్యాయుఁడు నైనవాఁడు' అనుభట్టారకప్రయోగములందు 'ఉవర్ణక స్యాస్య ద్వ్యన్తాత్తు' అనుచొప్పున వచ్చిన 'నున్' అనునది చేరి 'ఇహామునున్, పరంబునున్' 'ఇష్టుఁడునున్ సహాధ్యాయుఁడునున్' అనుచోట్లనున్న 'ను' అనుదానికి లోపము చేయఁగా 'ఇహాముం బరంబు నిది' అనురీతి రూపములు సిద్ధించును. ఇట్లే 'ఏనియున్' అనుదానిలో 'యు' వర్ణము లోపించి 'ఏనిన్' అని యగును. వీనికి లోపవైకల్పికత 'ఉవర్ణక శ్చాద్వ్యన్తాత్తు' అను దాని యందలి 'చ, తు' అనుశబ్దములచే సంపాదింపవలెనని వ్యా.సం. స. చెప్పుచున్నది. మీఁది నన్నపార్యుసిప్రయోగము లీవ్యాఖ్యానమును బలపఱచుచున్నవి. దీని నంగీకరించునపుడు 'ఆర్తుల నీవ నేర్తు వర యంగఁ ద్రిమూర్తివిలాసవర్తివిన్' అనుపాఠమును సవరింప నక్కఱలేదు. 'త్రిమూర్తివిలాసవర్తియున్' అనియుండఁగా 'యు' అనునది లోపించినదని యూహింపనగును. 'నేన్+చదివితిన్, తాన్+వినెన్' అను చోట్ల 'నేఁజదివితిన్, తా వినెన్' అనురూపములు గల్గును. 'గిరివ్రజ మన్పురంబు' మున్నగుచోట్ల 'శ్లిష్టత్వాచ్చ క్వచిత్' అనుచొప్పున సంశ్లేషము. 'తాను, నేను' శబ్దములలోని 'ను' అనుదానికంటె భిన్నమైన 'మ్రాను' మున్నగువాని నువర్ణమున కుల్లోపము చేయఁగా మిగిలిన యవయవనకారమునకు ద్రుతకార్యము లన్నియును మహాకవిప్రయోగానుసారముగా బహుళముగా నగును. కాని యిచట సంశ్లేషమే

యగునని యెన్నఁగును. 'చెడు నిహాముం బరంబు' అనునప్పుడు సము చ్చయార్థకక నువర్ణకముచోట బిందువు కల్గినది. ఇట్లే 'ఇష్టుండుఁ సహాధ్యాయుఁడు' మున్నగుచోట్ల సర్థవిశేషమున వచ్చిన నువర్ణక ద్రుతము సంశ్లిష్టమైనది. 'అర్తుల నీవ నేర్తు వరయంగఁ ద్రిమూర్తి విలాసవర్తివిన్' అనుచోట సర్థవిశేషమున వర్తివియున్' అని యుండ నగుననియు నట్లు సవరించినచోఁ బద్యము చెడుననియు నాకారణముచే 'వర్తివిన్' అనుదానికి మాఱుగా 'భర్తవున్' అని పఠింపవలెననియుఁ గవిశిరోభూషణ మభిప్రాయపడినది. 'ఉన్, నున్' అనునవి ద్రుతోప జీవిశబ్దములని యథర్వణాచార్యుల యభిప్రాయము. ఈపై విషయము లనుబట్టి 'తాను, నేను' పదములు ప్రథమావిభక్త్యేకవచనములై నను నుకారోకారలోపానంతరము ద్రుతప్రకృతికము లగుచున్నవి-అని కవి శిరోభూషణాభిప్రాయము స్పష్టమగుచున్నను, సూరిగారు 'ను' వర్ణము నే ద్రుతముగా సంగీకరించుటకు హేతు వగపడదు. ప్రౌఢవ్యాకర్తయు సూరిగారిమార్గానుసారియే యయ్యెను.

85 సూ :- "వాక్యాన్తగతపదానాఞ్చ"

85. సూ :- వాక్యాన్తగతపదాన్తే స్థితస్య చ ద్రుతస్య లుగ్వా స్యాత్ - యత్ర న ఛందోవిరోధః తత్రైవాయం లుగ్వికల్పకః. యత్ర తు ఛందోఽవిరోధః తత్ర వ్యవస్థితోఽయమితి జ్ఞేయమ్. సకలలోకాభినంద్య కలాకలాపంబు దొరయు నెమ్మొముచందురునితోడ, బహుదివ్య ఫలపరిపాక సౌభాగ్యంబు నెఱయుకెమ్మోవి మానికముతోడ" అత్ర వ్యవస్థితః. 'అమ్లానమమాలికాభిరూప్యముఁ దాల్చులలితభుజా కల్పలతలతోడ' అత్ర వికల్పః. విరోధాభావాత్. 'రాజీవానన యేడ్చెఁ గిన్నర వధూరాజత్కరాంభోజకాంభోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగాన్' ఇతిపాఠే వికల్పః. - 'తోరంబుగన్' - ఇతిపాఠే విరోధాన్నాస్య ప్రవృత్తిః. - 'అలరె నెత్తావి కేళీవనాగ్రసీమ పంచశరభూత పరిభూత పంచభూతములఁ దదీయస్థలం బులఁ గలుపుకరణి' అత్ర ప్రవృత్తిః. ఏవం సర్వత్ర జ్ఞేయమ్. అథర్వణో నాప్యుక్తమ్.

"వాక్యావసానగస్య స్యాల్లోపో నః ప్రాయశోఽత్రహి" ఇతి.

వాక్యఞ్చాత్ర పాదఏవ. సీసాదిషు ప్రతిపాదం వాక్యమ్. వృత్తాదిషు పూర్వార్థ ముత్తరార్థఞ్చ వాక్యద్వయమ్. క్వచి త్పద్యభేదేనైవ లుక్ -

"పద్యభేదావసానేషు శ్లిష్టతా నస్య కథ్యతే"

ఇతి తేనైవో క్తత్వాత్. 'ఏతాదృశగుణమహిమ ఖ్యాతాసమ సమగ్రవిధికిఁ గరుణాం బుధికిన్' - ఇత్యాది తత్రోదాహరణమ్.

వి:- వాక్యాన్తగతపదానాం చ- అని ఛేదము. వాక్యాంతమునం దున్న పదములద్రుతమునకు వికల్పముగా లోపము కల్గునని సూత్రార్థము. గుర్వంతము లగుపద్యములతుదివర్ణము హ్రస్వ మైన చో, దానికిఁ బిదప నున్నద్రుతమునకు లోపము రాదు. ఆతుదియక్షరము హ్రస్వమైన ద్రుతలోప మైచ్ఛికము. లఘ్వవసాయిపద్యములతుదియక్షరముమీఁదిద్రుతము నిత్యముగా లోపించును. వాక్యావసానమునఁ బదాంతద్రుతమున కాంధ్రభాషయందు లోపము తఱుచుగా నగును- అని 'వాక్యావసానగస్య' అనుదాని కర్థము. కందము మున్నగు కొన్ని పద్యములతుదియందు ద్రుతమునకు సంశ్లేషమును జెప్పఁబడుచున్నది-అని 'పద్యభేదావసానేషు' అనుదానికర్థము. కవిశిరోభూషణము 'కరుణాంబుధికిన్' అనుదానిని సంశ్లేషమని యిచట నంగీకరించుచు ద్రుతము పరవర్ణముతోఁ గూడుట సంశ్లేషమని స్వవచనవ్యాఘాతముగా "పరవర్ణేన సాకం ద్రుతస్య సంశ్లేషశ్చ భవతి" అని వ్రాయుట వింత. ద్రుతము పూర్వాచ్ఛునంటియుండుటయే సంశ్లేష మనునభిప్రాయము కవిశిరోభూషణమునకును గలదని దీనింబట్టి తెలియుచున్నది. ఇచట 'నెమ్మోము చందురునితోడ, కెమ్మోవిమానికముతోడ' అనునవి సీసపద్యపాదాంతములు. సీసపద్యమునఁ బ్రతిపాదము వాక్యమే కనుక వాక్యావసానద్రుతమునకు లోపము కలిగినది. 'లలితభుజాకల్పలతలతోడ' అనునపుడు లోపము వికల్పము. ఇచట లోపము కలిగినను గల్గకున్నను విరోధము లేదు. 'తోరంబుగాన్' అనుచోట వికల్పము, 'తోరంబుగన్' అనియు

నుండనగు. ఇందుఁ గలవాక్యశబ్దమునకుఁ గందవృత్తాదిపద్యములలోఁ బూర్వార్ధోత్తరార్ధములును సీసగీతాదులలోఁ బ్రతిపాదము ననియర్థము.

సూరిగారిమతమున ద్రుతము నుస్వరూపము కనుక వాక్యావసానమున ద్రుతస్వరమునకు ద్రుతమునకును లోపమును "అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగా నగు" అని వారు (బాల.సంధి.20సూ) సూత్రించిరి.

**86. సూ :- నలడాదే ర న్తరుత శ్చ.**

86. సూ :- ఏకపదాన్తస్థితో యో నలడాదివర్ణ స్తస్యోకారస్య చ వా లుక్స్యాత్. 'చిలుక - చిల్క, పునుక - పున్క, కినుక - కిన్క, మినుకులు - మిన్కులు, పలుకులు - పల్కులు, కాలువ - కాల్వ, కదుపు - కద్పు" ఇత్యాది. ఆదిశబ్దేన - 'కార్పోతు' - ఇత్యాది గ్రాహ్యమిత్యుక్తం సరస్వత్యా. తత్ర యద్యపి చిలుకేత్యాదివ న్నైకపదత్వమ్, తథాపి జంతువిశేషనామత్వేన రూఢత్వా త్సమస్తత్వా చ్చైకపదత్వం గ్రాహ్యమ్. 'త్రాడు - పాడు' - ఇత్యాది ష్వన్తోకారస్య వ్యావృత్త్యర్థ మన్తగ్రహణమితి సరస్వతీ.

వి:— నలడాదేః, అన్తరుతః— అని ఛేదము. పదమధ్యమం దున్న నలడాదివర్ణములలోని యుకారమునకు లోపము వికల్పముగాఁ గల్గునని సూత్రార్థము. 'చిలుక—చిల్క, కినుక—కిన్క, కదుపు—కద్పు, మురువు—ముర్వు' మున్నగునవి యుదాహరణములు. 'అన్తరుతః=పదమధ్యోకారమునకు' అనియనుటచే 'త్రాడ్వేసె' 'ప్రమాన్వడియె' మున్నగురీతి రూపము లుండవని తెలియుచున్నది. 'కార్పోతు' అనునది సమాసమగుటచే నేకపదమగును గాన సాధువే యగును.

**87. సూ :- అన్యేషాఞ్చ ప్రయోగమహితానామ్.**

87. సూ :- ప్రయోగమహితస్య నలడాదివర్ణావయవస్య అన్యస్య చ వా లుక్స్యాత్. 'కలికి - కల్కి, ములికి - ముల్కి, ఉనికి - ఉన్కి'; ధాతుష్వపి 'అలిగి- అల్గి, పలికి - పల్కి' ఇత్యాది. 'ఉంగరము - ఉంగ్రము' ఇత్యాది. ప్రయోగమహి

తానా మిత్యుక్తే రయమర్థః ప్రతీయతే. ఉకారస్యైవ వా లుకో యది ప్రయోగమహితత్వం అన్యేషా మచాం తర్హి తేషామపి వా లుగితి. తేన "ఏనుఁగు, అడుగు, వడుగు, పడుగు, కడుగు, వాలుగ, తలియ, గద్దియ, ముంగర, తామర" ఇత్యాదౌ న లుక్ప్రవృత్తిః. అత్రేద మనుసన్ధేయమ్. 'త్రాడు' ఇత్యాదౌ కవిభల్లటసూత్రప్రవృత్తి రస్త్యేవేతి. 'వనము, రాముఁడు, కలికి, ముంగర" ఇత్యాదౌ ఉకారాదే ర్లోప వ్యావృత్త్యర్థ మన్తర్గ్రహణమి త్యుక్తమితి. ప్రయోగశరణత్వా త్తత్రాప్యసావశ్యక మేవేతి స్పష్టార్థమేవ తత్. ఉదితో రేవ లోపవిషయత్వమితి బహువచనం ప్రయోగప్రాచుర్యద్యోతనార్థమితి. 'విస్మిదిరియె కాదు' - ఇత్యాద్యాచార్యప్రయోగాత్ చిలుకేత్యాది నామధేయేష్వేవాయం విధిరితి నియన్తుం న శక్యతే. తేన - పోశ్చ తదాద్యర్థవాచకేష్వాతః" - "చా రే రుపధాత్మనశ్చ లుగ్వాస్యాత్" ఇతిసూత్రద్వయస్య విశిష్యారమ్భస్తు స్పష్టప్రతిపత్త్యర్థమ్. "శత్రర్థే తూతశ్చానోః" ఇతిసూత్రేణ బిన్దుమాత్రం విశేషతో విధీయత ఇతి ప్రతిభాతి.

వి:- అన్యేషాం, చ, ప్రయోగమహితానామ్-అని ఛేదము. మహాకవిప్రయోగప్రసిద్ధములగు నలడాదివర్ణావయవోకారమునకే కాక యితరాచ్చులకును వికల్పముగా లోపము రావచ్చునని సూత్రార్థము. 'కలికి, కల్కి; ములికి, ముల్కి; ఉనికి,ఉన్కి; మొ. గాక, అలిగి, అల్గి; పలికి, పల్కి;' మున్నగుక్రియలయందును నిట్టిలోపము కల్గునని తెలియుచున్నది. 'ఉంగరము, ఉంగ్రము' అనుచోట 'అ'కారమునకును లోపము కల్గినది. ఉకారమునకువలె మిగిలినయచ్చులును ప్రయోగమహితము లగునపుడు వానికిని లోపము కల్గుననునర్థము ప్రతీయమాన మగుచున్నది. కాన 'ఏనుఁగు, అడుగు'మున్నగువానియందు 'ఉ'కారలోపము కల్గుచున్నది. 'వాలుగ, తలియ, గద్దియ, ముంగర, తామర' మున్నగువానియం దీలోపము ప్రయోగమహితము కానందున రాదు. 'త్రాడు'మున్నగు వానియందుఁ గవిభల్లటసూత్రముచే 'ఉ'కారలోపము కల్గి 'త్రాడ్వోనె' అనురీతిరూపములు కల్గును. 'రాముఁడు, వనము, ముంగర, కలఁక' (కలికి-కాదు) మున్నగువానియం దీలోపము రాకుండుటకై సూత్రమునందు 'అంతర్' అనుపదము వేయఁబడినది. ప్రయోగమహితములకే

యీలోపమగు ననుటచే నిది స్పష్టార్థమే యని తెలియుచున్నది. 'విన్మిదియు కాదు' అను ప్రయోగముచే నీలోపము క్రియలయందును రావచ్చునని తెలియుచున్నది.

బాలవ్యాకరణము 'నలడాదే ర స్తరుతశ్చ' అనుసూత్రమును 'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' (బాల-ప్రకీర్ణ-17 సూ) అనియు, 'అన్యేషాఞ్చ ప్రయోగమహితానామ్' అను దానిని 'లాతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి' (బాల-ప్రకీర్ణ-18 సూ) అని వివరించినది.

ఇతి శ్రీ......ద్వితీయ స్సన్ధిపరిచ్ఛేద స్సమాప్తః.

సంధిపరిచ్ఛేదము సమాప్తము.



ఓమ్

విఘ్నేశ్వరాయ నమః

# కవిశిరోభూషణ వివృతి

(రెండవ భాగము)

## అజన్త పరిచ్ఛేదము

**88. సూ :- డుముపులవః ప్రథమా స్యాత్.**

88 సూ:- డు, ము, వు, లు- ఇత్యేతే ప్రథమావిభక్తిసంజ్ఞా స్స్యుః. దేశ్యాస్మ ద్యుష్మద్విహితానాం స్వాదీనా ముప్యుపలక్షణ మేత దితి జ్ఞేయమ్.

వి:- డుముపులవః, ప్రథమా, స్యాత్-అని ఛేదము. డు,ము,వు, లు-అనునవి 'సు, ఔ, జస్' అనుసంస్కృత ప్రథమావిభక్తి ప్రత్యయముల కాదేశము లగుచుఁ బ్రథమావిభక్తిసంజ్ఞ గలవగును. 'నా, నీ' అను అస్మద్యుష్మచ్ఛబ్దములకంటె విహితములైన 'నుము-వురు' అనువానికిని డుమ్వాదు లుపలక్షణములు గావున నవియుఁ బ్రథమావిభక్తి సంజ్ఞకము లగుచున్నవని తెలియవలయును.

**89. సూ. కూర్చిలనునయో భవే ద్ద్వితీయా తు.**

89 సూ:- కూర్చి, ల, ను, ని-ఇత్యేతే వర్ణాః ద్వితీయావిభక్తిసంజ్ఞాః స్యుః.

వి:- కూర్చిలనునయః, భవేత్, ద్వితీయా, తు- అని ఛేదము.

'కూర్చి, ల, ను, ని-అనునవి ద్వితీయావిభక్తిసంజ్ఞకము లగునని యర్థము. ఇవి సంస్కృతద్వితీయాప్రత్యయము లగు 'అమ్-ఔట్-శస్' అనువాని కాదేశము లగును.

**90. సూ :- తో చేత తోడ చే స్స్యు స్తృతీయాయాః.**

90 సూ:- 'తో' ఇత్యాదయ స్తృతీయావిభక్త్యా స్స్యుః. తృతీయావిభక్తిసంజ్ఞకా ఇత్యర్థః.

వి:- 'తో, చేత, తోడ, చే, స్స్యుః, తృతీయాయాః'-అని ఛేదము.

పై ప్రత్యయములగు తో, చేత, తోడ, చే, అనునవి తృతీయా విభక్తిసంజ్ఞ గలవగు నని యర్థము. ఇవి 'టా, భ్యాం, భిస్' అను సంస్కృత తృతీయావిభక్తిప్రత్యయముల కాదేశము లగును.

**91. సూ:- కొఱకుకయీ చతుర్థ్యాః స్తః.**

91 సూ:- కొఱకుకయీ త్యేతౌ చతుర్థీవిభక్త్యా భవతః. చతుర్థీవిభక్తిసంజ్ఞకా ఇత్యర్థః.

వి:- కొఱకుకయీ, చతుర్థ్యాః, స్తః' అని ఛేదము. కొఱకు కయి అనునది లుప్తవిభక్తికము. 'వాయిరవుర్వ్యక్తవతా' అను సూత్రము చొప్పున 'కయి' అనునది 'కై' అనురూపమును బొందును. 'కొఱకు-కయి-కై' అనునవి చతుర్థీవిభక్తిసంజ్ఞ గల వగుచున్నవి. ఇవి "ఙే-భ్యాం-భ్యస్" అను సంస్కృతచతుర్థీవిభక్తి ప్రత్యయముల కాదేశము లగును.

**92. సూ :- పట్టి. వలన, కంటే-ఇతి పఞ్చమీ.**

92 సూ:- ఏతే పఞ్చమీ విభక్తిసంజ్ఞా స్స్యుః

వి:- 'పట్టివలనకంటే, ఇతి, పఞ్చమీ'-అని ఛేదము. పట్టి వలన కంటె అనునవి పంచమీవిభక్తి సంజ్ఞ గలవి యగుచున్నవి. ఇవి 'ఙస్-భ్యాం-భ్యస్' అను సంస్కృతపంచమీవిభక్తిప్రత్యయముల కాదేశము లగును.

**93 సూ. అథ లోపలకికుయొక్కానాం.**

93 సూ. అథే త్యానంతర్యాదిపర శ్శబ్దః. లోపలే త్యాదయః షష్ఠీవిభక్తి సంజ్ఞకాః స్స్యుః.

వి:- అథ, లోపలకికుయొక్కా, అన్యాః అని ఛేదము. లోపల, కి, కు, యొక్క - అనునవి షష్ఠీవిభక్తిసంజ్ఞకప్రత్యయములగును. "జస్-ఓస్-ఆమ్"అను సంస్కృతషష్ఠీ విభక్తిప్రత్యయముల కివి యాదేశము లగును.

**94.** సూ :- అన్ద్విన్దునాస్తు సప్తమీ.

94 సూ :- అన్ద్వాదయః సప్తమీవిభక్తిసంజ్ఞకా స్స్యుః. ఇతరశబ్దానాన్తు నులోపవిధానా త్ప్రథమా న్తత్వం జ్ఞేయమ్.

వి:- అన్ద్విన్దునాః, తు, సప్తమీ- అని ఛేదము. అందు మొదలగునవి సప్తమీవిభక్తిసంజ్ఞ గలవి యగును. కొన్నిశబ్దములకు 'ను' లోపము విధింపఁబడును. కావున నవియుఁ బ్రథమాంతములే యని తెలియవలయును. వీనిలోఁ బ్రథమా కయిపట్టి యొక్క అనునవితప్ప మిగిలినవి 'అన్యే ద్రుతప్రకృతయః' అనుచోవ్వున ద్రుతప్రకృతికము లగుచున్నవి.

సూరిగారు పై సూత్రములను యథాతథముగనే యీరీతి ననువదించి యున్నారు.

డుములు ప్రథమ (బాల. తత్స. 1సూ); నువర్ణంబు ద్వితీయ (బాల.తత్స. 2); చింతామణి 'కూర్చిలనునయో భవే ద్వితీయా తు' అని నాల్గుప్రత్యయములను బేర్కొనినను సూరిగారు 'ను' అను దానిని మాత్రమే చెప్పుట ఉత్వవిశిష్టమైన 'న' కారమే ద్రుతసంజ్ఞక మగునని దృఢపఱుచుటకే యని తోఁచుచున్నది. వీరి ననుసరించి ప్రౌఢవ్యాకర్త నకారం బసాధారణంబు ద్రుతంబు, (ప్రౌఢ-సం- 7సూ) అని సూత్రించెను. అసాధారణత్వమును వివరించినపద్ధతిని జూడఁగా శబ్దావయవ నకారమునకు ద్రుతసంజ్ఞ లేదని వీరిమత మైనట్లు తెలియనగుచున్నది. మఱియు నవ్యయాత్మకద్రుతము సముచ్చయాద్యర్థములలో వచ్చిన 'ను, శబ్దము. ఇవి శబ్దావయవ నకారము కానట్లుగా వీరిమత మభివ్యక్త మగుచున్నది.

చేత-తోడ-తృతీయ (బాల. తత్స 3సూ.) అని సూరిగారు తృతీయావిభక్తిప్రత్యయములను బేర్కొనిరి. చింతామణి చెప్పిన 'తో-చే' అను ప్రత్యయములను "చేత, తోడ, లోపల-వర్ణకంబుః ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు"నని (బా.తత్స-10సూ) సంగ్రహించెను.

"కొఱకు-కయి చతుర్థి" (బాల. తత్స-4) అను సూత్రముచే 'కొఱకు కయి చతుర్థ్యాకస్తక' అను సూత్రము వివరింపఁబడినది.

"వలన కంటె పట్టి పంచమి" (బాల-తత్స-5సూ) అను సూత్రముచే "వట్టి వలన కంటే ఇతి పఞ్చమీ" అను సూత్రము సంగ్రహింపఁబడినది. సంస్కృతమునందు 'ఏ'కారమునకు హ్రస్వత లేదు గావున 'కంటే'యని దీర్ఘాంతముగాఁ బఠింపఁబడినను 'కంటె' యని హ్రస్వాంతముగనే దానిని గ్రహింపవలసియుండును.

'కు యొక్క లోపల షష్ఠి' (బాల-తత్స-6 సూ) అను సూత్రముచే 'కికుయొక్కాన్యా" అను చింతామణి వివరింపఁబడినది. చింతామణి కి, కు, అను రెంటినే చెప్పి యున్నను సూరిగారు తమప్రణాళికననుసరించి 'కు' అనుదానినిమాత్రమే చెప్పియున్నారు. 'లోపల' అనునది షష్ఠ్యర్థమునందుఁ బ్రత్యయముగను, సప్తమ్యర్థమున స్వతంత్రశబ్దముగను నగపడుచున్నది. కావుననే ప్రత్యయమైన 'లోపల' అనుదానిని మాత్రమే సూరియు నన్నపార్యుఁడును వచించియున్నారు.

'అందు న సప్తమి' (బాల.తత్స. 7సూ) అనుసూత్రముచే 'అన్ద్విన్దునాస్తు సప్తమీ' అను చింతామణి వివరింపఁబడినది. 'ఇందు' అనునదియుఁ జింతామణిచేఁ బ్రత్యయముగా గ్రహింపఁబడినదని తెలియనగును. 'తృతీయాదులకు నుగాగమం బగు' (బాల.తత్స.8) అని చెప్పి తిఙ్మధ్యసూత్రముచే సిద్ధించినద్రుతాంతత్వమును ద్రుతప్రకృతికత్వమును సూరిగారు సంపాదించి యున్నారు. సూరిగారిమతమున ద్రుతాంతము లయినపదము లన్నియు ద్రుతప్రకృతికములే. కావుననే 'రాముఁడున్,

కృష్ణుఁడున్, అదియున్, ఇదియున్' 'తానున్, నేనున్' మున్నగున వన్నియుఁ బ్రథమాంతము లగుటచేఁ గళలైనప్పటికిని ద్రుతప్రకృతిక ములే యగుచున్నవి. వికృతివివేక మిట్టివానిని ద్రుతోపజీవిశబ్దములని వచించెను. 88 సూత్రము మొదలు 95 సూత్రమువఱకుఁ దెలుఁగు నందలి ప్రత్యయములు చెప్పఁబడినవి. ఏతదంతములు పదములు కాఁ జాలవని తలఁచి చింతామణి తెలుఁగునామములమీఁద సంస్కృతసుప్పు లనే నిల్పి వాని కీతెన్గుప్రత్యయముల యథాసదృశముగ నాదేశించి నది, క్రియలనుగూడ నట్లే యనఁగాఁ గ్రియలపైని సంస్కృతములోని తిఙ్ ప్రత్యయములను నిల్పి వానికిఁ దెన్గుప్రత్యయముల నాదేశించినది. ఇట్లు చేయుటవలనఁ దెనుఁగుశబ్దములన్నియుఁ బదములై, 'అపదం నప్రయుఞ్జీత' అను భాష్యవచనమునకు విరుద్ధము కానివై కావ్యాదిగ్రంథ ప్రయోగయోగ్యము లగుచున్నవి. దీనినే శాస్త్రీయసంప్రదాయ మనియందురు. ప్రయోజనము లేకుండ నింతపెద్దప్రక్రియ నాశ్రయింప నేల యని శంకింపఁజనదు. దీని నాశ్రయింపకున్నచో భాష సంప్రదా యవిరుద్ధము, నశాస్త్రీయము నగును. అట్లైన నేమి యని యనరాదు. అట్లైన నెవరికిఁ దోఁచినట్లు వారు భాషను గావ్యములలో నుపయోగిం తురు. అట్టిచో నొకరిభాష మఱొకరికి సరిగా నర్థము గాదు. అట్టి కావ్య ములు జాతిప్రతిష్ఠలకు హానికరములు. కావ్యములు జాతిప్రతిష్ఠకుఁ జిహ్నములుగ నుండవలెఁగదా!

95. సూ :- ఓయీ త్యామన్త్రణఞ్చ వికృతౌ స్యాత్.

'న్యుః ప్యా ట్వా డంగ హే హై భోః-

ఇత్యాదయః ఆద్యప్రకృత్యా మామన్త్రణపరాః. 'దే సమ్ముఖీకరణే' ఇత్యనుశాసనాత్ ప్రకృత్యాదౌ 'దే' ఆమన్త్రణార్థే ప్రయుజ్యతే. వికృతావత్ర తు "ఓ" ఇత్యామన్త్రణం స్యాత్. బాలసరస్వత్యా తు ద్వ్యక్షరపాఠో వ్యాఖ్యాతః. ద్వితీయాచార్యేణాపి ద్వ్యక్షరశబ్దమే వోరరీకృత్య,

"వికృతావత్ర వా లోపః సంబుద్ధ్యోయిపదే తు యేః
స పూర్వత్ర స్థిత స్స్వ ద్రో ఇతి శ్రీవాచకో భవేత్

పరత్రైవ ప్రయోగస్తు స్యాద్ద్వయో రపి చాద్యవత్
నీచతాయాం రిసీ స్యాతాం క్వచి న్మైత్ర్యాం చ తచ్ఛ్రుతిః"

ఇత్యుక్తమ్. యత్ర పురుషామన్త్రణం తత్ర లోపవికల్పః. యత్ర స్త్ర్యాద్యామన్త్రణం తత్ర వ్యవస్థితవిభాషా, ద్వ్యక్షరస్య ప్రయోగాభావాత్. ఉభయత్రాపి తస్య పూర్వత్రైవ ప్రయోగః. 'రో' ఇతి వర్ణస్తు స్త్రీమాత్రసంబోధనపరః. తస్య పరత్రైవ ప్రయోగః. తయోః ప్రయోగవికల్ప స్త్వాద్యయో మివ జ్ఞేయః. యద్యపి పురుషామన్త్రణేపి ద్వ్యక్షరస్య ప్రాయశః ప్రయోగో న దృశ్యతే. తథాపి-

"ఓయి దయావిహీనమతి యోజక యోపసిబిడ్డఁ గొట్టఁగా" ఇత్యాదిపద్యేషు క్వచి ద్దృశ్యత ఏవ.

"సంగతియయోయి యినుమంత తింగణావు"-

ఇత్యాదిషు వచనేషు అజ్ఞాదిశబ్దవత్ స్వాతన్త్ర్యేణాపి ప్రయోగో జ్ఞేయః.

'అమ్మ చెల్లరో' ఇత్యాది ప్రయోగస్తు,

"అన్యత్రాపి క్వచి ద్రో స్యా ద్రూఢదేశ్యప్రయోగతః"-ఇతి వచనాత్సాధుః.

ఓకారా దనన్తరం రిసోః ప్రయోగే 'ఓరి ఓసీ'తి సిద్ధమ్. 'ఓరిమరాత్మ' ఇత్యాది; మైత్ర్యామ్ ఓరితండ్రీ నన్నుఁజూడరా; ఓసమ్మా; 'ఓసికస్తురాలా' ఇత్యాదిరూపం గ్రాహ్యమ్.

వి:— ఓయి, ఇతి, ఆమన్త్రణమ్, చ, వికృతౌ, స్యాత్-అని చ్ఛేదము. సంబోధనమున 'ఓయీత్యామంత్రణఇచ్చ వికృతౌ స్యాత్' అనియు, 'ఓ—ఇత్యామంత్రణ ఇచ్చ వికృతౌ స్యాత్' అనియు రెండు పాఠము లున్నట్లు గోచరించుచున్నది. అథర్వణవివరణమునుబట్టి ఓయీ అను ద్వ్యక్షరపాఠమే నన్నపార్యప్రోక్తమని కవిశిరోభూషణ మంగీకరించినది.

సంస్కృతభాషయందు సంబోధ్యవాచకమునకు ముందు 'హ్యాట్ పాట్ అంగ హే హై భో మున్నగునవి సంబోధనమునం దుపయోగింపఁబడుచున్నవి. ప్రాకృతమునందు 'దే' అనునది యుపయోగింపఁబడుచున్నది. తెనుఁగున సంబుద్ధియందలి 'ఓయి' అనుదాని 'యి' వర్ణము

నకు వికల్పముగా లోపము గల్గును. దానిచే 'ఓ, ఓయి' అను రెండును సిద్ధించెను. అవి సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడుచుండును. 'రో' యనునది యొకటి స్త్రీవాచకములకుఁ బిమ్మట సంబోధనమునందు నిల్చుచున్నది. సంస్కృతభాషయందువలెనే వీనికినిఁ బ్రయోగవికల్పత గల్గుచున్నది. కాన 'ఓరాముఁడ, ఓయిరాముఁడ, రాముఁడ' అను రూపములు సిద్ధించుచున్నవి. 'రో' అనుదానికి సంబోధ్యవాచకమునకుఁ బరముగనే ప్రయోగ మగపడుచున్నది. నీచత్వార్థమునందు 'రి—సి' అనునవి 'ఓ' యనుదానికిఁ బిమ్మట నాగమములుగా వచ్చుచున్నవి. ద్వ్యక్షరపారమున 'రి—సి' అనునవి పర్యాయముగ 'యి' వర్ణమున కాదేశము లగు నని వ్యాఖ్యానింప నగును. ఒకప్పుడు మైత్రియందును నివి గన్పడుచున్నవి—అని పై యథర్వణవచనమున కర్థము. "ఓయి దయావిహీనమతి" మున్నగు మూలోదాహరణముల నిట ననుసంధించుకొననగును. స్త్రీవాచకేతరస్థలములలో నొకప్పుడు ప్రసిద్ధి ననుసరించి దేశ్య స్త్రీవాచకశబ్దముల చివర 'రో' అనునది ప్రయోగింపఁబడుచుండును—అని 'రో' ఇతి స్త్రీవాచకో భవేత్' అను దానికిఁ దాత్పర్యము. నిజ మాలోచింపఁగా 'రో' యనునది చేరినపుడు శబ్దము స్త్రీవాచకముకాని స్త్రీసమముకాని యయి ప్రథమైకవచన లోపము నందుచున్నదని వ్యాఖ్యానించుట సముచితము. అట్లు గావించినచో 'ఏనుంగురో!', 'బసవరో' మున్నగురీతి రూపములు సుసాధములగుచున్నవి.

ఈసందర్భమున బాలవ్యాకరణకర్త, 'ఓ యామంత్రణంబునందగు' (బాల.తత్స-14సూ) అని వ్రాసి పై యథర్వణవచనముల వివరణరూపముగఁ గొన్ని వ్రాసెను. మఱియు 'ఓ' శబ్దమునకుం బురుషనీచస్త్రీపురుషామంత్రణంబులందు 'యి-సి-రి' వర్ణంబులు విభాష నంతాగమంబు లగు' (బాల-తత్స-15 సూ) అనియు ఓరి-ఓసి మైత్రియందుం గలవు (బాల-తత్స. 16 సూ) అని మూఁడుసూత్రములలోఁ గవిశిరో

భూషణము ననుసరించి వివరించెను. అయినను 'రో' శబ్దమును విడిచి వేయఁగాఁ, ప్రౌఢవ్యాకర్త 'రో' శబ్దంబొండు స్త్రీవాచకంబునకుఁ బరంబుగ నగు; నయ్యాది ప్రాస్వాంతంబును నయ్యేడి' నని యావిషయమును వివరించెను. (ప్రౌఢ.శబ్ద.14) మఱియు 'ఓ' శబ్దం బొక్కచో సంబోధ్యవాచకంబునకు ముం దితరశబ్దవ్యవహితంబయి కానంబడియెడి" (ప్రౌఢ. శబ్ద.13) అని వివరించెను. దీనింబట్టిచూడ ఓ, ఓయి మున్నగునవి సంబోధ్యవాచకమునకుముందు వచ్చు నియతప్రత్యయములు గావనియు నవి యొకప్పుడు ముందును వెనుకను గూడ రావచ్చు ననియు నవి ప్రత్యేకశబ్దములనియు గోచరింపకపోదు. 'అన్నరో, ఏనుంగురో' అను వానిని బౌఢవ్యాకరణము తప్పనుట సరికాదు.

"ఓడఁజాఁబొడుతుఁజుండో" (బసవ. 4ఆ.17) ఇందలి 'చుండు+ఓ= చుండో" అనుదానికిఁ జచ్చునట్లుగాఁ బొడిచెదను జూడుఁడు; ఓయయ్యాలారా యనియర్థము. కావున నిందలి 'ఓ' అనునది 'ఓయి' అనుదానిలోని యివర్ణము లోపింపఁగా మిగిలినదే యనవచ్చును. 'ఓ,ఓయి' అనువాని కంగీకారముగూడ నర్థము కలదు. 'ఓనావే (హరి. ఆ 2129) నేను బిలుచుచుంటినిగాన 'ఓ' యని యనవే' అని దానియర్థము. 'ఏమండోయి' మున్నగుచోట్లఁగూడ నోయిపదము సంబోధనార్థకమే యనవచ్చును. అనుధాతువునకు మధ్యమపురుషైకవచన బహువచనములలో 'అనుము-అనుఁడు' అను రూపము లుండును. అన్వాదుల నుస్థానమునఁ బూర్ణబిందువు చేయఁగా 'అండు' అని యగును. 'ఏమి+అండు+ఓయి = ఏమండోయి' అనియగును. ఇట్లుగా 'ఓ-ఓయి' అనునవి సంబోధనార్థమునందును నితరార్థములయందునుగూడఁ బ్రయోగింపఁబడుచున్నవి.

'ఓరి+ఓరి=ఓరోరి' అనునది యేకత్వమున నేకాక "ఓరోరి శూరులారా" అని బహుత్వమునను నగపడుచున్నది. ఇచటిద్విరుక్తి కృత్స్నార్థమునఁ గలిగినదనవచ్చును. 'హరిహరీ, కృష్ణకృష్ణ, బళిబళీ,

మున్నగువానివంటి దగును. 'రో రో' అనునవి స్త్రీవాచకశబ్దముల మీఁదనేగాక మహదమహద్వాచకశబ్దములమీఁదఁగూడ 'అన్నరో, ఏనుంగురో, ఒకవరో, కంబమయ్యరో, దేవరో, మున్నగు ప్రయోగములనుబట్టి వచ్చునని తెలియుచున్నది. దీనికి హ్రస్వమును గలదు. 'రమణిరొ' అని యుదాహరణము.

96. సూ :— స్త్రీపశుజడాన్వినాఽన్యే మహదాఖ్యాః.

స్త్రీపశువాచకా యే శబ్దా స్తాన్ వర్జయిత్వా తదన్యే సర్వే శబ్దా మహదాఖ్యా మహత్సంజ్ఞకా స్స్యుః. పశుశబ్దోఽత్ర తిర్యఙ్మాత్ర స్యోపలక్షణమ్.

వి :— స్త్రీపశుజడాన్, వినా, అన్యే, మహదాఖ్యాః — అని ఛేదము.

స్త్రీపశుజడవాచకములుతప్ప మిగిలినశబ్దములన్నియు మహత్తులనుసంజ్ఞ నొందుచున్నవి — అని యర్థము. సూత్రమునం దున్నపశుశబ్దము తిర్యఙ్మాత్రమున కుపలక్షణము. కాన దిర్యగ్వాచకశబ్దము లన్నియు నమహత్తులే యగుచున్నవి.

97. సూ :— తద్విశేషణాశ్చాపి.

మహద్విశేషణా న్యపి శబ్దాః మహత్సంజ్ఞకా భవన్తి. ఏతత్సూత్రద్వయేనైవ స్త్రీపశుజడవాచకానాం శబ్దానాం విశేషణైస్సహ అమహత్సంజ్ఞేతి సిద్ధోఽర్థః. దేవదత్తో వామేనాక్ష్ణా పశ్యతీత్యుక్తే దక్షిణేన న పశ్యతీతి వత్.

వి :— తద్విశేషణం, చ, అపి — అని ఛేదము. విశేషణశబ్దము సంస్కృతమున నిత్యనపుంసకమగుటచే తద్విశేషణంచాపి అని యుండ నోపునని వ్యా.సం.స. సవరించినది. కావున 'తద్విశేషణాశ్చాపి' అను పాఠము సరికాదు. దీనిచే మహద్విశేషణములు మహత్సంజ్ఞను, అమహద్విశేషణము లమహత్సంజ్ఞను బొందుచుఁ దత్తత్కార్యముల నందునని తెలియవలెను. సూరిగారు, "స్త్రీతిర్యగ్జడభిన్నంబులు వానివిశేషణంబులు మహత్తు లనంబడు" — (బాల. తత్స. 17) అని వివరించినారు.

**98. సూ :- మహతోఽత ఉద్విభక్తౌ.**

మహత అకారస్య ఉత్ స్యాత్ విభక్తౌ. అలోఽన్త్యస్యేతిన్యాయే నాన్త్యా కారస్య.

వి :- మహతః, అతః, ఉత్, విభక్తౌ - అని ఛేదము. అకారాంతమహద్వాచకశబ్దము తుది అకారమునకు విభక్తి పరమగునప్పు డుత్వము వచ్చునని సూత్రార్థము.

**99. సూ :- మహత స్సోర్డు జనితో భవేత్ పుంసి.**

99. సూ. 1:- అనిదన్తా న్మహతశ్శబ్దాత్పరస్య సోః స్థానే డుజితి స్యాత్పుంసి. హలన్త్యమితి జస్యేత్ సంజ్ఞాయామ్, తస్యలోపః ఇతి లోపః. ఉపదేశేఽజనునాసిక ఇత్" ఇత్యనే నోకారలోప స్తున. "ప్రతిజ్ఞాఽనునాసిక్యాః పాణినీయాః" ఇతి పాణినీయసిద్ధాన్తాత్. 'నహుషపుత్రుఁడన్' ఇత్యాచార్య ప్రయోగవిరోధా చ్చ. 'అనుక్త మన్యశబ్దానుశాసనవత్' ఇతి న్యాయేన సానునాసికోచ్చారణంజిత్' ఇతిసూత్రేణ సానునాసికత్వే 'రాముఁడు, రాముండు' ఇతి రూపద్వయమ్. 'జగన్మోహనుఁడు రాముఁడు' ఇత్యాది విశేషణానాం మహత్కార్యమ్.

వి :- మహతః, సోః, డుజ్, అనితః, భవేత్, పుంసి - అని ఛేదము. పుంలింగమహద్వాచకశబ్దమునకుఁ బరమం దున్న సంస్కృత 'సు' ప్రత్యయమునకు 'డు' అనునది యాదేశ మగునని యర్థము. 'రామ' యను ప్రాతిపదికమునకు సంస్కృత సుప్రత్యయము చేరి 'రామ+సు' అనియుండును. ఉత్వము చేయఁగా 'రాము+సు' అని యగును. 'మహత స్సోర్డుజ్' అనుదానిచే సుప్రత్యయస్థానమున 'డుజ్' చేయఁగా 'రాముఁడు' అనురూపము సిద్ధించుచున్నది.

'రాముఁడు'- అనుదానియందు డువర్ణకమునకు ముం దర్ధపూర్ణాన్యతరబిందువు నిలుచును. ఆబిందువు, 'అనుక్త మన్యశబ్దానుశాసన వత్' (ఈ గ్రంథమునఁ జెప్పఁబడనివిశేషము లేవైన నవసరమైన నితరవ్యాకరణములనుండి తెచ్చుకొని వాడుకొనవచ్చును) అను

న్యాయము చొప్పున "సానునాసికోచ్చారణం జిత్ (జకారేత్సంజ్ఞకము అనునాసికోచ్చారణము గల్గియుండును) అను ప్రాకృతసూత్రముచే నిచట ఖండపూర్ణాన్యతరబిందువు గల్గుచున్నదని కవిశిరోభూషణము వచించినది. జిత్వసామర్థ్యముచే నిట బిందువు గల్గినదనినచో సమంజసము గదా !

'సానునాసికోచ్చారణం జిత్' అను ప్రాకృతసూత్రముచే సిద్ధించిన దన్నచో నొక దోషముగూడఁ బొడఁగట్టుచున్నది. అనునాసికోచ్చారణము జకారేత్సంజ్ఞకమునకుఁ గల్గునని కదా ప్రాకృతసూత్రార్థము. అపుడు బిందువు 'రాముండు' అని కాక 'రాముఁడుం' అను ననిష్టరూపమునకుఁ గూడ సాధకమగునేమో ! అనునాసికోచ్చారణము ముందైనను వెనుకైనను గావచ్చునుగదా !

99. సూ. 2 :– 'పుంసీతి కిమ్' దశరథాపత్యము. బ్రహ్మము, తోకము – ఇత్యాదౌ మాభూత్. నియమాభావే తనయాదిశబ్దవత్ మహత్త్వేన డుజ్ స్యాదేవ. 'అపత్యం తోకం తయోః స్సమే' ఇత్యమరసింహో నార్థద్వయేఽపి క్లీబత్వానుశాసనాన్న డుజ్ సులోపౌ. "అత్యంతమధురజనకాపత్యమ్మగుకీరవాణి భావింతు మదిన్" "నిత్యునిఁ గోసలరాజాపత్యమ్మగు సత్యసంధుఁ బ్రణుతింతు నొగిన్" ఇతి.

వి :– "అపత్యులము" అను (ఆది. 2 ఆ. 65 ప) దానింబట్టి, యపత్యశబ్దమునకు నపత్యుఁ డను రూప మున్నట్లు తెలియుచున్నది. కాన నీచర్చ యనవసరము. 'పుంసి' యను విశేషణముచే నిత్యనపుంసకము లగునపత్యబ్రహ్మతోకాదిశబ్దములకు 'డుజ్జు' రాక 'ము' వర్ణకమే వచ్చును. కావున జనకాపత్యము, దశరథాపత్యము, బ్రహ్మము, తోకము మున్నగువానికి 'ము' వర్ణకమే కలుగుచున్నదని కవిశిరోభూషణ మనుచున్నది. కాని యపత్యశబ్దమునకు రెండురూపము లుండును. "బ్రహ్మ" మను రూపమును గవిశిరోభూషణము సాధించినపద్ధతి సరిగాదు. చతుర్ముఖుబుత్విగ్విప్రవాచకబ్రహ్మశబ్దము తెన్గున స్త్రీసమమే యగును.

తత్త్వతపోవేదయోగవాచక మగునపుడు బ్రహ్మము ననియుండును”. అని బాలవ్యాకరణము.

99. సూ. 3 :- బహువ్రీహౌ తు స్యాత్తామేవ తా. అతిభీమాద్భుతశౌర్యనిర్జిత పులస్త్యాపత్యానిన్ నిత్యనిన్’ ఇత్యాది. బ్రహ్మన్ శబ్దస్య తు మాయాశబలపరత్వే నపుంసకత్వమ్. చతుర్ముఖపరత్వే పుంస్త్వమ్. “బ్రహ్మ తత్త్వం తపో వేదో, బ్రహ్మా విప్రః ప్రజాపతిః” ఇత్యభిధానాత్. ‘బ్రహ్మ మాయాశబలం; తద్ధి సర్వకార్యోపాదాన’ మితి వేదాన్తినో వదన్తి. తస్య క్లీబత్వాంత్యహల్లోపే ‘బ్రహ్మము’ ఇతి రూపసిద్ధిః. ‘పోతః పాకోఽర్భకో డింభః పృథుకః శావకః శిశుః “ఇత్యభిధానోక్తేషు శబ్దేషు, అర్భకడింభకాదిశబ్దానాం కేషాంచిన్మహత్త్వవివక్షాయాం డుః స్యాదేవ. ‘డింభకుఁడు’ ఇత్యాది. శిశ్వాదీనాం తథావివక్షాయాం న భవతి. తత్ర జడత్వం వివక్షామూలకమ్.

“వివక్షాతః ప్రవృత్తిశ్చ ప్రత్యయస్య క్వచి ద్భవేత్” ఇత్యథర్వణ వచనమ్. ఉరగులు, భుజగులు, జనులు, జనములు – ఇత్యాదిరూపం ప్రయుఞ్జానేన వాగనుశాసనేనాపి మహత్త్వ మమహత్త్వం చ క్వచిత్ వైవక్షికమితి ధ్వనిత మేవ. అత ఏవ ‘సముద్రుఁడు, సముద్రము; మేఘుఁడు, మేఘము’ ఇత్యాదిరూపం సమంజసమ్. ఏతేన ‘నరపుంగవులు గాని నరపుంగవులు గారు’ ఇత్యాదిప్రయోగో నిర్బాధః. ‘పాత్రములె నెత్తమాడు’ నిత్యాదౌ జడత్వవివక్షయైవ ధాతో రేకవచనప్రయోగోఽపి సుసాధుః.

వి .– నిత్యనపుంసకశబ్దమైనను సమాసాంతమందు నిలిచియున్నచో నన్యపదార్థము మహాత్ప్వంలింగ మగునపుడు దాని కుత్వ డుజ్ఞులు గల్గును. అహోబలపతిపండితుఁడు చింతామణి కథర్వణకారికలు వివరణము లని యంగీకరింపని కారణమున నన్నయప్రయోగమును బురస్కరించుకొని రూపసాధన గావించి దాని కథర్వణకారికలను బ్రమాణముగాఁ జూపుచుండును. ఆవిషయ మథర్వణాచార్యులుగా రిట్లు చెప్పిరి. ‘ఒకప్పుడు మహత్త్వవివక్షవలన డుజ్ఞ్వర్ణకప్రాప్తి గల్గును’ అని యాయథర్వణకారిక కర్థము. ‘శేషాదినాగములు’ మున్నగువానికిని, గామరూపము గలవానికిని వైవక్షిక మైనలింగము గలుగవచ్చునని పైయథర్వణకారికకుఁ దాత్పర్యము. సహజముగా నపుంసకలింగము లైయున్నవానికి

మహత్త్వవివక్ష చేసినపుడు మహాదమహాద్రూపములు రెండును వానికిఁ గల్గునని తెలియనగును.

99. సూ. 4 :— అనిత ఇతి కిమ్? శౌరి, హారి - ఇత్యాది. అత్రేదం విచార్యతే "నిరవకాశా హి విధయః" సావకాశాన్ విధీన్ బాధన్తే' ఇతి 'సర్వేభ్యో విధిభ్యో లోపవిధి ర్బలీయాన్' ఇతిచ పరిభాషాభ్యాం సోర్లోపే నాపహారా ద్దుజః ప్రాప్తిరేవ నాస్తి; అతోఽనితఇతి పర్యుదాసో ముధా సన్ కించిదిష్టం బోధయతి. తేన నపుంసకాదపి మహతః క్వచిద్దుజపి స్యాదేవేతి.

'మిత్రుం డెవ్వఁడు గోత్రరాజతనయామీనేక్షణాభర్తకున్;
జైత్రుం డెవ్వఁడు రావణప్రముఖరక్షశ్శ్రేణికిన్; సత్కృపా
ప్రాతుం డెవ్వఁడు నీలనీరదరుచిప్రాగ్భారసంబంధక
ద్గాత్రుం డెవ్వఁడు వాని నామనములోఁ గాంక్షింతు నాస్వామిగన్'

ఇత్యుదాహరణమ్. ప్రయోగాశ్చాప్యుభయత్రాపి వర్తన్తే. "మిత్రుఁడనియును సద్గురుపుత్రుఁడనియు" "అధికవైరాగ్యసంపత్తి యబ్బెనేని నతని కందఱు మిత్రంబు లరసి చూడ"; "నృహరీ వాదముకేల కేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్"; "భవఖేదాపహ దేవ నీదయకు నేఁ బాత్రుండఁగాఁ జాడఁగన్"; "తరుణికిం బ్రాణమిత్రుండు ధవుఁడు"; "తనయబంధుకళత్రమిత్రముల నెల్ల" ఇతి శాకున్తలే; అతఏ వాచార్యోక్తయః — "ఎంతమిత్రుఁడైన నెన్నఁడు"; "పరాశరాత్మజాంభోరుహామిత్రు" నిత్యాదయః.

వి :— శౌరి హారి మున్నగుచోట్ల నుత్వడుజ్జులు రాకుండుటకై 'అనితః' అను విశేషణము సూత్రమున వేయఁబడెను. ఈ సందర్భమునం దీవిషయము నాలోచింపవలెను. 'నిరవకాశములైనవిధులు సావకాశములైనవిధులను బాధించును' - అనియు, 'నన్ని విధులకన్నను లోపవిధి బలీయమైన'దనియును రెండు పరిభాషలచేతను హారి - శౌరి యనునపుడు సుప్రత్యయమునకు లోపము చేయఁగా డుజ్జునకుఁ బ్రాప్తియే లేదు; కావున 'అనితః' అనునది వ్యర్థమై యర్థవిశేషమును బోధించుచున్నది. దానిచే నపుంసకమైనమహాద్వాచకములకంటె నొక్కయెడ డుజ్జును రావచ్చును. కావున నే, "మిత్రుం డెవ్వఁడు; జైత్రుం డెవ్వఁ

డు, పాత్రుం డెవ్వఁడు; గాత్రుం డెవ్వఁడు" మున్నగు డుజంతరూపములు సిద్ధించుచున్నవి. అమహాద్రూపము లీవఱకే సిద్ధించినవి. ఈయుభయవిధరూపములకును గవిప్రయోగములు చూపఁబడుచున్నవి.

"మిత్రుఁడనియును సద్గురుపుత్రుఁడనియు" "అధికవైరాగ్య సంపత్తి యబ్బెనేఁ నతని కందఱు మిత్రంబు లరసి చూడ" "నృహరీ వాదము లేల లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్" "భవఖేదాపహా దేవ నీదయకు నేఁ బాత్రుండఁగాఁ జూడఁగన్" "తరుణికిం బ్రాణమిత్రంబు ధవుఁడు" "తనయబంధుకళత్రమిత్రముల నెల్ల" "ఎంతమిత్రుఁడైన" "పరాశరాత్మజాంభోరుహామిత్రున్" మున్నగునవి.

'మిత్ర' శబ్దము సూర్యార్థమునఁ బుంలింగము. స్నేహితుఁడను నర్థమున నిత్యనపుంసకము. నిత్యనపుంసకములై మహద్వాచకము లగుశబ్దములకుఁ బుంలింగవివక్ష చేసినపు డుత్వాడుజ్ఞులతోడ రూపములుగల్గును. అట్టివివక్ష లేనపుడు మువర్ణకాంతరూప ముండును. "ఒకానొక యర్థవిశేషమునందు నిత్యనపుంసక - అకారాంత శబ్దములకు డుజంత-మువర్ణకాంతరూపములు రెండును గలుగ వచ్చును. అట్టిరూపములు విద్వాంసుల కామోదకరములు గావలయును"-అనునర్థము "క్వచిదర్థవిశేషే తు..." అనునథర్వణవచనమువలన సిద్ధించుచున్నది. ఆ విషయము నొప్పరికించి కవిశిరోభూషణము చింతామణిచేతనే ద్వైరూప్యసిద్ధిని బడయుటకై సంస్కృతవ్యాకరణమునందలి వైయర్థ్యము, జ్ఞాపకము, స్వాంశే చారితార్థ్యము, అన్యత్రఫలము నను ననుబంధచతుష్టయము నాశ్రయించినది. ఇది సరికాదు. వాచ్యముగా నథర్వణవచనము చెప్పుచుండఁగా గ్రంథకృదభిప్రేతము గానియనుబంధచతుష్టయాశ్రయణవ్యాఖ్యానము చేయుట సరిగాదని తోఁపకపోదు.

99. సూ. 5: ఏతచ్చాథర్వణాచార్యస్యాప్యభిప్రేతమ్. "క్వచిదర్థవిశేషే తు క్లీబేఽ ప్యుభయరూపతా। విచక్షణమనోమోదకారిణీ శబ్దకల్పనా" – ఇతి తదుక్తేః. నఖిత్యయోగ్యత్వాదిర్విశేషార్థః. ఉత్తరార్థేన సహృదయహృదయాహ్లాదకమేవ రూపం

కల్పనీయమితి ద్యోతయతి. తేన ప్రాధాన్యవాచకస్య దైవతశబ్దస్య ప్రయోగే 'దైవతశిర మగురాముఁ డి'త్యేవ. 'శిరః ప్రధానే సేనాగ్రే' ఇత్యభిధానోక్తేః. దుజన్తత్వే త్వేతాదృశానాం నామోదకరత్వమ్. "శరణ మతఁడు సకలజనములకును" అత్ర శరణశబ్దస్య రక్షితృవాచకత్వమ్. 'శరణం గృహరక్షిత్రో' రిత్యభిధానాత్. "విమలజ్ఞానమున శరణు వేఁడెద నతనిన్" ఇత్యాదౌ శరణశబ్దస్యోదన్తత్వ మపి. 'శరణన్నఁగాతున్' ఇతి వాగనుశాసనః. 'జానకీకాంతరత్నము' "దైవతరత్నము రాముఁడె భావింపఁగఁ దగినవాఁడు భక్తులకెల్లన్" - "రత్నం శ్రేష్ఠే మణావపీ" త్యమరోక్తేః. 'జాతౌ జాతౌ య దుత్కృష్టం తద్రత్న మభిధీయతే' ఇతి విశ్వప్రకాశవచనాచ్చ రత్నశబ్దస్య శ్రేష్ఠపరత్వమ్.

వి :— 'ఒకానొకయర్థవిశేషమునందు నిత్యనపుంసకశబ్దములకు నైతము మహదమహద్రూపములు రెండును గలుగును', అనునథర్వణ వచనముచేతనే 'మిత్రుఁడు - మిత్రము, శరణుఁడు - శరణము, ప్రధానుఁడు-ప్రధానము, పాత్రుఁడు-పాత్రము' మున్నగురూపములు సిద్ధించును. శిరశ్శబ్దము ప్రధానవాచక మగునపుడు 'దైవతశిరము' మున్నగురూపములు గల్గును. దీనికి మహద్వివక్ష చేసినను దుజంతరూపము మోదకరము గాదు. 'శరణ' శబ్దమునకు 'శరణు' అను నుదంతరూపమును గలదు; 'శరణన్నఁగాతున్' అని నన్నపార్యుఁడు. 'రత్న' శబ్దముగూడ నపుంసకమే. దానికి 'జానకీకాంతారత్నము', 'దైవతరత్నము' - అని ప్రయోగములు.

99 సూ. 6 :— "రాముఁడు ప్రధానుఁ డఖిలగీర్వాణులందు నప్రధానంబు లందఱు నరసిచూడ"; 'ప్రధానం ద్వయహీనే ద్వే అప్రధానోపసర్జనే' ఇత్యమరోక్తేః. ప్రధానశబ్దస్యామాత్యపరత్వే 'ప్రధానుఁడు' "మహామాత్యాః ప్రధానాని" త్యమరోక్తేః. 'రాముఁడు నిర్జరకకుదుఁడు-కకుదము' "ప్రాధాన్యే రాజలిఙ్గేచ వృషాఙ్గే కకుదోఽస్త్రియా" మిత్యుక్తేః. 'రాముఁడు దేవలలాముఁడు' 'భూమిజ కాంతాలలామ భువనంబులలోన్', 'పక్షిలలామంబు నెక్కుబలియునిఁ దలఁతున్', 'లలామం త్రిషు రమ్యం స్యా న్ముఖ్య సామర్థ్య లక్ష్మ స్వి'త్యుక్తేః. 'అఖిలలోకాధ్యక్షు నారాజమణిఁ జూచి'; "పంకజలోచన యీకాంతామణి"; "మణిర్ద్వయో రిత్యుక్తేః. యద్యపి మణిశబ్దస్య రత్నశబ్దస్యేవ న శ్రేష్ఠపరత్వ మభిధానే షూపపాద్యతే; తథాపి

"మణి ర్ద్వయోః రజాకణ్ణ స్తనే రత్నేచ" ఇత్యాద్యుక్త్యా రత్నపర్యాయత్వేన తద్వాచకత్వ ముదాహృతమ్. నచ పర్యాయగ్రహణ మనర్థకమ్. ఇన్ద్రాదిపర్యాయాణాం వాసవాదిశబ్దానామపి తాదృశత్వేన ప్రామాణికై ర్గ్రహణాత్.

వి :- ప్రధానశబ్ద మమాత్యపరమైనపుడు ప్రధానుఁడని యుండును. ముఖ్యార్థమునందుఁ బ్రధానమని యుండును. కకుత్ శబ్దము 'నిర్జరకకుదుఁడు, నిర్జరకకుదము'; అనియు 'లలామ' శబ్దము 'దేవలలాముఁడు, కాంతాలలామ; పక్షిలలామము' అని మూఁడురూపములతో నుండును. 'మణి'శబ్దము 'రాజమణి, కాంతామణి' – అనురీతి నుండును. మణిశబ్దమునకు రత్నశబ్దమునకువలె శ్రేష్ఠార్థకత్వము లేదు; అయినను రత్నశబ్దపర్యాయముగా మణిశబ్దమును బ్రామాణికులు ప్రయోగించియుండుటచేఁ దత్పర్యాయము నగును.

99. సూ 7 :- కించ, "చన్ద్రశార్దూలనాగాద్యాః పరే శ్రేష్ఠార్థగోచరాః। ముదుజ్మన్తోఽ మహత్ స్వార్థే మహత్ స్వార్థే రుచి ర్యది".

ఇత్యాథర్వణమేవ వచనమ్. పరే ఉపమేయవాచకశబ్దాత్పరే, "ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే" ఇతి సమాసానుశాసనాత్. శ్రేష్ఠత్వగోచరాః గౌణలక్షణాద్వారా శ్రేష్ఠార్థప్రతిపాదకాః. ఆదిశబ్దేన సింహాదిశబ్దసంగ్రహః. ముదుజ్మన్త విశేష్యస్యామహత్త్వే 'ముః'; మహత్త్వే 'డు' ఇత్యర్థః. మహత్స్వార్థే విశేష్యస్య మహత్త్వేపి చన్ద్రాది ర్మహత్స్వార్థే వర్తతే. రుచిః సహృదయహృదయాహ్లాదకమేవ సర్వత్ర శబ్దప్రయోగే కారణ మిత్యర్థః. అభిధానకారై రప్యుక్తమ్ "స్యురుత్తరపదే వ్యాఘ్రపుంగవర్షభకుంజరాః। సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః" ఇతి. ఆదిశబ్దేన చన్ద్రాదిశబ్దసఙ్గ్రహ ఇతి వ్యాఖ్యాతారః. 'రాముఁడు రాజపుంగవుఁడు, రాజఋషభుఁడు, రాజసింహుఁడు, రాజసింహము' ఇతి.

వి :- 'చంద్ర, శార్దూల, నాగ' మున్నగునవి సమాసమునఁ బూర్వశబ్దములకుఁ బరములై శ్రేష్ఠార్థము నిచ్చుచున్నవి. అట్టి సమాసములలోఁ బ్రయోక్తయొక్క రుచి ననుసరించి ముపర్ణాంత, డుపర్ణాంత రూపముల నొందుచుండును' అను నథర్వణవచనముచే 'రాజపుంగ

వృుడు, రాజఋషభుఁడు, రాజసింహుఁడు, రాజసింహము మున్నగురూపములు సిద్ధించుచున్నవి.

99 సూ 8 :- 'రాజహంసుఁడు, రాజహంసము' ఇతి క్వచిత్. 'రాజహంసలఁ బట్టరాదుసుమ్ము' ఇత్యాదౌ శ్లిష్టత్వేన హంసశబ్దస్య స్వార్థవృత్త్యా రుచి ర్భవతి. పరమహంసలు — ఇత్యాదిరూపం సాధు; న తు 'పరమహంసులు' ఇతి. యది తత్సాధుతాసంపాదనాభినివేశః తర్హి యోగివాచకస్యాపి హంసశబ్దస్య యోధాదిత్వ మంగీకృత్యాథర్వణత్వ ముపపాదనీయమ్. 'స్త్రీత్వబహుత్వే' ఇతిసూత్రే క్వచి దిత్యనువర్త్య మహాంశంకేత్యాది రూపమివ తేనేదమపి సూపపాద మితి చింతామణీయత్వమపి సంపాద్యతామ్. 'రాజవతంసులు' ఇత్యాది. 'నృపపుంగవు నంపరకోపక' 'కౌరవసింహము' ఇత్యాద్యాచార్య ప్రయోగః. అమహత్త్వే తు 'గోనాగము, 'కరివృషభము, కాంతాతిలకము' ఇత్యాదిరూప మూహ్యమ్. 'కాంతాచంద్రుఁడు' ఇతి రూపం విశేష్యస్యామహత్త్వేఽపి స్వార్థే వృత్త్యా వుదాహరణమ్. కాంతాచంద్రుఁడు' ఇతి వ్యాఖ్యాతృభి రుదాహృతమ్. 'శ్రేష్ఠతాయా మమహతి' ఇతి వచనం తూత్తమాదిశబ్దవిషయక మిత్యవగన్తవ్యమ్.

వి:- హంస శబ్దము శ్రేష్ఠార్థకశబ్దములలోఁ బరిగణింపఁబడినపుడు 'రాజహంసుఁడు=రాజశ్రేష్ఠుఁడు' 'రాజహంసము=శ్రేష్ఠమగుహంస' అని యుండును. పక్షివాచకమైన హంసశబ్దమునకు 'హంస' యనియే రూపము. 'రాజహంసలఁ బట్టరాదు సుమ్ము' అనునపుడు శ్లేష గావున సహ్యమగుచున్నది. పరమహంసశబ్దమునకుఁ 'బరమహంసుఁడు, పరమహంసులు' అనురూపములే సాధువులు. 'పరమహంసలు' అని యుండరాదు. దానికి సాధుత్వము సంపాదింపఁ దలఁచినచో యోధాదిగణములోఁ బెట్టుకొని స్సాధువు చేసికొన వచ్చును. అది యథర్వణసమ్మతము. చింతామణిచేతనుగూడ దీనిసాధుత్వము సహోబలపతి నిరూపించెను. దానికై యెన్నో పాట్లు పడెను. అథర్వణవచన ముండఁగా నట్టి పాట్లు పడుట సరిగాదు గదా! 'నృపపుంగవుఁడు, కౌరవసింహము' మున్నగువాని నూహింపవలెను. 'కాంతాచంద్రుఁడు' అనునపుడు విశేష్యమమహత్తై స్వార్థవృత్తియందు 'చంద్ర' శబ్ద మున్నపుడు గల్గునని వ్యాఖ్యాతలు గొందఱు చెప్పిరి. నిజమునకుఁ 'గాంతాచంద్రుఁ'డనురూప

ముండుట సరిగాదు. కాంతాతిలక మనియే యుండనగును. 'శ్రేష్ఠతాయా మమహతః' అనువచనము ననుసరించి యమహద్వాచకములు గొన్నింటికి శ్రేష్ఠార్థమునందు మహద్వివక్ష చేయఁగా 'డుజ్ఝురావచ్చును' అని యుండుటచే సాధుత్వము నెఱుంగ నగును.

99 సూ. 9 :- 'కబరీహస్తము, కబరీహస్త' ఇత్యాదిరూప మాద్యాయామ్. "పాశః పక్షశ్చ హస్తశ్చ కలాపార్థాః కచాత్పర" ఇత్యమరః. 'ప్రకాండుఁడు, ప్రకాండము' 'ప్రకాండ ముద్ఘతల్లజౌ' ఇత్యుక్తేః. అత్ర 'ప్రశంసావచనైశ్చ' ఇతి సూత్రేణ సమాసః. ప్రశస్తః పురుషః పురుషప్రకాణ్డః. ఇత్యేవం ప్రశస్తశబ్దేన విగ్రహః. నియతలిఙ్గత్వ మేషామితి పాణినీయపారీణాః.

వి :- ఇందుఁ బేర్కొనఁబడినశబ్దములు సిద్ధసమాసగతములు గాని సాధ్యసమాసగతములు గావు. సిద్ధసమాసములు తెలుఁగులోనికిఁ దత్సమములుగా రావచ్చును గాన వాని కిందుఁ బ్రవేశము గల్గినది.

'కబరీహస్తము, కబరీహస్త, పురుషప్రకాండుఁడు' అనురీతిని దెలుఁగునఁ దత్సమములుగా నివి ప్రయోగింపఁ బడును.

99. సూ. 10 :- 'కాంతామౌళి యతిసుందరము' ఇదన్తాన్మౌ రభావాత్ విశేషణాన్మ్రవర్ణకః. 'రాజమౌళి సుందరుఁడు' చూడా కిరీటం కేశాశ్చ సంయతా మౌళయ స్త్రయః' ఇత్యుక్తేః 'మౌళి' శబ్దస్య పుంస్త్వమ్.

"లింగభేదో భవే దిష్ట ఆరోపే యది వా రుచిః
తత్రానురఞ్జనాత్ పుంసాం దుజా ప్యమహ దుచ్యతే"

యదివా రుచి రిత్యనేన "భక్తకల్పకము సీత" "భక్తమనోజ్ఞభృంగము జానకి" ఇత్యాది రూప మసఙ్గతమ్. కిన్తు, 'భక్తకల్పకవల్లి' ఇత్యాదిరూపమేవసాధ్వితిజ్ఞేయమ్. 'సా సౌన్దర్యపయోనిధిః' ఇత్యాదిరూపం తురఞ్జనా దిష్టమేవ. 'లలితరవివంశముక్తాఫలంబు రాముఁ దలఁప సంసారదోషముల్ దొలఁగి పోవు' ఇత్యాదికం లిఙ్గభేదోదాహరణమ్.

"నీకంఠ్యారితకాలపాశము శిరోనిర్ఘాతపాతమ్మ లం
కాకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి క

న్యాకారాగతమృత్యు వీజనకకన్యన్ వేగ మొప్పించి లో
కైకత్రాణుని రాముని గనుము నీ కీబుద్ధి గాకుండినన్"

'ఆవేశం బురపల్లవప్రకర నేత్రానంద బాష్పాంబుధారావర్షాగమచంచలాలతిక దుర్వారప్రసూనాస్త్ర తేజోవైశ్వానరసామిధేనిరసనానూత్నస్థితస్వర్ణపేటీవిన్యస్తకపర్ది యొక్క కలకంఠీరత్న మేతెంచినన్"

ఇత్యాదయః కవిప్రయోగాః. 'దాసమనోబ్జసారంగుఁడు' 'దాసపారిజాతుఁడు' ఇత్యుత్తరార్ధోదాహరణమ్. అపి శబ్దాత్ 'సారంగము' ఇత్యాది.

వి :— 'కాంతామాళి యతిసుందరము' అనునపుడు మాళిశబ్ద మికారాంతమగుటచే దానికిఁ బ్రథమైకవచనలోపము వచ్చినది. ఇది యమహద్రూప మగుటచే దీనివిశేషణ మగు 'సుందర' శబ్దమునకు 'ము' వర్ణకము గల్గినది. 'ఆరోప్యమాణమునందుఁ బ్రయోక్తకు రుచి యున్నపుడు లింగభేదము సమ్మతమే యగును. ఇది సహృదయహృదయాహ్లాదకత్వము ననుసరించి మహద్వాచకశబ్దమునకు సైతము 'డుజ్జు' రాక 'ము' వర్ణకమే వచ్చిన'దని యథర్వణవచనము. 'రవివంశముక్తాఫలము' - అనుదానిచే రవివంశమునందు శుక్తిత్వ మారోపింపఁ బడుచున్నది.

'భక్తకల్పకము సీత, భక్తమనోబ్జభృంగము జానకి' అను ప్రయోగములలోఁ గల్పకత్వభృంగత్వారోపమునందు రుచి లేదు గాన, ననఁగా సహృదయహృదయరంజకత్వము లేదు గావున నిట్టిరూపములు సాధువులు గావు. 'భక్తకల్పకవల్లి' మున్నగువానిలో రంజకత్వ ముండుటచే నవి గ్రాహ్యములే యగును. 'సౌందర్యపయోనిధి యగు నామె' మున్నగు రూపములు నిష్టములే యగును. 'జనకకన్య' యను విశేష్యమునకు 'నీకంఠార్పితకాలపాశము, శిరోనిర్ఘాతపాతమ్ము, లంకాకస్సంచయకాళరాత్రి గళబద్ధోదగ్రకాలాహి కన్యాకారాగతమృత్యువు' అను రీతిని మువర్ణకాంత, వువర్ణకాంతవిశేషణములు వేయఁబడినవి.

రెండవ పద్యమునందుఁ 'గలకంఠీరత్న' మను ముపర్ణాంతవిశేష్యమునకు స్త్రీపరములగు విశేషణములు వేయఁబడినవి.

'దాసమనోబ్జసారంగుఁడు' 'దాసపారిజాతుఁడు' మున్నగునవి పండితుల కిష్టము లగుటచే సాధువు లగుచున్నవి. వీనికి 'సారంగము, పారిజాతము' అను రూపములుగూడ నుండును.

99 సూ. 11 :- "శ్రేష్ఠతాయాం మహతః క్వచిద్డుజపి సమ్మతః।" డుజత్ర మహత్త్వం లక్షయతి నతు తన్మాత్రస్య గ్రహణమ్. సాధనాయకప్రముఖ శ్రైష్ఠ్యవాచకశబ్దాన్తా దమహత ఇత్యర్థః; 'పతగనాథుఁడు' ఇత్యాది.

వి :- 'శ్రేష్ఠత్వార్థమునం దమహద్వాచకశబ్దములకంటె నొకప్పుడు 'డుజ్జు' సైతము రావచ్చును' అను నథర్వణవచనముచొప్పున 'పతగనాథుఁడు' మున్నగువానికి సాధుత్వము గల్గుచున్నది.

99 సూ. 12 :- భవే దమహతోఽప్యర్థవిశేషే మహదాకృతిః। స్యాత్పూజ్యత్వవివక్షాయాం మహతాం బహుతా మతా॥ "క్వచిత్ స్వస్య భవే దిష్టా రుచిస్స్యాద్యది మానసే।" 'మైనాకులముద్దుకూఁతురు' 'ఘనులఁ గొండలపాలుగాఁ జేసిన కోఱంత' 'విమతగోత్రుల నంటు వృజినమెల్ల' నిత్యాది' ఆచార్యే ణాదిపర్వణి 'అరిది తపోవిభూతి నమరారుల బాధలు వొందకుండఁగా। సురగులనెల్లఁ గాచిన మహోరగనాయకుఁడు' 'అశ్వోత్తమున్' ఇత్యాదికమ్. 'భుజగజాల్ముఁడు' ఇతిరూపం చాచార్యేణైన ప్రయుక్తమ్.

అత్ర శబ్దానుశాసన స్యాయ మాశయః. సహృదయహృదయాహ్లాదకత్వ మనుసృత్యామహతో మహద్వివక్షా క్వచిత్ కేవలాత్; క్వచిత్ శ్రేష్ఠతాప్రతిపాదకశబ్దాన్తా దపీతి.

వి :- "తిర్యగ్జడవాచకములకు సైతము పురుషచర్య మున్నగు నర్థములవివక్షయందు మహద్రూపములు గల్గును. అమహత్త్వార్థమునకుఁ గామరూపాదికము లేకున్నను నర్థవిశేషమునందు మహద్వాచకరూపము గల్గునని యెఱుంగునది. 'వాయసుఁడోడెను' — 'మర్కటుఁడశోకవనముఁ బెకలించెను' — మొదలైనవి.

'పూజ్యత వివక్షితమగునపుడు మహన్మహతీవాచకముల కేకత్వమునందే బహువచనప్రయోగము సమ్మత మగుచున్నది. ఒకప్పుడు వక్తకు బహువచనరూపము మనోమోదకారి యగునేని సమ్మతమగును. పూజ్యతాబహువచనసందర్భమునందలిసంబోధ్యవాచక మేకవచనమునందే ప్రయుక్తమగును' – అని యాథర్వణవచనమున కర్థము. 'మైనాకుల ముద్దుకూఁతురు' – అనునపుడు పూజ్యతకు వివక్ష. అమహద్వాచకమునకు మహద్వివక్ష. 'ఘనులఁ గొండలపాలుగాఁ జేసిన' యను దానిలో మేఘపరార్థమునను బూజ్యతలో మహత్త్వము గల్గినది. 'విషమగోత్రులు' అనునపుడుగూడఁ బూజ్యతయందే యమహత్తునకు మహద్వివక్ష శ్లిష్టతయందుఁ గల్గినదని యెఱుంగునది. 'మాకెల్లం గలహంబు గూడ దిఁక నీమర్యాదతో నుండవే' యనునపుడు 'మాకు'నను నది పూజ్యతాబహువచనము. 'కవిశిఖామణి' యనువానిమతమునఁ గొన్నియమహద్వాచకశబ్దములును మహద్వాచకరూపముల పేర్లతో నుండఁదగును. ఈ విషయమునఁ గవిప్రయోగమే ప్రమాణము, 'వివక్షాతః' అనుకారిక కామరూపప్రసిద్ధి గలవాని విషయమునఁ బ్రవర్తించును. 'కేచి చ్చామహత శ్శబ్దాః' అనునది సామాన్యప్రవృత్తి గలది. కావున నొకదానిచే నొకటి గతార్థము గాఁజాలదు. కవిశిరోభూషణము 'వివక్షాత ఇత్యనేనైవ సిద్ధే భవే దమహతః' 'కేచి చ్చామహతః' ఇతి వచనద్వయం స్పష్టార్థమ్' అని వ్రాయుట సరిగాదు.

సూరిగారు నన్నయాథర్వణప్రోక్తము లగుపై విషయముల నీ క్రింది రీతిని వివరించియున్నారు.

'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తులనంబడు' (బాల. తత్స.17.) అని మహత్సంజ్ఞను విధించిరి. కవిశిరోభూషణము, 'స్త్రీపశుజడాన్వినాఽన్యే మహదాఖ్యాస్తద్విశేషణాన్యపి– అనుదానిని రెండు సూత్రములుగా విభజించి వ్యాఖ్యానించెను. సూరి

గారు వాని రెంటిని గలిపి యొకసూత్రముగా వివరించిరి. కవిశిరోభూషణ వివరణము కేవలస్పష్టప్రతిపత్తికే యని భావింపవలసియున్నది. పిమ్మట నథర్వణాచార్యులు పెక్కు కారికల నీసందర్భమున వ్రాయఁగా వాని నన్నిటిని గవిశిరోభూషణము వేఱువేఱుగా వ్యాఖ్యానింపఁగా సూరిగారు "క్వచిదర్థవిశేషే తు క్లీబేఽప్యుభయరూపతా" యను కారికను మాత్రము, 'క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబులగు' నని వివరించి తక్కినవాని నొప్పరికించిరి. (బాల. తత్స. 18)

మఱియు, 'మహతోఽత ఉద్విభక్తౌ. మహత స్సో ర్డుజనితో భవేత్ పుంసి' అనుకారికను గవిశిరోభూషణ మొక్కసూత్రముగా నెంచి వ్యాఖ్యానింపఁగా సూరిగారు దానిని 'పుంలింగంబయి మహద్వాచకం బయినన్నామంబుతుదియత్తున కుత్వం బగు' (బాల. తత్స. 21); పుంలింగం బగుమహద్వాచకంబునకు డుజ్ఞగు' (బాల. తత్స. 22) నని రెండు సూత్రములుగా విభజించిరి.

ప్రౌఢవ్యాకర్త, "పూజ్యతయం దొక్కచో 'నామత దేతద్యుష్మదస్మచ్ఛబ్దంబుల యేకవచనంబులకు బహువచనం బగు; నగుచో సంబోధ్యవాచకంబు బహువచనాంతం బగు" (ప్రౌఢ. శబ్ద. 42 సూ) నని, "స్యాత్ పూజ్యత్వవివక్షాయాం మహతాం బహుతా మతా" అను దానిని వివరించిరి.

1. శేషాదినాగములు, మేఘము, కొన్నిపర్వతములు, సముద్రాగ్నిప్రాణాదివాయువులు మున్నగువానికిఁ గామరూపము పురాణాదులలోఁ బ్రసిద్ధమైయున్నది. కావునఁ దద్వాచకశబ్దములకు వివక్షాతః అనుచొప్పున మహద్వివక్ష చేయనగును. వానికిఁ బుంలింగాదంతములున్నచో మిత్రాదులకువలె డువర్ణ-మువర్ణాంతరూపములు రెండు నుండనగును.

2. వాయసమర్కటాద్యమహాద్వాచకశబ్దములకుఁ బురుషచర్య మున్నగునర్థవిశేషము లున్నపుడు మహాదమహాద్రూపములు వాని కుండ నగును.

3. 'లింగ, భృంగ, సహకార' మున్నగువానికి సంబోధనప్రథమైకవచనమునందు మువర్ణకము లోపించి- లింగ, భృంగ, సహకార, అనురీతిరూపములతో నుండును. బహువచనమున 'లింగములార' మున్నగురీతి నుండును.

4. అమహద్వాచకశబ్దములకు శ్రేష్ఠత్వమున- 'డుము' వర్ణకరూపము లుండనగును. 2, 3, 4, సంఖ్యలు గలవిషయములు 'భవేదమహతో౽పి' 'లింగభృంగాదిశబ్దేభ్యః' 'శ్రేష్ఠతాయా మమహతః' అను కారికల కర్థము.

5. పాములు, పక్షులు, కుక్కలు, మున్నగువానికిఁ గవిశిఖామణి మతమున డుజంతనామము లగపడుచున్నవియని – 'కేచి చ్చామహతః' అనుదానివలనఁ దెలియుచున్నది. తక్షకుఁడు, గరుడుఁడు, పులియఁడు. మొ.

6. చంద్రశార్దూలనాగాదిశబ్దములు రాజాదిశబ్దములకుఁ బరముగా నున్నపుడు శ్రేష్ఠార్థమును బోధించును. వీనికి మహాదమహాద్రూపములు రెండును గల్గవచ్చునని 'సింహశార్దూలనాగాద్యాః' అనుదాని కర్థము. దీనికి రాజసింహము, రాజసింహుఁడు=శ్రేష్ఠుఁడగు రాజని వీనియర్థము.

7. ప్రధానశబ్దము నిత్యనపుంసకమైనను బహువ్రీహిసమాసమునఁ బుం స్త్రీలింగములయందు నుండును. లలామశబ్దము ముఖ్యసామర్థ్యలక్ష్మము లనెడి మూఁడర్థములయందును నపుంసక మగును. ఈరెంటికి ననఁగాఁ బ్రధానలలామశబ్దములు రెంటికి మహాదమహాద్రూపములు రెండు నుండును. ప్రధానుఁడు, ప్రధానము; లలాముఁడు, లలామము, అనియుదాహృతులు.

**100. సూ :— ఆమన్త్రణసుజసో స్తః క్రమేణ చాదారదాగమా వన్తే.**

100. సూ :— సంబోధనే యౌ సుజసౌ తయో స్స్వాన్తే 'అత్, ఆరత్' - ఇత్యేతా వాగమౌ స్తః. తన్త్యహ లుచ్చారణార్థః. 'రాముఁడ, రాములార'; ద్వితీయాచార్యేణ తు "సంబోధనే వా దీర్ఘ స్స్యాత్ ప్రయోగస్య తథాగతేః। భవే దత్రాదితామేవ దీర్ఘత్వం వికృతే శ్శుచేః". "సంబోధనే ప్లుతం ప్రాహుః కేచి ద్దూరాదికే ఒభితః" ఇత్యుక్తమ్. శబ్దశాసనస్యాపి దీర్ఘ ఇష్టఏవ. 'ననుం గృపఁజూడు భారతీ !' 'భావభవనిభసుభగా' ఇత్యాదౌ తద్దర్శనాత్'; 'కలఁగకుఁడీ వధూజనులు' ఇత్యాదిప్రయోగస్య సాధుత్వం తు 'స్యాన్మధ్యమక్రియాయోగో వినా క్కచి దాగమమ్' ఇతి తదుక్తేర్జ్ఞేయమ్,

వి:— ఆమన్త్రణసుజసోః, స్తః, క్రమేణ, చ, అదారదాగమౌ, అన్తే—అని ఛేదము.

ఆమంత్రణమునందలి సుజస్సులకుఁ బరముగా నేకత్వమునందు, అత్ అను నాగమమును, బహువచనమునందు, 'ఆరత్' అను నాగమమును నగునని సూత్రార్థము. ఆమంత్రణమనఁగా సంబోధనము. 'అత్—ఆరత్' అనువానిలోని తుదిహల్లులుచ్చారణార్థము. 'రాముఁడు' అను దానికి 'అత్' చేర్పఁగా 'రాముఁడ, ఓ రాముఁడ' అనియు, బహువచనమునందు 'రాములు' అనుదానికి 'ఆరత్' అనునది చేర్పఁగా 'రాములార—ఓరాములార' యనియు నగును. 'సంబోధనవిషయమునఁ బదముతుదివర్ణమునకు దీర్ఘము వికల్పముగా నగును. మహాకవిప్రయోగము లట్లే యున్నవి. తత్సమాచ్ఛికపదములకు, అకారేకారాంతములకుమాత్రమే దీర్ఘము వచ్చును. దూరాహ్వానాదులందు సంబోధనాంతములకుఁద్రిమాత్రాకప్లుతస్వరము వచ్చునని కొందఱనుచున్నారు' అనునథర్వణవచనము చొప్పున, రాముఁడా – రాముఁడ; హరీ – హరి; తమ్ముఁడా—తమ్ముఁడ; తండ్రీ—తండ్రి – మున్నగు రీతిని రూపద్వయము సిద్ధించుచున్నది. 'జరత్కారూ' మొదలగునవి 'సంబోధనేప్లుతం ప్రాహుః' అనుదానిచే సిద్ధించును, అకారేకారములకేగాని కడమయచ్చులకు సంబోధనదీర్ఘము

రాదు. ఏకాక్షరతత్సమపదమునకును దీర్ఘాంతదేశ్యపదమునకును హ్రస్వరూపమగు నదాగమము రాదు. 'దీర్ఘాణాం హ్రస్వస్స్యాత్' అని వచ్చు హ్రస్వము 'నచ దేశ్యపదే నచైకవర్ణేఽపి' యనునిషేధముచే దీర్ఘాంత దేశ్యపదములకు నేకాక్షరకతత్సమశబ్దములకు రాదు. కాన నట్టివానికి సంబోధనమునందును నదాగమరూపహ్రస్వముగూడ రాదు. ఓశ్రీ, ఓలకోరీ మొదలగునవి యుదాహరణములు.

"నను గృపఁజూడు భారతీ!;" "భావభవనిభసుభగా;" అని నన్నపార్యుఁడును నీదీర్ఘమును జేసియున్నాఁడు.

'మధ్యమపురుషక్రియతో యోగ మున్నవు డీయాగమము లేకుండ నొకానొకచోఁ బ్రయోగ ముండవచ్చును' అను నథర్వణవచనము వలన, 'కలఁగకుఁడీ వధూజనులు' అనుచోట 'వధూజనులార' యని రావలసిన యారదాగమము రాలేదు.

"సంబోధనంబునం దేకార్థం బయినపదంబుతుది యుకారంబున కకారం బగు" (బాల-తత్స-32) "సంబోధనంబునందుఁ బదంబుతుది యకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు" (బాల-తత్స-33) "ఉదంత సంస్కృతనామంబుమీఁదిసంబుద్ధిడుజ్ఞునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు" (బాల-తత్స-35) "సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు" (బాల-తత్స-36) "మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాషనగు" (బాల-తత్స-37) అనుసూత్రములచే సూరిగారు పైనన్నయాథర్వణులసూత్రముల వ్యాఖ్యానసారాంశమును వివరించిరి.

**101. సూ :- లు జసో ల శసోఽలాన్తాత్.**

101 సూ. లాన్తవ్యతిరిక్తా చ్ఛబ్దా త్పరయో ర్జశ్శసో స్స్థానే 'లు - ల' ఇత్యేతౌ స్తః 'రాములు, రాములఁజూచెన్'.

వి :- లు, జసః, ల, శసః, అలాన్తాత్-అని ఛేదము. లాంత వ్యతిరిక్తశబ్దములకుఁ బరమైన జస్సు, శస్సులస్థానమునందు వరుసగా 'లు,ల' యనునవి యాదేశము లగుననియర్థము. రాములు, రాములన్, మున్నగునవి యుదాహృతులు.

"ఓంయీాత్యామన్త్రిణశ్చ వికృతౌ స్యాత్" (చిం-95) అనుచో ప్పున సంబోధ్యవాచకమునకు ముందు-ఓ-ఓయి-మున్నగునవి యాగమములగునని (చిం-100 చే) చెప్పఁబడినది. సంబోధ్యవాచకశబ్దములకుఁ బరముగనున్న-సు-జస్-అను ప్రత్యయములకు హ్రస్వాకారమును, ఆరత్ అనునదియు వరుసగా నాగమము లగుననియుఁ జెప్పఁబడినది. "భావభవనిభసుభగా, ననుం గృపఁజూడు భారతీ" అనునన్నపార్యుని ప్రయోగములనుబట్టి యథర్వణాచార్యులుగారు 'తత్సమశబ్దముల యకారేకారములకును, నాచ్ఛికశబ్దములయకారేకారములకును దీర్ఘము కల్గును' అని వచించిరి. మిగిలినస్వరములకు సంబోధనమున దీర్ఘము రాదు. దీర్ఘరూపములు వ్యావహారికము లగును.

**102. సూ :- లాన్తాత్తు రురౌ తయోః క్రమేణ స్తః.**

102 సూ. లాన్తాత్ పరయోస్తయోస్తు క్రమాత్ రుర ఇత్యేతౌ స్తః. బాలురు-బాలురఁగనియెన్; సుశీలురు- సుశీలురఁ బొగడెన్; స్త్రియామపి-బాలురఁగనియెన్. అలాన్తాల్లాన్తాదితి చోక్తే ల్లోపధస్యాప్యకారాన్తస్యైవ గ్రహణమ్; న త్వన్యస్య. తేన 'ధీశాలులు, బుద్ధిశాలులు, మృదుతాలులు' ఇత్యాదౌ లులావేవేతి జ్ఞేయమ్. ప్రకృత్యాం 'ద్వివచనస్య బహువచనం నిత్యమ్' ఇతిన్యాయేన ద్వివచనస్య బహువచనాదేశస్య విధానా దత్రాపి ప్రకృతివద్వికృతిరితి న్యాయేన ద్వివచనస్థానే బహువచనాదేశ ఇతి జ్ఞేయమ్.

వి :- లాన్తాత్, తు, రురౌ, తయోః, క్రమేణ, స్తః-అని ఛేదము.

లకారాంతశబ్దములకంటెఁ బరమైన జస్సుశస్సులకు వరుసగా 'రు ర' అనునవి యాదేశము లగునని సూత్రార్థము. 'బాల' శబ్దము పుంలింగ

మహద్వాచకమైనపుడు ప్రకృతసూత్రముచే బహువచనమునందు 'బాలురు', 'బాలురన్' మున్నగురీతిరూపముల నందును. కాని స్త్రీవాచకమైనపుడుగూడ, 'బాలురఁ గనియెన్' అని కవిశిరోభూషణ ముదాహరించెను. ఈరూపము వ్యాకరణసిద్ధమైయున్నను స్త్రీలింగమం దట్టిరూపమునకు లోకప్రసిద్ధి లేనందున నిట్టివ్యాఖ్యానము సరిగాదని తోఁచుచున్నది. 'బాలలు, బాలలన్' అనియే స్త్రీలింగమున నుండ నగును.

సూరిగారీసందర్భమున 'బాలురు' అనురూపమును 'అదంతం బయి దీర్ఘపూర్వలోపథం బయినమహత్తుమీఁది విభక్తిలకారంబునకు రేఫం బగు' (బాల. తత్స. 38) ననుసూత్రముచే సాధించిరి.

సూరిగా రిన్నినియమములతో రేఫమును విధించి యుండఁగాఁ, ప్రౌఢ. 'ద్విత్వయుక్త లాంతంబుమీఁది లులలకు రుర లాదేశం బగు' నని (శబ్ద–23) ద్విత్వయుక్తలాంతముమీఁది బహువచన లకారము నకుఁగూడ రేఫమును విధించినది. ఇది విరళప్రయోగము. ప్రయోగ ప్రామాణ్యముచేతనే దీనికి సాధుత్వమును సంపాదించుట యుచితము. దీనికి సూత్రరచన యవసరము కాదు.

**103.** సూ :- ని రమో మహతాం లుక్చ స్యాత్.

103 సూ:- మహద్భ్యః పరస్యామః స్థానే ని స్స్యాత్. 'రామునిన్, కృష్ణునిన్' ఇత్యాది. అమహద్భ్యః పరస్యామః స్థానే ను రిత్యాది రర్థ స్సిద్ధః. 'ని, ను' ఇత్యేతయో ర్లుగ్వాస్యాత్. రామునిఁజూచి, రాముఁజూచి, సింహమును, వనమును. 'విమలశీలుని రఘువీర కులోత్తంసున్' ఇతి సూరకవిః.

ద్వితీయాచార్యేణ తు, "మహతోఽమస్తు ని ర్లుక్స్యా దన్యత స్త్వత్ర నుర్భవేత్। ఇదాదిభ్యస్తు నిత్యం లుం గుదన్తాత్తు స వా భవేత్" ఇత్యుక్తమ్. ప్రయోగా స్తు సర్వత్ర 'ను'వర్ణకస్య లుక్యేవ బహవః శ్రూయన్తే. ఆచార్యప్రయోగేష్వపి బహుశో లుంగేవ శ్రూయతే. తేనాత్ర వ్యవస్థితా విభాషేతి జ్ఞేయమ్. అతఏవ రాజన్ శబ్దాదిభ్యో న నివర్ణకశ్రుతిశ్చ.

వి :– నిః, అమః, మహతామ్, లుక్, చ, స్యాత్ –అని ఛేదము,

మహాద్వాచకములకంటెఁ బరమైన 'అమ్' ప్రత్యయమునకు 'ని' యనునది యాదేశముగా వచ్చును. దానికి లోపము నగునని యర్థము. మహాత్తులకు 'ని' వచ్చుననుటచేఁ బరిశేషన్యాయమున నమహత్తుల యమ్మునకు 'ను' అనునది యాదేశ మగునని తెలియుచున్నది. 'సింహమును, వనమును' అనునుదాహరణములలో ద్వితీయైకవచనమున వచ్చిన ను వర్ణమునకుఁ బిమ్మట 'అన్యే ద్రుతప్రకృతయః' అను చోవ్వున ద్రుతము చేరవలయును. మహాత్పుంలింగ తత్సమములకుమాత్రమే 'ని' యనునది వచ్చును. దానికి వికల్పముగా లోపమును గల్గును. ఇట్టివానిని డుమంతములనుట యుచితము. సూరిగారట్లే చెప్పుచున్నారు. డుమంతములపై నిల్చినద్వితీయైకవచనప్రత్యయమగు 'అమ్' అనుదానికి 'ని' అనునది యాదేశమగును. దానికి వికల్పముగా లోపమును గల్గును. డుమంతేతరస్థలములందెల్ల 'అమ్ము' నకు 'ను' అనునది యాదేశమగును. దీనికిని బాహుళికలోపము గల్గును. "డుమంతములపై నిల్చిన 'అమ్ము'నకు 'ని' వర్ణ మాదేశమగును. దానికి వికల్పముగా లోపమును గల్గును. నివర్ణము రానిచోట 'ను' వర్ణ మమ్మున కాదేశమగును. 'ఇ ఈ ఐ' అనునవి యంతమునఁగలశబ్దములపై నున్నయమ్మునకు నిత్యముగా నివర్ణకము మాత్రమే యాదేశ మగును. ఉదంతములకంటె వచ్చిన 'ని-ను' వర్ణకములకు వికల్పముగా లోపము గల్గును" - అను నథర్వణవచనముచే 'నిరమో మహతా' మనుసూత్రము వివరింపఁబడినది. ఇట్టిచోఁ గవిశిరోభూషణము, 'అమహద్భ్యః పరస్యామ స్థానే 'ను' రిత్యాది రర్థ స్సిద్ధః' అని చింతామణిచేఁ గుదురుబాటు చేయుటకు యత్నించుట యథర్వణకారికలు చింతామణికి వివరణములు గావని యంగీకరింపకుండుటచేతనే కల్గినదని చెప్పక తప్పదు. రాజన్ శబ్దము డుమంతము గానందున దానికి 'ని' వర్ణకప్రాప్తియే లేదు. కాన 'అతఏవ రాజన్‌శబ్దాదిభ్యో న నివర్ణకశ్రుతిశ్చ' అని వా శబ్దమునకు వ్యవస్థ నంగీకరించుట నన్నయాథర్వణుల మతములకు విరుద్ధమే యగును.

ఈ పై కవిశిరోభూషణవిషయములను సూరిగారు బాల-తత్స-సూ. 23 నుండి 37 సూత్రములచే విస్తరించి వివరించియున్నారు.

**104 సూ :-** కర్మప్రవచనీయకే కూర్చిః.

104 సూ:- ఆద్యవ్యాకరణే, కర్మప్రవచనీయయుక్తే ద్వితీయా ఇతిసూత్రేణ యా ద్వితీయా విహితా తత్ర కూర్చీతి స్యాత్. జపమంగూర్చి వర్షము, హరింగూర్చి భక్తుఁడు ఇత్యాది. విరించింగుఱించి తపంబు సేసెన్ ఇత్యాదౌ తు విభక్త్యర్థాభిధాయకో వైకృత శబ్ద ఇతి జ్ఞేయమ్. అత ఏవాథర్వణేనోక్తమ్.

"కేచిత్తు వైకృతా శ్శబ్దా విభక్త్యర్థాభిధాయకాః" ఇతి 'కర్తురీప్సితతమం కర్మ' ఇత్యాది శాస్త్రవిషయే, 'అన్యారాదితి ద్వితీయావిభక్తిరితి జ్ఞేయమ్.

వి :- 'కర్మప్రవచనీయకే, కూర్చిః' - అని ఛేదము. కూర్చి - గుఱిచి - గుఱించి - అనునవి కర్మప్రవచనీయార్థమున వచ్చిన ద్వితీయ కగునని యర్థము. చింతామణి వ్యాకరణదృష్టితో వ్రాయఁబడినది గాదు. నన్నపార్యుఁడు భారతాంధ్రీకరణము చేయునపుడు సంస్కృత భాషాపదములను దెలుఁగులోఁ జెప్పవలసివచ్చుటచేఁ దదనుగుణముగ జ్ఞాపకార్థముగాఁ గొన్ని యనుగమములను సంస్కృతకారికలతో వ్రాసికొనెను. ఆ కారికలు కాలాంతరమున వ్యాకరణముగాఁ బరిణమించినవి. సంస్కృతవ్యాకరణమునఁ గర్మప్రవచనీయార్థమున వచ్చిన ద్వితీయ తెనుఁగునం దెట్లుండుననీ శంకించుకొని, 'కర్మప్రవచనీయకే కూర్చిః' అని సూత్రించినట్లుగా నగపడుచున్నది. 'కూర్చి' యనునది కర్మప్రవచనీయార్థమున వచ్చునని సూత్రార్థము. ఇది 'కూర్చు' ధాతువుయొక్క క్త్వార్థకరూపము. ఇట్లే గుఱించి యనునదియు 'గుఱించు' ధాతువు యొక్క క్త్వార్థకరూపము. ఈ రెండును దెనుఁగునందు ద్వితీయావిభక్తి ప్రత్యయమునకుఁ దరువాత నను ప్రయుక్తము లగుచుండును. జపమున్ గూర్చి, హరింగూర్చి, విరించింగుఱిచి మున్నగురూపములు సిద్ధించు చున్నవి. ఈకూర్చి గుఱించి మున్నగునవి విభక్తిప్రత్యయములుగా

వనియు దేశ్యశబ్దములనియు నథర్వణాచార్యులుగారు, "కొన్ని వైకృత శబ్దములు విభక్త్యర్థములను జెప్పుచున్నవి గల"వని వచించియున్నారు. ఇవియేకాక మెయిన్, మయిన్, మైన్, చేసి, పొంటె, మొదలైన దేశ్యశబ్దములును బ్రయోగములం దగపడుచున్నవి. ఈవిషయమున సూరిగారిమార్గము సవిమర్శముగా సిద్ధాంతములను గావించినది. చింతామణి ననుసరించి విభక్తిప్రత్యయములను జెప్పునపుడు గొన్నింటిని విడిచి కొన్నిచోట్ల నొక్కదానిమీఁదనే రెండుమూఁడింటిని సాధించెను. ఆసంగతు లన్నియును బాలప్రౌఢవ్యాకరణములనుబట్టి తెలియుట సముచితము.

105 సూ :- మహతో నిలౌ విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్తః.

105 సూ. 1:- 'మహత స్టాదౌ విభక్తౌ పరతః ఏకవచన బహువచనయోః క్రమాత్ 'ని-ల' ఇత్యేతౌ స్తః. రామునిచేతన్, రాములచేతన్; రామునికొఱకున్, రాములకొఱకున్; రామునివలనన్, రాములవలనన్; రామునికిన్, రాములకున్; రామునియందున్, రాములయందున్ - ఇత్యాది.

వి :- మహతః, నిలౌ, విభక్తౌ, టాదౌ, వచనద్వయే, క్రమేణ, స్తః-అని ఛేదము.

రామశబ్దమునకుఁ దృతీయావిభక్తిలో రామ+టా అని యుండగా నుత్వము చేసినపిమ్మట రాము+టా యని యుండును. దానికి 'టాస్చేతః' అనుసూత్రముచే 'చేత' వర్ణక మాదేశమై ద్రుతము చేరఁగా రాముచేతన్; అట్లే 'భిస్సు'నకు 'చేత' ఆదేశముకాఁగా, ఈ 'చేత' అనునది పరముగునపుడు డుమంతమున కేకవచనమున 'ని' అనునదియు, బహువచనమున 'ల' అనునదియు నాగమములుగా వచ్చునని సూత్రార్థము. 'చేత' విభక్తికేకాక తృతీయపై నున్నవిభక్తుల కన్నింటికి నేకవచనమున 'ని' అనునదియు, బహువచనమున 'ల' యనునదియు నాగమములై వచ్చును. రామునిచేతన్, రాములచేతన్ మొదలైనవి యుదాహరణములు.

105 సూ 2:– అత్రేయం చిన్తా. విభక్తా విత్యేకవచనే సాయ మర్థో జ్ఞాప్యతే. తేన వైకత్వార్థకస్య షహాతి నియమః. బహుత్వార్థకస్య లస్యతు, అషహాలోఽపి టాదివిభక్తేః ప్రాప్తిరస్తీతి. అన్నలతో నరిగెదయ్యె యడవులకున్' ఇత్యాదీ న్యాచార్యస్య ప్రయోగశతాని.

'శస స్స్యాదుభయత్రాపి ల స్తస్మాట్టాది రుచ్యతే' ఇత్యథర్వణవచనం చాత్ర మానమ్. తేన భామలచేతన్, వనములచేతన్–ఇత్యాదిరూపం సిద్ధమ్.

వి :– చింతామణి 'ని–ల' అనునవి టాదివచనద్వయమునను మహద్వాచకములకే యగునని చెప్పినది. దాని నీక్రిందిరీతి నథర్వణాచార్యులుగారు వివరించుచున్నారు.

"లవర్ణకము మహదమహచ్ఛబ్దముల కంతటను సంస్కృతద్వితీయా బహువచనప్రత్యయమగు శస్సున కాదేశ మగును. ఈ లవర్ణము తృతీయాదులలో నాగమముగా నిల్చి వానిపైని దృతీయాది బహువచన ప్రత్యయము లగును".

ఈవివరణార్థము నే యహోబలపతిపండితుఁడు, 'అత్రేయం చింతా' అనుగ్రంథముచే వివరించియున్నాఁడు. ఇట్లు చెప్పుట గ్రంథకృదభిప్రేతము గాదు.

బాలవ్యాకర్త మఱియొకపద్ధతి ననుసరించి యీవిషయమును సంగ్రహించెను. డు ము వు లు మున్నగుప్రత్యయములను బఠించి తరువాతఁ 'దృతీయాదులకు నుగాగమం బగు (బాల–తత్స–8) కై పట్టియొక్క–లకు నుగాగమంబు లేదు (బాల–తత్స–9)' అనుసూత్రములచేఁ దృతీయాదిప్రత్యయములకుఁ 'డిజ్మధ్య' సూత్రముచే సిద్ధించిన ద్రుతప్రకృతికత్వమును గల్పించెను. "చేత, తోడ, లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికముగా శేషించు" (బాల–తత్స–10) ఈసూత్రముచేఁ జింతామణిలోని పునరుక్తిని బరిహరించెను. 'డుమువున లేకవచనంబులు' (బాల–తత్స–11) 'లు'వర్ణంబు బహువచనంబు' (బాల–తత్స–12) 'తక్కినవి యుభయంబులు' (బాల–తత్స–13) ఈసూత్రము

లచే సూరిగారు, ఏకవచనబహువచనప్రత్యయములను నిరూపించిరి. 'బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు' (బాల.తత్స.31) అనుసూత్రముచే బహువచనలడాగమమును జేసి రూపసిద్ధిని గావించిరి.

**106 సూ :— టాదివిభక్తౌ ని ర్నే త్యేకే.**

టాదివిభక్తౌ పరతః నివర్ణకో నేతి వద న్తి కేచి దాచార్యాః. 'రామునేతన్ - రామునొఅసన్; రామునకై — రామువలనన్' ఇత్యాది. ప్రకృతిసమ్బన్ధివిభక్తౌ పరత స్సామాన్యతో న్యాగమం కృత్వాఽనన్తర మిద న్తత్వే కిః కార్యః. తేన రామునికి నితి రూపం సిద్ధమ్. యది వైకృతస్య కేరేవ నిమిత్తత్వం వివక్షితం తర్హి, అన్యోన్యాశ్రయా న్నైతద్రూపం సిద్ధ్యేదితి రహస్యమ్.

"సకలభువనముల నఱచే
తికిఁ దేరంబాలునట్టి ధీమంతుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజు
నికి నాతం డెత్తిరాక నిలుచునె యధిపా"

ఇత్యాది వాక్య మత్ర మానమ్.

వి:— టాదివిభక్తౌ, నిః, న, ఇతి, ఏకే— అని ఛేదము. తృతీయాది విభక్తులయందు 'ని'గాగమము రాదని కొంద అనుచున్నారని యర్థము. తృతీయాదివిభక్తులయందు నిగాగమపాక్షికత యీసూత్రముచే సిద్ధించుచున్నది. సూత్రమునందుఁ జెప్పినటాదివిభక్తి యనఁగాఁ బ్రకృతిసంబంధి యగు 'టా, భ్యాం, భిస్' అనునది యని యర్థము. 'కు' వర్ణకమునకిటఁ బ్రాప్తియే లేదు, కవిశిరోభూషణచర్చ యిట నవసరము గాదు. ఈసూత్రము నిగాగమమును వికల్పించుచున్నది. ఈవిషయమును సూరిగారు తత్సమములకు వేఱుగాను, నాచ్ఛికములకు వేఱుగాను రెండు సూత్రములచే విధించియున్నారు.

**107 సూ:— నామ న్త్వణే డు జి త్యన్యే.**

107 సూ:- సంబోధనే డు జ్న భవతి; కి న్త్వదాగమ ఏవ నామగతస్యాకారస్యే త్యన్యే వద న్తి. ఏజ్ హ్రస్వాత్సంబుద్ధేః' ఇతి సులోపః. 'ఓరామ, ఓకృష్ణ ఇత్యాద్య

దాహరణమ్. అదాగమేనాత్ర నిత్యం సన్ధిః. యద్యప్యకారస్య వైకల్పికః సన్ధిః తథాప్యత్ర సన్ధేర్న వికల్పః ప్రయోగాభావాత్. అంబ నవాంబుజోజ్జ్వలకరాంబుజ-ఇత్యాచార్య వచన మేవాత్ర మానమ్. ద్వితీయాచార్యేణాపి.

"సన్ధిర్నిత్యం ప్రత్యయాచ స్తథార్యాదిగతస్య చ" ఇత్యుక్తమ్.

ప్రతీయతే విధీయత ఇతి ప్రత్యయ ఇతి తదాశయః - 'రామయ్య, కృష్ణయ్య' ఇత్యాద్యుత్తరపాదే.

వి:- న, ఆమన్త్రితే, డుఙ్, ఇతి, అన్యే-అని ఛేదము. సంబోధనమునందు డుజ్జు రాదని కొందఱనుచున్నారని యర్థము. సంబోధనమున డుజ్జు, ఒకసారి నిల్చును, ఒకసారి నిల్వదు. ఈచింతామణి సూత్రములోని డుజ్వర్ణలోపము 'అదాగమప్రాప్తిని' సూచించుచున్నది. 'ఓ రామ+అ, ఓకృష్ణ+అ; అని యుండఁగా, "అచ్చునకుఁ బ్రత్యయాగమాదులయొక్కయు, అయ్యా మున్నగుశబ్దములయొక్కయు నచ్చు పరమగుచుండఁగా నిత్యముగా సంధి యగును. ఒకానొకప్పుడు పైసంధి బహుళముగా రావచ్చును"-అను నథర్వణవచనముచొప్పున నిత్యసంధి చేయఁగా సంబోధనరూపములు సిద్ధించుచున్నవి. ఆమంత్రణమునందు డుజ్జు రాదని కొందఱును, డుజ్జు నిలువదని కొందఱును దీని కర్థముచేయుచున్నారు. కవిశిరోభూషణము మొదటియర్థము నాశ్రయించి సుప్రత్యయమునకుఁ బాణినీయసూత్రముచే లోపము గల్గునని చెప్పినది. డుజ్జునకు లోపముచేయుట యనుపద్ధతిచొప్పున నీప్రక్రియ కవసరముండదు.

సూరిగారు కవిశిరోభూషణము ననుసరింపక "కృతోత్కం బగు సంస్కృతనామంబుసంబుద్ధి డుజ్జునకు లోపంబు విభాష నగు" (బాల. తత్స. 34) నని డుజ్‌లోపపక్షము నాశ్రయించి వివరించిరి.

**108 సూ:- టాన శ్చేతః.**

108 సూ:- టాసితి ప్రాకృతీయ స్తృతీయావిభక్తిప్రత్యాహారః. టాస శ్చేత ఇతి స్యాత్. 'చే' ఇత్యస్యా ప్యయ ముపలక్షణమ్. "కర్తృకరణయోస్తృతీయా", "హేతౌ" ఇత్యాది సూత్రవిషయే తృతీయేయమ్. 'రాముచేతన్, రామునిచేతన్' ఇత్యాది.

వి.- టాసః, చేతః—అని ఛేదము. సంస్కృతవ్యాకరణమునందుఁ గర్తృకరణార్థములందును హేత్వర్థమునందును దృతీయ వచ్చునని చెప్పఁబడినది. ఆతృతీయకుఁ దెలుఁగునం దీసూత్రముచే 'చేత' యనునది యాదేశమగునని యర్థము. చేత యనువర్ణకముచే 'చే' అనునదియు గ్రహింపఁబడును. 'చే-చేత' అనువర్ణకములు కర్తృకరణహేత్వర్థములలోఁ దెలుఁగునందు వచ్చునని తాత్పర్యము.

సూరిగారు, 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగువంచమికి బహుళంబుగా నగు' (బాల.కాం.4) నని చెప్పిరి. 'చేతవర్ణకంబు కర్త కగు' (బాల.కార 3) నని కర్త్రర్థమునందును దీనిని విధించిరి.

**109 సూ :- జేసః కయికొఱకూ.**

109 సూ - జేసితి చతుర్థీవిభక్తిప్రత్యాహారః ప్రాకృతీయః. జేసః స్థానే కయి, కొఱకు ఇత్యేతౌ స్తః. 'కోసము' ఇతి చతుర్థ్యర్థాభిధాయకో దేశ్యశబ్దః. 'రామునికయి; రామునికొఱకున్' ఇత్యాది. 'చతుర్థీసంప్రదానే' ఇత్యాదిసూత్రవిషయ ఇయం చతుర్థీ.

వి:- జేసః, కయికొఱకూ- అని ఛేదము.

'చతుర్థీసంప్రదానే' అనుసూత్రముచే సంస్కృతవ్యాకరణమున విహితమైన చతుర్థికిఁ దెనుఁగున "కయి-కొఱకు" అనునవి వచ్చునని యర్థము. 'వాయి రవు ర్వ్యత్యయతయా' అనుచోప్పున 'కయి' అనుదానికి 'కై' అనురూపాంతరము గల్గును. కావున 'కయి-కై' అను రెండును, వచ్చునని తెలియునది. 'రామునికయి-రామునికై-రామునికొఱకున్' మొదలగునవి.

సూరిగారు 'సంప్రదానంబునకుం జతుర్థి యగు' (బాల.కార.8) అనుదానిచేఁ బై విషయమును వివరించిరి.

**110 సూ :– జసిస ఉచ్యతే వలనః.**

110 సూ:- జసినితి ప్రాకృతీయః ప్రత్యాహారః. జసినో వలనేతి స్యాత్. 'అపాదానే పఞ్చమీ'తి శాస్త్రవిష యేఽయం పఞ్చమీ. రామునివలనన్, రాములవలనన్ ఇత్యాది.

వి:– జసినః, ఉచ్యతే, వలనః–అని ఛేదము. 'పఞ్చమ్యపాదానే' అను సంస్కృతవ్యాకరణసూత్రముచే సిద్ధించిన పంచమికిఁ బ్రకృత సూత్రముచేఁ దెనుఁగున 'వలన' అనుప్రత్యయ మాదేశ మగునని యర్థము. 'రామునివలనన్, రాములవలనన్' మున్నగునవి యుదాహృతులు. 'రామువలనన్' అనియు నుండును.

**111 సూ:– నః కౌ.**

111 సూ:– నేరపవాదః. నామ్నః కౌపరే న స్యాత్. 'రామునకున్ విష్ణునకున్' ఇత్యాది. ఉకారాదేశాక్షరగతా దూకారాచ్చ పరోఽయం నకారః. అతఏవ ద్వితీయాచార్యేణోక్తమ్.

"సర్వేషామేవ చోదన్తశబ్దానాం కౌ పరే భవేత్
నః ప్రాయ స్స్యాదృకారాచ్చ సర్వపణ్డితసమ్మతేః" ఇతి.

'రామాయణముగ రచించి ప్రాచేతసునకున్' ఇతి భాస్కరోక్తి రసఙ్గతైవ. కైవిభక్త్యపార స్సాధుః. వ్యాకరణద్వయేఽపి నస్యైవ విధానాత్. విధాతృనకు నిత్యాది ఋకారాన్తోదాహరణమ్. ప్రాయోగ్రహణాత్, ఊదన్తాదపి భవతీతిజ్ఞేయమ్.

వి:– నః, కౌ–అని ఛేదము. 'కు' వర్ణకము పరమగునపుడు పూర్వమునకు 'న'గాగమము వచ్చునని యర్థము. ఉకారమునకు 'కు' వర్ణకము పరమైనపుడే యీ నగాగమము ప్రాప్తించునని తాత్పర్యము. ఈవిషయము చింతామణియందుఁ బేర్కొనఁబడినందున "నః ప్రాయ స్స్యాదృకారాచ్చ సర్వపణ్డితసమ్మతేః" అనుదానిం గలిపి యథర్వణాచార్యులుగా రిట్లు వివరించుచున్నారు, 'సమస్తమైన ఉకారాంతశబ్దములకును 'కు' ప్రత్యయము పరమైనప్పుడు తఱచుగా 'న' వర్ణాగమ మగును. ఇట్లాగమము వచ్చుట పండితు లందఱకు సమ్మతము. ఋకారమునకు 'కు' వర్ణకము పరమగునపుడుఁ గూడ నీనగాగమము తఱచుగా నగును.

ఇట్లనుటచే ఊకారాంతశబ్దములకు సైతము నవర్ణాగమము వచ్చునని తెల్లమగుచున్నది.

ప్రాయశ్శబ్దము నహోబలపతి ఊకారాంతములకు నవర్ణక మగు ననుమాటతో నన్వయించెను. ఇది సరిగాదు. ప్రాయశ్శబ్దముచే ఋకారాంతమునకు నవర్ణక మగు ననునర్థమే సరియైనది. అథర్వణవచనము నందలి ప్రాయశ్శబ్దమునకుఁ గొందఱు 'కు'వర్ణకపరకత్వమునను 'ఉ'కారాంతమునకు సైతము 'న'గాగమము రాదని వ్యాఖ్యానించుచున్నారు. అది సరిగాదు. ఆవ్యాఖ్యానపక్షమున నే 'రామాయణముగ రచించి ప్రాచేతసుకున్' అనునది సాధు వగుచున్నది. కవిశిరోభూషణము దాని నంగీకరింపక 'రామాయణముగ రచించి ప్రాచేతసుకై' యని పఠించి సాధువుచేసికొం డనినది. విధాతృనకు మున్నగునవి ఋకారాంతోదాహరణములు.

ఈవిషయమును సూరిగారు "కువర్ణకంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమం బగు" (బాల-తత్స-29) నని వివరించిరి.

ప్రౌఢవ్యాకర్త కవిత్రయేతరప్రయోగముల ననుసరించి యీ నగాగమవిధానము నిట్లు వివరించెను.

'కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులందుఁదక్కఁ దక్కిన మహాకవిప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టదు' (ప్రౌ-శబ్ద-19) అని వచించి, "కంటెవర్ణకంబు పరంబగునపుడు గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి" (ప్రౌ-శబ్ద-20) అని సూత్రించి, 'తత్క్రతుశతంబునకంటె' అను నన్నపార్యుని ప్రయోగము నుదాహరించెను. ఇంతేకాక "ఉదంతంబులగు నమహత్తుల 'కందు' వర్ణము పరమగునపుడును నగాగమంబు గొన్నియెడలఁ గానంబడియెడి '(ప్రౌ-శబ్ద-21) నని సూత్రించి అనిమిషనాయకత్వమునయందు'; 'పిండదానసమంబునయందు' మున్నగు ప్రయోగ

ముల నుదాహరించెను. 'ప్రాయః' అనుపదముచే నీయర్థములు సంగతము'లగునని యూహించుట లెస్స.

## 112 సూ:— జమః కు రనితామ్.

112 సూ:- ఇకారాన్తవ్యతిరిక్తాత్ పరస్య జమః కురితి స్యాత్. జమితి ప్రాకృత వ్యాకరణప్రత్యాహారః. 'రామునకున్, సీతకున్'ఇత్యాది. ఇకారాంతాత్ కి ర్వక్ష్యతే.

వి:— జమః, కుః, అనితామ్—అని ఛేదము. ఇకారాంతము గాని శబ్దమునకుఁ బరమైనషష్ఠికిఁ దెనుఁగున 'కు' వర్ణక మాదేశమగునని యర్థము. 'రామునకున్, కృష్ణునకున్', మొదలగునవి. ఇకారాంతశబ్దములకు 'కి' వర్ణకము ముందుఁ జెప్పఁబోవుచున్నాఁడు.

ఇయ్యెడ సూరిగారు విధానాంతరము ననుసరించి 'కు' వర్ణకమును 'కి' వర్ణకమునుగా మార్చుకొనిరి.

## 113 సూ :— అందు జిపః.

113 సూ:- జిపితి ప్రత్యాహారః. జిపః అంద్వితి స్యాత్; 'రామునియందున్.' జేరభావ పక్షే నుమ్చేతి నుమి కృతే 'రామునందున్, కాంతలయందున్ ఇత్యాది.

వి:— అందు, జిపః—అని ఛేదము.

సప్తమీవిభక్తికిఁ దెనుఁగునందు 'అందు' అనునది యాదేశమగునని యర్థము. 'రామునందున్, కాంతలయందున్' మున్నగునని యుదాహరణములు.

## 114. సూ:— సవిధవర్తినా మిన్దు.

114 సూ 1:- అధికరణతాపన్న సమీపవర్తి పదార్థాభిధానే ఇంద్వితి స్యాత్. 'రాముఁ డిందు భుజించెన్, ఇందు శయనించెన్' ఇత్యాది.

వి :— సవిధవర్తినామ్, ఇన్దు—అని ఛేదము. 'అందు' అనునది సప్తమీవిభక్తి ప్రత్యయ మగును. 'ఇందు' అనునది యనాశ్రయమై

సప్తమ్యర్థావబోధక మగుచున్నది. ఈవిషయము ముందు వివరింపఁబడును.

114 సూ 2 :- నను, అంద్విత్యస్య సాశ్రయత్వ మనాశ్రయత్వ మస్తీతి; సాశ్రయత్వే విభక్తిత్వ మనాశ్రయత్వే, అత్రే త్యవ్యయపర్యాయపరత్వ మేవేతి. తస్య విభక్తిత్వేన గ్రహణం యుక్తమ్. ఇంద్విత్యస్యతు కేవల మనాశ్రయత్వేన తస్యవిభక్తిత్వే నోపాదానం కథ ముపపన్నం స్యాత్? కిఞ్చ, తస్య విభక్తిత్వేన గ్రహణే ఎంద్విత్యస్యైవ కిమపరాద్ధమ్. తస్యా వ్యధికరణతాపన్న పరోక్షపదార్థాభిధాయిత్వాదితి చేత్సత్యమ్. సామాన్యాకారేణ, అంద్వితిగ్రహణాత్ 'అందలిపూవుదోంపములు' ఇత్యాది ప్రయోగస్సిద్ధ్యతి. ఇందుగ్రహణఫలం తు 'ఇందలి రత్నసానవులు' ఇత్యాది వాక్యమేవే త్యవధారయ.

వి:- చింతామణికారుఁడు, 'అంద్వింందునాస్తు సప్తమీ' అని 'అందు- ఇందు' అనువానికి సప్తమీవిభక్తిప్రత్యయత్వ మంగీకరించెను. 'అందు' అనుదానిని 'అందు జిపక' అనుసూత్రముచే సప్తమీవిభక్తికి సర్వాదేశముగా విధించెను. కవిధవర్తినా మిన్న అనుసూత్రముచే 'ఇందు' అనుదానిని వేఱుగాఁ జెప్పి యున్నాఁడు. 'ఇందు' అనునది విభక్తిప్రత్యయము గాదు. అయినను నధికరణశక్తిప్రధానమైనది యగుటచేతను 'జేరలిచ' అనుసూత్రముచే నలిగాగమము - 'ఇందు' - అనుదానికిఁ గూడ రావలసియుండుటచేతను దత్సిద్ధికై సప్తమీవిభక్తి ప్రత్యయములలో 'నిందు' అనుదానిని బరిగణించెను. 'ఎందు' అనునది మఱియొకటి గలదు. కాని దాని కలిగాగమము రానందున నది సూత్రమున గ్రహింపఁబడలేదు. 'ఎందలివారు' - అనుప్రయోగము నేఁడు మనకు వినఁబడుచున్నదిగాని యది ప్రాచీనప్రామాణిక కవిసమ్మతము గాదు. 'ఎందులవారు' అని ప్రాచీనప్రయోగము గలదు.

114 సూ 3 :- 'అందు, ఇందు, ఎందు; అట, ఇట, ఎట; ఇత్యాదయోఽధికరణలక్షణార్థాభిధాయకాః దేశ్యశబ్దాః.

"సాశ్రయాఽనాశ్రయాపి స్యాత్తత్రార్థగతసప్తమీ" ఇత్యథర్వణే నోక్తమ్. నస్తు స్త్రీలిఙ్గవ్యతిరిక్తామహచ్ఛబ్దేభ్యో భవతీతి జ్ఞేయమ్. అతఏవో క్త మథర్వణేన.

"శేర్నస్యాత్ సోఽపి ముఖ్యాన్తం వినా వుప్రత్యయాన్వితమ్. అమహాన్నామ జడగం చోదన్తం నాన్యతో విధిః" ఇతి. ఉదన్తం చ స్త్రీసమోదన్త మిత్యర్థః. 'వనంబునన్, ధనువునన్, పేరునన్' ఇత్యాది తదుదాహరణమ్. 'సప్తమ్యధికరణే చ' ఇతి సూత్ర విషయేయం విభక్తిః. 'విప్రపంశంబునవారు' ఇత్యాచార్యః.

వి:— "అందున్" అనునది సప్తమీవిభక్తిప్రత్యయముగనే కాక స్వతంత్రశబ్దముగా నైతము ప్రయోగింపబడుచున్నది. 'ఆస్థలమందు' అనునర్థముగలసప్తమీవిభక్తిప్రత్యయమగు 'అందు' అనునది సాశ్రయముగను, అనాశ్రయముగను ప్రయోగింపబడుచున్నది" – రాముని యందున్ మున్నగు వానిలో సాశ్రయమైనది. 'ఇందుఁ గలఁ డందు లేఁడ'నునపు డనాశ్రయ మైనది. "అన్ద్వందునా స్తు సప్తమీ" అనుచొప్పున వచ్చుసప్తమీవిభక్తి 'న' వర్ణకము సప్తమ్యేకవచనము నందు జడవాచకశబ్దసంబంధమైన 'ము – మ్ము – ంబు – వు' – అను నాగమములకు మీఁద నిలుచును' – అను నథర్వణవచనముచొప్పున 'వనమునన్, ధనమ్మునన్, వృక్షంబునన్, ధనువునన్' అనునవి నిష్పన్నములగును.

సూరిగారు ఉదంతజడంబునకు నవర్ణకం బగు (బాల. కార. 18) నని నవర్ణకవిషయమును వివరించిరి.

115 సూ :— తోడ సహార్థే టాసః.

115 సూ 1 :— 'సహాయుక్తేఽప్రధానే' ఇత్యాద్యవ్యాకరణసూత్రేణ సహార్థ యుక్తే అప్రధానార్థే యా తృతీయా విహితా తత్ర తోడేతి స్యాత్. తోడేతి 'తో' ఇత్యస్యాప్యుపలక్షణమ్. తోడుత నితి విభక్త్యర్థాభిధాయక శ్శబ్దః 'శిష్యులతోడ వచ్చె గురువు, శిష్యులతోవచ్చెన్. 'శిష్యైస్సహ ఆగతో గురు'రిత్యాద్యోదాహరణమ్. "మందితసూర్యరశ్మిరుచిమన్మణిహారచయంబుతోఁ గటస్యందిసుగంధిదానజలసంపద నొప్పెడివాని దేవకీనందనుఁ డిచ్చె", 'విజయప్రారంభాత్యుగ్రుఁడయ్యెఁ బాండవుతోడన్', 'ఎన్నిదినములయ్యె నేలయ్య మాతోడ నిభపురీశ పలుక విట్టులేల' "అనవరతము భక్తితో మదర్చిత యగుచున్"; ఇత్యాద్యాచార్యప్రయోగే ప్రసిద్ధేయమ్.

'తుల్యార్థై రతులోపమాభ్యా' మితి సూత్రస్య విషయే చేయం ప్రవర్తతే. తేన 'హరికిఁ దుల్యుఁడు, హరితోడఁ దుల్యుఁడు', ఇత్యాదిరూపం నిర్బాధమ్.

వి :— తోడ, సహార్థే, టాసః—అని ఛేదము. 'తోడ, తో' అనునవి రెండును దృతీయావిభక్తి ప్రత్యయములే. సంస్కృతవ్యాకరణమునందుఁ దృతీయావిభక్తిని విధించుసూత్రములు గొన్ని గలవు. అందు 'సహయుక్తేఽప్రధానే'అనుసూత్రముచే విహితమైనతృతీయావిషయమునను, 'తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయాఽన్యతరస్యా' మ్మను సూత్రముచే విహితమైనతృతీయావిషయమునను, 'తో, తోడ' అను విభక్తిప్రత్యయములు వచ్చునని సూత్రార్థము. 'శిష్యులతోడ వచ్చెన్, శిష్యులతో వచ్చెన్' అనునవి సహార్థకతృతీయావిభక్తులు. '...మణిహారచయంబుతో' ననియు, '...పాండవుతోడన్' అనియు, 'మాతోడన్'; 'భక్తితోన్' అనియు నాచార్యులుగారుకూడ 'తో, తోడ' ప్రత్యయములతోఁ దృతీయను బ్రయోగించియున్నారు. 'హరికిఁ దుల్యుఁడు, హరితోడఁ దుల్యుఁడు' అని తుల్యార్థయోగమున 'తోడ—కు' వర్ణంవచ్చుటయుఁగలదు.

సూరిగారు 'కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' 'వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ' దోడ—కువర్ణకంబులు ప్రాయికంబుగా నగు' 'ఉపయోగంబునందాఖ్యాతకుం దోడవర్ణకం బగు' నని (బాల.కార. 5,6,7.) సూత్రములలోఁ బై విషయములనువివరించిరి.

**115** సూ **2** :- నన్వత్ర కథం ప్రధానాప్రధానయోః శాబ్దత్వార్థికత్వాభ్యా మేకక్రియాన్వయ స్సంభవే దితిచే న్మైవమ్. అత్రాపి తుల్యాదిక్రియాన్వయోఽస్త్యేవేతి న దోషః. క్రియాన్వయత్వం వినా కారకత్వం న సంభవతీతి వైయాకరణసిద్ధాన్తః. ఏవంచ 'దానితోనుపమ'; 'దానితోఁదుల'; 'ఇతి రూపద్వయం న సాధు. కిన్తు 'దానికి నుపమ'; ఇత్యాదిరూపమేవ నిర్బాధం సిద్ధ్యతీ త్యవగన్తవ్యమ్.

వి:— 'తుల్యార్థైః' అను సూత్రముచేఁ దృతీయ విధింపఁబడిన స్థలములలో సహార్థక తృతీయవలెఁ దృతీయ యెట్లు వచ్చునని ప్రశ్నించు

చున్నాఁడు. ఏలయనఁ బ్రధానమైనది శబ్దమనియు నప్రధానమైనది యర్థమనియు వీని కేకక్రియాన్వయిత్వ మెట్లు పొసఁగుననియు నాయాశంకకర్థము. క్రియాన్వయము లేనిచోటఁ గారకత్వ ముండదని వైయాకరణసిద్ధాంతము. ఆకారణముచే, 'దానితో నుపమ - దానితోఁదుల' అను నిట్టిప్రయోగములు తెలుఁగులో నుండవనియు 'దానికి నుపమ'యనియే యుండుననియుఁ దాత్పర్యము.

115 సూ. 3:- కేచిత్తు సదృశవాచకయోరేవ తులోపమాశబ్దయో ర్గ్రహణమ్; న సాదృశ్యవాచకయోరపి; 'నభసా నిభృతేన్దునా తులా' ఇత్యాది మహాకవిప్రయోగాత్. సాదృశ్యవాచకత్వం చ తస్య తులా నాస్తీతి ప్రయోగా న్నిర్వివాదమితి వదన్తి. తద్రీత్యా సాదృశ్యపరత్వే తు రూపద్వయస్యాపి సాధుత్వం జ్ఞేయమ్. 'ధరణి హరిశ్చంద్రుఁడు భాసురయశుఁడై చేసె రాజసూయం బదియున్। సరి గాదని యే వగ చెద। సురుచిరయశుఁడైన ధర్మసుతుయజ్ఞముతోన్' - ఇత్యాచార్యప్రయోగే కథం సరీత్యాదికేవలవికృతిపదం సఙ్గచ్ఛతే ఇతిచే న్నైష దోషః వికృతిపదై స్సంస్కృతపదార్థాభిధానస్యాపి, 'సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా' ఇతి సూత్రస్వరసప్రాప్తత్వాత్. అతఏ వాథర్వణే నోక్తమ్ —

“శబ్దా యేచ సముత్పన్నా ఆద్యాయా మత్ర తేఽఖిలాః ।
కథితా వైకృతై శ్శబ్దై ర్భవన్తి పదనుగ్రహాత్” - ఇతి.

వి:- తులా - ఉపమా శబ్దములకు సదృశవాచకత్వము సాదృశ్యవాచకత్వము నను రెండర్థములు గలవు. సదృశవాచకములైన తులా - ఉపమాశబ్దములకే 'తుల్యార్థైః' అనుసూత్రమున గ్రహణము గాని సాదృశ్యవాచకములకుఁ గాదు. మహాకవులు 'నభసా నిభృతేందునా తులా' అని ప్రయోగించి యున్నారు. ఇందలి 'తులా' శబ్దము సదృశవాచకమే. 'తస్య తులా నాస్తి' అనుదానియందలి 'తులా' శబ్దము సాదృశ్యవాచకము. సాదృశ్యవాచకమైనపుడు తృతీయాషష్ఠులు రెండును రావచ్చును. 'సరి గాదని యే వగచెద ...ధర్మసుతుయజ్ఞముతోన్' - అనునది సరిగాదు. నన్నయగారు 'సరి' శబ్దమును సదృశవా

చకముగాఁ బ్రయోగించియున్నారు. అయినను దోషము లేదు. 'సహా కవులు సంస్కృతమునందున్న సర్వశబ్దములకును వికృతిశబ్దముల నేర్పఱిచియున్నారు. సంస్కృతభాషయందు 'సదృశము - తుల్యము' మున్నగుశబ్దములు 'సహా - సాకమ్' మున్నగుశబ్దములును సత్కవుల యనుగ్రహమువలన సరి - సాటి - ఉద్ది - కూడన్ - మున్నగు నాచ్ఛికశబ్దములచేఁ జెప్పఁబడుచున్నవి' అనుసర్వాణవచనము చొప్పునను సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా' అనుసూత్రస్వారస్యము చొప్పునను దోషము గాదని తాత్పర్యము.

116. సూ :- పట్టీతి తు పఞ్చమీ గుణే హేతౌ.

116 సూ:- గుణే హేతౌ సతి 'విభాషా గుణేఽస్త్రియామ్' మిత్యాద్యవ్యాకరణసూత్రేణ యా పఞ్చమీ విహితా తత్రపట్టీతి పఞ్చమీవిభక్తిస్స్యాత్. 'జాడ్యముంబట్టి బద్ధుఁడు' ఇత్యాద్యుదాహరణమ్. తృతీయాపక్షే 'జాడ్యముచేత బద్ధుఁడు' 'కర్తృకరణయో స్తృతీయా' ఇత్యాదిసూత్రవిహితతృతీయాస్థానే 'టాస శ్చేత' ఇతి విధానాత్, నత్వజడప్రకృతిభ్య స్తృతీయాస్థానే. 'అన్యస్యాః క్వచిద్భవే ద్వాస్యా' ఇతిసూత్రోక్తరీత్యా విహితే ద్వితీయాసప్తమ్యావేవ హేతుతృతీయేతి వ్యవహార స్త్వయమాచార్యః. తత్రాపి 'చేసి' శబ్దం ప్రాయశః ప్రాయుఙ్క్త. 'భారతభారతీ శుభగభస్తిచయంబులఁజేసి'; 'పరార్థపరిగ్రహబుద్ధిఁజేసి పాపంబగు'; 'శమహీనుఁడైన విశ్వామిత్రుచేసినయపకారమునఁజేసి'; ఇత్యాది. క్వచిత్ 'చేసి' శబ్దప్రయోగాభావేఽపి 'వారలకారణంబున నెగ్గు పుట్టెన్ - ఇత్యాది. తృతీయార్థే అత్వేపి, ప్రల్లదుఁడైనయొక్కకులసాంసను చేసినదానఁ దక్కులంబెల్ల' నిత్యాది.

వి :- పట్టి, ఇతి, తు, పంచమీ, గుణే, హేతౌ-అని ఛేదము.

గుణము హేతువగునపుడు వికల్పముగా సంస్కృతమునఁ బంచమీ తృతీయలగును. ఆపంచమికిఁ దెనుఁగునఁ 'బట్టి' వర్ణక మగునని యర్థము. జాడ్యముంబట్టి బద్ధుఁడు, అనునపుడు బంధనమునకు గుణవాచక మగు జాడ్యము హేతు వగుచున్నది. ఇట్లే తక్కినవియును. 'జాడ్యముచేత బద్ధుఁడు' అనియు నుండును. అజడప్రకృతులపై నున్నద్వితీయకుఁ దృతీ

యాసప్తములు, 'అన్యస్యాః క్వచిద్ భవే చ్ఛాన్యా' అనుదానిచేఁ గల్గును. దానిని హేతుతృతీయ యని యాచార్యులు నుడివిరి. అచటఁ దఱచుగాఁ 'జేసి'యనుశబ్దమును బ్రయోగించిరి. అది లేకయుఁ గొన్ని ప్రయోగము లుండును.

'కొన్నియెడల 'చేత' విభక్త్యర్థకవర్ణకంబులకును 'వలన' వర్ణకంబునకును దఱచుగా 'చేసి' యనుప్రయుక్తం బగు '(ప్రౌఢ. కార. 4 సూ.)' అయ్యాది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియు చాలెడి (ప్రౌఢ. కార. 5) అని ప్రౌఢవ్యాకర్త 'చేసి' శబ్దమును గుఱించి వివరించియున్నాఁడు.

**117. సూ :— కంటే ఽన్యారాదాదేః.**

**117** సూ:- "అన్యారాదితరర్తే దిక్ఛబ్దాఞ్చూత్తరపదాజాహియుక్తే" ఇతిసూత్రేణ అన్యారాదాదియోగే యా పఞ్చమీ విహితా తత్ర 'కంటే' ఇతి స్యాత్. రామునికంటె నన్యుఁడు–వనముకంటెఁ జేరువ–గ్రామముకంటెఁ బూర్వము–ఇత్యాది. 'పృథగ్వినానానాభి స్తృతీయాన్యతరస్యామ్' 'యతశ్చాధ్వకాలనిర్మాణం తత్ర పఞ్చమీ'; "తద్యుక్తాదధ్వనః ప్రథమాసప్తమ్యౌ; కాలా త్సప్తమీచ వక్తవ్యా" ఇత్యాది శాస్త్రం చాత్ర గృహ్యతే. నిర్ధార్యమాణస్య యత్ర భేదఏవ 'పఞ్చమీవిభక్తే' ఇతి సూత్రేణ యా పఞ్చమీ విహితా తస్యాస్థానేపి కంటెపంచమీ సాధురేవ. సర్వసఙ్గ్రాహక స్యాదిశబ్దస్య సత్త్వేన బాధకాభావాత్. తేన 'మాధురులు పాటలీపుత్రకులకంటె నాఢ్యతరులు' ఇత్యాదికం రూపం సిద్ధమ్.

వి:- 'కంటే, అన్యారాదాదేః–అని ఛేదము. సంస్కృతమున హ్రస్వమైన 'ఎ' కారము లేదు కావున 'కంటే' అనుసూత్రవిహితమైన దానికి 'కంటె' అనియే యర్థము చెప్పుకొనవలెను. అన్యము – ఇతరము – మొదలైన శబ్దములు, అన్యారాదాదులు. వానితో యోగ మున్నప్పుడు పంచమి కల్గునని సంస్కృతవ్యాకరణము చెప్పుచున్నది. ఆపంచమికి 'కంటె' వర్ణకము వచ్చునని చింతామణిసూత్రమున కర్థము. అంతేకాక "పృథగ్వినానానాభిః..." మొదలగు సూత్రములచే నిప్పన్న

మైనపంచమికిని 'కంటె' వర్ణకమే వచ్చును. 'పంచమీావిభక్తే' అను సూత్రమువలనఁ గల్గినపంచమికిని 'కంటె' వర్ణకము వచ్చును.

సూరిగారీవిషయములను 'కంటె వర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు (బాల. కార. 12) కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు (బాల. కార. 13) అని వివరించిరి.

118 సూ:- లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ.

118 సూ:- నిర్ధారణాత్ పృథక్కరణా దుద్భవః. యతశ్చ నిర్ధారణ మితిసూత్రేణ నిర్ధారణార్థే యా షష్ఠీవిహితా తత్ర లోపలేతి విభక్తి స్స్యాత్. దేవతలలోపల శ్రీకాంత యధికురాలు' ఇత్యాద్యుదాహరణమ్.

వి:- లోపల, నిర్ధారణోద్భవా, షష్ఠీ - అని ఛేదము. సముదాయమునుండి యొకదానిని వేఱుచేసి చెప్పుట నిర్ధారణమగును. నిర్ధారణార్థమున 'యతశ్చ నిర్ధారణ' మ్మను సంస్కృతవ్యాకరణసూత్రముచే షష్ఠి విధింపఁబడినది. ఆషష్ఠికిఁ దెలుఁగునందు 'లోపల' అనువర్ణకము వచ్చును; కొన్నియెడల 'లో' అనియు నుండును.

సూరిగారీవిషయమును నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకంబగు (బాల. కార. 16.) నని వివరించిరి.

119 సూ :- యొక్క చ శేషే షష్ఠీ.

119 సూ:- 'షష్ఠీ శేషే' ఇతిసూత్రేణ కారకప్రాతిపదికార్థవ్యతిరిక్తవిషయే యా షష్ఠీవిహితాత త్రతు యొక్కేతి విభక్తిస్స్యాత్. రామునియొక్క దాసుఁడు; సీతయొక్క భర్తఁడు - ఇత్యాద్యుదాహరణమ్. వికృతౌ శేషషష్ఠ్యైవ షష్ఠీసమాసః. యద్యపి యొక్కషష్ఠ్యర్థప్రతిసన్ధానం సమాసఏవ. వాక్యస్యతు ప్రయోగః ప్రబన్ధేషు ప్రాయశో న దృశ్యతే; తథాపితస్య ప్రయోగ ఇష్టఏవ. కళామధ్యే తత్ప్రారేన ప్రయోగస్య జ్ఞాపితత్వాత్. 'కి, కు' ఇతి విభక్తిస్తు అసమాసే కారకషష్ఠీతి జ్ఞేయమ్. 'హరికిచ్చెన్, విష్ణునికిచ్చెన్' ఇత్యాది తత్రోదాహరణమ్. 'సౌధంబులలోపల' ఇత్యాదిషు 'లోపల' శబ్దః అంతరవ్యయపర్యాయో దేశ్యశబ్దః.

యొక్క, చ, శేషే, షష్ఠీ—అని ఛేదము. సంస్కృతవ్యాకరణమున 'షష్ఠీ శేషే' అనుసూత్రముచే సిద్ధించిన శేషషష్ఠికిఁ దెనుఁగునందు 'యొక్క' అనువిభక్తిప్రత్యయము వచ్చును. 'యొక్క' ప్రత్యయముతోడనే తెలుఁగునందు సమాసవిగ్రహములు చెప్పవలయును. 'యొక్క' అనుదానికిఁ బ్రబంధములలోఁ బ్రయోగము లేదు. 'కి – కు' అను షష్ఠీవిభక్తిప్రత్యయములు సమాసము లేనప్పుడు వ్యస్తతలో నుండును. ఇవి కారకషష్ఠులు. 'లోపల' అనుశబ్ద మొకటి సప్తమ్యర్థకముగాఁ దెలుఁగునం దగపడుచున్నది. అది 'అంతర్' అను నవ్యయమునకుఁ బర్యాయ మైన దేశ్యశబ్దము.

బాలవ్యాకరణమునం దీవిషయములు 'శేషషష్ఠికి యొక్కయు నగు' (బాల. కార. 15.) నని వివరింపఁబడినది. ప్రౌఢవ్యాకర్త 'యొక్క' కు లోపంబు బహుళంబు (ప్రౌ. కార. 16.) అని వ్యస్తతయందును 'యొక్క' కు లోపంబును విధించెను.

**120 :- విషయనిమిత్తాదిజా తథైవాన్యా.**

120 సూ. 1:- విషయనిమిత్తాద్యర్థజా అన్యా విభక్తిః సప్తమీత్యర్థః. తథైవ తేన ప్రకారేణ ప్రథమాన్తత్వలక్షణేన తిష్ఠతీత్యర్థః. ఆదిశబ్దేన సత్యర్థప్రధానా సప్తమీ గ్రాహ్యా. తద్విధాయకం చ శాస్త్రం 'యస్య చ భావేన భావలక్షణమ్' ఇత్యాది. ఇతరయో ర్విధాయకస్తు 'నిమిత్తాత్ కర్మయోగే' 'సప్తమ్యధికరణే చ' ఇత్యాదిశాస్త్రమ్. ఔపశ్లేషికో వైషయికోఽభివ్యాపకశ్చేత్యాధారః త్రివిధ ఇతి సంహితాయాం ఇతి సూత్రే భాష్యమ్. 'నిమిత్తాత్ కర్మయోగే' ఇతి సూత్రే నిమిత్తం నామ ఫలమ్. 'భృత్యుల విషయము గౌరవ మత్యంతచలంబు సత్య మవనీశులకున్'- 'చర్మమునిమిత్తము ద్వీపిని జంపెను'; 'వాలమునిమిత్తము చమరిం జంపెన్' 'దంతములనిమిత్తము కుంజరంబును జంపెన్' 'సీమనిమిత్తము శంకువు నాటెన్' యద్వా సీమనిమిత్తము పుష్కలకముఁ జంపెన్' 'సీమాణ్డకోశః. పుష్కలకో గన్ధమృగవిశేషః. 'అథ పుష్కలకో గన్ధమృగే క్షపణకీలయోః' ఇతి మేదినీకారః. 'చర్మణి ద్వీపినం హన్తి' దన్తయో ర్హన్తి కుఞ్జరమ్। వాలేషు చమరీం హన్తి సీమ్ని 'పుష్కలకో హతః' ఇత్యుక్తం వ్యాకరణపారగైః. 'భృత్యు లావులఁ బిదుకఁగ వచ్చెను; గోవులు పిదుకఁబడఁగఁ జనెన్'; 'వటువులు

చదువుచుండఁగ వచ్చెన్. షష్ఠీ చానాదరే. 'పుత్రులు దుఃఖింప సన్న్యసించెన్' ఇత్యాది. సతిసప్తమ్యా వర్తమానార్థకత్వం విశేషః. ప్రథమాన్తత్వన్తు సర్వత్ర సమానమ్. అథర్వణేనాప్యుక్తమ్.

"భావాదిజన్యజే ప్రత్యు స్సపా స్యా దత్ర సర్వదా
సత్యర్థజా సప్తమీ తు వర్తమానార్థతాం గతా"-ఇతి.

సనాదిశబ్దా వర్తమానార్థబోధకాః. విషయనిమిత్తయోః ప్రయోగ ఏవాయం విధిః. అన్యత్ర, 'మోక్షమునందు నిచ్ఛ గలదు', ఇత్యాదిరూపం భవత్యేవ. సత్యర్థసప్తమ్యాః క్వచిత్ప్రయోగసంభవేఽపి న సామఞ్జస్యమితి జ్ఞేయమ్. 'నిమిత్తపర్యాయప్రయోగే సర్వాసాం ప్రాయదర్శనమ్.' ప్రాయగ్రహణా దసర్వనామ్నః ప్రథమాద్వితీయే న స్తః. వర్తమానస్తు ప్రథమా మప్యాహ. 'ఏనిమిత్త ముండెనరఁడు' ఇత్యాదిరూపం తు యథాయోగ్య మూహ్యమ్.

వి:- విషయనిమిత్తాదిజా, తథా, ఏవ, అన్యా - అని ఛేదము. విషయార్థమునందు నిమిత్తార్థమునందుఁ బైసూత్రముచే సప్తమీ విభక్తి విహిత మగుచున్నది. అచట శబ్దమునకుఁ బ్రథమాంతత్వము గూడ వచ్చుచున్నది. ఆదిపదముచే సతిసప్తమి గ్రహింపఁబడుచున్నది. విషయనిమిత్తార్థములందును సత్యర్థమునందును సంస్కృతవ్యాకరణమున సప్తమీవిభక్తి విహితమైనది. అధికరణమనఁగా నాధారము. సప్తమ్యధికరణే చ- అనుసూత్రముచే సప్తమి విహితమైనది. ఈ సప్తమి ఔపశ్లేషికము, వైషయికము, నభివ్యాపకము—అని మూఁడువిధములు. సతిసప్తమియందు వర్తమానార్థత్వము భాసించుచుండును. ప్రథమాంతత్వము తక్కినవానితో సమానము. "భావాద్యర్థములలో 'యస్య చ భావేన భావలక్షణమ్' మున్నగు పాణినీయముచే విధింపఁబడినసప్తమి భావాదిజన్యసప్తమియని చెప్పఁబడుచున్నది. దీనికిఁ దెనుఁగునందుఁ బ్రథమావిభక్తితో సమాన మగురూపమే యుండును. అనఁగాఁ బ్రథమాంతముగాఁ బ్రయుక్తమగునని యర్థము. సతిసప్తమి ప్రథమాంతముగఁ బ్రయుక్తమైనను వర్తమానార్థత్వమును బొందుచుండు' నను నథర్వణవచనముచే భావాద్యర్థక సతిసప్తములు రెండును వివరింపఁబడినవి.

సూరిగారీవిషయములను 'అధికరణంబునకు సప్తమి యగు' (బాల. కార. 17.) అని వివరించిరి.

120 సూ. 2 :- 'షష్ఠీ హేతుప్రయోగే' ఇతి సూత్రమహిమ్నా 'అన్నమునకుండు నిచట'- ఇత్యాదిరూపం సిద్ధమ్. అన్నస్య హేతో ర్వసతీత్యాది తత్రోదాహరణమ్.

వి:- 'షష్ఠీ హేతుప్రయోగే' అనుచోప్పన 'అన్నస్య హేతోర్వసతి' అని సంస్కృతమున సిద్ధించును. అది యాంధ్రమున 'అన్నమునకుండు నిచటన్' అనురీతి నేర్పడును.

120 సూ. 3 :- 'నీనిమిత్తంబునన్' ఇత్యాది తత్పురుషసమాసోఽపి సాధుః. 'నీకారణంబునఁజేసి సర్వజగంబులోఁగల భూపతుల్'; 'తనకులబ్రాహ్మణున్'; 'తమతమకులములన్'-ఇత్యాద్యాచార్యప్రయోగాత్. సమాసస్య తత్పురుషత్వే 'వారలకారణమున నెగ్గుపుట్టు గౌరవ్యులకున్' ఇత్యాద్యాచార్య ప్రయోగ ఏవ. అథర్వణాచార్యేణ తు-

'శబ్దేభ్యో యుష్మదాదిభ్య స్సమాసోఽపి గురు ర్భవేత్' ఇత్యుక్తమ్.

వి:- 'ద్విగువు-కర్మధారయము' మున్నగు సమాసములు తెలుఁగునందుండునని చింతామణి చెప్పినది. అవి సాంస్కృతి కాచ్ఛిక మిశ్రములని మూఁడురీతులుగా విహితమగుచున్నవి. నీవు - నేను - తాను మున్నగుశబ్దములకుఁ దెలుఁగున సమాసముండునని 'నీ,నా, తా, మన- అనుశబ్దములకంటెఁ బరముగా నున్నశబ్దములతో సమాసము వచ్చుటయు సాధువే.' అపుడు యుష్మదస్మదాదుల షష్ఠికి ద్వితీయాతుల్యాకారము గలుగదు - సమాససామాన్యముచొప్పున సమాసము గల్గెడి పద్ధతిలో'మాయొక్క, తమయొక్క' మున్నగుచోట్ల-తాయాన-అనురీతి ననిష్టరూపములు కల్గవలసివచ్చును. ఈయథర్వణవిధిచొప్పున నీయాన- నీయాజ్ఞ మున్నగురూపములు సిద్ధించి సమాసము లగుచున్నవని తెలియవలయును. 'నీయొక్క+ఆన=నీయాన' మొ.

120 సూ. 4 :- ద్విత్ర్యాదిసంఖ్యాశబ్దానా మల్పానాం నాత్ర సంస్థితిః. సప్రత్యయత్వే మహితా స్తచైకో వనవ న్మతః-ఇతి పఏవ. 'ద్వయము, త్రయము' ఇత్యాద్యాః ప్రయోగార్హాః. అల్పానా మిత్యుక్తేః వింశత్యాదీనాం ప్రయోగోఽస్త్యేవ. సంఖ్యావాచక స్యైకశబ్దస్య 'ఏకము' ఇత్యేవ రూపమ్. 'మన మిద్దఱ మేకమై' ఇతి ప్రయోగః. అనేకశబ్దస్య తు 'అనేకు' లితి ప్రయోగోఽస్త్యేవ.

వి:- అల్పసంఖ్యను బోధించు 'ద్వి త్రి' మున్నగు శబ్దములకుఁ దత్సమరూపస్థితి లేదు. 'క' ప్రత్యయముతోఁ గూడినపు డవి తెనుఁగు నందుఁ బ్రయుక్తములై సాధువు లగుచున్నవి. ద్వికము - త్రికము మున్నగునవి తదుదాహృతులు. 'అల్పసంఖ్యాబోధకమైనను నేకశబ్దము మాత్రము 'వన' శబ్దమువలె ముపర్ణకాంతరూపము నంది తెలుఁగున వనము-అని ప్రయుక్త మగుచుండును' అను నథర్వణవచనము చొప్పున 'ద్వయము - త్రయము - అనేకులు - ఏకము' మున్నగునవి సిద్ధించు చున్నవి.

120 సూ. 5 :- దీర్ఘాణాం హ్రస్వ స్స్యాదితి సూత్రస్య దీర్ఘమాత్రసాధారణ్యేన ప్రవృత్తత్వాత్; తేన హ్రస్వే కృతే 'సోమపుఁడు, విశ్వపుఁడు'-ఇత్యాద్యాకారాన్త రూప ముస్నేయ మకారాన్తరూపవత్.

వి:- అకారాంతమహద్వాచకములప్రక్రియను ముగించుచు 'ఆ' కారాంతపుంలింగ మహద్వాచకములను వ్యాఖ్యాత చెప్పుచున్నాఁడు. సోమం పిబతి (సోమమును ద్రాగుచున్నాఁడు.) అనువ్యుత్పత్తిచొప్పున 'సోమపాః' అనియు, విశ్వం పాతి (విశ్వమును రక్షించుచున్నాఁడు) అను వ్యుత్పత్తిచొప్పున 'విశ్వపాః' అనియు నీమున్నగు రూపములు సంస్కృతమున నేర్పడుచున్నవి. వీనిలో 'సోమపా' - 'విశ్వపా' - అనునవి తెనుఁగునఁ బ్రాతిపదికము లగును. 'దీర్ఘాణాం హ్రస్వ స్స్యాత్ - అను చొప్పున హ్రస్వముచేయఁగా 'సోమప - విశ్వప - అనియై, ఉత్వాఖ్యజ్ఞులతో 'సోమపుఁడు, విశ్వపుఁడు' అను రూపములు సిద్ధించును.

**121 సూ - స్యా దమహతాం విభక్తౌ సోఽశ్చ ము.**

అమహద్భ్యో నామభ్యో మువర్ణః స్యాద్విభక్తౌ. సోఽశ్చ సుప్రత్యయస్థానేఽపి స్యాత్. అమహతామితి సామాన్యనిర్దేశేఽపి న స్త్రీవాచకా దమహద్వాన్నామ్నోఽయం ప్రత్యయః 'అనుతాం స్త్రియాం సమానా'మితి సూత్రేణ సో ర్లోపే తత్ స్థానికమువర్ణ సమ్బన్ధవిశిష్టస్య మో ర్దూరాపాస్తత్వా త్తతోఽయం తద్వ్యతిరిక్తేభ్య ఏవ నామభ్య ఇతి నిర్ణయః. తత్ప్రయోగోఽపి సర్వత్ర తథావిధ ఏవ. అథర్వణేన తు-

“ము ర్వనాదికశబ్దేభ్యో ముబూ స్యాతాంచ తత్పరమ్” ఇతి స్పష్ట ముక్తమ్. 'వనము, ధనము, జ్ఞానము, పర్వతము.' పశుశబ్దస్యోపలక్షణత్వాత్ 'కాకము, గృధ్రము' ఇత్యాదిరూపం సిద్ధమ్.

**వి:-** స్యాత్, అమహతామ్, విభక్తౌ, సోః, చ, ము-అని ఛేదము. మహద్వాచకాకారాంతశబ్దముల కుత్వాదుజ్జులు వచ్చినట్లే, అకారాంతామహద్వాచకశబ్దములకుఁ బరమై 'సు' ప్రత్యయ మున్నపుడు దానికి 'ము'అనునది యాదేశముగా వచ్చుచున్నది. విభక్తిపరకత్వమున 'ము' అనునది యాగమముగా వచ్చును.'అమహతా' మ్మనుటచే స్త్రీవాచకములకీప్రత్యయము వచ్చునని భావింపరాదు. స్త్రీవాచకములపై నున్న సుప్రత్యయము - అనుతాం స్త్రియామ్ - అనుదానిచే లోపించుచున్నది గదా! “వన, ధన, మిత్ర, దైన మున్నగుశబ్దములకంటెఁ బరముగా నున్న సుప్రత్యయమునకు 'ము' వర్ణక మాదేశమగును. ము ప్రత్యయేతరవిభక్తులు పరమగునపుడు ము వర్ణ మాగమముగ వచ్చును. చింతామణి యందుఁ జెప్పఁబడినరీతిని 'ము - మ్ము-ంబు' అనునవియు వనాది శబ్దములకు వచ్చును. దానికిఁ బరముగా 'ము-బు' అనునవి నిలుచును” అను నథర్వణవచనముచే సిద్ధించిన 'వనము, వనమ్ము, వనంబు'-అనువానిలో 'ము'అనునది పరమగునపుడు పూర్వమందున్న 'ము' వర్ణకమునకు మేళనమును, బువర్ణకము పరమగునపుడు 'ము' వర్ణమునకు బిందువును గల్గి సిద్ధించుచున్నవి. 'స్త్రీపశుజడాన్ వినాఽన్యే' అను సూత్రమునందలి పశుశబ్దముచేతఁ జతుష్పాజ్జంతువులే కాక, కాకము గృధ్రము మొద

లగుపక్షివాచకశబ్దములును గ్రహింపఁబడును. కాన వానికిని 'ము' వర్ణకాదులు గలుగుచున్నవి.

122 సూ :— తదుపరి పున ర్మబూ ప్రాచామ్.

122 తూ. 1 :- తదుపరి ముపర్ణకస్యోపరి పునః ముశ్చ బుశ్చ స్యాతామ్, ప్రాచామాచార్యాణాం మతే ముబువర్ణకాభ్యాం రూపద్వయం సిద్ధ్యతి యోగపద్యవిధానాభావాత్. తదభావశ్చ తదుపరీత్యనేన జ్ఞాప్యతే. తస్యా వ్యవ్యవహితత్వేన పరత్వ మర్థః. యోగపద్యవిధానాభావేఽ న్యతరవ్యవహితత్వేన, అన్యతరస్య తత్పరత్వం న సిద్ధ్యేత్, భిన్నప్రయోగే న తు తాదృక్పరత్వం సిద్ధ్యతి. అతఏ వాథర్వణాచార్యేణ "బాపరే మస్య బిన్దు స్స్యా న్మాపరే మేళనం భవేత్" ఇత్యుక్తమ్. వనము; ఉపరి ముపర్ణకప్రయోగే బిన్దుమేళనవిధానసామర్థ్యా దుల్లోపే 'వనమ్మ', బువర్ణకప్రయోగే ఉల్లోపే 'నశ్చాపదా న్తస్య ఝలి' ఇత్యనుస్వారేచ కృతే 'వనంబు' ఇతి రూపత్రయం సిద్ధ్యతి. అత్ర ముబ్వో శ్చోత్వవిశిష్టత్వే తయోః పరతః మోర్లోపే చ 'సలోలోశ్చేతి' శబ్దశాసనసూత్రం తత్ప్రబన్ధ శ్చాత్ర మానమ్. అతఏవ డుజో నోల్లోపః. ఏవం వర్ణాన్తరేఽ ప్యూహ్యమ్.

వి :— వనాదిశబ్దములకు స్వాదులు పరమగునపుడు ముపర్ణకము నిత్యముగా నాగమ మగును. సుప్రత్యయస్థానమున ము - బు వర్ణకములు పర్యాయముగా నాదేశము లగును. 'ము' వర్ణకము పరమగునపుడు - అథర్వణాచార్యులుగారు, "పూర్వ ముపర్ణకమునందలియుకారము లోపించి 'వనమ్ము' - అని యొకరూపమును, ఉత్వలోపము చెందిన 'మ' కారమునకు బిందువు గల్గి బువర్ణాంతముతోఁ గూడిన 'వనంబు' అని మఱియొకరూపమును నివి రెండును రానిపక్షమున 'వనము' - అని యింకొకరూపమును గల్గుచున్నవి" అనిచెప్పిరి. కవిశిరోభూషణము మకారమునకు 'నస్యాపదాన్తస్య ఝలి' నస్య మస్యచాపదాన్తస్య ఝల్యనుస్వార స్స్యాత్ -అను సంస్కృతవ్యాకరణసూత్రముచే బిందువు గల్గునని చెప్పుచున్నది. చింతామణివివరణకర్తయగునథర్వణాచార్యులుగారు బిందువును విధించియుండుటచే నట్లు వ్యాఖ్యానించుట సరిగాదని తోఁచుచున్నది. 'వనము+ము, వనము+బు

అని యుండఁగా 'ఋవర్ణకము పరమగునపుడు మకారమునకు బిందువు గల్గును. మువర్ణకము పరమగునపుడు మకారముపై నున్న స్వరము లోపించి రెండుమకారములకును మేళనము గల్గు'నని చెప్పిన ద్వితీయాచార్యునివచనముచే మొదటనున్న మకారముమీఁది యుకారము లోపించుచున్నది. కావునఁ గవిశిరోభూషణము 'అత్ర ముబ్వో శ్చోత్త్వే విశిష్టత్వే తయోః పరతో మో ర్లోపేచ సలోలోశ్చేతి శబ్దశాసనస్య సూత్రం తత్ప్రబన్ధ శ్చాత్ర మానమ్' అని వ్రాయుట సరికాదు. 'సలో లోశ్చ' అనుసూత్రము లకారయుక్తమైన లకారముమీఁది యుకారమునకు లకారమునకు లోపమును జెప్పుచున్నది. దానిచే నిచట 'మ' కారముమీఁది యుకార మెట్లు లోపించును ? నన్నపార్యుని ప్రబంధమునం దట్టిరూపములు వెలయుచుండుటచేతనే యథర్వణాచార్యులు గారు 'బౌ పరే మస్య బిందు స్స్యా' త్తని వివరింపవలసి వచ్చినది గదా !

122 సూ. 2 :- అత్రేయం చిన్తా. 'నపదా--' త్యత్ర అవ్యయాత్ పృథక్ క్త్వాతుమునో ర్గ్రహణాత్ అవ్యయస్య నిషేధోఽనిత్య ఇతి జ్ఞాయతే; అతఏ వాచార్య ప్రయోగః "చెడునిహాముం బరంబు". అధికరణశక్తిప్రధానస్యా ప్యస్య ప్రత్యయ సమ్బన్ధేశక్తిమత్త్వమాత్ర మేవ ప్రాతఃకల్ప మిత్యాదౌ యథా. 'ఈక్రతుక్రియఁజేసి యిహ పరంబులన్'- ఇత్యస్య ప్రయోగే ద్వన్ద్వసమాసేఽపి సాధికరణప్రాధాన్యమ్. అథర్వణో నాప్యుక్తమ్-"క్వచిత్ ప్రత్యయసమ్బన్ధే శక్తే స్స్యా దన్యథా స్థితిః" ఇతి.

వి:- 'న పదా న్యవ్యయసు ప్తిజ్ క్త్వాతుమునామ్' అనుసూత్రమునకు 'సంస్కృతావ్యయములకుఁ దెనుఁగునం దవ్యయములుగాఁ దత్సమత్వమునఁ బ్రయోగము లే'దని యర్థము. కావునఁ బ్రత్యయసంబంధము గలిగి యున్నవిభక్తులలోను రూపములు గొన్నిసంస్కృతావ్యయముల కగపడుచున్నవి. ఇహ — పర—అనునవి ఇహము—పరము అని తెనుఁగునఁ దత్సమములై సుబంతము లగుచున్నవి. సంస్కృతమునందు వీనికి

ఈలోకమునందు-పరలోకమునందు అని యర్థములు. కావుననే యవి యధికరణశక్తిప్రధానములైన యవ్యయములని చెప్పఁబడినవి. అథర్వణాచార్యులుగారు 'ఒకప్పుడు 'ము' మున్నగుప్రత్యయసంబంధమందుఁ దదర్థశక్తికి మార్పునైతము గల్గు'నని వచించియున్నారు. 'సంస్కృతమునం దధికరణశక్తి గల్గినవేయైనను తెనుఁగునందవి శక్తిమాత్రములే యై సర్వవిభక్తుల నందుచున్నవి' యని యథర్వణాశయము.

122 సూ. 3 :- చిరముగ్రబహ్మ్ర, సంతతము, అవశ్యము, అనిశము - అత్ర 'అన్యేషాంచేతి మస్యలోపే సోర్స్థానే మువర్ణకే సిద్ధమేవం రూపమ్.

వి :- చిరమ్ - సంతతమ్ - అవశ్యమ్ - అనిశమ్ - అను వానిచివరనున్న మకారము, 'అన్యేషాంచ ప్రయోగమహితానామ్' - అను చింతామణిచొప్పున లోపింపఁగా 'సు' ప్రత్యయస్థానమున ముప్రత్యయము చేయఁగా నిట్టిరీతిరూపములు సిద్ధించెను.

122 సూ. 4 :- స్వస్తి యొనర్పఁగ నవసరము, నాయథాశక్తి, సోర్లు గతః. వృథ సేయంగాఁజనదు. దీర్ఘాణాం హ్రస్వః. గంగఁ బ్రత్యక్షంబు గావించి. ప్రతిపరసమనుభ్యోఽక్ష్ణః ఇతిటచ్. 'యస్యేతిచ' ఇతీల్లోపే, 'నావ్యయీభావాదతోఽమ్త్వపంచమ్యాః' ఇత్యమి ప్రత్యక్షమితి రూపం సిద్ధమ్ ఆద్యప్రకృత్యామ్. అత్ర సోర్స్థానే మువర్ణకే, తదుపరిమువర్ణకే చ సిద్ధమేవం రూపమ్ 'చాపంబు లాకర్ణాంతంబు లగుచుండఁగా' ఇత్యాదయః. ఏతేన, ఆబాలగోపాల మఖిలపత్త్రజయము నానందమగు మన్కి నతిశయిల్లి, ఇత్యాదివచనాని వ్యాఖ్యాతాని. అవ్యయప్రయోగస్య జ్ఞాపకసిద్ధత్వాత్ క్వాచిత్కత్వైవ; 'జ్ఞాపకసిద్ధం న సర్వత్ర' ఇత్యుక్తేః. ఆచార్యప్రయోగపర్యాలోచనయా త్వయమర్థః ప్రతీయతే 'తత్సమవదనుకూలస్యైవాత్ర ప్రయోగస్తథాపి వికృతిశాస్త్రసమ్బద్ధ ఆవశ్యకః' ఇతి. ఏతేన 'అతఁడు పృథుక్కగాఁ బలికెన్' ఇత్యాదిప్రయోగా అపి తదభిప్రేతా ఇతి యద్యపి వక్తుం శక్యతే; తథాపి ప్రథమైకవచనతుల్యత్వాభావాన్నాత్ర తత్స్వారస్యం. రూపసాధుత్వమాథర్వణమితి జ్ఞేయమ్. ఏవంచ 'వృథాశపింతురే'; 'సదానానన్' - 'సర్వత్రనిలింపకామినులు'; 'కర్తృమకర్తృమన్యథాకర్తృ మూదారశక్తివి' ఇత్యాదిప్రయోగా న శబ్దశాసనాభిమతా ఏవేతి. 'ప్రతిమాటలేటికిఁబలుకవయ్య' ఇతి తత్ప్రయోగే ప్రతిశబ్దో దేశ్యః; ప్రతీత్యవ్యయే నాత్ర సమాసాసంభవాత్. ఆద్య

ప్రకృత్యామపి తస్య ద్యోతకమాత్రత్వేన పృథక్ప్రయోగానర్హత్వాచ్చ. సంస్కృతీయ సమాసానాం ప్రాకృతీయసమాసానాం 'అహా॰, అహో' ఇత్యాదీనాం ప్రయోగస్తు నిర్బాధ ఏవ. 'నీకచెల్లెఁగాక నేఁడహో పతిహితావహావిహారగంధవహాకుమార' ఇత్యాద్యాః ప్రయోగాస్సాధవ ఏవ.

"లిఙ్గభృఙ్గాదిశబ్దేభ్యో మ్వాదిరామన్త్రణే తు న
కేచిజ్జనా వదన్త్యన్య ఏవారసహి తేఽబ్రువన్"

ఇత్యథర్వణోఽపి. ఏతేన, 'సరసీజాసనవాహానాన్వయవతంసా హంస నీకందముల్' ఇత్యాదిప్రయోగస్తు సాధుః. నను 'అర్థేన నిత్యసమాసో విశేష్యలింగతా చ' ఇత్యుక్తేః, 'ఏను గుర్వర్థ మర్థినై'; 'దారార్థమ్ము ప్రవర్తింపన్' ఇత్యాద్యాచార్యప్రయోగాః కథం సఙ్గచ్ఛన్త ఇతిచేత్ క్రియావిశేషణతా మాశ్రిత్య తత్సాధుత్వ మవధేయమ్. తదర్థ మధ్యాహృత్య జనేన తద్వనే ఇత్యాదయ స్సంస్కృతకవీనాం వాచః. విశేష్యలింగతాయాం 'నీతదర్థంబులై నిఖిలవేదంబులు' ఇత్యాదికం తద్వచనమేవ.

వి:- చిరమ్, సంతతమ్, అవశ్యమ్, అనిశమ్-అనునవ్యయములు తత్సమము లెట్లగునో యీవఱకుఁ జూపఁబడినది. స్వస్తి-యథా శక్తి మున్నగుచోట్ల 'సోర్లుగితః' అని సులోపము చేసి స్వస్తి-స్వస్తులు; యథాశక్తి - యథాశక్తులు—మున్నగుసుబంతరూపములను సాధించుకొనవలయును. ప్రత్యక్షమ్ - అనునది 'ప్రత్యక్షము' అనురూపముతో 'ము' వర్ణాంతమై తెలుచుగాఁ గ్రియావిశేషణ మగుచున్నది. మఱి 'అకర్ణాంతము — అనునదియు మువర్ణాంతమే. ఇదియుఁ గ్రియావిశేషణముగనే తెలుచుగాఁ బ్రయోగింపఁబడుచున్నది. 'ఆబాలగోపాలము' అనునదియుఁ గ్రియావిశేషణమే. ఈయవ్యయప్రయోగము తెనుఁగునందు బాహాటముగనే యగపడుచున్నను నవదాన్యవ్యయసుప్తిజ్క్వాతు మునా మ్మనుసూత్రమున కర్థమును మఱియొకరీతిని జెప్పి యీయవ్యయములప్రయోగమునకు సంస్కృతవ్యాకరణపద్ధతి ననుసరించి జ్ఞాపకసిద్ధత్వమును గవిశిరోభూషణ మంగీకరించుట సమంజసముగా నగపడదు. తెనుఁగునం దీరూపములు మనకుఁ జింతామణ్యథర్వణకారికల చొప్పున

సిద్ధింపకున్నచో నవు డావద్ధతి నాశ్రయించుట కొంతయు క్షమముగా నుం డును. పై యవ్యయరూపము లన్నియుఁ జింతామణ్యాథర్వణకారికలచే సిద్ధించుచున్నవిగదా! 'అతఁడు పృథక్కుగాఁబలికె' ననునది నన్నయాథ ర్వణులకు సమ్మతమని కవిశిరోభూషణ మేయాధారముతోఁ జెప్పఁగల్గి నదో తెలియకున్నది. పృథా, సదా, సర్వత్ర, కర్తుమకర్తుమన్యథాకర్తుమ్ - మున్నగువాని ప్రయోగము శబ్దశాసనున కభిమతము గాదని చెప్పుట సమంజసమే కాని యవి మహాకవులచేఁ బ్రయోగింపఁబడియుంటుటచే వానినిసైతము సాధువులుగా నంగీకరించుట యుచితమే యగును. "లింగ, భృంగ' మున్నగుశబ్దములకంటెఁ బరముగా సంబోధనమునందు 'ము, మ్ము, ంబు' అనునవి నిలువవు. ముసర్ణకము లోపించి, అదాగ మము మాత్రమే నిల్చును. మహాద్వస్త్వారోపమునందుమాత్రమే యట్లగునని కొందఱు నుడువుచున్నారు" అనునథర్వణవచనముచే లింగమా, భృంగమా' అనురూపములు సమంజసములు గావని తెలియు చున్నది. 'లింగములార' యని యుండవచ్చును. 'హంస' శబ్దముగూడ నథర్వణగారికలోని యాదిశబ్దముచే సంగ్రహింపఁబడుటవలన సంబోధ నమునందు 'హంస' యనియే యున్నదిగాని 'హంసమా' యని యుండ లేదు. 'అర్థమ్' అను సంస్కృతశబ్దము తత్సమముగా 'సర్వార్థము, దారార్థమ్ము'మున్నగురీతిని దెనుఁగున నగపడుచున్నవి. సూరిగారీవిష యములను బాల. తత్సమ. 39 నుండి 43 సూత్రములచే విశేషముగా వివరించిరి.

**123 సూ :— సోర్లు గితః.**

ఇతః పరస్య సోర్లుక్ స్యాత్ -హరి, శౌరి ఇత్యాది.

వి :— సోః, లుక్, ఇతః - అని ఛేదము. హ్రస్వమగు ఇకార మంతమునఁ గలశబ్దమునకుఁ బరమగు ప్రథమైకవచనప్రత్యయమునకు లోపము గల్గునని సూత్రార్థము. 'హరి+సు; శౌరి+సు'అని యుండఁగా

సుప్రత్యయమునకు దీనిచే లోపము గల్గి 'హరి, శౌరి' యని ప్రథమైక వచనరూపము లేర్పడుచున్నవి.

'సూరిగారు, 'ఇగ్లౌ రాయుగంతంబుల ప్రథమైకవచనంబులకు లోపం బగు' నని (బాల. తత్స. 44) పై విషయమును వివరించిరి. ఇం దికారాంతశబ్దముచే నీకారాంతమును గ్రహింపఁబడును. కావున శ్రీ,ధీ, మున్నగుశబ్దములుగూడ నిట్లే సిద్ధించుచున్నవి.

**124 సూ :-** ఉద్ బహుత్వే.

ఇదన్తైకారస్య ఉత్ స్యాద్బహువచనే పరే. హరులు శౌరులు, ఇత్యాది.

వి :- ఉత్, బహుత్వే – అని ఛేదము.

బహువచనము పరమగునపుడు, ఇదంతేకారమున కాదేశముగా, ఉకారము వచ్చునని సూత్రార్థము. హరి+జస్, శౌరి+జస్, అగునపుడు 'లు జసః' అని జస్సునకు 'లు' ఆదేశమై హరి+లు; శౌరి+లు, అని యుండఁగా, దీనిచే ఇకారమున కుకారము కలిగి 'హరులు' శౌరులు - అనురూపములు సిద్ధించును.

సూరిగారీవిషయము నీక్రిందరీతిని 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' (బాల. తత్స. 45) అను సూత్రముచే వివరించినారు.

**125 సూ :-** సంబుద్ధౌ నాత్.

**125 సూ. 1 :-** ఇదన్తస్య అదాగమో న స్యాత్ సంబుద్ధౌ. ఓహరి ఇత్యాది. అత్రేద మవధేయమ్. ఆమన్త్రణసుజసోరితి సూత్రేణ సుజసో రన్తఏవ తద్విధానా దత్ర తు సో ర్లుకి కథ మదాగమప్రాప్తిః? అప్రాప్తౌ సంబుద్ధౌ నాదితి నిషేధః కథం సఙ్గచ్ఛతే? నచాప్రాప్తే నిషేధః క్వచిదపి దృశ్యతే. తస్మాదనేన నిషేధే నాయ మర్థో జ్ఞాప్యతే. యత్ర సో శ్శ్రవణం నాస్తి తత్రాదాగమః ప్రాతిపదికస్యైవేతి. డుజతావిత్యత్ర చాద్గ్రహణం చాత్ర మానమ్. తేన ఓకాంతేత్యాది నిర్బాధమ్.

వి:- సంబుద్ధౌ, న, అత్ -అని ఛేదము ఇకారాంతశబ్దమునకుఁ బ్రథమైకవచనమున సులోపము గల్గును. బహువచనమునందు ఇకారమున కుకారము వచ్చును. సంబోధనమునందు రావలసిన అదాగమ మిచట రాదు. కవిశిరోభూషణ మీసందర్భమున, "ఆసు స్త్రీణసుజసోః- అనుసూత్రముచే సుజస్సులయంతమునసే అదారదాగమములు విధింపఁబడినవి; 'హరి శౌరి' యనునపుడు సులోపము గల్గినది గదా; అచట నదాగమ మెట్లు ప్రాప్తించును? అదాగమమునకుఁ బ్రాప్తియే లేనపుడీవిషేధమునకుఁ బ్రయోజనము లేనందున వ్యర్థమై సుప్రత్యయశ్రవణము లేనిచోట నదాగమము ప్రాతిపదికము చివరకే కల్గు" నను నర్థము జ్ఞాపిత మైనదని చెప్పినది. నిజమునకు సులోపము గల్గినపిమ్మట సుబన్తమగును గాని ప్రాతిపదికము గాఁజాలదు. సుప్రత్యయము లోపించినదిగానఁ దత్పదాంతమునకు అదాగమము వచ్చుట కాటంక మేమి? కాన నీయర్థకల్పనము నిరర్థకమని తోఁచుచున్నది.

125 సూ. 2 :- రామేత్యాదౌ మతాంతరే అనుక్తన్యాయేన 'ఏఙ్ హ్రస్వాత్సంబుద్ధేః' ఇతి సూత్రేణ సులోప ఇతి నకశ్చిత్కళఙ్కః. ఇదన్తస్య సమ్బోధనే దీర్ఘవికల్పోఽప్యాచార్యసమ్మత ఏవ. 'ననుం గృపఁజూడు భారతీ' ఇత్యాద్యుక్తేః

వి:- తా నీవఱకుఁ జేసినచర్చప్రకారముగాఁ గవిశిరోభూషణము రామ అనునపుడు సుప్రత్యయశ్రవణము లేదుగాన నచట నదాగమము రాకపోవునని, అదాగమము చేసిన పిమ్మటనే సుప్రత్యయమునకు **ఏఙ్** హ్రస్వాత్సంబుద్ధేః అనుపాణినీయసూత్రముచే సులోపము గల్గునని చెప్పుట కీవిషయ మారంభించినది. సులోపము గల్గినపిమ్మటఁగూడ నదాగమము రావచ్చునని యీవఱకుఁ జెప్పఁబడినదిగాన నీచర్చ యనవసరము. ఇకారాంతములకు సంబోధనమున దీర్ఘము వికల్పముగా నగును' - అని నన్నయగారి ప్రయోగానుసారముగా నథర్వణాచార్యులుగారు వివరించియున్నారు. ఆవిషయ మీవఱకు (100. సూ. 1 లో) వివరింపఁబడినది.

**125** సూ. 3 :- యద్వా ఆమన్త్రణసూత్రే ఆ-అత్ ఇతి ఛిత్వా సవర్ణదీర్ఘే ణాకారస్యాపి ప్రశ్లేషః. ద్వివచనాభవ స్సూత్రః. అదారదాగమావిత్యత్రాకారాఽకారయో స్సవర్ణదీర్ఘే పునస్సవర్ణదీర్ఘః. ఏవఞ్చ ఆకారాన్త-ఆకారాన్తశ్చ అదారదాగమౌ భవత ఇత్యర్థః. తథాచసతి సంబుద్ధౌ నాదిత్యత్ర, అకారాఽకారయో ర్నిషేధే ఇత్వ మీత్వంచ తత్రేష్టమిత్యర్థః ఫలతి. దుజతా విత్యత్ర అత్వమాత్రస్యా ప్యుపలక్షణమితి విదాంకుర్వన్తు. నమరామేత్యాదౌ అదాగమేన కింప్రయోజనమ్; సంస్కృతత్వేనైవ తస్య రూపస్య సిద్ధత్వాదితిచే న్న; న పదానీతి నిషేధఏవ తద్విధానప్రయోజనసంపాదక మిత్యవధేయమ్.

వి:- నన్నపార్యుఁడు 'భావభవనిభసుభగా'; 'ననుం గృపఁజూడు భారతీ' అని సంబోధనమునందు, అకారాంతేకారాంతశబ్దముల కేకవచనమున దీర్ఘమును నిర్దేశించియున్నాఁడు. దానినిఁ బురస్కరించుకొని యథర్వణాచార్యులుగారు, "సంబోధనే వా దీర్ఘ స్స్యాత్ ప్రయోగస్య తథాగతేః। భవే దత్రాదితామేవ దీర్ఘత్వం వికృతే శ్చచేః" (100. సూ1.) అని అకారేకారములకు దీర్ఘమును విధించియున్నారు. చింతామణ్యథర్వణకారికలసంబంధమును గుర్తింపనందునఁ గవిశిరోభూషణ మీవిషయములోఁ జింతామణిచేతనే యీదీర్ఘములను సంపాదించుటకుఁ బెక్కురీతులఁ బొల్లుపడినది. 'యద్వా' మొదలగుగ్రంథమును నట్టిదే.

ఆమంత్రణసూత్రమునందు, 'అదారదాగమౌ' అనునపుడు, 'అ-ఆత్' అని పదచ్ఛేదము చేసి రెండుమార్లు సవర్ణదీర్ఘముచేసి అకారాకారములను సంపాదింపవలెననియు నాకారణముచే సంబుద్ధౌ నాత్-అనునపుడుగూడ అకారాఽకారములకు నిషేధము దగులుననియుఁ గావున ఇత్వ-ఈత్వములు రెండును నిల్చుననియు, దానివలన 'ననుం గృపఁజూడు భారతీ' మున్నగుచోట్ల నీకారము సంబుద్ధియందు నిలుచుచున్నదనియు వివరించినది. 'రామ' మున్నగువానియందు అదాగమము చేయ నక్కరలేదనియు 'ఓరామ' అనునపుడు హ్రస్వము సంస్కృతమున

'హేరామ' అనునట్లు సంస్కృతవ్యాకరణముచేతనే సిద్ధించుచుండఁగా మఱి యీసూత్రమునకుఁ బ్రయోజనమేమనియు శంకించి వారింపఁబడినది. 'న పదాన్త్వవ్యయసు ప్తిజ్క్వాతుమునా' మ్మను సూత్రముచే సంస్కృత సుబంతిములు తెనుఁగునందుఁ బ్రయోగింపఁబడవని చెప్పఁబడుటచే నట్టి శంక కవకాశము లేదని వివరింపఁబడినది. ఈశంకాసమాధానములన్నియు నథర్వణవచనములచే గతార్థములు గావున నీచర్చ గ్రంథవిస్తరమే యని భావింపక తప్పదు.

**126 సూ :- ఇతాం జసః కి స్స్యాత్.**

126 సూ 1 :- ఇతఃపరస్య జసఃస్థానే కి స్స్యాత్. 'హరికిన్, గిరికిన్, శౌరికిన్' ఇత్యాది.

వి:- ఇతామ్, జసః, కిః, స్యాత్-అని ఛేదము. ఇదంతముల షష్ఠికి 'కి' అను ప్రత్యయము వచ్చునని సూత్రార్థము. 'హరికిన్' మున్నగునవి యుదాహరణములు. తక్కిన విభక్తికార్యములలో విశేషము లేనందున నవి యిటఁ బ్రస్తావింపఁబడలేదు. కువర్ణకము అదంతోదంతఋదంతములకును, ఇదంతములకు 'కి' వర్ణకమును వచ్చునని చెప్పుటకీసూత్ర మారంభింపఁబడినది. చింతామణి ప్రక్రియలో 'కి-కు' అనియు, 'ని-ను' అనియుఁ బ్రత్యయములు రెండేసి పేర్కొనఁబడుటచే నిట్లు చెప్పవలసివచ్చినది. సూరిగారు 'ను-కు' అనుప్రత్యయములను మాత్రమే చెప్పి, వానికి 'ని-కి' అనురూపములు వచ్చునట్లు కార్యములను విధించియున్నారు.

126 సూ 2 :- నిర్ధారణార్థే లోపలషష్ఠీ విహితా. శేషార్థే యొక్కటి విహితా. జసః కు రనితామి తి కారా న్తపర్యుదాసపూర్వక మన్యేషాం కుర్విహిత ఇతి పరిశేషా దిదన్తాత్ కి స్సిద్ధ ఏవే త్యేకాక్షరా దీదన్తా త్కివిధానార్థ మిదం సూత్రమ్.

వి:- 'లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ' - అని నిర్ధారణార్థమున 'లోపల' వర్ణకము విధింపఁబడినది. 'యొక్క చ శేషే షష్ఠీ' అని

శేషార్థమున యొక్క-ప్రత్యయము విధింపఁబడినది. ఇంక షష్ఠీవిభక్తి ప్రత్యయములలో 'కి-కు' అనునవి మిగిలినవి. 'జసః కు రనితాఽమ్మను' సూత్రమునం దికారాంతములను బర్యుదాసము చేయుటచేఁ బరిశేష న్యాయమున నిదంతములకు 'కి' వర్ణకము వచ్చుననునర్థము సిద్ధించుచునే యున్నది. కాఁబట్టి యేకాక్షరకేకారాంతములకంటె 'కి' అను దానిని విధించుట కీసూత్రము రచింపఁబడినట్లు తోఁచుచున్నది. శ్రీ-ధీ-మున్నగుశబ్దములకు హ్రస్వము రాదుగాన షష్ఠీవిభక్తియందు 'కు' ప్రత్యయము వీనికి రాకపోవలసియుండఁగా 'ఇతాం జసః కి స్స్యాత్' అని మరల దానికి 'కి' వర్ణకమును విధించుచున్నదని తెలియవలెను.

126 సూ 3 :- 'సఖుఁడు సంబంధి శిష్యుఁడు సవ్యసాచి' ఇతి భీష్మపర్వవచనే సఖియు ఇత్యేవ పాఠః సాధుః, అసమాసే అకారాన్తత్వాభావాత్. సమాసేతు 'మత్సఖుఁడు' ఇత్యేవ రూపమ్. 'రాజాహస్సఖిభ్యష్టచ్' ఇతి సమాసాన్తవిధానాత్. 'సహ ఖేన వర్తతే' ఇతి సఖః ఇత్యాది వ్యుత్పత్త్యా వా అకారాన్తత్వా న్నిర్వాహః.

వి:- 'సఖుఁడు' అనురూపము 'సఖి' శబ్దమున కసమాసమున నుండరాదు. భీష్మపర్వమునందు 'సఖుఁడుసంబంధిశిష్యుఁడు' అనివ్రాయఁబడినది. ఇట 'సఖియు సంబంధి శిష్యుఁ'డని పఠించుట సాధువనియు నసమాసమునందు టచ్చు రాదుగాన 'సఖుఁడు' అనురూపము సాధువుగాదనియుఁ బైగ్రంథమునకుఁ దాత్పర్యము. సమాసమున 'మత్సఖుఁ' డని యుండనగును. 'సహ ఖేన వర్తతే' యను వ్యుత్పత్తిచొప్పున నసమాసమునను అకారాంతసఖశబ్దము గలుగవచ్చును. దానిపై సఖుఁడనురూపము సాధు వగును.

**127 సూ :- టాదా వితో న ని స్స్యాత్.**

127 సూ 1 :- ఇదన్తా న్నివర్ణకో న స్స్యా ట్టాదివిభక్తౌ. 'మహాతో నిలా' వితి ప్రాప్తే నిషేధోఽయమ్. 'హరిచేతన్, శౌరిచేతన్' ఇత్యాది. శేషం సర్వం సమానమ్.

వి:- టాదౌ, ఇతః, న, నిః, స్యాత్-అని ఛేదము. ఇకారాంతమునకు టాదివిభక్తి పరమగునపుడు 'మహాతో నిలౌ' అను సూత్రముచేఁ

ప్రాప్తించుచున్న నిగాగమము దీనిచే నిషేధింపఁబడుచున్నది. కావున 'హరినిచేతన్' మున్నగునవిష్టరూపములు వారింపఁబడినవి. 'హరిచేతన్' అనురీతి రూపము లుండును.

127 సూ 2 :– 'హరియు, గిరియు, హరియును, గిరియును, ఇతిరూప మాచార్యస్యాపి సమ్మతమేవ. ఇవియేనున్ సతతంబు నామది గరం బిష్టంబులై యుండుఁ బాయవు భూదేవకులాభితర్పణమహీయఃప్రీతియున్ భారతశ్రవణాసక్తియు' నిత్యాది తత్ప్రయోగాత్. అథర్వణేన తూక్తమేవ—

"ఉవర్ణక శ్చాద్యన్తాత్తు నువర్ణక ఉతో భవేత్
ద్యోతకా వర్థభేదస్య చాన్యత్రాపి క్వచిద్భవేత్
ఉనూ నుస్యేవ నియతౌ వయుతౌ వచి సంయుతౌ"-ఇతి

అయుతౌ విభక్త్యన్తరే పరతో న సంభవత ఇత్యర్థః. అచి తూభావపి సంయుతౌ. అన్యత్ర తు సంయుతత్వ మసంయుతత్వ మపీత్యర్థః ఆచార్యస్యా ప్యర్థవిశేషే తత్ప్రయోగ ఇష్టఏవేతి స్పష్టమే వోక్తవచనాత్. అన్యత్రాపి తత్ప్రయోగః క్వచిదిష్టఏవ. 'తద్దయు కేడ్కన్', 'కేడ్కచేనెంతయున్', 'పెద్దకాల మునికి తద్ద తగదు'; 'తద్ద కేడ్కన్' ఇత్యాదౌ తదన్వయవ్యతిరేకయో ర్దర్శనాత్. ఉకారాంతా ద్విహితస్య కేవలనువర్ణకస్య తు ప్రయోగః శబ్దశాసనగ్రంథే నార్థవిశేషద్యోతకాభావే శ్రూయతే. తథా ప్యథర్వణవచనానుసారేణ 'చంద్రుపాదుపున్ నీరాకరంబుం బకెన్'- ఇత్యాదిప్రయోగ స్సజ్జచ్ఛతఏవ. తల్లిందండ్రియు నన్నుఁ గానక' ఇత్యాదిప్రయోగ స్త్వనాకరత్వా దుపేక్ష్యఏవ.

వి:– 'యువర్ణకస్యా' త్తనుకారిక సరికాదు. "ఉవర్ణక శ్చాద్యన్తాత్తు నువర్ణక ఉతో భవేత్" అని పఠింపనగును. అకారాద్యంత శబ్దములకుఁ బైన సముచ్చయార్థవిశేషబోధకముగా 'ఉ' అను ('యు' కాదు) హ్రస్వోకారము నిలుచును. ఉకారాంతశబ్దములపైని 'ను'అను శబ్దము నిల్చును. ఇవి రెండును ద్రుతప్రకృతికములగుటచే వీనిరూపములు 'ఉన్' 'నున్' అనురీతి నుండునని తెలియుచున్నది. సముచ్చయాద్యర్థవిశేషముల నివి తెలుపును. ఒకప్పు డర్థవిశేషద్యోతకత్వము లేనపుడును 'ఉన్,నున్' శబ్దములలో నేదేనిఁ బ్రయుక్తము కావచ్చును.

అపుడు దానిని బాదపూరణార్థకమని భావింపనగును. 'ఉన్-నున్' శబ్దములు సుబ్విభక్తులమీఁదమాత్రమే ప్రచురప్రయోగము గలవయియున్నవి. 'ఉనూ సుస్యేవ నియతౌ' అనుచోట 'ఉనూ సుప్యేవ నియతౌ - అని పఠించుట లెస్స. ఇట్లనుటచేతఁ దిజ్విభక్తిప్రభృతుల మీఁదఁగూడ నివి యరుదుగా నిలువవచ్చునని తెలియుచున్నది. ఉన్-నున్ శబ్దములు తమలోఁదాము గూడియుఁ గూడకయు రెండును సముచ్చయార్థవిశేషబోధకత యావశ్యకమై యున్నపుడు ప్రయోగింపఁబడుటయుఁ బ్రయోగింపఁబడకుండుటయుఁ గలదని, 'అయుతౌ' అను దానివలనఁ దెలియుచున్నది. 'తల్లిందండ్రియు నన్నుఁ గానక' అనునది యసాధువు కాదని చెప్పుటకు యువర్ణాంతరూపము లేకుండుటయే యని తేలుచున్నది. తల్లి, తండ్రి అనుశబ్దములు ఇకారాంతములగుటచే వీనిపైని 'ఉన్' అనునది చేరి 'తల్లి+ఉన్=తల్లియున్; తండ్రి+ఉన్=తండ్రియున్ అని యగును. ఈ 'ఉ'వర్ణకమునకు లోపము శాస్త్రసిద్ధముగా లేదుగాన నీప్రయోగ మసాధువని చెప్పఁబడినది కాని యాకారికయందలి 'చ, తు' అనుశబ్దములవలన 'ఉ, ను' అనునవి లోపింపవచ్చునని వ్యాఖ్యానింపనగును. అప్పుడు 'తల్లిన్' అనునదియు; 'మిక్కిలిన్' అనునదియు సాధువులే యగును. 'రాకన్ మానవు' మున్నగునవి క్రియోదాహరణములు.

ఈవిషయమును బ్రౌఢవ్యాకర్త 'నామసర్వనామంబులకును గళలగునవ్యయంబులకును గడపల సముచ్చయార్థవిశేష పాదపూరణములయందు 'ను' శబ్దంబు తఱచుగా నగు. కళలగు ననుదంతశబ్దములమీఁద నయ్యది యువర్ణపూర్వకంబు విభాషనగు. మఱియు శేషషష్ఠియందు యొక్క- లోపించునపుడు లాగమాంతబహువచనంబుమీఁదను సముచ్చయార్థమునం జూపట్టెడి' నని వివరించెను.

**128 సూ. :- ఈదన్తౌ ఇద్వదేవ కృతహ్రస్వౌ.**

128 సూ:- ఈకారాన్తౌ కృతహ్రస్వౌస్తు ఇకారాన్తకార్యం సర్వం ప్రాప్ను

వక్తవ్యమేత్యర్థః. దేవతాగ్రామణీ, వాతప్రమీః, గ్రామణులు - ఇత్యాదయః ఈదన్తా ఇత్యత్ర ఈకారమాత్రస్య గ్రహణేన 'కరికిన్ - కృతికిన్' ఇత్యాదిరూపం నిర్బాధమ్.

వి:- ఈదన్తాః, ఇద్వత్, ఏవ, కృతహ్రస్వాః - అని ఛేదము. 'కరిన్ - కృతిన్ అనుశబ్దములు నకారాంతములైనను వీనిప్రథమైకవచన రూపములు 'కరీ - కృతీ' అని ఈకారాంతములైయుండును. ఈద న్తాః అనునపుడు సంస్కృతమున నీకారాంతశబ్దములే కా నక్కఱలే దనియుఁ దెలుఁగు ప్రాతిపదిక మీకారాంతమైనను దానికిహ్రస్వము గల్గి ఇకారాంతములకు వచ్చు కార్యముల నన్నింటిని బొందుననియుఁ దెలియ వలయును.

129 సూ:- వికృతౌ క్వచిచ్చ లోపో మో ర్దీర్ఘశ్చాత ఆదిమస్య భవేత్.

129 సూ. 1:- వైకృతపదస్య యో ముః తస్య లోప స్స్యా త్తదాదిమస్య దీర్ఘ స్స్యా ల్లాదౌ బహువచనే క్వచిదేవ. ఆద్యశ్చకారోఽవధారణే-జోంపములు, జోం పాలు, జంపములు, జంపాలు ఇత్యాది. అత్ర వికృతా విత్యనేన సంస్కృతసమ పర్యు దాసః క్రియతే. తత్రాపి లులయోః పరయోరేవాయం విధిః ప్రవర్తతే. యద్యేకవచ నేఽపి స్యా త్తర్హి 'జోంపాచేతన్' ఇత్యాదిరూప మనిష్టం సిద్ధ్యేత్. ఏవంసతి 'సంస్కృతంబు కృతులఁ దత్సమము చేయునపుడు ముత్వమైన దీర్ఘమైనఁ జెల్లున్' - ఇత్యాద్యాధునికానాం లక్షణ మతీవ దూషణగ్రస్తమితి స్పష్టమేవ.

వి:- వికృతౌ, క్వచిత్, చ, లోపః, మోః, దీర్ఘః, చ, అతః, ఆదిమస్య, భవేత్ - అని ఛేదము. ఇందలివికృతి శబ్దముచేత నీకా ర్యము తత్సమములకు రాదనియే యర్థము చేయవలెను. ఆధునికలాక్ష ణికు లొకరు సంస్కృతపదమును దత్సమము చేయునపుడు ముత్వమైన దీర్ఘమైన నుండవచ్చునని చెప్పినారు. ఆలక్షణము ప్రయోగవిరుద్ధము.

వికృతిపదముచివరనున్న ముప్రత్యయమునకు లోపము గల్గి, దానికిఁ బూర్వమునందున్న 'అ' కారమునకు దీర్ఘము కల్గును - అది బహువచన లులలు పరమగునపుడే క్వాచిత్కముగాఁ గల్గునని యర్థము.

సూరిగారు, ఉలనలు పరంబులగునప్పుడౌకారౌకారోచ్చారణముగాగ మంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు (బాల. తత్స. 43) నని సూత్రించి పై విషయమును వివరించిరి. మూలమునందున్న 'వికృతౌ' అనుదానిని విడుచుటచేఁ దత్సమంబులకుఁగూడ నీకార్యములు వచ్చునని వీరంగీకరించిన ట్లగపడుచున్నది. అహోబలపతి పండితుఁడు తత్సమములకు రాదని నిష్కర్షగాఁ జెప్పినను వీ రిట్లుచెప్పుటచే వీరు కవిత్రయమువారిప్రయోగముల నన్నింటినిమాత్రమే ప్రమాణముగా గ్రహించినట్లు తోఁచుచున్నది.

129 సూ. 2:- తర్హి "మానుగ ధృతరాష్ట్రుఁడు ప్రాణానం గలుగంగ, వాడినారసంబు వర్మని నిటలానన్" ఇత్యాదీనాం తిక్కయజ్వాది కవిప్రయోగాణాం కాగతిరితిచేత్

"ఉతా మత్ర భవే ద్వావు రస్త్రీయాం ల్వాదివర్ణకే
ప్రాయశో వైకృతపదే లోపో దీర్ఘశ్చ మోరతః"

ఇత్యథర్వణవచనగత ప్రాయోగ్రహణమహిమ్నా తత్సాధుత్వ మస్తీ త్యవధేయమ్.

వి:- "మహతీవాచక స్త్రీలింగేతరములగు నమహత్తులగు హ్రస్వోకారాంతములకు 'లు' వర్ణకము మున్నగు ప్రథమైకవచనేతర విభక్తి పరమగుచుండఁగా వు వర్ణకము వికల్పముగాఁ బ్రాతిపదికమున కంతాగమ మగును. ఆచ్ఛికపదములందు మువర్ణకమునకు లోపమును బూర్వస్థితాకారమునకు దీర్ఘమును దఱచుగా సమ్మతమగును-" అని యథర్వణుఁడు వచించెను. 'ప్రాయశః' అని యుండుటచే నరుదుగాఁ దత్సమములందుఁ గూడ నీకార్యము గలుగ వచ్చునని తెలియుచున్నది. కానఁ 'బ్రాణానన్' నిటలానన్' మున్నగురూపములు సాధువు లగుచున్నవి. వీని నసాధువు లనరాదు.

**130 సూ:- సర్వత్రోదోతో ర్వు ర్భవతి మువత్.**

130 సూ:- ఉకారాన్తా దోకారాన్తాచ్చ 'వు' వర్ణక స్స్యా ద్విభక్తౌ. సోఽస్థానేఽపిస్యా ల్లింగత్రయేఽపి. 'విష్ణువు, ధేనువు, గోవు, మధువు. సంకేతితసుప్రసిద్ధ మేవేత్యుక్తేః స్మృతో ప్రముఖస్య నాత్రప్రవేశః.

వి:— ఉకారాంతములకు నోకారాంతములకు విభక్తి పరమగు నపుడు 'వు' వర్ణక మాదేశ మగును. సుప్రత్యయస్థానమునను నాదేశ మగును. ఈకార్యము మూఁడు లింగములయందును గల్గును — అని సూత్రార్థము. 'ఇహతు ప్రవ్యాహార్యం సంకేతిత సుప్రసిద్ధమేవ పదమ్' అని సన్నపార్యుఁడు సంకేతితము, సుప్రసిద్ధమునగు పదమునకే తెనుఁగుఁ దత్సమముగా నుండుటకుఁ బ్రయోగాభ్యనుజ్ఞ నిచ్చుటచే స్మృతో మున్నగు నప్రసిద్ధాసంకేతితపదములు తత్సమములుగాఁ దెలుఁగులోనికి రావని తెలియవలయును. ఈ 'వు' వర్ణకవిషయమున మహతీవాచక స్త్రీ లింగములుగాని యమహద్ధ్రిస్వోకారాంతములకు 'లు' వర్ణకము మున్నగుప్రథమైకవచనేతరవిభక్తి పరమగుచుండఁగా 'వు' వర్ణకము వికల్పముగాఁ బ్రాతిపదికముల కంతాగమమగును; అని వువర్ణకో భవేదత్ర క్వచిన్నిత్యం క్వచిత్తు వా, (ఉతా మత్ర భవే ద్వావు గస్త్రియాం ల్వాదివర్ణకే — అనిపాఠాంతరము) అనువచనముచే నథర్వణాచార్యులు గారు 'వు' వర్ణకమును వికల్పముగా విధించిరి. కాన 'తరువులు' 'తరులు' 'తరువున్' 'తరున్', 'తరువుచేతన్' 'తరుచేతన్' మున్నగురీతిని రూపద్వయము కల్గుచున్నది.

సూరిగారీవిషయమును, వువర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాంతములకు బహుళముగా, గోశబ్దమునకు నిత్యముగా వుగాగమం బగు (బాల. తత్స. 49) అని వివరించిరి.

**131 సూ. :— డు జ్మహత్పదానాం వా.**

**131.** సూ౹:— పూర్వయోగాపవాదః 'సర్వత్రోదోత్తో' ఇతి; 'మహతస్సో' ఇతి వువర్ణకడువర్ణకయో ర్నిత్యత్వేన ప్రాప్తౌ విభాషేయమ్. 'విష్ణువు, విష్ణుఁడు-జిష్ణువు, జిష్ణుఁడు' ఇత్యాది. వువర్ణకే సంబోధనే 'విష్ణువ- దీర్ఘే 'విష్ణువా', డుజి 'విష్ణుఁడ, విష్ణుఁడా' ఇత్యాది.

వి — డుజ్, మహత్పదానాం, వా — అని ఛేదము, మహదమహత్సాధారణముగాఁ బూర్వసూత్రముచే 'వు' వర్ణకము వచ్చుచున్నది.

దీనిచే మహద్వాచకములకు వికల్పము. ఋవర్ణకము రానపుడు డుజ్వర్ణకము వచ్చును.

**131** సూ **2** :- డుజ్వా స్యుం మహత ఉదన్తాదేవ నత్వోదన్తాదపి. తాదృశప్రయోగస్య మృగ్యత్వాత్. అతఏవాథర్వణేనోక్తమ్ "భిన్నత్వే చాప్యభిన్నత్వే న డుజోదన్తతో భవేత్। సమాసాన్తవిధానే తు తత్ప్రయోగో హితో భవేత్" ఇతి 'భీకరగతి నింద్రుఁడేగె భృతగుం డగుచున్' ఇత్యాది తత్రోదాహరణమ్.

వి:- 'డుజ్' మహత్పదానాం వా అనుదానిచే వచ్చునట్టి డు మహద్వాచకోదన్తములకే కాని యోకారాంతములకుఁ గాదు. ఓకారాంతములకు డుజంతప్రయోగ మగపడదు. అథర్వణాచార్యులు "వ్యస్తతయందును సమాసమందును నోకారాంతము లగు సంస్కృత శబ్దములకంటెఁ బరమైనప్రత్యయమునకు డుజ్ ఆదేశము రాదని" స్పష్టముగా వివరించియున్నారు. భీకరగతి నింద్రుఁ డేగె భృతగుం డగుచున్' భృతమైన గోవులు గలవాఁ డనునర్థములో 'భృతగుః' అని సమాసాన్తప్రత్యయముచే రూపమేర్పడుచున్నది. దీనిమీఁద డుజ్జు రావచ్చునని యథర్వణాచార్యులు వచించిరి.

**131** సూ **3** :- "ధూర్తవృద్ధౌ మూర్ఖనీచా వుదన్తావపి సమ్మతౌ
ఉత్వేనైవ భవన్త్యన్యే ప్రయోగాస్తత్ర కారణమ్"-ఇతి.

ఇయం విధిశ్చ శబ్దశాసనస్యాప్యభిమత ఏవ. 'నన్నయభట్టు, నారాయణభట్టు, కడువృద్ధు, నెఱజోదు, ఒక్కరూపు, మూర్ఖవు శిశుపాల' ఇత్యాదీనాం తత్ప్రయోగాణాం సత్వాత్. ఏవంచ 'ఆహారంబిడున్ సీతునన్' ఇత్యాది కవిప్రయోగాః సఙ్గచ్ఛన్త ఇత్యవగన్తవ్యమ్.

వి:- 'ధూర్త - వృద్ధ' - శబ్దములును 'మూర్ఖ - నీచ' శబ్దములును 'ఉత్వ' ఘటితములై మాత్రమే సమ్మతమగుచున్నవి. కాన వీనికిఁ బ్రథమైకవచనలోపము వచ్చునని యెన్నవలయును. ప్రథమైకవచనలోపము వికల్పముగా వచ్చుటచే వీనికి డుమంతత్వము పాక్షికముగాఁ గొన్నింటికి లేదని తాత్పర్యము. నన్నయభట్టు-నారాయణభట్టు - నెఱజోదు - ఒక్కరూపు - ఇవి యుదంతములే. 'మూర్ఖుఁడు - మూర్ఖ;'

దీనికి రెండురూపములు. ఇట్టివి యుదాహృతులు.

131 సూ 4 :- "మనువట్వాదిశబ్దానా నడుజ్ నిశ్చ ప్రయుజ్యతే" ఇతిచ. ఆదిశబ్దేన దన్వాది సంగ్రహః. 'మనువు, మనువున్, మనువుచేతన్' ఇత్యాదిరూపం జ్ఞేయమ్.

వి:- "మను - వటు" మున్నగుశబ్దములమీఁద నిల్చిన సుప్రత్యయమునకు డుజ్జు గాదు; వానికి నివర్ణాగమమును రాదు-అను నథర్వణవచనముచొప్పున ఉకారాంతమహత్తులైనను మనువట్వాదిశబ్దములకు డుజ్మహత్పదానాంవా 'అనుదానిచేతను వచ్చు డుజంతరూపములు రావు. నిగాగమమును నచట నుండదు. దానికి వువర్ణక వుగాగమములు వచ్చును. 'మనువు - మనువున్- మనువుచేతన్; వటువు - వటువున్, వటువుచేతన్'- అనియే యుండును. ఆదిశబ్దముచే 'దనువు - దనువున్ - దనువుచేతన్' మున్నగువానిని గ్రహింపవలెను.

**132. సూ :-** డుజతౌ తు న ప్లుత స్స్యాత్ సంబుద్ధా విత్యుతాం విదుః కేచిత్.

132 సూ 1 :- సమ్బోధనోదన్తేభ్యో డుజదాగమౌ తు న భవతః. కిన్తు, ప్లుత స్స్యాత్ శేషంచి న్మతే. 'ఓవిష్ణూ3, ఓశంభూ3' ఇత్యాది. అత్ర విదుః కేచిదిత్యనేన ప్లుతస్య క్వాచిత్కతాం జ్ఞాపయ త్యాచార్యః.

వి:- డుజతౌ, తు, న, ప్లుతః, స్యాత్ , సమ్బుద్ధౌ, ఇతి, ఉతాం, విదుః, కేచిత్ - అని ఛేదము. ఉకారాంతములైనమహద్వాచకశబ్దములసంబోధనమునందు డుజ్జు, నదాగమమును రావు-కాని ప్లుతము వచ్చును' అని కొందఱు చెప్పుచున్నారు' అని సూత్రార్థము. తెలుఁగునఁ ద్రిమాత్రాకప్లుత మున్నదనుట కాధారము లగపడవు. 'హేమహారాజ' మున్నగు చోట్ల నాచార్యులుగారు సంబోధనమున హ్రస్వమునే ప్రయోగించి యున్నారు. దూరాహ్వాన మహారోదన గాన సంశయార్థములకుఁ బిమ్మటఁగూడఁ బ్లుతము రాక దీర్ఘముమాత్రమే ప్రయోగింపఁబడినట్లు కవిప్రయోగములనుబట్టి తెలియుచున్నది. అట్టియెడఁ బ్లుతము

వచ్చునని చూపఁబడిన మతాంతరము సరిగాదని చెప్పవలసియున్నది. సంస్కృతమునందువలెఁ దెనుఁగునఁ బ్లుతమునకుఁ బరిగణనము లేదని భావింపవలెను. కాని దీర్ఘరూపమే యచట విధింపఁబడిన దనియు నది ద్విమాత్రాకమే కాని త్రిమాత్రాకప్లుతము గాదనియుఁ దెలియవలెను. 'జరత్కారూ జగన్మాన్య' - అను నన్నయగారిప్రయోగమునందు దూరాహ్వానమునందుఁ ద్రిమాత్రాకప్లుతమున్నదని కొందఱు భావించుటచే నామత మీసూత్రముచేఁ దెలుపఁబడినది.

132 సూ 2 :- అత్ర యద్యపి డుజభావే 'వు' ప్రత్యయే కృతే తదభావే తదుకారస్యైవ ప్లుతః కర్తుం శక్యత ఏవ. తథాప్యాచార్యేణ 'జగత్కారూ మునిశ్రేష్ఠ' ఇతి ప్రయుక్తత్వాత్, ఉతామిత్యత్ర ప్రతిపదోక్తఏవ, ఉకారః ప్లుతవిషయ ఇతి నిశ్చీయతే. జరత్కారో ర్జరత్కార్వామితి వ్యాసోక్తి స్తస్యోద న్తతాయాం మానమ్. డుజ్గ్రహణా దమహతాం నైతత్కార్యమితి స్పష్టమ్.

వి:- 'డుజ్ మహత్పదానాం వా' అనుటచేత 'వు' వర్ణకము, డుజ్జును రానపుడు ప్రతిపదోక్తమగు 'ఉ' కారాంతములకుమాత్రమే ప్లుతము వచ్చునని తెలియవలయును. 'జరత్కారూ మునిశ్రేష్ఠ' యనునది దానికి నిదర్శనము. వ్యాసుఁడు చెప్పిన 'జరత్కారోః-జరత్కార్వాం' అనునదియు దీనికి మూలము గానోపును. పుంలింగ జరత్కారుశబ్దము హ్రస్వోకారాంతమే కదా.

132 సూ 3 :- నను ప్లుతే కృతే కథం సులోప ఇతి చేత్ 'సర్వేభ్యో విధిభ్యో లోపవిధి ర్బలీయాన్' ఇతి పరిభాషయా ప్లుతాత్పూర్వమేవ సులోపః. సచ, 'ఏజ్ హ్రస్వాదితి' సంస్కృతీయేన 'సోర్లుగితి' ప్రాకృతీయేన సూత్రేణవా భవతి. నచ సూత్రే సంబుద్ధావితి పదం ప్రత్యయపరమ్. కిన్తు సమ్బోధనార్థపరఏవ. ఏవంచ సమ్బోధనార్థే విషయే ఇతి తదర్థ ఇతి న కశ్చిత్కలఙ్కః.

వి :- ప్లుతముచేసినపుడు సులోప మెట్లు గల్గునని శంక రాఁగా నన్నివిధులకంటెను లోపవిధి బలీయ మనుపరిభాషచొప్పునఁ బ్లుతముకంటె బూర్వము సులోపము వచ్చును. 'ఏజ్హ్రస్వాత్సమ్బుద్ధేః' అను

పాణినీయసూత్రముచేఁగాని 'సోర్లుక్' అను ప్రాకృతవ్యాకరణసూత్ర ముచేఁగాని కలుగవచ్చునని సమాధానమును గవిశిరోభూషణము చెప్పినది. సూత్రమునందలి 'సమ్బుద్ధౌ' అనుపదము ప్రత్యయపరము గాద నియుఁ దదర్థపరమనియు వ్యాఖ్యానింపనగును. అపుడు సంబోధనార్థము విషయమగుచుండఁగా ననునర్థము గల్గును. అపుడు దోష ముండదు- అనియు సమాధానము చెప్పినది.

132 సూ 4 :- డుజ్ గ్రహణ స్యోపలక్షణత్వాత్ న్యాదికార్యమ్. 'విష్ణునిచేతన్, విష్ణుచేతన్, విష్ణువుచేతన్, విష్ణువుఁచేతన్, విష్ణునకున్, విష్ణునికిన్, విష్ణువునకున్, విష్ణువునికిన్' ఇత్యాది.

వి :- మహద్వాచకోకారాంతశబ్దములకు డుజ్జువచ్చినపక్షమునందు నిగాగమమున్నైతము వచ్చును. డుజ్జు రానపుడు 'వు' వర్ణకముతో నొక రూప ముండును. మూలములో 'విష్ణువునిచేతన్, విష్ణువునికిన్' అని రెండురూపము లుదాహరింపఁబడినవి. ఈరూపముల నెట్లో వ్యాకరణ ములు సాధించినను వీనికిఁ గవిప్రయోగప్రసిద్ధిమాత్రము లేదు. 'సంకే తితసుప్రసిద్ధమేవ' అను నియమముచే వీనిని గ్రహించుట స్వారసము గాదు. కవిశిరోభూషణ మట్టివానిని సాధించుట సరిగాదు.

132 సూ 5 :- అమహత్సో 'వు' వర్ణకే 'తనువు, తనువ, తనువా' ఇత్యాది రూపమ్. ద్వితీయాచార్యేణ తు, అమహదుద న్తేభ్యోఽపి 'వు'ర్వా విహితః. తేన 'తరువు, తరుఁలు; బాహు, బాహులు'; ఇత్యాది రూపం సిద్ధ్యతి. 'అగ్గలంబు నాయె దుట బాహువ్వళించి' 'పర్వము లేకయును రాహు భానునిఁబట్టెన్'; 'తనతనువు రాహు సోమామృతంబు మ్రింగె'; 'నిక్కెఁ తనువెత్తి తిరి పెంచు తనతోన' ఇత్యాద్యాః తిక్క యజ్వాదికవిప్రయోగాః'.

వి :- అమహద్వాచకశబ్దములకు 'వు' వర్ణకము వికల్పముగా వచ్చునని 'ఉతామత్ర భవేద్వా వుః' (129-2) అను నథర్వణవచనము చెప్పుచున్నది. ఈ 'వు' వర్ణకము వికల్పము గావున 'తరు, తరువు; బాహు, బాహువు' మున్నగురూపములు సిద్ధించుచున్నవని కవిశిరోభూ

షణము చెప్పుచున్నది. కాని యీసూత్రములందుఁ బ్రథమైకవచనేతర విభక్తులు పరమైనపుడే యీ 'వు' వర్ణకవికల్పత చెప్పఁబడుటవలన దానిచే నీరూపములను సాధించుట సరిగాదు.

132 సూ 6 :– అస్త్రియా మిత్యథర్వణవచనేన స్త్రీవాచకవ్యతిరిక్తానా ముద న్తానామితి వ్యాఖ్యానా న్నతన్వాదిభ్యో 'వు' వర్ణక వికల్పో విరుద్ధః. విద్యుత్సహస్ర ముల్ విలసిల్లె మఱి రాహు పర్వంబు లేకయు భానుఁబట్టె'; ఇత్యాదిప్రయోగాత్. శబ్దశాసనస్యాపి 'వు'వర్ణకవికల్ప స్సమ్మతఏవ. 'అనుతాం స్త్రియా మిత్యుక్తేః' ఆచా ర్యస్య మతే తు తన్వాదిభ్యో నేష్ట ఏవ వికల్పః. 'జరత్కారున్ మదీయానుజన్' ఇతి తదుక్తేః తస్మాత్రస్య సాధుత్వమితి బోధ్యమ్.

వి :– 'ఉతామత్ర' అనుసూత్రమునందున్న 'అస్త్రియా' మ్మను పదమునకు స్త్రీవాచకవ్యతిరిక్తోదంతములని వ్యాఖ్యానము చేయుటచేఁ దన్వాదులకు 'వు'వర్ణకము వికల్పముగా వచ్చుట విరుద్ధము గాదని కవి శిరోభూషణము చెప్పుచున్నది. ప్రథమైకవచనేతరవిభక్తి పరమైనపుడే యని యచట వివరింపఁబడుటచే 'రాహు, తను, అను ప్రథమైకవచన రూపములు కుదురుపడవు. కాని నన్నపార్యుఁడు 'రాహు' మున్నగు రూపములను బ్రయోగించియున్నాఁడు. రాహుబాహుశబ్దములతరువాత 'సు' ప్రత్యయమునకు లోపము రావలసియున్నది. అది 'అనుతాం స్త్రియా' మ్మను సూత్రముచే నిత్యముగాఁ గల్గుచున్నది. కాని 'జరత్కారున్' 'రాహు' మున్నగు ప్రయోగములు నిపాతన్యాయముచే నంగీకరింపఁబడుటవలన నవి సాధువు లగుచున్న వనిచెప్పుట సముచిత మగును.

132 సూ 7 :– "భవే ద్ధర్మాదిశబ్దానాం ముశ్చ వుశ్చాత్ర కుత్రచిత్" ఆదిశబ్దేన కర్మాదిశబ్దా గృహ్యన్తే-'ధర్మువు, కర్మువు, వర్మువు' ఇతి. ఆచార్యస్యాప్యేతద్రూప మిష్టమేవ. 'అవని యరాజకంబయినయత్తఱి భూప్రజలందు సర్వధర్మువులు దొలంగు' ఇత్యాది ప్రయోగశ్రుతేః. మువర్ణక విధాయకశాస్త్రే ఉదన్తమాత్రస్య గ్రహణాత్ 'ఆయువు' ఇత్యాదిరూపం నిర్బాధమ్.

వి :— 'భవే ద్ధర్మాదిశబ్దానాం ముశ్చ వుశ్చాత్ర కుత్రచిత్' అనుపాఠము సరిగాదనియు 'భవే ద్ధర్మాదిశబ్దానాం ము శ్చోవుశ్చాత్ర కుత్రచిత్' అని యుండుట సమంజసమనియు వ్యా.సం.స. చెప్పుచున్నది. 'మువర్ణకసందర్భమునం దొకానొకచో ధర్మాదిశబ్దమునకుఁ బరమై యున్న సుప్రత్యయమున కాదేశముగా 'ము', 'ఉవు', అను వర్ణకములు పర్యాయముగా వచ్చుచుండును' అనుచెప్పిన 'సర్వధర్మువులు దొలంగు' నని 'ఉవు'వర్ణకముతోడి ప్రాసప్రయోగమునుబట్టి వ్యా. సం.స.' సవరించిన పై పాఠము సమంజసమే యని యంగీకరింపక తప్పదు. 'సర్వత్రోదోతో ర్వార్భవతి మువత్' అను సూత్రమునందు, ఉదంత మాత్రములే గ్రహింపఁబడుటచేత, నాయుశ్శబ్దము సకారాంతమైనను దెనుఁగునఁ బ్రాతిపదికము 'ఆయు' అనునదియే యగుటచే దానికి 'వు' వర్ణకము వచ్చి 'ఆయువు' అనురూపము సిద్ధించుట కెట్టి యాటంకము లేదు.

పై విషయములను బాలవ్యాకర్త యీ క్రింది రీతిని, 'అర్థా దులకడయుచ్చున కుత్వంబును, మీఁద వువర్ణకంబును వైకల్పికముగా నగును. (ప్రౌఢ. శబ్ద. 25) "రాహు బాహు శబ్దంబుల కంతట వువర్ణక లోపంబు వైకల్పికంబు" (ప్రౌఢ.శబ్ద.26) 'విశ్వకర్ముఁడనియు రూపంబు" (ప్రౌఢ. శబ్ద. 27) అనుసూత్రములచే వివరించియున్నారు.

132. సూ. 8 :— "నోవా ద్విత్వం క్వచిత్ శ్లిష్టః పరప్రాణేన సంగతేః, ద్రుతాద్వ్యంతః క్వచిచ్చాత్ర దృశ్యతే కవిభాషితే."

ఏతదాచార్యస్యాపి సమ్మతమ్. "దీనినెట్టులఁగ్రమ్మఱింతు మదీయభాషణ మెన్నఁ డున్నని పూఘము గాదు"; "ఆతనిధైర్యశక్తికి న్నరుదుగ మెచ్చి" ఇత్యాది తత్ప్రయోగాత్.

వి:— "ఒకానొకప్పుడు పూర్వాచ్చునత్తియున్న 'న' కారమున కచ్చు పరమగునపుడు వికల్పముగా ద్విత్వము గల్గును; ఈద్విత్వము

వచ్చుసందర్భమునందు ద్రుతమునకుఁ బరముగా మఱియొక ద్రుతము మహాకవిప్రయోగములం దగపడుచున్నది" అనునథర్వణవచనముచే, 'ఎన్నఁడున్నని'; 'ధైర్యశక్తికి న్నరుదుగ' మున్నగు రూపములు సాధింపఁబడినవి.

ఈవిషయమును ప్రౌఢవ్యాకర్త, "కొన్నియెడలఁ బ్రామాణిక ప్రయోగంబుల ద్రుతంబున కచ్చు పరంబగుచో ద్విత్వంబు చూపట్టెడి" (ప్రౌఢ.సంధి.3) అనియు; "తఱచుగాఁ గర్మధారయసమాసమునం బెన్వాదులకడహల్లున కచ్చు పరంబగునపుడు ద్విత్వంబు గానంబడియెడి" (ప్రౌఢ. సం. 9) అనుసూత్రములచే వివరించెను. రెండవసూత్రమునకుఁ 'బెన్నదరులు, పెన్నరదము, పెన్నద్రి, పెన్నాఁత, పెన్నొడలు, కన్నాకు' అని పెక్కుప్రయోగములను 'నకారద్విత్వములనే చూపి 'పల్లఱపు' అని యొక్క ప్రయోగమును మాత్ర మితరహల్లునకుఁ జూపియుండుటచే నీ సూత్రము ప్రకృతాథర్వణకారికకే వివరణమని భావింపఁదగునని తెలియుచున్నది.

132. సూ. 9 :- శంతనుసంతానంబును సంతతసత్కీర్తి పిండసత్కృతియును నత్యంతమహీరాజ్యమును బరంతప నీయంద చిరతరంబుగ నిల్చెన్' ఇత్యాది తద్వచనాత్. 'ఆబాలగోపాల మఖిలసత్త్వజయము నానందమగుమనికి నతిశయిల్లె' ఇత్యాద్యా అన్యకవిప్రయోగా అపి బహవః. ద్రుతాద్ద్రుత ఇత్యత్ర ద్రుతశబ్దః కేవలనకార 'ను' వర్ణకద్వయ సాధారణ ఇతి ద్రష్టవ్యమ్. తేన 'తేటపడం గాచెదఁ బంపుమన్నను నఖండ ప్రేమ సామగ్రితోన్' ఇత్యాది ప్రయోగస్తు సాధుః.

వి:- పైపద్యము భారతాదిపర్వము నాల్గవయాశ్వాసము ప.219 సంఖ్యగలది. ఇందుఁ బిండసత్కృతియును + అత్యంత అనుచోట సముచ్చయార్థక 'యును' వర్ణకములు రెండును సంయుతములై నిల్చినవి. కావున వానిపైని ద్రుతముగల్గి 'యును, నత్యంత' అనురూపము సిద్ధించినది. 'దుతాద్ద్రుతః' అనుదానిచే 'సత్కృతియును నత్యంత' మున్నగు చోట్ల ద్రుతముమీఁద మఱల ద్రుతము వచ్చునని కవిశిరోభూషణ మభిప్రాయపడినది. అది సరిగాదు. 'నోవా ద్విత్వ'మ్మనుసూత్రముచే

నిచట 'స'కారమునకు ద్విత్వము గల్గి యట్టి ద్విత్వమునందుమాత్రమే నిరర్థక మగుమఱియొకసకారము నిలుచునని దానియభిప్రాయము తేలుచున్నది. కావుననే 'ద్రుతాద్రుతి' ఇత్యత్ర కేవలనకార నువర్ణకద్వయసాధారణ ఇతి ద్రష్టవ్య' మ్మని కవిశిరోభూషణము వ్రాసినది. దానికిచ్చినయుదాహరణములలోఁ దేఁటపడం గాచెదఁ బంపు మన్నను నఖండప్రేమసామగ్రితోన్' అనునపుడుగూడ 'అన్ననున్=అనినప్పటికిని' అనునర్థవిశేషమున ద్రుతాంతమైన 'ను'వర్ణము నిల్చెనని తెలియవలెను. ద్రుతమునకు 'ను'స్వరూప ముండదని కవిశిరోభూషణ మచ్చటచ్చటఁ జెప్పియుఁ, గొన్నియెడల నుస్వరూపద్రుతము నంగీకరించుట సరిగాదు. అది నన్నయాథర్వణులకు సమ్మతమును గాదు. అట్టిదాని కాధారములును లేవు.

ఈవిషయమును సూరిగారు, 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' (బాల. సం. 21) అని 'ద్రుతాద్రుతిః క్వచిచ్చాత్ర దృశ్యతే' అనునథర్వణవచనమును వివరించిన ట్లగపడుచున్నది. ఈయథర్వణకారిక ప్రక్షిప్తపాఠమేమో యని తోఁచుచున్నది. ఇట్టిచోట్ల సముచ్చయార్థకక 'యును' వర్ణకములతో నర్థము పొందుపడుచున్నది.

**133 సూ. :- దీర్ఘాణాం హ్రస్వ స్స్యాత్.**

133 సూ. :- యే దీర్ఘాన్తా శ్శబ్దాః తేషాం హ్రస్వః స్యాత్. సోమపుఁడు, గ్రామణి, లక్ష్మి, రమ' ఇత్యాది.

వి:- దీర్ఘాణామ్, హ్రస్వః, స్యాత్-అని ఛేదము. దీర్ఘాంతములగుశబ్దములకుఁ దెనుఁగున హ్రస్వము గల్గునని యర్థము. సోమపాః, గ్రామణీః, లక్ష్మీః, రమా అనువానికి హ్రస్వముచేయఁగాఁ దెనుఁగునం దవి ప్రాతిపదికములై తత్తద్యోగ్యకార్యముల నందుచున్నవి.

సూరిగారు "నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు" (బా.ల. తత్స. 54) నని యీవిషయమును వివరించిరి.

**134 సూ. – న చ దేశ్యపదే న చైకవర్ణేఽపి.**

134 సూ. 1 :- దేశ్యపదస్య ఏకవర్ణసంస్కృతపదస్య చ హ్రస్వో న స్యాత్. 'నవలా, నేజా, లకోరీ, మత్తా' ఇత్యాద్యా దేశ్యాః. 'శ్రీ, హ్రీ, మా, భూ' ఇత్యాద్యా ఏకాక్షరక సంస్కృతశబ్దాః.

వి:- న, చ, దేశ్యపదే, న, చ, ఏకవర్ణే, అపి–అని ఛేదము. దేశ్యపదమునకును నేకాక్షరక సంస్కృతశబ్దమునకును హ్రస్వము రాదని యర్థము. 'నవలా, నేజా, లకోరీ' అను దేశ్యపదములదీర్ఘమున కర్వాచీనులు గొందఱు హ్రస్వము చేసి ప్రయోగించుట సమంజసము గాదు. 'లకోరీ' శబ్దమునకు 'లకోరులు' అని హ్రస్వాంతముగా నొకానొకకవి ప్రయోగించియున్నాఁడు. అదియుఁ బ్రాచీనప్రామాణికకవిప్రయోగ విరుద్ధమే.

134 సూ. 2 :- అత్రేయం చిన్తా. హ్రస్వవిధాయకం శాస్త్రం భిన్నవిషయక మేవ; నతు సమాసవిషయకమపి. సమాసే తాదృశప్రయోగ స్యాదృష్టత్వాత్. నచ 'గ్రామణిపుత్ర' ఇత్యాది స్తద్విషయ ఇతి వాచ్యమ్. "ఇకో హ్రస్వో ఙ్యో గాలవస్య" ఇతి శాస్త్రేణ తత్సిద్ధేః.

వి:- హ్రస్వమును జెప్పు "దీర్ఘాణాం హ్రస్వః' అనుశాస్త్రము సమాసమునందు వర్తింపదు. వ్యస్తతలో వర్తించును. 'గ్రామణిపుత్రః' అనునది 'గ్రామణ్యఃపుత్రః' అనుసమాసమునఁ గల్గినహ్రస్వత సంస్కృతవ్యాకరణసూత్రముచేత నే కల్గినది.

134 సూ. 3 :- నచ సమాసే. స్త్రీప్రత్యయమాత్రవిషయత్వేన ప్రవృత్తి స్యాస్య వైషమ్య స్యాసమాసేఽన్వాయ్యత్వాత్; తర్హి 'నదిమునగురుకర్ణ కల్యవాగ పురీకుల్' ఇత్యాదౌ కథం హ్రస్వ ఇతిచేత్. "హ్రస్వోఽదీర్ఘసమాసేఽపి క్వచిత్ జీపః ప్రయోగతః" ఇత్యథర్వణోక్తే ర్హ్రస్వః.

వి:- 'దీర్ఘాణాం హ్రస్వః' అను హ్రస్వవిధి సమాసమధ్యగత పదములందుఁ బ్రవర్తించుననియు నట్టిప్రదేశములలో నొక్క స్త్రీప్రత్యయాంతములందే వర్తించుననియు నియమము చేయరాదా యని శంకింపఁ జనదు. సమాసేతరస్థలములం దంతటను వర్తించునీవిధిని సమాసములలో స్త్రీప్రత్యయాంతములకుమాత్రమే వర్తించుననుట సరి గాదు గదా! 'నదిసుత' (భార.ఆది1-69) అనునది సంస్కృతసిద్ధసమాసము. దీనికి సంస్కృతవ్యాకరణముచొప్పున హ్రస్వము రాకున్నను కవిప్రయోగానుసారముగా 'జీప్, జీన్' మున్నగువానికి హ్రస్వము క్వాచిత్కముగాఁ గల్గు' నను నథర్వణవచనముచొప్పున హ్రస్వత గల్గుచున్నది. అదీర్ఘసమాసముననే హ్రస్వము గల్గునపుడు దీర్ఘసమాసమునఁ గల్గునని వేఱుగా నుడువ నక్కఱ లేదు. 'హ్రస్వో దీర్ఘసమాసేఽపి' అనియుఁ బాఠము గలదు. రెంటికి నర్థమునం దంతగా భేదమగపడదు.

134 సూ 4 :- నచాత్ర ద్వితీయాతుల్యతా ప్రతిపాదకశాస్త్రప్రవృత్తిః. యత్ర సమాసాన్తగతపదస్య షష్ఠ్యన్తే నాన్వయ స్తత్రైవ తత్ప్రవృత్తేః.

వి :- 'నదిసుత' అనునపుడు నదియొక్క సుతుఁ డనువిగ్రహమున ద్వితీయాతుల్యతా శాస్త్రముచొప్పున ద్వితీయాతుల్యత్వమును ద్రుతలోపమును గల్గి 'నదిసుత' యనురూపము గల్గు ననరాదు. సమాసాంతపదమునకు షష్ఠ్యంతముతో నన్వయ మున్నచోటనే ద్వితీయాతుల్యతా శాస్త్రమునకుఁ బ్రవృత్తి గల్గుచున్నది.

134 సూ 5 :- నచ 'జ్యాపో స్సంజ్ఞాచ్ఛన్దసో ర్బహులమ్.' ఇతి వార్తికమత్ర ప్రవర్తతే; శబ్దస్యాస్య సంజ్ఞాత్వేన రేవతిపుత్రాదివత్ హ్రస్వవిషయతా ఆద్యప్రకృత్యాం వ్యవహారాభావాత్. అథర్వణవచనం చాత్ర మానమ్.

వి :- 'రేవతిపుత్ర' మున్నగువానివలె నదిసుతమున్నగునవి సంజ్ఞావాచకములు గానందున 'జ్యాపో స్సంజ్ఞాఛందసో ర్బహుళ' మ్మను

వార్తిక మిచటఁ బ్రవర్తింపదు. అట్లు ప్రవర్తించినచో, 'హ్రస్వోఽదీర్ఘ సమాసేఽపి' యను నథర్వణవచనము బయలు వెడలియుండదు గదా!

**134** సూ 6 :- ప్రయోగత ఇత్యనేన స్థితనిర్వాహార్థ మిదం వచనమ్. నాపూర్వశబ్దకల్పనార్థమపీ త్యయమర్థో ద్యోత్యతే. వాగనుశాసనస్యాప్యత్ర రుచి రస్తీతి జ్ఞాయతే. ఆదిపర్వణి 'నలినరజస్సుగంధి యమునానది తుంగతరంగ సంగతానిలశిశిర స్థలాంతరవినిర్మితనిర్మలహర్మ్యరేఖలన్' ఇతిపాఠస్య బహుపుస్తకేషు దర్శనాత్. 'రాకసుధాంశుమండలము' ఇత్యత్ర 'రాకా' పదమ్ షష్ఠ్యన్తం, సప్తమ్యన్తంవా భవతి. 'నెలకొనియె కేఁటతమి నబ్బలియుఁడు శిశిరనగరుచిరపరిసరమహిమం గలతమసతీరసికతావిలసనములు డెందమునకు విందొనరింపన్' ఇత్యాది ప్రయోగే తు తమసాదిశబ్దానాం భిన్నత్వేనైవ సాధుత్వ మవగన్తవ్యమ్.

వి:- అథర్వణవచనమునందలి 'ప్రయోగతః' అనుపదముచే నీవచనము కవిప్రయోగమును సాధించుటకే బయలుదేఱినదిగాని యపూర్వకల్పనోపదేశమునకుఁ గాదని తెలియుచున్నది. 'యమునానది తుంగతరంగ' అను నాదిపర్వపద్యము బహుపుస్తకములలో నుండుటచే నది నన్నయగారిదే యనియు నీయథర్వణుఁడు చెప్పినది నన్నయగారికి సమ్మతమనియుఁ దెలియుచున్నది. ఇట్టి కవిశిరోభూషణవ్యాఖ్య చింతామణ్యథర్వణకారికలకుఁ గలసంబంధ మెఱుంగనందునఁ జేయవలసివచ్చినదని యూహింపకతప్పదు. చింతామణి సాధింపని నన్నయభారతప్రయోగముల నథర్వణుఁడు సాధించునుగదా!

'రాకసుధాంశుమండలము' అనునపుడు రాకాపదము షష్ఠ్యంతముగాని సప్తమ్యంతముగాని కానోపును' అని కవిశిరోభూషణము చేసిన వ్యాఖ్య సరిగాదు. ఇచట షష్ఠికి ద్వితీయాతుల్యత గల్గినదని యూహించుట లెస్స. 'తమసతీరసికతావిలసనములు' అను రాఘవపాండవీయ పద్యమునఁ దమయొక్క సతీరసికతావిలసనములనియు; తమసయొక్క తీరమందలిసికతావిలసనములనియు నర్థద్వయము గలదు. ఇందుఁ దమసానదియొక్క తీరమునందనునర్థమునఁ దమసాపదము సిద్ధసమాసములోనిది

గాదు. లేక సమాసములోనిదే కాదన్నను (వ్యస్తపదమే యన్నను) దోషము లేదు. కాన నచట హ్రస్వము వచ్చుట కెట్టియభ్యంతరమును లేదు. వ్యస్తతలోఁగూడ రెుుక్కఁడు లోపము గల్గును గదా!

134 సూ. 7 :— సమాసాన్తే తు "దీర్ఘాణాం హ్రస్వో నిర్వివాదః, తన్నిషేధ శాస్త్రస్యాపి సమాసాన్తేఽపి ప్రవృత్తేః. 'ముద్దునవలాలు, సుశ్రీలు, సుస్త్రీలు, సుభ్రూలు' ఇత్యాదౌ దీర్ఘ ఏవ. అతఏవాచార్య స్స్వగ్రన్థే రాజ్యశ్రీ వాలింపఁగ' నిత్యాదౌ దీర్ఘమేవ ప్రాయుఙ్క్త. 'పూర్ణశ్రీకిన్' ఇత్యాదౌ 'ఇతాం జసః కిస్స్యాత్' ఇతి సూత్రారమ్భసామర్థ్యా త్కి వర్ణకః.

వి:— ఇంతవఱకు సమాసమధ్యమునందు స్త్రీప్రత్యయాంతము లగుదీర్ఘాంతశబ్దములకు హ్రస్వము వచ్చువిషయము చర్చింపఁబడినది. సమాసాంతమునందు దీర్ఘమునకు హ్రస్వము వచ్చుట కెట్టియాటంక మును లేదు. కాఁబట్టి తన్నిషేధశాస్త్రముగూడ సమాసాంతముననే ప్రవర్తించుచున్నది. కావున 'ముద్దునవలాలు, సుశ్రీలు, సుస్త్రీలు' మున్నగుచోట్ల దేశ్యపదమునకు నేకాక్షరసంస్కృతపదాంత దీర్ఘము నకు హ్రస్వము రాలేదు. కావుననే నన్నపార్యుఁడు 'రాజ్యశ్రీ వాలింపఁగ' నని ప్రయోగించెను. 'పూర్ణశ్రీకిన్' అనునపుడు హ్రస్వము రాకుండుటయే కాక 'ఇతాం జసః కి స్స్యాత్' అనుసూత్రసామర్థ్యముచే 'కి' వర్ణకమును గల్గినది.

134 సూ 8 :— శ్ర్యాదీనా మనుపసర్జనత్వే ఏవైతద్రూపమ్. ఉపసర్జనత్వే ప్రత్య యాన్తత్వే నైవ ప్రయోగ ఇత్యర్థః. "యూదన్త శ్ర్యాది శబ్దానా మప్రాధాన్యే కపా స్థితిః" ఇతి తదుక్తేః. యూదన్తా ఈదూదన్తా ఇత్యర్థః. సుశ్రీకఁడు రాముఁడు; సుశ్రీక సీత.

వి :— ఇకారోకారాంత స్త్రీప్రత్యయాంతశబ్దములకు శ్రీ, లక్ష్మి. భ్రూ మున్నగువానికని యర్థము. "ఈదూదంతముల కప్రాధాన్యమునఁ 'క' ప్రత్యయముతోడిస్థితి గల్గును" అను నథర్వణవచనము చొప్పునఁ గొన్ని స్త్రీప్రత్యయాంతములకు 'నద్యృతశ్చ' అను పాణి

నీయము చెప్పున 'క' ప్రత్యయము వచ్చును. నద్యంతములుగానట్టిటాబాది ప్రత్యయాంతములకును (శ్రీ, లక్ష్మి, మున్నగుశబ్దములకును 'శేషాద్వి భాషా' యను పాణినీయముచే బహువ్రీహిసమాసమున 'క' ప్రత్యయము వికల్పముగా వచ్చును. సుశ్రీకుఁడు రాముఁడు, సుశ్రీక సీత మొదలగునవి యుదాహరణములు.

134 సూ. 9:— సుహ్రీకుఁడు "హ్రీకా, హ్లీకా, త్రపా మతా" ఇతి వచనేన కాన్తత్వమపి. సుహ్రీకము ముఖము.

వి :— "హ్రీకా హ్లీకా" అనుచెప్పున అకారాంతము లగు శబ్దములుగూడఁ గల్గుటచే 'సుహ్రీకుఁడు' మున్నగు రూపములు సిద్ధించుచున్నవి. కప్రత్యయము వచ్చినపుడును నిట్టిరూపములే యుండును.

134 సూ. 10 :— భ్రూశబ్దస్య త్వనుపసర్జనే కాపరే నకారా వితి నః. సుభ్రూవునకున్; ఉపసర్జనే హ్రస్వో భవత్యేవ. సుభ్రువు రాముఁడు. సుభ్రులు, సుభ్రునకున్, సుభ్రునికిన్, ఇత్యాది. స్త్రియాం సుభ్రువు చెలి, సుభ్రువునకున్. కప్రత్యయాన్తత్వే సుభ్రూకుఁ డిత్యాది. ఏవంస్థితే 'నిస్తులాస్యశ్రీ వయస్తంభనిక్షిప్త నిమ్నచ్ఛదభ్రువల్లంబు నిక్కము' ఇత్యాదయః కవీనామున్క్తయస్త్వసాకరా ఏవ.

వి :— భ్రూశబ్దమునకుఁ బ్రాధాన్యమునందు 'కు'వర్ణకము పరమగునపుడు 'నకారా' అనుశాస్త్రముచెప్పున 'న'గాగమము వచ్చి 'సుభ్రువునకున్' అని యగును. ఉపసర్జనత్వమునందు హ్రస్వము గల్గును. 'సుభ్రువు రాముఁడు'. 'సుభ్రుఁడు' మున్నగునవి యుదాహరణములు. కప్రత్యయపరకత్వమున హ్రస్వము రాదు. సుభ్రూకుఁడు, సుభ్రూక, సుభ్రూకము, మున్నగురీతిరూపములు గల్గును. ఇది యిట్లుండఁగా 'నింబచ్ఛదభ్రువు' అనుకవిప్రయోగమునం దుపసర్జనము గాకున్నను కప్రత్యయమును లేదు; ఉపసర్జనత్వమును లేదు; గాని హ్రస్వము కల్గినది. కావున నీప్రయోగము సరిగాదని కవిశిరోభూషణము చెప్పుచున్నది.

134 సూ. 11 :- మాశబ్దక్ష్మాశబ్దయోస్తు 'గోస్త్రియో రుపసర్జనస్య' ఇతి హ్రస్వః. ధృతరాజ్యముఁడు; ధృతక్ష్మకుండు, ధృతరాజ్యమ, ధృతక్ష్మ నృపశక్తి ఇతి

స్త్రియాం. నపుంసకే, ధృతరాజ్యమము రాజసలము, ఇత్యాది. ప్రాధాన్యే తు సకల క్ష్మా నేలురాజు సరసిజనేత్రా, ఇత్యాది. క్ష్మా దీర వర్ణింపన్ ఇత్యాదిః కవితాపితామహః. 'స్త్రీ వచ్చెన్' ఇత్యాదౌ అనుతామితి సులోపః.

వి:- 'మా–క్ష్మా' శబ్దములకు నుపసర్జనత్వమునందు 'గోస్త్రియో రుపసర్జనస్య' యని హ్రస్వము సంస్కృతముననే కల్గును. ధృతరాజ్యముఁడు=ధరింపఁబడినరాజ్యమా కలవాఁడు; ధృతక్ష్మాకుండు=ధరింపఁబడినక్ష్మా కలవాఁడు. ఇటఁ గ ప్రత్యయము పరమగుటచే నుపసర్జనమైనను హ్రస్వము రాలేదు. ధృతరాజ్యమ=ధృతమైన రాజ్యమా కలది (నృపశక్తి) ధృతక్ష్మ=ధృతమైనక్ష్మా కలది (నృపశక్తి) ఈ యర్థములలో నుపసర్జనములైనవి గావున హ్రస్వత కల్గినది. ఇవి స్త్రీలింగములోని రూపములు. నపుంసకలింగమునందైనచో 'ధృతరాజ్యమము రాజకులము' అని యుండును. అనుపసర్జనత్వమునందైనచో 'సకలక్ష్మా నేలు' నని హ్రస్వము రాకయే యుండును. క్ష్మా దీర వర్ణింపన్' అని కవితాపితామహుఁడు ప్రయోగించెను 'స్త్రీ వచ్చెన్' అనుచోట 'అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్యచ సులోపః' అని సులోపము.

134 సూ. 12 :- "నైకవర్ణే న దేశ్యేఽపి హ్రస్వో దేశ్యేతు వా క్వచిత్".

ఇత్యథర్వణోక్త్యా 'చక్కఁ-ఱఖాణంపుఁదేజిఁదోలన్' ఇత్యాదౌ తేజ్యాదిశబ్దానాం హ్రస్వో న విరుద్ధ ఇత్యవగన్తవ్యమ్.

వి :- 'ఏకాక్షరకతత్సమపదములందును దీర్ఘాంత దేశ్యపదములందును హ్రస్వరూపమగు నదాగమము రాదు' అని పై యథర్వణకారిక కర్థము.

'చింతామణిచొప్పున దీర్ఘాణాం హ్రస్వస్స్యా' త్తనుసూత్రముచే హ్రస్వము రానివానికి సంబోధనమునందును హ్రస్వరూపమగు నదాగమము రానేరదని భావము. 'దేశ్యపదమునం దొకానొకప్పుడు వికల్పముగా హ్రస్వమగు' ననునథర్వణవచనముచే నదాగమఘటితరూప

ముండునని తెలియుచున్నది. కవిశిరోభూషణ మీకారికను 'నచ దేశ్య పదే-నచైకవర్ణేఽపి' అనుదానికి వివరణమనుకొని దాని క్రింద వ్రాసినది, అది సరిగాదు. అట్లయినచోఁ జింతామణి చెప్పినవిషయము నే యథర్వ ణుఁడుగూడఁ జెప్పె ననవలసి వచ్చును. కాఁబట్టి దీని కదాగమపరముగా వ్యా.సం.స. వ్యాఖ్య వ్రాసినది. అట్లు సవరించుకొనుట యుక్తము.

134 సూ. 13 :- ననుః 'పల్లకీశబ్దస్య పల్లకీలు' ఇతి దీర్ఘాన్తత్వేఽపి కథం ప్రయోగ ఇతి చేత్-తద్భవస్యాపి శబ్దస్య దీర్ఘాన్తత్వం క్వచిద్భవేత్' ఇత్యథర్వణోక్త్యా తాదృశప్రయోగోఽసీ త్యవధేయమ్. హ్రస్వేకృతే 'పల్లకులు' ఇతి రూపమ్. ఆద్యా యామపి ప్రయుజ్యతే పల్లకీశబ్దః ప్రోల్లసత్ పల్లకీశబ్దై రిత్యాదివచనాత్.

వి :- 'పల్లకీ' శబ్దము 'పల్యంకికా' శబ్దతద్భవముగావున దీనికిఁ 'బల్లకీలు' అనురూప మెండు టెట్లని శంక కలుగఁగా 'తద్భవశబ్దములకు హ్రస్వము రాక దీర్ఘాంతత నిల్చుటయు నొకానొకచోఁ గవిప్రయోగ సిద్ధమగుచున్నది' అనునథర్వణవచనముచొప్పున నీరూపము సాధువగు చున్నది. ఇచ్చటఁ 'దద్భవస్యాపి శబ్దస్య దీర్ఘాన్తత్వం క్వచిద్భవేత్' అనియు, 'కథిత స్తద్భవస్యాపి దీర్ఘాన్తత్వం క్వచిద్భవేత్' అనియు రెండు పాఠము లగపడుచున్నవి. అర్థమునందుఁగాని, తాత్పర్యమునందుఁ గాని వీనికి భేదము లేదు, 'పల్లకులు' అనురూపముగూడ బహువచన మున దీనికిఁ గలదు. 'ప్రోల్లసత్ పల్లకీశబ్దైః' అనువచనమునుబట్టి పల్లకీశబ్దము సంస్కృతమునఁగూడఁ గలదని చెప్పఁబడుచున్నది.

134 సూ. 14 :- స్వయంభువు, రంభోరువు, జంబువు, అలాబువు, ఇత్యాదీని హ్రస్వే కృతే ఊకారాన్తరూపాణి ఉకారాన్తరూపవత్ జ్ఞేయాని. 'ఈటన్తా ఇద్వ దేవ కృతహ్రస్వాః' ఇత్యస్య పదోపలక్షణత్వాత్ సంస్కృతభాషైకాక్షరాణాం ఆదీదూతాం దేశ్యానా మాదీదూతాం చ 'సంబుద్ధౌ వాఽత్' దీర్ఘాణాం వికృతసన్ధా స్థానివత్త్వాభావాదితి వేదితవ్యమ్.

వి :- దీర్ఘాకారాంతశబ్దములకు హ్రస్వము చేయఁగా హ్రస్వాకారాంతములకు వచ్చుకార్యములను బొందును. 'ఈదన్తా ఇద్వదేవ కృతి హ్రస్వాః' అనుచోటఁ గల 'ఈదన్త' పదము దీర్ఘస్వరముల కన్నింటికి నుపలక్షణమని తెలియవలయును. సంస్కృతభాషలోనున్న యేకాక్షరశబ్దములగు నాదీదూదంతములకును సంబోధనమునం దదాగమము రాదు. ఈయంశము 'నైకవర్ణే న దేశ్యేఽపి హ్రస్వో దేశ్యేతు వా క్వచిత్' అను నథర్వణకారిక వచించుచున్నది. కవిశిరోభూషణము వీనికి హ్రస్వమగు నదాగమము రాకుండుటకుఁ జెప్పిన హేతువు వికృతి సంధియందు దీర్ఘములకు స్థానివద్భావము లేకుండుటయే యని చెప్పుట సరిగాదు. సంస్కృతవ్యాకరణప్రసిద్ధమగుస్థానివద్భావము దెనుఁగునందు వచ్చుట నన్నయాథర్వణులకు సమ్మతము గాదుగదా.

**135. సూ :- డా బవిధాత్రాదే రుః.**

135 సూ:- విధాత్రాదివ్యతిరిక్తాదృకారాన్తాన్నామ్నో డాప్ స్యాత్. పకార ఉచ్చారణార్థః. 'చుటూ' ఇతి డఇత్. హ్రస్వః. కర్త, భ్రాత ఇత్యాది.

వి :- డాప్, అవిధాత్రాదేః, ఉః- అని ఛేదము. విధాత్రాది గణమునందుఁ బఠింపఁబడిన ఋకారాంతశబ్దములుతప్ప మిగిలినఋకారాంతశబ్దములకు 'డాప్' అనుప్రత్యయ మాదేశముగా వచ్చును. ఇందు డకారపకారము లిత్సంజ్ఞకములగుట 'ఆ' అనునది మిగులును. కర్తృశబ్దమునకు ఋకారమున కాదేశముగా డాప్పును జేయఁగా 'కర్తా' అని యగును. దీనికి హ్రస్వము చేసి సులోపముచేయ 'కర్త' అనియగును. ఇట్లే తక్కినవియు నెఱుంగనగును.

**136. సూ :- తస్య చ వా.**

136 సూ. I :- తస్మాద్ విధాత్రాదేశ్చ వా డాప్ స్యాత్. విధాత, విధాతృఁడు; సవిత, సవితృఁడు. దాత, దాతృఁడు; ధాత, ధాతృఁడు; నేత, నేతృఁడు;

ఇత్యాది. డాబభావపక్షే ఋదన్తాదపి ఙుజః ప్రాప్తిరస్త్యేవ. 'మహాతస్సో ర్ధ జనితో భవే త్పుంసి' ఇతి సామాన్యవచనాత్.

వి :— తస్య, చ, వా— అని ఛేదము. విధాత్రాదిగణమనియు నవిధాత్రాదిగణమనియు ఋకారాంత సంస్కృతశబ్దములు రెండు విధములుగాఁ దెలుఁగువ్యాకరణమునందు సంకేతింపఁ బడినవి. అవిధాత్రాదులకు డాప్ ప్రత్యయము వచ్చి మాత, పిత, మున్నగురూపములు గల్గుచున్నవి. ఈడాప్పు స్త్రీప్రత్యయమగుటచే నేతదంతమునయున్న ప్రథమైక వచనప్రత్యయమునకు లోపము గల్గును. "విధాతా సవితా ధాతా దాతా నేతా చ వా ఙుజ్" అను నథర్వణవచనముచొప్పున నీయైదు శబ్దములకును డాప్ ప్రత్యయము వికల్పము. అది రానపుడు ఙుజ్వర్ణకముతో రూపము లేర్పడును. కావున వీనికి రెండేసి రూపములు గల్గును.

136 సూ. 2 :- నచోత్వస్య సన్నియోగశిష్టత్వమ్, తత్ర మహాత్పదస్యైవ జ్ఞాపకత్వాత్. యది సన్నియోగశిష్టత్వం తదైకవాక్యత్వేన తదనువృత్తిరస్త్యేవేతి పునస్తద్గ్రహణం ముధా స్యాత్. విభక్తావితి నిమిత్తనిర్దేశా దుత్వస్య తు ఙుజ్ సమ్బన్ధ ఆవశ్యకః. తస్మాత్ విధాత్రుఁ డిత్యాది ఙుజన్తం రూపం నిర్వివాదమ్.

వి :— 'మహాతోఽత ఉద్విభక్తౌ'; 'మహాత స్సోర్ధ జనితో భవేత్పుంసి' అనుదానియందు మహాతః అనుపదమును రెండుసార్లు పఠించుటచే నిందు రెండువాక్యములు గలవు గాని యేకవాక్యము గాదని తెలియుచున్నది. కాన ఉత్వఙుజ్జులు సన్నియోగశిష్టములు గావు. కాఁబట్టి డాప్రత్యయము రానపు డుత్వము రాకున్నను ఙుజ్జు వచ్చి విధాత్రుఁడు మున్నగురూపములు సిద్ధించుచున్నవి.

**137. సూ :— తా వుభౌ రమేశసమౌ.**

137 సూ. 1 :- ఙుజన్తఋకారాన్తౌ క్రమాద్రమేశ శబ్దతుల్యౌ భవతః. ఉదాహరణం తూక్తమేవ. అత్రేద మవధేయమ్. డాబన్తస్య[ర]మాశబ్దతుల్యత్వానుశాసనం నులోపార్థమ్ ఋకారాన్తస్య ఈశశబ్దతుల్యత్వానుశాసనంతు స్పష్టార్థమేవ నడుజర్థమ్;

డుబః ప్రాప్తేరుక్తత్వాత్. నాపి విధాతృనకాన్, ఇత్యత్ర నవర్ణకప్రాప్త్యర్థమ్; ప్రాప్తౌ విరోధాభావాత్. విధాతృనందనన్, ఇత్యాదౌ నుమః ప్రాప్తిస్తు 'నుమ్చేతి' చకారేణైవ భవతి. 'దేవిగాఁ బ్రీతితో దీనిఁగావించెద ననియున్నచో విధాతృనకు నిట్లు, ఇత్యాద్యాచార్య ప్రయోగః.

వి :— తౌ, ఉభౌ, రమేశసమౌ—అని ఛేదము.

డాబన్తాడాబన్త ఋకారాంతములు వరుసగా 'రమ, ఈశ' శబ్దతుల్యములై వెలయుచుండును—అని యర్థము. రమాశబ్దతుల్యత్వము సులోపార్థము విధింపఁబడినదని కవిశిరోభూషణము వ్రాసినది. అది సరిగాదు. స్త్రీప్రత్యయమగు 'డాప్' ప్రత్యయాంతమునకు సులోపము రాకుండుట యెట్లు? స్త్రీలింగశబ్దములు పుంలింగముల కతిదేశములు కాకుండరావు. కాన 'రమా' శబ్దతుల్యత యతిదేశింపఁబడినది. ఈశశబ్దతుల్యత్వానుశాసనము డుజ్ వర్ణకమునిమిత్తమే. ఇచట నుత్వము రాకున్నను డుజ్జు వచ్చుచున్నదిగదా! డుజ్జున కుత్వసన్నియోగశిష్టత్వము లేకున్నను డుజ్ సన్నియోగశిష్టత్వమునకుఁ గల్గునని కవిశిరోభూషణము వ్యాఖ్యానించెను. అదియు సరిగాదు. ఉత్వము లేకుండఁగనే యిచట డుజ్జు రావలెను గాన 'ఈశ'శబ్దతుల్యత్వానుశాసనముచే నది సిద్ధించినదని తెలియువలెను.

137 సూ. 2 :- 'విధాతా సవితా ధాతా దాతా నేతా చ వా డుజి భవన్తి సవిధాత్రాదిః తదన్యేన డుజి స్థితాః' ఇతి ద్వితీయాచార్యః. "నౠదన్తశ్చ ఌన్తశ్చ న్యేదన్తశ్చాత్ర విద్యతే" ఇతి తేనైవోక్తమ్. ౠదన్తాః 'కౄ, తౄ' ఇత్యాదయః, ఌదన్తాః 'గమ్ఌ, శక్ఌ' ఇత్యాదయః; ఏదన్తాః 'నే' ఇత్యాదయ ఇతి జ్ఞేయాః.

వి :— విధాత్రేతి కారిక యీవఱకు వివరింపఁబడినది. "ౠకారాంతము ఌకారాంతము, నేకారాంతము నగుసంస్కృతశబ్దములు తెలుఁగునకుఁ దత్సమములుగా రావు"— అనునథర్వణవచనముచొప్పునఁ దత్తదంతము లగుశబ్దములు తెలుఁగునందుఁ దత్సమములుగా రావని తెలియవలయును.

సూరిగారీవిషయములను 'ఋకారంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు' (బాల. తత్స. 52) విధాతృధాతృదాతృసవితృనేతృశబ్దములకు మహత్తుల కత్వస్త్రీవద్భావములు విభాష నగు (బాల.తత్స.50) అని వివరించిరి.

**138.** సూ :— క్వచి దమహతోఽపి డుజ్ స్యాత్.

138 సూ :- క్వచి దమహాన్నామ్నోఽపి డుజ్ స్యాత్. అపిశబ్దా దేకాదేరపి. 'వన మొక్కఁడు, పులియఁడు, ఒక్కఁడు' ఇత్యాది. ఒక్కండు సెప్పెదన్-ఇత్యాది వచన మాచార్యస్య. అశ్వవాచకానాం కత్తళాదిశబ్దానాం 'కత్తళఁడు, జన్నఁడు' ఇతి రూపమ్.

వి :— క్వచిత్, అమహతః, అపి, డుజ్, స్యాత్-అని ఛేదము. మహద్వాచకములకు విధింపఁబడిన డుజ్ప్రత్యయము క్వాచిత్కముగా నమహద్వాచకములకును వచ్చును. అపిశబ్దప్రయోగస్వారస్యముచే నీడుజ్జు ఏకాదిగణగణితశబ్దములకును వచ్చునని వ్యాఖ్యానింపఁబడినది. ఉదాహరణములు మీఁద స్పష్టములు.

**139.** సూ :— ఏకాదే రమహతాం చ డా వున్న.

139 సూ 1 :- ఏకాదే రమహన్నామ్నాంచ డుజ్ పరే ఉత్వం న 'ఒక్కఁడు పురుషుఁడు, మెరియఁడు; సురియఁడు' ఇత్యాది.

వి :— ఏకాదేః, అమహతాం, చ, డౌ, ఉత్, న-అని ఛేదము. ఏకాదిగణములోని శబ్దములకును గొన్ని యమహద్వాచకశబ్దములకును డుజ్జు పరముగా నున్నప్పటికి నుత్వము రాదని యర్థము.

139 సూ. 2:- అత్రామహతాన్నాత్వనిషేధో న్యాగమప్రాప్తౌ పర్యవస్యతి. తేన వన మొక్కనిన్ కయిరనిచేతన్, ఇతి రూపం సిద్ధ్యతి.

వి :— అమహత్తులకుఁ బ్రాప్తింపని ఉత్వమును నిషేధించుట వానికి నిగాగమప్రాప్తి కవకాశ మిచ్చుచున్నది. కాన, ఒక్కనిన్, కయి

రనిన్-మున్నగురూపములు సిద్ధించుచున్నవి. డుమంతములకు వచ్చు కార్యములలో నుత్వముమాత్రమే నిషేధింపఁబడుటచే వానికి వచ్చు నిగాగమాదులు రావచ్చునని తెలియుచున్నదిగదా!

139 సూ. 3 :- 'విశేషణానాం మహతో డుజ్ఞి ఉభయథాపి చ। క్వచిద్డుజ్మాత్రకే స్వార్థవిశేషణ మిహోచ్యతే' ఇత్యథర్వణః. ఉభయథాపిచ మహద్రూప మమహద్రూపం చేత్యర్థః. 'వన మెుక్కఁ డధికరమ్యము' ఇత్యుత్తరార్ధే ఉదాహరణమ్. క్వచిత్ గ్రహణాత్ 'వన మెుక్కటి, కత్తళము' ఇత్యాదిరూపమ్.

వి :- 'ఏకాదిగణపఠితశబ్దములకుఁ గొన్నియమహన్నామముల కును 'డుజ్ఞు' పరమగునపుడుగూడ నుత్వము రాదు' - అని యమహద్వాచకముల కుత్వప్రాప్తి లేకున్నను నిషేధించుటచే వానికి నిగాగమప్రాప్తి నదిసూచించుచున్నదిగదా! ఆవిషయమునే యథర్వణాచార్యులుగారు వివరించుచున్నారు. 'ఆచ్ఛికము లగు మహద్వాచకములకు విశేషణము లగుసంస్కృతశబ్దములు డుజ్వర్ణకనిగాగమముల నొందును. అట్టివిశేష్యనిఘ్నములకు డుమంతత్వ మువర్ణకాంతత్వములు రెండును విశేష్యములయొక్క మహత్త్వామహత్త్వములనుబట్టి కల్గును. ఆచ్ఛికవిశేష్యమాత్రమున స్త్రీసమత్వ మనుదానికిని విశేషణ మగు సంస్కృతసమశబ్దమునందు మువర్ణకమును నిల్చును.' ఈయథర్వణకారిక 'విశ్రుతౌచ స్త్రీలింగాః' అనుదానికి వివరణమైనట్లు తోఁచుచున్నది.

139 సూ. 4 :- 'మగఁడు, అతఁడు, ఇతఁడు, ఎవ్వఁడు, గొల్లఁడు, మనుమఁడు, ఱేఁడు, అబ్బఁడు, అప్పఁడు, మిండఁడు, గండఁడు' ఇత్యాదీనాం 'గంగఁడు, మంగఁడు, సింగఁడు' ఇత్యాదిజననామ్నాంచ ఏకాదిత్వమేవ ఉత్వనిషేధార్థమ్. 'బావ, హనుమ, రాయాది' శబ్దానా మప్యేకాదిత్వమ్.

వి:- మగఁడు మున్నగునవియు గంగఁడు మున్నగుజననామములును బావ-మున్నగునవియు నేకాదిగణములోని వగుటచే వీని కుత్వము రాదు. డుజ్ఞు నిగాగమముఁను వచ్చును. ఈవిషయమును "మహత్తులగుమగాదులకుం గైరాదులకును డు గు ను త్త్వంబు గాదు" (బాల. ఆచ్ఛి-4సూ) అని సూరిగారు దీనిని వివరించిరి.

139 సూ. 5 :– ‘బల్లిదుఁడు, చెలువుఁడు, నెయ్యుఁడు, కుచ్చితుఁడు, అల్లుఁడు, పాఱుఁడు, మార్తుఁడు’ ఇత్యాది శబ్దానాం మహతస్సో రిత్యనేన డుజ్. ‘కొడుకు, కొడుకఁడు, ముదుకు, ముదుకఁడు’ ఇత్యాదౌ రూపద్వయమపి.

‘హితాః ప్రత్యయభేదేన శబ్దా ఏకార్థవాచకాః’ ఇత్యథర్వణోక్తేః కేషాంచిదమహత్త్వే ‘బల్లిదము చెలువ. చెలువము, నెయ్యము, ప్రల్లదము, కుచ్చితము,’ ఇత్యాది రూపమ్. అతఏ వాథర్వణేనోక్తమ్.

‘కేచిత్తు వైకృతాశ్శబ్దాః పుంసి చాన్యత్ర సజ్జతాః’. ఇతి. ‘నెయ్యుఁడై పూజించెన్’. ఇత్యాద్యాచార్యవచనమపి.

వి :– ‘ఒకయర్థమునే చెప్పుశబ్దములు ప్రత్యయభేదముతో నీవికృతి భాషలో సమ్మతమగును’ అను నథర్వణవచనముచే ‘కొడుకు, కొడుకఁడు’ మున్నగురూపములు సిద్ధించుచున్నవి. ‘కొన్నివైకృతశబ్దములు పుంలింగమునందును మిశ్రతయందును వర్తించుచున్నను నథర్వణ వచనముచే బల్లిదము, చెలువము మున్నగురూపములు సిద్ధించుచున్నవి.

139 సూ. 6:– నను ‘పాఱు’ శబ్దస్య యది తద్భవత్వం తర్హి గురురేఫః కథమితి చేన్నైష దోషః. ‘ఉక్కెఱ, కఱకు, మొఱకు’ ఇత్యాది తద్భవేష్వపి తచ్ఛ్రవణాత్. అతఏ వాథర్వణః లక్ష్యానురోధేన ఉచ్చారణస్య కల్ప్యత్వ మాహ.

వి:– శకటరేఫము ద్రావిడభాషాసంబంధి యగుటచే నది యార్యభాషాసంబంధులగు సంస్కృతతద్భవములం దుండదని యాంధ్ర లాక్షణికులు నుడివిరి. దానికి విరుద్ధముగాఁ గవిశిరోభూషణము తద్భవములలోఁగూడ శకటరేఫ ముండవచ్చునని చెప్పుచున్నది. దానికి నిదర్శనముగా ‘ఉక్కెఱ, కఱకు, మొఱకు’ అను తద్భవరూపములు పెక్కింటిలో శకటరేఫ మగుపడుచున్నదని చెప్పినది. అథర్వణుఁడు లక్ష్యానురోధముగానుచ్చారణమును గల్పించుకొనవచ్చుననుట దీని కాధారమనియుఁ జెప్పినది. ‘ఉచ్చారణస్య కల్ప్యత్వాన్నిదానం తత్ర సద్వచః’ అను నథర్వణవచనముచే మహాకవిప్రయోగమే యట్టియుచ్చారణము గల్పించుట కాధారమని తెలుచున్నది. మహాకవిప్రయోగప్రామాణ్యము లేదు గానఁ గవిశిరోభూషణ మిట్లు చెప్పుట సరిగాదు.

139 సూ. 7 :- ఏకాదిగణేఽపి కస్యచిత్ ప్రవేశోఽప్రవేశశ్చేతి లక్ష్యానురోధాద్రూప మవగన్తవ్యమ్. అత్రాథర్వణః "భవే త్తదాదిశబ్దేభ్యో డుశ్చిరస్తు భవేన్నచోత్। జసఃస్థానే రురత్ర స్యా త్క్వాచిదుత్వం భవేల్లులే. ఏకత్వేచ భవేద్వా రుస్తథా లౌచ భవేత్క్వాచిత్" 'వాఁడు, వీఁడు, వారలు, వీరలు, ఎవ్వాఁడు, ఎవ్వారు; హ్రస్వః- ఎవ్వఁడు, ఎవ్వరు; స్త్రియామపి బహువచనే 'వారు' ఇత్యపి రూపమ్ 'కూఁతురు, కూఁతులు, కూఁతురులు' ఇత్యాది.

వి :- "భవే త్తదాదిశబ్దేభ్యో" అనుచోట 'భవే త్తదాది శబ్దేభ్యో' అని పఠించుట మంచిదని వ్యా.సం.ప. చెప్పుచున్నది. ఆ-ఈ-ఏ శబ్దములకు వకారము పూర్వాగమ మగుననియు వానికి 'డుజ్' 'ని' మున్నగునవి వచ్చుననియు, ఉత్వము మాత్రము రాదనియు నర్థము. ఈ తదాదిశబ్దములకుఁ బ్రథమాబహువచనమున లు ప్రత్యయస్థానమున 'రు' వర్ణక మాదేశమగును. 'లు, ల' లు పరమగునపుడు, అరుదుగా 'రు' వర్ణకమును ఉకారమున కత్వమును వచ్చును. ఏకవచనమునందును వికల్పముగా రు వర్ణాగమ మగును. 'బహువచన 'లు'ప్రత్యయపరకత్వమునను గ్వాచిత్కముగా 'రు' వర్ణాగమము వచ్చుటగలదు' అనునథర్వణవచనముచేఁ బై రూపము లన్నియు సిద్ధించుచున్నవని తెలియవలెను. చింతామణి 139 సూత్రము నథర్వణకారికలు పెక్కింటితోఁ గలిపి కవిశిరోభూషణము 10 విభాగములలో విస్తరించినది. ఆ విషయములఁ గొన్నింటిని బాలవ్యాకరణము వివరించినది. "కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు 'రు' వర్ణకం బగు. (బాల-ఆచ్ఛిక-9 సూ) పగతాదుల బహువచనలకారంబునకు రేఫం బగు. (బాల-ఆచ్ఛిక-5 సూ)

139 సూ. 8 :- "ఏకత్వేచ బహుత్వేచ సమ్బద్ధే 'ది, వి' వర్ణకౌ। తయోశ్చసాదౌ రే మాత్ర ఉదతోః ప్రాయశోఽత్ర ఇత్".

వారిది, వారివి, వారిన్, వీరిన్, వారిచేతన్, ఆలిన్, ఆలిచేతన్, ఇత్యాది. వారిమాత్రంబు, వారిగుణములు. అతస్తు అక్కడివారు, ఇక్కడివారు; తోడివారు; 'తోడివారలు నవ్వనాతోడన్' ఇత్యాది కవిప్రయోగః. 'తోడికోడలు, తోడిచెలులు. అయంశబ్దః సహచరశబ్దపర్యాయః. ప్రాయోగ్రహణాత్ 'తోడఁబుట్టువు' ఇత్యాదౌ న. అయంశబ్దః సహజన్మపర్యాయః.

వి :- "సంబంధివస్తువుల కేకత్వమునను బహుత్వమునను సంబంధార్థమున 'ది వి' యనువర్ణకములు వచ్చును. సంబంధివస్త్వమహత్వమున నివి వరుసగా వచ్చును. ఈ సంబంధమున నేకవచనమునందు, 'ఆలు' ప్రభృతిశబ్దములయుఁ 'గూఁతురు' అనుదానికినిఁ జివఱ నున్న ఉకారమునకు ద్వితీయాదివిభక్తుల బహువచనమునందలి 'రు' వర్ణకము మీఁదనున్న 'ఉ' కారమునకుఁ దఱచుగా హ్రస్వేకార మాదేశమగు" నను నథర్వణవచనముచే మీఁదిరూపములు సిద్ధించుచున్నవి. వారిది - వారివి - అనునవి 'ది - వి' వర్ణకోదాహరణములు. వారిన్ వీరిన్ మున్నగునవియు - ఆలిన్ మున్నగునవియు ఉకారమున కికారము వచ్చుట కుదాహరణములు. అకారమునకైనచో అక్కడివారు, తోడివారు, తోడికోడలు, తోడిచెలులు మున్నగునవి యుదాహృతులు.

139 సూ. 9 :- "అద్విత్వంచ భవేద్ద్విత్వం దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్" ఒక్కఁడు,ఒకఁడు; ఎవ్వఁడు, ఎవ్వాఁడు-ఇత్యాదికంరూపం సర్వత్రజ్ఞేయమ్. ఏతత్సూత్రేణైవ అందోలు, ఒక్కొఁడు, ఇత్యత్రోకారశ్చ. 'చోటు' ఇత్యత్ర హ్రస్వోఽపి కవివాక్యారూఢ స్సాధుః. ఈతఁడు, ఇతఁడు; పయ్యెద, పైయెద; సయ్యాటము, సయాటము; గయ్యాళి, గయాళి; ఒయ్యారి, ఒయారి; నువ్వు, నూవు; నూఁబూవు, నూఁబువ్వు; పూవు, పూవెంగ; నవ్వు, నవు; దవ్వు, దవు; ఇత్యాదీని రూపాణి సామంజస్యం లభన్తే. 'నిలుగుచు, నావులించుచున్' ఇతి మనుచరిత్రపద్యే 'హ్రస్వోఽత ఏవ సాధుః. పూఁబోదలం ఇత్యత్ర పూవు శబ్దస్య 'పూ' నిత్యాదేశః. ఊదన్తా న్నమాఽసంధి వాదితి జ్ఞేయమ్.

వి :- "ద్విత్వము లేనివానికి ద్విత్వము వచ్చును; అట్టియెడ ముందటి దీర్ఘమును గొన్నియెడల హ్రస్వమగును. చకారముచే ద్విత్వపూర్వము గానిదాని కొకప్పుడు హ్రస్వము గల్గునని వ్యాఖ్యానింపనగును" అనునథర్వణవచనముచే ఒక్కఁడు, ఒకఁడు, ఎవ్వాఁడు, ఎవఁడు; ఈతఁడు, ఇతఁడు, సయ్యాటము, సయాటము మున్నగురూపములు సిద్ధించుచున్నవి.

139 సూ 10 : "ద్యన్తా త్తదాదిశబ్దా త్స్వ్య ద్బహుత్వే తు విపర్ణకః। దేని ర్దానిర్దిని రమి వేన్యాది శ్వసి తూచ్యతే. జసిచాత్ర భవే దేని రిత్యాహ మృదుభాషణః. న స్త్రియా మత్తు టాజ్ఙ్యోశ్చ దాన స్సంబోధనాదికే" ఇతి.

ఏది, అది, ఇది, ఇయ్యది, అయ్యది, ఎయ్యది, నాయది. స్త్రియాం విపర్ణకో న. అవి, ఇవి, ఎయ్యవి, ఇయ్యవి, ఎంతేనియున్, ఎయ్యేనియున్, ఎద్దియేనియున్ ఇత్యాదావప్యర్థక 'ఏని' శబ్దః. "దానింబుచ్చుకొనువిధంబు, అయ్యేనేని దాని ననుభవింతు" ఇత్యాద్యాచార్యవచనమ్ ఏకారాదిపూర్వకత్వే 'ఎద్దానిన్, అద్దానిన్' ఇద్దానిన్'. ఇతి రూపమ్. 'వేనింజూచి, వానింజూచి, వీనింజూచి.' న స్త్రియా మిత్యస్య ఉభయత్రా ప్యన్వయః. ఏతే శబ్దా ఆచార్యగ్రన్థే వర్తన్తే. 'వేటిన్, వాటిన్, వీటిన్' ఇతిపర్యాయపదాన్యపి దృశ్యన్తే. తాని దేశ్యాని గ్రామ్యాణి. మృదుభాషణీయం రూపంతు న ప్రసిద్ధమ్. 'దానంజేసి, దీనంజేసి' ఇత్యాది. న స్త్రియా మేతద్రూపమ్. 'ఒక్కరులపాంసుచేసినదాన' ఇత్యాద్యా ఆచార్యవాచః. 'దానన చేసి' ఇత్యాదానాత్ర ద్రుతకార్యమ్. అత్వేన వ్యవధానాదితి తత్వమ్. సమ్బోధనే 'ఓచిన్నదాన' ఇత్యాది. ఆదిశబ్దేన, ఉత్తమాది గృహ్యతే. 'వచ్చినదానన్, పోయినదానవు' ఇత్యాది.

వి :— 'జసి చాత్ర భవే దేని రిత్యాహ మృదుభాషణః' అను పాఠము "జసి చాత్ర భవే దేసి రిత్యాహ మృదు భాషణః" అని యుండఁదగునని వ్యా.సం.స. చెప్పుచున్నది. వేటిన్, వాటిన్-అనునవి గ్రామ్యములగుటచే వాని ప్రశంసయే మన కిచ్చట నవసరము లేదు.' జసిచాత్ర భవే దేసః' అని మృదుభాషణుఁడు చెప్పెను గదా! 'మృదుభాషణీయం రూపంతు నప్రసిద్ధమ్' అని కవిశిరోభూషణము చెప్పినది. పాఠము తప్పైనవు డట్టిరూపములకుఁ బ్రసిద్ధియుండదు గదా! 'ఏసిః' అని పఠించినచో 'ఇంతలేసి - అంతలేసి' అనురూపము లుండునని యూహింపవచ్చును. 'అది, ఇది, ఏది' అని దివర్ణాంతములగు అ - ఈ - ఏ శబ్దములకంటెఁ బరముగాఁ బ్రథమైకవచనమునందు 'ద' వర్ణకము వచ్చిన రూపము లేర్పడుచున్నవి. బహువచనమున 'వి' వర్ణకముతో 'అవి, ఇవి, ఏవి' అని యగుచున్నవి. దీనిస్వారస్యముచేతనే తదాది శబ్దము

లకుఁ బ్రథమైకవచనమున 'ది' ప్రత్యయము విధింపఁబడుచున్న దను నర్థము లభించినది. ద్వితీయైకవచనము పరముగు చుండఁగా ఆ - ఈ - ఏ - అనువానికి వరుసగా 'దాని, దీని, దేని' అనునవి యాదేశము లగుచున్నవి తృతీయాద్యేకవచనములందును నుపలక్షణముచే నివి గల్గు చున్నవి. బహువచనమున వీనికి వరుసగా 'వాని, వీని, వేని' అని యాదేశము లగును. తృతీయాదులలో 'వానిచేతన్' మున్నగు రూపములు లాక్షణికములు. ఈ మానవాచకములలో 'లు' ప్రత్యయముమీఁద 'వసి' వర్ణకమగునని మృదుభాషణుఁడనుపండితుఁడు పల్కుచున్నాఁడు. స్త్రీత్వవాచకమునందు 'వి' వర్ణకమును వాన్యాదులును గలుగవు. మహద్వాచకకార్యములు పరిశేషన్యాయముచే సిద్ధించునని చెప్పన గును. తృతీయాసప్తమ్యేకవచనములందును దద్బహువచనములందును నీతదాదుల కత్వము కల్గును. సంబోధనాది స్థలములం దేకత్వమున 'దాన' శబ్దము నిల్చును. విశేషణములతుదినిగూడ 'దాన' యనునది నిల్చును. ఈ విషయము లన్నియును బాలవ్యాకరణములోఁ గొన్ని యాచ్ఛికమునను గొన్ని ప్రకీర్ణమునను, ప్రౌఢవ్యాకరణము లో శబ్దపరి చ్ఛేదమునఁ గొన్నియు వివరింపఁబడినవి.

**140.** సూ :- స్త్రీత్వబహుత్వే సురాదే రసమాసే.

140 సూ. 1 :- సురాదే ర్మహతః బహుత్వం స్త్రీవద్రూపంచ స్యాత్; నతు సమాసే. 'సురలు' 'చకోరకములు భూతధాత్రికి సురల్ దివికిన్' ఇతి కవితాపితామహః. అస్య స్త్రీత్వబహుత్వయోరేవ ప్రయోగః. సమాసేతు 'భూసురుఁడు' అసురేతి స్త్రీసమ ప్రయోగస్తు 'ఈయగ్నిదేవుఁడసురికి', 'పావకసముఁ జూచుచు నసుర భస్మసాత్కృతుఁడయ్యె' ఇత్యాద్యాచార్యప్రయోగాత్. ఏతత్ప్రయోగబలేనైన ప్రపూర్వసూత్రాత్ క్వచిదిత్యనువర్త్య క్వచిత్సమాసేఽపి స్త్రీత్వమితి వ్యాఖ్యానాత్ 'మహారోధుఁడు' మహాశుంఠేత్యాదిరూపం సిద్ధమ్. కిఞ్చ స్త్రీత్వబహుత్వయోః క్వచిదేకత్ర నివేశః. క్వచిత్ స్త్రీత్వస్య సార్థక్యేన వ్యాప్తి రన్వేయా. తేన యోధశుంఠేత్యాద్యాః స్త్రీసమాస్సిద్ధాః. ఏవంవ్యాఖ్యానఏవ సురాదే ర్గణత్వం సిద్ధ్యతి. ఆదిశబ్దస్య సార్థక్యంచ భవతి. శాస్త్రస్యాల్పవిషయతాదోషోఽపి నిరాకృతో భవతీతి కృతబుద్ధయో విదాంకుర్వన్తు.

వి :— స్త్రీత్వబహుత్వే, సురాదేః, అసమాసే - అని ఛేదము. మహద్వాచకము లగుసురాదిగణపఠితము లగుశబ్దములకుబహువచనాంతత్వమును స్త్రీసమరూపమును గల్గును. సంస్కృతసమాసమునం దట్టి రూప ముండదని యర్థము. సంస్కృతసమాసమున 'భూసురుఁడు' అనియే యుండును. 'అసుర' అను స్త్రీసమరూపము నన్నపార్యప్రయుక్త మగుటచే సాధువగును. దీనిని 'స్త్రీత్వబహుతే' అని పఠింపనగుననియు సురాదేః అనుదానికి 'సుర' అనునది యాదియందుఁ గలశబ్దమనియు వ్యా.సం.స. వివరించినది.

దీనిని బాలవ్యాకర్త స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపఁబడు' (బాల. తత్స. 58) అని వివరించెను.

140 సూ. 2 :- "యోధాసురాదిశబ్దానాం స్త్రీసమత్వ మపీష్యతే। చరితాదిక శబ్దానాం రూపం తూభయథా భవేత్ -ఇత్యథర్వణః.

వి :— 'యోధ, అసుర, మున్నగు శబ్దములకు స్త్రీసమత్వమును సమ్మత మగుచున్నది;' అను నథర్వణవచనముచే 'యోధ, అసుర' మున్నగు స్త్రీసమరూపములు సిద్ధించుచున్నవి. వీని కేకవచనబహువచనములందు స్త్రీసమత్వము వికల్పముగా నగునని తెలియవలెను. 'చరిత' మున్నగుశబ్దములకు 'ము' వర్ణకలోపతదభావరూపద్వయము ముండును' అను నథర్వణవచనముచే 'చరిత, చరితము' మున్నగురూపములు సిద్ధించుచున్నవి. వీనిని బాలవ్యాకరణము 'సురశబ్దంబు నిత్యంబుగా, నసురశబ్దంబు వైకల్పికముగా స్త్రీతుల్యంబు లగు; సంస్కృతసమాసంబునఁ గావు' (బాల. తత్స. 60) అనియు; 'చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు' (బాల. తత్స. 58) అనియు వివరించినది.

140 సూ. 3:— నచైవం సురాదేః స్త్రీలింగవిశేషణప్రయోగాపాతః. ఆచార్యేణ దుబన్తభేదస్యైవ ప్రయుక్తత్వాత్. 'విశేష్యమాత్రే స్త్రీతా స్యాద్గుణ్యా స్యా

తా స్తు భేదకే' ఇత్యథర్వణాచార్యవచనాచ్చ. అతో 'మహానుభావులైన సురలు' 'అధికులైన యోధలు, సుందరుల్ దగుచందమామ, గురుతరంబు లైన కొండలనీదలన్' ఇత్యాది రూపాణ్యేవ సాధూని.

వి :- సురాదులకు స్త్రీత్వ మున్నంతమాత్రముచే వానివిశేష ణములకుఁగూడ స్త్రీత్వ ముండునని యనుకొనరాదు. నన్నపార్యుఁడు సురాదులవిశేషణములను డుజంతములుగనే ప్రయోగించినాఁడు. కావున నథర్వణాచార్యులుగారు, 'ఆచ్ఛికవిశేష్యమునందుమాత్రమే స్త్రీసమత్వము గల్గును - మహత్ స్త్రీసమవిశేషణమునందు డువర్ణక మును, అమహత్ స్త్రీసమవిశేషణమునందు 'ము' వర్ణకమును నిల్చు' నని చెప్పుచున్నారు. కావుననే 'మహానుభావులైన సురలు'మున్నగునవి సిద్ధించుచున్నవి.

ఈ సూత్రమును వివరణకర్త లందఱు నొక్కరీతిగనే వ్యాఖ్యా నించిరి. కాని వ్యా.సం.స. మాత్రము "సిద్ధసమాసేతరస్థలమున సుర, అనునది యాదియందుఁ గలశబ్దమునకు నిత్యముగా స్త్రీసమత్వబహు వచనాంతత్వములు కల్గును' అని వ్యాఖ్యానించినది. సురలు అని యుదాహరణము. అసుర-అనునది సిద్ధసమాసగత మగుటచే అసు రుఁడు-అసురులు-అనియు నుండవచ్చును. కావుననే యథర్వణా చార్యులుగారు - యోధాసురాదిశబ్దములకు వికల్పముగా స్త్రీసమ త్వము కల్గును-అని సూచించినారని వివరించినది.

బాలవ్యాకరణము, విశేషణ విశేష్యభావమునుగుఱించి కారక పరిచ్ఛేదమున సూ. 26 నుండి 31 సూత్రమువఱకును విపులముగా వివ రించి చెప్పినది. ప్రౌఢ. శబ్దపరిచ్ఛేదమునందు మొదటి 12 సూత్రము లలో సవిమర్శముగా నీవిషయమును వివరించినది.

**141 సూ. :- లు గ్భవేత్ కుశాదే ర్మోః.**

141 సూ :- కుశాదే ర్మువర్ణకస్య లుక్ స్యాత్. హంస, కుశ, దర్భ, దూత,

దూతశబ్దస్య జనశబ్దవ దమహద్వివక్షాయా మత్ర స్థితి రస్తేయా. 'నిత్యసత్యవ్రత నిషధేశ నీవు మా కమరంగ దూతవై యభిమతంబు' ఇత్యాద్యాచార్యప్రయోగః. 'చరిత చరిత్ర, భ్రమ, అభిలాష, విజృంభణ, అక్షత, పులక, అలక, తరంగ, వేగ, వంద, పనస, స్ఫురణ. ఘోషాదీనా కుశాదిత్వేనైవ మోర్లోపః. 'అమలచరిత నేలి, పాండ వోత్తమలచరిత్ర' ఇత్యాద్యాచార్యప్రయోగశ్చాత్ర మానమ్. కుశాదే స్స్వరితివ క్తవ్యే మోర్లుగితి కథనేన లుకో౽నిత్యత్వం జ్ఞాయతే. తేన, 'హంస, హంసములు, రాజ హంసములు' ఇత్యాదిరూపం సిద్ధ్యతీతి జ్ఞేయమ్.

వి :- లుక్, భవేత్, కుశాదేః, మోః - అని ఛేదము. నన్న పార్యుఁడు కుశాదిగణగణిత శబ్దములయొక్క ముపర్ణకమునకు లోపము నిత్యముగా విధించినను నది ప్రయోగములలో వికల్పముగా నుండు టచేఁ గవిశిరోభూషణము దానిని సాధించుటకు,'కుశాదేస్స్వరితి వ క్తవ్యే మోర్లుగితి కథనేన లుకో౽నిత్యత్వం జ్ఞాయతే' అని వ్యాఖ్యానించినది. కాని యాకారికయందలి క్వచిత్ - అనుదానిచే 'ము' వర్ణకలోపము క్వాచిత్క మనుట లెస్స.

కుశాదిగణములోనిశబ్దముల మువర్ణకమునకు లోపము నిత్య మని చింతామణి చెప్పియుండుటచేఁ జరితాదిగణగణిత శబ్దముల మువ ర్ణకమునకు లోపము వికల్పమని యథర్వణాచార్యులుగారు వచించి యున్నారు. కాని కవిశిరోభూషణ మీరెంటిని గలిపి వీనికి మువర్ణక లోపము వికల్పమని వ్యాఖ్యానించినది. ఇట్టివ్యాఖ్యానమునకు-కుశము-మున్నగురీతి ప్రాచీనప్రామాణికప్రయోగములు మాత్రము లేవని వ్యా. సం.గ. చెప్పినది.

**142. సూ :- షష్ఠీవిశేషణానాం ప్రథమా స్యాత్.**

142. సూ :- స్పష్టమ్. విశేషణానామితి బహువచనేన ప్రయోగబాహుళ్యం సూచ్యతే. 'అపటిలాత్ముఁడు శ్రీరామునికి వినతులు' ఇత్యాది. "సర్వవిభ క్తి స్సం స్కృతతుల్యా" ఇతి నిత్యం షష్ఠ్య న్తత్వే ప్రథమావిధానాత్ ఉభయమప్యస్తీతి జ్ఞేయమ్.

"విభాషయా సుపన్తం స్యా దత్ర షష్ఠీవిశేషణమ్
భ్వాద్యర్థవ్యవధానే తు ఛేద్యస్య నిఖిలం భవేత్"

ఇత్యథర్వణః. 'రక్షకత దాల్చు శ్రీరఘురాముచేతఁ బోషితులమైన మముఁ జెందు భూరిసుఖము' ఇత్యుత్తరార్ధోదాహరణమ్. 'ఉద్దండగండక పేదండవరాహ హాహారిపుఖడ్గవ్యాఘ్రము మిమ్మంచుకొండసు రాఁజెల్లునె' ఇత్యాదయః కవీనాం ప్రయోగాః. విశేష్యస్యాభిన్నత్వే౽పీదం విశేషణమ్ 'ప్రల్లదుఁడైన యొక్కకులపాంసను చేసినదానఁ దత్కులం బెల్లను', ఇత్యాద్యాచార్యోక్తి రత్ర మానమ్, 'ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంబె' ఇత్యాది కవితాపితామహోద్యుక్తిస్తు నిర్మూలైవ.

వి:- షష్ఠీవిశేషణానామ్, ప్రథమా, స్యాత్-అని ఛేదము. విశేషణము లైనశబ్దములయొక్క షష్ఠీవిభక్తికిఁ బ్రథమ యగునని సూత్రార్థము. విశేషణవిశేష్యములు సమానలింగవిభక్తివచనములు కల్గియుండవలెనని నియమ మున్నను దెనుఁగున నిట్టిమార్పుండనగునని యీసూత్రము చెప్పుచున్నది. చింతామణి షష్ఠీవిశేషణములకుఁ బ్రథమను నిత్యముగా విధించియుండఁగా నథర్వణాచార్యులుగారు "షష్ఠ్యంత విశేషణము తెనుఁగున వికల్పముగాఁ బ్రథమాంత మగును; భూప్రభృతి ధాతురూపముల యన్వయవ్యవధాన మున్నచో విశేష్యములకు సకల విభక్తులును గలుగవచ్చు"నని వివరించినారు. దీనిచే, 'అకుటిలాత్ముఁడు శ్రీరామునికి వినతులు, అకుటిలాత్మునకు శ్రీరామునికి వినతులు' అను రూపద్వయము సిద్ధించును. 'రక్షకతఁ దాల్చు శ్రీరఘురాముచేతఁ బోషితులమైన మముఁ జెందు భూరిసుఖము' అనునపుడు 'అయిన' అను భ్వాద్యర్థముతో విశేషణవిశేష్యములకు వ్యవధానము గల్గినది. కావున 'మమ్మున్' అనునది ద్వితీయాంతమై విశేష్యమైనను బోషితుల మను విశేషణమునకుఁ బ్రథమయే వచ్చినది. విశేష్యము సమాసమునం దున్నను విశేషణమునకుఁ బ్రథమ రావచ్చునని 'ప్రల్లదుఁడైన యొక్కకులపాంసను' అనుదానిచేఁ దెలియుచున్నది. 'కులపాంసను' అనునది సమాసపూర్వావయవముగా నున్నది. ప్రల్లదుఁ డనెడిదీనివిశేషణము ప్రథమాంతమై వ్యస్తముగాఁ గూడ నున్నది. ఇచ్చట 'అయిన' అను

భ్వాద్యర్థము వ్యవధానముగానున్నది. షష్ఠ్యంతవిశేషణమునకు భ్వాద్యర్థ వ్యవధానము లేకున్ననుఁ బ్రథమ రావచ్చును. షష్ఠీతరవిశేషణమైనపుడు భ్వాద్యర్థవ్యవధానము లేకున్నచో దానికిఁ బ్రథమ రాదు. కావుననే 'ఆద్యుఁడు హిరణ్యగర్భునం' దనునది దుష్టమని చెప్పఁబడినది. ఇందు ఆద్యుఁ డనునది విశేషణము. హిరణ్యగర్భునం దనునది విశేష్యము. ఇందు విశేషణ విశేష్యములకు భ్వాద్యర్థవ్యవధానము లేదు గావున విశేషణము ప్రథమాంతమగుటకు వీలు లేదు. కాని మహాకవిప్రయోగ మగుటచే సాధువే యననగును.

సూరిగారు 'ఒకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభావ నగు' (బాల. కార. 27) భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు (బాల. కార. 28) భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబు లకును దానిముందువిశేషణముల కయి పదంబును బహుళంబుగా నను ప్రయుక్తంబగు (బాల. కార. 29) 'అయిపదానుప్రయోగంబులేనిచోఁ దుది విశేషణంబునకేని విశేషణంబు లన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపంబడు (ఈసూత్రమునకు మూలము లేదు) (బాల. కార. 30) 'ధాతుజవిశేషణవ్యవధానంబున విశేషణంబుల కన్నింటి కయిపదం బనుప్రయుక్తంబగు (బాల. కార. 31) దీనికిని మూలము లేదు. ఇవి యాధునికకవిప్రయోగానుసారముగా సంతరింపఁ బడినవని తెలియుచున్నది.

**143.** సూ :— వ్యవహితాశ్చ సర్వే స్యుః.

143 సూ 1 :— సర్వే శబ్దా వ్యవహితా భవేయుః; చా దవ్యవహితాశ్చ. 'రాముఁ దలఁచెద సద్గుణారాము నెపుడు, రాము నభిరాము సద్గుణారాముఁ దలఁతు' ఇత్యాద్యుదాహరణమ్. వ్యవధానం చాత్ర ప్రకృతార్థప్రత్యాయనక్షమమే వాఙ్గీక్రియతే. తదుక్తమథర్వణేన— "వ్యవధానంచ సాధుస్స్యాత్ప్రకృతార్థప్రకాశకమ్" ఇతి. భవజ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్మఁ దసహ్యవిషోగ్రధూమకేతనహతిఁ జేసి చేసవతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిన్-ఇత్యాద్యా వాగనుశాసనానాం వాచః.

వి :— వ్యవహితౌ, చ, సర్వే, స్యుః-అని ఛేదము. విశేష్య విశేషణములకు మధ్యమునం దితరపదములతో వ్యవధాన ముండవచ్చు నని సూత్రార్థము. అథర్వణాచార్యులుగారు దీనిఁ వివరించుచు "వాక్య గతము లగుపదములు పరస్పరవ్యవధానముతోఁ గవిప్రయుక్తములయి నను నావ్యవధానము వివక్షితార్థప్రకాశక మగునప్పుడే సాధు వగునని పండితులయభిప్రాయము" అని చెప్పియున్నారు. కావుననే 'భవజ్జనస' అనుపద్యములోని పదములు ప్రకృతార్థప్రకాశకము లగుటచేతనే పరస్పర వ్యవహితములయినను సాధువు లగుచున్నవి.

143 సూ. 2 :— 'క్రియాయాస్తు ప్రయోగ స్స్యాత్కారకాద్యన్తభాగయోః మధ్యభాగే తత్ప్రయోగో న సాధుస్స్యాదయంగమః'. ఇత్యథర్వణః.

నడచె నేనుఁగు గుఱ్ఱము, ఏనుఁగు గుఱ్ఱము నడచెను-ఇత్యాది పూర్వార్ధ ఉదాహరణమ్. ఏనుఁగు నడచెను గుఱ్ఱము-ఇత్యాదిప్రయోగో న సాధుసమ్మతః.

వి :— 'తనతో నన్వయించుచున్న కారకముల తొపయందుఁగాని యంతమందుఁగాని క్రియాప్రయోగము సమ్మతమగును. ఇట్టిస్వాన్విత కారకములనడుమ నాక్రియాప్రయోగము సమ్మతము గాదు' అను నథర్వణవచనముచొప్పున, ఏనుఁగు నడచెను గుఱ్ఱము, మొన్నగురీతి ప్రయోగము లసాధువు లగుచున్నవి.

సూరిగారీవిషయములను 'ఏకవాక్యంబునం దొకానొక్కెడు దక్క సర్వపదంబులు గ్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంజను' (బాల. కార. 37) నని వివరించిరి. వీరును రెండుకారకములమధ్యఁ గ్రియా ప్రయోగమును నిషేధించిన ట్లగపడుచున్నది.

**144.** సూ :— వికృతౌ చ స్త్రీలిఙ్గాః స్త్రీలింగకసర్వనామధేయా స్స్యుః.

**144** సూ. **1** :- వికృతౌ చ స్త్రీలిఙ్గవాచకా శ్శబ్దాః తే సర్వే స్త్రీలిఙ్గకవిశేష్యవిశేషణాభిధాయిన స్స్యుః. అత్రేయం చిన్తా- సూత్రస్యాస్య సీత భక్తవత్సలేత్యాదౌ న తాత్పర్యమ్. నియతస్త్రీప్రత్యయస్తు సర్వాసామ్-ఇత్యనుశాసనాత్, స్త్రీప్రత్య

యాన్తస్యైవ గ్రహణే 'ఏకదేశవికృత మనన్యవ ద్భవతీ'తి న్యాయేన స్త్రీవాచకత్వ మవ్యాహత మేవేతి తద్విధాన స్యానావశ్యకత్వాత్. కిన్తు, 'పంటచెలిపట్టి లోకైక భద్రచరిత' ఇత్యాదౌ తాత్పర్య మవధార్యతే.

వి:- వికృతౌ, చ, స్త్రీలింగాః, స్త్రీలింగకసర్వనామధేయాః, స్యుః-అని ఛేదము. వికృతియందుఁగల స్త్రీవాచకశబ్దములకుఁ దత్సమ స్త్రీలింగవిశేషణవిశేష్యము లుండునని యర్థము. సీత భక్తవత్సల- అనుచోట విశేషణవిశేష్యభావసమీకరణమునకై 'వికృతౌ సర్వే శబ్దాః' అనుసూత్రము పుట్టినదని చెప్పనక్కఱలేదు. సీతాశబ్దము భక్త వత్సలాశబ్దము రెండును టాబంతములే. 'నియత స్త్రీప్రత్యయ స్తు సర్వా సామ్' అనుచోప్పున సంప్రాప్తించిన టాప్ ప్రత్యయమునకు హ్రస్వము చేయఁగాఁ బై రూపము సిద్ధించుచున్నది. కావున నీసూత్రమునకు 'పంటచెలిపట్టి లోకైకభద్రచరిత' అని యాచ్ఛికవిశేష్యమునకు స్త్రీ లింగతత్సమవిశేషణ ముండు ననుదాని కుదాహరణము గానోపును. 'పంటచెలిపట్టి' అనునది యాచ్ఛిక స్త్రీవాచకము. లోకైకభద్రచరిత' అనుతత్సమపదము దీనికి విశేషణముగా నున్నపుడు స్త్రీలింగముగాఁ బ్రయోగింపవలయునని చెప్పుటకే యీసూత్ర ముపయోగించును.

144 సూ. 2 :- సంస్కృతభాషాయాం టాబాదిప్రత్యయ ఇవ న కశ్చిత్ప్రత్యయో ఽత్ర స్త్రీవాచకశబ్దమాత్రసాధారణో ఽస్తి. నచ, 'అఇఉః స్త్రీవిషయాః', ఇతి స్త్రీవాచకశబ్దమాత్రసాధారణా స్సన్తీతి వాచ్యమ్. నవలేత్యాదౌ తదవ్యాప్తేః నెచ్చెలి తమ్మికంటిత్యాదిశబ్దానాం స్త్రీపుంసాధారణ్యేన ప్రవృత్తత్వాచ్చ తాదృశ సాధారణ్యస్య దుర్ఘటత్వాత్. అత స్తే ప్రత్యయాః 'గౌర, గౌరి, గౌరు' ఇత్యాది లోకప్రసిద్ధ స్త్రీజననామవిషయా ఏవేతి నిర్ధారణాత్.

వి :- తెనుఁగునందు 'అ ఇ ఉ' అనునవి స్త్రీప్రత్యయములుగాఁ జెప్పఁబడుచున్నవి. నవలా మున్నగుచోట్ల నాప్రత్యయములు ప్రవర్తింపనందున స్త్రీప్రత్యయములే తెలుఁగునందు లేవని చెప్పుటకు వీలులేదు. 'నెచ్చెలి, తమ్మికంటి' ఇత్యాదులయందును నట్టిప్రత్యయములు వచ్చిన

వని చెప్పుటకు వలనుగాదు. నెచ్చెలి, తమ్మికంటి, యనునవి కేవల స్త్రీప్రత్యయమాత్రములే కాక పుంలింగములును నగపడుచున్నవి. కావున అ ఇ ఉ అనునవి 'గౌర, గౌరి, గౌరు' మున్నగు జననామములయందే ప్రవర్తింపవలసియున్నవని చెప్పవచ్చును. ఇవి తప్పఁ దెనుఁగునందు స్త్రీప్రత్యయములు లేవు.

144 సూ. 3 :- స్త్రీత్వద్యోతకస్య ప్రత్యయస్యాభావాత్తస్య శబ్దస్య గౌరాది శబ్దవత్ స్త్రీత్వద్యోతకస్య స్త్రీత్వ మిత్యనుశాసనద్వారా తద్విశేషణత్వేన ప్రయుక్తస్య సంస్కృతపదస్యాపి స్త్రీత్వమేవేత్యత్ర సూత్రస్య స్వారస్యమితి ప్రతిభాతి.

వి :- స్త్రీత్వద్యోతకప్రత్యయములు తెలుఁగున లేకున్నను గౌర, గౌరి, గౌరు మున్నగు శబ్దములవలె స్త్రీత్వమును నిర్దేశించుకొనుట యుచితము; కాన నిచట 'గౌరి' మున్నగుశబ్దములకు విశేషణముగాఁ బ్రయుక్తమైనతత్సమపదమునందు స్త్రీత్వ ముండునని చెప్పుటే యీ సూత్రస్వారస్యమని తెలియుచున్నది.

**145. సూ :- ఉభయవిధ మమహతీనామ్.**

145 సూ:- అమహత్ స్త్రీలిఙ్గానాం ఉభయవిధం విశేషణం స్యాత్. అమహతీనామిత్యనేన స్త్రీలిఙ్గానా మిత్యయమర్థోఽవగమ్యతే. అమహాన్తో ద్వివిధాః. స్త్రీలిఙ్గాః, అస్త్రీలిఙ్గాశ్చేతి. స్త్రీలిఙ్గా అపి ద్వివిధాః. ప్రాణివాచకాః, అప్రాణివాచకాశ్చేతి. తత్ర అప్రాణివాచకానాం స్త్రీలిఙ్గామహతీనాం స్త్రీలిఙ్గవిశేషణ మస్త్రీలిఙ్గామహద్విశేషణం చోభయం భవతీత్యర్థః. స్త్రీలిఙ్గవిశేషణస్య ప్రాప్తత్వాత్. అస్త్రీలిఙ్గవిశేషణవిధానఏవ సూత్రస్య తాత్పర్యమ్.

"అప్రాణివాచినామత్ర భవే దమహతాం స్త్రియామ్
ద్విధా విశేషణం తత్ర మానం సువచసాం వచః"

ఇత్యథర్వణేనోక్తమ్. శరచ్చంద్రిక మనోహరము, మనోహర, ఇత్యాది.

వి:- ఉభయవిధమ్, అమహతీనామ్—అని ఛేదము. స్త్రీలింగామహచ్ఛబ్దవిశేషణము లుభయవిధరూపములతోనుండునని యర్థము.

క్లీబసమ స్త్రీసమరూపములతో విశేషణము లుండునని భావము. "జడ
వాచకములైన అమహత్ స్త్రీలింగములకుమాత్రమే స్త్రీలింగవిశేష
ణము నిల్చును. ప్రాణివాచక అమహత్ స్త్రీలింగములవిశేషణములు
స్త్రీలింగములే యగును; కాని యవి స్త్రీలింగములు గావు" అనునర్థవ్యంజక
వచనముచే నప్రాణివాచకామహద్విశేషణమగు 'శరచ్చంద్రిక' యను
నది 'మనోహరము, మనోహరి' యనురెండువిధములగు విశేషణముల
నొందుచున్నది.

సూరిగారు, 'మహతీతరంబు లగు స్త్రీలింగంబుల విశేషణంబులకుఁ
గ్లీబత్వంబు విధేయంబగు (బాల.తత్స. 30) అని యీపై విషయము వివ
రించియున్నారు.

**146.** సూ :— నియతస్త్రీప్రత్యయస్తు సర్వాసామ్.

సర్వేషాం స్త్రీలింగశబ్దానాం సంస్కృతభాషానుశాసనే య ష్టాబాదిప్రత్యయః
సోఽత్రాపి నియతస్స్యాత్. రామకృప సంతాపహారిణీ; సీత సర్వాభీష్టప్రదాత్రీ;
భూతనూజాత నవవారిజాతనయన; పుడమిచెలికూఁతురే సర్వభూతజనని; అట్టితోవ
కంటి యస్మదిష్టార్థదాత్రి ఇత్యాది. సరస్వత్యాం తు 'మిన్నేఱు శివజటావాసిని' ఇత్యు
దాహృతమ్. తత్ర న కేవలం స్త్రీసమత్వమ్, కిన్తు స్త్రీవాచకత్వమ ప్యవ్యాహతమేవేతి
తద్రూపమపి సాధ్వేవ. ధరాపరాగపటలాక్రాంతంబు మిన్నేఱు, రూపం తూభయథేతి
సూత్రేణ సమఞ్జసమితి జ్ఞేయమ్.

వి :— నియతస్త్రీప్రత్యయః, తు, సర్వాసామ్—అని ఛేదము.
సంస్కృతస్త్రీలింగశబ్దముల కన్నింటికిని వానివానికి నియతము లగు స్త్రీ
ప్రత్యయములు వచ్చును. వానితోడనే యవి తత్సమములై తెలుఁగునఁ
బ్రయోగింపఁబడును. 'మిన్నేఱు శివజటావాసిని' అనునప్పుడు శివజటా
జూటమందు వసించుమిన్నేఱు స్త్రీసమమే కాక స్త్రీవాచకముగూడ
నగుచున్నది. కావున 'శివజటావాసిని' యను విశేషణమునకు 'ఋన్నే
భ్యోఙీప్' అని ఙీప్పు వచ్చినది. 'ధరాపరాగపటలాక్రాంతంబు మిన్నేఱు'

అనునపుడు 'మిన్నేఱు' శబ్దము ప్రవాహపర్యాయమే కాని స్త్రీవాచకము గాదు. దానికి ఉభయవిధ మనుహతీనామ్న మనుచెప్పుట రెండువిధము లగురూపము లుండును. (బాల. తత్స. 85 సూ)

147 సూ :- ఇతరత్ర చ ద్వితీయా.

147 సూ:- ద్వితీయావిభక్తిః స్వవిషయవ్యతిరిక్తవిషయేఽపి స్యాత్. రాముఁడు హేతి నమరారుల నడిచెన్; రాముఁ డయోధ్య నున్నవాఁడు 'ఆద్యే తృతీయాస్థానే 'అమ్' ద్వితీయే సప్తమీస్థాన ఇతి విశేషః. పక్షే హేతిచే నరులఁ-ఇత్యాదికం రూపమ్ సంస్కృతన్యాయేన జడవిషయ ఏవేయమ్.

వి:- ఇతరత్ర, చ, ద్వితీయా-అని ఛేదము. ద్వితీయేతరవిభక్తుల చోట జడవాచకశబ్దములకు ద్వితీయావిభక్తి వచ్చునని యర్థము. 'హేతితో నడిచెన్' అనుటకు 'హేతిన్ నడిచెన్' అని, 'అయోధ్యయుం దున్' అనుటకు 'అయోధ్యన్' అని తృతీయాసప్తములకు ద్వితీయ వచ్చినది. 'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళముగా నగు' అని బాలవ్యాకరణవివరణము.

148 సూ :- తస్యాః ప్రథమా చ జడపదానాం స్యాత్.

148 సూ:- జడవాచకశబ్దసమ్బన్ధిన్యాః ద్వితీయాయాః స్థానే ప్రథమాపిస్యాత్; చా ద్ద్వితీయాపి. కొండ దిగి, రథ మెక్కె- ఇత్యాది ప్రథమాయా ముదాహరణమ్. 'మాణిక్యగాణిక్యసంపద లాలించి గొనివచ్చి' ఇత్యాదికః మాచార్యస్య వచనమ్. ద్వితీయాయాంతు 'వనముఁజేరి' ఇత్యాది జ్ఞేయమ్. 'పదిదినము లై దుప్రొద్దులుం' ఇత్యత్రాపి "కాలాధ్వనో రత్యన్తసంయోగే" ఇతి ద్వితీయా. తస్యాః ప్రథమా. 'ఒక్కపగలున్ రేయిన్' ఇత్యత్ర ద్వితీయైవ సప్తమ్యర్థే. ద్వితీయాప్రథమాభ్యాం వా సాధుత్వమ్. అతఏవ రేయి నిత్యత్ర న 'యు' వర్ణకాభావప్రయుక్తదోష ఇత్యనుసన్ధేయమ్.

వి:- తస్యాః, ప్రథమా, జడపదానాం, స్యాత్ -అని ఛేదము. ద్వితీయేతరవిభక్తిస్థలములలో వచ్చిన జడవాచకద్వితీయకుఁ బ్రథమ వచ్చునని సూత్రార్థము. రథ మెక్కె, కొండ దిగి మున్నగునవి ప్రథమ

కుదాహృతులు. రథమును, కొండను అనువానిద్వితీయలకుఁ బ్రథమ వచ్చినది. పదిదినము లైదు ప్రొద్దులు అనునపుడు జడవాచకసప్తమికి వచ్చిన ద్వితీయకును బ్రథమ గల్గినదని తెలియవలయును. ఒక్కపగలున్ రేయిన్ అనునపుడు 'ఒక్కపగటియందును, రేయియందును' నని యర్థము. ఆసప్తమికి ద్వితీయ వచ్చి, యాద్వితీయకుఁ బ్రథమ వచ్చినది. 'రేయిన్' అనునపుడు రేయియందున్ అనుసప్తమ్యర్థము చెప్పకొన్నను దోషము లేదని కవిశిరోభూషణాభిప్రాయము. 'రేయియందున్' అను దానికి ద్వితీయ వచ్చినయెడల 'రేయిన్' అనురూపమగును. కావుననే యిచట సముచ్చయార్థమున రావలసిన యువర్ణకము రాకున్నను దోషము లేదని కవిశిరోభూషణము వ్రాసినది. ఇదిసరికాదు. పదిదినము లైదుప్రొద్దులు పదఁపడి రెన్నాళ్ళునొక్కపగలున్ రేయిన్। కదనంబుచేసి మడిసిరి నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్' ఈపద్యము పూర్వార్ధమునందున్నపదము లన్నియు సప్తమ్యర్థకములు. దీనికి సముచ్చయార్థమునందు వచ్చు 'ఉన్, నున్' అనువానిలోని 'న్' అనువ్యంజన నకారము మిగిలి 'ఉ, ను' అనునవి లోపించినవి. మిగిలినవ్యంజన నకారము సముచ్చయార్థమును బోధించుచున్నది. కావున 'రేయిన్' అనుదానియందున్నవ్యంజననకారము పూర్వమందున్న సప్తమ్యర్థక ప్రథమాంతముల కన్నింటికిని సముచ్చయమే. జడవాచకములసహజద్వితీయలకువలెనే తృతీయాసప్తములకు వచ్చినద్వితీయలకును జింతామణిమతమునఁ బ్రథమ రావచ్చును.

సూరిగారీవిషయములను, 'జడంబుద్వితీయకుఁ బ్రథమ బహుళంబుగా నగు', (బాల.కార.24) 'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' (బాల.కార.22) 'కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు' (బాల.కార.25) అనుసూత్రములచే వివరించిరి. చింతామణి తృతీయాసప్తములకు వచ్చినద్వితీయకును బ్రథమ రావచ్చునని చెప్పచుండఁగా, నాతని ప్రయోగము లావిషయమును స్పష్టపఱుచు

చుండఁగా, సూరిగారు బాహుళకము చేఁ దృతీయాన్తములకు విధించిన ద్వితీయకుం బ్రథమ రాదు.' అని వచించుట సరిగాదని తోఁచుచున్నది.

ప్రౌఢవ్యాకర్త సూరిగారు చెప్పినవిషయములను విమర్శించుచు, 'కొన్నియెడల నజడంబుతృతీయాన్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి' (ప్రౌఢ. కార. 18) 'కొన్నియెడల నజడంబుద్వితీయకును బ్రథమ గానంబడియెడి' (ప్రౌఢ.కార.19) 'ఒక్కొక్కచో జడంబు సప్తమికిఁ బ్రథమయు నగు' (ప్రౌఢ.కార.20) అని వచించియున్నారు.

**149 సూ:-స్తోఽవావౌ రైనావోః.**

149 సూ. 1:- ఓశ్చ ఆవశ్చ అవావౌ. అవావా దేశః. రైశబ్దనౌశబ్దయో రచఃస్థానే క్రమాత్ ఓ - ఆవ - ఇత్యేతా వాదేశౌ స్తః. రోయీని; 'నావ నీనామ నుతిఘోరసారకాఘజలనిధికి రామ భక్త్యాఘజలధిసోమ' ఇత్యుదాహరణమ్ రాస్తు ద్వయో రిత్యభిధానాత్. రైశబ్దస్య స్త్రీత్వమ ప్యస్త్రీతి సులోపః.

వి:- స్తః, అవావౌ, రైనావోః-అసి ఛేదము. రైశబ్దమునకు 'రో' అనియు, నౌ శబ్దమునకు 'నావ' అనియుఁ బ్రాతిపదికరూపములు తెలుఁగునం దుండునని సూత్రార్థము. వీనికిఁ బ్రథమైకవచనమున సులోపము చేయఁగా 'రో, నావ' అనురూపము లేర్పడుచున్నవి.

149 సూ. 2 :- "త్రిలిఙ్గ్యామపి రైనావో స్సమాసే ప్రత్యయాన్తతా। ద్యోనావోః క్వచి దిష్ట స్స్యాత్ క్లీబత్వే హ్రస్వసఙ్గ్రహః." ఇత్యథర్వణః.

అతీతనౌకుఁడు పురుషుఁడు; అతీతనౌః కాంత, అతీతనౌకము విప్రకులము. రూపకే-సంసారార్ణవనౌః సీత ఇత్యేవం రూపమ్; అతీతరైకుఁడు పురుషుఁడు ఇత్యాది క్లీబత్వే హ్రస్వే అతినువు బ్రాహ్మణకులము; ప్రద్యువు సురకదంబకము.

వి:- "తెనుఁగునందు రై-నౌ శబ్దముల కన్యపదార్థప్రధానసమాసమగు బహువ్రీహియందు 'క' ప్రత్యయాంతత గలదు. ద్యో-నౌ శబ్దముల కుపసర్జనత్వమునందు నపుంసకత్వమున కప్రత్యయము రానపుడు సంస్కృతవ్యాకరణప్రసిద్ధ మగుహ్రస్వము గల్గును" అను నథర్వణవచన

నుచే 'అతీతనౌకుఁడు, అతీతనౌక, అతీతనౌకము' మున్నగురూపములు సిద్ధించుచున్నవి. హ్రస్వము వచ్చినపుడు 'అతినౌశబ్దము 'అతినువు' అనియు, ప్రద్యోశబ్దము 'ప్రద్యువు' అనియుఁ దత్సమత్వమున నేర్ప డును. సూరిగారీవిషయమును 'నౌ శబ్దంబునకు నావ యగు' (బాల. తత్స.63) 'రై గ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు' (బాల. తత్స.64) అను సూత్రములచే వివరించియున్నారు.

**150 సూ :- స్త్రీవత్ గ్లౌః.**

150 సూ. :- అతిదేశేనైవ సులోపః. 'గ్లో యుదయించెను బ్రమోదకరుఁడై మింటన్' ఇత్యాద్యుదాహరణమ్.

"స్యాద్వక్రతమయుగ్మస్య వక్రవర్ణో ద్వితీయకః"
ఐకారాన్తం స్వరూపేణ మతే భవతి థార్వ్వహే"

ఇత్యథర్వణవచనం. రో, రై, గ్లౌ ఇతి రూపమ్.

వి :- స్త్రీవత్, గ్లౌః-అని ఛేదము. ఈసూత్రము గ్లౌ శబ్దము నకు స్త్రీత్వము నతిదేశించుచున్నది. రై, గ్లౌ శబ్దములమీఁది ఐకారౌ కారములకు ద్వితీయవర్ణకవక్రమనఁగా ఓ కారము ధార్వహునిమతము నం దాదేశమగును-అనునథర్వణవచనముచే రై, గ్లౌ, అనువానికి రో, గ్లో, అనునవి వైకల్పికరూపము లగును. వీనికి స్త్రీసమత్వాతి దేశముచేఁ బ్రథమైకవచనలోపము గల్గుచున్నది.

**151. సూ :- భూదివో స్తు జౌ య త్తత్.**

151 సూ :- భూదివ్శబ్దయో రాద్యాయాం జౌ య ద్రూపం త దత్ర స్యాత్. 'భువి దివి నీవలనఁ బొడమెఁ బురుషవతంసా' ఇత్యుదాహరణమ్. హాలన్తేషు 'దివము' ఇతి రూపాన్తరమ్.

వి :- భూదివోః, తు, జౌ, యత్, తత్-అని ఛేదము. 'భూ దివ్' శబ్దములకు సంస్కృతమునందు సప్తమ్యేకవచనమునం

దేరూపము లుండునో యవియే తెనుఁగునఁ బ్రాతిపదికము లగునని యర్థము. వీనికిఁ బ్రథమైకవచనలోపము గల్గి 'భువి, దివి' అనురూపము లేర్పడును. ఇకారాంతముల కగుకార్యము లన్నియుఁ బిదపఁ గల్గి 'భువులు, దివులు' మున్నగురూపములు సిద్ధించును.

151 సూ. 2 :- "పృథ్వీపరస్తు భూశబ్దో నాత్మభ్వాది రిహేష్యతే" ఇత్యథర్వణః. పృథ్వీవాచకో భూశబ్దః సమాసాన్తేనైవ ప్రయుజ్యతే. సమాసే ఆత్మభ్వాదిశబ్దానాం న భూశబ్దాన్తత్వేన ప్రయోగ ఇత్యర్థః. ఆదిశబ్దేన మనోభ్వాద యోగృహ్యన్తే. స్వయంభూప్రముఖానాం గ్రహణ మిష్టమేవ.

వి:- 'భూ-దివ్' అను సంస్కృతశబ్దములు తెలుఁగునఁ దత్సమత్వము నొందునపుడు 'భువి, దివి' అనురూపములతో నిల్చునుగాన నపుడు భూశబ్దము పృథ్వీవాచకమే యగును. సిద్ధసమాసముతుదిని బృథ్వీవాచకభూశబ్దము నిలువదు. 'ఆత్మభూ' మున్నగురూపములలోని భూశబ్దము పృథ్వీవాచకమైన భూశబ్దము కాదని యెన్నవలయును. కాన 'స్వయంభువు' మున్నగుప్రయోగములు ప్రచురముగా నున్నవి. సూరిగారీవిషయమును 'పృథ్వీవాచిభూశబ్దమునకు భువి యగు (బాల.తత్స.62) నని వివరించిరి.

152 సూ. :- వాఽయి రవు ర్వక్రతమౌ.

152 సూ. :- వికృతిశబ్దేషు య అయిః, అవుశ్చ తరౌ క్రమేణ వక్రతమౌ 'ఐ, ఔ' ఇత్యేతా వాదేశౌ స్తః. 'చెలువయి, చెలువై; అవుర, ఔర' ఇత్యాది.

వి:- వా, అయిః, అవుః, వక్రతమౌ-అని ఛేదము. వికృతిశబ్దములలో నున్న 'అయి-అవు' అనువానికిఁ గ్రమముగా 'ఐ, ఔ' అనునవి యాదేశము లగునని యర్థము. 'చెలువయి, చెలువై; అవుర, ఔర' ఇత్యాదు లుదాహరణములు.

'అచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు' నని (బాల.క్రియా.103) సూరిగారు పైవిషయములను వివరించిరి,

కాని "వాయిరవుర్వక్రతమా" అనుసూత్రమునందు స్థానాన్యాదేశములను వ్యత్యస్తము చేసి వ్యాఖ్యానించినను దోషము లేదని తోఁచుచున్నది.

**153 సూ. :- ఉ ర్ద్వన్ద్వే రః.**

153 సూ. 1:- ఋకారాన్తద్వన్ద్వే పూర్వపదసమ్బన్ధీ యో ఋకారః తస్యస్థానే రః స్యాత్. 'మాత్రపిత్రుబుద్ధి వైదేహపుత్రిఁ దలఁతు' ఇత్యాది. క్వచిద్గ్రహణస్య ఉభయత్రాప్యన్వయే 'మాతాపితలు, మాతాపితృబుద్ధి సీత మగిలెఁ నెంతున్' ఇత్యాది రూపాన్తరం సిద్ధ్యేత్.

"ఆనజ స్స్యా దృతో ద్వన్ద్వే రేఫ శ్శౌరికవే ర్మతే" ఇతి వదద్భి రథర్వణాచార్యై రస్యైకమత్యం సిద్ధ్యేదితి జ్ఞేయమ్.

"ఆనఙ్ ఋతో ద్వన్ద్వే" ఇతి సూత్రే ఉత్తరపదేన పూర్వపదం నాక్షిప్యత ఇతి మధ్యమపదస్యాప్యానఙ్. తేన, హోతృ, పోతృ, నేష్టోద్గాతారః. హోతా పోతా నేష్టోద్గాతారః ఇతి భాష్యకైయటాదౌ స్థితమ్. తత్రాపి రేఫప్రయోగే హోత్ర పోత్ర నేష్ట్రోద్గాతలు. హోతృపోతృనేష్టోద్గాతలు ఇతిరూపం జ్ఞేయమ్.

వి:- ఉః, ద్వన్ద్వే. రః-అని ఛేదము. ఋకారాంతసర్వావయవ ద్వంద్వమునందుఁ బూర్వపదాంతిమ ఋకారమున కాదేశముగా సంస్కృత వ్యాకరణమునందు ఆనజాదేశము విధింపఁబడినది. దానిస్థానమునందుఁ దెనుఁగున రేఫాదేశము వికల్పముగాఁ గల్గుచున్నదని యర్థము. మాతృపితృబుద్ధిఅను ద్వంద్వమున మాత్రపితృబుద్ధి అను రూపము తెలుఁగున నేర్పడును. ఉత్తరసూత్రమునందలి క్వచిత్ అనుపదముచే మాతాపితృబుద్ధి యను రూపమును నేర్పడుచున్నది. ఈవిషయము నథర్వణాచార్యులుగారిట్లు వివరించుచున్నారు. 'ఋకారాంతద్వంద్వమున వచ్చుఆనజాదేశమునకుఁ దెనుఁగున శౌరికవిమతములో రేఫము వచ్చును'-అనునథర్వణ వచనముచే రెండురూపములును సిద్ధించుచున్నవి. 'ఆనజ్ ఋతో ద్వన్ద్వే' అనుసూత్రమున నుత్తరపదే యనునది యాక్షిప్త మగుచున్నది. అట్టి యాక్షేపము లేనిచో మధ్యమపదమునకును నానజాదేశము వచ్చును. అప్పుడు 'హోతృపోతృనేష్టోద్గాతారః' అనుసమాసమున 'హోతాపోతా

నేష్టోద్గాతారః' అనియు రూపముండునని భాష్యకారులు చెప్పుచున్నవి. అచటఁగూడ రేఫము చేసినచో హోత్రపోత్రనేష్ట్రోద్గాతలు అనురూపము సిద్ధించుచున్నది.

153 సూ. 2 :- 'క్షత్రియవంశ్యులై జగతి' ఇత్యాదిపద్యపద్యే చతుర్థపాదే మాంధాతృపదస్య సంయుతాసంయుతప్రాసత్వేన ఋకారాన్తత్వమేవ; న సరేఫత్వమితి జ్ఞేయమ్. పితాపుత్రా విత్యత్రాపి రేఫే 'పిత్రపుత్రులు' ఇత్యపి రూపం సమఞ్జసమేవ.

వి:- 'క్షత్రియవంశ్యులై' అనుపద్యప్రారమున 'మాంధాతృరఘుక్షితీశులు' అని ప్రయోగించుటచే మాంధాతృపదము సంయుతాసంయుతప్రాసముగా నిలుపఁబడినదని కవిశిరోభూషణము చెప్పుచున్నది. కొందఱు 'ఇచ్చటఁగూడ మాంధాత్ర రఘుక్షితీశులు' అని పఠించి ప్రకృతసూత్రముచే నచ్చటఁగూడ రేఫమును జేయుచున్నారు. ఈ'ఉర్ద్వన్ద్వే రః' అనుసూత్రము 'ఆనఙ్ ఋతో ద్వన్ద్వే' అనుసూత్రము ననుసరించినదిగావున ఋదంత సర్వావయవద్వంద్వములే దీనికి విషయము లగునుగాని తక్కినవి కావు. గాన మాంధాతృరఘుక్షితీశు లనునపుడు సంయుతాసంయుత ప్రాసమని యంగీకరింపక తప్పకున్నది. 'ద్వంద్వంబునందు ఋకారమునకు రవర్ణము విభాషనగు' (బాల.సమా.24) నని సూరిగారు పై విషయమును వివరించియున్నారు. వీరిమతమున మాంధాత్రరఘుక్షితీశులు...అని యుండనగును. కాన వీరు సంయుతాసంయుతప్రాసము నంగీకరింప నవసరము లేదు. కాని 'క్షత్త్రియ' అనునది ద్విత్వసహితమును, మిగిలినవి కానందునను, సంయుతాసంయుతప్రాస మచట సిద్ధమే యగును.

**154 సూ. క్వచి ద్గకారో వః.**

154 సూ. :- క్వచిద్ గకారస్య వకార స్స్యా ద్విభక్తౌ. ప్రోగులు-ప్రోవులు, ప్రేగులు-ప్రేవులు, ఈగి-ఈవి, ఇత్యాది

'ఆద్యగస్య గకారస్య వకారస్తు న దృశ్యతే' ఇత్యథర్వణోక్తేః నాద్యగస్య.

గురువులు, గరువు, గరిక, గిరక, ఇత్యాదౌ న వకారః. క్వచిత్ గ్రహణాత్ రేగు, వాగు, బాగు ఇత్యాదౌ పదాద్యగస్యాపి న.

వి:- క్వచిత్, గకారః, వః-అని ఛేదము. ఒకానొకచోఁ దెలుఁగున గకారమునకు వకార మాదేశమగును-అని సూత్రార్థము. ఉదాహరణములు మీఁద స్పష్టము. 'పదాదిగతగకారమునకు వకారాదేశము ప్రయోగములం దగపడ' దనునర్థర్వాణవచనముచే గురువులు మున్నగువానియందున్న పదాదిగతగకారమునకు వకారాదేశము రాలేదు. 'క్వచిత్' అని చెప్పుటచే రేగు-వాగు-బాగు మున్నగువానిలోని 'గ' కారము పదాదిగతము కాకున్నను 'వ' కారము రాలేదు. ఈసూత్రమునందును స్థాన్యాదేశములను వ్యత్యస్తము చేసి యన్వయింపవచ్చును.

సూరిగారు పై విషయమును, 'అపదాద్యంబయి, అసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాష నగు' (బాల. అచ్చ. 27) అనుసూత్రముచే వివరించియున్నారు. 'ముగ్గురు-ముఫ్వురు' అని దీనిచే సాధువు కాదు.

155 సూ. :- న్వన్తా న్నామ్నః కుజ్నో ర్బహువచనే.

155 సూ:- న్వన్తనామ్నో నోః కుజాదేశ స్స్యా ద్బహువచనే పరే. న్వన్తాదిత్యత్ర 'సదిరప్రతేః' రిత్యాదావివ విభక్తే ర్వ్యత్యయః. హల న్త్యమ్ః. సానువాసికోచ్చారణం జిత్. కోలను. కోలఁకులు. కెలను, కెలఁకులు. మ్రాను, మ్రాఁకులు, ఇత్యాది.

వి .- న్వన్తాత్, నామ్నః, కుజ్, నోః, బహువచనే-అని ఛేదము. 'ను' వర్ణాంతనామముయొక్క నువర్ణమునకు బహువచనపరకత్వమున కుజాదేశ మగును. ఈసూత్రమునందు 'న్వన్తాన్నామ్నః' అనుచోట న్వన్తాత్ అనుపంచమిని షష్ఠ్యంతముగా మార్చి యన్వయింపవలయునని చెప్పుచుఁ గవిశిరోభూషణ మట్టి విభక్తి విపరిణామమునకు సంస్కృత వ్యాకరణమర్యాదను, 'సదిరప్రతేః' అనుగ్రంథముచేఁ జూపినది. అట్టి

మర్యాద ననుసరించుట గ్రంథకర్త కభిమతమైన ట్లగపడదు. నువర్ణాంతమైన ప్రాతిపదికమునకు బహువచనప్రత్యయము పరమైనపుడు 'ను' వర్ణస్థానమున కుజాదేశము నిత్యముగా నగును – అనునర్థము సూత్రము వలన లభించుచుండఁగా విభక్తివ్యత్యాసము చేయుట కవసరము లేదు గదా! 'కుజ్' అనుదానిలోని జిత్త్వముచే 'కు' అనునది బిందుపూర్వక మగునని వ్యాఖ్యానింపవలెను.

155 సూ. 2 :- అత్ర కుజః, ఉపలక్షణత్వేన కోరను-కోరఁకులు, నెఱను, నెఱకులు, గోను-గోఁగులు, రేను-రేఁగులు-ఇత్యాదిరూపాణి సిద్ధాని. తదుక్త మథర్వణాచార్యైః, 'కేషాంచి న్న్వంతశబ్దానాం కు స్స్యా ద్గు స్సార్ధబిందుకః' ఇతి. కుశ్చ సార్ధబిన్దుకౌ కు-గూ చ భవ స్తీత్యర్థః. అత్రాథర్వణసూత్రే బహువచనే ఇత్యస్యానుపాదానాత్ గోఁగుచెట్టు ఇత్యాదిసమాసేఽప్యాదేశ స్సిద్ధః.

వి :– 'కుజ్జు' నువర్ణాంత నామముల కన్నింటికిని రాదు. కొన్నింటికి మాత్రమే వచ్చును. 'కొన్ని నువర్ణాంతనామములకు ఖండబిందుపూర్వక 'గు' వర్ణకము వచ్చును'–అను నథర్వణవచనముచే గోను–గోఁగులు మున్నగురూపములును సాధువులగుచున్నవి. ఇచట నథర్వణకారికకు 'కేషాంచి న్న్వన్తశబ్దానాం కుజ్ స్యా ద్గు స్సార్ధబిన్దుకః' అను పాఠాంతర మగపడుచున్నది. కుస్స్యా త్తనుటకంటె కుజ్స్యా త్తను పాఠమే గ్రంథకృదభిప్రేతమని యూహింప వలసియున్నది. ఈకారిక న్వన్తా న్నామ్నః కుజ్శ్నః'అను చింతామణిసూత్రమును వివరించుచున్నది. కాన నచట కుజ్జునే యిది గ్రహించెననుట యుక్తము. 'బహువచనే' అని యథర్వణవచనమునఁ జెప్పఁబడకుండుటచే నేకవచనమునను సమాసమునను గూడ నీకుజ్జు వచ్చి 'కోలకుచేతను, కోలకునోడ్డు' మున్నగునవియును సాధువులగునని చెప్పవలయును. మఱియు బహువచనపరకత్వమున నిత్యమును, నేకవచనమున వికల్పమనియు 'కేషాఞ్చిత్' అనుదానింబట్టి వ్యాఖ్యానింపవలయును. సూరిగారీవిషయమును 'కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు; బహువచనంబు పరంబగునపుడు నిత్యంబుగా

నగు’ (బాల.అచ్చి.18); ‘అట్లు రేను గోను శబ్దములనువర్ణంబు గుజ్జగు’ (బాల.అచ్చి.19) అని వివరించిరి.

156 సూ. :- క్వచిత్ న్నులోపశ్చ.

156 సూ. 1 :- న్వన్తా న్నామ్నో నోః క్వచి ల్లోప స్స్యాత్. చేను–చేలు, మీను-మీలు ఇత్యాది. క్వచిద్గ్రహణాత్ మీను, మీనులు, కొను–కొనులు ఇత్యాదీని.

వి:— కుత్రచిత్, నులోపః, చ– అని ఛేదము. ఒకానొకచో బహువచనపరకత్వమున ‘ను’ వర్ణాంతనామముయొక్క ‘ను’వర్ణమునకు లోపము వచ్చునని సూత్రార్థము. ఉదాహరణములు మీఁద స్పష్టములు. సూరిగారీవిషయమును ‘బహువచనము వరంబగునపుడు చేను, పేను, మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు (బాల. అచ్చి. 20) అని వివరించిరి.

156 సూ. 2 :- దాయి-దాతులు, వాయి-వాతులు, నేయి-నేతులు, చేయి-చేతులు-ఇత్యాది ష్వాపవిభక్తిలోవర్ణకః. ఉక్తం చాథర్వణేన “కేషాంచి ద్ధ్యన్త శబ్దానాం బతీ స్యాతాం యథోచితమ్ క్వచిత్త్వాదేశ ఏవ స్యాత్; క్వచిన్నైవ ప్రయోగతః. వర్ణస్యాన్త్యస్య లోప స్స్యా ల్లులయోః ప్రాయశః క్వచిత్ ఇతి. ప్రోయి ప్రోయులు; ఇత్యాదౌ నాదేశః. రేయి-రేలు, ఇత్యాదావన్త్యస్య లోపః. ‘ఱాళ్ళు’ ఇత్యత్ర లుకారాదేశ ఇతి జ్ఞేయమ్. ‘ఆలఁగాని’ నిత్యాదివచనం చాత్రోదాహరణమ్.

వి:- “కొన్ని ‘యి’వర్ణాంతశబ్దములకు బహువచన లు, ల–లు పరమగుచుండఁగా ‘లు–తి’ అనువర్ణములు శబ్దముతుది ‘యి’వర్ణమున కాదేశములు కవిప్రయోగానుసారముగా నగును” అను నథర్వణవచనము చొప్పున ప్రోయి–ప్రోయులు, రేయి–రేలు; ఱాయి–ఱాళ్ళు–ఱాలు; మున్నగునవి సాధువు లగుచున్నవి. నేయి, నేతులు, నూయి–నూతులు మున్నగునవి ‘తి’వర్ణోదాహృతులు. రేయి–రేలు, ఆవు–ఆలు మున్నగునవియు నీయథర్వణవచనముచేతనే సాధువు లగునని

యనూహింపవలెను. సూరిగారు పై విషయములను బాల.అచ్చి.21, 22, 35 సూత్రములలో విస్తరించియున్నారు.

**157 సూ. :— సలలో ర్బిన్దుయుతో డు ర్వా లులయోః.**

లేనసహ వర్తత ఇతి సలః; సచాసౌ లుశ్చ సలలుః; తస్య సలలోః. లకారసంయుక్తలుకారస్యపూర్ణబిన్దుయుతో డుర్వా లులయోః పరతః. విల్లు–విండులు; ముల్లు–ముండులు; పల్లు-పండులు.

వి:— సలలోః, బిన్దుయుతః, డుః, వా, లులయోః—అని ఛేదము. ద్విరుక్తలకారాంతశబ్దమునకు బహువచన లు ల లు పరమగునపుడు, ఆ ద్విరుక్తలకారమునకు బిందుపూర్వక డువర్ణ మాదేశమగునని సూత్రార్థము. ఉదాహరణములు మీఁదఁ జూడనగును. బాల. అచ్చి. 16 సూత్రముచే సూరిగా రీవిషయమును వివరించిరి.

**158 సూ :— ఉల్లు గపి తయోః పరతః.**

158 సూ :- తస్య డో రుల్లోపో వా స్యా త్తయోరేవ పరతః. విండ్లు, ముండ్లు ఇత్యాది. విండ్లమోపులు, ముండ్లప్రోఁకులు ఇత్యాది. ఆదేశలోపయో ర్వైకల్పికత్వాత్ విల్లులు ఇత్యాదిరూపమ్.

వి :— ఉల్లుక్, అపి, తయోః, పరతః – అని ఛేదము. బహువచన లు=లలు పరమగుచుండఁగా బిందుపూర్వక డువర్ణముయొక్క ఉకారమునకు వికల్పముగా లోపము వచ్చును – అని సూత్రార్థము. సూరిగా రీవిషయమును మఱికొన్నింటితోఁ గలిపి "బహువచనంబు పరంబగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు" (బాల. అచ్చి. 13) అని విశేషించి చెప్పియున్నారు.

**159 సూ. :— నిత్యం దారాదే శ్చ స్యా ల్లో ర్లులయో రురౌచ తత్ర స్తః.**

159 సూ. 1:- దారాదే ర్లోశ్చ నిత్యం బిన్దుయుతో డు రుల్లోపశ్చ నిత్యం స్యా ల్లులయోః పరతః. తత్ర దారాదౌ స్థితయో ర్లులయోః క్రమాత్ 'రు, ర' ఇత్యేతౌ

వాదేశాచ నిత్యం స్తః. అల్వాదయో దారాదిగణః. అంగ్రడు; జవరాంగ్రడు; చెల్లెంగ్రడు; కోడంగ్రడు; ఇత్యాది. అత్రాథర్వణః ప్రాహ —

"నిత్యం లులౌ రులౌ స్యాతా ముల్లోపో బహులతా డుజామ్" ఇతి. వాంగ్రడు, వీంగ్రడు, అల్లుంగ్రడు; గండండు ఇత్యాది.

వి:- నిత్యమ్, దారాదేః, చ, స్యాత్, లోః, లులయోః, రురౌ, చ, తత్ర, స్తః - అని ఛేదము. దారాదులలోని లువర్ణమునకు నిత్యముగా బిందుపూర్వక డువర్ణకము వచ్చును. దాని కుల్లోపము వికల్పముగా నగునని యర్థము. ఈయథర్వణకారిక 'కేషాంచిద్ ర్వంత శబ్దానాం తథా డుజ్వా రురౌ స్మృతౌ. నిత్యం లులౌ రురౌ స్యాతా ముల్లోపో బహులతా డుజామ్" - అనుచోట బహుళం డుజః అని పఠింపఁదగినది. "నిత్యం లులౌ రురౌ స్యాతా ముల్లోపో బహులతా డుజామ్' అని కేవలము పఠించినచో నన్వయసందర్భము కుదురుపాటు గాదు. కొన్ని రువర్ణాంతశబ్దములకు (బహువచన లులస్థానమున వచ్చిన రేఫాదేశము గల శబ్దములకు) బిందుపూర్వక డువర్ణాదేశ మట్లే వచ్చును. అనఁగా సలలో ర్బిందుయుతో డుర్వా... 'నిత్యం దారాదేశ్చ స్యాత్' అను సలములందువలెనే బిందుపూర్వక డువర్ణాగమ మగును. లుల స్థానిక రురపరకత్వమున వికల్పముగా నగును. కొన్ని యాచ్ఛికశబ్దములకు వికల్పముగా బహువచన లులచోట రు ర ల యాదేశమును, గొన్నియెడల నది పాక్షికముగాను నగును; కొన్నింటికి బహువచన లు లలు నిత్యముగా రు ర లగుచున్నవి. "బహుత్వమునందుఁ బై రీతిని లులస్థానిక రు-ర-పరకత్వమున నాగమముగా వచ్చిన బిందుపూర్వక డువర్ణమున కుత్వలోపము బహుళముగా నగును" అను నథర్వణవచనముచే అంగ్రడు- జవరాంగ్రడు - వాంగ్రడు - వీంగ్రడు-అల్లుంగ్రడు - గండంగ్రడు, మున్నగురూపములు సిద్ధించుచున్నవి.

159 సూ 2 :- "కాఁడు ర్గాఁడు ర్ఛ కే దీఁడు ర స్త్యిత్యాద్యర్థబోధకాః। ఏకత్వవాచకాత్ పుంసి స్యాద్దాఁడు స్త్వన్యథా మతః॥ స్త్రియా మాఁడి ర్బహుత్వేస్యాత్

పుంసి దీర్ఘా న్నిరుచ్యతే। ఉతో లోపశ్చ లులయో స్తయోః పుంసి డురా మతా॥ అన్యేచ బహవో దేశ్యా వర్ణకా అర్థభేదకాః। క్వచిద న్త్యస్య లోప స్స్యాత్ క్వచి ద్వర్ణాగమో మతః॥"

వి :— కలుగుట మున్నగు నర్థములను బోధించునట్టి కాఁడు-గాఁడు-ఈఁడు- అనునవి మహ త్త్వవాచకమునకు-ఏకవచనాంతమునకుఁ బరముగా నగును. అపుడు ప్రథమైకవచనప్రత్యయము వానిమీఁద నిలిచి లోపించును. 'అఁగు' అనునది ఏకత్వము ం రాక బహువచనప్రత్యయముమీఁద వచ్చును. మహతీత్వవాచకత్వమున బహువచనాంతము మీఁద 'ఆఁడి' అని నిలుచును. మహద్వాచకమునందలి 'కా-ఈ-ఆ' అను దీర్ఘములకుఁ బరముగా ద్వితీయైకవచనపరకత్వమున నిగాగమము చెప్పఁబడుచున్నది. వీనికి వచ్చు నీ నిగాగమము నిత్యము. నిగాగమ విధానసామర్థ్యముచేత నే 'కా-ఈ-ఆ' అనునవి స్త్రీప్రత్యయాంతములు గావని తెలియుచున్నది. 'కా-ఈ-ఆ' అనువానిని 'డు'వర్ణాంతములుగా నిబంధించుటచే 'నచ దేశ్యపదే' అనుప్రహాస్వాభావము సూచింపఁబడినది. ఇవి తత్సమములమీఁద సైతము వచ్చునని కొంద అనుచున్నారు. ఈ బిందుపూర్వకడువర్ణోకారగములకుఁ బాక్షికముగా లోపము సంభవించును. పుంలింగములకుఁ గొన్ని మహద్వాచకములందున్న బహువచన లు ల లకు రు రలు నిత్యముగా నగును. చింతామణి యుపదేశించిన 'దు-డి' క-చు మున్నగు కృ త్తద్ధితప్రత్యయములే కాక, యింకను నితరములైన యనేకదేశ్యప్రత్యయములు వివిధము లగునర్థభేదములతోఁగవిప్రయోగ దృష్టము లగుచున్నవి. 'ఒకప్పుడు దేశ్యతద్ధితప్రత్యయములు పరమగుచుండఁగాఁ బ్రకృతియొక్క తుదివర్ణమునకు లోపమగును. ఒకప్పుడు వర్ణవిశేషాగమము వచ్చుట సమ్మతమగును' అనునథర్వణవచనముల చొప్పునఁ గొన్ని దేశ్యకృత్ తద్ధితాంతరూపములు సాధింపఁబడుచున్నవి. అవి ముందు వివరింపఁబడును.

**159 సూ. 3 :— అన్యథామత ఇతి. పుంసి బహుత్వవాచకా చ్ఛబ్దా న్మత ఇత్యర్థః. వన్నెకాఁడు; ఆయతికాఁడు; కన్నగాఁడు; కన్నడీఁడు; కపటీఁడు, ఇత్యాది.**

మాయలాఁడు; చిన్నలాఁడు; వన్నెలాడు; వన్నెకాని; వన్నెకాండ్రు - ఇత్యాది. వన్నెలాఁడిఁ జూచి వలచె మనము - ఇత్యాది.

వి :- ఈ భాగమునందు కాఁడు-గాఁడు-ఈఁడు-ఆఁడు-ఆఁడి అనునవి యుదాహరింపఁబడినవి. ఇవి తెలుఁగుతద్ధితములలోఁ గొన్ని.

159 సూ. 4 :- కల్లరి - వెరవరి - ముక్కుఁడి- వెరవిఁడి - ఎద్దడి - కట్టడి - చలిమిరి - వలిమిరి - కన్నెటికము - కలవరము - కనికరము - వేగిరము - తేజరము - పుట్టింటికోమలికము - ఇత్యాద్యా బహవో వర్ణకాః.

వి :- ఇందుఁ బెక్కుదేశ్యతద్ధితప్రత్యయములు 'అరి, ఇఁడి, అడి, మిరి, అటిక,' మున్నగునవి వివరింపఁబడినవి.

159 సూ. 5 :- స్త్రీత్వే ఒక్కతె- ఒక్కర్తు - ఒర్తు - అవ్వతె - ఇవ్వతె- ఇత్యాద్యాః. చెలికాఁడు - చెలిమికాఁడు - గట్టివాతనము - గట్టివాయితనము - మిండగీఁడు - ఇత్యాదౌ లోపాగమకార్యమ్.

వి :- ఇందుదాహరింపఁబడిన అవ్వతె-ఇవ్వతె అనువానికిఁ గవిప్రయోగప్రసిద్ధి యగపడదు. ఇవియు దేశ్యతద్ధితములే.

159. సూ. 6 :- జడను మత్తు ఇత్యేతయో శ్శబ్దయో రుదన్తయో స్త ల్ అర్థప్రత్యాయకత్వం జ్ఞేయమ్. "అతఏవ గమ్యార్థానా మప్రయోగః. అన్యథా పౌనరుక్త్యమ్" ఇత్యుక్త్వా 'ఏతావతానన్వసుమేయశోభి' ఇత్యాదికం కాళిదాసాది మహాకవివచన ముదాజహ్రు రాలంకారికాః.

వి :- జడను=జడత; మత్తు=మత్తత; అని వానియర్థములు గావున జడత-మత్తత యనువానిలోని 'తల్' ప్రత్యయార్థము జడను మత్తు - అను నుదంతశబ్దములకుఁ గల్గుచున్నది. కాన 'గమ్యార్థములకుఁ బ్రయోగము లేదు' అను వచనము చొప్పున వీనిపై మరలఁ దలర్థకప్రత్యయము చేయ నక్కఱలేదని తాత్పర్యము.

159. సూ. 7 :- ఆకారో మత్వర్థీయః. విభక్త మేషా మస్తీతి విభక్తాః. పీతమేషా మస్తీతి పీతాః ఇతి. అథవా ఉత్తరపదలోపో ద్రష్టవ్యః. విభక్తధనా విభక్తాః

పీతోదకాః పీతాః ఇతి పాతఞ్జలగ్రన్థోఽపి. అత్ర లోపశబ్దార్థో నిరణాయి కైయటేన- 'గమ్యార్థస్యాప్రయోగ ఏవ లోపోఽభిమతః' ఇత్యాదినా గ్రన్థేన.

వి :— విభక్తాః, పీతాః — అనుశబ్దములు 'ఉక్తార్థములకుఁ బ్రయోగ ముండ నక్కఱలేదు' — అను నాలంకారికవచనమున కుదాహృతులు. దీనిని సంస్కృతవైయాకరణులు నంగీకరించిరి. 'విభక్తధనులు, పీతోదకులు' అను నర్థములలోఁ 'విభక్తాః, పీతాః' అనురూపములు మత్వర్థముగల 'అ' ప్రత్యయముచేతఁ గాని, మధ్యమపదలోపముచేతఁగాని సిద్ధించును. వీరి ననుసరించి కవిశిరోభూషణము జడను, మత్తు — అనువానిలోని ఉ-కారము మత్వర్థప్రత్యయమని సాధించుచున్నది.

159. సూ. 8 :— ఏతేన రమణకెక్కు ఇత్యాది రూపం సిద్ధమ్.

వి :— 'రమణకెక్కు' రామణీయకమును బెందు నని యర్థము. రమణ యనునది భావార్థకప్రత్యయ మేదియు లేకయే రామణీయకరూపార్థము నిచ్చుచున్నదని యర్థము. రమణ — అనుదాని తుది — అ — కారము మత్వర్థీయమని భావము.

159. సూ. 9 :— అతఏవ దివిజపాలకునట్టిది నీకు నొప్పుసామ్రాజ్యము - ఇత్యాద్యాచార్యప్రయోగే ఇన్ద్రసమ్బన్ధి సామ్రాజ్యస్య ఉపమానస్య గమ్యత్వాదప్రయోగః. తదర్థస్యాపి గమ్యత్వం తత్ప్రయోగ ఏవ శ్రూయతే. 'భావభవనిభసుభగా' ఇతి. అత్ర 'సుందరేఽధికభాగ్యాంశే దుర్దినేతరవాసరే' తురీయాంశే శ్రీమతి స్యాత్ సుభగః' ఇత్యాదిశబ్దార్ణవాదికోశవచనాత్ సుభగపదస్య సుందరపరార్థే రూఢత్వేన గమ్యత్వాదప్రయోగః 'సప్తమ్యుపమానపూర్వపదస్య బహువ్రీహేరుత్తరపదలోపశ్చ ఇతివార్తికే నోత్తరపద స్యోపమానస్య సుభగత్వస్య లోపః. ఉపమానసుభగత్వధర్మకత్వేన భావభవస్యాప్యుపమానత్వమితి న వార్తికస్యావ్యాప్తిః. అతఏవ 'ఖరముఖ' ఇత్యాదా వవయవావయవిభావేన ఖరస్యాప్యుపమానత్వం న విహన్యత ఇతి శబ్దమర్మజ్ఞాః.

వి :— దివిజపాలకునట్టిది నీకు నొప్పు సామ్రాజ్యము - అను

నాచార్యప్రయోగమున నుపమాన మగునింద్రసంబంధిసామ్రాజ్యము గమ్యమాన మగుచున్నది; కావున దానికిఁ బ్రయోగము లేదు. అట్టిది అనునపుడు సంబంధార్థమున వచ్చిన 'ది'వర్ణకము కాని, 'అది'శబ్దసంబంధి కాదు. 'భావభవనిభసుభగా' అను నాచార్యవచనమునను బ్రత్యయార్థమునకుఁ గమ్యత గలదు. సుభగశబ్దమునకు సుందరుఁడని యర్థము. 'భావభవసుభగత్వముతో నిభమైన సుభగత్వము గలవాఁడు' అని దానికర్థము. నిఘంటువులయందు సుభగపదమునకు సుందరార్థము రూఢమైయున్నది. 'భావభవుని యొక్క సుభగత్వమువంటి సుభగత్వము' అనునపుడు 'సప్తమ్యుపమానపూర్వపద మగుబహువ్రీహిసమాసమున నుత్తరపదలోపము గల్గును' అను వార్తికముచే నుత్తరపదలోపము గల్గినది. ఉపమానమైన సుభగత్వధర్మము గల్గుటచే భావభవపదమునకును నుపమానత గల్గుచున్నది. కావున వార్తికమున కవ్యాప్తి గలుగలేదు. 'ఖరముఖ' మున్నగువానియందును నవయవావయవిభావముచే ఖరమున కుపమానత్వము గల్గుచున్నదని శబ్దశాస్త్రమర్మజ్ఞులనుచున్నారు.

159 సూ. 10 :– ఏవఞ్చాత్రోపమానలుప్తాయా ద్యత్ర సుభగపదస్య సున్దరమాత్రపరత్వం తర్హి నిభసుభగశబ్దయో రుభయో రన్యతరప్రయోగ స్యాసాధుత్వమేవస్యాత్. భావభవనిభేతి ధర్మలుప్తాయా భావభవసుభగేతి వాచకలుప్తాయా వా ఉపమాయా ఏవోచితత్వాత్. యద్యపి సుభగశబ్దస్య శ్రీవాచకత్వేన క్లీబతా మభ్యుపగమ్య బహువ్రీహ్యాశ్రయణేన న తదర్థాపేక్షా. తథా వ్యక్తార్థస్యైవార్థస్యాస్య న ద్రుతప్రతీతివిషయత్వమితి స్పష్టమేవ వివేకినామ్. కిఞ్చాత్ర న యోగమాత్రాశ్రయణ మభిమతమ్. తత్పక్షే సుశబ్దస్యానావశ్యకత్వేన భావభవనిభగేత్యస్యప్రయోగస్స్యాత్. నచేష్టాపత్తిః. అదృష్టత్వాత్, గ్రామ్యత్వాత్, సున్దరతార్థవాచకత్వప్రతిపాదకనిఘణ్టుకదమ్బకవిరోధాచ్చ. సుశబ్దపర్యాయ సమ్యక్ఛబ్దాదిపూర్వకభగశబ్దప్రయోగస్యాపి గ్రామ్యకష్టావగాహనమన్తరా మహాకవిహృదయఙ్గమత్వాపాతాచ్చ. తస్మాద్ భాష్యకారాది మహాశాబ్దిక రుచిరాద్యాలఙ్కారిక వచనానురోధేన నిఘణ్టుకారానుకూల్యేన కాళిదాసాదికవివ్యవహారానుసారేణ మేరుపమానధీర నరిమేచకమేఘసమీర నిత్యాద్యాన్వర్థ

కవిప్రయోగసాధుతాసమ్పాదన స్యావశ్యకత్వేన చ ద్రుతప్రతీతస్య ప్రత్యయార్థస్యైవ గ్రహణ మాచితీపదపాన్థతా మజ్ఞైః కోతీతి సువిదో విదాఙ్కుర్వన్తు.

వి :— 'భావభవనిభసుభగ' అనునపు డుపమానలుప్త. ఇచట సుభగపదము సుందరమాత్ర పరమైనపుడు నిభ — సుభగ శబ్దములలో నొకదానిప్రయోగము వ్యర్థమే యగును. భావభవసుభగముతో నిభమైన సుభగము గలవాఁడని బహువ్రీహి నాశ్రయించినచో దానికి ద్రుతప్రతీతి లేనందున హృద్యము గాదు. కావున వ్యాకరణాలంకారశాస్త్రములకు విరుద్ధము గానిరీతిని సుభగశబ్దమును నిర్ణయము చేయుటయే యుచితము.

159 సూ. 11:— ఏతదాకూతేనైవ చక్రవర్తినా షష్ఠీవిన్యాస ఉక్తమ్. 'వీర్యసుభగాదిశబ్దా విక్రమసున్దరముఖాభిధేయేషు కావ్యేషు సుప్రయుక్తాః కవిభి శ్లాఘాయుజో భవన్త్యే' తేతి.

వి :— వీర్యసుభగాదిశబ్దములు విక్రమసుందరార్థములయందుఁ గావ్యప్రయుక్తములై కవులపొగడ్తల నందుకొనుచున్నవని చక్రవర్తి యను నాలంకారికుఁడు నుడివియున్నాఁడు.

**159 సూ. 12 :-** కర్ణావతంసాదిశబ్దేషు కర్ణాదిశబ్దానాం ప్రయోగే తు న దోష్యమ్. న కతార్థం దుష్టమ్ యది విశేషః ప్రతిపాద్య స్స్యాత్. ధనుర్జ్యాశబ్దే ధనుశ్శ్రుతి రారూఢేః ప్రతిపత్త్యై. కర్ణావతంస శ్రవణకుండల శిరశ్శేఖరేషు కర్ణాది నిర్దేశః "సన్నిధా" ఇత్యాది సూత్రే ర్వామనేన సాధుత్వప్రతిపాదనా దితి ధ్యేయ మిత్యల మతిప్రసక్తేన.

వి :— కర్ణావతంసాది శబ్దములలోఁ గర్ణాదిశబ్దములు దుష్టములు గావని వామనుఁడు చెప్పుచున్నాఁడు.

**159 సూ. 13 :-** మత్తాశబ్దో దేశ్య ఇత్యుక్తమ్. తేన, 'సీధుపారణమత్తా గొని సోలువారి' ఇతిప్రయోగ స్సాధుః.

వి:— మత్తాశబ్దము దేశ్యమగుటచే 'నచదేశ్యపదే' అను నిషేధమున్నదిగావున హ్రస్వము రాదు. 'సీధుపారణమత్తా' అని ప్రయోగించుట దోషము గాదు.

159 సూ. 14:- "కేషాంచిత్ ర్వంతశబ్దానాం తథా డుజ్ వా రురౌ స్మృతౌ" ఎల్లరు, ఎల్లంద్రు; పెక్కురు, పెక్కండ్రు; పలువురు, పలువుండ్రు; ఇత్యాది. కేషాంచి దిత్యుక్తేః మార్తురు, పగతురు; ఇత్యాదౌ నాయం విధిః.

వి :- బహువచన స్థానమునందు రేఫాదేశము గల కొన్నిశబ్దములకు బిందుపూర్వక 'డు' వర్ణాగమమును గొన్నింటికి బహువచన లు - లల చోట రు - రల యాదేశమును వికల్పముగా నగును. "నిత్యం లులౌ రురౌ స్యాతా ముల్లోపో బహుళం డుజః" అనుకారిక కిది పూర్వార్థము.

159 సూ. 15 :- "వువర్ణకో భవత్యత్ర క్వచి న్నిత్యం క్వచిత్తు వా" అన్నువు, పండువు; ఇత్యాదౌనిత్యః; 'అన్ను' శబ్దోఽత్ర స్వల్పవాచకః. పుట్టు, పుట్టువు; అన్న అన్నువు, ఇత్యాదౌ వికల్పః అన్నుశబ్దోఽత్ర స్త్రీవాచకో దేశ్యః.

వి :- "డుజ్జు రాని 'మను,వటు' మున్నగుశబ్దములకు 'వు' వర్ణకము కొన్నియెడల నిత్యముగాను గొన్నియెడల వికల్పముగాను నగుచున్నది. 'ఈ వువర్ణకము 'వు' గాగమమునకు నుపలక్షణము' అను నథర్వణవచనముచే అన్నువు, పుట్టువు, పండువు, మున్నగుశబ్దములు సాధువు లగుచున్నవని పైగ్రంథమునకుఁ దాత్పర్యము. (చూ. సూ. 131-4 భా).

159 సూ. 16 :- "కథితార్థా త్క్వచిల్లుర్లః క్వచిల్లు ర్మానవాచకాత్। క్వచి న్నిత్యం క్వచిద్వా స్యా త్క్వచిదేనేస్తు పూర్వతః. మానార్థా చ్చేని రత్ర స్యాత్ భవే త్సోఽపి విభాషయా. మాత్రజర్థేతు బంట్యాది స్తథా పూర్వాత్ర నః క్వచిత్"

చూపరు, చూపరులు, చూపరి - ఇత్యేద న్తమపి రూపా న్తరమ్. మిన్ను, మిన్నులను, ఇత్యాది. 'ఇంతలు గన్న లందఁ డరు వెవ్వరి కేఁడెదు భూసురేంద్ర' ఇంతలు సేసెన్; వాఁడింతచేసి; ఇంతలేనికన్నులు; 'చేటెఁడేసి సొమ్ములు. చకారాదన్యత్రాపి, నాలుగేసి చీరెలు; ముక్కుబంటినీరు, ముక్కుబంటిజలము, ఇత్యాది. ఆదిశబ్దేన ముక్కుకోలఁది; మోకాలుబంటి, మోకాలుకోలఁది, ఇత్యాది శబ్దానాం సఙ్గ్రహో బోధ్యః.

వి :— ప్రథమాబహువచనార్థమును జెప్పుచున్న 'లు' ప్రత్యయమునకుఁ బరముగా మఱియొక 'లు' ప్రత్యయము చేరుట క్వాచిత్కమని తెలియుచున్నది. 'లు' ప్రత్యయము హలంతరసంయుక్తమైన చోట్ల మాత్రమే వచ్చునని తెలియవలెను. మొసళ్ళులు – నీళ్ళులు మున్నగునవి : 'కథితార్థా త్క్వాచి ల్లుర్గః' అనుదానికిని; ఇంతలు కన్నులు – ఇంతలేసి చెవులు – మున్నగునవి 'క్వచి ల్లు ర్మానవాచకాత్' అనుదానికి నుదాహృతులు. పరిమాణార్థమునందు 'ఎఁడు' వర్ణకము వచ్చునని 'మానార్థా న్నిత్య మేకత్వ ఎఁడు స్యా త్పరిమాణకే' అనుదాని కర్థము. మానెఁడు, తూమెఁడు, పుట్టెఁడు, మొదలగునవి యుదాహరణములు. ఈ 'ఎఁడు' ప్రత్యయము గొన్నియెడల నిత్యముగను గొన్నియెడల వైకల్పికముగను నొకప్పుడు 'ఏసి' యను దానికి ముందును వచ్చును. చేఁటెఁడేసి 'ఇంతలేసి', 'ఇంతేసి' మున్నగునవి యుదాహరణములు. 'ఈ యాంధ్రభాషయందుఁ బరిమాణార్థకశబ్దమునకుఁ బరముగా 'ఏసి' అను ప్రత్యయముసైతము వచ్చును; అది వికల్పము' అని మానార్థాచ్చేసి అనుదాని కర్థము. 'మాత్రచ్' ప్రత్యయార్థమునందు 'బంటి' మున్నగునవి వచ్చును. ఆ ప్రత్యయములకుఁ బూర్వమున 'న' అనునది క్వాచిత్కముగా నిల్చును—అని 'మాత్రజర్థే తు' అనుదాని కర్థము. 'మాత్రో దఘ్నతు బంట్యాదిః తతః పూర్వత్ర నః క్వచిత్' అను పాఠము సరిగాదు. దఘ్నార్థమనఁగాఁ బరిమాణార్థమనియే భావము. ముక్కుబంటినీరు – ముక్కుబంటిజలము – మున్నగునవి యుదాహరణములు.

159. సూ 17 :– "బహుత్వం క్వచిదేకత్వం బహుత్వప్రత్యయః క్వచిత్" – ఏకత్వావాచకశబ్దాదపి బహుతావాచకప్రత్యయః క్వచిదితి ద్వితీయపాదార్థః. ఇరులు ఇత్యాద్యాః బహువచనాన్తాః. కేలు – ఇత్యాద్యాః ఏకవచనాన్తాః. దవ్వునం గని; దవ్వులం గని – నిచ్చ వినుతింతు రాముని మెచ్చఁగాంతు – నిచ్చలు గాంక్షింతు నతని నిరుపమపదమున్ – ఇత్యాది రూపాణి ప్రయోగతోఽవగన్తవ్యాని.

వి :— ఒకప్పుడు నిత్యబహువచనాంతత్వము నొకప్పుడు నిత్యైక వచనాంతత్వమును గొన్నిశబ్దములకు సమ్మతములగును. 'ఒకానొక శబ్దము బహువచనరూపముతో నున్నను నేకవచనార్థమే యందు భాసిల్లును' అని 'బహుత్వం క్వచిదేకత్వ'మ్మనుదాని కర్థము. ఇరులు, కేలు అనునవి నిత్యబహువచనాంతములు. 'కేలు' శబ్దము, ఏకవచనాంతమని కవిశిరోభూషణము చెప్పుట సరిగాదు. దవ్వనన్ – దవ్వులన్ అనుచో రెంటికి నర్థము సమానమే. సమానార్థమునం దేకవచనరూపము బహువచనరూపమును వర్తిల్లుచున్నవి. నిచ్చలు–అనునది బహువచనరూపముతో నున్నను నర్థ మేకవచనార్థమే.

159 సూత్రవిషయమున వివరింపఁబడిన యంశములు పెక్కుగలవు. వానిని విషయముల ననుసరించి కొంతవఱకు నిట బాలవ్యాకరణమును బ్రదర్శించుచున్నాను. సూరిగారు 159 సూ. 1 భా. విషయమును 'అల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందఱి 'లు' వర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు (బాల. అచ్ఛి. 11 సూ.)అని వివరించినారు, 159 సూ. 2 భా. విషయమును, బాల. తద్ధి. 11,12,13, 14 సూత్రములలో వివరించిరి,

159–3 భా. విషయమును 'వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యంబగునపుడు మత్వర్థంబునం దాడి వర్ణకంబగు' (బాల. తద్ధి. 22) 'వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారంబగు' (బాల. తద్ధి.23) ననియు, 4 భా. విషయమును, 'అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు' (బాల. తద్ధి. 17) అని వివరించిరి. మఱి 14భా. విషయమును. 'పగతాదులబహువచన లకారంబునకు రేఫంబగు' (బాల. అచ్ఛి. 5) అని వివరించిరి. ఇంకను పెక్కువిషయములను మఱికొన్నివిషయములతో సంకలనముచేసి పెక్కుసూత్రములతో వివరించియున్నారు. 16 భా. విషయమును, బాల. తద్ధి. 24 నుండి 28 సూత్రములలో వివరించియున్నారు.

ప్రౌఢవ్యాకరణకర్తయుఁ బరిశిష్ట విషయమును శబ్దపరిచ్ఛేదములో 28 నుండి 48 వఱకుఁగల సూత్రములలో వివరించెను.

**160. సూ :— రో లః.**

160 సూ:- రేఫస్య లాదేశ స్స్యాల్లులయోః పరయోః. గోఁడు, గోళ్ళు - గోళ్ళ జిగి, గోళ్ళకొనలన్-ఇత్యాది. లడయో రభేదః. ఒకకొన్ని కళ్ళపై ఇతి రూపం ప్రాప్యేనైవ సాధు. తస్య చేత్యుకారస్య వా లోపే అవశిష్టస్యానుకరణం 'ర' ఇతి. తేన లోపాభావేన లత్వమ్. అతో గోరులు — ఇత్యాదికమపి రూపాన్తరమ్.

వి:— రః, లః-అని ఛేదము. బహువచనలులలు పర మగునపుడు రేఫమునకు లాదేశమగునని సూత్రార్థము. 'తస్యచ వా' అనుసూత్రము చొప్పున రేఫముమీఁది 'అ'కారమునకు లోపము చేయఁగా మిగిలిన రేఫమునకే యందు గ్రహణము. కాన, 'ఉ'కారలోపము రానపుడు 'గోరులు' మున్నగురూపములు సిద్ధించును.

సూరిగారు 'బహువచనంబు పరంబగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' నని రేఫలోనియుకారమునకు లోపము చెప్పి 'గోర్లు-గోరులు'అనురూపములనే సాధించిరి గాని 'గోళ్లు' మున్నగు రూపములను సాధింపలేను. (బాల.అచ్చి.12) బాల.అచ్చి. 14వ సూత్రముచే డకారలకారములకే అలఘులకారమును విధించినారు గాని రేఫమునకు విధించియుండలేదు.

**161. సూ :— డలటా ముదితాం తస్య చ వా లుక్.**

**161.** సూ :— వైకృత డలటవర్ణ సమ్బన్ధినా ముకారేకారాణాం వా లుక్ స్యాల్లులయోః. తస్య 'ఉ' వర్ణసమ్బన్ధిన శ్చోకారస్య వా లుక్ స్యాత్తయోరేవ పరతః. పాడి - పాళ్ళు; కడి - కళ్ళు; జడి - జళ్ళు; త్రాడు - త్రాళ్ళు; అంబలి - అంబళ్ళు; తోలు - తోళ్ళు; చాలు-చాళ్ళు; బెట్టి - బెట్లు' లడళానా మభేదాభిధానాద్రూపమేతత్. పిప్పళ్ళు-ఇత్యాది రూపన్తు సంస్కృతసమప్రాకృతత్వేన జ్ఞేయమ్. ద్వితీయసూత్రస్యోదాహరణం పూర్వమేవోక్తమ్. లోపాభావపక్షే 'ఉద్బహుత్వే' ఇతి

సూత్రేణ ఉకారాదేశే కృతే పాదులు, తడులు, కదులు, పదులు, జడులు, ఇత్యాది రూపాణ్యపి. 'బిసరుహపత్రలోచన కృపీటములందు మునింగి యాడవే మొసళులు మీలు కర్కటకముల్ కమఠంబులు వాని కబ్బునే' ఇత్యాదయః కవీనాం ప్రయోగాః।

"డలటా ముదితాం లుక్ స్యాత్ప్రాయశోఽపి లువర్ణకే।
వైకృతానాం లుకి భవే ల్లడయో రేకరూపతా॥"

ఇత్యథర్వణోక్తౌ ప్రాయోగ్రహణాత్ క్వచిత్ నాగళ్ళు, శేవళ్ళు, కోడవళ్ళు, ఇత్యాది రూపమపి సాధు.

వి:- డలటామ్, ఉదితామ్, తస్య, చ, వా లుక్-అని ఛేదము. ఇందు 'ప్రాయశోఽపి లువర్ణకే' యనుచోట 'ప్రాయశో లే లువర్ణకే' అని పాఠాంతరము వెలయుచున్నది. ఇది తొలిపాఠముకంటె సమంజసమని తెలియనగును. ప్రథమాద్వితీయాబహువచనములం దగపడు లు, ల వర్ణములు పరము లగునపు డాచ్ఛికపదములలోని డలటవర్ణములయొక్క యుకారేకారములకు దఱచుగా లోపము గల్గును. ఇది రేఫముమీఁది యుత్తున కుపలక్షణము. 'రోలో డలటా'మ్మను సూత్రము పాక్షికలోపమును జెప్పుచుండఁగా నీయథర్వణకారిక లోపమును బ్రాయికముగాఁజెప్పుచు వైకృతములకే యీవిధి వర్తిల్లుచున్నదని వచించుచున్నది. అథర్వణకారికచేఁ దత్సమముల కీవిధి ప్రవర్తింపదు గావునఁ గవిశిరోభూషణము పిప్పళ్ళు అనుదానిని సంస్కృతసమప్రాకృతముగా సాధించినది. అది వైకృతము కానోపును.

ఈసూత్రమును సూరిగారు, బాల. అచ్చి. 12, 14 సూత్రములచే వివరించియున్నారు.

**162.** సూ :- సలోలో శ్చ.

162 సూ. 1 :- లకారయుక్తస్య లోశ్చోకారస్య వా లుక్ స్యాత్. పందిళ్ వేసి; అంబళ్ గాచి - పందిళ్ళువేసి - అంబళ్ళు గాచి ఇత్యాది. 'నీయకోళ్ కోల కోల మనుచున్' ఇతి కవితాపితామహః. కేవలలువర్ణస్యాపి వ్యల్లోపః ఆచార్యస్యాభిమత ఏవ. 'అయ్యుదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ పంతతాభ్యుదయుల్' ఇత్యాది.

వి:- సలోలోః, చ-అని ఛేదము. లకారయుక్తమగు లువర్ణో కారమునకు లోపము వికల్పముగా నగునని సూత్రార్థము. 'అంబళ్ళుకాచి' అనునపుడు ఉకారలోపము చేయఁగా గసడదవాదేశము రాఁగా 'అంబళ్ గాచి' అప యగుచున్నది. 'నీరుకోళ్ళు' అనునది నీరుకోళ్ అని యగుచున్నది. కేవలలువర్ణోకారమునకును లోపము వచ్చుట నన్నపార్యునకు సమ్మతమని యుర్వీపతుల్ మున్నగు ప్రయోగములనుబట్టి తెలియుచున్నది.

సూరిగారు కేవలకారోకారమునకే కాక 'ను, రు' అనువర్ణముల యుకారమునకును లోపము గల్గునని 'పదాంతంబులయి, యసంయుక్తము లయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' (బాల. ప్రకీ. 16) అని వివరించినారు.

162. సూ. 2:- "క్వచిద్ద్విపదస్య స్యాదుతో లోపః ప్రయోగతః" ఇత్యథర్వణోక్తేః. 'తత్పాలు ర్భయంబందఁగన్' ఇత్యాద్యాచార్యప్రయోగాచ్చ. 'అతఁ డెల్లర్ భీముఁ డితఁ డనన్' ఇత్యాది ప్రయోగో నిర్బాధః.

వి .- 'సలోలోశ్చ' అనుదానిచే ద్విత్వలకారోకారములకు లోపము వికల్పముగా నగునని సూత్రార్థము. ఉర్వీపతుల్ అను నన్నయ ప్రయోగమునుబట్టి పదాంత లువర్ణములోని ఉకారమునకుఁ గూడ లోపము గల్గునని కవిశిరోభూషణము వచించినది. అథర్వణాచార్యులు గారు,' 'కొన్నియెడల రేఫముమీఁది యుకారమునకు లోపము ప్రయోగానుసారముగా నగునని చెప్పుటచేఁ బదాంతరేఫముమీఁది యుకారమునకు లోపము కొన్నిచోట్లఁ గల్గుచున్నది. ఎల్లరు, ఎల్లర్; తత్పాలురు, తత్పాలుర్; మున్నగునవి యుదాహరణములు.

ఈసందర్భమునఁ బ్రౌఢవ్యాకర్త 'అను, కొను' లోనగుధాతుజవిశేషణములయంత్యోకారమునకు హల్లు పరంబగునపుడు లోపంబు వైకల్పికంబని (ప్రౌఢ. శబ్ద. 13) యీ నువర్ణవిషయమును వివరించియున్నారు.

162. వా. 3 :- సూత్రగత చకారోఽప్యత్ర బీజమితి సువచమ్. నన్విద మసఙ్గతమ్, చకార స్యాన్యత్రేవాత్రాపి సముచ్చయపరత్వస్య వక్తు ముచితత్వాత్. అత ఏవ 'తాఁజెప్పె' ఇత్యాదౌ. అనేన నువర్ణలోకారస్య లోప ఇత్యుక్తి రప్యసఙ్గతా. కిఞ్చ నచ తత్ర పరుషేషు వికల్పోఽభిమతః. తాను సెప్పె నిత్యాది రూపస్య ప్రయోగాభావా దితిచేన్నైవమ్ సముచ్చయార్థకస్యాపి చకారస్య క్వచిత్ప్రయోగానుసారేణ ప్రయోజనాన్తరకల్పనేఽపి న కిఞ్చి ద్బాధకమ్. తాఁజెప్పె నిత్యాదౌ వ్యవస్థితవిభాషా సమాశ్రితేతి నకిమ ప్యనిష్టమ్. అస్తువా చకారస్య సముచ్చయార్థకతా; నహి తావతా లోపే ప్రమాణాభావః. ఆచార్యప్రయోగస్యైవ లోపమాత్రేప్రమాణశిరోమణిత్వాత్. ఉక్తం చాన్యదపి మాన మస్త్వితి యత్కిఞ్చి దేతత్.

వి :- ఇందలి చకారముచేఁ దాను నేను పదములలోని ఉకారమునకు సైతము లోపము రావచ్చునని కవిశిరోభూషణము చెప్పుచున్నది. వాస్తవముగా 'తాను, నేను' పదములలో నుత్వలోపము చేయకున్నయెడల నవి ద్రుతప్రకృతికములు గానేరవు. నిజమునకు వీని యందలి యుకారమునకుఁ గవిభల్లటసూత్రముచేతనే లోపము గల్గునని చెప్పవలసియున్నది. ఆసూత్రమునందుఁ 'బ్రథమైకవచనమాత్రే వికృతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే' అని కలదుగదా.

163. సూ :- ఔపవిభక్తికలీనా మిల్లుగ్బహుళం తథైవ డుశ్చ స్యాత్.

163 సూ:- ఔపవిభక్తికలీనా మకారస్య లుక్ స్యాత్; తస్య బిన్దుపూర్వో డుశ్చ బహుళంస్యా ల్లులయోః పరయోః. బహుళగ్రహణాత్క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిఃక్వచి ద్విభాషా క్వచి దన్యదేవ. గుద్దలి-గుద్దండ్లు; రోఁకలి-రోఁకండ్లు; కొడవలి-కొడవండ్లు; అటకలి - అటకండ్లు ఇత్యాదౌ ప్రవృత్తిః. పందిరి - పందిండ్లు; గాలి - గాళ్ళు - అత్ర అప్రవృత్తిః. తాగలి - తాగండ్లు (తాగళ్ళు) ఇత్యాదౌ విభాషా. పెండిలి - పెండిళ్ళు - పెండిండ్లు ఇత్యాదౌ అనౌపవిభక్తికత్వేఽ ప్యత్ర ప్రవృత్తిః. ఔపవిభక్తికత్వ మనౌపవిభక్తికత్వంచ సమాసే విభక్తౌ టింట్యాదివర్ణభావాభావాభ్యాం జ్ఞేయమ్.

వి:- ఔపవిభక్తికలీనామ్, ఇల్లుక్, బహుళమ్, తథా, ఏవ, డుః, చ-స్యాత్-అని ఛేదము. ఔపవిభక్తికము లగుశబ్దములలోని 'లి'

వర్ణాంతశబ్దములకు 'ఇ'కారలోపమును మిగిలినలకారమునకు బిందుపూర్వకడువర్ణాదేశమును నీసూత్రము విధించుచున్నది. ఈ కార్యమును గవిశిరోభూషణము బహుళముగ వ్యాఖ్యానించి యుదాహరించినది. ఆయుదాహరణములలో 'గాలి–గాడ్పు' అనునుదాహరణ మప్రసిద్ధముగాన సరిగాదని తోఁచుచున్నది. క్వచిదవ్యాదేవ అనుదానిచే 'పెండిలి, పెండిళ్ళు' అని అనేపవిభక్తికశబ్దమునకుఁ గూడ నీకార్యము వచ్చినట్లు వ్యాఖ్యానింపఁబడినది. ఇదియు సరికాదు. దీనికిని ప్రసిద్ధి కవిలోకమందగపడదు. 'జౌపవిభక్తికంబుల లివర్ణ సలలువర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు బిందుపూర్వకి డువర్ణంబు బహుళంబుగా నగు' నని (బాల.అచ్చి.16) సూరిగారీవిషయమును వివరించిరి.

**164. సూ :– అపి సంయుక్తసమాప్తో భూయోఽన్తే లుః ప్రదృశ్యతే నామ్నామ్.**

164 సూ:- సంయుక్తిశ్చాసౌ సమాప్తశ్చ సంయుక్తసమాప్తః. లువర్ణకః సంయుక్తసమాప్తోఽపి నామ్నామన్తే భూయః ప్రదృశ్యతే. ముసళ్ళులు-నీళ్ళులు–ఏండ్లులు ఇత్యాది. 'ఇది సారంగ నకక్య మెవ్వరికిన్' ఇత్యాది తరళపద్యే 'ముసళ్ళులు' ఇత్యాచార్య ప్రయోగః, "సమాప్తా వర్ణకాః కేచి ద్దృశ్యన్తే పునరపి శ్రుతాః" ఇత్యథర్వణోక్త్యా అత్రాపి లువర్ణకస్యోపలక్షణత్వాత్ ఏతచ్చాచార్యస్యాభిప్రేత ఏవ 'సుందరి నాకోదంద్రురయం దభ్యర్థితవు నివు' ఇత్యాది తత్ప్రయోగాత్. అతఏవ 'తరళేక్షణ కలికిలోలంతనమున మెలఁగన్' ఇత్యాదావర్థస్యోక్తత్వేఽపి తనవర్ణక స్సాధుః. క్వచిద్గ్రమాణాత్ ప్రయోగోఽత్ర శరణమితి జ్ఞాయతే.

వి :– అపి, సంయుక్తసమాప్తః, భూయః, అన్తే, లుః, ప్రదృశ్యతే, నామ్నామ్–అని ఛేదము. లువర్ణకము, హలంతరసంయుక్తమై ప్రాతిపదికమును జేరుటచే సమాప్తప్రక్రియ గలదైనను దాని తుదిని మరల 'లు' వర్ణక మగపడుచున్నదని సూత్రార్థము. ఇట్లనుటచే బహువచనలుప్రత్యయము హలంతరసంయుక్తమై యుండుస్థలములలోనే మరల 'లు' అనునది వచ్చునని తెలియుచున్నది. నీళ్ళు, ముసళ్ళు; అను

నవి బహువచనాంతములు, సంయుక్తసమాప్తములునై యుండుటచే నిచట మరల లువర్ణకము వచ్చి నీళ్ళులు, మొసళ్ళులు-మున్నగురూపములు సిద్ధించుచున్నవని తాత్పర్యము. ప్రథమాబహువచనార్థము చెప్పఁబడినను దానికంటెఁ బరముగా మఱొక లుప్రత్యయము చేరుట క్వాచిత్కమని యథర్వణవచనము చెప్పుచున్నది. భారతమునందు 'కోడంద్రురు' అని ప్రయోగింపఁబడినదని నన్నపార్యునిప్రయోగమును గవిశిరోభూషణ ముదాహరించినది. నన్నపార్యునిప్రయోగము 'సుందరి నాకోడందురయందు' అనుపాఠాంతరముతో వెలయుచుండుటచే నదియే కవిప్రోక్తమని యంగీకరించుట యుక్తము. నన్నపార్యుని సూత్రముచేఁ గాని యథర్వణవచనముచేఁగాని, 'కోడంద్రురయందు' అనురూపము సిద్ధించుట దుర్లభము. కోడలుశబ్దము, ఆల్వాదులలోనిదిగాన బహువచన లు-ల పరకత్వమున 'లు' వర్ణకమునకు బిందుపూర్వక డువర్ణమాదేశమగును. బహువచన లుకారమునకు 'నిత్యం దారాదేశ్చ' అను చొప్పున బిందుపూర్వకడువర్ణకమును నిత్యముగ లు-ల లకు రు-రాదేశమును గల్గి కోడందురని ప్రథమాబహువచనమునను, కోడందురన్, కోడందురచేన్; అని తక్కినవిభక్తులయందును రూపము లేర్పడును. సప్తమ్యేకవచనమున 'కోడందురయందున్' అని యుండుట సహజము. ఈడవర్ణోకారమునకు 'డలటా ముదితా' మ్మని డకారోకారమునకు లోపము చేయఁగా 'కోడంద్రు, కోడంద్రన్, కోడంద్రచేతన్' మున్నగు రూపములు సిద్ధించుచున్నవి. ఇందు బహువచనరూపము లన్నియు సంయుక్తసమాప్తములే యగుటచేఁ గోడంద్రురు; కోడంద్రరన్; కోడంద్రరచేతన్, కోడంద్రరయందున్-అని యుండుట సమంజసము కాని 'కోడంద్రురయందున్' అని సంయుక్తసమాప్త మగుప్రథమాబహువచనముమీఁద 'అందు' వర్ణకము వచ్చుట సంప్రదాయసిద్ధము గాదు. కాన నన్నపార్యుఁడు ప్రయోగించినది 'కోడందురయందున్' అనియే కాని 'కోడంద్రురయందున్' అని కాఁజాలదు. దేశ్యముల

యందుఁ గొన్ని ప్రత్యయములు సమాప్తములై మరలఁ బునరుక్తము లగుచున్నవి యని "సమాప్తా వర్ణకాః కేచి" త్తను దానికర్థము. "తర శీక్ష్ణణ కలిపికోలుతనమున మెలఁగెన్" అనుచోటఁ గలిపికొను అను ధాతువుమీఁద భావార్థకరూపము కలిపికోలు, అనియై దానిమీఁద మరల భావార్థముననే తనవర్ణకముకూడ వచ్చినది. కావున నిది యధ ర్వణవచనమున కుదాహరణము కానోపును.

'ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంత తుల్యంబయి బహువచనంబు నెనయు' (బాల.అచ్చ.17) నని యీవిషయమును సూరిగారు వివరించిరి.

ప్రౌఢవ్యాకరణమును దేశ్యంబునం గొన్నయెడల మహన్మహ త్యర్థక బహువచనాంతనామంబులపై మరల బహువచనప్రత్యయములు చూపట్టెడు; నగుచోగువారు వీరు మీరు శబ్దంబుల యంత్యోకారంబున కకారంబగు (ప్రౌఢ.శబ్ద.48) నని వివరించినది.

165. సూ :- కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునో లుక్ స్యాత్.

165. సూ. 1 :- కేషాంచి దుకారాన్తానాం నేతి సప్తమీ విభక్తౌ వరత ఉనో లుక్ స్యాత్. ఉకారాన్తా న్నవర్ణక విధాన మిత్య త్రేదమేవ సూత్రం జ్ఞాపకమ్. చోటున - చోట, ఊరున - ఊర, నడుమున - నడుమ, మీఁదున - మీఁద, పేరున - పేర, ఇత్యాది. బహుళపద మనువ ర్త్య క్వచిత్ పేరున - చోటున ఇత్యాది రూపస్యాపి సాధుత్వ మవగన్తవ్యమ్. కేషాంచి దిత్యుక్తేః ఆ పైపున ఇత్యాదౌ న. కొంగున ముడిచినమాడలు ఇత్యాదికవిప్రయోగః.

వి:- కేషాంచిత్, ఉదన్తానామ్, న, ఇతి, విభక్తౌ, ఉనః, లుక్ స్యాత్ అని ఛేదము.

ఈసూత్రమునందు ఉదంతములకు నవర్ణకము పరమగునపుడు 'ఉన్' అనుభాగమునకు లోపము గల్గునని చెప్పఁబడినది. ఇట్లనుటచే

ఉదంతజడవాచకములకు సప్తమ్యర్థమునందు నవర్ణకము వచ్చునని జ్ఞాపితమగుచున్నది. ఈఉన్‌లోపము క్వాచిత్కము.

165 సూ 2 :— "ఉదన్తటాన్తాః స్థానార్థవాచకా యుక్తబోధకాః
కాపరే తు భవే దత్వం ల్వాన్తో లాన్తః ప్రకారయుక్"

ఇత్యథర్వణః ఇటురమ్ము, అటుపొమ్ము, ఎటు పోయెదు, ఇటకు, ఎటకు, అటకు, అటులంపక్కె, అట్లుపల్కె, అటుకై ఇత్యాది.

వి:— ఇందు 'ఉదన్తటాన్తాః స్థానార్థవాచకాః ఉక్తబోధకాః. కా పరే తు భవే దత్వం ల్వాన్తం లాన్తం ప్రకారయుక్" అని పాఠాంతరము. ఉకారయుక్త టకారముతుదిని గల 'అటు, ఇటు, ఎటు' అను శబ్దములు ప్రదేశార్థబోధకములు. అనుకరణవాచకములును నగును. 'కు' ప్రత్యయపరకత్వమున వానికి ముందు. 'అ'కారము నిల్చును. ఆశబ్దములు ప్రత్యయాంతము లగునపుడును లప్రత్యయాంతములగునపుడును ద్విత్వముతోఁ గూడినవి యగునపుడును ప్రకారార్థకములగును. అను నథర్వణవచనముచొప్పునఁ బైయుదాహరణములు కుదురుపడుచున్నవి.

166. సూ :— ఔపవిభక్తికనామ్నా మత్వం స్యా త్సప్తమీ తృతీయార్థే.

166. సూ :—1 స్పష్టమ్. మింట - కంట - ముంట, వింట ఒంట; ఇత్యాదౌ వర్ణద్వయ స్యాదేశః.

వి :— ఔపవిభక్తికనామ్నామ్, అత్వం, స్యాత్, సప్తమీ తృతీయార్థే — అని ఛేదము.

సప్తమీతృతీయార్థములందు ఔపవిభక్తికనామముల కత్వము గల్గునని యర్థము. మిన్ను శబ్దమున కందువర్ణకము పరమగునపుడు. ఔపవిభక్తికప్రత్యయమగు 'ంటి' అనునది వచ్చి - మింటియందున్ - అని యుండఁగా, సప్తమ్యర్థకప్రత్యయమగు — 'అందున్' అను ప్రత్య

యమునకుఁ బ్రకృతసూత్రముచే నత్వమాదేశము చేయఁగా 'మింటన్' అనురూపము సిద్ధించుచున్నది. అట్లే కన్ను – కంటన్; ముల్లు – ముంటన్; విల్లు – వింటన్; మన్ను – మంటన్; మున్నగు రూపములు సిద్ధించుచున్నవి. 'ఒడలు' అనుదానికి 'ఒంటన్' అని యగునని కవిశిరోభూషణము చెప్పుచున్నది. ఇచట వర్ణద్వయమునకు నౌపవిభక్తిక 'ంటి' వర్ణక మాదేశమగుచున్నది. రెండు వర్ణములకు నౌపవిభక్తికప్రత్యయ మొక్కటి యాదేశమగుట సమంజసముగా నగపడదు. కాన 'ఒంటన్' అనునది ఒండు శబ్దముపై సిద్ధించిన దనుట సముచితము.

166 సూ. 2 :– నన్విదం సూత్రమనారంభణీయమ్. పూర్వసూత్రేణైవ మింటనిత్యాది రూపాణాం సిద్ధత్వాత్.

వి :– మిన్నుశబ్దమునకు 'న' వర్ణకపరకత్వమున నౌపవిభక్తికమగు 'ంటి' అనునది యాదేశమగును. 'మింటి+నన్' అని యుండును. దీనియందు 'ఇన్' అను భాగమునకు లోపము చేయఁగా 'మింటన్' మున్నగు రూపములు సిద్ధించుచున్నవి. ఆకారణముచే నీసూత్ర మవసరము లేదని శంకించుటకు వీలులేదు.

166 సూ 3 :- నచోనో లోపే విభక్తిపరత్వాభావేన 'ఔపవిభక్తివర్ణాప్రాప్తేః' విభక్తిద్వయస్యార్థే అత్వవిధానం సార్థకమితి వాచ్యమ్. ఉనో లోపాత్ ప్రాగేవ నవర్ణే పరతస్తత్ప్రాప్తేః. ఔపవిభక్తికవర్ణావయవస్య టికారస్యేకారాన్తత్వేఽపి విరోధాభావేనానన్తరమప్యునో లోపప్రాప్తేస్సుకరత్వాత్. సర్వవిధిభ్యో లోపవిధే ర్బలీయస్త్వేన పూర్వమేవ లుకః ప్రాప్తావపి నవర్ణకసమ్బన్ధినో కారస్యాపి విభక్తిత్వేన తత్ప్రాప్తి రస్త్యేవ. ఏకదేశ వికృతస్యానన్యత్వాత్.

వి:– ఉల్లోపానంతరమున విభక్తిపరకత్వముండదు గాన ఔపవిభక్తికవర్ణకమునకు ప్రాప్తి యుండదు. కావున విభక్తిద్వయసిద్ధికై అత్వవిధానము సార్థకమగుననియుఁ జెప్పరాదు. ఉల్లోపము రాకముందే ప్రత్యయనవర్ణకపరకత్వమునం దౌపవిభక్తిక 'టి' వర్ణమును జేసి పిదప 'ఇన్' అను భాగమునకు లోపము చేయఁగా మింటన్ మున్నగు

రూపములును నగును. ఇన్ లోపము చేసిన పిమ్మటనైనను మిగిలిన అకార మౌపవిభక్త్యవయవ మగుటచేత నీరూపసిద్ధి కభ్యంతరముండదు.

166 సూ. 4 :- నచ తృతీయాయాం నవర్ణకాభావా త్తత్ర సూత్రం సార్థక మితి వాచ్యమ్. అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యేతి విధానా త్తృతీయాస్థానేఽపి నవర్ణక ప్రాప్తే శ్శిష్టవాదత్వాత్. అన్యథా 'తునిమె శితఖడ్గమున శిరంబు' ఇత్యాది ప్రయోగస్యా సఙ్గతత్వాప త్తిరితి చేత్సత్యమ్ 'గుద్దలి, కొడవలి, చేయి, దాయి, వాయి, ఈయి' ఇత్యాది శబ్దేభ్య స్తృతీయాసప్తమ్యోః 'గుద్దింట, కొడవంట, గొడ్డంట' ఇత్యాది రూపసిద్ధ్యర్థ మిదం సూత్ర మావశ్యక మిత్యవధేహి.

వి.— 'మింటన్' అనుదానికి 'మింటిచేతన్, మింటియందున్' అను నర్థములలో సప్తమ్యర్థము సిద్ధించినను దృతీయార్థము సిద్ధింపదు. తత్సిద్ధి కొఱ కీసూత్రమవసరమని చెప్పుటకు వీలులేదు. 'అన్యస్యాః క్వచిద్భవేచ్చాన్యా' అనుచెప్పుటచే దృతీయాస్థానమునందు నవర్ణకము ప్రాప్తింపవచ్చును గదా! అయినను నీసూత్రము లేకున్నచో 'గుద్దలి, కొడవలి' మున్నగువానికి 'గుద్దంటన్; కొడవంటన్' మున్నగురూపములు తృతీయాసప్తములయందు సిద్ధించుటకీసూత్ర మావశ్యకమే యనకతప్పదు. మఱియు 'ఊరు, చోటు, మేను' మున్నగువానికి సప్తమ్యర్థమే ప్రసిద్ధముగాని తృతీయార్థము ప్రయోగప్రసిద్ధముగా లేదు. ఈవిశేషకార్యమును సామాన్యకార్యముచే గతార్థముచేయుట సరిగాదు. 'గుద్దలి' మొదలైనశబ్దములికారాంతములగుటచే వానికి సప్తమ్యర్థమౌన నవర్ణకము ప్రాప్తింపదుగాన 'కేషాంచిదిత్యాదిసూత్రముచే 'గుద్దంటన్' మున్నగురూపములు సిద్ధింపవు. ఔపవిభక్తికత్వమున్నచో నీరూపములు సిద్ధించుచున్నవి. కావున రెండుసూత్రములు ముఖ్యములే యనక తప్పదు.

సూరిగారు, అహోబలపండితుఁడు చేసిన పూర్వపక్షమునే సిద్ధాంతముగాఁ జేసికొని, 'కేషాంచిదుదన్తానాం, ఔపవిభక్తికనామ్నాం' మ్మను సూత్రములను వేఱుగాఁ జెప్పక రెంటిని గలిపి 'ఔపవిభక్తిక

ముల తృతీయాసప్తముల కత్వాం బాదేశంబు బహుళంబుగా నగు" (బాల అచ్చి.-32) నని చెప్పినారు. కాని ప్రౌఢవ్యాకర్త యీవిషయమును విమర్శించుచు 'ఊరుచోటుమేన్వాదుల నిల్గు విషయంబులు' (శబ్ద-106) అని వ్రాసిరి.

166 సూ. 5 :- "విభక్తౌచ సమాసే న్యురన్యే ప్యాపవిభక్తికాః
ఆదేశాః కేవలా స్త్వేషాం భావోఽభావః ప్రయోగతః"

ఇత్యథర్వణః. కేవలాః ఆగాదేశరూపాః. భావశ్చాభావశ్చ ప్రయోగతో జ్ఞేయ ఇత్యర్థః నిన్నటికి, రేపటికి; నిన్నటిమాపు; నాపాలికి, నాపాలింటికి; నాపాలింటి దైవంబు, తొంటటిచదువులు; తొల్లింటిచదువులు; అప్పటిపనులు, అంతటన్, అంతటివాఁడు, ఎంతటివాఁడు; పాదరండ్లు, పందిటిదండలు, పందిలిదండలు; ఇత్యాది.

వి:- విభక్తి పరమగునపుడును సమాసమునందును టింటీతరములగునటిని యాపవిభక్తికవర్ణములును శబ్దాంతిమవర్ణముల కాదేశములగుచును నాగమములగుచును వచ్చును. వీనియునికిలేములు మహాకవి ప్రయోగములనుబట్టి తెలియవలయును' అనుసథర్వణవచనముచొప్పున నీఁదిమూలములోని యుదాహరణములన్నియు సిద్ధించుచున్నవి.

167 సూ. :- అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః.

167 సూ. 1 :- ఋకారాన్తవ్యతిరిక్తేభ్యః ప్రకృతిద్వయ తుల్య స్త్రీలింగశబ్దేభ్యః పరస్య సోర్లోపస్స్యాత్. అంబ, రమ; గౌరి, వాణి; జడ, మేర; ఇత్యాది. ప్రాన్వే కృతే అనంతర మనేన సులోపః అన్యథా 'హల్ఙ్యాభ్యః' ఇతిసూత్రేణ సోర్లోపః ప్రాప్త ఏవేతి సూత్ర మనావశ్యకం స్యాత్. నచ స్థానివద్భావే నానన్తరమపి ప్రాప్తిః, హలః పరత్వేన స్థానివద్భావాభావాత్. 'దీర్ఘా యా ఙ్యాపావితి' తత్ర విశేషణాచ్చ

వి:- అనుతాం, స్త్రియాం, సమానాం, సర్వస్య, స్త్రీసమస్య, చ, సులోపః, అని ఛేదము.

ఈసూత్రము 'రమా' మున్నగు స్త్రీవాచకస్త్రీలింగశబ్దములకుఁ బ్రథమైకవచనలోపమును జెప్పుచున్నది. 'రమా' మున్నగువానికి హ్రస్వము చేసిన పిమ్మట దీనిచే సులోపము సిద్ధించును. తక్కిన కవిశిరోభూషణగ్రంథము తెలుఁగునకు సంబంధించినది గాదు. స్థానివద్భావము మున్నగు విషయములు తెలుఁగువ్యాకర్తలు ద్దేశించియు నుండ లేదు.

167 సూ. 2 :– నన్విదం సూత్ర మనావశ్యక మేవ. ప్రథమమేవ హల్ఙ్యాబ్భ్య ఇతి సూత్రేణ సులోపః. అనంతర మేవ హ్రస్వ ఆప్తామితి చేత్సత్యమ్. తల్లి తండ్రి ప్రముఖ శబ్దానాం ఏతత్సూత్రాభావే న సులోప స్సిద్ధ్యతీతి జ్ఞేయమ్. అనుతామిత్యత్ర ఉద్గ్రహణ మోకారస్యా ప్యుపలక్షణమ్. సర్వత్రోదోతోరితిసూత్రే సప్తాప 'వు' విధానాత్. ధేనువు, కరభోరువు, చెంచువు, గోవు, ఇత్యాది.

వి:– అనుతామ్ – అనుపర్యుదాసముచే నుదంతములకు స్త్రీలింగములైనను నైసూత్రముచే సులోపము గలుగును. 'సర్వత్రోదోతో ర్వ్యర్థ్యవతి మువత్' అనుదానిచే ను ప్రత్యయమునకు 'వు' ప్రత్యయమాదేశ మగును. ఉకారాంతములకు వలెనే ఓకారాంతములకును సులోపము రాదు. ఈసూత్రమనావశ్యకమని కవిశిరోభూషణము శంకించి చెప్పినవిషయము లేవేవో యవి తెలుఁగున కుపచరింపవు.

167 సూ. 3 :– స్త్రీసమాత్ శబ్దాత్తు సర్వస్మాదపి సోర్లోప స్స్యాత్. ఊరు, బారు; మోరు, బావి, మోవి; పల్లియ, జల్లియ, ఇత్యాది. స్త్రీవాచకత్వేఽపి స్త్రీలింగత్వాభావాత్ దారాదిభ్యో మువర్ణక ఏవ న సులోపః. తేన, 'దారములు' ఇత్యాదిక మేవ రూపమ్. బహుత్వ ఏవ దారశబ్దస్య పుంస్త్వమ్; ఏకత్వే తు స్త్రీత్వమేవ. నిజాగ్రదారన్ ఇత్యాదిరూపమపి సాధ్వేవ.

వి:– స్త్రీలింగశబ్దములకువలెనే స్త్రీసమశబ్దములకుఁ బిమ్మటఁ గూడ సులోపము గల్గును. ఊరు బారు మున్నగునవి యుదాహృతులు. ఇందు 'మోరు' అని యొకటి యగపడుచున్నది. అది ప్రక్షిప్తమేమో యని తోఁచుచున్నది. 'దార' శబ్దమునుగుఱించి కవిశిరోభూషణము

చేసినచర్చకుఁ బ్రమాణ మగపడదు. "దారాః పుంసి చభూమ్న్యేవ" అనునిఘంటువుచొప్పున సంస్కృతమునందు 'దారాః' అని పుంలింగ బహువచనరూపమే యుండును. ఆశబ్దమట్లే తెలుఁగునందు నిలుచునని చెప్పుట కవకాశము లేదు. నిజాగ్రదారన్ అను కవిప్రయోగమును బట్టి యేకవచనమునందును 'దార' శబ్దము ప్రయుక్తమైనది. దీనికిఁ బ్రథమైకవచనబహువచనములందు స్త్రీలింగరూపమే తెలుఁగునఁబ్రసిద్ధమైనట్లు గోచరించుచున్నది. కవిశిరోభూషణము సాధించిన 'దారములు' అనురూపమును భార్యార్థమునఁ దెనుఁగునందుఁ బ్రసిద్ధము గాదు.

'సూరిగారీసూత్రమును స్త్రీలింగబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు' అని (బాల.తత్స.57) స్త్రీలింగప్రథమైకవచనలోపమును జెప్పిరి. అంతేకాక 'హరిః, గ్లౌ, రై' మున్నగువానికిని బ్రథమైకవచన లోపంబు గల్గుటకై 'ఇగ్లౌరాయగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' (బాలతత్స.44) ననియు వచించియున్నారు.

**168 సూ :— ఏదన్తతా చ నామ్నా మన్యతరస్యా మియాన్తానామ్.**

168 సూ. I :— అన్యతరస్యాం పదం వికల్పార్థకత్వేన 'ఝయోహోఽన్యతరస్యా' మిత్యాదౌ పాణినీయే ప్రసిద్ధమ్ ఇయేత్యన్తే యేషాం తే ఇయాన్తాః. తేషాం శబ్దానాం వా ఏదన్తతా చ స్యాత్. ఇయస్థానే వా ఏకారాదేశ స్స్యాదితి ఫలితార్థః. గడియ, గడే; ప్రాకృతభవోఽయం శబ్దః; నతు తత్సమః. 'టో డః' 'ప్రాయో లుక్ కగచజతదపయవామ్' ఇతి సూత్రకార్యే విద్యమానేఽపి తత్ర ఘస్య గత్వరూపాభావాత్. తద్భవత్వే వర్ణవికారస్తు 'వర్ణలోపాగమానైకే' ఇత్యథర్వణోక్తే రేజ్ఞయమ్.

వి :— ఏదన్తతా, చ, నామ్నామ్, అన్యతరస్యామ్, ఇయాన్తానామ్ – అని ఛేదము. ఈ సూత్రములోని 'అన్యతరస్యా' అనుదానికి వికల్పత యర్థమైనట్లు 'ఝయోహోఽన్యతరస్యా' మ్మనుపాణినీయ సూత్రమునఁ బ్రసిద్ధమై యున్నదనియు, దానినే చింతామణి యుపయోగించినదనియుఁ గవిశిరోభూషణాభిప్రాయము. పాణినీయముననే కాక దానికిఁ బూర్వమందున్న సంస్కృతవ్యాకరణము లన్నింటియందును

వికల్పార్థకముగా 'అన్యతరస్యా'మ్మనునది యుండలేదనుట కాధారము లేదుగదా!

'ఇయ' అనునది యంతమునఁ గల తెలుఁగుశబ్దములకు ఏదన్తత్వము వికల్పముగా నగునని సూత్రార్థము. 'ఇయ' అనుదానికి 'ఎ' కారము వికల్పముగా నాదేశమగునని ఫలితార్థము. 'గడియ, గడె' మున్నగునవి యుదాహృతులు. గడియ అనునది ప్రాకృతభవముగాని ప్రాకృతసమము గాదు. ఘటికాశబ్దము 'గడియ' అని ప్రాకృతము లోనికిఁ దద్భవముగా వచ్చినది. ఇందు 'టో డః' 'ప్రాయో లుక్ కగచతదపయవామ్' మున్నగు తద్భవకార్యములు విలసిల్లినను ఘకారమునకు గకారము వచ్చుట కాధారములేదుగదా! తద్భవమని యున్నచో 'వర్ణలోపాగమాన్తే కే' యను నథర్వణవచనముచే వర్ణవికారము గల్గుట కవకాశ మగపడుచున్నది.

168. సూ. 2 :- ముత్తియము - ముత్యము, అయమపి ప్రాకృతభవ ఏవ. తత్సమస్తున. అత్ర. 'యశ్రుతిరః' ఇతి సూత్రేణ అకారాత్పరస్యేకారస్య యశ్రుతివిధానాత్ 'ముత్యము' ఇత్యప్యప్తిః. 'దాపించినట్టి ముత్యాలు గాన్' 'దక్షిణాధీశు ముత్యాలశాల' ఇతిచ శ్రీనాథః.

వి :- 'ముత్తియము' అనుదానియందు 'ఇ'త్వమునకు లోపము చేయఁగా 'ముత్యము' అనురూపము సిద్ధించినది. కావున ముత్తియము - ముత్తెము - ముత్యము - అనురూపత్రయము కల్గును.

'ఇయకు మారుగా నామాంతంబున కేత్వంబు బహుళంబుగా నగు' (బాల.ఆచ్ఛి.23) అని చెప్పి సూరిగారు 'ఇయ'శబ్దంబునం దికారలోపంబుఁగొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబులందు మృగ్యము. ముత్తియశబ్దంబునందుమాత్ర మిత్వలోపంబు గానంబడియెడి' నని వ్రాయఁగా, ప్రౌఢ. దానిని విమర్శించుచు 'ముత్తియశబ్దేతరంబులయందును దఱచుగా నిత్వలోపంబు గానంబడియెడి' (ప్రౌఢ.శబ్ద. 49) అని వక్కాణించినది.

168 సూ. 4 :- విడియము, విడెము; పీడియము, పీద్యము, విద్యము

'క్వచిచ్ఛబ్దభేదేషు భవేత్పర్యస్తలిఙ్గతా' ఇత్యథర్వణోక్తేః క్లీబత్వమ్. అతఏవ మీసలు, గడ్డము, జడలు, ఇత్యాది ప్రయోగాస్సాధవః. ప్రాకృతభవసూత్రే ద్వితీయార్థే వ్యతిరిక్తపదేన లిఙ్గభేదాదే స్సఙ్గ్రహాల్లిఙ్గభేదస్య సమ్ప్రదాయసిద్ధత్వమ్. తదుక్తం భాష్యకారైః, "లిఙ్గ మశిష్యం లోకాశ్రయత్వా ల్లిఙ్గస్య" ఇతి. అతఏవ గవాక్ష ఇత్యాదౌ పుంస్త్వం లోకాత్సిద్ధమితి పాణినీయపారీణాః. ఏవంచ వికృతౌ విధామాయాదిశబ్దానాం క్లీబసమత్వేన ప్రయోగో నదోషా యేత్యవధేయమ్

వి :- వీటికాశబ్దము తెల్గున నైదురూపములతో నిల్చెను. ఈయెడల గొన్నిశబ్దవిశేషములయందు లింగవ్యత్యయము జరుగునని యథర్వణవచనము చెప్పుచున్నది. కాన వీటికాశబ్దమునుండి పుట్టినతద్భవములన్నియుఁ గ్లీబసమములుగాఁ దెలుఁగునందగవడుచున్నవి. మిగిలిన వాని నిట్లే తెలియనగును సంస్కృతమునం దున్నలింగమే తెలుఁగునందుఁ దత్సమత్వమునఁగాని తద్భవత్వమునఁగాని యుండనక్కఱలేదనియు నవసరమైన మాఱవచ్చుననియు నథర్వణవచనమువలన విశదమగుచున్నది. పతంజలిమహాభాష్యమును లోకాశ్రయలింగము శాసింపఁబడదు అని దాని నంగీకరించుచున్నది.

168. సూ. 5 :- కడియము, కడెము, కద్యము; మిరియము, మిరెము, మిర్యము.

వి :- 'ముత్యము' అనుదానియందేకాక 'కడియము, మిరియము, మున్నగు మఱికొన్ని శబ్దములందుఁగూడ నిత్యలోపము గల్గి యకారము పూర్వహల్లుతో సంయోగించుట గలదని ప్రయోగములను బట్టి తెలియుచున్నది.

168. సూ. 6 :- గోనియ, గోనె అయమపి న ప్రాకృతసమః 'నోణస్తు చూళికాపైశాచ్యామ్' ఇతి వా నత్వవిధానేఽపి ఇతఃపరతః తత్ర యత్రస్యేతర భావాత్. 'గోనియ' ఇత్యేవ తత్ర రూపమ్.

వి :- 'గోనియ' అనునదియుఁ బ్రాకృతసమము గాదు. అందు

'ణ' కారమునకు 'న'కారవిధానమున్నను ఇకారముమీఁద 'యశ్రుతిరః' అనుసూత్రముచే యకారశ్రవణము రాదుగదా.

168 సూ. 7:- కన్నియ, కన్నె, కన్య, అతఏవ రాఘవపాండవీయే నెయ్యంపుఁగన్యకలన' ఇత్యుక్తమ్. తత్ర పాండవపక్షే 'కన్యకలనన్' ఇత్యేకం పదమ్. రాఘవపక్షేతు కర్మధారయసమాసః. 'కన్యకలనన' అప్రౌఢయుద్ధఏవేత్యర్థః. కన్యాశబ్దస్యాత్ర లాక్షణికత్వమ్.

"క్వచిదాద్యస్య శబ్దస్య వికారే త్వన్యవాచ్యతా" ఇత్యుక్త్యా విన్నాణాదిశబ్దానా మివాస్యాప్య న్యార్థబోధకతాసంభవాదితి జ్ఞేయమ్. తత్ర ఉనో లోపే ప్రుతస్య ఏవార్థకత్వేన యోగే సతి ఏతద్రూపమ్.

వి :- కన్యాశబ్దమునకు 'కన్నియ' అనురూపము ప్రాకృతతద్భవము. దాని కిత్వలోపము చేయఁగా 'కన్య' అని యగుచున్నది. 'ఒకప్పుడు సంస్కృతశబ్దమునకుఁదద్భవత్వమునం దన్యార్థకత్వము అనఁగా నర్థమునం దొకవిధమైనమార్పు కల్గును' అను నథర్వణవచనము చొప్పున నిత్వలోపము గల్గినచో 'కన్య'శబ్దమునకు 'అవివాహిత' అను నర్థము రాదు. 'అప్రౌఢ' అని దానియర్థము. 'నెయ్యంపుఁగన్యకలనన' అనురాఘవపాండవీయప్రయోగమునందు భారతార్థమున 'కన్యకలను' అనియు, రామాయణార్థమున నప్రౌఢ యుద్ధమునం దనియు నర్థము గల్గుచున్నది. ఇట్లే విజ్ఞానము, విన్నాణము, అను నపుడును నర్థభేదము పొడగట్టుచున్నది. 'కలను' శబ్దమునకు 'సప్తమ్యర్థమున' నవర్ణకము పరమైయుండఁగా 'కలనునన్' అని యగును. దానికి 'ఉన్' లోపము చేయఁగా 'కలనన్' అని యగును. దానిపైని అవధారణార్థకమగు 'అ'కారము నిలువఁగా 'కలనన' అనురూప మేర్పడుచున్నది.

168 సూ. 8 :- తెలియ, తలె, అందియ, అందె, 'అందియలు' ఇత్యాదిశబ్దాః జ్ఞేయాః.

వి :- 'తలియ, అందియ, మున్నగునవి దేశ్యములు, వీనిలో

'అందియ' అనుదాని కేత్వము వచ్చి 'అందె' అనియగును. 'తలియ, అనుదాని కట్టిరూపము ప్రసిద్ధముకాదు.

168 సూ. 9 :— చకారబలేన శబ్దమధ్యే ప్యయం విధిః. 'పరియాచకము, పర్యాచకము, చరేచకము, ఇతి. తేన 'పర్యాచక మేలచేసెదు సుహార్ద్రముచేఁ గరుణింపవేచెలీ' ఇత్యాదిప్రయోగ స్సాధుః.

వి :— చకారమనఁగా 'నేదంతతా చ' అను సూత్రమునందలి చకారబలము చేసని యర్థము. పర్యాచక మనురూపమును గవిప్రయోగ సిద్ధమై యగపడుచున్నది.

168. సూ. 10 :- క్రియాస్వపి 'కదియంబడె, కదెంబడె' ఇత్యాదిరూపమ్. ఇయాన్తానామ ప్యేదన్తతా న పర్వత్ర. "ఇయాన్తాః స్సాధవ శ్శబ్దాఃక్వచిదేదన్తతాపి చ" ఇత్యథర్వణోక్తేః. తేన 'సందియము' ఇత్యాదావేదన్తత్వమ్.

"మల్లియ లంజియ గద్దియ

నొల్లెయ ననుపగిదిపలుకు లొల్లవు కృతులన్" ఇతీదానీన్తనానా ముక్తిస్తు నిర్మూలైవ.

వి :— చకారబలము చేతనే క్రియాపదములందును "ఇయ" అను భాగమున కేకారము వచ్చును. "ఇయ, అను నదంత శబ్దములు సాధువులగును. ఒకప్పు డేదంతరూపములును సాధువులగును. అను నథర్వణవచనముచొప్పున సందియము' మున్నగుచోట్ల నేదన్తత్వ ముండదు.

169 సూ. :— వికృతా సర్వే శబ్దాః క్లీబసమాః స్త్రీసమాశ్చనాన్యేస్యుః.

169. సూ. :- అన్యే పుంలింగసమాస్తు న స్యుః. నిషేధస్య దేశ్యమాత్రవిషయత్వేన తద్భవేషు త్రివిధశబ్దసద్భావేఽపి నదోషః. చందురుఁడు, చందమామ, కడియము, ఇత్యాది. ఒక్కఁడు, ఇతాదీనాం మహత్సమత్వేన విధానా న్న దోషః.

వి :— వికృతౌ, సర్వే, శబ్దాః, క్లీబసమాః, స్త్రీసమాః, చ, న, అన్యే, స్యుః అని ఛేదము. వికృతిశబ్దములెల్ల స్త్రీలింగసమములై ప్రథ

మైకవచనలోపము నొందినవగును. క్లీబసములై 'ము' వర్ణకము నందును. కాని పుంలింగసమము లుండవు. ఈనిషేధము దేశ్యశబ్దము లకు మాత్రమే యగుటచేఁ దద్భవములందుఁ బుంస్త్రీనపుంసకలింగసమ ములు మూఁడు నుండవచ్చునని తెలియుచున్నది. ఒక్కఁడు అనునది మహత్సముమైన నుండనగును,

ఆచ్ఛికశబ్దంబులెల్లం దఱచుగ స్త్రీసమంబులును క్లీబసమంబులు నయి యుండు (బాల. ఆచ్ఛి. 2) అని సూరిగారీవిషయమును వివరించిరి. మఱియు, 'మహత్తులగు మగాదులకుం గయిరాదులకును దుజ్జగు, నుత్వంబు గాదు' అనియు విస్తరించి సూరిగారు వివరించిరి.

**170 సూ. :— క్లీబసమా అమహద్వత్.**

170. సూ. నపుంసకసమా అమహద్వత్తత్సమతుల్యాః స్యుః. మువర్ణకాంత త్వేన వర్తన్త ఇత్యర్థః. అందము-చందము, గుజ్జము- పల్లము ఇత్యాది.

వి :— క్లీబసమాః, అమహద్వత్ అని ఛేదము. నపుంసకలింగ సమశబ్దము లమహత్తత్సమశబ్దతుల్యములై! మువర్ణకాంత తుల్యము లగునని యర్థము.

**171 సూ. :— స్త్రీవత్ స్యుః స్త్రీసమాః.**

171 సూ. :- స్త్రీసమాః స్త్రీలింగతుల్యా భవన్తి. చందమామ, నెల, నవలా, సేలా, గోద, మేడ, బావి. మోవి, తావి, ఎల్లియ, పల్లియ, మోపు, దాపు, ఏపు, ఇత్యాది.

వి :— స్త్రీవత్, స్యుః, స్త్రీసమాః — అని ఛేదము. స్త్రీలింగ శబ్దములతో స్త్రీసమశబ్దములు తుల్యము లగుచున్నవని యర్థము. వీనికిఁ బ్రథమైకవచనలోపము కల్గును.

**72. సూ. :— సమాస్తు సమాః.**

172 సూ. 1 :— సమాస్తు ప్రకృతిద్వయతుల్యా భవన్తి. రాముఁడు, సీత, రఘు కులము, జముఁడు ఇత్యాది.

వి :- సమాః, తు, సమాః — అని ఛేదము. తత్సమములు పకృతిద్వయతుల్యము లగుచున్నవని యర్థము. ఉదా : రాముఁడు మొదలగునవి.

172 సూ. 2 :- వికృతివిశేషోక్తాః కేచద్వి శేషా విఖ్యాతే. "కేచిత్తు వైకృతాశ్శబ్దా డాదిత్వేనైవ సాధవః" డాసి—డావల ఇత్యాది.

వి :- 'కొన్ని వైకృతశబ్దములు డకార మాదియందుఁ గల్గియే సాధువు లగుచున్నవి' అను నథర్వణోక్తిచేఁ బ్పాన డాసి—దాసి; డావల—దావల మున్నగురూపము లేర్పడుచున్నవి. (బాల. ప్రకీర్ణ. 13. సూ)

172 సూ. 3 :- "కుత్రచిత్సర్వశబ్దానాం పునరుక్తిర్న దోషకృత్
తత్ర స్యాద్గిత్వ మాద్యస్య సమతా హ్రస్వదీర్ఘయోః"

హరి-గిరి, వహ్ని—గిహ్ని ఇత్యాది.

వి :- "నింద యర్థమగునపు డొక్కయెడ శబ్దములకన్నింటికిని బునరుక్తి దుష్టము గాదు. ఆ పునరుక్తియందు మలిపదము మొదటి యక్షరమునకు 'గి' అనునది యాదేశ మగును. హ్రస్వదీర్ఘములకు సామ్యమును గల్గును" అను నథర్వణోక్తిచే హరి—గిరి; రావణుఁడు—గీవణుఁడు; మొదలగునవి సిద్ధించుచున్నవి.

"నిందయం దామ్రేడితము నాద్యక్షరంబునకు హ్రస్వదీర్ఘములకు గి—గీ లగు" నని సూరిగారీవిషయమును వివరించిరి. (బాల. ప్రకీ. 22)

172 సూ. 4 :— "కాన్తిశబ్దాది శబ్దాస్తు ద్విరుక్తాస్సన్తి నైకశః
సాధారణా స్తదర్థ్యే చ వైచిత్ర్యం భూరి వర్తతే"

వైచిత్ర్యం వర్ణవైచిత్ర్యమ్. నిగనిగలు నిగన్నిగలు, నిగనిగంబనన్. తళతళమనెన్, ధళధళలాడెన్, గనగనమని, ఘణఘణలు, ఝుంఝుమ్మనెన్ ఇత్యాదయః కాన్తిశబ్దాద్యనుకరణశబ్దాస్సన్తి సంస్కృతాదిసాధారణాః.

వి :- తళ తళ మున్నగు కాంత్యనుకరణశబ్దము 'మున్నగువివిధానుకరణశబ్దములు పెక్కులు భృశాద్యర్థవిషయకద్విరుక్తిగలవి సకల

భాషాసాధారణములై యున్నవి. అనుకరణార్థకేతరము లగుమఱికొన్ని ద్విరుక్తశబ్దములును గలవు. వానియందు వర్ణలోపవర్ణాగమాది వికారవైచిత్రి మిక్కిలిగా నున్నది' – అనుచోప్పున ధగధగలు. నిగన్నిగలు మున్నగునవి సాధువు లగుచున్నవి. 'ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువు పరంబగుచోఁ గొన్నియెడల ముగాగమంబగు" (ప్రౌఢ. సం. 19) 'ధ్వన్యనుకరణశబ్దంబులు ద్విరుక్తంబుల యగు" (ప్రౌఢ. సం. 20) 'అయ్యవి క్రియావ్యవహితంబులు నగు (ప్రౌఢ.సం.21) అని ప్రౌఢ వీనిని వివరించెను. 'ధ్వన్యనుకరణశబ్దంబులు కొన్నింటి కిందు నిగాగమంబగు' (ప్రౌఢ.సమా.12) అని నిగాగమమును గూడ విధించెను.

172 సూ 5 - ఖణిల్లు-పెరిల్లు-ఖంగు-ఖంగుఖంగు: ఖచుక్కు-ఖరిక్కు, రివ్వురివ్వనన్, మిణుక్కురను; చుఱ్ఱను, గోడుగోడునసేడ్చెన్; కులకులగూసెన్, మలమలమాడెన్; గుసగుసనడచెన్; పురపురబొక్కెన్; ధగధగలు, తెకతెకలు, హాహాహాయని యగ్నిమాఁడెన్; కొలకొలమసెన్; వికవికనవ్వెన్; పకపకనవ్వెన్; గఱ్ఱని త్రేఁచెన్ ఇత్యాదయో బహవః ఆంధ్రభాషామాత్రే ప్రయోగార్హా శ్శబ్దాః.

వి:– పైని జూపఁబడినశబ్దజాలమంతయు నాంధ్రభాషయందు మాత్రమే ప్రయోగార్హమగుచున్నదని యూహింపనగును. కాంతిశబ్దాదిశబ్దములు సర్వభాషాసాధారణములైనను దిఙ్మాత్ర మాంధ్రభాషయందు మాత్రమే ప్రయోగార్హము లగుచున్నవని తాత్పర్యము.

172 సూ. 6 :- తలతలమను వెన్నెలజిగి, కొలకొలమంచునుండెన్ ఇత్యాది కవివచనేషు తలతలయను వెన్నెలజిగిన్, ఇత్యాది పాఠఏవ సాధుః, ద్విత్వస్య నిత్యత్వేన విధానా ద్ద్విరుక్తమకారస్యాసంభవాత్.

వి:– 'అహమాదీనాం ద్విత్వ' మ్మనుచొప్పున తలతలమ్మను కొలకొలమ్మను మున్నగురీతిని నిత్యముగా ద్విత్వము రావయును గావున నిట వీనిని మకారాంతములుగాఁ గాక అకారాంతములుగనే పఠింపనగునని కవిశిరోభూషణాభిప్రాయము. కావుననే తలతలయను,

కోలకోలయుంచు నని నిరూపించినది. ఈవిషయము బాల.సంధి.40,41, 42 సూత్రములచే సూరిగారు వివరించినది.

172 సూ. 7 :- "దుమకాతా కావుతాద్యా ఆశీరర్థే తు సమ్మతాః" శుభము ఘటియింపుడుమ ఇత్యాది. ఆదిశబ్దేన 'ఎదు, తన్' ఇత్యాదయో గృహ్యన్తే.

వి:- 'దుమ, కాత, కావుతన్, ఎడున్' మున్నగునవియు నాశీరా ద్యర్థకములుగా సమ్మతములగును' అను సథర్వణవచనముచే 'శుభము ఘటియింపుడును' ఘటించుఁగావుతన్, ఘటించుఁగాతన్ మున్నగునవి సిద్ధించుచున్నవి. ఇందలి యాది శబ్దముచే 'ఎడున్, తన్' అనునవియు గ్రహింపఁబడును. ఘటియించెడున్; ఘటియించుతన్. ఎడుతల్రుదుతం బున కచ్చు పరంబగునపుడు మకారం బగు" (బాల.క్రియా.28) అని సూరిగారు వీనిని వివరించిరి.

172 సూ. 8 :- "క్వచిద్ధర్మక్రియామాత్రి మాశీర్వ్యర్థత్ర ప్రయుజ్యతే" 'ప్రధన జయ మిచ్చుఁ దిరుమలరాయమణికిన్'.

వి :- 'ఒకవ్వా డాశీరర్థమునందుఁ దద్ధర్మక్రియామాత్రమే కవులచేఁ బ్రయోగింపఁబడుచున్నది' అనుచోవ్వనఁ బైరూపము సిద్ధించినది. (బాల. క్రియ. 26, 28 సూ)

172 సూ. 9 :- 'ఏకత్వే సస్యవాచిత్వం బహుత్వే ధాన్యవాచితా లోపాదేశ వికారస్తు తత్ర తత్ర ప్రదృశ్యతే. వరి-వడ్లు, ఆరుగ-అళ్ళు, కొఱ్ఱ-కొఱ్ఱలు ఇత్యాది.

వి :- "ఏకవచనమున సస్యమును దెల్పుటయు బహువచనమున ధాన్యమును దెల్పుటయుఁ గొన్నిశబ్దములవలన సంప్రదాయముగా నర్థములు వచ్చుచున్నది. బహువచనలకారపరకత్వమున వర్ణలోపవర్ణాదేశాదివికారము లచ్చటచ్చటఁ గన్పట్టుచున్నవి" అనుచోవ్వన వరి - వడ్లు మున్నగురూపములు సిద్ధించుచున్నవి.

ప్రౌఢవ్యాకర్త యీ విషయములను శబ్దపరిచ్ఛేదము 28వ సూత్రమునుండి పెక్కుసూత్రములతో విపులపఱచెను.

172 సూ. 10 :– "అసాధ్యస్యాపి శబ్దస్య కల్పనా క్వచి దిష్యతే, క్వచి దర్థ విశేషే స్యుః కేచి దాదౌ ద్వివర్ణకాః"

'తీయవిల్తుఁడు, తుంటవిల్తుఁడు చక్కఁబొమ్మ' ఇత్యాది. నట్టనడుమ, కొట్టకొన, ఎట్టయెదురు, పట్టపగలు ఇత్యాది.

వి :– సంస్కృతప్రాకృతభాషలు తెలుఁగునకుఁ బ్రకృతులు. ప్రకృతిభాషల శబ్దరచన ననుసరించి తెనుఁగునను శబ్దరచన చేయుట సమంజసమై యుండనగుననియు సంస్కృతమునఁ బ్రసిద్ధముగానిరీతి శబ్దఘటన చేయుట యొకప్పుడు సమ్మతమగుననియు నర్థము. చక్కఁబొమ్మ, తీయవిల్తుఁడు, తుంటవిల్తుఁడు మున్నగునవి యుదాహృతులు. ఒకానొకయర్థవిశేషమునందుఁ గొన్నిశబ్దము లామ్రేడితాదులయందు ద్విత్వమునొందు చున్నవని యుత్తరార్థమున కర్థము. కొట్టకొన మున్నగునవి యుదాహృతులు. బాలవ్యాకర్త పైకారికయందలి యుత్తరార్థమును 'ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁదివర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారంబగు' నని వివరించెను. (బాల.సం.40)

172 సూ. 11 :- 'నిసర్గక స్స్యా ద్బహుళ మదన్తా ద్గుణవాచకాత్' నల్లని కలువ నల్లకలువ, తెల్లనికలువ–తెల్లకలువ, తెల్లనితమ్మి-తెల్లఁదమ్మి. బహుళగ్రహణాత్ 'చక్కనివాఁడు' ఇత్యేవ. ఉదన్తాదపి క్వచిత్. 'పవురనివాఁడు' ఇతి రూపమ్. తత్రోకారస్య అత్వం చ. అదన్తాదిత్యుక్తేః వెలిదమ్మి, వెలిదామర ఇత్యాదౌ న నివర్ణకః.

"గుణవచనంబు లగు నల్లాదులకుఁ గర్మధారయంబునందునిగాగమంబు బహుళంబుగానగు" (బాల. సమా.12) నని యీవిషయమును సూరిగారు వివరించిరి.

ప్రౌఢవ్యాకర్త 'గుణవాచకంబులు కొన్నింటికినిగాగమంబునకు బరుషంబులు పరంబులగునపుడు బిందువగు. (ప్రౌఢ.సమా.13) 'గుణ

వాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కెడ నవర్ణంబునకు బిందువు గానంబడియెడి (ప్రౌఢ.సమా.15) నని కొన్ని విశేషములను వివరించెను.

**172.** సూ **12** :– 'శబ్దానా మాదిభాగేషు నూతనత్వాదిబోధకాః
ఏకద్వివర్ణకాశ్శబ్దా అర్థభేదోఽపిచ క్వచిత్
వైపుల్యవాచకత్వేన పేరుశబ్దో విధీయతే'

క్రొన్నన - క్రొంజిగురు: నెన్నడుము - చెంగలువ; నెత్తావి, నెత్తమ్మి, పొందామర; ప్రాఁతచదువు; వేవేలు – వేనవేలు, రాయంచ - రాచిలుక, ఇత్యాది. రాతరుణులు రాకుమారులు; ఇందనుక-ఇంతదనుక; ఇత్యాదీనామ ప్యేతత్సూత్ర ఏవోదాహరణతా జ్ఞేయా. పేరాముదము, పేరురము.

వి .– శబ్దములయాదిభాగమునం దున్నట్టి యొకటి రెండక్షరములతోడిశబ్దభాగములు మాత్రమే క్రొత్త మున్నగునర్థములను దెల్పుశక్తి గలవగుచున్నవి. ఒకప్పు డాద్యక్షరరూపశబ్దభాగమున కర్థభేదమును గల్గు ననుచొప్పున – క్రొన్నన – మున్నగునవి సిద్ధించుచున్నవి. పేరు - అనునది విపులార్థమును జెప్పుచుఁ బేరురము మున్నగు సమాసములలోఁ గనపడుచున్నది – అనుచొప్పున పేరురము – పేరాముదపాకు మున్నగునవి సిద్ధించుచున్నవి.

బాలవ్యాకర్త యీ విషయములను ప్రాఁతాదులలోఁ బఠించి బాల. సంధి. 36 మొదలు 39 వఱకుఁ గలసూత్రములచే వివరించి యున్నారు.

ప్రౌఢవ్యాకర్తయు సంధిపరిచ్ఛేదము 12వసూత్రముచే బాలవ్యాకరణముకంటె మఱికొన్నివిశేషములను జెప్పెను.

**172** సూ. **13.** "అర్థభేదే క్వచిత్ శబ్దాదిగః స్యాచ్చ తతోఽపి దుక్। నామన్త్రణే దుక్ ప్రహ్వస్యాద్ బహుతా త్వత్ర నేష్యతే. క్వచిదామన్త్రణే కానో వైకృతాత్పరతో మతః. పూజ్యత్వే సద్రుతిః కార్యః భేదకం తూభయాత్మకమ్, తచ్ఛబ్దస్య బహుత్వం స్యాత్తథా౽త్ర ద్రుతస్థితిః, లోకోక్తౌ వంశకథనే భవే దన్యత్ర తచ్ఛ్రుతిః".

సీ॥ "చప్పుడు గాకుండ నెప్పుడు వచ్చెనో
వచ్చి దేవరయిల్లు సొచ్చి వాని
పొట్ట యెంతో కాని యుట్టి గట్టిగఁబట్టి
పెద్దకు దాచినముద్దపెఱుగు
దుత్త రిత్తగ జొత్తి తూరుపుచవికెలో
కన్నుకూఱుకుచున్న నన్నుఁ జేరి
చెప్పెడునది యేమి సిగ్గువా ల్లేమన్న
బలిమిమై నల్లల్ల పనియుఁ జేసె

గీ. నంతఁబోవక మఱియు నోయమ్మలార!
నిన్న మెడఁబెట్టుకొన్నట్టి బన్నసరము
నెత్తుకొని వచ్చె నే చెల్ల! నీయశోద
గారి గోపాలిగాఁ, డిట్టు కలఁడె జగతి?"

"వ్రేపల్లెఁ గలుగునింతులం నీపట్టున నేర మెన్న నే వినఁ జాలన్,
నాపాల నుండు మెప్పుడు గోపాలిగ రమ్మటంచుఁ గొడుకుం బిలిచెన్."

వి :— "వాత్సల్యము – నీచత్వము – నింద – ఆక్రోశము – మున్నగు నర్థవిశేషములలో నామమునకుఁ బరముగా 'ఇగా' అనునది యొకానొకప్పుడు నిల్చును. దానికిఁ బరమగు సుప్రత్యయమున కాదేశముగా వచ్చు డుజ్జును నిల్చును. సంబోధనమునందు డుజ్జు నిలువదు. కాని 'ఇగా' అనుదాని దీర్ఘమునకు హ్రస్వము గల్గును. 'ఇగా' అనుదానికి బహువచన ముండదు" అను నథర్వణవచనముచొప్పున 'బాలిగాఁడు'– 'గోపాలిగాఁడు' బాలిగా – బాలిగ; గోపాలిగా – గోపాలిగ మున్నగునవి సిద్ధించుచున్నవి. 'ఒకప్పుడు తెనుఁగుశబ్దములకుఁ బరముగా సంబోధనమునందు 'కాన' అనునది ప్రయుక్తమగును' అనుచొప్పున నా తల్లికాన, నాయమ్మకాన – మున్నగునవి సిద్ధించుచున్నవి. 'పూజ్యత్వే స్ద్రుతః కారుః' అనుపాఠముకంటె 'పూజ్యత్వే స్ద్రుతో గారుః' అని యుండుట సంగతముగా నుండును. పూజ్యతావివక్షయందు షష్ఠ్యాదేశమగు ద్వితీయారూపమైన ద్రుతము పూర్వమందుఁగలదై 'గారు' అనునది సమాసగతమగుచు నిల్చును. ఈ పూజ్యార్థక బహు

వచనములవిశేషణ మేకవచనముగాఁగాని బహువచనముగాఁగాని నిలువ వచ్చును. కొన్నియెడలఁ దచ్ఛబ్దార్థకబహువచన మగు వారుశబ్దము సమాసగతమై యుండును. ఇచ్చటఁ గూడ సామాసిక ద్రుతము నిల్చును. అయ్యగారు - అమ్మగారు; స్వాములవారు మొదలైనవి యుదాహరణములు. లోకోక్తులయందును వంశమును బేర్కొనునపుడును మఱికొన్ని యితరస్థలములందును వారుశబ్దము సమాసమునం దును నగును.

ప్రౌఢవ్యాకర్త యీ విషయముల నీక్రిందిరీతిని సంగ్రహించెను- "తెనుఁగునం గొన్ని తత్సమదేశ్యశబ్దములకంటెం బరంబుగ నేకవచనం బున నీచత్వద్యోతకంబయి 'ఇగా' యనునొక్కశబ్దంబును దానిపై డువర్ణకాదులునుం జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు; తుది దీర్ఘమునకు హ్రస్వంబు వైకల్పికంబు" (ప్రౌఢ. శబ్ద. 22); "దేశ్యంబునం గొన్నియెడల స్త్రీవాచకస్త్రీసమంబులకు సంబోధ్య వాచకశబ్దంబులమీఁద నేకవచనంబున 'కాన' శబ్దంబొండును 'అల' యను నవ్యయం బొండును గానంబడియెడి. 'అల' దీర్ఘాంతంబును నగు" (ప్రౌఢ. శబ్ద. 15) "తఱచుగా స్త్రీసమంబులకుఁ గడపలఁ గొన్నింటి కేవచనంబునం బూజ్యతయందు 'గారు' శబ్దంబగు" (ప్రౌఢ. శబ్ద. 39) "డుమంతంబులగు తత్సమాదిశబ్దంబులకుం గొన్నింటికి ద్వితీయాబహు వచనంబుమీఁదఁ బూజ్యతయందు గారునకు మాఱుగా వారగు" (ప్రౌఢ. శబ్ద. 41) "అర్థవిశేషంబునం దేకత్వమునను, గొన్నిశబ్దములకు మీఁద వారు చూపట్టెడు" (ప్రౌఢ. శబ్ద. 42) ఇట్టివిశేషములు 43, 44, 45, 46, 47 సూత్రములతో మఱికొన్ని విశేషములను ప్రౌఢ వ్యాకరణము వివరించినది.

**172 సూ. 14 :-** నాయయ్యకాన, నాయమ్మకాన, పిన్నపెద్దయైన పింగళి సూరయ్య గారిఁ దలఁచి వేఁడె గౌరవమున-ఇతి యయాతిచరిత్రే. 'పిన్నపెద్దలైన'

ఇతి బహువచనమపి. (దీనివివరణము మీఁది నియమఁబడినది) వయసా న్యూనోఽపి వివే కేన గరీయా నిత్యర్థః.

"విశేషణసమాసోఽపి క్వచి దిష్టో భవే న్మతః."

ఇత్యథర్వణవచనా ద్విశేషణసమాసః. మొత్తనివలఁదపొదుగు; విననికనినమహిమలు. సంస్కృతభాషావిదో విశేషణస్యాపి విశేష్యత్వవివక్షాయాం స్నాతానులిప్త ఇత్యాదౌ విశేషణం విశేష్యేణ బహుళమితి సూత్రేణ సమాసనిర్వాహ ఇతి వదన్తి. 'సూరిచేతోరుచిరాబ్జబోధనరతుం డగుచెవ్వన్. ఇత్యాదిప్రయోగా దాచార్యస్యాపి సమ్మత ఏవాయం సమాసః.

వి :— 'పిన్నపెద్దలైన పింగళి సూరయ్యగారు', పిన్నపెద్దయైన పింగళి సూరయ్యగారు' అనుచోట నేకవచనబహువచనములు రెండు నుండనగును. పిన్నపెద్దలన నపుడు వయసుచేఁ దక్కువయైనను, వివేకముచే నధికులని యర్థము. "విశేషణసమాసముగూడ నొకానొకచో నాకిష్టము" అను నథర్వణవచనముచే మొత్తనివలఁదపొదుగు; విననికనిమహిమలు మున్నగునవి సాధువులు. సంస్కృతభాషయందుఁగూడ నిట్టి సమాసములను సిద్ధింపఁజేసికొనుటకు విశేషణోభయపదముల యందు రెండవవిశేషణమునకు విశేష్యత్వవివక్షచేసి "విశేషణం విశేష్యేణ బహుళ"మ్మను సూత్రముచే స్నాతానులిప్తః మున్నగుసమాసములను నిర్వహించుకొనుచున్నారు. (ప్రౌఢ. సమాస. 17, 18)

172 సూ. 15 :— స్వామలవారన్, స్వాములవారికి న్మిగుల సత్కృప పుట్టఁగఁ బూజచేసెదన్, సుగుణరాశికెల్ల సురుచిరాధారంబు వరదరాజువారి వంగసంబు—అత్రోభయత్రాపి విశేషణం స్యాద్యది తర్హ్యుభయాత్మకమేవ.

వి .— ఇందలి యుదాహరణములు 'తచ్ఛబ్దస్య బహుత్వం స్యాత్' మున్నగునథర్వణగ్రంథముచే సాధువు లగుచున్నవి.

172. సూ. 16 :— "క్రియదర్థాదికా శ్శబ్దా భవన్త్యర్థవిశేషదాః। భవన్త్యజడవాచిత్వే ర్వన్తాశ్శబ్దా మనోహరాః. జడతావాచకత్వే తు న్యన్తతా తత్ర దృశ్యతే."

ఎంత, ఇంత, అంత, కాసంత, ఇత్యాది. అంతియ, ఇంతియ ఇతిశబ్దా తు 'ఇత్తియం ఏత్తియం' ఇతి ప్రాకృతశబ్దయో స్తద్భవా. "కిమిదమశ్చ డెత్తిఅం,

డిత్తలం, డెద్దహాం" ఇతిసూత్రేణ తన్నిష్పత్తిః. పిడన్తత్వే 'ఇంతే అంతే' ఇతి రూపమ్. అందఱు, కొందఱు, ఇందఱు, ఎందఱు, అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని.

వి :— 'కయత్' మున్నగువాని యర్థముగల తెలుఁగుశబ్దము లర్థవిశేషముల నిచ్చునవి యగుచున్నవి. ఎంత పరిమితులు గలవి; ఎంత సంఖ్య గలభిన్నవస్తువులు; ఎంతసంఖ్యగల పురుషులు లేక స్త్రీలు అనునట్టివి విశేషార్థములు; ఎల్ల, ఎల్లరు, అన్ని, అందఱు, అనునవి సర్వతావదర్థకములు. ఎన్ని, ఎందఱు, అనునవి కియద్యావదర్థకములు. కొన్ని, కొందఱు, అనునవి కతిపయార్థకములు. మహన్మహతీవాచకత్వమున 'రు' వర్ణాంతములై కవిసమ్మతము లగుచున్నవి. తిర్యగ్జడవాచకత్వమునఁ గియదర్థాదికశబ్దములయందు నివర్ణాంతరూపస్థితి యగపడుచున్నది.

బాలవ్యాకర్త పైవిషయములను, "అన్నిప్రభృతులు సర్వనామములు" (బాల ఆచ్ఛి. 24) అని చెప్పిన్న రూపముల నుదాహరింపఁగాఁ బ్రౌఢవ్యాకర్త శబ్దపరిచ్ఛేదమందలి సర్వనామప్రకరణ మనునొక ప్రత్యేకప్రకరణమునందుఁ బెక్కుసూత్రముల నుజెప్పి పైరూపములను సాధించియున్నాఁడు. 'సర్వనామసంజ్ఞ' మూలమున లేకున్నను సూరిగారు దానిని సంస్కృతవ్యాకరణము నుండి యుద్ధరించుకొనిరి. ప్రౌఢవ్యాకర్త దాని ననుసరించెను.

173 సూ. 17 :- "ద్రుతోపజీవిన శ్శబ్దాః కేచి త్సుకవిసమ్మతాః
సమ్బద్ధ స్త్రిజ్సుబన్తాభ్యాం పూర్వత్రైచ పరత్రచ
అచ్చత్తుమ్కం భవే త్ప్రాణి స్థితం ప్రశ్నాదివాచకమ్
తత్రాసచ్చ భవే ద్దీర్ఘ ఏదోతా వుభయాత్మకా
క్వచిదూచ్చ భవే దర్థవిశేష ఇతి కేచన."

ఏడ్తెరన్, క్రమ్మఱన్, చెచ్చెఱన్, గ్రక్కునన్, అంతన్, మఱిన్, మిక్కిలిన్, మిగులన్, అప్పుడున్, ఎప్పుడున్. ఇత్యాదయ శ్శబ్దా ద్రుతోపజీవినః. తద్దయు వేడ్కన్ వేడ్కఁ జేఁదద్దయున్, తద్దయునలరెన్ ఇత్యాదిక మన్వయోదాహరణమ్. ఇతఁడా మమ్ముఁ బ్రోచునట్టి యిఁకేల్పు చెలీ!, రమ్మా మముఁ గావ వేగ రఘుకులనాథా. ఏమేమీ

జగతిన్ గఠోరములు, సీత మముఁ గావుమీ సౌఖ్యసిద్ధి గాఁగ, అదివచ్చె నదియె వచ్చెన్, రాజమాత్రుండె రాముఁడు రాజవదన, రావే మముఁ గావ, చంద్రుఁడో, ఇంద్రుఁడో, రక్షింపవో దేవ, ఇంద్రుఁడో చంద్రుఁడో యటంచు నేనీక్షింపన్, రక్షింపవ రామచంద్ర రాజీవాక్షా, రక్షింపవో మమ్ము దేవరాజప్రణుతా, ఎట్లెట్లు, ఎట్లూ ఇతి.

వి:— సముచ్చయాద్యర్థబోధకమగు ద్రుతరూప 'నున్' శబ్దముతోఁ గలిసియే ప్రయుక్తము లగుచున్న కొన్ని శబ్దములు సర్కావిసమ్మతము లగుచున్నవి. వానికిఁ బూర్వమందును బరమందును గలశబ్దములతో నన్వయము గల్గుచుండును. ఆ—ఈ—ఏ—ఓ అనునచ్చులు సుప్తిఙంతపదముల తుదిని నిలిచి ప్రశ్నాద్యర్థవిశేషబోధకము లగును. వీనిహ్రస్వములుకూడ నిట గ్రహింపఁబడును. కాఁగా అ—ఆ; ఇ—ఈ; ఎ—ఏ; ఒ—ఓ; అనునవి సుప్తిఙంతపదములతుదిహల్లులమీఁద నిలిచి ప్రశ్నాద్యర్థవిశేషములను బోధించుచుండునని తాత్పర్యము. ఒకప్పుడు 'ఊ' అను శబ్దముగూడ నర్థవిశేషమునఁ బ్రయోగింపఁబడునని కొందఱను చున్నారు. ఉదాహరణములు మీఁద స్పష్టములు.

172 సూ. 18 :- "ఏవాద్యవ్యయసమానార్థ మేత్వ మత్వఇచ్ఛ దృశ్యతే
సహితాది పదానాం స్యా త్క్రియా శేదకతా యది
నుసస్తత్వ మిష్టం స్యా త్స్వాత్పతీయా స్తతాపి చ
క్వచి ల్లక్షకశబ్దస్య ప్రయోగశ్చ హితావహః.
తచ్ఛబ్దవస్య లోప స్స్యా దదాతోః క్వచిదేకతా."

నేనె భృత్యుఁడను, నీ వదొరవు, ఇత్యాది తమ్ములు భూమిజాత సహితమ్ముగ నుండెడి రాముఁ గొల్చెదన్, నన్నుసహితమ్ము విడిచె నన్నరపమాళి, తమ్ములతో సహితంబుంగ నెమ్మిం గొలువున్నరాము నెమ్మదిఁ దలఁతున్" ఇత్యాది. సయితశబ్దస్సహితశబ్దా న్నిష్పన్నః. తేన సయితమ్ముగన్ ఇతి ప్రయోగోఽపి సాధుః. "చాలుఁబదివేలు వచ్చె నోజలజనయన" ఇత్యాదౌ లక్షకత్వమ్. 'వచ్చినవాఁడ, వచ్చివాఁడ' ఇత్యాది. క్వచిచ్ఛబ్దప్రయోగా త్క్వచిత్కోఽయం ప్రయోగః. అదాతో రిత్యుక్తేః వస్య నవర్ణకాత్పరత్వం జ్ఞాయతే. తేన 'వచ్చువాఁడు, పోవువాఁడు' ఇత్యాదౌ నాతి

ప్రసక్తిరితి జ్ఞేయమ్. 'దశరథాధీశు నడుగులకును దప్పినాఁడన్' ఇత్యాద్యాః కవీనాం ప్రయోగాః.

వి :- సహితశబ్దభవములగు 'సయిత, సైత' అను శబ్దములకుఁ గ్రియావిశేషణత్వమునందుఁ బ్రథమ, ద్వితీయ, తృతీయాంతత్వములతోఁగూడుట సమ్మత మగును - అను నథర్వణోక్తివలన 'తమ్ములు భూమిజాత సహితమ్ముగ' 'నన్ను సహితమ్ము విడిచె' 'తమ్ములతో సహితమ్ముగ' మున్నగురూపములు సిద్ధించుచున్నవి. 'ఒకప్పుడు లక్ష్యార్థము దెల్పుశబ్దప్రయోగమును సమ్మతమగును' అనునథర్వణోక్తిచే 'చాలుఁబదివేలు వచ్చె నో జలజనయన, మున్నగునవి సాధువులు. 'ఒకానొకప్పుడు 'వాఁడు', అను తచ్ఛబ్దార్థములోని వకారమాత్రమునకు లోపము కల్గును-అట్టిచో అకారాకారముల కేకత్వ మునఁగాఁ బరరూప సంధి కల్గును. వచ్చినవాఁడు, వచ్చిన+ఆఁడు-వచ్చినాఁడు; వచ్చిన+వారు వచ్చినారు మొదలగునవి. 'న' అనువర్ణమునకుఁ బరమైనపుడే వకారలోపము నదాత్తుల కేకత యగపడుచున్నది. కాన 'వచ్చువాఁడు, పోవువాఁడు, అనునపుడు లోపము రాకున్నను దోషము కాదు.'అథాతోః' అను కవిశిరోభూషణపాఠము ప్రశక్తి ప్తము కానోపును.

'ఉన్నకలనవర్ణకములమీఁది తచ్ఛబ్దవకారమునకు లోపంబు బహుళంబుగా నగు (బాల. క్రియ. 117) అని సూరిగారు పై విషయమును వివరించిరి. కాని ప్రౌఢవ్యాకర్త - 'దానిఁజూపుకొఁటకు' అను రీతిరూపములను సాధించుటకు – "కొఁటకుకంటెపొంటెలుఁ పరంబులగునపుడు భావార్థకటవర్ణకంబునకు లోపంబు విభాషనగు" (ప్రౌఢ. క్రియ. 14. సూ) "అట్టి, ఇట్టి, ఎట్టి అను విశేషణంబులమీఁది తచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాషనగు" (ప్రౌఢ. సమాస. 9 సూ) ఇట్టిసూత్రములనుబట్టి - తచ్ఛబ్దవోశ్చ లోపస్స్యాత్ -అనుపాఠము గ్రంథకృత్ప్రయుక్తమేమోయని తోఁచుచున్నది. తచ్ఛబ్దవోః=తచ్ఛబ్దమునకుఁ దచ్ఛబ్దవకారమునకు ననీ యర్థము. వకారలోపము వకారవాకారము

లకుఁ గలుగవచ్చునని వ్యాఖ్యానింపనగు. 'అట్టివాఁడు' ఇత్యాదులలో వాకారలోపము. 'అట్ట్రేఁడు' మొ. 'దానిఁజూపుకొఱకు' అనునపుడు కొఱకు మున్నగునవి ధాతువులకంటె రావు. కాన నిచట 'చూపుదాని కొఱకు' అనునపుడు 'దాని' అను తచ్ఛబ్దమునకు లోపమని తెలియ నగు నని వ్యా. సం. స. చెప్పినది.

172 సూ. 19 :- "అద్రుతానా మజాదీనాం ద్విరుక్తావ న్త్యలోపితా
అన్యేషాఞ్చ ద్విరుక్తౌ స్యు ర్బహులోపాగమా మతాః"

ఓహోహో, అయ్యయ్యో ఇత్యాదీనా మద్రుతత్వా దన్త్యస్య లోపః. ఏవఞ్చ 'ఆరె యాని, కలిసికలిసి, అనియని' ఇత్యాదిరూపాణా మసాధుత్వమ్. ఇంటింటన్, ఇంట నింటన్, ఊరూరన్, ఊరనూరన్, వేవేగన్, వేగవేగన్, సారెసారె, సారెసారెకున్- పునశ్శబ్దార్థాత్సారె శబ్దా త్క్రియావిశేషణత్వేన ద్వితీయార్థే షష్ఠీ. 'మాటిమాటికిన్, మాటికిమాటికిన్, వెంటవెంటన్, వెన్వెంటన్, తోడతోడన్, తోడుతోడన్, తోతోన్, తోతోడన్, తోడతోడుతన్, ఒక్కఁడొక్కఁడు, ఒక్కొక్కఁడు, ఒకానొకఁడు, ఒకా నొకటి, ఒండొండుదాఁకి, ఒండొరులఁజూచి, ఒండొరులన్జూచి, ఒకరొకరు, ఒక్క రొకరు, ఒకానొకని, ఒక్కనినొకని, ఒకరొకరులన్ జూచి, ఒకళ్లొకళ్లకై, వేఁజేత, తరమతరము, తరతరము, తారుతారె, తమరుతమరె, తముఁదామె, తనుఁదానె, తనకుఁ దానె, తమకుఁదమకె, తమతమకే, వారువారె, వారివారికి, వారికివారె' ఇత్యాది. తనం తతాను, తమంతతాము, ఇత్యాదా వంతశబ్దస్య పరిమాణవాచినః ప్రయోగః. ఏమి మహాద్భుతంబిది హరీహరి, హరిహరీ దానిసౌందర్య మగునె పొగడ, భళిభళి, ఇత్యా దయో బహవః. సురరాజ సాధుసాధు, ఇత్యాది శ్రీనాథవచన స్యాలోగాహూర ణతా. ఊతామత్ర భవే ద్వావ్రు రిత్యనేన వా సామఞ్జస్య మనుసన్ధేయమ్. 'భుజించి భుజించి' ఇత్యాదీనాం సమానాం, 'తినితిని' ఇత్యాదిపర్యాయాణాఞ్చ 'భుక్త్వా భుక్త్వా' ఇత్యాద్యర్థశబ్దానుసారేణ ప్రయోగోఽవగన్తవ్యః. అన్యోన్యేతరేతరపర స్పరశబ్దానాం సమాసా మత్రాపి ప్రయోగోఽస్త్యేవ. రారమ్మా, రమ్మురమ్ము, పో పొమ్ము, లేలెమ్ము, తాతలము, తలముతలము, పడుపడుండు, పడుఁడుపడుండు, పడుండుపడుండు, కోకోనుము, కొనుముకొనుము, ఇత్యాది.

వి:- ఓహో+ఓహో=ఓహోహో, అయ్యో+అయ్యో=అయ్య య్యో మున్నగు 'ద్రుతప్రకృతికములు కాని యజాదిశబ్దములకు ధృశా

ద్వ్యర్థములలో ద్విరుక్తికల్గినపు డంత్యవర్ణమునకు లోపము కల్గును. అను నథర్వణ వచనముచే సిద్ధించును. కాని యివి "ఆద్యస్యామ్రేడితే న్త్య లోపశ్చ" అను చింతామణిచొప్పుననే సిద్ధించుచున్నవిగదా! మఱి యిదియేల? అనిశంకింపఁజనదు. ఈయథర్వణకారిక మొదటిభాగ మవతరణిక. దీనిరెండవభాగమును బై చింతామణితోఁ గలిపి వ్యాఖ్యానింపవలయుననిచెప్పుట కీవిషయ ముపక్రమింపఁబడినది. "హలాదులగు నట్టియు ద్రుతప్రకృతికములగునట్టి శబ్దములద్విరుక్తియందును వివిధములగు వర్ణలోపాగమాదులు సమ్మతములగు" అని వ్రాసియు త్తరార్థమున కర్థము. మూలమునం దీయఁబడిన యుదాహృతులన్నియు దీనిచే సాధువులగునని యథర్వణునియభిప్రాయము. మాటిమాటికిన్, మాటికి మాటికిన్, ఇంటింటన్, ఇంటనింటన్ మొ॥ ఈవిషయమును సూరిగారు "అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు" (బాల. సంధి.10) అని చింతామణిసూత్రము ననువదించిరి. మఱియు "ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులతొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారం బగు" (బాల,సంధి.40సూ) "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగ నగు" (బాల. సంధి.41సూ)" అందదుకుప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు" (బాల సంధి.42సూ) అనియు వివరించిరి. ప్రౌఢవ్యాకరణమును "కృత్రిమబహుత్వంబునఁ దనతనకుఁ దమదమయు నగు" (ప్రౌఢ.శబ్ద.79. సూ) "కొన్నిశబ్దంబు లర్థవిశేషంబున ద్విరుక్తంబులయి యదంతంబులు నగు" (ప్రౌఢ.శబ్ద.114సూ) "వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకంబగు" (ప్రౌఢ,కారక.14సూ) అని యీయామ్రేడితస్థలములను భంగ్యంతరముగా వివరించెను. సంధిలో లేలెమ్ము, లెమ్ములెమ్ము మున్నగువానిని "ఆమ్రేడితము పరంబగునపుడు కృతప్రాస్వంబునకు దీర్ఘంబగు" (ప్రౌఢ.సంధి.27సూ) వివరించెను.

172. సూ. 20 :- "లోకో క్తీనాంథ వేద్యోగో యదిస్యా ద్భ్రులితిర ఞ్జనమ్".

అమ్మకుచెల్ల, అమ్మచెల్ల, నీవెత్తిబంగారమయ్యెన్, నీయిల్లుబంగారమయ్యెన్, అయ్యోలక్కా, ఇత్యాద్యాలోకోక్తయః.

వి:- 'పండితకవీంద్రశ్రుతిపాత్రమగునని కొన్నిలోకోక్తుల కనఁగా లోకవ్యవహారమునం దలముకొనిన వాక్యములకుఁ దెలుఁగునఁ బ్రయోగార్హత కలదు' అనుచెప్పిన మూలమునందలి లోకోక్తులకును దదితరములకును బ్రయోగార్హత సిద్ధించుచున్నది.

172. సూ. 21 :- "పరేషూణ్డ్యాదిశబ్దేషు సప్తమ్యాద్యే విభక్తయః క్వచిన్నిత్యం కచిద్వాస్యా వహారతాసాం ప్రకారితా" ఆద్యే ప్రథమాద్వితీయేత్యర్థః. నిన్నుండి, నిన్నునుండి, వారినుండి, వీరినుండి, మిమ్మునుండి, మిమ్ముండి, అందుండి, ఎందుండి, ఇందుండి, అంద్వాదీనాం శక్తిమన్మాత్రతాపిక్వచిత్. 'అందుననుండి, అందులనుండి'. అతయేవ 'అందువలన, అందుకొఱకు, అందనుక, అందుదనుక, ఇందుదనుక' ఇత్యాదీని రూపాణి సాధూని, 'ఎన్నాళ్ళనుండియో నన్నుఁజూడఁగా రాఁడు' 'నన్నుఁజూడఁ జనుదే వెన్నాళ్ళనో యుండి' ఇతి రూపం త్వసంగతమేవేతి 'పరేష్వితి' సప్తమ్యంత పదేన విజ్ఞాయతే. 'నాటనుండి, నేటనుండి, ఇంతటనుండి, అంతటనుండి'. 'అవని రాజ్యభరంబుఁ బూనిన యంతనుండి' 'బ్రహ్మలోకంబుననుండి' ఇత్యాది వచనమాచార్యస్య. 'అందుండి పల్కరవ్వడు' ఇత్యాదౌ 'ఉండి' శబ్దస్య స్త్రీత్వేత్యవ్యయ పర్యాయత్వమ్ 'నాటఁగోలె, నాడుగోలె. నాడుమొదలు, అదినుత, నినుదొట్టిబంధుజనములు', ఇత్యాది. 'భీష్ముదొట్టి సద్బంధుజనములు' 'హిమకరుఁదొట్టి పూరుభరతేశ కురుప్రభు పాండుభూపతుల్' ఇత్యాదివచన మాచార్యస్య.

వి:- ఉండ్యాదిశబ్దములు పరమగునపుడు సప్తమీమున్నగు విభక్తులు ప్రయుక్తములగుచుండును. ఇది కొన్నియెడల నిత్యముగను కొన్నియెడల వైకల్పికముగను సంభవించును. ఆసప్తమ్యాదులపై నాయుండ్యాదులు నిల్వకుండుటయు గలదు. ఆవిభక్తులయొక్కయు, నుండ్యాదులయునికియొక్కయు రీతి వింతయైనది." అనునథర్వణవచనము చెప్పిన మూలములోని విచిత్రవిషయముల నన్నింటిని సాధించుకొననగును.

సూరిగారీవిషయమును "ఉండిపదంబౌ కానొకచో వలన వర్ణకంబున కన్వ్రయుక్తంబగు" (బాల.కారక.10సూ) అని వివరించిరి. ప్రౌఢవ్యాకరణముగూడ "వలనకాదేశంబగు ద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు" (ప్రౌఢ.కారక.11సూ) అని విస్తరించెను.

172. సూ. 22 :— ననువంటివాడుఁ నినువంటివాడు, మిముబోటులు, ననురీతి, నినుభంగి, నినుపాటి, నిన్నువలె, నిన్నునట్టివాఁడు మిమ్మునట్టివాఁడు "షష్ఠ్యర్థే ద్వితీయా" పక్షే "నీయట్టివాఁడు, మీయట్టివాఁడు" ఇత్యాది "నీవంటివాఁడు" ఇత్యాద్యపి రూపమ్. విభక్తిలోపే "గిరిజపాలకునట్టిది నీకునొప్ప సామ్రాజ్యము" ఇత్యాద్యా ఆచార్యవాచః. 'నిన్నునంతవాఁడు, నీయంతవాఁడు, రాజునంతవాఁడు. ఒకనాడింద్రుని యంతవేల్పు, అటుతగునే సురేశ్వరుని యంతటివాఁడు' ఇత్యాది కవీనాం వచనమ్. 'అలరఁజేసితి నిషధరాజంతవానిన్' ఇతి శ్రీనాథకవిపద్యే నిషధేశు నంతవానిన్' ఇత్యేవ పాఠస్సాధుః. "క్వచిత్సాదృశ్యశబ్దస్య తదుక్త్యాన్తేవ్యవస్థితిః" ఇతివచనా దేషాం సాధుత్వమ్.

వి:— ఈవిషయములను ప్రౌఢవ్యాకర్త (ప్రౌఢ.సమాస.39 మొ 43 సూత్రములతో వివరించెను.

172, సూ. 23 :— "దీర్ఘస్యాద్వర్ణనిర్దేశే ప్రత్యయోస్యత్ర చ క్వచిత్ కేషాఞ్చిత్ప్రత్యయేనైవ తత్ప్రయోగ స్తుసమ్మతః" ఊకుమూకు ఊవచ్చున్. మూవచ్చున్, ఇత్యాది. దీర్ఘేష్వపి తదేవరూపమ్. కేషాఞ్చిన్మతే కారేఫయోగేనైవ ప్రయోగస్సమ్మతః. మకారమునకు, మాకారమునకు, రేఫమునకు మకారము వచ్చున్ ఇత్యాది. "ద్వన్ద్వేతుస్త్రీవదిష్టం స్యాత్ఛపే ద్రూపం మునాపిచ" ఇత్యుక్తేః చజలు చజములు ఇత్యాది రూపద్వయం సిద్ధమ్.

వి:— అయావర్ణముల నిర్దేశవిధానాదులయందు వానికి దీర్ఘము కల్గును. పక్షాంతరమునందొకప్పుడు 'కార, ఇఫ' అను ప్రత్యయములలో నొకటివచ్చుటయుఁ గలదు. కొన్నియక్షరములకు కారప్రత్యయముతోడనే దానిప్రయోగము సమ్మతమైయుండును. అను నథర్వణవచనముచే అకారము, మకారము, రేఫము మున్నగురూపములు సిద్ధిం

చును. "వర్ణములకు ద్వంద్వసమాసమున స్త్రీసమత్వము వచ్చుటయుఁ గలదు. ఒకప్పుడు ఉవర్ణముతోఁడి రూపమును సమ్మతమే" అను చొప్పున కగలు, చజలు, కగములు, చజములు। మున్నగునవి సిద్ధించును. ఈవిషయములను ప్రౌఢవ్యాకరణము ప్రౌఢ. సంజ్ఞ. 2,3,4 సూత్రములచే వివరించియు ద్వంద్వేతు స్త్రీవదిష్టం స్యాద్భవేద్రూపం మునాపిచ, అను విషయమును ప్రశంసింపనే లేదు.

172సూ. 24 :— "ఏకాదశాదిసఙ్ఖ్యాయా మునో డుశ్చ సబిన్దుకః, ఆదేశః క్వచిదున్మాత్ర మాదేశ స్యాన్య తద్ధికతా, ద్విత్వఞ్చ క్వచిదిష్టం స్యా దత్వమాపవిభక్తితా క్వచిదన్యవిభక్త్యర్థే ప్రథమాపి ప్రదృశ్యతే, ఏకత్వేడుః క్వచిల్లోపో భవేద్రుశ్చ డుజా దయః, ఆదేశశ్చ ఈరూరశ్చ సబిన్దుర్దన్తు మాత్పరః, దవర్ణస్యోత్వయోగస్స్యాద్ద్విత్వా వాదేశా భవన్తిచ, నిత్యం విభాషా సర్వత్ర సమా నేఽపస్తు సర్వదా, క్వచిదన్యస్య చాన్యస్య లోపో దీర్ఘశ్చ కుత్రచిత్" ఆదేశస్యాన్య తద్ధికతేతి, పన్నిత్యాదేశః. పదునొకండు బిందుపూర్వకడాదేశే పండ్రెండు, పదున్మూఁడు, పదుమూఁడు, పదున్నాల్గు, పదునాల్గు, పంతొమ్మిది, పందొమ్మిది, ఇరుపది; ఇరువది. ఇత్యాదేశః, పకారస్య వకారాదేశశ్చ. అన్యత్ర రెండుపదులు, ముప్పది, అత్ర మ్వాదేశః. పకారస్య ద్విత్వంచ. ఏవం రూపాంతరం సర్వమూహ్యమ్. నిత్యం విభాషా సర్వత్ర ఇత్యుక్తేః "పదియునొకడు" ఇత్యాదీన్యపి రూపాణి యథాసంభవ మూహ్యాని.

వి :— "ఏకాదశాద్యర్థక సంఖ్యావాచక శబ్దములందు "ఉన్, ఉః, డుః, చ, సబిందుకః, ఆదేశః, క్వచిత్, ఉత్, మాత్రం, స్యాత్। ఉన్, ఉ, ండ్" అనునవి యాదేశములగును. ఒకచో ఉవర్ణకము మాత్రమే యాదేశమగును. ఒకఁడు, ఒకటి, రెండు పరమగునపుడు పది శబ్దము తుదివర్ణముచోట 'ఉన్, ఉ' అనునవి యాదేశములగును. ఇట్లే తక్కినవియు అని ''ఏకాదశాది సంఖ్యాయాం" అనుదానికర్థము. అట్లే ఇరువది మున్నగుస్థలములయం దేకవచనము నిలుచును. ఇదియుమహా త్వమున మాత్రమే వచ్చును. అని తద్ధికతా అనుదానికర్థము. ఇచట 'తథావతా' అనుపాఠముకలదు. అది సరికాదు. కొన్ని సంఖ్యావాచక ములలో పరపదాదిని ద్విత్వమును సమ్మతమగును. 'మున్నూఱు,

సన్నూఱు, ఇన్నూఱు' మున్నగునవి యుదాహృతులు. చకారముచే నీద్విత్వము పాక్షికముకాన 'ఎనమనూఱు, ఎనమన్నూఱు' మున్నగు రీతి రూపములుండనగును. అని "ద్విత్వఞ్చ క్వచిదిష్టంస్యాత్" అనుదానికర్థము. "సమాసమున నూఱు శబ్దమాపవిభక్తికరూపముతో నిల్చి దానిమీఁద నత్వము నిల్చుటయుఁ గలదు" అని 'అత్వమాపవిభక్తితా' అనుదానికర్థము. నూటయిరువది, నూటొకటి, మున్నగునవి యుదాహృతులు. 'ఒకానొకప్పు డితరవిభక్తుల యర్థమునఁ బ్రథమావిభక్తియు నగపడుచున్నది'. అని 'క్వచిదన్య విభక్త్యర్థే' అనుదానికర్థము.'ఇరువది నలువురు' అనునపుడు 'ఇరువదిటియొక్క నలువురు' ఇరువదిటిన్+నలువురు=ఇరువదినలువురు. అనియగును. దీనికి ప్రథమ వచ్చినది. ఇట్టివి దీనియుదాహృతులు. 'క్వచిదన్యవిభక్త్యర్థేప్రథమాదిః ప్రదృశ్యతే' అనువచనము 'షష్ఠీభవేద్వితీయాతుల్యా, అనుకారికకు వివరణము. "ఒకప్పు డేకత్వార్థబోధకమగు ఒకశబ్దమునందు 'క్వచిదన్త్యస్య చాన్త్యస్య' అనుదానిచే లోపము కలుగఁగా రువర్ణాగమమును, ఉవర్ణాగమమును, డుజ్వర్ణకాదులును నగు" అని 'ఏకత్వేరుః' అనుదానికర్థము. "రెండు మున్నగువానికి వివిధములగు నాదేశములును, బహువచనలువర్ణముచోట ఉవర్ణపూర్వకరువర్ణమును (ఉరు) ఒకప్పుడు రువర్ణమాత్రమును నామవాచకము మున్నగువానికిఁబరముగ నాదేశములగును. ఈ సందర్భములో 'ఇరు, ఇద్ద' అనునవి రెండు శబ్దమునకును 'మూ, మ్ము' అనునవి మూఁడు శబ్దమునకుమ 'నలు' నాల్గు శబ్దమునకును, 'ఏను' అనునది అయిదు శబ్దమునకును, ఎనమ, తొమ్మ అనునవి ఎనిమిది, తొమ్మిది అనువానికిని నాదేశములగును" అని 'ఆదేశశ్చ' అనుదాని కర్థము. "పదిశబ్దముయొక్క దవర్ణేకారమునకుకారాదేశమగును. ఉ, రు, మున్నగునవి చేరునపుడుత్వముకల్గును. ద్విత్వాదేశాదులు నగును" అని 'దవర్ణస్యోత్వ యోగస్స్యా ద్విత్వాదేశాభవన్తిచ' అనుదానికర్థము. సంఖ్యావాచకవిషయములగు పైవిధుల

చోటఁ గవిప్రయోగానుసారముగఁ గొన్నియెడల నిత్యముగను, గొన్ని యెడల వికల్పముగను నివి వర్తిల్లును. పూర్వకాండకమగు 'అప' ప్రత్యయ మెల్లప్పుడును సమాసమందే వర్తిల్లును" అని 'సమాసేవ స్యురప్వాదా' అనుదాని కర్థము. "ఒకానొకప్పుడు పదమాతుది వర్ణము నకును, ఒకఫు) దంత్యేతరవర్ణమునకును లోపముకల్గును. తత్పూర్వస్వరమునకు దీర్ఘము నగును" అని 'క్వచిదన్త్యేత్యాది' కర్థము. (పై విషయములు ప్రౌఢ. సమా.22 మొ 26 వఱకు వివరింపఁబడినవి).

172 సూ. 25 :- ఒంటరి, ఒంటిగాఁడు, వారొంటఁగూడి, మాచెలియొంటనున్నది, నాకొంటయ్యెడు నెచ్చెలీ విరళికన్ నానాధనిం దిల్వకే, ఇత్యాద్యా ఒంటి శబ్దో దేశ్యః. ఒక్కటి, రెంట, మూఁట, నాల్గిట, నాల్గింట ఇత్యాది. 'బాణమొక్కట నేసెన్' బాణమొక్కటి నితి ప్రయోగోపి, 'మతిజలపూరితంబులగు నూఁగులు నూటికి కంటెన్' ఇత్యాచార్యః.

వి:- ఒంటరి=ఏకాకి. ఇది ఒంటి శబ్దమనియు, దేశ్యమనియుఁ గవిశిరోభూషణము చెప్పినది. కాని ఒండు శబ్దముయొక్క ఔపవిభక్తిక టివర్ణాంతరూపమనుట లెస్స. ఇట్లే రెంటన్, మూఁటన్, నాల్గింటన్ మొ॥ బాణమొక్కట నేసెన్=ఒక్కటి=ఒక్కటన్ అనుహాయముగా ననిదానియర్థము. నూటికికంటెన్, అనియాచార్యప్రయోగములు కలదు.

172 సూ. 26 :- నన్వస్మిన్ పద్యే 'తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు' ఇత్యత్ర బువర్ణకానంతరం నకారః శ్రూయతే. తత్ర కాగతిరితి చేత్, 'తత్క్రతు శతబునకెన్న సుతుండు మేలు' ఇత్యేవపారస్సాధుః. దానికెక్కుడు, నీకనెక్కుడు, ఇత్యాదావివ పంచమ్యర్థే షష్ఠీ విభక్తేః శ్రుతత్వాత్. యది బహుపుస్తకస్థితత్వేన తత్పాఠ ఏవాగ్రహః, తర్హి తద్రూపే తదేవవచనం ప్రమాణమస్తు.

వి:- తత్క్రతుశతంబునకంటెన్ అనునపుడు కంటె వర్ణకమువకు ముందు న అనునది యుండుట కాధారములేదనియుఁ దానిని 'తత్క్రతు శతంబునకెన్న' అని పఠింపవలెననియు, నది పంచమ్యర్థమునవచ్చినషష్ఠి యగుననియు వచించి కవిశిరోభూషణము 'తత్క్రతుశతంబునకంటె

సుతుండు మేలు' అనుపాఠమే సాధువనియు దానిసాధుత్వమున కా ప్రయోగమే మూలమనియు గూడ వచించెను.

బాలవ్యాకరణమీవిషయమును సూత్రింపకున్నను ప్రౌఢవ్యాకరణము "కంటెవర్ణకంబు పరంబగునపుడును గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి" అనిసూత్రించెను. ఈనగాగమము కవిత్రయమువారికి సమ్మతమైనట్లగపడుచున్నది. ఇచట 33,34,35 భాగముల విషయములకు (ప్రౌఢవ్యాకరణవివరణములు చూపఁబడుచున్నవి. ప్రౌఢవ్యాకరణమున శబ్దపరిచ్ఛేదమున 51వసూత్రము మొదలు ప్రకరణాంతమువఱకు నితరవిషయములు కొన్నింటితోఁ గలిపి వివరింపఁబడినవి.

172 సూ. 27 :- నూటొక్కటి, నూటరెండు, ఇత్యాదౌ సమాసే టోపవిభక్తిర్వర్ణః. ఒండు, ఒండ్లు, ఒరుఁడు, ఒరులు, ఒకరుఁడు, ఒకరులు, ఆదిశబ్దేన న్యాదయః. ఒక్కనశబ్దోఽప్యస్తి, ఒక్కనవిరివికి నిత్యాదికవిప్రయోగాత్. ముక్కనబంటీత్యాదావపి నవర్ణకో బోధ్యః.

వి:- నూటొక్కటి మొన్నగువానియందలి 'టు' వర్ణకము సమాసమున వచ్చిన యౌపవిభక్తికటివర్ణకము. ఒకరుఁడు, మొన్నగువానియందు నిగాగమాదులు కల్గి, ఒకరునిన్ మొన్నగురీతి రూపములు కల్గును. ఒక్కనవిరిఖికి అనుకవిప్రయోగముచే ఒక్కన అనురూపము నుండును. బంటి అనునది పరమగునపుడు నవర్ణకము వచ్చి ముక్కనబంటి మొన్నగురూపమునుండును. బాలవ్యాకరణము "దఘ్నార్థంబున బంటికొలఁదులగు" (బాల,తద్ధిత,27 సూ) అని చెప్పెను. బంటిపరంబగునపుడు నగాగమమును గవిశిరోభూషణము దాహరించెను.

172 సూ. 28 :- ఒండు ఇత్యాదీనామాచిత్యాదన్యార్థకత్వమపి. ఏకశబ్దస్యాన్యార్థేపి ప్రవృత్తేః. తదుక్తమభిధానకారైః. ఏకోఽన్యార్థే ప్రధానేచ ప్రథమే కేవలే తథా, సాధారణే సమానేఽల్పే సఙ్ఖ్యాయాఞ్చ ప్రయుజ్యతే" ఇతి. అతయేవ 'ఒక్కొకటి, ఒకించుక, ఒకకొన్ని' ఇత్యాదీనాం సాధుత్వమ్. 'ఇద్దరు, ఇరువురు, ముగ్గురు, మువ్వురు, నలుగురు, నలువురు, ఏవురు, ఐదురుగు, ఆఱుగురు, అర్వురఁ

జూచెన్, ఎనమండ్రు, పదుండ్రు, పదునొకండ్రు ఇత్యాదీని రూపాణి సర్వాణి ద్విత్వాదేశనిత్యత్వవికల్పవచనపూర్వక మూహ్యాని. 'రెండవవాఁడు, మూఁడవకన్ను' ఇత్యాదావవాదేశో నిత్యః. 'ఏనవపర్వము' ఇతి. ఎనిమిదవపర్వ మిత్యాది వచనమాచార్యస్య. ఏతేన 'పదార్వన్నియ పట్టుపుట్టము' ఇత్యాది వచన మసంగతమేవేత్యవధేయమ్.

వి:- ఒండు మొదలైనశబ్దములకు సంస్కృతమునందేకశబ్దమునకువలె నితరార్థములునుండదగును. అభిధానకారులు "ఏకశబ్దము అన్యము ప్రధానము, ప్రథమము, కేవలము, సాధారణము, సమానము, అల్పము అనునర్థములందే కాక సంఖ్యావాచకముగను ప్రయోగింపఁబడును'' అని చెప్పిరి. కాన ఒకానొకటి, ఒకించుక, ఒకకొన్ని మున్నగునవి సాధువులగుచున్నవి. 'ఇద్దరు, ఇరువురు, ముగ్గురు, మువ్వురు' అని రెండేసి రూపములు మఱికొన్ని కార్యవిశేషములతో నగపడుచున్నవి. ఇవన్నియు ద్విత్వాదేశనిత్య వికల్పాదులచే కలిగినవని తెలియవలెను. రెండవవాడు, మూడవకన్ను మున్నగువానియందు' అవాదేశము నిత్యము. ఏనవ పర్వము, ఎనిమిదియవపర్వము అనునవి నన్నపార్య ప్రయోగములు, పదార్వన్నియవట్టుపుట్టము, అనునపుడు 'పదాఱవ', పదునాఱవ, అని అవాదేశముతో నుండవలెను. ఇందవాదేశము లేకుండుట దోషము. 'సంఖ్యకుంబూరణార్థంబునం దవగాగమంబగు (బాల. ఆచ్ఛిక.25సూ) అని సూరిగారును నిత్యముఁగనే అవగాగమమును విధించిరి.

172 సూ. 29 :- వెంగసాల, మోసల, అనుఁగు మోసల, వెంగము, మోము, దిగులుపడు, డీలుపడు, చానేసెన్, చావకేసెన్, నోనాడెన్, నోవ్వనాడెన్, నన్నుమఱాక, మఱువక, మఱక' ఇత్యాది. క్వచిన్నదీర్ఘః. 'నెలకొనియె' క్వచిద్దీర్ఘ యేవ. నన్నొల్లఁడు, ఒల్లాఁడు, ఎవ్వఁడు, ఏఁడు, ఎవ్వారు, ఏరు' పూనె, నెగనె పొడవె పొనరె పొండె నిత్యత్ర ఆద్యస్య హల్మాత్రస్య లోపే 'ఊనె' నిత్యాది రూపాణి కవి ప్రయోగసిద్ధాని. 'నేర్తురు' ఇత్యత్ర రేఫలోపే 'నేతురు, ఇతి ప్రయోగోపి కవిసమ్మతః. 'నీవు, ఈవు, నేను, ఏను, మీరు, ఈరు, మేము, ఏము' ఇతి యుష్మదస్మదోః ప్రథమాయాం రూపాణి. ఏతాదృశాని రూపాణి జ్ఞేయాని.

వి:- 'మొగసాల, మటాశ, మఱువక' అనునంతవఱకుఁ గలయుదాహృతులలో దీర్ఘము వికల్పము. 'నెలకొనియె, నెలవుకొనియె' మున్నగుచోట్ల దీర్ఘములేదు. 'ఒల్లఁడు, ఒల్లాఁడు, ఎవ్వఁడు, ఎవ్వాఁడు' మున్నగుచోట్ల దీర్ఘ మగపడుచున్నది. 'పూనెన్, నెగసెన్, పొదవెన్, పొనరెన్, పొందెన్' మున్నగుచోట్ల మొదటిదగు హల్లుమాత్రము లోపించి 'ఊనెన్' మొదలగురూపములు కవిప్రయోగసిద్ధములై యగపడుచున్నవి. 'నేర్తురు' అనుదానికి 'నేతురు' అనుప్రయోగము కవిసమ్మతమే. 'నీవు, ఈవు' మున్నగువానిలోఁగూడఁ బ్రథమహల్లోప మగపడుచున్నది. ఈపై రూపములను బాలవ్యాకరణము కొన్నిటిని బ్రత్యేకముగ సాధింపఁగా మిగిలినవానిని బ్రౌఢవ్యాకరణము సాధించినది.

172 సూ. 30 :- "క్వచిద్బిందుర్ని నా దృష్టః క్వచిత్తేషు ననూ మతో, క్వచిల్లోదః క్వచిద్ద్రోణో దృష్టో దుస్తు క్వచిచ్చ్యుతః" బిందుః పూర్ణబిందుః, 'పూనిచెన్, పూంచెన్, పూన్చెన్' ఇతి రూపత్రయమ్. 'పూఁచె' నితి రూపం త్వప్రామాణిక మేవ దీర్ఘాచ్ఛేత్యణ్వివే త్యుక్తేః. దీర్ఘాత్పర స్యానుస్వారస్య ఉభయవిధత్వాంగీకార విరోధాత్. అతఏవ ముద్దరాజురామభద్రకవినా

"పూంచె న్మించె న్మనిచె న
టంచుఁ బ్రయోగింపఁజెల్లు నమరశ్రేణిన్
మంచి మనోరథనికరము
నించె రమాధిపుఁడు భక్తపోషకుఁ డనఁగన్".

ఇతి లక్షణముక్త్వా 'కాంచనమాలాలంకృత చంచత్తనులీలమెఱయు జవనాశ్వములన్, బూంచినరథమునమణిమయ ,పంచాననకేతువెత్తె బంధురఫణితిన్' ఇతి తిక్కయజ్వవచనముదాహృతమ్. మనిచెన్, మన్చెన్, మంచెన్, ఇతి రూపత్రయమ్. మన్నించెనితిరూపం తుమాన్యశబ్దభవత్వేన జ్ఞేయం. 'మంచి తనేకయాగముల మానుగ దక్షిణలిచ్చి విప్రులన్' ఇత్యాచార్యః. 'అనిచెన్, అంచెన్, అన్చెన్' ఇతిరూపత్రయమ్. 'వెదకెన్, కదికెన్, చదికిలఁబడియెన్, పిదికెన్, ఉదికెన్, ఇత్యాదా వెదకెనిత్యాదీని డకారేణాపి రూపాణి; పోడిమి, ఉరువడి, వాడిమి ఇత్యత్ర పోణిమిత్యాది రూపాణి ణకారేణాపి సిద్ధాని. 'పదఁతుక, పదక, వదను, కడిమిమ్రాను,కదక, పేఁదుకొనెన్, పువ్వుబోఁడి' ఇత్యాదౌ డకారఏవ, న ణకారఇతి జ్ఞేయమ్.

వి:— ఈకారిక 'శత్రర్థే తూత్తశ్చోనోః తస్య స్యాచ్చ పూర్ణ బిందురపి.'' అనుదాని వివరణము. ప్రేరణార్థకస్థలములలోఁ గొన్ని యెడల లుప్తస్వర నకారస్థానమున బిందువును, స్వరలోపము రానిపక్షమున నివర్ణవ్యంజననకారములు నగపడుచున్నవి. కొన్నిరూపములలో నినల చోట నువర్ణనకారములుకూడ నుండనగును. ని వర్ణము భూతార్థరూపములందును, నువర్ణము వర్తమానార్థకములందును నిల్చుననియు స్వరలోపపక్షమున వ్యంజననకారము, బిందువు, పర్యాయముగ నుండుననియు నర్థము. పూనిచెన్, పూన్చెన్, పూంచెన్' అని మూఁడురూపములు. ఇచట 'సి' వర్ణమునకు అర్ధబిందువురాదు. దీర్ఘముకంటెఁ బరముగ ఖండబిందువే యుండునని 'దీర్ఘాచ్ఛేత్ఖండఏవ' అనిచింతామణి చెప్పుచున్నదికదా! ముద్దరాజురామభద్రకవి యీ విషయమునే చెప్పి తిక్కనార్యునిప్రయోగమును జూపెను. మనిచెన్, మన్చెన్, మంచెన్' అని మూఁడు రూపములు. 'మన్నించె' నను రూపము మాన్యశబ్దభవము 'మంచి తనేకయాగముల' అని నన్నపార్యునిప్రయోగము, 'అనిచెన్, అంచెన్, అన్చెన్' అని మూఁడు రూపములు. వెదకెన్, వెతకెన్, కదికెన్, కతికెన్, చతికిలఁబడియెన్, చదికిలఁబడియెన్, పిదికెన్, పితికెన్, ఉదకెన్, ఉతికెన్' అనుచోట్ల, తకారముతోఁగూడ రూపములుండును. పోఁడిమి, ఉరువడి, నాడెము మున్నగుచోట్ల 'పోణిమి' మున్నగు రూపములు ణకారముతో నుండవచ్చును. పోఁడిమిశబ్దములో నరసున్నయుండుటచే ణకారము వచ్చుట సరికాదు. పడఁతుక, పడక, కడిమిమ్రాను మున్నగు చోట్ల డకారమునకు ణకారము రాదు. పువ్వుబోఁడిఅనుసమాసమును సూరిగారు 'బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడి యగు'(బాల. సమాస. 23 సూ) అని చెప్పి యుదాహరింపఁగా అలరుఁబోఁడీత్యాదు లుపమానపూర్వపద కర్మధారయంబులు' అని దీనిని కర్మధారయముగా పోఁడి శబ్దముతోఁ బ్రౌఢవ్యాకరణము సాధించెను, ఇతనిమతమున డకారమునకు ణకారము వచ్చి 'విరిబోణి' మున్నగురూపములును సాధువు లగును.

172. సూ. 31 :— "ప్రకృత్యుక్తప్రకారేణ రచనా రసరఞ్జనీ
భవేదత్రాపి శబ్దస్య క్వచిద్యోగేన సాధుతా
భవేత్క్వాచి దయోగేన క్వచిత్తు వచనశ్రుతేః
తత్తత్పదం పరిగ్రాహ్యం యద్య త్సహృదయేహితమ్"

సంస్కృతభాషోక్తప్రకారేణ తత్తద్రసానుకూలరచనా ప్యత్రాపి చావశ్యంభావినీ,- నునుగాల్లు - మీఁగాల్లు-ఇత్యాదీనాం శబ్దాన్తరసంయోగే శృఙ్గారే సాధుతా. వ్రేల్లు విదిమియు- కాల్లు నఱికియు-ఇత్యాదీనా మయోగే రౌద్రాదౌ సాధుతా- పండ్లికిలించుచుండెడి కాల్వురు - ఇత్యాదీనాం బహువచనశ్రవణేన బీభత్సాదౌ సాధుతా. శృఙ్గారేతు- పలుగంటి రక్తిమ భాసిల్లెఁగెమ్మోవి- పంటికొలంది నొక్క- నరపాలక మాళి యుదీర్ణరాగుఁడై- ఇత్యాద్యేవ. నతు- పళ్ళగంటి- ఇత్యాదిప్రయోగః "తత్తత్పదమితి" యత్ర యత్ర రసే యద్య ద్వికృతిపదం సహృదయాహ్లాదకం తత్తద్రసే తత్తత్పదం గ్రాహ్యమిత్యర్థః.

వి:— 'సంస్కృతకావ్యములలోని శబ్దములందలి రీతులచొప్పున శబ్దరచనచేయుట తెనుఁగునందు రసవంతముగ నుండును. ఈ యాంధ్ర భాషయందు సుశబ్దమున కొకప్పుడు శబ్దాంతరముతో సమాసమందే సాధుత్వము సమ్మతమగును' అని భవేదత్రాపి శబ్దస్య' అనుదాని కర్థము— నునుగాళ్ళు—మీఁగాళ్ళు— మొదలైనవి శృంగారరసమున సాధువులు- ఒకప్పుడు వ్యస్తత యందును సాధుత్వము సమ్మతమగును— వ్రేళ్ళు చిదిమియు— కాళ్ళు నఱికియు— మొదలగువానికి యోగములేకుండునప్పుడె రౌద్రాదులలో సాధుత్వముండును. ఒకప్పుడు శ్రుతిహితమగుబహువచనవిశేషప్రయోగముచే సాధుత్వముండును. పండ్లికిలించుచుండె— అని బహువచనశ్రవణము బీభత్సాదులలో సాధువు. ఇందు సహృదయహృదయాహ్లాదకమగుపదమే ప్రయోగార్హమని 'తత్తత్పదం' అనుదాని కర్థము.

172 సూ. 32 :- "క్వచిత్కులకసమబన్ధేఽప్యత్ర సాహితకృద్భవేత్
అధ్యాహారస్య సంయోగ స్త్వత్ర నైవ సుఖావహః
అవృష్టార్థోఽపి సాధు స్స్యా ద్యది చేత్సుఖావహః
భూయసీ దేశ్యశబ్దేషు లోపవర్ణాగమశ్రుతిః"

‘తత్ఫలావళుల్। వారలకెల్లఁ బెట్టి యనవద్యుఁడు తా నొకపండు చెచ్చెఁబో’ ‘కాని ప్రచ్చదు లోపలనల్లనిక్రిమియై తోఁచి’-ఇత్యాదా వాచార్యస్య కులకమిష్టమేవ. అన్యగ్రన్థేష్వపి

“గుణకర్షణశరవర్షణ
వ్రణకిణ పటుబాహుయుతుల వాజిగజారో
హణకరణాంగుల పతతో
ల్బణశస్త్రాభ్యాసకలిత లఘుతరతనులన్”

‘తనయులఁ గనుఁగొని జనపతి’ ఇత్యాద్యాకారేణ కులకసంయోగః ప్రసిద్ధః. సంస్కృతభాషాయా మివాన్వయానుపపత్తిబలే నాత్రాధ్యాహారస్య సత్కల్పస్సుఖావహో నైవభవతి ‘తలపండొప్పడి యొప్పినప్పుడు’, ఇత్యాద్యాకారేణాపుష్టార్థపదానాం క్వచిత్ప్రయోగ స్సాధుః- ఏమిటికల్గితే కువలయేక్షణ-ఏటికల్గెను నాతోద నిందువదన- ఎదలోన- ఎద్ద ధరించిన లక్ష్మి-ఎదదనున్న మంచి బెడగుమానిక మిత్తు- దివ్యమాల్యములయు దివ్యానులేపనములయు- దివ్యమాల్యములయున్-ఎఁడి-ఎరి- ఏఁడి- ఏరి” ఇతి రూపద్వయమ్. ఎవఁడు-ఎవరు- ఇతి కింశబ్దార్థయో రేల్లోపయేత్వేచ సిద్ధమ్ ఏతచ్చ ఇవర్ణయోాగ ఏవేతి జ్ఞేయమ్.

వి :— ‘ఏకవాక్యగతమగు ననేకపద్యసంబంధము కూడ నీతెనుఁగునం దొకానొకచో సమ్మతమగును’ అని క్వచిత్కులకసంబంధేత్యాది కర్థము. ‘వాక్యమునఁ బ్రయుక్తములు కాని పదముల యోజన తెనుఁగునందు సమ్మతము కాదు’ అని అధ్యాహారస్యేత్యాది కర్థము. ‘అర్థపరిపుష్టి లేనిశబ్దములకూర్పు నయితము పండితకవీంద్రులహృదయమునకు సుఖావహముగాఁ దోఁచునపుడు ప్రయోగార్హమే యగును’ అని అపుష్టార్థేత్యాది కర్థము. ‘దేశ్యశబ్దములయందు వర్ణలోపవర్ణాగమశ్రవణము విస్తారముగఁ గలదు’ అని భూయసీత్యాది కర్థము. రెండు పద్యముల కేకాన్వయమున్నచో యుగ్మమనియు, మూఁడింటి కేకాన్వయమున్నచో విశేషకమనియు, నాల్గింటి కేకాన్వయమున్నచో కాలాపకమనియు, అంతకెక్కుడు పద్యముల కేకాన్వయమున్నచోఁ గులకమనియు “ద్వాభ్యాం యుగ్మమితి ప్రోక్తం, త్రిభిశ్శ్లోకై ర్విశేషకం, కలాపకం

చతుర్భి స్స్యా ద్తతఊర్ధ్వం కులకం స్మృతమ్” అను వచనమువలనఁ దెలియు చున్నది. కాని కవిశిరోభూషణము 'తత్ఫలావళుల్ వారలకెల్లఁబెట్టి యనవద్యుఁడు తానొక పండు చెచ్చెఁబన్' అనునది "కొని వచ్చుదు లోపల నల్లనిక్రిమియై తోఁచి" అను రెండవపద్యముతో నన్వయించు చున్నదిగాన నిది కులకమనియు నిట్టికులక మాచార్యులవారికి సమ్మత మే యనియు వ్రాసినది. మఱియు 'గుణాకర్షణ...లఘుతరతనులన్' అను నితర కృతులలోఁగూడ 'తనయులఁగనుగొని జనపతి' అను రెండవపద్యముతో నన్వయ మగపడుచున్నదనియు నది కులకమనియు వ్రాసినది. సంస్కృత మున నర్ధార్ధాంతమునను, శ్లోకాంతమునను సమానపదమును సమాస మును దెగిపోవలయును. తెనుఁగునం దట్టినియమము లేదు. "శ్రీయున గౌరినాఁ బరఁగు...ఇష్టసిద్ధికిన్" అనుపద్యమునందు 'విష్ణురూపాయ' అను పదము పద్యము రెండర్ధములను గలుపుచున్నది. 'శ్రీవాణీగిరిజా శ్చిరాయ' అనుపద్యము మొదలు తొమ్మిదవపద్యమువఱకుఁ గల పద్య ము లన్నియు నేకాన్వయము కలవి. దీనికే కులకమని చెప్పుట యుచి తము. తెనుఁగునందు వాక్యమున లేనిపదములను దెచ్చుకొని యన్వ యించుకొనుట సమ్మతము కాదు. దీని కధ్యాహార మని పేరు. సంస్కృత భాషయందు దీనికిఁ బ్రాచుర్యము కలదు. తెనుఁగున నాపదములను దెచ్చుకొనకయే వాక్యము లర్థము లగుచుండును. కాన నధర్వణుఁడు 'అధ్యాహారస్య సంయోగ స్త్వత్ర నైవ సుఖావహః' అని చెప్పెను. వాక్యార్థమునకుఁ బరిపోషము నీయనిపదములు 'అపుష్టార్థము' లనఁ బడును. సహృదయహృదయాహ్లాదకత్వమున్నచో నపుష్టార్థముకూడఁ దెనుఁగున సాధువే. తలఁపం జొప్పడియొప్పె నప్పుడు— మున్నగునవి యపుష్టార్థమున కుదాహరణములు.

ఎవఁడు- ఎవరు— మున్నగువాని కర్థవిశేషము లేకున్నను—ఏఁడు— ఏరు— ఏఁడీ— ఏరీ— మున్నగురూపములు ఇకారము పరముగా లేకున్నను ఏఁడు- ఏరు- అనురూపములు కవిప్రయుక్తములై యున్నవి.

172. సూ. 33 :— "అజన్యజన్యభేదేన శబ్దాస్స్యుర్వికృతౌ మతాః
జన్యాన్తర్గతశబ్దానాం భూయసీ స్యాద్విచిత్రతా"

అజన్యా అధాతుప్రకృతికాః. గోడ, మేడ, మోరు, బారు, మోవి, ఇత్యాద్యాః. ఓకిలింత, వెక్కిరింత, పల్కరింత, అలయిక, కలఁక, కలఁగుఁడు, తేలిక, పోలిక, పోలికి, పొందిక, అలయిక, అల్లిక, అల్లు, వ్రాఁత, కోఁత, ఈఁత, మ్రాఁత, వేఁత, లేఁత, ప్రాఁత, అలఁత, కలఁత, వెలుఁగు, తరుఁగు, పరగు, తిరుగు, చదువు, తనివి, పొంగు మ్రింగుడు, కూటమి, దూఱు, చావు, కానుపు, వినికి, వినికిఁడి, పూనిక, పూనికి, చెదరు, వదరులు, పదరులు, ముదురులు, కేసట, నొప్పి, డాపురములు, అదరులు, ఏలిక, రాక, పోక, తెలివి, తెలివిడి, కప్పు, ఒప్పు, ముప్పు, బెణకు, వడఁకు, పాట, కుదురు; పొసఁగు, కదపు, తడుపు, చూపు, దోపు, కలఁగు, నవ్వటాలు, అత్ర లకార టకారయోర్వ్యత్యాసః. నవ్వులాట, నవ్వు, దుక్కి, పొందు, కందు, చిందు, మెఱపు, అలపు, బలుపు, కొలుపు, ఆడికొనుట, పొగడికొనుట, ఇత్యాదిశబ్దపర్యాయత్వేన, అడికోలు, ఇత్యాదిశబ్దా ఆచార్యేణ ప్రయుక్తాః. నిలుపు, నిలుకడ, ఆపు, రాపు, మోపు, దోపు, ఏపు, అంగలార్పు, ఓర్పు, నేర్పు, తాపు, ఈర్పిన, మార్పు, ముడుపు, కలపు, వెలపు, విరుపు, విరుగుడు, అరపు, కసరు, చొరవ, తెగువ, వేకువ, నలుగుడు, తిరుగుడు, మాటు, నాటు, వ్రేటు, పోటు, పాటు, పట్టు, ఒట్టు, తిట్టు, కొట్టు, అలుక, మొలక, పలుకు, కులుకు, నడుపు, వడుపు, పూఁత, ఊఁత, కోఁత, మ్రోఁత, కాక, త్రేపు, కాపు, దుముకు, నఱుకుఁడు, వదిగిళ్ళు. చొక్కిళ్ళు, వెక్కిళ్ళు, పొదిగిళ్ళు, పంపకము, అంపకము, బడలు, బడలిక, బడలింత, ఉబ్బు, తిబ్బు, పబ్బు, విప్పు, తొడవులు, కలుపు, మొలుపు, నిక్కు, మ్రొక్కు, స్రుక్కు, సొక్కు, తక్కువ, ఎక్కువ, పడపు, విడుపు, ఏడుపు, ఆడికలు, వాడిక, ఇత్యాదయో బహవశ్శబ్దాః ప్రయోగతోఽవగన్తవ్యాః.

వి :— 'వికృతియందలి శబ్దము లన్నియు జన్యములు, అజన్యములు—అని రెండువిధములు. వీనినే వరుసగా నవ్యుత్పన్నములు వ్యుత్పన్నములు నని యందురు. వ్యుత్పన్నము లగుశబ్దములయందలివిచిత్రత మిక్కిలి యధికమని 'అజన్యజన్యభేదేన' అనుదానికర్థము. గోడ, అనునది మొదలు మోవి—అనువఱకుఁగలవి యజన్యోదాహృతులు. ఇట్టివింకను గలవు. ఓకిలించు, ఓకిలింత. ఇట్లే, వెక్కిరించు, పల్కరించు మున్నగు

నవి. అలుగు, అలయిక, కలఁగు, కలఁక, కలగుండు, తేలు, తేలిక, పోలు, పోలిక, పోలికి, పొందు, పొందిక, అలయు, అలయిక, అల్లు, అల్లిక, వ్రాయు, వ్రాఁత, కోయు, కోఁత, ఈఁదు, ఈఁత, మూయు, మూఁత, వేయు, వేఁత, లేఁత, ప్రాఁత, మొదలగునవి జన్యములు. అలయు, అలఁత, కలఁగు, కలఁత, వెలుఁగు, తరుగు, పరగు, తిరుగు, చదువు, అనునవి ధాతురూపములు. అవే కృత్ప్రత్యయాంతములును. తనియు, తనివి,పొంగు, అనునవియు నుభయములే. మ్రింగు, మ్రింగుడు, కూడు, కూటమి. దూఱు, చావు, అనునవి యుభయములు. కను, కానువు, విను, వినికి, వినికిఁడి, పూను, పూనిక, పూనికి, చెదరు, వదరు, పదరు, ముదురులు, వేసరు, వేసట, నొచ్చు, నొప్పి, డాయు, డాపురము, అదరు, అనునవియు—ఏలు, ఏలిక, వచ్చు, రాక, పోవు, పోక, తెలియు, తెలివి, తెలివిడి, కప్పు, తొప్పు. ఉప్పు, బెణఁకు, వడఁకులు, పాడు, పాట, కుదురు, పొసఁగు, కడపు, తడుపు అనునవియు-చూచు, చూపు, దోఁచు, దోఁపు, కఱఁగు, కఱఁగుడు, నవ్వు, నవ్వులాట, నవ్వుటాలు, దున్ను, దుక్కి, పొందు, కందు, చిందులు నుభయములు. మెలఁగు, మెలపు, అలయు, అలవు, బలియు, బలుపు, కొలుచు, కొలుపు, ఆడికొను, ఆడికొనుట, పొగడికొను, పొగడికొనుట, ఆడు, ఆడికోలు, నిలుచు, నిలుపు, నిలుకడ, ఆగు, ఆపు, రాయు, రాపు, మోయు, మోపు, దోఁచు, దోఁపు, ఏఁచు, ఏఁపు, అంగలార్చు, అంగలార్పు, ఓరుచు, ఓర్పు, నేరుచు, నేర్పు, తాచు, తాపు, ఈరుచు, ఈర్పెన, మారు, మార్పు, ముడుచు, ముడుపు, కఱచు, కఱపు, వెఱచు, వెఱపు, విరుచు, విరుపు, విరుగుడు, అఱచు, అఱపు, కసరు, అనునవియు నుభయములు. చొచ్చు, చొరవ, తెగు, తెగువ, వేఁగు, వేఁకువ, నలుగు, నలుగుడు, తిరుగు, తిరుగుడు, మాటు, నాటు, ప్రేటు లుభయములు. పడు, పాటు, పట్టు, తిట్టు, కొట్టు లుభయములు. అలుగు, అలక, మొలుచు, మొలక, పలుకు లుభయములు. కులుకు అజన్యము. నడుచు,

నడుపు, వడియు, వడుపు, పూయు, పూఁత, ఊఁచు, ఊఁత, కోయు, కోఁత, మ్రోయు, మ్రోఁత, కాచు, కాక, త్రేఁచు, త్రేఁపు, దుముకు, దుముకుడు, దూఁకుడు, నలుకు, నలుకుడు, వడిగిలు, ఇది వత్తిగిలు అను దాని పరిణామమేమో! వడిగిళ్ళు, చొక్కు, చొక్కిళ్ళు, వెక్కు, (బెక్కు) వెక్కిళ్ళు-పొదిగిళ్ళు, అజన్యములు. పనుచు, పంపకము, అనుచు అంపకము, బడలు, బడలిక, బడలింత, ఉబ్బు, తబ్బు, సబ్బు, విప్వు లుభయములు. తొడుగు, తొడవులు, కలువు, (ఉభయము) మొలుచు, మొలుపు, నిగుడు, నిక్కు, ఇది తనంతఁదా నుభయము కానోపును. మ్రొక్కు, స్రుక్కు, సొక్కు లుభయములు. తరుగు, తక్కువ, ఎదుగు, ఎక్కువ, పడయు, పడపు, విడుచు, విడుపు, ఏడుచు, ఏడుపు, ఆడు, ఆడిక, ఓడు, ఓడిక. ఇట్టికృదంతములను బాలప్రౌఢవ్యాకరణములు ప్రత్యేకప్రకరణములలో విపులముగా వివరించినవి.

**172** సూ. 34 :- “ప్రతిక్రియమడాంతత్వం ప్రతీతం నతు గీయతే
క్వచి దింప్వన్తతాం కేచి దూచిరే నహి మే రుచిః.

అందడము, పొందడము, విడువడము-నిలువడము, విరుగడము ఇత్యాదయో అడాంతా శ్శబ్దాః ప్రతీయన్తే సర్వత్ర. తథాపి తత్ర గానం న సంభవతి. తేషాం గ్రామ్యత్వా న్న ప్రయోగార్హతేత్యర్థః. రాణింపు- తేలింపు - ఇత్యాద్యాః కేచి దింప్వన్తా శ్శబ్దా వర్తన్తే. అత్ర కేషాఞ్చి దపణ్డితానాం రుచిరస్తి. నాస్మాకం తేషాం ప్రయోగ ఇష్ట ఇత్యర్థః.

వి :- 'సర్వధాతుసాధారణముగ భావార్థమున- అడ - ప్రత్యయము వినఁబడుచున్నది. కాని యది కవిప్రయోగప్రసిద్ధము కాదు. ట- డు- పు-అనుప్రత్యయములు భావార్థమున వచ్చుచున్నవి. కాని-ఇంపు-అనునది యంతమునఁగల-రాణింపు-తేలింపు-మున్నగు నవి కలవని కొంద ఱనుచున్నారు. అవి సహృదయ సమ్మతములు కానందున మేము సమ్మతింపము' అని యథర్వణవచనార్థము.

172 సూ. 35:- అనిన్ద్యతాయాం భాషాణాం శ్లేషో యోగశ్చ సమ్మతః—నిన్ద్యభాషయా సహశ్లేష స్సంయోగోఽపి న సమ్మతిః. యోగశ్చసమస్తత్వేన పదానాం సమ్బన్ధ మింటఁగంటు కలకంఠి కళాంకం- ఇత్యాది.

వి :— మహాకవిప్రయోగసమ్మతిచే నింద్యము కానప్పుడు వివిధ భాషలపదములకును వాక్యమం దన్వయమును, సమాసమును సమ్మత మగును—అని యర్థము. దీని కుదాహరణము మీఁద స్పష్టము.

172. 36 :- అవాన్తరకథాస్థాన విశ్రాన్త్యాశ్వాస ఉచ్యతే
ప్రత్యన్తపూరణం భిన్నవృత్తైర్డుజ డ దీరితైః

డుజన్తైర్వా సమ్బుద్ధ్యన్తైర్వా భిన్నవృత్తై రిత్యర్థః, సమ్బుద్ధ్యన్తైః పూరణం సర్వత్ర ప్రసిద్ధమ్. డుజన్తైరపి పూరణం భాస్కరాదికవిప్రబన్ధేషు ప్రసిద్ధమ్.

వి :— కావ్యకథలో నవాంతరకథారంభమునందలి విశ్రాంతిచే నాశ్వాసము చెప్పఁబడుచున్నది. ఆశ్వాసాంతమునఁ జేయు కృతిపతి ప్రశంస ప్రథమావిభక్త్యంతశబ్దములతోను సంబోధనాంతశబ్దముల తోను గూడిన వేఱువృత్తవిశేషములతోఁ జేయ నగును—అనియర్థము. సంబుద్ధ్యంతోదాహృతులు సర్వప్రబంధములలోఁ గలవు. ప్రథమాంతోదాహృతులు భాస్కరరామాయణాదులఁ బ్రసిద్ధములు.

172-37 :- సఙ్గీతకవితాయాన్తు గణాదౌ యతి రుచ్యతే
ప్రాసోవా నాతి సామీప్యే నాతిదూరే విధీయతే.

ఇతి పదకవితాసామాన్యలక్షణమ్.

"గీతే తాళానుగుణ్యేన హ్రస్వ స్స్యా ద్దీర్ఘసంశ్రుతిః
హ్రస్వశ్రుతిస్తు దీర్ఘస్య దోష ఇత్యుచ్యతే బుధైః"

ఏతదుభయం తత్తత్తాళానుగుణ్యేన ప్రయుక్తేషు జ్ఞేయమ్.

వి:— సంగీతకవితయగు యక్షగానాదులలో గణాదియందు విశ్రమము చెప్పఁబడుచున్నది. లేక ప్రాసయతి యైనను మిక్కిలి సమీపము కానట్టియు, మిక్కిలిదూరము కానట్టియు స్థలమునందు విధింపఁ బడును. సంగీతకవితయందుఁ,ద్రిపుటాదితాళముల కనుకూలముగ హ్రస్వమున్ దీర్ఘముయొక్క వినికి కలది కానోపును. కాని దీర్ఘము నకు హ్రస్వశ్రవణము దుష్టమని పండితులు నుడువుచున్నారు' అని పైయథర్వణకారిక కర్థము.

172 సూ. 38 :— ద్వ్యక్షరాది చతుర్వర్ణపర్యన్త జననామసు
లోప స్స్యా ద్ద్వాదివర్ణానాం శబ్దే రాయాదికే పరే
క్వచి దత్వం క్వచి చ్చాత్వం క్వచి దిత్వం క్వచి త్వతా
క్వచి న్మత్వం యథాయోగ మన్యచ్చ వ్యవహారతః.
సబిన్దుకస్య డో స్థానే ని ర్నిత్య ముపతిష్ఠతే
ఆర్యామ్బాదికశబ్దా స్స్యుః శ్రేష్ఠతావాచకా యతః
తత స్తద న్తశబ్దేభ్యో నైవ శ్రేష్ఠత్వగోచరాః.

ద్వ్యక్షరేషు రామరాజు- తిమ్మరాజు- ఇత్యాదా వత్వమ్. రామిసెట్టి- తిమ్మిసెట్టి- ఇత్యాదా విత్వమ్. అయ్యపరాజు- అయ్యపసెట్టి- ఇత్యాదౌ వత్వమ్— కృష్ణమరాజు— కోనమరాజు- ఇత్యాదౌ మత్వమ్. త్ర్యక్షరేషు బసవరాజు- కేసవరాజు- ఇత్యాదా వత్వమ్. బసివినీఁడు- ఇత్యాదా విత్వమ్. ఏవ మన్యద ప్యూహ్యమ్. చతుర్వర్ణేషు నరసింగరాజు— ఇత్యాదిక మూహ్యమ్. రాజు—రావు-సెట్టి-వజ్ఝులు-దాసరి-జెట్టి—రాయఁడు రెడ్డి, ప్రగ్గడ, ప్రగడ, సాని, దేవి, నాయఁడు, ఇత్యాదీ న్యుపపదాని వ్యవహారతో జ్ఞేయాని. వేము, రాము, చెన్ను, గంగులు, ఇత్యాదౌ వర్ణాన్తరం గ్రాహ్యమ్.

వి :— 'రెండక్షరములు మొదలు నాల్గువర్ణముల వఱకును బరిమితి గల జనులనామములకు రాజు, రావు, రాయఁడు, అన్న, అమ్మ, దేవి, శాస్త్రి, సెట్టి, మున్నగు పూజ్యతను, శ్రేష్ఠతను దెల్పుపదములు పరమై యుండఁగా సుబ్విభక్తులకు లోపము కల్గును. అపుడు పూర్వపదముతుదిని గొన్నియెడల అత్వమును, గొన్నియెడల ఆత్వమును, వేఱొకకొన్నిచోట్ల ఇత్వమును, ఇంకఁగొన్నిచోట్ల వత్వమును, మఱికొన్ని యెడల మత్వమును బండితవ్యవహారానుసారముగ నితరకార్యజాతమును యథార్హ్వముగ నగును'— అని 'ద్వ్యక్షరాది ...యథాయోగ మన్యచ్చ వ్యవహారతః' అనునథర్వణకారిక కర్థము.' ప్రథమైకవచనమున బిందుసహిత డువర్ణము వచ్చిన దానికి ద్వితీయైకవచనమునందు బిందువుతోఁ గూడిన యా డువర్ణమునకు నిత్యముగా నివర్ణ మగును. అమ్మ, అన్న, అయ్య మున్నగునవి శ్రేష్ఠార్థకము లగుటచేఁ దదంతశబ్ద

ములమీఁద మరల శ్లేష్మార్థకశబ్దములు రావు'– అని 'సబిందుకస్య డో: ...నైవ శ్లేష్మత్వగోచరా:' అనుదాని కర్థము.

172. సూ. 39 :– రామిసేనికులము, రామానాయనిసంగసము, తిమ్మానాయని కొడుకు, ఇత్యాదౌ సర్వత్ర న్యాగమో నిత్య:. నాయనివారు, ఇత్యత్ర ప్రసిద్ధపురుష మాదాయ సమ్బన్ధిజనానా ముక్తి:. యది స్వాములవారు, ఇత్యాదావివ పూజ్యతా వివక్షితా తర్హి ప్రథమాయాం ద్వ న్తత్వమ్. అన్యత్ర ని రితి వివేక:.

వి :– రామిసేనికులము మున్నగు నుదాహరణములలోని నివర్ణము రామినీఁడు అను బిందుసహిత డువర్ణమునకుఁ గల్గినది. ఈ నిగాగమము నిత్యము. నాయనివారు అనునపుడు ప్రసిద్ధపురుషునినామ ముతోఁ దత్సంబంధి జనులను బలుకుట యగును. స్వాములవారు, అను దానిలో వలె నాయనివారులోని 'వారు'కూడఁ బూజ్యార్థమున వచ్చిన దని యనినచోఁ బ్రథమావిభక్తిలో 'నాయఁడువారు' ద్వితీయాదులలో నాయనివారిని' అని యుండును.

172. సూ. 40 :– రామయప్రభుఁడు, రామయమంత్రి, రామయప్రధానుఁడు, కోనమాంబ - ఇత్యాదయో నప్రయోగార్హా: శబ్దా:, కింతు రామప్రభుఁడు, కోనాంబ ఇత్యాద్యాకారేణ ప్రయోగార్హా:. లక్కమాంబాకుమార, ఇత్యాదిప్రయోగస్తు ప్రౌఢోక్తిమాత్రనిష్పన్న ఇతిజ్ఞేయమ్. 'ముఖ్యాన్తాదపిశబ్దాత్తు ముఖ్యశబ్దే' ఇతివచనస్తు సంస్కృతసిద్ధార్థానువాదకమ్. ముఖ్యశబ్దాత్ ముఖ్యా దిత్యర్థ: ఎట్టియాపద వచ్చిన గట్టిపడుచుఁ జిత్త ముండుట యత్యుత్తమోత్తమంబు- ఇత్యాద్యుదాహరణమ్. అయ్యా వారు, ఇత్యాది వైకృతమ ప్యత్రోదాహర్తవ్యమ్.

వి:– రామయప్రభుఁడు, మున్నగునవి ప్రయోగార్హములు కావని కవిశిరోభూషణము చెప్పుచున్నది. అయ్య, అన్న, అనువాని రూపాం తరములగు, అయ, అమ, అనువానికి సిద్ధసమాసమధ్యమునఁ బ్రయోగ ముండుటయే కారణమని వచించుచు, రామప్రభుఁడు అనుమున్నగు రీతితో నుండనగు ననుచున్నది. లక్కమాంబాకుమార, అనునపుడు, లక్కమ+అంబా+కుమార:=లక్కమాంబాకుమార:, అనుదీనితత్సమ

రూపము లక్కమాంబాకుమారుఁడు; దీని సంబోధనరూపము లక్కమాంబాకుమార, అనియగును. కాని లక్కశబ్దము, లక్ష్మీశబ్దవికృతిగ నగపడుచున్నది. దీనితో, అమ్మ, అనుదాని రూపమగు, అమ, అనునది చేరి లక్కమ, అని కావచ్చును. కాని, లక్కమ+అంబ=లక్కమాంబ, అని సవర్ణదీర్ఘము వచ్చుట దుర్లభము. అపద్ధతిచొప్పున నిది దుష్టమే; కాని యథర్వణాచార్యు లంగీకరించుటచే నిది సమ్మతమే. అయ్య, అమ్మ, అనునవి శ్రేష్ఠార్థమును దెల్పుచున్నవి. కాన నవి యంతమునఁ గలశబ్దములమీఁద మరల శ్రేష్ఠార్థబోధకశబ్దములు రావు- అని, అర్యాంబాదికశబ్దాస్స్యుః, అనుదానికర్థము. ముఖ్యాంతశబ్దముమీఁద మరల ముఖ్యశబ్దము వచ్చును- అనువిషయము సంస్కృతలక్షణసిద్ధమగు నర్థమున కనువాదము - అత్యుత్తమోత్తమంబు అని దాని కుదాహరణము. ఈ విషయమును ప్రౌఢ. సమా. 2 మొ॥ 6 సూత్రమువఱకు వివరించెను.

ఇతి శ్రీ......తృతీయోఽజన్తపరిచ్ఛేద స్సమాప్తః.

అజంతపరిచ్ఛేదము సమాప్తము.

# అంకితము





డాక్టర్ శ్రీకొలచల వేంకటకృష్ణమూర్తిగారు,

తద్ధర్మపత్ని

కీ. శే. శ్రీమతి శ్యామలాంబగారు

పతికిన్, భూరిభిషక్ప్రభాపతికి, భవ్యత్యాగపూర్ణక్రియా
రతికిన్, శ్రీయుత కృష్ణమూర్తికి;– సపర్యావ్యగ్రయై, సర్వదా
ధృతఁ దా మాని, కలార్థిపోషణచిరానంతప్రదం బెంచుధీ
మతికిన్, మత్కృతి యంకితం బగుత శ్రీమచ్ఛ్యామలాసాధ్వికిన్.

—వివృతిరచయిత.

ఓమ్

విఘ్నేశ్వరాయ నమః

# కవిశిరోభూషణ వివృతి

## హలంత పరిచ్ఛేదము

1. శ్లో. సీతే సచ్ఛదనావృతే ర్విగళనా న్మన్దానిలవ్యాపృతా
గుచ్ఛద్విన్ద్వ మతుచ్ఛ మృచ్ఛతి మహాన్పుష్పన్ధయో౽యం ప్రియః।
పశ్యేత్యాలపతి ప్రియే కుచభరే సాపత్రపా సత్వరం
కుర్వాణా మృదులాంశుకం సురచితం భూనన్దినీ పాతు నః॥

వి :— ఏకాంతమునందు శ్రీరాముఁడు సీతతోఁ జేసినవిస్రంభాలాపములు— "ఓసీతా! మందానిలముచేఁ బత్రములచాటు తొలంగఁగ (గాలికిఁ బైటఁచెంగు తొలఁగఁగాననియర్థము) నీగండుఁతుమ్మెద (ఈరాముఁడు) పూలగుత్తులనుభావముతోఁ దిరుగుచున్నది చూచితివా" అని ప్రియుఁడగు శ్రీరామచంద్రమూర్తి పలుకఁగా సిగ్గుతోఁ దనవక్షోజములపైకిఁ బైఁటచెఱఁగును సుకుమారముగ సవరించుకొను సీతయొక్క సంభ్రమము మనలఁ గాపాడుఁ గాక.

2. శ్లో. యద్వామాఙ్కే నివాసో నిరత ముఖిలగ్రాంత రజ్ఞాయతాక్షీ
శ్రేణీనాం భాతి దూరే వదతి నిరుపమం భూసుతాయాః స్వరూపమ్।
తం ప్రాచీనం పుమాంసం కపటదశరథాపత్యతాచ్ఛన్నమూర్తిం
మూర్తిత్రయ్యా నిదానం హృదయ భజ సదానన్ద మస్మన్నిధానమ్॥

వి :— "ఏప్రభువర్యునివామాంకసతతనివాసము సీతాదేవియొక్క లోకాతీతసౌందర్యమును జెప్పుచున్నదో, కపటదశరథాపత్యరూపముతోఁ గప్పఁబడినట్టియుఁ, బరమప్రాచీనము, బ్రహ్మవిష్ణుశివాత్మకము, స్వానందమయము, మాకు నిధానమును నగు శ్రీరామచంద్రపరబ్రహ్మము

నోహృదయమా ! నీవు భజింపుమని గ్రంథకర్త తనహృదయమునకు హితోపదేశము చేయుచున్నాఁడు :

3. శ్లో. వన్దేమహి జగన్నాథం వన్దారుజనకల్పకమ్।
అరవిన్దదళాపాఙ్గ మమ్భోధితనయాపతిమ్.

వి :— "నమస్కరించుజనమునకుఁ గల్పవృక్షమై, తామరరేకుల వంటికన్నులు గల లక్ష్మీప్రియుఁడగునాజగన్నాథునకు నమస్కారము" అని కవి విష్ణుమూర్తిని స్తుతించెను.

**173.** సూ :— ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హాలన్త మగుణవత్ప్రభృతి.

173 సూ:— గుణవద్గణవ్యతిరిక్తం హాలన్తం సంస్కృతప్రథమైకవచనతుల్యం స్యాత్సర్వత్ర.

వి :— ప్రథమైకవచనతుల్యమ్, సర్వత్ర, హాలన్తమ్, అగుణవత్ప్రభృతి—అని ఛేదము. సంస్కృతమునందలి హాలంతశబ్దము లన్నియు నీ వికృతియందు గుణవద్గణము, నగుణవద్గణము, నని రెండుగణములుగాఁ బ్రక్రియాసౌకర్యమునకై విభజింపఁబడినవి. గుణవద్గణవ్యతిరిక్త మగు హాలంతశబ్దము సంస్కృతప్రథమైకవచనతుల్యరూపములో నిచట నామము (ప్రాతిపదికము)గా నిలుచునని సూత్రార్థము. రుక్–రాట్–మొ॥ "హాలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామంబగు" (బాల. హాలంత. 67 సూ.) అను సూత్రముచేఁ బై విషయమును జిన్నయ సూరిగారు వివరించిరి.

**174.** సూ:— గుణవద్గణో ద్వితీయైకవచనతుల్యో భవే ద్వికృతౌ.

వి :— గుణవద్గణః, ద్వితీయైకవచనతుల్యః, భవేత్, వికృతౌ—అని ఛేదము. గుణవద్గణము సంస్కృతములోని ద్వితీయైకవచనతుల్యశబ్దమిచట నామముగా గ్రహింపఁబడునని సూత్రార్థము. "గుణవన్తమ్" అనునది సంస్కృతమున ద్వితీయైకవచనరూపము. తత్తుల్యమగు— 'గుణ

వంతమ్' అనునది యిచట నామము. ఇందుఁ జివర మకారము "అన్యేషాంచ వా లుగన్తస్య"-అను సూత్రముచేఁ గాని "అన్త్యహలో శ్రుదుది"-అను ప్రాకృతసూత్రముచేఁ గాని లోపించును. మఱుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామంబు" (బాల-హలంత-70) అను సూత్రముచేఁ బై విషయమును సూరిగారు వివరించిరి.

**175.** సూ:- ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్.

175 సూ:- హ్రస్వాత్పరేషా మగుణవర్ధనసమ్బన్ధినాం శబ్దానా మన్త్యహలాం సర్వేషాం ద్విత్వ ముత్వఞ్చ స్యాత్.

వి :- ద్విత్వోత్వే, సర్వహలాం, హ్రిస్వాత్-అని ఛేదము. హ్రస్వస్వరమునకుఁ బరమైనయుగుణవర్ధనసంబంధి యగుశబ్దముల తుదిహల్లునకు ద్విత్వము గల్గును, ఉత్వమును గల్గును. ఎట్లు-మొ॥ "ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు". అని బాలవ్యాకరణము వివరించెను. (బాల-హలంత-68 సూ.)

**176.** సూ :- ద్విత్వం తు దీర్ఘతో బహుళమ్.

176. సూ :- దీర్ఘా త్పరేషాం తు ద్విత్వం బహుళం స్యాత్. ఉత్వం తు స్యాదేవ.

వి:- ద్విత్వమ్, తు, దీర్ఘతః, బహుళమ్-అని ఛేదము. దీర్ఘస్వరమునకుఁ బరమైన హలంతశబ్దముయొక్క తుదిహల్లునకు ద్విత్వము బహుళముగా నగును. బహుళపదమునందు నాలుగర్థము లిమిడియుండును. ప్రవృత్తి-అప్రవృత్తి-విభాష-అన్యత్ అని నాలుగర్థములు. సంస్కృత వైయాకరణులు దీని నిట్లు వివరించిరి. "క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ। విధే ర్విధానం ప్రసమీక్ష్య సమ్యక్ చతుర్విధం బాహుళకం వదన్తి॥" "ఒకచోట నిత్యముగాఁ గార్యము జరుగును. వేఱొకచో నది జరుగదు. వేఱొకచో వికల్పముగా జరుగును. విలక్షణరూపకార్య మింకొకచో జరుగు"నని దానికర్థము. ఇందు

మొదటిమూఁడును దెలుఁగువ్యాకరణములయందుఁ బ్రచురముగా నగపడుచున్నవి. వాక్కు-వాకు, రాట్టు-రాటు, అనునవి యుదాహృతులు. దీనిని సూరిగారు "దీర్ఘంబుమీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు" (బాల-తత్సమ-69) అని వివరించిరి.

177 సూ :- అగుణవతాం సర్వహలాం సో ర్లోపః.

177 సూ:- గుణవద్గుణవ్యతిరిక్తానాం మహతా మమహతాం శబ్దానాం సో ర్లోపస్స్యాత్.

వి :- అగుణవతామ్, సర్వహలామ్, సోః, లోపః-అని ఛేదము. గుణవద్గుణవ్యతిరిక్తము లైన సర్వహలంతశబ్దములకును, ననఁగా మహదమహద్వాచకశబ్దములకుఁ బిమ్మట నిలిచినసుప్రత్యయమునకు లోపము కలుగు నని సూత్రార్థము. సంస్కృతవ్యాకరణమునందువలెనే ప్రాతిపదికసంజ్ఞగలశబ్దమునకుఁ బిమ్మట వక్తృవివక్షానుసారముగ స్వాది ప్రత్యయములు నిలుచును. ప్రథమైకవచనమునందు నిలిచినసుప్రత్యయమున కీసూత్రముచే లోపము కలుగుచున్నది. రుక్కు+సు; రాట్టు+సు-అనియుండఁగా, నాసుప్రత్యయము దీనిచే లోపించి, రుక్కు, రాట్టు అనురూపము లేర్పడును. సూరిగారు ప్రక్రియాగౌరవశంకచే నీపద్ధతిని విడిచిరి. కాని ప్రథమైకవచనలోపమును మాత్రము "ఇగ్లారాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు" (బాల-తత్సమ-44) అని వివరించిరి. కాని వీరిసూత్రములచే సాధింపఁబడినప్రక్రియనుబట్టి యాశబ్దములకుఁ బదత్వము సిద్ధింపఁ జాలదు. సంస్కృతవ్యాకరణమునందు సుబంతమునకుఁ, దిఙంతమునకు మాత్రమే పదసంజ్ఞ విధింపఁబడినది. "సు-ఔ-జస్" మున్నగునవి సుప్రత్యయములు. "తిప్ తస్-ఝి" మున్నగునవి తిఙ్ప్రత్యయములు. ఇవి యంతమందున్నవి పదములగును. చింతామణికారుఁడు ప్రాతిపదికమునకుఁ బిమ్మటఁ దత్తద్విభక్తివచనానుసారముగా స్వాదిప్రత్యయములను నిలిపియు, ధాతువులపై నిగూఢఁ దత్తత్పురుష వచనానుసారముగఁ దిఙ్ప్రత్యయములను నిలిపియు,

వానికిఁ దెనుఁగుప్రత్యయముల నాదేశముగా విధించెను. ఆదిష్టము లైన తెనుఁగుప్రత్యయములయందు పరుసగా సుప్తిజ న్తత్వములు కలిగి యవి చేరినవానికిఁ బదత్వము సిద్ధించుచున్నది. సూరిగారు ప్రకిర్యాగౌ రవశంకచేఁ గావలయు నీవిధానమును విడిచి సరాసరిగా నామముల యందును, క్రియలయందును డుమ్వాదులను, డుజ్వాదులను జేర్చి రూపసాధనము చేయుటచే శాస్త్రమర్యాదానుసారముగా నట్టివానికిఁ బదత్వసిద్ధి కలుగుట లేదు. కావున బాలవ్యాకరణసాధితనామక్రియా వాచకశబ్దములకుఁ బదత్వము సిద్ధింపదు. అయినను సూరిగారు 'ద్రుత మంతమందుఁగలపదములు' మున్నగుచోట్లఁ బదశబ్దము నుపయోగింపక పోలేదు. అవి పదము లగునని వా రెట్లూహించిరో తెలియదు.

178. సూ:- గుణవతాం డుమూ ప్రాగ్వత్.

178. సూ:- గుణవతాం ప్రాగ్వ ద్డుజ్ మూ స్తః. మహాతో డు జమహాతో ము రిత్యర్థః-తురాసాహుఁడు, అనడ్వాహుఁడు, సుదివుఁడు. "అనుక్తమన్యాయే సాంత్యహాలోఽశదుదీతి" ప్రాకృత సూత్రేణ మకారస్య లోపః. ప్రశానుఁడు. ప్రథమైకవచనతుల్యత్వం, దీర్ఘాత్పరత్వాన్న ద్విత్వమ్. కిమ్- నామలిఙ్గానుశాసనాది గ్రన్థేషు నపుంసకలిఙ్గాధికారే అవ్యక్తలిఙ్గస్య ఫణితో యత్ప్రయుజ్యతే - ఇత్యుక్తత్వా త్కిమ్శబ్దస్యావ్యక్తలిఙ్గత్వేన నపుంసకలిఙ్గప్రథమైకవచనతుల్యత్వమ్. "క్వచిన్నామగ్రహోహ్యైవ" ఇత్యథర్వణోక్తి శ్చాత్ర మానమ్

వి :- గుణవతామ్, డుమూ, ప్రాగ్వత్ - అని ఛేదము. గుణవ ద్గణములోని శబ్దములు సంస్కృతద్వితీయైకవచనాంతతుల్యము లిటఁ బ్రాతిపదికము లగుటచే వానితుదిమకారమునకు "అన్యేషాఞ్చ వా లుగ న్తస్య" అనుసూత్రముచేఁ గాని "అంత్యహలోఽశదుది" అను ప్రాకృత వ్యాకరణసూత్రముచేఁ గాని లోపముచేయఁగా 'గుణవంత' మున్నగు ప్రాతిపదికరూపములు సిద్ధించును. వీనికి సుప్ప్రత్యయాదులు పరమగు నపుడు మహ త్త్వమునం దుత్వడుజ్ఞులు మహతీత్వమునఁ బ్రథమైకవచన లోపము, నమహ త్త్వమున మువర్ణకాదులును నజంతములకుఁ బోలెఁ

గల్గు చుండును. మహత్త్వమునం దాలుశబ్దముతో సమాసమును వీనికిఁ గల్గును. "గుణవన్తమ్" అనునది ద్వితీయైకవచనాంతతుల్యరూపము. దీని మకారమునకు లోపము చేయఁగా 'గుణవంత' అని మిగులును. ఇచటఁ గవిశిరోభూషణము ప్రాకృతసూత్రముచే మకారలోపము చేయుట న్యాయ్యము గాదు. చింతామణియందు వాక్యాంతగతపదానాం చ" మున్నగు సూత్రములు పెక్కు లుండుటచే వానిచేఁ దుది వర్ణలోపము చేయుట యుక్తము. తురాషాట్, అనడుహ్, సుదివ్ మున్నగుశబ్దములు గుణవద్గణములోనివి కావున 'తురాసాహమ్, అనడుహమ్, సుదివమ్' అనురూపములు ద్వితీయైకవచనాంత తుల్యములై తెలుఁగులోనికి వచ్చును. మకారలోపము చేయఁగా తురాసాహ, అనడ్వాహ, సుదివ; అనునజంతప్రాతిపదికము లేర్పడి వానితర్వాత, సు ప్రత్యయము నిలిచినపు డజంతములకు వలె నుత్వాదుజ్ఞులు వచ్చి తురాసాహుఁడు, సుదివుఁడు నని మహత్త్వమునందును, 'అనడ్వాహము' అని యమహత్త్వమునందును రూపసిద్ధి కలుగుచున్నది. సంస్కృతమునందలి ప్రశాన్ శబ్దమును దత్సమత్వమున ద్వితీయైకవచనాంత తుల్యముగా దానిప్రాతిపదికము గ్రహించుట యుచితమని తోఁచుచున్నది. అపుడు 'ప్రశామఁడు' అనురూపము కల్గును. 'ప్రశానుఁడ'ను కవిశిరోభూషణోదాహృతికిఁ బ్రసిద్ధి యగపడదు. అట్టిదున్నచో దానిని సంజ్ఞావాచకముగా నకారాంతముగ గ్రహింప నగును. 'ప్రశాన్' శబ్దమును బ్రథమైకవచనాంతతుల్య ప్రాతిపదికముగా గ్రహించినచో ద్విత్వోత్వనులోపములు కలుగును; గాని యుత్వాదుజ్ఞులు కలుగుటకే యవకాశము లేదు. కిమ్శబ్దము 'కిమ్ము' అనురూపముతోఁ బ్రసిద్ధి కలిగి యుండుటచేనపుంసకలింగ ప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికమును గ్రహించి ద్విత్వోత్వనులోపములతో 'కిమ్ము' అనుదానిని సాధించుకొనవలెనని కవిశిరోభూషణము చెప్పుచున్నది. అది సరిగాదు. ప్రథమైకవచనాంతతుల్యమునుగాని ద్వితీయైకవచనాంతతుల్యమునుగాని ప్రాతిపదికముగా గ్రహించునపుడు

పుంలింగములోని వానినే గ్రహింపవలెను గాని స్త్రీలింగనపుంసక లింగములలోనివానిని గ్రహింపకుండుట తెలుఁగు లాక్షణిక సంప్రదాయము. కావున 'క్వచి న్నామగ్రహేణైవ' అనునథర్వణవచనముచే కిమ్‌శబ్ద ప్రాతిపదికమునే తెనుఁగు ప్రాతిపదికముగా గ్రహించి 'కిమ్ము' అనురూపము సాధించుకొనుట యుచితమని తోఁచుచున్నది. ఈ సంప్రదాయము నాంధ్రలాక్షణికు లందఱు సమ్మతించిరి.

179. సూ:- ఆత్మన ఇమనన్తానాం డా వా.

179:- ఆత్మన్‌శబ్దా దిమన్న న్తేభ్యశ్చ డా వా స్యాత్. చుటూ- డిత్కార్యమ్. హ్రస్వః. ఆత్మ. పక్షే౽న్యహల్లోపే ఆత్మము. మహత్త్వే డుజ్. ఆత్ముఁడు. గరిమ, లఘిమ, మహిమ ఇత్యాది. పక్షే గరిమము ఇత్యాది.

వి :- ఆత్మనః, ఇమనన్తానాం, డా, వా- అని ఛేదము. ఆత్మన్ శబ్దమునకును, ఇమనిచ్ ప్రత్యయాంతములైన శబ్దములకును 'డా' యనునది వికల్పముగా సుప్రత్యయమున కాదేశమగు నని యర్థము. 'డా' యనుదానిలోని డకార మిత్సంజ్ఞ కలది యగుటచే నది లోపించి, 'ఆ' యనునది మిగులును. డిత్తు పరమగునపుడు టిలోపము, పిమ్మట హ్రస్వము కలుగును. ఈ రీతిని 'ఆత్మ' మున్నగురూపములు సిద్ధించు నని కవిశిరోభూషణము వచించుచున్నది. 'ఆత్మా' అనుప్రథమైకవచ నాంతతుల్యప్రాతిపదికమునకు 'డా' యనుదాని నాగమము చేయఁగా టిలోపము, హ్రస్వమును జరిగి, ఆత్మ+సు అనియుండఁగా, డా అనునది స్త్రీప్రత్యయ మగుటచే, 'అనుతాం స్త్రియాం' అనుచోవ్వాన సులోపము కలిగి, 'ఆత్మ' అనురూపము సిద్ధించు ననుట సమంజసము. డాప్రత్యయము వికల్పము గావున, నది రానపుడు 'ఆత్మన్' అను ప్రాతిపదికములోని నకారమునకు లోపమును, సుప్రత్యయమునకు ముపర్ణ కాదేశమును జేయఁగా, 'ఆత్మము' అనురూపము సిద్ధించును. ఆత్మన్ శబ్దమునకు మహత్త్వవివక్ష చేయఁగా ఆత్మ+సు అనునపు డుత్వాదుజ్జులు

చేయఁగా 'ఆత్మోఁడు' అను రూపము సిద్ధించును. ఇన్లే గరిమ మున్నగు వాని నెఱుంగునది.

"ఆత్మన ఇమనన్తానాం" అనుదానికి శ్రీపచ్ఝల చిన సీతారామ స్వామిశాస్త్రిగారు తమయాంధ్రవ్యాకరణ సంహితాసర్వస్వమున నిట్లు వ్యాఖ్య చేసియున్నారు- "ఆత్, మన్, ఇమనన్తానాం, డా, వా," అని సూత్రమును విభజించిరి. హ్రస్వమగునవర్ణమునకుఁ బిదప నుండు 'మన్' అనుదానికిని, ఇమన్ప్రత్యయాంతశబ్దములకును బరముగా డా ప్రత్యయ మగును." ఈసూత్రములోని వాశబ్దము వ్యవస్థావాచి యగుటచే మన్నం తములు కాని 'యువన్, యజ్వన్, పూషన్ మున్నగు మఱికొన్ని కవి ప్రయుక్తశబ్దములకును డాప్రత్యయమువచ్చుననియు, అర్యమన్, వర్మన్, కర్మన్, మహాత్మన్, మున్నగుమన్నంతములకు డాప్రత్యయము రానేరద నియుఁజెప్పిరి. మఱియు నీడాప్రత్యయము స్త్రీప్రత్యయ మగుటచే దీనికిఁ బిమ్మట నున్న సుప్రత్యయమునకు స్త్రీలింగప్రథమైకవచనలోపము కలుగు ననియు వచించిరి. ఇట్లర్థము చేయుకున్నచో, ఆత్మన్శబ్దము హలంతమగుటచే దానికి డాప్రత్యయవిధానము సిద్ధసాధనమే యగు ననిరి, 'ఆత్మన్' అనుదానికి డాప్రత్యయము, టిలోపము, ప్రథమైకవచన లోపము చేయఁగా, ఆత్మ యనియు, డాప్రత్యయము రానపుడు ప్రథ మైకవచనాంతతుల్యమగు 'ఆత్మా' అనుదానికి హ్రస్వము చేసి యథా ర్హముగా నుత్వడుఙ్ములు, మువర్ణకము వచ్చి ఆత్మోఁడు, ఆత్మము మున్నగురూపములు సిద్ధించుచునే యున్నవని వచించిరి.

"అత్మేమనిజంతములకు, నాంతంబు లగుమనుజసంజ్ఞలకు, స్త్రీ త్వంబు బహుళంబుగా నగు" (బాల-తత్సమ-77) అని యీవిషయ మును సూరిగారు వివరించిరి.

**180. సూ :- డు స్స్యాత్సదా రాజ్ఞః.**

180 సూ:- రాజన్శబ్దాత్తు డుస్స్యాన్నిత్యమ్. రాజా. డువర్ణకవిధానం మువర్ణకవద్

జ్ఞేయమ్. 'స్వార్థప్రధానభావే స్యాద్రాజ్ఞో డుః పుంసి చేతనే' ఇత్యథర్వణోక్తిః. ముని రాజు స్వాత్ర టచ్. గౌణత్వేతు నమన్మునిరాజుఁడు రాముఁడు. నమన్మునిరాజ సీత. మహారాజము. బహురాజము దేశము. బహురాజయీపురి. ప్రాస్వః. "సురాజ యయోధ్య వసుధ"—ఇత్యాచార్యః. జీపి-రాజ్ఞి. బహురాజ్ఞి. సురాజ్ఞి ఇత్యాదిరూపమ్.

వి :- డుః, స్యాత్, సదా, రాజ్ఞః-అని ఛేదము. రాజన్‌శబ్దము నకు డు అనునది నిత్యముగా వచ్చునని యర్థము. రాజన్+డు+సు అని యుండఁగా టిలోపము కలిగి, సులోపము కలిగి 'రాజు' అను రూపము సిద్ధించును. ఈసూత్రముచే విహితమైన 'డు' అనునది ప్రాతిపదికకార్యము గాని పదకార్యము గాదు. డు చేరినరాజు అనుశబ్దము స్త్రీప్రత్యయాంతము. కావునఁ బ్రథమైకవచనప్రత్యయలోపము కలుగును. డు అనునది ప్రాతిపదికకార్య మగుటచే సన్నివిభక్తివచనములందును ముగాగమమువలె నిది వచ్చును. "రాజన్‌శబ్దమునకు స్వార్థప్రాధాన్యమునందును. బుంలింగమైనప్పుడును, చేతనవాచిత్వమునందును మాత్రమే పై చింతామణి సూత్రముచే 'డు' అనునది వచ్చును" అని యథర్వణ కారిక కర్థము. "డు వర్ణక విధానం మువర్ణకవత్ జ్ఞేయమ్" అనుదానికి విభక్తి పరమగునప్పు డాగమముగను, సుప్రత్యయమున కాదేశముగను జింతామణి చెప్పిన డు వచ్చునని యర్థము. ఇట్లు చెప్పుట సరిగాదు. 'డు' అనునది యాగమమే కాని యాదేశ మెన్నఁడును గాదు. 'డు' అనునది స్త్రీప్రత్యయము గానఁ, దదంతమునకుఁ బరమైన సుప్రత్యయమునకు లోపము కల్గును. మునిరాజు అనుచోట స్వార్థ ప్రధానభావము కలదు గాన టజంతముమీఁదనే డు ప్రత్యయము చేయఁగా రూపసిద్ధి కలుగుచున్నది. ఇచట టచ్ రాదని కవిశిరోభూషణము చెప్పుట సరి గాదు. నమన్మునిరాజుఁడు మున్నగువానియందు "నమస్కరించుచున్న మునిరాజులు కలవాఁడు" అని యర్థమగుటచే నిచట స్వార్థప్రాధాన్యము లేదు. కావునఁ జింతామణి చెప్పిన డు రానేరదు. బహురాజము మున్నగుచోట్ల నుపసర్జనత్వ ముండుటచే డుప్రత్యయము రాదు. సూరి గారు చింతామణ్యథర్వణ సూత్రములను రెంటిని గలిపి "మహత్త్వం

బున స్వార్థపరం బగు రాజశబ్దము రాజు నాఁ బడు" (బాల-తత్సమ-78) అని వివరించినారు.

181:- సూ. సాన్తా దపయఃప్రభృతే ర్లోపః.

181 సూ:- అపయః ప్రభృతే స్సకారాన్తస్య సస్య వాలుక్ స్యాత్. ఉదాహరణ ము త్తరత్ర వక్ష్యతే.

వి :- సాన్తాత్, అపయః ప్రభృతేః, ర్లోపః-అని ఛేదము. పయః మున్నగు వానిలోఁ జేరని సకారాంతశబ్దములకంటె విభక్తి పరమగు చుండఁగాఁ దుదిసకారమునకు లోపము వికల్పముగా నగునని యర్థము. సకారాంతప్రథమైకవచనతుల్యప్రాతిపదికముతుది నున్నసకారమునకు లోపము వికల్పమని తాత్పర్యము. ఊర్ధ్వరేతస్ అనుప్రాతిపదికమునకుఁ బ్రథమైకవచనతుల్యత్వమునందు 'ఊర్ధ్వరేతాస్' అనురీతిరూప ముం డును. తత్తుల్యప్రాతిపదిక సకారము లోపించి హ్రస్వము వచ్చి, ఊర్ధ్వ రేత+సు అని యగును. దాని కుత్వడుఙ్ములు వచ్చి, ఊర్ధ్వరేతుఁడు అని యగును. సకారలోపము రానపుడు గుణవద్గణ కార్యములును గలిగి, ఊర్ధ్వరేతసుఁడు అనియగును. "అపయః ప్రభృతేః" అనుటచే సకారాంత నపుంసకలింగశబ్దము లన్నియుఁ బర్యుదస్తము లగుచున్నవి. దీనింబట్టి సకారలోపము పుంస్త్రీలింగములగు సకారాంత మహాన్మహతీ వాచకశబ్దముల తుదిసకారమునకు వికల్పముగా లోపము కలుగు నని తెలియ వలయును. ఈసకారాంత శబ్దముల మహాన్మహతీవాచక పుంస్త్రీ లింగశబ్దములకు మాత్రము గుణవద్గణాగుణవద్గణకార్యములు రెండును గల్గును. మిగిలినవానికి గుణవద్గణకార్యముగాని, యగుణవద్గణకార్య ముగాని యేదోయొక్కటే కలుగును. రెండుగణములకార్యములు నొక్క-శబ్దమునకుఁ గలుగుట యనఁగా నొక్క-శబ్దమునకు రెండుగణములలోఁ జేరి యుండుట సంభవింప దని యర్థము. "సాంతంబులతుదిసకారమునకు లోపంబు బహుళంబుగా నగు" (బాల-తత్సమ-80); "మహద్వాచకంబు లగు సాంతంబుల కంతలోపంబేని, ద్వితీయైకవచనాంతతుల్యత్వంబే నగు"

(బాల-తత్సమ-81); "వేధపురోధపురోధసుఁడు" (బాల-తత్సమ-82); "మనఃప్రభృతులసకారంబునకుద్విత్వంబు విభాషనగు" (బాల-తత్సమ-83) అను సూత్రములచే సూరిగారు పైచింతామణిసూత్రమునకు ముందు చెప్పంబోవునహోబలపతిపండితునివివరణమును విశదపఱచి యున్నారు.

**182.** సూ :- అన్యేషాఞ్చ వా లుగ న్తస్య.

182 సూ. 1:—సా న్తవ్యతిరిక్తానాంకేషాంచిద్ధలన్తానాం శబ్దానా మ న్త్యస్యవాలుక్ స్యాత్. వ్యవస్థితవిభాషయా నస్యలోపే చ కారాదికార స్యాకారాదేశే కృతేపథము, బుభుక్షుఁడు, మథము, ఇతిరూపాణి. "నాయథాశక్తిఁజేసి యన్యాయపథము" ఇత్యాచార్యవచనే సమాసాన్తోఽప్రత్యయః.

వి :- అన్యేషాం, చ, వా, లుక్, అన్త్యస్య—అని ఛేదము. సాంతేతరములైన కొన్ని హలంతశబ్దములచివర నున్న వర్ణమునకు వికల్పముగా లోపము గలుగు నని యర్థము. 'పథిన్' శబ్దమునకు 'పథము' అనురూపము కలుగును. ఈ రూపమును సాధించుటలోఁ గవిశిరోభూషణము విచిత్రమార్గము నాశ్రయించినది మీఁది సూత్రములోని వా శబ్దమును వ్యవస్థచేసి తద్బలముచే 'పథిన్' అనుదానిలోని 'ఇ' కారమున కకారాదేశమును, ప్రకృతసూత్రముచే నకారలోపమును, ముఃవర్ణకమును జేసి 'పథము' అనురూపమును సాధించినది. ఇంతకంటె 'పథః' అను నకారాంతశబ్దము సంస్కృతనిఘంటువులయందుఁ బ్రసిద్ధముగానుంటను, 'సోపానపథేన'(రఘు—6సర్గ. 3శ్లో)అని కాళిదాసు దీని నకారాంతముగాఁ బ్రయోగించుటను, దానిని దత్సమము చేయఁగాఁ 'బథము' అనురూపము సిద్ధించుచున్నది. ఈరూపమే కవులచేతను బ్రయోగింపఁబడినది. ఇట్లే 'మథము' అనురూపము కూడ సిద్ధించునని యూహింపనగును. (చూ. బాల-తత్స. 83. సూ.) 'బుభుక్షిన్' అను శబ్దముయొక్క ప్రథమైకవచనరూపము 'బుభుక్షాః' అనునది. బుభుక్షా అనుదాని దీర్ఘమునకు హ్రస్వము, నుత్వడుజ్ఙులును జేయఁగా

బుభుక్షుఁడు' అనురూపము సిద్ధించును. 'మథిన్' శబ్దమును మథము అనురీతినే తత్సమమగుచున్నది. 'పథిన్, బుభుక్షిన్, మథిన్' అనువాని కారములకు "అన్యేషాం వా లుగ న్తస్య" అనుదానిచే లోపము చేసి, వ్యవస్థితవిభాషాసామర్థ్యముచే సూత్రములోని చకారబలమువలన నికారమున కకారాదేశము చేయఁగా పథము, బుభుక్షుఁడు, మథము మున్నగు రూపములు సిద్ధించుననుట సరికాదు. 'మథిన్' అనుదానికి మథము అను తత్సమరూప మప్రసిద్ధము. దీనిని 'మన్థమ్' అను ద్వితీయైకవచనాంతతుల్య ప్రాతిపదికపైని 'మంథము' అని సాధించుట యుచితము.

182. సూ. 2:- హ్రస్వే డుజ్. నిగమశర్ముఁడు. నిగమశర్మేత్యదుజ న్తరూపస్యతు "క్వచి న్మనుజసంజ్ఞాయాం డుజ్నాన్తా న్న విధీయతే." ఇత్యథర్వణోక్తి శ్శరణమ్. ఏతేన 'అశ్వత్థామా' ఇతిరూపం సమఞ్జసమేవ. "మహాబలుఁడశ్వత్థామ" ఇత్యాచార్యవచనమ్. చతుర్ముఖపరత్వే బ్రహ్మేతిరూప న్తు "పుంబ్రహ్మణో వేధసశ్చ హ్రస్వత్వేనైవ సంస్థితిః" ఇతి తదుక్త్యైవ సిద్ధ్యతి. "బ్రహ్మకుం దపము చేసి యనంతుఁడు" ఇత్యాదివచన మాచార్యస్య. "తోలుఁదోలుతఁ గృష్ణవ ర్త్మకుఁ గళ యొసంగి" ఇత్యాది కవివచన మనాకర మేవ. ఆర్యముఁడు, బుక్షము, ఇత్యాది. కరీ, కృతీ ఇత్యాదయో బహవ శ్శబ్దాః ప్రథమాతుల్యత్వే జ్ఞేయాః.

వి :— నిగమశర్మన్‌శబ్దముయొక్క ప్రథమైకవచనతుల్యరూపము 'నిగమశర్మా' అనునది. దానికి హ్రస్వముచేసి సుప్రత్యయమును, దాని కుత్వడుజ్జులును జేయఁగా 'నిగమశర్ముఁడు' అనురూప మేర్పడును. 'సుశర్ముఁడు' అనునదియు నిట్లే. 'మనుష్యవాచకములలో నకారాంతముకంటెఁ బరముగాఁ బ్రథమైకవచన డు ప్రత్యయము క్వాచిత్కముగా విధింపఁబడదు' అనునథర్వణవచనము చెప్పుచున్నది. అనఁగా వానికి డుప్రత్యయము నిత్యమని తెలుచున్నది. 'పుంలింగ బ్రహ్మన్' శబ్దమునకును వేధస్‌శబ్దమునకును, గొన్నిమనుజసంజ్ఞలకువలె హ్రస్వము కలుగుటచేత మాత్రమే యునికి సంభవించునని "పుంబ్రహ్మ" అను వాక్యమున కర్థము. పుంలింగ 'బ్రహ్మన్' శబ్దమునకు 'డాప్' అను ప్రత్య

యము వచ్చి, ప్రాతిపదికదీర్ఘమునకు హ్రస్వము కలిగి దానిపైనున్న 'సు' ప్రత్యయమునకు స్త్రీలింగప్రథమైకవచనలోపము కలుగుటచేఁ దెనుఁగున దాని కునికి సంభవించునని తాత్పర్యము. మనుష్యవాచి యగు 'అశ్వత్థామన్' అనుదానికివలెనే దేవతావాచి యగు 'బ్రహ్మన్' అనుదానికిని డాప్రత్యయము నిర్వివాదముగ వచ్చును. వేధశ్శబ్దమునకును నీడాప్రత్యయము వచ్చును. డావ్వును వీని కంగీకరింపనిచో "డుఙ్నాన్నా న్న విధీయతే"అను నథర్వణవచనముచొప్పునఁ బ్రథమైకవచనలోపము వానికి సంభవింపదు. 'అశ్వత్థాము, బ్రహ్మ, వేధ' అనునవి యుదాహరణములు. "పుంబ్రహ్మణః" అనునియమముచేఁ బుంలింగేతర 'బ్రహ్మన్' శబ్దమునకు డాప్రత్యయము పాక్షికముగానైనను రానేరదనియు, సగుణవద్గుణకార్యముతోనే యది ప్రయుక్త మగునని యుఁ దాత్పర్యము నెన్నవలయును. బ్రహ్మము - బ్రహ్మమ్ము - బ్రహ్మంబు అని యుదాహరణములు.

182. సూ. 3 :- ద్వితీయైకవచనతుల్యత్వే శ్వానము, ఋత్విజుఁడు. 'ఋత్విజుండని విచారించి పూజించితే' ఇత్యాచార్యః.

వి :- 'శ్వానమ్, ఋత్విజమ్' అను ద్వితీయైకవచనతుల్యప్రాతిపదికములు శ్వశబ్దఋత్విక్ఛబ్దములకుఁ గల్గును. వానిమకారములకు లోపము చేసి సుప్రత్యయమునకు ముపర్ణకము చేయఁగా 'శ్వానము' అనియు, నుత్వడుజ్జులు చేయఁగా ఋత్విజుఁడనియు, రూపములు సిద్ధించును. ఇట్లే 'సుహృదుఁడు, వేదవిదుఁడు' అని సుహృద్వేదవిచ్ఛబ్దములకును, ద్వితీయైకవచనాంతతుల్య ప్రాతిపదికములమీఁదనే తత్సమరూపము లగును.

182. సూ. 4 :- "భవద్గిర్ముఖ శబ్దానా మాద్యయో ర్యష్మదస్మదోః
భాషాయాం నాత్ర యోగ స్స్యా దితి సిద్ధాన్తపద్ధతిః"
ఇత్యథర్వణః. ఆదిశబ్దేన తదాదయో గృహ్యన్తే.

వి :- "భవత్ మున్నగుహలంతశబ్దములును - గీర్, ధూర్,

చతుర్, మొదలగు రేఫాంతశబ్దములును - యుష్మత్, అస్మత్, అను శబ్దములును వికృతిభాషయం దాంధ్రవిభక్తియోగరూప మగుతత్సమ శబ్దప్రయోగముతో నుండవు - అని ఆంధ్రమహాకవి సమయము" అని 'భవద్గీర్ముఖశబ్దానాం' అనుదాని కర్థము. "యుష్మదస్మదోః" అనుపదము సంస్కృతములోని యత్, తత్, మున్నగు సర్వనామశబ్దముల కుపలక్షణము; కాన యత్, తత్, ఏతద్, ఇదమ్, అదస్, త్యద్ మున్నగు సర్వనామశబ్దములకును దత్సమరూపమునఁ దెలుఁగులోఁ బ్రయోగము లేదు. ఈయథర్వణకారిక, 'న పదా న్యవ్యయ' అనుసూత్రమునకు వివరణము.

182 సూ 5:- అగ్నిమథుఁడు, ప్రాఞ్చుఁడు, భగవంతుఁడు, మఘవంతుఁడు, ధీమంతుఁడు. "హనుమానుఁడు, భగవానుఁడు" ఇతిరూపద్వయం గుణవద్గణవ ద్బోధ్యమ్. 'హనుమంతుఁడు' ఇతిరూపం ప్రాకృతసమమపి "మన్తమణవన్తమా అలఇరఇల్లఉల్ల ఇంతామతుపః" ఇతి సూత్రేణ మతుపః స్థానే మన్తాదేశవిధానాత్. విశేషణస్య గుణవద్గణత్వే 'మంత్రవంతమ్ముగఁ గ్రమంబున సేవురు' ఇత్యాచార్యవచనం మానమ్.

వి :- అగ్నిమంథమ్ అనునది అగ్నిమథ్ శబ్దముయొక్క ద్వితీయైకవచనాంతతుల్యప్రాతిపదికము. దీనికిఁ దత్సమరూపము అగ్నిమంథుఁడు. 'ప్రాక్' శబ్దమునకుఁ బ్రాఞ్చుఁడు; భగవచ్ఛబ్దమునకు భగవంతుఁడు, మఘవచ్ఛబ్దమునకు మఘవంతుఁడు; ధీమచ్ఛబ్దమునకు ధీమంతుఁడు - అనురీతిని ద్వితీయైకవచనాంతతుల్యప్రాతిపదికములమీఁద నీ రూపములు సిద్ధించును. హనుమానుఁడు, భగవానుఁడు-అనునవి చింతామణి వికృతివివేకములచొప్పున సిద్ధింపవు. వానికి 'హనుమాన్, భగవాన్' అనునవి ప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికములు. వీని కుత్వడుఙులు వచ్చుట దుర్లభము. 'హనుమంతుఁడు, భగవంతుఁడు' అనురీతిని ద్వితీయైకవచనాంతతుల్యప్రాతిపదికములమీఁద నివి సిద్ధించును. ఇట్టిరూపములను సాధించుటకుఁ గవిశిరోభూషణము ప్రాకృతవ్యాకరణము నాశ్రయింప నక్కఱ లేదు. 'హనుమానుఁడు, భగవానుఁడు' అనురూపములు దీనిచే సాధింపఁబడవు. 'మంత్రవంతము' అనునదియు ద్వితీయైక

వచనాంతతుల్య ప్రాతిపదికముమీఁదనే సిద్ధించును. అహోబలపతి హనుమత్, భగవచ్ఛబ్దములను ప్రథమైకవచనాన్తతుల్యములుగా గ్రహించి, యుత్వాదుజ్ఞులు చేసి హనుమానుఁడు, భగవానుఁడు అనియు, ద్వితీయైక వచనాంతతుల్యములుగా గ్రహించి హనుమంతుఁడు, భగవంతుఁడు అనియు రూపములు సిద్ధించునని చెప్పియున్నాఁడు. అట్లనుట సరికాదు. గుణవర్ణము కాని దగుణవర్ణమనియు, నగుణవర్ణము కానిది గుణవర్ణమనియుఁ దెలియుచున్నది. ఒకగణములో నున్నశబ్దము వేఱొక గణములో నుండరాదు. అట్లుండుట నన్నయాథర్వణులకు సమ్మతమును గాదు. కావున నట్టివ్యాఖ్యానము సరి గాదనవలసివచ్చును. ఈవిషయము నహోబలపతిమతము ననుసరించి బాలవ్యాకర్త "ఒకానొకచో మహత్త్వంబునందు మతు ప్తకారంబున కానాదేశంబు విభాష నగు" (బాల—తత్సమ—74) అని వివరించెను. ఇది ఆంధ్రవైయాకరణుల సంప్రదాయము కాదని చెప్పక తప్పదు. ఇట్టిమహాకవిప్రయోగము లున్నపుడు వానిసిఁ దత్ప్రయోగప్రసిద్ధిచేతనే సాధువు లగునని, వానికి మాత్రమే సాధుత్వ మంగీకరించుట యుచితముగాని, యట్టిరూపముల నితరకవులు ప్రయోగించుకొనుట కనుకూలముగా వైయాకరణులు సూత్రించుట యుచితము గాదుగదా!

182. సూ. 6 :— 'అజ్ఝలోః రాలు శబ్దేన సమానార్థకతా యది।
సమాసే తత్ర చో ద్రస్యా ద్రేఫ ఏవ క్వచి ద్భవేత్'॥

ఇత్యథర్వణోక్తేః బుద్ధిమంతురాలు. స్త్రీత్వే ధీమతి, బుద్ధిమతి ఇత్యాదిరూపమ్. "ఆద్య శాస్త్రానుసారేణ టాబాదిప్రత్యయో మతః" ఇత్యథర్వణః. "నియతస్త్రీప్రత్యయః" ఇతి వాగనుశాసనశ్చ.

వి:— అజంతములకును, హలంతములకును 'ఆలు' అనుశబ్దముతో సామానాధికరణ్యము గలుగునపుడు నిత్యముగా నారెంటికిని సమాసము కలుగును. చింతామణి చెప్పినయుత్వరత్వములు నగును. ఒకానొకప్పుడు రేఫముమాత్రమేవచ్చును—అని 'అజ్ఝలోరాలుశబ్దేన' అనుదాని కర్థము.

ఈకారిక 'దారార్థేత ఉదపి రః' అను చింతామణికారికను వివరించుచున్నది. 'సంస్కృతవ్యాకరణముచొప్పున వచ్చు టాబాదిస్త్రీప్రత్యయములును నీ తెలుఁగునందు సమ్మతము లగును' అని 'ఆద్యశాస్త్రానుసారేణ' అనుదాని కర్థము. ఈకారిక 'ఃయతస్త్రీప్రత్యయ స్తు సర్వాసామ్' అను చింతామణిసూత్రమునకు వివరణము.

182. సూ. 7 :— మరుత్తు, ఇంద్రజిత్తు, పరీక్షితుఁడు, "భవజ్జనకుఁ బరీక్షితున్" ఇత్యాచార్యః. అస్య సులోపఞ్చాప్యఙ్గీచకార. 'పరీక్షితుఁ గాచినయట్లు' ఇతి ప్రయోగాత్. షష్ఠ్యన్తత్వేన వా రూప మిదం కథఁచి దున్నేయమ్. నీవృతము, ఘృతస్పృశుఁడు, దోషములు, చతుర్దోషుఁడు, విద్వాంసుఁడు; (స్త్రీయాం) విదుషి, (సమాసే) బహువిద్వాంస పురి, బహువిద్వాంసము పురము. సలోపే ప్రచేతుఁడు, ప్రచేతసుఁడు, ఇత్యాది 'ప్రచేతసుపుత్రు భక్తిఁ దలంచుచున్', 'మఱియు నాంగిరసుఁ డనుమానసపుత్రున కూర్ధ్వరేతుండు' 'ఊర్ధ్వరేతసులైన' ఇత్యాదివచన మాచార్యస్య. ఏవం పుంలిఙ్గ శబ్దా బోధ్యాః.

వి :— మరుత్తు, ఇంద్రజిత్తు, అనునవి మరుదింద్రజిచ్ఛబ్దముల ప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికములమీఁద సిష్పన్నములు. ఇవి యగుణవర్ణములోనివి. పరీక్షిచ్ఛబ్దము గుణవర్ణములోనిది. కావున 'భవజ్జనకుఁ బరీక్షితున్' అనుప్రయోగము సాధు వగుచున్నది. 'పరీక్షితుఁ గాచినయట్లు' అను నన్నపార్యునిప్రయోగముచే సులోపము నంగీకరింపవచ్చు నని కవిశిరోభూషణ మనుచున్నది. కాని 'పరీక్షితు యొక్క కాచిన యావిధముగా' అని యర్థముచేసి పరీక్షిత్తు, పరీక్షితు— అని యగుణవర్ణరూపముల నంగీకరించి, సులోపము కలుగుననుట సరి కాదు. 'పరీక్షితమ్' అను ద్వితీయైకవచనాంతతుల్యప్రాతిపదికము మీఁదఁ బరీక్షితుఁడు అనురూపము నిష్పన్న మగును. నిగాగమము రానిచో 'పరీక్షితుఁ గాచినయట్లు' అనురూపము సిద్ధించును. నీవృతమ్— నీవృతుఁడు; ఘృతస్పృశమ్—ఘృతస్పృశుఁడు; దోషమ్ - దోషము; చతుర్దోషః — చతుర్దోషుఁడు, విద్వాంసమ్ - విద్వాంసుఁడు, స్త్రీ

లింగమునందు విదుషి - ఇత్యాదిరూపములు సిద్ధించును. 'బహువిద్వాంస పురి' ఇది స్త్రీలింగవిశేషణము. బహువిద్వాంసము పురము- క్లీబవిశేషణము. 'ప్రచేతస్' అనుదానికి సలోపము చేయఁగా నత్వడుజ్జులు వచ్చి 'ప్రచేతుఁడు' అని యగును. సలోపము రానపుడు 'ప్రచేతసుఁడు' అనునది గుణవర్ధనరూప మగును. సాంతంబులు కొన్నింటికి క్లీబరూపములు గ్రహింప నగును. కొన్ని సాంతములకు గుణవర్ధనాగుణవర్ధనపాఠములను రెంటిని గవిశిరోభూషణ మంగీకరించెను. అది సరిగాదు. సలోపపక్షమునం దూర్ధ్వరేతుఁడు, సలోపాభావపక్షమున నూర్ధ్వరేతసుఁడు — అని పుంలింగశబ్దరూపములు.

182. సూ. 8 :- ఉపానత్తు - పూశ్శబ్దస్య. పురము. స్రుక్కు. 'మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసంపద లాలిన్' ఇత్యాచార్యవచనాత్ సంపద, ఆపద ఇతిసిద్ధమ్. అన్యథా గుణవర్ధనే డుజ్ఞేరేవ శ్రవణాత్సులోపో న స్యాత్. ఏతద్వచనమహిమ్నా గుణవర్ధనేఽపి స్త్రీత్వే సులోపశ్చాస్తీతి జ్ఞాయతే. ఏవఞ్చ డుమూ ప్రాగ్వదిత్యేతయోరుపలక్షణతా మాశ్రిత్య ప్రాగ్వన్మహత్త్వే డుజ్, స్త్రీత్వే సోర్లోపః, అమహత్త్వే మురితి వ్యాఖ్యేయమ్. అయమేవ ప్రయోగోఽన్యహల్లోపేఽపి మానమ్. ముచ్ఛబ్దస్య ముదంబు లింగవ్యత్యయః. 'ముదం బొనరం గొనియాడి వేడుకన్' ఇత్యాచార్యః.

వి :— ఉపానహ్, ఉపానత్తు - ఇది ప్రథమైకవచనాంతతుల్య ప్రాతిపదికము. పూర్ శబ్దమునకు-పురము. ఇది ద్వితీయైకవచనాంత తుల్య ప్రాతిపదికము. స్రుక్కు, స్రుజము అను నుదాహృతులనుబట్టి స్రుక్ శబ్దమునకు గణద్వయమునను పాఠ మంగీకరింపఁబడినదని తెలియుచున్నది. ఇది సరి గాదుగదా. మఱియు స్రుక్కు, సృజము—అనుటకంటె, స్రుక్కు, స్రజము—అని యుదాహరించుట సమంజసమేమో యని తోఁచుచున్నది. సంపద—ఆపద అనునవి యాచార్యప్రయోగమహిమచే గుణవర్ధనమునందును స్త్రీత్వవివక్ష చేయఁగా సులోపము కలిగినది. 'డుమూ ప్రాగ్వత్' అనుదానికి మహద్వివక్షయందు

డుఙ్ఞును, స్త్రీత్వమున నులోపమును, నపుంసకత్వమున మువర్ణకమును గలుగునని వ్యాఖ్యానింప నగును. 'సంపదమ్' అనునపుడు "సంపదిలు" అను నన్నపార్యుని ప్రయోగమే వ్యంజనమకారలోపము కలుగు నను టలోఁ బ్రమాణము. ముచ్ఛబ్దమునకు ముదంబు - ఇచట లింగము మాఱినది. ఇదియు నన్నపార్యుని ప్రయోగమే.

182 సూ. 9 :- వాక్కు' వాకు - బహుళగ్రహణా ద్విత్వ మద్విత్వఞ్చ 'వాకులకిత్తులు నుపద్రవంబులుగావే' ఇత్యాచార్యః. ప్రక్కు, ఋక్కు, సరిత్తు, యోషిత్తు, పంచాశత్తు. అప్ శబ్దస్యతు బహువచనాన్తత్వేన ఏకవచనతుల్యత్వాసమ్భవాత్ ప్రాతిపదికమాత్రస్య ద్విత్వోత్వే 'అప్పులు' ఇతిరూపమ్. "క్వచి న్నామగ్రహేణైవ ప్రయోగోఽత్ర హితో భవేత్" ఇత్యథర్వణః - అప్పుపాలైన శుభ్రాబ్జంబురుచి యొంత, 'తనకూర్మి తేని నప్పుననె ముంచె' ఇత్యాదయః కవిప్రయోగాస్తు న సాధవః. 'అప్పులపాలైన యబ్జంబురుచి యొంత;' 'తనకూర్మి తేని నప్పులనె ముంచె' ఇత్యాది పాఠస్తు సాధుః. కకుప్పు, దిక్కు, దృక్కు, ఆశీస్సు.

వి :- 'ద్విత్వం తు దీర్ఘతో బహుళమ్' అనుచెప్పిన వాక్కు, వాకు అని ద్విత్వాద్విత్వములతో రెండురూపము లగును. ప్రక్కు, ఋక్కు, సరిత్తు, యోషిత్తు, పంచాశత్తు - అనునవి యుగుణవర్ణము లోనివి. కాని ప్రక్ఛబ్దమును ద్వితీయైకవచనాంతతుల్యమనుట లెస్స. అప్ శబ్దము నిత్యబహువచనాంత మగుటచేఁ బ్రథమైకవచనాంతతుల్యత్వము దాని కుండదు గావున "క్వచి న్నామగ్రహేణైవ" అనుచెప్పిన అప్ అనుప్రాతిపదికమునకే ద్విత్వోత్వములను జేసిన 'అప్పులు' అనియగును. 'అప్పుపాలైన' 'అప్పుననే' అని యేకవచనాంతప్రయోగము తప్పని కవి శిరోభూషణ మనుట సరికాదు. అప్ శబ్దము-సంస్కృతమున నిత్యబహు వచనాంతమైనను దత్సమత్వమున నేకత్వబహుత్వములు దాని కుండ నగును. కాఁగా అప్పు, అప్పులు అనురెండురూపములును దెనుఁగున నుండనగును. కవిశిరోభూషణ మేకవచనాంతప్రయోగమును సవరించు టకుఁ బడినప్రయాసము వ్యర్థ మగుచున్నది. కకుప్, దిక్, దృక్, ఆశీస్

అనువాని కగుణవద్గుణకార్యము లగు ద్విత్వోత్వనులోపములు కలుగును.

182 సూ. 10 :- అప్సరసలు - అప్సరస - 'అప్సరస ఘృతాచి యన్ పదము లాంగి' ఇతివచన మాచార్యస్య. నచ తస్యైకవచనాన్తత్వం విరుద్ధమ్. "స్త్రియాం బహుష్వప్సరసః" ఇత్యత్ర బహుష్వితి ప్రాయికమ్. అప్సరా ఇత్యేకవచనస్యాపి దర్శనా దితి వ్యాఖ్యాకృద్భి రుక్తత్వాత్. 'మేనకా పరమాప్సరాః' "తుల్యాప్సరస ఇతి కాళిదాసః" నలోదయే "చతురత్వం బొప్పఁగా నప్సరస లుభయపార్శ్వంబులం బాడుచుండ" ఇతి శ్రీనాథకవిః. ఏవం స్త్రీలిఙ్గా బోధ్యాః.

వి :— అప్సరశ్శబ్దము నిత్యబహువచనాంత మని 'స్త్రియాం బహుష్వప్సరసః' అని నామలింగానుశాసనము చెప్పుచున్నది. కాని సంస్కృతమునందే యేకవచనబహువచనప్రయోగములు రెండును దానికిఁ గలవు. అట్లే తెలుఁగునఁగూడ నుండ నగును. 'అప్సరసమ్' అని ద్వితీయైకవచనాంతతుల్య ప్రాతిపదికము. దానిమీఁద సులోపము చేయఁగా అప్సరస—అప్సరసలు అనురూపము లేర్పడును. దీనివలెనే 'అప్' శబ్దమునకుఁ దెనుఁగునందు అప్పు, అప్పులు—అని రూపద్వయ ముండును. ఇది సంస్కృతమున నిత్యబహువచనాంతము. కాన దీనికి ఆపః, అపః, అద్భిః. అద్భ్యః, అద్భ్యః, అపామ్, అప్సు—అనురూపములే సంస్కృతమున నుండును. దీనికిఁ బ్రథమైకవచనరూపము లేదు గాన 'క్వచి న్నామగ్రహే త్వైవ' అను నథర్వణవచనము చొప్పున సంస్కృతప్రాతిపదికమే తెలుఁగునను బ్రాతిపదికము కానోపును.

182 సూ. 11 :- స్వనడ్వాహము పురము. అస్రుక్కు, అస్రుజము. చర్మము. శర్మము. బ్రహ్మము. జగము-జగత్తు, ఆయువు-జటాయువు, ధనువు, శిరము, తేజము, ఓజము, యశము, మనము, అన్త్యహల్లోపే మువర్ణకః, పక్షే ద్విత్వోత్వే ఆయుస్సు ఇత్యాది. బహుళగ్రహణా దద్విత్వే జటాయుషుఁడు ఇతిరూపఞ్చ. పయఃప్రభృతేస్తు పయస్సు – ఆయుస్సు - సరస్సు ఇత్యాది. అత్ర ప్రథమైకవచనతుల్యత్వేపి విసర్గస్య ద్విత్వాసమ్భవా త్తత్స్థానిన స్సకారస్యైవ గ్రహణమ్. "అపయః ప్రభృతేః" ఇతి సూత్రప్రయోగశ్చ శబ్దానుశాసన స్యాత్ర మానమ్". బహుళగ్రహణా త్క్వాచి

దన్యదేవ “ఇత్యద్విత్వే సదసు” ‘సదసులోని విప్రజనముమీఁద’ ఇత్యాచార్యేణ ప్రయుక్తమ్. తేన ‘ఎందు వేఁటరారె యితరు లేమనసుతో దారసంగసుఖము తప్పఁ ద్రోచి’ ఇత్యాదయః కవీనాం ప్రయోగాః సాధవ ఇతి బోధ్యమ్. ఏవం నపుంసకలిఙ్గా జ్ఞేయాః.

వి :— స్వనడ్వాహము అనునది స్వనడుచ్ఛబ్దము ద్వితీయైకవచనాంతతుల్య ప్రాతిపదికముమీఁద నిష్పన్నము. మంచియెద్దు అని దాని యర్థము. పూర్ శబ్దమునకును ‘పురము’ అనురూపమునను సరించి ద్వితీయైకవచనాంతతుల్యత్వము నే యంగీకరింపవలయును. అసృక్ఛబ్దమునకుఁ బ్రథమాద్వితీయైకవచనాంతతుల్యత్వములుగలవని అసృక్కు, అసృజము అని యుదాహరింపఁబడుట సరిగాదు. ఒకశబ్దము రెండుగణములలో నుండుట యసమంజసము. మహాకవిప్రయోగానుసారముగా దాని నొక్క గణములో నిలుపుట యుచితము. సకారాంతములలో నొకా నొకశబ్దమునకుఁ గ్వాచిత్కముగా గణద్వయపాఠ మున్నట్లు కవిప్రయోగ మగపడుచున్నది. అట్టివాని నొకగణములోఁ బఠించి రెండవరూపమునకుఁ దత్ప్రయోగప్రామాణ్యముచే సాధుత్వము నంగీకరించుట యుచితము. చర్మన్, శర్మన్ శబ్దములకు వరుసగా చర్మము—శర్మము అను రూపము లేర్పడును. వీనికి రెండుగణములయందును బాఠము నంగీకరింపరాదు. ‘క్వచి న్నామగ్రహణైవ’ అనుచొప్పునఁ బ్రాతిపదికముమీఁదనే రూపసిద్ధి నరయవలెను. ప్రథమాద్వితీయైకవచనాంతతుల్యతలు పుంలింగశబ్దముల కంగీకరించుటయే సంప్రదాయము కాన ‘చర్మ, చర్మణీ, చర్మాణి; శర్మ, శర్మణీ, శర్మాణి’ అనురీతి నున్నవానినపుంసకలింగ ప్రథమైకవచనాంతతుల్య ప్రాతిపదికములను దెనుఁగున గ్రహించుట యుచితము గాదు. చర్మన్+సు అనియుండఁగా నంతలోపము చేసి, సుప్రత్యయమునకు మువర్ణకము చేయఁగా ‘చర్మము’ అని యగును. శర్మము అనునదియు నిట్లే. పరబ్రహ్మరూపార్థక మగుబ్రహ్మము అను దానినిగూడ నిట్లే సాధింపనగును. జగచ్ఛబ్దమునకు ‘అన్యేషాఞ్చ వా లుగన్తస్య’ అని వికల్పముగాఁ దకారలోపము చేసి జగము-జగత్తు

అని సాధింపనగును. ఆయుస్-జటాయుస్ శబ్దములకు సకారలోప
మును సుప్రత్యయమునకు వువర్ణకమును జేయఁగా ఆయువు-జటాయువు
అని యగును. ధనువు, శిరము, తేజము, ఓజము, యశము, మనము,
మున్నగువానికి సలోపమువర్ణకములు చేయఁగా నవి సిద్ధించుచున్నవి.
సలోపము రానపుడు ద్వితీయైకవచనాంతతుల్యత్వము నంగీకరించి జటా
యుషమ్-జటాయుషుఁడు-అనియగునని కవిశిరోభూషణ మనుచున్నది.
కాని యట్టిరూపములకుఁ బ్రసిద్ధి లేదుగదా. పయస్సు, ఆయుస్సు,
సరస్సు మున్నగునవి ప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికములమీఁద
సిద్ధించును. పయః, అనుదానిలోని విసర్గమునకు ద్విత్వ మసంభవము
గావున దానికి సకారము చేసి ద్విత్వోత్వసులోపములు చేయనగునని
కవిశిరోభూషణ మనుచున్నది. పయః మున్నగునవి నపుంసకలింగములు
గాన వీనిప్రాతిపదికమునే తెనుఁగునను ప్రాతిపదికముగా గ్రహించి
రూపసిద్ధి నరయవలెను. ద్విత్వలోపము చేయఁగా సదను మున్నగు
రూపములు కల్గుచున్నవి. 'సదసులోనివిప్రజనముమీఁద' అనునన్న
పార్యునిప్రయోగముచే నట్టిరూపములు సాధువులనుట లెస్స. "ఏమన
సుతో దారసంగసుఖము" అనునపుడు 'ఏమనస్ + సుతోదారసంగ
సుఖము' అనియు, ఏమనసుతోన్ + దారసంగసుఖము-అనియు నర్థద్వ
యమునను ఛేదము. శ్లేషలలో నిట్టివాని కభ్యనుజ్ఞ కలదు గాన
దోషము లేదు.

182 సూ. 12 :– ప్రాచి - ప్రతీచి - అనడుహి - అనడ్వాహి - అతిసుత్వరి - అతిధీవరి - బహుధీవరి - కుండోధ్ని - ద్వ్యూధ్ని ఇత్యాదికం స్త్రీప్రత్యయే రూపం యథాశాస్త్రం గ్రాహ్యమ్.

"యథాప్రకృతి సర్వత్ర సమాసాన్తవిధి స్థితః।
నిత్యతా క్వచి దిష్టా స్యా ద్రూపం గ్రాహ్యం సుధీహితమ్॥

ఇత్యథర్వణః. ద్వ్యహ్నము, అశ్వోరసము. ముఖ్యోశ్వ ఇత్యర్థః. కాలాయసము, లోహితాయసము, జలసరసము, అతిశ్వం బగువరాహము, కుబ్రహ్మఁడు, మహాబ్ర

హ్మాడు, అర్ధర్చము, శార్ఙ్గధన్వుఁడు, శతధన్వుఁడు, ధనుశ్శబ్దపర్యాయో ధన్వశబ్దోఽ ప్యస్తి. వ్యూఢోరస్కుఁడు, ప్రియసర్పిష్కుఁడు, 'విభాషాకపి' మహాయశస్కుఁడు- ఇత్యాదిసమాసాన్తవిశిష్టా రూపాణి గ్రాహ్యాణి. క్వచిత్సమాసాన్త స్యాద్యప్రకృత్యాం వైకల్పికత్వేఽపి, అత్ర తస్య నిత్యత్వేనైవ ప్రయోగ ఇష్టః. యద్యత్సమాసాన్తరూపం పణ్డితహృదయఙ్గమం, తత్తద్రూపం గ్రాహ్యమిత్యుత్తరార్థః. తేన 'విశదమనస్కుఁడు' ఇత్యాదీన్యేవ రూపాణి గ్రాహ్యాణి; నతు విశదమనుఁడు. విశదమనస్సుఁడు, ఇత్యాదీని. అతఏవ 'సద్వీపసారణ్య సక్షితిభృత్కం బగుదానిన్' ఇత్యాదివచనాన్యాచార్యస్య. వితతౌజుఁడు - ఇత్యాదిరూపం గ్రాహ్యమేనేతి యథాశాస్త్రం యథేపితం రూప మూహ్యమ్. 'అంతర్మనుఁడు' ఇతి రాఘవపాండవీయే పుంసి బలజితానడ్వాహుఁడు. స్త్రియాం నివారితానడ్వాహి. పుంసి పాలితద్వీపుఁడు; స్త్రియాం పాలితద్వీప; పుంసి పదజనితసరిత్కుఁడు; స్త్రియాం సముత్తీర్ణసరిత్క - ఇత్యాదీని విశేష్యనిఘ్నతాయాం రూపాణ్యూహ్యాని.

వి :- "ప్రాచి, ప్రతీచి, అనడుహి, అనడ్వాహి, అతిసుత్వరి, అతిధీవరి, బహుధీవరి, కుండోధ్ని, ద్వ్యూధ్ని, ఇత్యాదికం స్త్రీప్రత్యయే రూపం యథాశాస్త్రం గ్రాహ్యమ్" అని కవిశిరోభూషణము వ్రాసెను. ఈశబ్దము లన్నియు సంస్కృతభాషయందు స్త్రీలింగము లగుటచే దీర్ఘమునకు హ్రస్వము వచ్చి తత్సమత్వమున సులోపముచే సిద్ధించుచున్నవని కవిశిరోభూషణాభిప్రాయము వ్యక్తమగుచున్నది. సంస్కృతమున నివి స్త్రీప్రత్యయాంతములు. వీనికి సంస్కృతమున నిట్టిరూపము లుండుఁగాక ! సంస్కృతవ్యాకరణము వీనిని సాధించుఁగాక! తెనుఁగున మాత్రము వీనికి 'ప్రాచి, ప్రతీచి, మున్నగువానికిఁ దప్ప మిగిలినవానికిఁ గొన్నింటికిఁ గవిప్రయోగప్రసిద్ధి యున్నట్లగపడదు.

నన్నయగారు "విరళాన్ పేచోపాదికశబ్దాన్ప్రవ్యాహరన్తు శబ్దజ్ఞాః ; ఇహ తు ప్రవ్యాహార్యం సజ్కేతితసుప్రసిద్ధమేవ పదమ్" అని తెనుఁగునందు సంకేతితసుప్రసిద్ధము లగువానికే ప్రయోగ ముండవగునని తమయభిప్రాయమును వ్యక్తముచేసిరి. కవిశిరోభూషణము చెప్పిన

పై ప్రయోగములు సంకేతితసుప్రసిద్ధములు కానందుననే మహాకవులు వీనిం బ్రయోగించియుండలేదని తోఁచుచున్నది.

అథర్వణాచార్యులుగారు—"ఆద్యప్రకృతి, ప్రకృతి యని చెప్పఁబడు సంస్కృతప్రాకృతభాషలలో సాధువులుగా నంగీకరింపఁబడుచున్న పదములకు సంస్కృతమున సమాసాంతకార్యములు విధింపఁబడుచున్నవి. వానిని బ్రకృత్యనుసారముగాఁ దెనుఁగునఁ బ్రయోగింపనగును. కాని తెనుఁగునందు సంస్కృతమునందువలెఁ గాక క్వాచిత్కముగా నిత్యత యిష్టమగుచున్నది. అట్టిరూపమైనను మహాకవిపండితులకు హితమైనది మాత్రమే యిందు సంగ్రహింపఁబడవలెను" - అను 'యథాప్రకృతి సర్వత్ర' యనుశ్లోకమున వచించిరి. ద్వ్యహ్నము—అశ్వోరసము, కాలాయసము, లోహితాయసము, జలసరసము, అతిశ్వము, కుబ్రహ్మఁడు, మహాబ్రహ్మఁడు, అర్ధర్చము, శార్ఙ్గధన్వుఁడు, శతధన్వుఁడు—మున్నగు వానియందు సమాసాంతప్రత్యయములు సంస్కృతమునఁ గలుగుచున్నవి. వీనిలో నొకటిరెండుశబ్దములకుమాత్రమే మహాకవిప్రయోగప్రసిద్ధి యగపడుచున్నది. నన్నయాథర్వణులనియమానుసారముగా వానిలోఁ దెనుఁగునఁ గవిప్రయోగప్రసిద్ధి కలవి మాత్రమే ప్రయోగార్హములని యూహింపనగును. ధనుశ్శబ్దపర్యాయ మగుధన్వశబ్ద మొకటి సంస్కృతమునఁ గలదనియు దానిమీఁదను శార్ఙ్గధన్వుఁడు, శతధన్వుఁడు, అనురూపములు నిష్పన్నములు కావచ్చుననియుఁ జెప్పుకవిశిరోభూషణాశయ మెంతయుఁ గొనియాడఁదగినది. వ్యూఢోరస్కుఁడు, ప్రియసర్పిష్కుఁడు—అనురూపములకుఁ దెనుఁగునఁ బ్రసిద్ధి లేదు. మహాయశస్కుఁడు, మహాయశుఁడు, అనుచోట "విభాషాకపి" అనుపాణినీయసూత్రముచే సమాసాంతప్రత్యయము వికల్పము. అథర్వణాచార్యులుగారు పండితహృదయంగమమైనసమాసాంతప్రత్యయవిశిష్టరూపములనే గ్రహింపవలె నని చెప్పియున్నారు. కావున విశదమనస్కుఁడు మున్నగువానికిఁ దెనుఁగున గ్రహణ ముండుననియు, విశదమ

నుండు, విశదమనస్సుఁడు మున్నగువాని నుండదనియు నూహింపనగును. నన్నయగారు "సద్వీపసారణ్యసక్షితిభృత్కం బగుదానిన్" అని ప్రయోగించి యున్నారు. వితతౌజుఁడు అనునది సాధువే. ఈ పై రూపములను శాస్త్రసమ్మతముగా సాధించుకొని గ్రహింపవలయును. "అంతర్మనుఁడు" అని రాఘవపాండవీయమునఁ బ్రయోగింపఁబడినది. విశేష్యనిఘ్నతయందుఁ బుంలింగశబ్దములను "బలజితానడ్వాహుఁడు, పాలితద్వీపుఁడు, పదజనితసరిత్కుఁడు" మున్నగురీతి నుండవచ్చునని యు, స్త్రీలింగమున "నివారితానడ్వాహ, పాలితద్వీప, సముత్తీర్ణసరిత్క" మున్నగురీతిని రూపము లుండవలయుననియుఁ గవిశిరోభూషణముః వివరించినది.

**183 సూ :— ప్రాకృతభవసంస్కృతభవసంస్కృతవత్ప్రాకృతభవ వికృతిభవాః.**

183 సూ :— ప్రాకృతభవవికృతిభవాః ప్రాకృతభాషాభవాన్ధ్రభాషాభవాశ్శబ్దాః. ప్రాకృతభవ సంస్కృతభవ సంస్కృతవత్. వతిప్రత్యయస్య ప్రత్యేక మన్వర్తైస్సమ్బన్ధః. ప్రాకృతభవవత్ ప్రాకృతో దేశః, తస్మా ద్భవతి య శ్శబ్దః సః ప్రాకృతభవః. తద్వత్ ప్రాకృతభవవత్ ప్రాకృతదేశీయవ దితి యావత్. సంస్కృతభవవత్ సంస్కృతభవప్రాకృతవత్. సంస్కృతవత్ సంస్కృతసమప్రాకృతవత్ తిష్ఠన్తీత్యర్థః. ప్రాకృతభవవికృత్యాం ప్రాకృతభాషాసమ్బన్ధిన స్త్రివిధా శ్శబ్దాః ప్రవిశన్తీతి ఫలితమ్.

వి :— ప్రాకృతభవసంస్కృతభవసంస్కృతవత్, ప్రాకృతభవవికృతిభవాః—అని ఛేదము. ప్రాకృతభాషయందుఁ బుట్టి, యాంధ్రభాషలోఁ బ్రయుక్తములైన ప్రాకృతశబ్దములు ప్రాకృతదేశ్యములవలెను, సంస్కృతభవప్రాకృతములవలెను, సంస్కృతసమప్రాకృతములవలెను మూఁడు విధములుగా నుండునని యర్థము. ప్రాకృతభవవికృతియందుఁ బ్రాకృతభాషలోనుండి వచ్చినవివిధశబ్దములు నుండునని ఫలితార్థము.

**184. సూ :- వ్యతిరిక్తా భూయాంసః.**

184. సూ :- వ్యతిరిక్తాః వర్ణాగమవర్ణలోపైరీషద్వికృతత్వేన భిన్నాస్సంస్కృతభవప్రాకృతభవాః భూయాంసః అపరిమితా వర్తన్తే. "సంప్రదాయతో వేద్యాః" ఇత్యుత్తరసూత్రేణ తు నాన్వయః. సంస్కృతభవప్రాకృతభవానాం సంస్కృతభవాదివ త్సమ్ప్రదాయైకశరణత్వాభావాత్.

వి :- వ్యతిరిక్తాః, భూయాంసః- అని ఛేదము. సంస్కృతభాష నుండి ప్రాకృతభాషలోనికి వచ్చినతత్సమరూపములు మిక్కిలిగాఁ గలవు. వానిని ప్రాకృతవ్యాకరణములఁబట్టి తెలియవలయు నని తాత్పర్యము.

**185. సూ :- వ్యతిరిక్తా స్సమ్ప్రదాయతో వేద్యాః.**

185 సూ. :- వ్యతిరిక్తాః ఏతద్భిన్నా స్సంస్కృతభవా దేశ్యాశ్చ లిఙ్గవచనభేదాదివిశేషాశ్చ సర్వే సమ్ప్రదాయతో వేద్యాః. సమ్ప్రదాయోఽత్ర తత్తద్వ్యాకరణవిచక్షణశిష్టపరమ్పరాప్రయోగః. సంస్కృతసమాస్తు శాస్త్రైణైవ వేత్తుం శక్యా ఇతి న వ్యతిరిక్తపదేన తేషాం సఙ్గ్రహః. తథాచ 'అహో' ఇత్యాదీనాం సంస్కృతసమప్రాకృతసమత్వమ్. అంబరాదీనాం ప్రాకృతదేశ్యసమత్వమ్. తత్ర తామ్రస్య తంబరః, అమ్రస్య-అంబరః ఇతి వ్యవహారాత్. జమాదిశబ్దానాం సంస్కృతసమప్రాకృత సమత్వమ్. మూఁగ ఇత్యాదీనాం సంస్కృతభవప్రాకృతభవత్వమ్. చందురుఁడు, చందమామ, వంతసము, సతంతరము, సంద్రము - ఇత్యాదీనాం సంస్కృతభవత్వమ్. నవలేత్యాదీనా మాన్ధ్రదేశ్యత్వమ్. వనము ఇత్యాదీనాం సంస్కృతసమత్వఞ్చ స్పష్టమేవ. ఏవం చేయం వికృతి స్సాకల్యేన ద్వావింశతిభేదా. తథాహి. ప్రాకృతభవవికృతి రష్టాదశధా, దేశ్యాదిభి స్త్రిభి రనువర్తనాత్. సంస్కృతభవా ద్వివిధా, తత్సమభవభేదాత్. దేశ్యా గ్రామ్యేతి ద్వౌ భేదావితి. యద్యపి 'అహేయ మన్యదేశీయం యత్తదేవ ప్రయుజ్యతే' ఇత్యథర్వణోక్తేః, దేశాన్తరభాషాపదప్రయోగోఽప్యత్ర న విరుద్ధః. తథాప్యాద్యద్వయాపేక్షయైవాఽస్య వికృతిత్వం నిరుక్తమితి ప్రాధాన్యేన భేదపరిగణనైవం కృతేతి ధ్యేయమ్.

వి :- వ్యతిరిక్తాః, సంప్రదాయతః, వేద్యాః-అని ఛేదము. మీఁదఁ జెప్పినవి గాక మిగిలినవానిలో సంస్కృతభవములును, దేశ్యములును,

సంప్రదాయము ననుసరించి తెలియఁదగినవని యర్థము. ఇచట సంప్రదాయ మనుదానికి భాషావిషయము బాగుగా నెఱింగిన మహాకవుల యొక్క పరంపరాప్రయోగ మే యర్థమని తెలియవలయును. సంస్కృత సమములను, సంస్కృతవ్యాకరణశాస్త్రము ననుసరించి తెలియ వచ్చును. కాని వానియందును సంకేతితసుప్రసిద్ధములకే తెనుఁగునందుఁ బ్రయోగార్హత. కావున వానికి సంప్రదాయవేద్యత లేదు. ఈవికృతి భాష యిరువదిరెండువిధములు :- ప్రాకృతభాష యాఱువిధములు; అవి తత్సమతద్భవదేశ్యభేదములచేఁ బదునెనిమిదివిధములు. $6\times3=18$. తత్సమతద్భవభేదములచే సంస్కృతమును రెండు విధములు. దేశ్యము, గ్రామ్యము రెండు విధములు. మొత్తి మిరువదిరెండుభేదములు. $18+4=22$.

'నింద్యముకాని'యనఁగా వ్యాకరణాదివిరుద్ధముకాని యన్యదేశ్య పదము రోజు మున్నగునది యాంధ్రదేశమున వాడుక కెక్కియున్నచో నాపదము కవిప్రయుక్త మగుచునే యున్నది. మలకలు మున్నగునన్య దేశ్యశబ్దమునకు దేశ్యమునఁ బర్యాయశబ్దము లేకుండుటచే నవశ్యముగాఁ బ్రయోగింపఁబడుచునే యున్నది'' అని 'అహేయ మన్యదేశీయ'మ్మను దానికర్థము.

**186. సూ :- దేశ్యా దస్మద్యుష్మచ్ఛబ్దా త్సుజసో ర్నుమూ వురూచ స్తః.**

186. సూ :- దేశ్యాభ్యా మస్మద్యుష్మచ్ఛబ్దాభ్యాం పరయోః స్సుజసోః యథాక్రమం 'నుము, వురు' ఇత్యేతే స్యుః. 'నా' ఇత్యస్మచ్ఛబ్దో దేశ్యః. 'నీ' ఇతి యుష్మచ్ఛబ్దో దేశ్యః; వక్ష్యమాణసూత్రేణ ఏత్వమ్. నేను, మేము, నీవు, మీరు, మత్వా మేత్వంచ వక్ష్యతే. "ఉడిగించెదఁ దొలఁగి చూచుచుండుఁడు మీరల్" ఇత్యాచార్యవచనాత్ 'మీరల్' ఇతిప్రయోగోఽపి సాధుః.

వి :- దేశ్యాత్, అస్మద్యుష్మచ్ఛబ్దాత్, సుజసోః, నుమూ, వురూ, చ, స్తః-అని ఛేదము. 'నా' అనునది దేశ్యాస్మచ్ఛబ్దార్థకము. 'నీ' అనునది దేశ్య మగుయుష్మచ్ఛబ్దార్థకము. నా+సు; నీ+సు అని

యుండఁగా 'ను–వు' అనునవి వరుసగా సుప్రత్యయమున కాదేశములగును. 'నాను–నీవు' అనురూపము లేర్పడును, 'నా+జస్, నీ+జస్' అని యుండఁగా 'ము, రు' అనునవి జస్సున కాదేశములగును. 'నాము, నీరు' అను రూపము లేర్పడును. "ప్రథమాయా మేదస్మద ఏతయోర్బహుత్వే మః" అనుసూత్రముచొప్పున నస్మచ్ఛబ్దమున కేత్వమును, నస్మద్యుష్మద్బహువచనములకు మత్వమును వచ్చి నేను, మేము, నీవు, మీరు అనురూపములు ప్రథమైకబహువచనములలో సిద్ధించుచున్నవి. యుష్మదర్థకబహువచనమునందు "మీరల్" అని నన్నపార్యుని ప్రయోగసమ్మతి యుండుటచే నదియు సాధువేయని యెన్నవలెను.

**187 సూ:- న్నుమ్మూ హ్రస్వశ్చాదే రమి శసి చ.**

187. సూ :- అమ్శసో ర్న్నుమ్మూ ఇత్యేతౌ స్తః. ఆదేర్వర్ణస్య హ్రస్వశ్చ స్యాత్. నన్నున్, మమ్మున్, నిన్నున్, మిమ్మున్.

వి :- న్నుమ్మూ, హ్రస్వః, చ, ఆదేః, అమి, శసి, చ– అని ఛేదము. అమ్శస్సులకు (ద్వితీయైకవచనబహువచనప్రత్యయములకు) న్ను–మ్ము అనునవి క్రమముగా నాదేశము లగుచున్నవి–అని కవిశిరోభూషణము చెప్పినయర్థము. ఈ యర్థము సిద్ధించుటకై సూత్రమందున్న 'అమి–శసి' అను సప్తమ్యంతములను 'అమ్శసోః" అని షష్ఠ్యంతములుగా మార్చి కవిశిరోభూషణ మన్వయించినది. ఇట్టి మార్పువలన న్నుమ్ముల నాదేశములుగా నన్వయించుట కవకాశమును సంపాదించెను. సప్తమ్యంతములుగా నన్వయించినచో న్నుమ్ము లాగమములని యర్థము వచ్చును. నాఅనుశబ్దమునకు నా+అమ్ అనియుండఁగా అమ్మునకు 'న్ను' అనునదాదేశమై,పూర్వదీర్ఘమునకు హ్రస్వమువచ్చి "అన్యే ద్రుతప్రకృతయః" అనుచొప్పున ద్రుతము వచ్చి, 'నన్నున్, నిన్నున్–అనురూపములేర్పడుచున్నవి. 'అమి–శసి'అనువానినిసప్తమ్యంతములుగ నన్వయించినచో నా+అమ్,నీ+అమ్ అనునపుడు అమ్పరకత్వమున న్ను

అనునది యాగమమై పూర్వదీర్ఘమునకు హ్రస్వము వచ్చి, నన్ను+అమ్, నిన్ను+అమ్ అని యగును. ఇపుడు "కూర్చిలనునయో భవే ద్వితీయాతు" అను సూత్రము చెప్పిన 'ను' అనునది అమ్‌న కాదేశమై ద్రుతముచేరి నన్నునున్, నిన్నునున్' అనురీతిని రూపము లేర్పడును. నన్నయగారు "నన్నునుఁ గౌఁగిలించికొని" అనుప్రయోగమునందు "నన్నునున్" అనుద్వితీయైకవచనరూపమునే ప్రయోగించి యున్నారు. దానినే చింతామణి సాధించినది గాని నన్నుః అనుదానిని జింతామణి సాధింపలేదు. మఱియు నన్-నిన్-తన్ అనురూపములకు నచ్చుపరమైనప్పుడు, "నోవా ద్విత్వం క్వచి ఛ్లిష్టః పరప్రాణేన సంగతేః" "ద్రుతమునకుఁబరప్రాణముతో సాంగత్యము కలిగినపుడు వికల్పముగా ద్విత్వము వచ్చును సంశ్లేషమునుగల్గును"- అనునథర్వణవచనము చెప్పిన 'అన్+ఉర్వీశుఁడు=అన్నుర్వీశుఁడు' మున్నగువానివలె నన్+అడిగె=నన్నడిగె- అనునవి సిద్ధించుచున్నవి. కావున న్ను మ్ములనాగమములుగనే వ్యాఖ్యానింపవలయును గాని, యాదేశములుగా వ్యాఖ్యానింపరాదు - అని చింతామణివిషయపరిశోధనగ్రంథమందు వివరింపఁబడినది. 'న్ను మ్ము' అనునవి పరమగునపుడు పూర్వదీర్ఘమునకు హ్రస్వమును గలుగుచున్నదని "హ్రస్వశ్చాదేరమిశసిచ" అనుదానికర్థము. 'అమ్‌శస్‌లు' పరమగునపుడు 'నా, నీ' శబ్దములకు 'న్ను-మ్ము' లాగమము లగును. పూర్వదీర్ఘములకు హ్రస్వము వచ్చునని చెప్పుటచే 'నన్నునున్+నిన్నునున్' అని యేకవచనరూపములు సిద్ధించుచున్నవి. మమ్మున్, మిమ్మున్ అను బహువచనమునను 'మ్ము' అనున దాగమమే యగును. మమ్ము+శస్-మిమ్ము+శస్ అనియుండఁగాఁ గవిప్రయోగానుసారముఁగాఁ బ్రక్రియ పరిసమాప్తమైనది గాన "న పదాని" అనుసూత్రముచేత శస్సునకు లోపము వచ్చి "అన్యే ద్రుతప్రకృతయః" అనుచెప్పిన ద్రుతము చేరి 'మమ్మున్, మిమ్మున్' అనురూపములు సిద్ధించునని చింతామణి విషయపరిశోధనము నుడువుచున్నది.

**188. సూ :— అన్యతరలుక్చ యుక్తస్య.**

188. సూ :- సంయుక్తయోః 'న్ను మ్ము' ఇత్యేతయో రన్యతరస్య ప్రాణినో లుక్ చ స్యాత్. చాద్వికల్పః. నను, నిను, మము, మిము ఇతి. ననున్ ఇత్యాది.

వి :- అన్యతరలుక్, చ, యుక్తస్య—అని ఛేదము. సంయుక్తములైన 'న్ను–మ్ము' అనువానిలో నొకహల్లునకు లోపము వికల్పముగా నగునని యర్థము. అప్పు డవి 'ననున్–నన్నున్–నినున్–నిన్నున్–మమున్–మమ్మున్–మిమున్–మిమ్మున్' అనురూపములతో నేర్పడును. ముందు చెప్పఁబోవుప్రక్రియ ననుసరించి, ఆత్మన్శబ్దార్థకమునకును 'తనున్–తన్నున్' అనురూపములు సిద్ధించును. 'నను, నిను, తను' అనువాని నువర్ణోపరిస్వరమునకు "కవిభల్లైః" అను సూత్రముచే లోపము కలుగఁగా మిగిలిన వ్యంజననకారములు ద్రుతములై ద్రుతకార్యము నొందుచున్నవి. కన్ను మున్నగువాని ద్విత్వమును 'అద్విత్వాచ్చ భవేద్విత్వం దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్' అను నథర్వణవచనముచే నొక నకారము లోపించి 'కన్ను' అనురూప ముండును. నుకారస్వరము లోపింపఁగా ద్రుతకార్యము వచ్చి 'కందోయి' మున్నగునవి సిద్ధించునని తెలియవలయును.

**189. సూ :— కి ర్న జమః.**

189. సూ :- జమః కి ర్న స్యాత్. యుష్మచ్ఛబ్దాజ్జమః కిః ప్రాప్తః. సోఽప్యనేన నిషిధ్యతే.

వి :- కిః, న, జమః— అని ఛేదము. యుష్మచ్ఛబ్దార్థకమగు 'నీ' అనుదానికి షష్ఠ్యేకవచనమున "ఇతాం జసః కి స్స్యాత్" అని 'కి' ప్రత్యయము ప్రాప్తించుచున్నది. జస్‌నకు వచ్చు 'కి' ప్రత్యయము యుష్మదర్థకమునకు రాదని యీసూత్రము చెప్పుచున్నది. కావున 'నీ, నా' శబ్దముల షష్ఠ్యేకవచనమునకు 'కు' అనుప్రత్యయమే కలుగునని ఫలితార్థము. ఉ. 'నీకున్, నాకున్, నీయొక్క, నాయొక్క, మీలో, మాలో—మొ.

**190. సూ :- ప్రథమాయా మే దస్మదః.**

190. సూ :- అస్మద ఏత్వం స్యా త్ప్రథమాయామ్.

వి :- ప్రథమాయాం, ఏత్, అస్మదః—అని ఛేదము. అస్మచ్ఛబ్దమునకుఁ బ్రథమావిభక్త్యేకవచన బహువచనములం దేత్వము వచ్చునని యర్థము. 'నా' అను నస్మచ్ఛబ్దార్థకమునకుఁ బ్రథమైకవచన బహువచనములలో 'నా+సు, నా+జస్' అని యుండఁగా, ఆసుజస్‌లకు 'ను, ము' అనునవి వరుసగా నాదేశములై 'నాను, నాము' అనురీతి నుండును. యుష్మచ్ఛబ్దార్థకమగు నీ యనునది 'నీవు, నీరు' అనురూపముల నందును. 'నాను' అనునది కొన్నిప్రాంతములలో గ్రామీణజనులచే నేఁడును వాడఁబడుచున్నది. "ప్రథమాయా మే దస్మదః" అను సూత్రముచొప్పున 'నా' అనుదానిమీఁదనున్న 'ఆ' కారమున కేత్వము చేయఁగా 'నేను, నేము' అను గ్రాంథికరూపము లేర్పడుచున్నవి.

**191. సూ :- ఏతయో ర్బహుత్వే మః.**

191. సూ :- ఏతయో ర్యుష్మదస్మచ్ఛబ్దయో ర్బహుత్వే మాదేశ స్స్యాత్. హాల్మాత్రస్యై వాయ మాదేశః. "నీవు, మీరు, నిన్నునున్, మిమ్మున్, నీచేతన్, మీచేతన్" ఇత్యాది. 'నేను, మేము, నన్నునన్, మమ్మున్, నాచేతన్, మాచేతన్' ఇత్యాది. 'మమ్ముఁగంటెన్' ఇత్యాదిరూప మప్రామాణికమ్.

వి :- ఏతయోః, బహుత్వే, మః — అని ఛేదము. అస్మద్యుష్మచ్ఛబ్దములకు బహుత్వమునందు మత్వము వచ్చును. మేము, మీరు, మొ. మిగిలిన యుదాహరణములు మూలమునఁ జూడ నగును. 'మముఁగంటెన్, మమ్ముఁగంటెన్' మున్నగురూపములు ప్రామాణికములు గావు. ద్వితీయావిభక్తియందు నన్నునున్, ననున్, మిమ్మున్, మమ్మున్, మిమున్, మమున్' అనియగును. 'అన్యతరలుక్చ యుక్తస్య అని 'న్న, మ్మ' అనువాని ద్విత్వములో మకారనకారములకు లోపమొకదాని కగు. 'మమ్మున్, మమున్' అనునవి ద్వితీయాబహువచన

రూపము లగుచున్నవి. వీనిమీఁద మఱలఁ 'గంటె' అనువర్ణకము వచ్చుట శాస్త్రసమ్మతము కాదు గాన "మమ్ముకంటెన్" అనురూప ముండదు. 'న్ను మ్ము' లాదేశము లనుట నన్నపార్యునకు సమ్మతము గాదు. ఆగమము లనుటయే నన్నయాథర్వణులకు సమ్మతమని తెలియ వలయును. కావునఁ గవిశిరోభూషణ మాదేశములని వ్రాయుట సరి కాదు.

**192** సూ – హ్రస్వే టాదౌ న-మవాన్ ద్వయవ ద్వచనద్వయేఽన్యయో రాత్మా.

192. సూ :- హ్రస్వే టాదివిభక్తౌ 'న-మ' ఇత్యాగమౌ స్తో వచనద్వయే. తా ఇత్యాత్మన్ శబ్దో దేశః. ద్వయవదితి-అన్యయోః ప్రథమాద్వితీయయో రేకవచనయో రస్మద్యుష్మద్వ త్స్యాత్. ఆత్మా, క్రమా దేకవచనే అస్మద్వత్ బహువచనే యుష్మ ద్వ త్స్యా దిత్యర్థః. 'తాను, తారు' అతిదేశా దేవ హ్రస్వః 'తన్ను, తను, తమ్ము, తము' తృతీయాదౌ హ్రస్వనమాగమయోశ్చ, 'తనచేతన్, తమచేతన్' ఇత్యాది. ద్వయవదితి సామాన్యోక్తేః క్వచిత్ 'తాము' ఇతిరూపం జ్ఞేయమ్. ద్వితీయాచార్యేణతు రూపద్వయ ముక్తమ్. "నుర్మురూ నుజసో ర్యుక్తాఽయుక్తావపి మతౌ నుమూ" ఇతి.

వి :- హ్రస్వే, టాదౌ, న-మవాన్, ద్వయవత్, వచనద్వయే, అన్యయోః, ఆత్మా-అని ఛేదము. అస్మచ్ఛబ్దార్థమునకువలె నేకవచనమును, యుష్మచ్ఛబ్దార్థమునకువలె బహువచనమును దేశ్యాత్మన్ శబ్దార్థక మగు 'తా' అనుదానికి నుండుననియు, ద్వితీయావిభక్త్యేక వచనబహువచనములలో తన్నునున్, తనున్, తమ్మున్, తమున్, అనియుఁ, దృతీయావిభక్తినుండియు నేకవచనబహువచనములలోఁ బ్రకృతిప్రత్యయములకు నడుమ 'న, మ' అనునవి వరుసగా వచ్చి ప్రకృతికి హ్రస్వము కలుగుననియు నర్థము. 'తారు' అనునదియే కాక తాము అనురూపముగూడ 'నాత్మన్' శబ్దార్థకమునకుఁ బ్రథమాబహు వచనమునం దుండునని యథర్వణాచార్యులుగారు నుడువుచున్నారు.

అథర్వణకారికలో నుమూ అని యుండుట సరిగాదు. అది లేఖకపాఠక ప్రమాదకల్పిత మగునపపాఠ మని తెలియవలయును. నమూ అని యుండవలెను. అపుడు కారిక "నుర్మురూ సుజసో ర్యుక్తాయుక్తావపి మతౌ నమూ" అనియుండును. ఆత్మన్ శబ్దార్థకమగు 'తా' అనుదానికిఁ బ్రథమైకవచనమున 'ను' అనునది వచ్చి తాను అనియు, బహువచనమున తాము, తారు అనియు నగును. మఱియు 'నా–నీ'యనుయుష్మదస్మదర్థకములలోని నకారము ప్రథమావిభక్తిరూపములలో నొకనారి లోపించును" అని యథర్వణకారిక కర్థము. నేను, ఏను, మేము, ఏము, నీవు, ఈవు, మీరు, ఈరు–అనురూపము లేర్పడును.

ఈరీతిరూపములు ప్రథమావిభక్తియందుమాత్రమే యుండును. 'తమరు' అనుపదమును గొందఱు ఉపయోగించుచున్నారు. దాని కాధార మగపడదు.

అస్మచ్ఛబ్దము :– ప్రథమ–ఏను, నేను; నేము, మేము, ఏము; ద్వితీయ–నన్నునున్, నన్నున్, ననున్, నన్; మమ్మున్, మమున్; తృతీయ – నాచేతన్, మాచేతన్. యుష్మచ్ఛబ్దము – ప్రథమ – నీవు, ఈవు; మీరు, ఈరు, ఈరలు; ద్వితీయ – నిన్నునున్, నిన్నున్, నినున్, నిన్; మిమ్మున్, మిమున్; తృతీయ – నీచేతన్, మీచేతన్, మొ. ఆత్మన్ శబ్దము ప్రథమ – తాను, తాము; తారు, తమరు, (దీనికి యుష్మదర్థకబహువచనముగాఁ బ్రసిద్ధి గలదు) ద్వితీయ – తన్నున్, తనున్, తన్ – తమ్మున్; ('తమ్మలన్' అనునదియుఁ గలదని కొందఱు అనుచున్నారు. అది సరిగాదు.) తృతీయ – తనచేతన్, తమచేతన్; మొ. మిగిలినవిభక్తులలోఁగూడ నిట్లే యూహించునది.

193. సూ :– భూయ ఉభయార్థవాచీ యః కశ్చి ద్భవతి నిత్యబహువచనః. తస్య జసో ము శ్శసో లః.

193 సూ :– భూయ శ్శబ్దద్వయవ్యతిరిక్తః యుష్మదస్మదర్థవాచీ నిత్యబహు

వచన శ్శబ్దో యః కశ్చి ద్భవతి దేశ్యః, స శబ్దో 'మన' ఇతి జ్ఞేయమ్. తస్మా జ్జసో ము, శ్శసో ల స్స్యాత్. 'మనము, మనలన్' ఇత్యాది

వి :– భూయః, ఉభయార్థవాచీ, యః, కః, చిత్, భవతి, నిత్యబహువచనః, తస్య, జసః, ముః, శసః, లః–అని ఛేదము. ఉభయార్థవాచకమైన 'మన' అనుశబ్దము దేశ్యము. దీనిప్రథమాబహువచనప్రత్యయమగు 'జస్'నకు మువర్ణకమును, ద్వితీయాబహువచనప్రత్యయమగు 'శస్'నకు లవర్ణకము నాదేశము లగునని యర్థము. 'మనము, మనలన్' అనునవి యుదాహరణములు. ప్రత్యేకముగా మనశబ్దమునకు లవర్ణకమును విధించుకొనుటచే నీవఱకుఁ జెప్పిన లవర్ణకము అస్మద్యుష్మదాత్మార్థకశబ్దములకును 'మన' అనుదానికిని రాదని తెలియుచున్నది. కావున మిమ్ముల్ మమ్ముల్ మొదలగు రూపములును, మీరలు, వారలు మొదలగురూపములును నుండరాదని తెలియుచున్నది. వీనిని సూరిగారు నిషేధించినారు.

**194. సూ :– ప్రాగ్వత్సర్వం భిసాదికేఽన్యత్ర.**

194 సూ :– అన్యత్ర భిసాదికే ప్రాగ్వద్రూపం జ్ఞేయమ్. 'మనచేతన్, మనకొఱకున్' ఇత్యాది. ఉభయార్థవాచినోఽస్య లవర్ణకో యుష్మదస్మదో ర్ముర్వర్ణకాదపి క్వచిత్. 'మిమ్ములన్, మమ్ములన్', "మిమ్ములఁ జూడఁగా మిగుల మించును గూరిమి మాకు నెమ్మదిన్" ఇత్యాదివచనాని కవీనామ్. "మనభాగ్యము గాద రాము మఱిలోఁగనుటల్" ఇత్యాది. సమాసే – మనవల్వారు, మీయిద్దఱు – ఇత్యాదిసమాసోఽపి సాధుః. "మానల్వురు" ఇత్యాద్యాచార్యప్రయోగాత్. 'మనము నల్వురు' ఇత్యాది రూపం తు నిర్బాధమేవ.

వి :– ప్రాగ్వత్, సర్వం, భిసాదికే, అన్యత్ర – అని ఛేదము. మనశబ్దమునకుఁ దృతీయమున్నగు విభక్తిరూపము లన్నియు నస్మద్యుష్మచ్ఛబ్దములకువలెనే కలుగును. మనశబ్దము నిత్యబహువచన మగుట వలన మనము, మనలన్, అని ప్రథమాద్వితీయలయందును, మనచేతన్, మనకొఱకున్ అని తృతీయాది విభక్తులయందును రూపము

లగును. తక్కిన విభక్తులయందును నిట్లే దీనికి రూపము లూహింప నగును. ఉభయార్థవాచకమునకు విధింపఁబడిన లవర్ణకము క్వాచిత్కముగా యుష్మదస్మచ్ఛబ్దముల మువర్ణకముకంటె రావచ్చును. 'మిమ్ములన్, మమ్ములన్' మొదలగునవియు, సమాసమున మనభాగ్యము మొదలగునవి సిద్ధించుచున్నవనియు, మనవల్వురు, మీయిద్దఱు- అనునవిగూడ 'మానల్వురు' అనునాచార్యులవారి ప్రయోగసమ్మతి వలన సాధువులే యనియుఁ గవిశిరోభూషణాభిప్రాయము. మనము నల్వురము అనురూపమును నిర్బాధమే. 'మిమ్ములన్, మమ్ములన్' మొదలగునవి సాధువులు గావని యిదివఱకుఁ జెప్పఁబడినది". మన భాగ్యము, 'మనవల్వుఱు మీయిద్దరు' అనుసమాసరూపములు సాధువులే యని యథర్వణాచార్యులుగారు 'శబ్దేభ్యో యుష్మదాదిభ్యస్సమాసోఽపి గురుర్భవేత్' అను వచనముచేఁ జెప్పిరి. 'మానల్వురు' అను నాచార్యులవారిప్రయోగమునుబట్టియే పై యథర్వణవచనముత్పన్నమైనది. అట్టిచో విషయమును వక్రముగాఁ జిత్రించుట కవిశిరోభూషణమున కలవాటు గావునఁ బైరీతిని నుడివినది. ఆవచనము (శబ్దేభ్యో అనునది) నిచటఁ జూపకుండుట కవిశిరోభూషణమునకు న్యాయము కాదని చెప్పవలెను.

**195.** సూ :- కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే
హ్యేషు. ప్రథమైకవచనమాత్రే వికృతా నాన్తాదయోఽపి
కథ్యన్తే.

195. సూ :- కవిభల్లటాఖ్యైః ప్రాచీనాచార్యైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హి. హీతి ప్రసిద్ధౌ. ఏషు లోపప్రదేశేషు వైకృతాశ్శబ్దా నాన్తాదయోఽప్యద్విత్వా ఏవ ప్రథమైకవచన ఏవ కథ్యన్తే. అన్యేఽపి శబ్దాః ప్రథమైకవచన ఏవ లోపవన్తో భవన్తి. ఆదిశబ్దాత్తు నాన్తాదయః. "చూడర్జునులు, వత్తుర్ఘనులు" ఇత్యాదికం క్రియోదాహరణమ్. "హృద్ధరోప్పన్నతులం చూచి యెట్లు సహింతుర్" ఇత్యాచార్యప్రయోగః. కన్దెఱచి, చన్గుడిపి, విల్పూని, కల్ద్రావి - ఇత్యాది. పేర్వాడి,

గోర్గోమ్మ్రిపి, ఇత్యాదికమద్విత్వే ఉదాహరణమ్. పక్షే కన్ను దెఱచి, పేరు వాడి, ఇత్యాది. ప్రథమైకవచనా దన్యత్ర బహువచనాదివిభక్తౌ సర్వత్ర కన్నులు, కన్నుల చేతన్, గోరులు, ఇత్యాద్యేవ రూపమ్. సమాసేతు పక్షే కన్దోయి, చన్దోయి- ఇత్యాదిరూప మస్త్యేవ. "క్వచి ద్భవే త్సమాసేఽపి ప్రాణిమాత్రస్య సంశ్రుతిః" ఇత్యథర్వణ వచనాత్.

వి:- కవిభల్లటైః, క్రియాణాం, నామ్నాం, చ, ఉల్లోపః, ఇష్యతే, హి, ఏషు, ప్రథమైకవచనమాత్రే, వికృతౌ, నాన్త్రాదయః, అపి, కథ్య న్తే- అని ఛేదము. కవిభల్లటశబ్దము నన్నయగారినాఁటిరెయిక వైయాకరణుని నామము. తిఙ్సుబంతపదములతుదినున్న ఉకారమున కంతట నుల్లోపము కవిభల్లటులచే నంగీకరింపఁబడుచున్నది. ఇతరులమతములో నుండదు. కావున నది వికల్పమని తేలుచున్నది. లోపము వచ్చినచోట నాచ్ఛిక శబ్దమందుఁ బ్రథమైకవచనసామాన్యమున నకారాన్త్రప్రభృతులే యుం డునని వారిమతముననే చెప్పఁబడుచున్నదని యర్థము. ప్రథమైకవచన రూపమున నున్నకారాంతపదములతుదియుకారములకే పాక్షిక లోపము ప్రాయిక మనియుఁ, దక్కినచోట్ల బహుత్వమునం దుల్లోపము కలుగుననియుఁ దాత్పర్యము. క్రియాపదములతుదిని నిల్చినపురుషబోధక ప్రత్యయములు సాక్షాత్తుగాఁ బ్రథమావిభక్తులు కాకున్నను బ్రథమా సదృశము లగుచున్నవి. కావున వానినిగూడ గ్రహింపవలయునని యెంచి యహోబలపతిపండితుఁ డీయుల్లోపమును బ్రాతిపదికములకు మాత్రమే వచ్చునని చెప్పెను. అది సరి కాదు. రాముల్ మున్నగుచో ట్లను, నుకారలోపము వచ్చుచున్నది గదా. 'వత్తుర్ఘనులు' మొదలై నవి సమాపకక్రియారూపము లగుటచే నవి పదములే యగును గాని కేవలధాతురూపములు కావు గదా! ఈకారికయందు "క్రియాణాం- నామ్నాం" అనుపదములచే సమాపకక్రియారూపములయందును, సుబం తరూపములయందును నీయుల్లోపము కలుగునని చెప్పవలయును. "వత్తు ర్ఘనులు", వత్తుర్వారు, గోర్గోమ్నిపి, చన్గుడిచి, కన్దోయి, మొదలగునవి,

ఇందు 'కన్దోయి'మున్నగువానియందు దుత్వవిశిష్టనకారమునకు లోపము వచ్చుననియు గ్రహింపవలెను. "కాదాచిత్కముగా సమాసమందును నకారవ్యంజనరూపద్రుతముయొక్క వినికి కల్గు"నని 'క్వాచి ద్భవేత్' అను నథర్వణకారిక కర్థము. ఇచట "ప్రాణిమాత్రస్య సంశ్రుతిః", "ప్రాణిమాత్రస్య సంస్థితిః" అనుపాఠద్వయమును సమ్మతమే. ఇందు మాత్రశబ్దముచే నందువచ్చిన కొన్నిశబ్దములద్రుతమునకు సమాసమున సంశ్లేషము వచ్చునే కాని సరళాదేశాదిద్రుతసంధు లెల్లియుఁ గలుగ వని ప్రయోగానుసారముగాఁ జెప్పవలయును. ఇచట సంశ్లేష మనఁగా ద్రుతము పూర్వాచ్చు నత్తియుండుటే యని యర్థము. 'క్వాచి ద్భవేత్ సమాసేఽపి' అనునథర్వణకారిక 'లుగ్వా ద్రుతప్రకృతికాత్' అను దానికి వివరణము కానోపు నని వ్యా॥ సం॥ స॥ ఊహించుచున్నది.

**196. సూ :- ఇదమదఏతద్యత్తచ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుళమ్.**
**హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి.**

196. సూ :- ఇదమాదిశబ్దాదేశ్యాదీర్ఘా శ్శబ్దాన్తరాన్వయే సతి, హ్రస్వం ప్రపద్య శబ్దాన్తరాద్యవర్ణస్య బహుళం ద్విత్వం జనయన్తి. ఈదేశము, ఇద్దేశము. అద సేత చ్ఛబ్దయో రేతదేవ రూపమ్. ఏదేశము, ఎద్దేశము, ఆదేశము, అద్దేశము-ఇత్యాది. అజాదిశబ్దాన్వయే తు లఘుయకారస్యైవ ద్విత్వమ్. అయ్యార్యుఁడు, అయ్యతివ, ఎయ్యేకాలము - ఇత్యాది. అయ్యెకాలము - ఇత్యాద్యాచార్య వచనమ్. బహుళగ్రహణా దేకాక్షరేఽపి ద్విత్వమ్. ఎద్ది, అద్ది, ఇద్ది, ఏది, - ఇత్యాది. బహుళ మపి నైవ రేఫ ఋకారయో శ్శషసహానాంచ న ద్విత్వమ్. 'ఆరాజు, ఆ ఋషభుఁడు, ఆ శరము, ఆ షణ్ముఖుఁడు, ఆసేన, ఆ హయము' - ఇత్యాది. ఏతేన "ఆయాలాపం బయివేళఁ బక్కాడు"-ఇత్యాది కవిప్రయోగ స్యాతివదుష్టతే త్యవధేయమ్. "అవేళ" ఇతిపాఠ ఏవ సాధుః.

"ఊష్మరేఫాన్ వినా ద్విత్వ మయుక్తస్య హలో మతమ్।
ఋకారం చ విముచ్య స్యాత్ప్రాణానాం ద్విత్వసఙ్గతిః॥"

ఇత్యథర్వణాచార్యేణోక్తమ్. అత్ర సంయుక్త వర్ణస్య తు న ద్విత్వమ్. ఉచ్చారణస్య తద్గౌరవాపత్తేః; ఆ వ్యాధుఁడు - ఇత్యాది.

వి:— ఇదముదవేతద్యత్తచ్ఛబ్దాః, శబ్దాన్తరాన్వయే, బహుళమ్, హ్రస్వమ్, ప్రపద్య, దీర్ఘాత్, ద్విత్వమ్, ఉపర్యక్షరస్య, జనయన్తి-అని ఛేదము. హలంతములగు ఇదమాదిశబ్దములకర్మధారయరూపమిశ్రసమాసమున కభ్యనుజ్ఞ నొసంగుచుఁ దదాశ్రితవిధుల నుపదేశించుచున్నాఁడు. తత్సమతద్భవదేశ్యములలో దేనితోనైనను సమానాధికరణసమాసము నందునపు డిదమాదిసంస్కృతశబ్దములకుఁ బర్యాయము లగు 'ఆ-ఈ-ఏ' అనునాచ్ఛికశబ్దములు దీర్ఘరూపము లగు ప్రాతిపదికరూపములతో (అనఁగా 'ఆ-ఈ-ఏ' అనురూపములతో) సమాసపూర్వావయవములై నిలిచి బహుళముగా హ్రస్వరూపము నంది, యుత్తరపదాది నుండుహల్లునకు ద్విత్వమును గల్గించుచున్నవి. బహుళశబ్దార్థము నీరీతి నథర్వణాచార్యులుగారు "రేఫశకటరేఫములను శషసహ-అనువానిందప్ప హలంతరసంయుక్తము కానియితరహల్లునకు ద్విత్వము కవిసమ్మత మగుచున్నది; ఋకారమునుసైతము విడువఁగా, నచ్చులకు సంధి రానపుడు వచ్చినిలిచిన లఘుయకారమునకును ద్విత్వము కలుగుచున్నది" అని వివరించినారు. 'ఆయాలాపం బయి వేళఁ బల్కెడు' నను చోట 'ఆయాలాపంబ, యవేళఁ బల్కెడున్' అని కవిశిరోభూషణము చెప్పుచున్నది. అవేళ అనుదానికి 'ఆవేళన్' అని యర్థమైన నాయర్థము నందు 'అవ్వేళన్' అని యుండనగును గాని 'అవేళన్' అని యుండ రాదు. లేక 'వేళన్' అనుదానికి సందర్భానుసారముగా—మేళనకాలమందలి స్వరము నే ప్రస్తుతసమయమునను బల్కుచున్నదని యర్థము చెప్పనగును. 'వేళన్'=ప్రస్తుతసమయమునందును-అని యర్థము. అవేళన్ = వేళ కాని వేళయందని యర్థము. ఇట్లు సరిపెట్టుట యుచితము.

**197. సూ :— దిస్స్యాత్సమ్బన్ధార్థే సర్వస్మాత్.**

197. సూ :— సర్వస్మాన్నామ్న స్సమ్బన్ధార్థే దిస్స్యాత్. 'రాజాద, బంటుది' ఇత్యాది. నీయది, నాయది - ఇత్యాదౌ తచ్ఛబ్దార్థో౽దిశబ్దః." "శబ్దాత్తచ్ఛబ్దాతః" ఇత్యాచార్యోక్తేః. అత ఏవ 'బాపనయది' ఇత్యాదిశబ్దాః తత్తజ్జాతిసమ్బన్ధి

స్త్రీవాచకాః. సర్వత్ర షష్ఠ్యా ద్వితీయాతుల్యత్వమ్. ద్రుతలోపస్తు "వరుణధనేశ్వరుల దైనవైభవయుక్తిన్" ఇత్యాచార్యవచనా ద్భవతి. అత ఏవ "కన్నునది" ఇత్యాదౌ నుమ్. బహుత్వే వివర్ణకోఽ ధర్వణో నోక్తః. "వారివముఖుసకరూప్వర" ఇత్యాదిక మాచార్యస్యాపి వచనమ్. ఇదంశబ్దబహుత్వే తు "ఇవి యేనున్ పతతంబు సామదిఁ గరం బిట్టంబులై యుండు" నిత్యాదివచనం మానమ్.

వి :- దిః, స్యాత్, సంబంధార్థే, సర్వస్మాత్ - అని ఛేదము. శేషషష్ఠ్యర్థమునఁ బ్రాతిపదికముల కన్నింటికంటెను బరముగా నమహత్త్వమున 'ది' ప్రత్యయ మగునని యర్థము. రాజుయొక్క=రాజుది, బంటుయొక్క=బంటుది అనునపుడు యొక్కకు 'ది' అనునది యాదేశముగఁ గాని, యాగమముగఁగాని వచ్చినచో 'యొక్క' లోపించియు రూపసిద్ధి కలుగుచున్నది. సాధారణముగా యొక్కకు లోపమునుజింతామణి యంగీకరింపదుగాన 'రాజుయొక్క+ది' అనియుండఁగా "క్వాచిత్ప్రత్యయయోగేఽపి తథాత్వ మభిధీయతే"-"ఒకానొకచోఁ బ్రత్యయసంబంధము కలిగినపుడు షష్ఠికి ద్వితీయాతుల్యత కలుగునని చెప్పఁబడుచున్నది" అనుచోప్పున యొక్కకు ద్వితీయాతుల్యత గలిగి 'రాజున్+ది' అని యగును. ద్రుతమునకు వృత్తిసంబంధముచే లోపము గలిగి 'రాజుది, బంటుది' మున్నగురూపములు సిద్ధించుచున్నవి. "ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు" అనుచోప్పున నిచట లోపము వచ్చుట కవకాశము లేకున్నను వృత్తిసంబంధముచే లోపము వచ్చునని వ్యాఖ్యానించుటకు "వరుణధనేశ్వరుల దైనవైభవయుక్తిన్" అను నన్నపార్యుని ప్రయోగమే యాధార మగుచున్నది. ఇందు 'వరుణధనేశ్వరులయొక్క' అనునర్థమున 'ది' వర్ణము వచ్చి యొక్కకు ద్వితీయాతుల్యత కలిగి, యాద్రుతమునకుఁ బైని జూపఁబడినవ్యాఖ్యానముచోప్పుననే లోపము కల్గిన ట్లూహింపనగును. బాపనది, కోమటిది, మున్నగునవి బాపన+అది, కోమటి+అది అనియుండఁగా "శబ్దా త్తచ్ఛబ్దాతః" అనుచోప్పున 'అది' యనుదానియందలి అకారము లోపించినపుడు బాపనది, కోమ

టిది, మున్నగురూపములు సిద్ధించుచున్నవి. లోపము రానపుడు 'బావ నయది' మున్నగురూపములు కలుగుచున్నవి. కన్ను+అది అననపుడు "శద్బా త్తచ్ఛద్బాతః" అని అకారలోపము కలిగి కన్నుది అనియు, లోపము రానపుడు "షష్ఠ్యా ఉతోఽచి నుమ్నేచ" అనుచొప్పుననుమా గమము చేయఁగా 'కన్నునది' అనియు నగుచున్నది. "ది స్స్యాత్సంబంధార్థే" అని వచ్చు 'ది' వర్ణక మేకవచనముననే వచ్చును. బహుత్వ మున 'బహుత్వే తు వివర్ణకః' అను నాథర్వణోక్తిచే వివర్ణకము వచ్చును.

198. సూ :— యుష్మదస్మదాత్మభ్యో ద్వితి వర్ణకః.

198. సూ :— యుష్మదస్మదాత్మభ్య స్త్రిభ్యో దేశ్యేభ్యస్తు సమ్బన్ధార్థే 'దు' ఇతివర్ణక స్స్యాత్. 'నాదుసొమ్ము, నీదువేడ్క, తనదుపేర్మి' ఇత్యాది. ప్రాతిపదిక మాత్రా దస్య విధిః. సర్వస్మాదిత్యుక్తత్వా దేభ్యోఽపి భిన్నావస్థాయాం 'ది' వర్ణకస్య ప్రయోగే నకశ్చి ద్విశేషః. నచ విశేషవిధినా బాధః. తస్య సమాసవిషయక త్వాత్. 'కీర్తి తనది' ఇత్యాది.

వి :— యుష్మదస్మదాత్మభ్యః, దు, ఇతి, వర్ణకః—అని ఛేదము. మీఁదఁజెప్పిన 'ది, వి' అనువర్ణకము శేకత్వబహుత్వములలో సమాసమున మాత్రమే వచ్చును. యుష్మదస్మదాత్మన్ శబ్దములకంటెఁ బ్రకృత సూత్రమున వచ్చు 'దు' అనువర్ణకము సంబంధార్థమునందే వ్యస్తత లోనే గల్గునని సూత్రార్థము. ఈ 'దు' వర్ణకము ప్రాతిపదికమాత్రము కంటె విధింపఁబడుచున్నది. "సర్వస్మాత్" అని చెప్పుటచే యుష్మదాద్యర్థకశబ్దములకంటె వ్యస్తతలో దివర్ణకము రావచ్చును. నాదుసొమ్ము, నీదువేడ్క, తనదుకీర్తి, అని యుదాహరణములు. 'కీర్తి నీది' అనునపుడు నీసంబంధమైనకీర్తి యనియర్థము. 'ది, వి' అనునవి సమాసముననే వచ్చును. దువర్ణకము వ్యస్తతయందే వచ్చును.

**199. సూ :— అ ఇ ఉ స్త్రీవిషయాః.**

199. సూ :— 'అ ఇ ఉ' ఇత్యేతే వర్ణాః లోకప్రసిద్ధవ్యావహారికనామాన్తే ష్వనపాయిత్వేన వర్తన్తే. గౌర, గౌరి, గౌరు, లచ్చ, లచ్చి, లచ్చు, ఇత్యాది.

వి :— సూత్రమంతయు నేకపదమే. అ, ఇ, ఉ అనునవి తెనుఁగున స్త్రీత్వమును దెలుపుప్రత్యయములు. సంస్కృతములోని టాబాది ప్రత్యయములవలె నివి యాచ్ఛికస్త్రీప్రత్యయములు. అ, ఇ, ఉ అనునవి మిగిలినవాని కుపలక్షణములు. ఆచ్ఛికస్త్రీసమశబ్దము లనేకము లీస్త్రీప్రత్యయాంతములే యగుచున్నవి. అనఁగా నీస్త్రీప్రత్యయములు తుదిని జేరుటచే నేర్పడినవే యని యర్థము. కావుననే యీప్రత్యయాంతము లగుశబ్దములు స్త్రీసమము లగుచున్నవని తెలియనగును. 'అ, ఇ, ఉ' అనునవి వ్యావహారిక స్త్రీజననామములతుదిని నిల్చునని కవిశిరోభూషణము చెప్పుచున్నది. అట్లుచెప్పుట సరి కాదు, వ్యావహారికభాషకు వ్యాకరణ మవసరము లేదని ప్రాచీనాంధ్రవైయాకరణుల సిద్ధాంతము. ఇప్పటివారు కొందఱు వ్యావహారికభాషకును వ్యాకరణ ముండవచ్చునని యట్టిగ్రంథములను వ్రాయఁగడంగుచున్నారు. "ప్రయోగమూలం వ్యాకరణమ్; ప్రయోగశరణా వైయాకరణాః" అనువచనములనుబట్టి కవిప్రయోగమునుబట్టియే వ్యాకరణ మేర్పడుచున్నదని తెలియుచున్నది. కాని వ్యావహారికభాషావ్యాకరణ మే ప్రయోగముల ననుసరించి వెలువడినదో తెలియదు.

**200. సూ :— త్వార్థే తనశ్చ వికృతౌ స్యాత్.**

200 సూ :— పాణినీయోక్త 'త్వ' ప్రత్యయార్థే తు 'తన' ఇతివర్ణకస్స్యాత్. అత్రాపి షష్ఠ్యా ద్వితీయాతుల్యత్వమ్. "తస్య భావ స్త్వతలౌ" ఇతి పాణినీయోక్తేః. అత ఏవ 'వన్నెకానితనము, బుద్ధిమంతునితనము' ఇత్యాదిరూపం సిద్ధమ్. 'బొడ్డతనము, దొరతనము' ఇత్యాదిరూపమ్. 'వడిగలవానితనము, సిరిగలవానితనము' ఇత్యాదౌ 'కల' శబ్దో విద్యమానశబ్దపర్యాయో దేశ్య స్తద్ధర్మతుల్యః. తేన 'పీతాంబరము కల

వాఁడు, వడి గలవాఁడు, "అంటినఁ గందు కెందలుకు లంగములం గలవానిన్" ఇత్యాదౌ "కర్మాదేః కర్తృత్వ" మితిసూత్రవ్యాప్త్యా సాధుత్వమ్.

వి :- త్వార్థే, తనః, చ, వికృతౌ, స్యాత్—అని ఛేదము. త్వ ప్రత్యయము పాణినీయమున "తస్య భావ స్త్వతలౌ" అని చెప్పఁబడినది. దానియర్థమునందుఁ దెనుఁగున 'తన' అనువర్ణకము వచ్చునని సూత్రార్థము. 'వన్నెకానియొక్క భావము' అనునర్థమున 'వన్నెకానితనము' అని సిద్ధించుచున్నది. వన్నెకాఁడు, అనునది ధర్మివాచకము. ధర్మబోధకమగు 'తన' ప్రత్యయము చేరి వన్నెకానితనము అని యగుచున్నది. ఇట్లే 'వడికలవాఁడు, సిరిగలవాఁడు' అనువానిపైని 'తన' ప్రత్యయము చేరి 'వడిగలవానితనము, సిరిగలవానితనము—అనురూపములు సిద్ధించుచున్నవి. 'పీతాంబరము కలవాఁడు' మున్నగునవి "కర్మాదేః కర్తృత్వ" మ్మనుసూత్రమునకు లక్ష్యములు. ఈ త్వప్రత్యయము వచ్చినపుడు షష్ఠికి ద్వితీయాతుల్యత్వము కలిగి రూపములు సిద్ధించును. 'దొడ్డతనము, దొరతనము' అనునపుడు 'దొడ్డ, దొర' అనునవి తచ్ఛబ్దార్థముతో నన్వయించి 'దొడ్డవాఁడు' అనియగును. దొర అనునది స్త్రీసమమగుటచేఁ బ్రథమైకవచనమున 'దొర' అనియేయుండును. దీని షష్ఠ్యంతరూపము 'దొరయొక్క' అని యుండును. 'దొడ్డవాని' యనునపుడు షష్ఠీవిభక్త్యర్థమున 'దొడ్డ' అనుదానికి విభక్త్యంతతచ్ఛబ్దము చేరినదని తెలియవలెను. 'వడిగలవానితనము' అనుచోట నున్న 'కల' అనుశబ్దము విద్యమానార్థక మగుదేశ్యశబ్దము.

**201.** సూ :- నామ్నః కవర్ణక స్స్యా త్త్వార్థే స్యా దుత్వమపి పరే తస్మిన్.

201. సూ :- స్త్రీసమాత్ స్త్రీలింగాద్వికృతాచ్చ ప్రాతిపదికా త్త్వార్థే కవర్ణకోఽపి స్యాత్. తస్మిన్ పరే ఉత్వమపి స్యాత్. అపిశబ్ద స్సోభయత్రా ప్యన్వయః. 'పొలఁతుక, నెలఁతుక, గొంతుక, వెలఁదుక' ఇత్యాది. 'నిప్పుక, ఇత్యాదౌ నామ సమ్బన్ధ్యేవోత్వమ్. 'వాలుగంటిక' ఇత్యాదౌ సమాసా త్కః. కవర్ణకాభావే పక్షే పొలఁతి ఇత్యాది.

వి :- నామ్ని, కవర్ణకః, స్యాత్, స్వార్థే, స్యాత్, ఉత్వమ్, అపి, పరే, తస్మిన్-అని ఛేదము. స్త్రీవాచకాచ్ఛికశబ్దముమీఁదను, స్త్రీసమాచ్ఛికశబ్దముమీఁదను, 'క' వర్ణకము వచ్చును. అది స్వార్థమునందు వచ్చును. కవర్ణకపరత్వమునఁ బూర్వమున కుత్వము వచ్చునని సూత్రార్థము. పొలఁతి+క, పొలఁతుక. నెలఁత+క, నెలఁతుక. గొంతు+క, గొంతుక, వెలఁది+క, వెలఁదుక. ఈయుదాహరణములలోఁ బొలఁతి, వెలఁది, అనునవి రెండును నికారాంతములు. గొంతు అనునది యుకారాంతము. నెలఁత యనున దకారాంతము. గొంతుక అనునట్లే నివ్వెక యనునది యగపడుచున్నది. ఇచట నున్న యుకారము నామసంబంధి యుకారమే. వాలుగంటిక అనుచోట కకారము సమాసాంత ప్రత్యయ మగుటచే దీని కుత్వము రాదు. ఈయుత్వము కవర్ణకమును వికల్పమగుటచేఁ బొలఁతి మున్నగురూపములు నుండును.

**202.** సూ :- చురితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్.

202. సూ :- సర్వస్మాత్ క్రియాపదాత్ వర్తమానకాలే చురితి వర్ణకః స్యాత్. ఘటింపుచున్నాఁడు, జయింపుచున్నాఁడు, చేయుచున్నాఁడు, గెలుచుచున్నాఁడు, ఇత్యాది.

వి :- చుః, ఇతి, క్రియాపదానాం, సర్వేషాం, వర్తమానకాలే, స్యాత్-అని ఛేదము. వర్తమానార్థవివక్షయందు ధాతురూపమునకు 'చు' అనున దాగమముగా వచ్చును. "సర్వేషాం" అనుదానికి సమాపకక్రియలు, నసమాపకక్రియలు, క్రియాజన్యవిశేషణములునని యర్థము చెప్పవచ్చును. అంతకంటెఁ దత్సమాంధ్రక్రియలు, సకర్మకాకర్మకక్రియలు, నామక్రియలు, ప్రేరణాదిక్రియలునని యర్థము చెప్పుట యుచితము. "ఘట చేష్టాయామ్" అనుసంస్కృతి ధాతువునకుఁ దత్సమత్వవివక్షలో నించుగాగమము చేయఁగా ఘటించు అనియగును. దీనికి వర్తమానార్థమునందు చువర్ణక మాగమముగా వచ్చి 'ఘటించుచు' అనియగును. దీనిమీఁద 'ఉన్న' అనుననుబంధము చేరి ఘటించుచున్న

అనురూప మేర్పడును. ఇది క్రియాజన్యవిశేషణము. దీనికి విభక్తి వివక్ష చేయునపుడు తచ్ఛబ్ద మనుప్రయుక్తమై ఘటించుచున్నవాఁడని మహద్వివక్షలో రూప మేర్పడును. అమహద్వివక్షయందు దీనికి 'అది' శబ్ద మనుప్రయుక్తమై 'ఘటించుచున్నది, ఘటించుచున్నయది' అని యగును. ఇట్టి క్రియాజన్యవిశేషణములు నామాకాంక్షాసమాపకములు కావున వీనికి నామములతోనే యన్వయము. ప్రకృతసూత్రముచే 'ఘటించు' అనుదానికి 'చు' వర్ణకము చేసి "అన్యే ద్రుతప్రకృతయః" అనుచోట్నాన ద్రుతము చేరఁగా 'ఘటించుచున్' అను నసమాపకక్రియా రూప మేర్పడును. 'ఘటించుచున్న' అనుదానిపైని సమాపకక్రియావివక్షలోఁ బ్రథమపురుషైకవచనమున "వ్యతిరేకార్థే లృటి లటి డుజ్ స్యాత్" అని డుజ్వర్ణకమును, నది పరమగునపుడు 'పునరాగమః క్రియాణాం' అని పూర్వమునకు దీర్ఘమును జేసిన 'ఘటించుచున్నాఁడు' అనురీతిని రూపసిద్ధి కలుగును. నన్నయగా రిట్టిరూపము లను వర్తమానార్థమునఁ బ్రయోగించి యుండలేదు. మఱికొందఱిమతమున 'ఉండు' అనునాచ్ఛికధాతువునకుఁ బ్రథమపురుషైకవచనమునందు ఉన్నాఁడు అనురూప మేర్పడు ననియు, 'ఘటించుచున్+ఉన్నాఁడు' అనునపుడు "చోర్వా స్యాత్" అనుచోట్నాన సంధిచేసినచో ఘటించుచున్నాఁడు, ఘటించుచునున్నాఁడు అని రెండు రూపము లగుచున్నవి. "చోర్వా స్యాత్" అనుసూత్రమునందలి 'వా' శబ్దమును వ్యవస్థావాచిగా నంగీకరించినయెడల 'ఘటించుచున్నాఁడు' అనుచోట సంధి నిత్యముగానే జరుగును. ఇట్టిరీతిప్రక్రియను గొంద ఱంగీకరింప లేదు. 'జయించుచున్నాఁడు, చేయించుచున్నాఁడు' మున్నగువానిప్రక్రియ నిట్లే యెఱుంగునది. మూలమున 'ఘటింపుచున్నాఁడు' మున్నగుపత్వఘటితరూపము లుదాహరింపఁబడినవి. అట్టిచో పత్వము వచ్చుట దుర్ఘటము. 'ఘటించు' ధాతువునకు వర్తమానార్థవివక్షలో 'లట్టు'ను, లడర్థమునందు 'ఉన్న' అనుననుబంధమును వచ్చును. చువర్ణకము వర్తమా

నార్థవివక్షలోనే వచ్చుచున్నది. ధాతు 'చు' వర్ణమునకును, 'ఉన్న' అనుబంధమునకును మధ్యమున వర్తమానార్థమున విధించిన చువర్ణముతో వ్యవధాన మున్నది. అవ్యవహితానుబంధపరకత్వము ధాతువునకు లేదు గాన పత్వము రాదు. కావున 'ఘటింపుచున్నాఁడు' మున్నగురూపములు చింతామణి వికృతివివేకములమతమున సిద్ధింపవు. కాన 'ఘటించుచున్నాఁడు' అనియే యుండనగును.

**203.** సూ :— ప్రతిషేధవాచినాం నిః

203. సూ :- ప్రతిషేధవాచినః క్రియాపదాన్నివర్ణక స్స్యాత్. 'ఘటింపనివాఁడు, చేయనివాఁడు' ఇత్యాది. స్త్రియాన్తు 'ఘటింపనియది, చేయనియది' ఇత్యాది.

వి :— ఇచట 'ప్రతిషేధవాచినో నిః' అని పాఠాంతరము. ఇదియే లెస్సగా నగపడుచున్నది. ప్రతిషేధవాచినాం, (ప్రతిషేధవాచినః) నిః—అని ఛేదము. ప్రతిషేధమును జెప్పుక్రియావాచకశబ్దముకంటె 'ని' వర్ణకము వచ్చునని సూత్రార్థము. ఈ నివర్ణకవిశిష్టరూపము వ్యతిరేక క్రియాజన్యవిశేషణ మగునని తాత్పర్యము. 'ఘటించు' ధాతువునకు నామాకాంక్షలో వ్యతిరేకార్థమున 'ని' అనుప్రత్యయము వచ్చి తత్పరకత్వమున 'చ' కారమునకు 'ప' కారమును, పకారోకారమున కత్వమును వచ్చి 'ఘటింపనివాఁడు' మున్నగురీతిరూపము లేర్పడును. స్త్రీత్వమునందు 'ఘటింపనియది' యని యగును. 'ఘటింపని+అది' అనియుండఁగా 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అనుచోప్పున 'అది' శబ్దములోని అకారమునకు వికల్పలోపము కలిగి 'ఘటింపనిది, ఘటింపనియది' అను రూపములు సిద్ధించును.

**204.** సూ :— భూతార్థానాన్తు నః క్రియాణాం స్యాత్.

204. సూ :- భూతార్థవాచినః క్రియాపదాత్తు న ఇతివర్ణక స్స్యాత్. 'ఘటించినవాఁడు, ఘటించినయది' ఇత్యాది.

వి :- భూతార్థవాచకము లగుక్రియాపదములకు నామాకాంక్ష యందు 'న' అనునది తుదిని వచ్చును. "క్త్వాభూతయోః క్రియా స్త్వ స్యాత్" అనుచో వ్వాన ధాత్వంతమున ికారము వచ్చును. 'ఘటించిన వాఁడు, ఘటించినయది' మున్నగునవి యుదాహరణములు.

**205 సూ. కర్మాదేః కర్తృత్వం ప్రథమా చ నవర్ణకశ్చ తద్వత్స్యాత్.**

205 సూ 1:- కర్మాదికారకార్థానాం కర్త్రర్థతా స్యాత్. కర్మార్థతాప్రయుక్తాయా స్తృతీయాయాః ప్రథమాచ స్యాత్. తద్వద్భూతార్థే నవర్ణకశ్చ స్యాత్ కర్మార్థతాయాం చద్వయం త్రయాణాం సముచ్చయద్యోతకమ్. ఇతరత్ర తు ద్వయో స్సముచ్చయద్యోతకమ్. కర్త్రర్థత్వం చాత్ర కర్తృగతక్రియావాచకక్రియాపదసామానాధికరణ్యం వివక్షితమ్. 'నీచేత నుతింపఁబడినరాజు' ఇత్యాదయః కర్మార్థాః. "ఆదిన్ గాధితనూజుచే పగముసేయంబడ్డ మిన్నేఱు" ఇత్యాద్యాః కవీనాం వాచః "కర్మణ్యనుబన్ధస్స్యాత్ పతిధాతుః"ఇతిసూత్రేణ 'పడు' ఇతి పతిధాత్వర్థస్యకర్మణ్యనుబన్ధతా. 'త్వయా రాజా నుతః' ఇత్యాదౌ ప్రకృత్యామాద్యాయాం యథా కర్మణి క్తవిధానాత్ క్తప్రత్యయేన రాజాదిపదార్థగతకర్మత్వేఽభిహితే "కర్తృకరణయో స్తృతీయా" ఇతి తృతీయా, ప్రాతిపదికార్థసూత్రేణ ప్రథమాచ భవతి; తథాఽత్రాపి పడుధాతునా కర్మత్వేఽభిహితే విభక్తిద్వయం జ్ఞేయమ్. "ఘనతపంబుసేయ వనము సేరన్" ఇత్యాద్యనభిహిత ఉదాహరణమ్. 'తపసే వనం గతః' ఇత్యాద్యభాషాయామ్. ఏవమన్యేపి కారకార్థాః ప్రకృత్యనుసారేణ జ్ఞేయాః.

వి:- కర్మాదేః, కర్తృత్వం, ప్రథమా, చ, నవర్ణకః, చ, తద్వత్, స్యాత్ —అని ఛేదము. కర్మాదికారకములకుఁ గర్త్రర్థత్వము కలుగును. కర్మార్థతాప్రయుక్తముగాఁ గలుగవలసిన తృతీయకుఁ బ్రథమయు వచ్చును. భూతార్థమున నవర్ణకమును వచ్చును. 'నీచేత నుతింపఁబడిన రాజు'అని కర్మార్థతలో నుదాహరణము. "నీవు రాజును నుతించితివి" అనునది కర్త్రర్థకవాక్యము. ఇందు 'నీవు'అనునది కర్త. 'రాజును'అనునది కర్మము. 'త్వయా రాజా నుతః' అనుదానికి సంస్కృతభాషలోని వాక్యమున 'నుతః'అనుదానియందలి క్తప్రత్యయము కర్మార్థమునందు

వచ్చినది. కావున 'రాజన్' శబ్దమునందలికర్మత్వము దానిచే నుక్తమైనది. కావున నుక్తార్థమునఁ బ్రథమ వచ్చినది. క్రియావాచకపదమునకు నవర్ణకమును నిత్యమును వచ్చినచో 'నీవు నుతించినరాజు'అని కర్త్రర్థమునను, 'నీచేత నుతింపఁబడినరాజు' అని కర్మార్థమునను రూపములు కలుగును. ఇట్టివానినిఁ గర్మధారయాభాసము లందురు. 'నుతించిన,' 'నుతింపఁబడిన,' మున్నగునవి నామాకాంక్షాసమాపకములు. ధాతుజవిశేషణములు, క్రియాజన్యవిశేషణములునని వీనికి నామాంతరము లు. సుబంతములతో వీని కన్వయ ముండును. కర్మము, కరణము, సంప్రదానము, అపాదానము, అధికరణము ననునవి యభిహితములు కానపుడు (అనఁగా నుక్తములు కానపు డని యర్థము) వానికి వరుసగా ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, సప్తమి, అనువిభక్తులు కలుగునని సంస్కృతవ్యాకరణము చెప్పుచున్నది. వానికిఁ బ్రాధాన్యవివక్ష చేసినచోఁ బ్రథమావిభక్తియే వచ్చును. 'రాముఁడు రావణునిఁ జంపెను' అనునపుడు కర్మవాచక మగురావణశబ్దమునకుఁ బ్రాధాన్యవివక్ష చేసినచో రావణశబ్దమునకుఁ గర్తృత్వముఁ, బ్రథమయు వచ్చి క్రియావాచకపదమునకు నిత్యము,నవర్ణకము,వచ్చి 'రాముఁడు చంపినరావణుఁడు'అనురీతివాక్యములేర్పడుచున్నవి. ఇట్లే తక్కినకారకములకును నెఱుఁగునది.

205 సూ 2 :- సీ॥ నీవు పోషించిన నిఖిలదైవతములు। కేల గల్గను భీతి యెపుడు నీవు
జనముల కిడినపరసంపుఁగరుణకు। మేరేది నీవు నిమేషమాత్ర
మేనిఁ గ్రోధించిన హీనాత్ములకు గతి। యెద్ది భక్తులకు నీ వేదినట్టి
పాపం బసదె నీవు పరమాత్మభావత। నుండినవారి కెవ్వండు కినియు

గీ॥ నసమగుణహార సాధుమానసవిహార
హారనీహారసత్కీర్తిసారభార
భారమోదార నిర్ధూతభవవికార
కారణవిదూర భూమిజాదార వీర॥

ఇతి నవర్ణకోదాహరణమ్.

వి :- 'నీవు పోషించిననిఖిలదైవతములకున్' అనుచోటఁ గర్మకారకమునకుఁ బ్రాధాన్యవివక్ష చేయఁబడినది. నీవు నిఖిలదైవతములను బోషించితి వనునపుడు కర్మకారక మగునిఖిలదైవతములన్ అనుదానికిఁ బ్రాధాన్యవివక్ష చేయఁగాఁ గర్తృత్వమును బ్రథమయు నవర్ణకమును వచ్చినవి. 'నీవు జనముల నేదినసరసంపుఁగరుణకున్' ఇది కరణకారక ప్రాధాన్యవిక్ష కుదాహరణము. 'నీవు సరసంపుఁగరుణతో జనముల నేదితివి' అనునపుడు జనముల నేదుటలో సరసంపుఁగరుణ కరణమైనది. దానికిఁ బ్రాధాన్యవివక్ష చేసినచో నీవు జనముల నేదినసరసంపుఁగరుణ అని యుండును. "నీవు క్రోధించినహీనాత్ములకున్" అనునది సంప్రదానకారకమున కుదాహరణము. నీవు హీనాత్ములకొఱకుఁ గ్రోధించితివి-అనునపుడు హీనాత్ములకొఱకు అనుసంప్రదానచతుర్థికిఁ బ్రాధాన్యవివక్షచేయఁగా నీవు క్రోధించినహీనాత్ములు-అనియగును. 'నీ వేదినట్టిపాపంబు' అనునది యపాదానకారకమున కుదాహరణము. నీవు పాపంబువలన నేదితివి-అనునపుడు అపాదానపంచమికిఁ బ్రాధాన్యవివక్ష చేయఁగా 'నీ వేదినపాపంబు' -అనియగును. "పరమాత్మభావత నుండినవారి నెవ్వండు కనియు"నను నది యధికరణకారకమున కుదాహరణము. ఎవ్వారియందుఁ బరమాత్మభావత యుండునో వారు పరమాత్మభావత నుండినవారు అనియర్థము.

205. సూ. 3 :- క॥ తెక్కలు విఱిగినపులుఁగులు
సిక్కినగతి నీదుభక్తి సెడినమహాత్ముల్
దిక్కెందు లేక సంసృతిఁ
జిక్కుదురని శ్రుతులు వల్కు శ్రీరఘురామా!

ఇతి నవర్ణకే షష్ఠ్యా ముదాహరణమ్. అత్ర పంచమ్యర్థే షష్ఠీ. "శ్రుతులఁగనిఫల మిపుడు గంటిన్" - "తారు వేర్చినయట్లు తేర్చెన్," "పుట్టినయపుడు" ఇత్యాద్యా వాగనుశాసనానాం వాచాం ప్రసారాః.

వి :- 'తెక్కలు విఱిగినపులుఁగులు' అనునపుడు ఏపులుఁగులకు తెక్కలు విఱిగినవో యవి తెక్కలువిఱిగినపులుఁగు లనిపించు కొనుచు

న్నవి. 'నీదుభక్తి సెడినమహాత్ముల్' ఏమహాత్ములకు నీదుపదభక్తి సెడినదో వారు నీదుభక్తి సెడినమహాత్ములు. ఇవి రెండును షష్ఠి కుదాహరణములు. ఈషష్ఠి పంచమ్యర్థమున వచ్చినది. షష్ఠికిఁ గారకత్వము లేకున్నను గారకత్వము గలపంచమికి నిట షష్ఠి వచ్చినది గావున వీనిని గర్మధారయసమాసము లనుటకు వీలులేకున్నను గర్మధారయాభాసము లనఁ దగియున్నవి.

205. సూ. 4 :- అంతాదిశబ్దవ్యవధానేఽపి సాధుత్వమ్. "తిలలు పైనెత్తి చల్లిన దిగువఁబడనియంతసందడి" "నుసి యొలుకుచున్న పురాణచాపమున్", "గట్టిగాఁ జూడు నీవున్న యట్టిచోటు"-ఇత్యాద్యాః కవీనాం వాచః.

"క్వచి న్నవర్ణే దేర్లోపః క్వచి ద్దోశ్చ తథా భవేత్ ।
క్వచి త్తదర్థే దయుగం క్వచి న్నస్యైచ్చ లోపవాన్ ॥

తదర్థే నవర్ణకార్థ ఇత్యర్థః. ఉండినవాఁడు, ఉన్నవాఁడు, పడినవాఁడు, పడ్డవాఁడు, కనినవారు, కన్నవారు, వినినవారు, విన్నవారు, రాకుండునె, రాకున్నె, ఇత్యాది. హ్రస్వాదిష్వే వాయం విధిః. తేన పాడినవాఁడు, ఓడినవాఁడు, వాడినవాఁడు, పూనినవాఁడు, ఇత్యాదౌ నాయం విధిః. "ధర్మసుతుఁ డున్నచోటన్" ఇత్యాది వచన మాచార్యస్య. నివర్ణకే ష్వేవం ప్రయోగః. "భూతార్థే ప్రతిషేధార్థే నశ్చ నిశ్చ భవే త్క్రమాత్ । కర్మాదిక ర్తృతాయాశ్చ తౌ క్రియాచ విశేషణమ్" ఇత్యథర్వణోక్తేః.

వి :- ఏసందడియందు పైనెత్తిచల్లినతిలలు దిగువఁబడవో యది తిలలు పైనెత్తిచల్లిన దిగువఁ బడనియంతసందడి. ఇందు విశేషణవిశేష్యములకు 'అంత'శబ్దముతో వ్యవధానము కలదు. కవిప్రయోగానుసారముగా నిట్టివ్యవధాన మంగీకరింపఁబడుచున్నది. ఇది యాభాసకర్మధారయము. ఏపురాణచాపమునందు నుసి యొలుకుచున్నదో యది నుసి యొలుకుచున్నపురాణచాపము. ఏచోటియందు నీవుంటివో యది నీవున్నయట్టిచోటు. ఇందు 'అట్టి' అనుపదముతో వ్యవధానము కలదు. వీనిలో సప్తమికిఁ బ్రాధాన్యవివక్ష చేయఁబడినది.

చింతామణి యాచ్ఛికరూపసాధనప్రక్రియ నుపదేశింపలేదు. కాని యందలి చివరిసూత్రమగు "అత్వాది" అనునది చింతామణి క్రియాపరిచ్ఛేదములోనికార్యము లాచ్ఛికధాతువులకుఁగూడ వచ్చునని యభ్యనుజ్ఞ నొసంగుచున్నవి. కావునఁ బై యాచ్ఛికధాతువు లన్నియుఁ గర్మాదికర్తృకతలను బొందుచున్నవి. భూతార్థకవిశేషణాదుల నవర్ణకము పరమగుచుండఁగా దానికి ముందున్న 'ది' వర్ణమునకు లోప మొకప్పుడు సంభవించును. ఒకప్పు డానవర్ణకాన్తమునందు ద్విత్వ డ వర్ణము చూపట్టును. ఒకప్పుడు నవర్ణకముమీఁది 'ఇ' వర్ణమునకు లోప మును గల్గును. ఉండినన్, ఉన్నన్-ఉండినచోన్, ఉన్నచోన్-ఉండి నప్పటికిని, ఉన్నప్పటికిని- ఉండినవాఁడు, ఉన్నవాఁడు — కావలసియుండి నను, కావలసియున్నను-ఇది భూతార్థకవిశేషణమైనను, నన్నయాదులు దీనిని వర్తమానార్థకవిశేషణముగా వాడియున్నారు. ఉండునే, ఉన్నే- పడినన్, పడ్డన్ - చెడినన్, చెడ్డన్ - కనినన్, కన్నన్ - వినినన్, విన్నన్- మొదలైనవి. భూతార్థమునందును, వ్యతిరేకార్థమునందును వరుసగా నవర్ణకనినర్ణకములు కర్మాది కర్తృతయందు వర్తిల్లినట్లు తెలియ నగును. ఇవి క్రియాజన్యవిశేషణము లగును. ఈచోట "క్రియాజవిశేష ణమ్" అనుపాఠాంతరము కలదు. దానికంటె నిదియే లెస్స యని పెద్ద లనుచున్నారు. "క్రియాజవిశేషణమ్" అనుదానికిఁ గ్రియ విశేషణ మగుట సంభవించునని యర్థము. క్రియ యనఁగా ధాతువుగదా! ధాతుజ విశేషణ మనియు నర్థము. వ్యతిరేకార్థమునందు ఘటింపనివాఁడు మున్నగునవి యుదాహరణములు. 'ఉండు' ధాతువునకు భూతార్థక క్రియాజన్యవిశేషణరూపము 'ఉండినన్' అనునది. ఇది చేదర్థమునందును వర్తిల్లును. రెండర్థములందును 'ఉండినన్' అనియుండుట చింతామణికి సమ్మతము. చింతామణిమతమునందు విశేషణము లన్నియు ద్రుతప్రకృ తికములు గదా. "క్వచి న్నవర్ణే డే ర్లోపః" అనుచోప్పున 'డి'వర్ణము లోపించి బిందువునకు నకారరూపము కలిగినపుడు 'ఉన్నన్' అని

యగును. ఉండునె, ఉన్నె, అనునవి "క్త్వాచి డ్వోశ్చ" అనుదాని కుదాహరణములు. 'పడ్డెన్, చెడ్డెన్' అనునవి "క్త్వాచి త్తదర్థే డయుగ" మ్మనుదాని కుదాహరణములు. వినినన్, విన్నన్ — కనినన్, కన్నన్, మున్నగునవి "క్త్వాచి న్నస్వేచ్ఛ లోపవాన్" అనుదాని కుదాహృతులు. ఈవిషయ మంతయు "క్త్వాచి న్నవర్ణే డేర్లోపః" అనునధర్వణకారికకు సంబంధించినది. "భూతార్థమునందును బ్రతిషేధార్థమునందును 'న—ని' అనునవి కర్మాదికర్తృతలో ధాతువునకుఁ జివర వచ్చును. నినలు చేరిన యీపదములు విశేషణములుగూడ నగునని "క్రియాచ విశేషణమ్" అనుసూత్రమున కర్థము. "తౌ క్రియాజవిశేషణ" మ్మనుపాదమునకు—'నిన లంతమునఁ జేరినధాతువులు క్రియాజన్యవిశేషణము లగు' నని యర్థము.

205 సూ. 5:— సీ॥ "నీవు పూననికార్య మేవిధిఁ గడతేఱు। నీవధిష్ఠింపనినెలవు గలదె?
దానుల నేదనిదయ నీకుఁ గల్గునే। నీవు వరం బీనినిపుణు లెవరు?
నీవు భక్తుల నేదనిదురితం బున్నదే। యెన్నంగ నీ వవిచ్ఛిన్నరీతి
నధివసింపనివిద్య యబ్బునే తెలఁపంగఁ। గమలభవాండసంఘాతి [ములను

గీ॥ నెందటిపల్కులగమికానిముద్దురాణి,
నమ్రగీర్వాణి, మాధుర్యనవ్యవాణి,
పులినసుశ్రోణి, నీలాభ్రలలితవేణి,
నకలి ననుఁ బ్రోవుము పురాణి నలినపాణి".

ఇత్యాది. "నీదుపదభక్తి లేనియన్నిచమతికి శుభము గల్గునె శ్రీరామ సుగుణధామ" ఇతి షష్ఠ్యా ముదాహరణమ్. అత్రాధికరణే షష్ఠీ. క్రియాజన్యవిశేషణే ష్వేవం ప్రయోగః. 'దానిం బుచ్చుకొనువిధంబు' 'సుతుఁ విద్యాప్రవీణతఁ జూచునేడ్కు' ఇత్యాద్యాచార్యవచన మత్ర మానమ్.

వి :— ప్రతిషేధార్థమునఁ గ్రిందివి యుదాహరణములు. కర్మాది కర్తృతయందు నివర్ణఘటితము క్రియాజన్యవిశేషణ మగునని చెప్పిన యధర్వణవచనమునందలి నివర్ణమునకు "పూననికార్యము, (అధిష్ఠింపని నెలవు) ఏదనిదయ, వరం బీనినిపుణులు, ఏదనిదురితము, అధివసింపనివిద్య

అనునవి యుదాహృతులు. ఈయుదాహరణములు వరుసగాఁ గర్మకరణ సంప్రదానాపాదానాధికరణములకుఁ బ్రాధాన్యవివక్ష చేసినపుడు కర్మాది కర్తృతలో నేర్పడినరూపములని తెలియనగును. నీ వే కార్యమును బూన లేదో యది పూననికార్యము. ఏదయతో నీ వేదలేదో యది ఏదనిదయ. ఏవిప్రులతోడను నీవు వరం బీయలేదో వారు వరం బీనివిప్రులు. ఏదురితమువలన నీ వేదలేదో యది ఏదనిదురితము. ఏవిద్యయందు నీ వధివసింపలేదో యది యధివసింపనివిద్య యని తెలియవలెను. అధిష్ఠింపని నెలవు అను నుదాహరణ మధికరణార్థకోదాహరణమని తెలియవలెను. "నీదుపదభక్తి లేనియన్నిచమతికిన్" అనునది షష్ఠి కుదాహరణము. ఇది యధికరణార్థమునందు వచ్చినషష్ఠి. ఏనీచమతియందు నీదుపదభక్తి లేదో వాఁడు నీదుపదభక్తి లేనియన్నిచమతి యనిపించుకొనును. పృచ్ఛకొనువిధంబు, చూచువేడ్క అనువానిలో 'పృచ్ఛకొను, చూచు' అనునవి తద్ధర్మార్థక క్రియాజన్యవిశేషణములు. పైవి నన్నపార్యునిప్రయోగము లగుటచే నిట్టివి సాధువు లగును.

205. సూ. 6 :— సీ॥ నీవు సంరక్షించునిర్మలాత్ముల కెద్ది
యాపద నీవు విద్యాధికులను
సాఁకుసత్కారణాకరసంబున కేమేర
నీవు విద్యల నిచ్చునేర్పు లాంద్ర
భాగ్యంబుఁ గొనియాడు బ్రతిభాఢ్యుఁ డెవ్వఁడు
నీ వభివాదకనికరములను
గాచు నాజ్ఞానంపుఁగడలికి దరి యేది
నీ వుండుభక్తహృన్నీరజముల
గీ॥ నిర్మలత్వంబుఁ గీర్తింప నేర్చు నెవఁడు
పాదుపుకడమేడ విడిమట్టుకెడదకంటి
కంటితీవంచగవదంటయింటిగరిత
గరితరతనంబ నాయంబ గురునితంబ".

"ఇత్యాది తత్రోదాహరణమ్. "నీదుపదభక్తి లభియించునిర్మలులకు నిరతిశయ మైన సుఖ మబ్బు నీరజాక్ష" ఇతి షష్ఠ్యా ముదాహరణమ్. అత్ర కర్తరి షష్ఠీ. సమాసాధి

కరణసమాసోఽపి సాధుః. ఏతేన "ఇంతుల నేఁచుపాతక మదింతటఁ బోవదు సుమ్ము పాంథలోకాంతక", "దీనులఁ బ్రోచుపుణ్యము సుధీవినుతా వినుతింప శక్యమే" ఇత్యాదీని కవివచనాని వ్యాఖ్యాతాని.

వి :- సవర్ణకనివర్ణకములు వచ్చినవే కాక తద్ధర్మార్థమునందును, దద్ధర్మార్థకక్రియలమీఁదను నుత్పన్నమైన క్రియాజన్యవిశేషణ మొకటి కలదు. వృచ్చకోనువిధంబు, చూచువేడ్క, అని మీఁది నన్నవాగ్య ప్రయోగము లావిషయమును సూచించుచున్నవి. నివర్ణకములు వచ్చిన వానికివలెనే కర్మాదికర్తృత్వములు వానికిని గలవని 'నీవు సంరక్షించు' అనుపద్యముతో గ్రంథకర్త యుదాహరించి యున్నాఁడు. 'సంరక్షించు నిర్మలాత్ములు, సాఁకుసత్కారుణారసంబు, విద్యలనిచ్చు నేర్పుకాంద్రు, కాచు నాజ్ఞానంపుఁగడలికిన్, నీ వుండుభక్తవ్రాస్నీరజములన్—ఇవి వరుసగాఁ గర్మాదికారకములకుఁ బ్రాధాన్యవివక్షలోఁ గల్గినరూపముల కుదాహరణము లై యున్నవి. ఏనిర్మలాత్ములను నీవు సంరక్షించుచుంటివో వారు నీవు సంరక్షించునిర్మలాత్ములు. ఏసత్కారుణారసముతో సాఁకుచుంటివో యది సాఁకుసత్కారుణారసము; అని యీరీతి నర్థముల నెన్నినచోఁ గారకప్రాధాన్యవివక్ష తేటపడుచు ధాతుజవిశేషణములతోఁ గర్మధారయాభాసము సిద్ధించునట్లు తెలియఁ గలదు. "లభియించునిర్మలులకు" అనుచోట నేనిర్మలులకు లభియించునో వారు లభియించునిర్మలులు, అనియగును. ఇది కర్త్రర్థకషష్ఠి కుదాహరణము. ఏఁచుపాతకము, ప్రోచుపుణ్యము అనునవి సమానాధికరణ కర్మధారయాభాస సమాసము లని యెన్నవలెను. "కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు" (బాల. సమా. 26. సూ) అని సూరిగారీవిషయముల వివరించిరి.

205. సూ. 7 :- ఏవంస్థితే భాగవతే "నృపకుమారులఁ జదివింప నేర్పుగలుగు" ఇతి విశేషణాంతత్వేన పద్యం పరిసమాప్య "గురుజనంబులం దనమూఁడుకోట్లమీఁద" ఇతి విశేష్యాదిత్వేన పద్యోపక్రమః ప్రామాదిక ఇత్యవధేయమ్. "నీ చెప్పినపెద్దలం" ఇత్యాదీని తిక్కయజ్వాదికవిఃవచనాని తు "ప్రహ్లాదుఁ డైనరయొక్క కులపాంసను

చేసినదానఁ దత్కులం బెల్లను", "నా పల్కినపల్కు, నాతాల్చినవ్రతము, జనమేజయుచేసినసర్పయాగము, ఎఱుంగుదేని మాపడిరియోడునీయవస్థ" - ఇత్యాద్యాచార్యవచనమహిమ్నా సౌష్ఠవం లభన్త ఇత్యవగన్తవ్యమ్. "నాయొనర్పంబూనినయిమ్మహాప్రబంధంబునకు" ఇత్యత్ర "నాపూనినయిమ్మహాప్రబంధంబునకు" ఇత్యేవ ప్రయోగః సాధుః. "అతఁడు వోయినవెనుక"– ఇత్యాదౌ పథక్పదమేవ జ్ఞేయమ్. యద్వా – వెనుకాదిశబ్దానాం పరకాలవాచిత్వేన ఏషామవధిత్వవివక్షాయా అపాదానసంజ్ఞాయాం పూర్వకాలాగమనలక్షణార్థః ప్రతీయత ఇత్యభిన్నత్వమేవ. 'అతఁడు రానిపిదప' ఇత్యాదావ ప్యేవమేవ సాధుత్వ మవధేయమ్. "అధికుఁడని యెన్నఁదగువాని నఖిలజనులు సమరరంగంబులను సడిసన్నకతన"– ఇత్యాదావ ప్యధికతానిమిత్తతా దృష్టిర్భవతీ త్యర్థతాత్పర్యావగతే స్సామఞ్జస్య మవధేయమ్. ఏవమన్యత్రాపి యథాకథఞ్చిద్విభక్త్యన్తతా ముపపాద్య ప్రయోగగ్రామ్యతా పరిహ్రియతాం కోవిదైరితిసంక్షేపః.

వి:— భాగవతమునందు విశేషణాంతముగాఁ బద్యము పూర్తి చేయఁబడి విశేష్యాదిగా మఱియొకపద్య మారంభింపఁ బడినది. అనఁగా విశేషణ మొకపద్యమునను, విశేష్యము వేఱొకపద్యమునను నుండుట యని యర్థము. ఇట్లుండుట సరి గాదని కవిశిరోభూషణాభిప్రాయము. రెండుపదముల కేకార్థభావరూపసామర్థ్య మున్నపు డారెంటికి సమాసము కల్గి యేకపద మగుచున్నవి. వాక్యగతపదములకు వ్యపేక్షాభావరూపసామర్థ్య ముండును. ఏకసమాసమున నొకపద్యమునం దొకపదమును, మఱియొకదానియం దింకొకపదము నుండరాదు. విశేషణవిశేష్యములసంబంధము నిత్యము. నిత్యసంబంధము కలవానికి సన్నికర్ష యవసరము, విభిన్నపద్యములలో నున్నపదములు సన్నికృష్టములు కాఁజాలవు. పోతన్నగారీయెడ సమాసమును వివక్షింప లేదని యూహింపవలయును. అట్లైనను నిట్లుండరాదుగదా. ఛందోబద్ధములు కాని వాక్యములలోని విశేషణవిశేష్యములనే విడఁదీయరానపుడు ఛందోబద్ధవాక్యగతపదములను వాక్యమధ్యమున వేఱుచేసి పలుకరాదనియు, వ్రాయరాదనియు వేఱుగాఁ జెప్పనక్కఱ లేదుగదా. 'నీచెప్పినపెద్దలు' అనునపు డిందలిపదములకుఁ బరస్పరాన్వయము కుదురలేదు. ఇదెట్లు

సాధు వనుశంక కలుగవచ్చును. 'చెప్పినపెద్దలు' అనునది కర్మధార యాభాసము. దీనితో యుష్మదర్థక 'నీ' శబ్దమున కన్వయ మెట్లు? అని శంకించినచో 'ఒక్కకులపాంసను చేసినదానన్' అను నన్నపార్యునిప్రయోగముంబట్టి సాధువగునని చెప్పవలయును. కులపాంసనుయొక్క చేసిన దానిచేత నని యర్థము. 'నీచెప్పినపెద్దలు' అనుదానికి 'నీయొక్క చెప్పిన పెద్దలు' అని సాధుత్వమును దీనివలె నూహింపనగును. నన్నపార్యుని ప్రయోగము లిట్టి వెన్నియేనిం గలవు. 'నాయొనర్పంబూనిన' అను చోట 'నా' అనుదానికిని 'పూనిన' అనుదానికిని మధ్యను 'ఒనర్పన్' అనుదానితో వ్యవధాన ముండ రాదని కవిశిరోభూషణము 'నాపూనిన' అని దానిని సవరించెను. మధ్యను వ్యవధాన మున్నచో రెండుపదము లకును నేకార్థభావరూపసామర్థ్య ముండదు గాన నట్టి సమాస ముండ రాదని దానితాత్పర్యము. 'అతఁడు వోయినవెనుక' అనునపుడు సామ ర్థ్యము లేనందున నది సమాసము కాదని చెప్పనగును. లేక, వెనుక అనునది పరకాలవాచి యగుటచే దాని కపాదానసంజ్ఞ సిద్ధింపవచ్చు ననియు, దానిని సమాస మన్నను సమంజసమే యగుననియుఁ దోఁచు చున్నది. 'అతఁడు రానిపిదప' మున్నగువాని నిట్లే సాధింపవలెను. 'అధికుఁడని యెన్నఁ దగువానిన్' అనునపుడు అధికత్వరూపనిమిత్తము దృఢపడుచున్నదని యూహింపవలెను. (ప్రౌఢవ్యాకరణము. కారక. 15వ సూ.)

205. సూ. 8 :- "భవే ద్విరుదశబ్దేషు యతేచ్ఛం వర్ణకల్పనా ।
గ్రామమానుష్యబిరుదశబ్దానా మపి సోమతః ॥
గ్రామనామ్నః సమాసేషు వికారోఽపి క్వచి ద్భవః ।
క్వచి త్స్యా దుత ఈదిచ్ఛ యణ్వా న్యస్మి న్న యణ్మతః ॥
స్వరూపత స్సమాస స్స్యా ద్వికారస్య శ్రుతావపి।
క్వచి దన్తిమవర్ణస్య సమాసే స్యా త్పరిగ్రహః॥
క్వచి ద్భేద న్తతాయాం తు స్యా దవ్యయసమస్థితిః।
క్వచి దాద్యవికారస్తు సమాసే స్యా ద్విరోధకృత్ ॥

గ్రామనామ్నోఽపి మోః పుస్త్వ్యత్సమాస ఇతిభావుకాః॥ సోమత ఇతి:-సంస్కృత మధ్యేఽపి సమాస ఇష్ట ఇత్యర్థః. 'స్వామిద్రోహరగండలాంఛనుఁడు, పేషణీహాను మంతబిరుదాంకుఁడు, సాహిత్తమల్లుఁడు, జగనుబ్బగండఁడు' ఇత్యాది బిరుదశబ్దేషు వక్తృయదృచ్ఛాతో వర్ణానాం కల్పనా. నానావటీరసేనామానభేదసుండును—ఇత్యాదౌ మానుష్యశబ్దానాం ప్రయోగః. "మాగంటిపట్టణమహేశ మహం భజామి' 'మాగంటి పట్టణంబున నేఁ గంటి నశేషదైవతేశు మహేశున్, వాగమడుగుంబురీశుని" ఇత్యాదౌ వర్ణవికారోఽపి. క్వచి దిత్యుక్తేః "మాగల్లుపట్టణమహేశమ్" ఇత్యాదికమపి జ్ఞేయమ్. క్వచిదీత్వ ఇత్వేచ 'మానూరిపట్టణవరే మహితోఽస్తి యజ్వా'- 'మానూరీ పట్టణంగతః' ఇత్యాది. క్వచిదిత్యుక్తేః 'మానూరుపట్టణవరే' ఇత్యాదికం రూపంచ జ్ఞేయమ్. యణాదేశే "మానూర్యన్వయవర్ధన" ఇత్యాదిరూపమ్. ఇకారే పరే సవర్ణ దీర్ఘే 'మానూరీతి పురీ బభౌ' ఇతి. అన్యస్మిన్నాన్ధ్రపదే పరేతు న యణాదేశః. "రాజ త్యహోఽత్రోదనియమ్మభూపః" ఇతి. "ఆత్మవత్సర్వభూతాని యనెడినీతి"-ఇతి శ్రీనాథః. అతఏవ పద్భావేష్వితి సుబన్తస్య ఇతిశబ్దేన అనుకరణే యణాదేశ ఏవ. స్వరూపత ఇతి సంహితాయాం వర్ణవికారస్య శ్రుతావపి స్థానివర్ణేనైవ సమాసః. 'మాగంటిపట్టణ' మిత్యత్ర మాగల్లురితి పట్టణ మిత్యుదన్తేనైవ సమాస స్సర్వత్ర జ్ఞేయః. అతఏవ "కనువసేనివంశకమలినీహితోదయా" ఇత్యాదౌ 'డు' వర్ణకేనైవ షష్ఠీతత్పు రుషః. నచ వైకృతపదా ద్విభక్త్యుత్పత్తి ర్విరుద్ధా. కవిశిరోమణిభి స్తథాఽఙ్గీకా రాత్. తథాహి- "వితేను రింగాలమి వాయశః పరే" ఇతి శ్రీహర్షః. ఇంగాల శబ్దో దేశ్య ఇతి వ్యాఖ్యాతారః. "విషయమృగతృష్ణాఝులఝుల్యా"మితి మురారిః. ఝులఝులీశబ్దః ప్రవాహపర్యాయో దేశ్య ఇతి తట్టీకాకృతో హరిహరనాథచరణా దయః. "అధికొండవీడురిపవో నిపాతితాః" ఇతి. "అధికభుజబలాత్తా న్గ్రహీత్కొండ వీడా" ఇతి కల్పద్రుమే కవితాపితామహః. అన్యేపి శబ్దా బహవః కవిభి రంగీకృతాః. అతఏవ వామనేనోక్తమ్- "అతిప్రయుక్తం దేశభాషాపద" మితి. ప్రత్యయాకృత్యా వర్తమానస్యాపి క్వచి దన్త్యవర్ణస్య సమాసే సుబన్తత్వేన గ్రహణమ్. "జమ్మలవంశ సంభవుఁడు, గుజ్జమువంశపావనుఁడు", ఇత్యాది. ఏతాదృశప్రయోగే జమ్మలాదిశబ్దా అదాద్యన్తత్వేన గ్రాహ్యాః క్వచిద్గ్రామనామ్న ఏదన్తత్వే సత్యన్వయరీత్యా సమాసే గ్రహణమ్. "రేపల్లెనామనగరీ న గరీయసీ కిమ్" ఇతి చిత్రమయూరనాటకాదిస్థితాని కవివచనాని. క్వచిత్సమాసే నాన్ధ్రవర్ణవికారః. "కనువరాజవంశజలధి కౌస్తు భాఖ్యేతోదయా" ఇత్యాది తత్రోదాహరణమ్. నత్వత్ర 'కనువరాజువంశ'

ఇత్యుక్తి స్సమ్మతా. "శబ్దానామపీ"త్యపి శబ్దేన గల్లాదిశబ్దస్యాపి ప్రయోగానుజ్ఞా జ్ఞాయతే. తేన "అనుకేలపణితయాచ్ఛాన్నర్థగల్లచపేటము" ఇత్యాదికవివచనానాం ప్రామాణ్య మవ్యాహతమ్. ప్రాకృతవ్యాకరణే గణ్డశబ్దస్థితస్య బిన్దుయుక్తడకారస్య ద్విత్వేలకారో నిపాత్యతే "కొల్లాపురపుక్రిఁగొలిచినాఁడ" ఇత్యాదికం ప్యాదేశ ఉదాహరణమ్. అపిశబ్దాత్ క్వచిత్ "గుఱ్ఱపుదళములు" - ఇత్యాదికమపి రూపమ్.

వి :- గ్రామమనుష్యాదులసామర్థ్యాదులను స్తుతించుసంజ్ఞలలోని యక్షరములవ్యత్యాసమును వక్త తనయిష్టానుసారముగా నిల్పనగును. అట్టివానియందు వ్యుత్పత్తి సరిపడకున్నను క్షతిలేదు. అట్టిలక్షణాతిక్రమ వర్ణవ్యత్యాసములు గలవ్యుత్పత్తిరహిత మగుబిరుదరూపభాషాంతర శబ్దములకును, సిద్ధసమాసమునుసమకూర్చుట కవిసమ్మతమగును. ఇచటి గ్రామశబ్దమునుమష్యాదిశబ్దములకును పలక్షణము, ఇతరభాషలలోనిసంజ్ఞ లనుకృతములై సంస్కృతమునందు వాడఁబడునపుడు వానియం దాంధ్ర భాషాసహజము లగువిభక్త్యవిభక్త్యాదిసమ్మేళనము సిద్ధసమాసముల యందుఁ గల్గినఁ గల్గవచ్చునని యర్థము. అట్టివికృతియే విస్తరింపఁబడు చున్నది. ఒకచో నామముతుది 'ఉ'కారము నకీకారేకారములును, యణా దేశమును, గల్గును. అచ్చికపదాద్యచ్చు పరమగునపుడు యణాదేశము సమ్మతము కాదు. ఆంధ్రవికారము వినఁబడుచున్నను నది లేనిరూపము తో సమాసము చేయవచ్చును. ఒకప్పుడు పదాంతమందుండెడి మువర్ణ కాదిప్రయోగమును సిద్ధసమాసమున సంభవింపవచ్చును. ఒకప్పు డేదంతత కలదాని కవ్యయముతో సమాసము కలుగుస్థితి కలుగవచ్చును. ఒక ప్పుడు సిద్ధసమాసమునం దాంధ్రభాషాసహజ మగువికారము కవిసమ్మ తికి విరుద్ధము కాకపోవచ్చును-" అని భవేద్విరుద...స్యాద్విరోధకృత్ - అనుసథర్వణగ్రంథమున కర్థము. "నానావజీరసేనామానభేదనుండు" - అనునది బిరుదశబ్దము. బిరుదశబ్దములలో యథేచ్ఛముగా వక్త వర్ణకల్ప నమును జేయవచ్చునని యథర్వణుఁడు చెప్పుటచే సంస్కృతసిద్ధసమాస మధ్యమున 'వజీర'అనునన్యదేశ్యపదము ప్రవేశించినది. గ్రామమానుష్య

బిరుదశబ్దములకు సమాసమును గల్పింపనగుననుటచే "స్వామిద్రోహర గండలాంఛనుఁడు, పేషణీహనుమంతబిరుదాంకుఁడు, చౌహత్తమల్లుఁడు, జగనొబ్బగండఁడు, మున్నగుసమాసములు సిద్ధించును. మఱియు "మాగంటిపట్టణాధిపేశ మహం భజామి, మాగంటిపట్టణంబున నేఁగంటి నశేషదైవతేశు మహేశున్, వాగెముడుగుంబురీశుని" మున్నగువాని యందు 'ంటి' 'న్' మున్నగునౌపవిభక్త్యాదికవికారము కలిగినది. 'ంటి, న్' అనునవి సిద్ధసమాసమధ్యమునఁ జేరి వర్ణవికృతిని గల్పించినవి. "మానూరిపట్టణవరే మహితోఽస్తి యజ్వా, మానూరీపట్టణం గతః," అనువానియందు ఇ–ఈ–అనువర్ణముల వికార మగపడుచున్నది. 'మానూర్యన్వయ' అనుచోట యణాదేశమును గల్గినది. 'మానూరు'అనునది గ్రామనామము. గ్రామములనామము లన్నిభాషలయందు నొక్క రీతినే యుండి తత్తద్భాషానుగుణవిధుల నొందుట స్వాభావికము. అట్లు పొందకయు నుండవచ్చును. "మానూరీతి పురీ బభౌ"–అనునపుడు సవర్ణదీర్ఘము వచ్చినది. యణాదేశము కొన్నియెడల వచ్చును; కొన్నియెడల రాదు–అని "అన్యస్మిన్ న యణ్మాతః" అనునథర్వణవచనము చెప్పుచున్నది. "రాజ త్యహోఽద్రోదనియమ్మభూపః" అనుచోట యణాదేశము రాలేదు. "ఆత్మవత్సర్వభూతాని యనెడునీతి" అనుచో ననుకరణమున యణాదేశసంధి రాలేదు. యడాగమము వచ్చినది. "సద్భావేప్సితి" అని ఇతిశబ్దానుకరణమున యణాదేశము కలిగినది. సమాసమునందు వర్ణవికార మగపడినను శబ్దస్వరూపముతోడనే సమాస మిష్టపడునని చెప్పుటచే "మాగంటిపట్టణ"మ్మనునపుడు మాగల్లు అనుపట్టణ మనియే విగ్రహము చెప్పవలెనని భావము. "కసువ నేఁడువంశకమలినీహితోదయా" అనుచోట 'కసువనేఁడుయొక్క వంశ మనుకమలలతకు హితమైన ఉదయము కలవాఁడా' యనియర్థము. ఇట్టి చోట డువర్ణకముతోడనే విగ్రహము చెప్పనగునని యథర్వణవచనము చెప్పుచున్నది. కసువనేఁడు అనునది వికృతిపదము గదా. దీనిపై 'ను'

ప్రత్యయము పుట్టుట విరుద్ధము కాదా యని శంకింపరాదు. "వితేనురింగాలమి వాయుః పరే" అని శ్రీహర్షుఁడు ప్రయోగించినాఁడు. ఇంగాలశబ్దము దేశ్యమని వ్యాఖ్యాతలు చెప్పిరి. అది ప్రాకృతదేశ్యము. ప్రాకృతదేశ్యము సంస్కృతమునందుఁ బ్రయోగింపఁబడుట యాశ్చర్యము. సుబంతముమీఁద మరల సుప్రత్యయ ముండరాదనునది శాస్త్రసంప్రదాయము. కాన "కనువనేఁడు" అనునది దీని కుదాహరణము కానోపును. ఇంగాలాదిశబ్దఘటితవాక్యము లిందుల కుదాహృతులు కావు. 'ఇంగాలమివ, విషయమృగతృష్ణాఝలఝల్యాం' అనుచోట్ల 'ఇంగాల-ఝలఝలీ' అనుప్రాకృతదేశ్యశబ్దములను సంస్కృతసమాసములలోఁ గవు లుపయోగించియున్నారనుట లెస్స. ఇట్లే కేవలసంస్కృతపదములను దెనుఁగున సమాసములలో నుపయోగించుట తప్పుకాదని కవులయభిప్రాయము కానోపును. "అధికొండవీడురివవో నిపాతితాః" అధికభుజబలా త్తా న్నగ్రహీం త్కొండవీడా" అను సంస్కృతవాక్యములలోఁ 'గొండవీడు'పద ముపయోగింపఁబడినది. అది తెనుఁగుదేశ్యము. ఇట్టి వెన్నో గలవు. "దేశభాషాపదము సంస్కృతమునం దధికముగాఁ బ్రయోగింపఁబడినది"- అని వామనుఁడు నుడివియున్నాఁడు. 'జమ్ములవంశసంభవుఁడు, గుజ్జమువంశపావనుఁడు' మున్నగుచోట్ల నున్న 'ల, ము' అనునవి ప్రత్యయాకారముతో నున్నవర్ణములు. వీనితో సంస్కృతపదమునకు సమాసము. 'జమ్ముల, గుజ్జము' అనువానిని అకారోకారాంతములుగా గ్రహింపనగును. "రేపల్లెనామ నగరీ న గరీయసీ కిమ్' అనుచోట రేపల్లె యను నేదంతనామమును గ్రహింపనగును. ఇది 'వ్రేపల్లె' అని యుండనగును. కొన్నియెడల "కనువరాజవంశజలధికౌస్తుభాంచితోదయా" మన్నగుసంస్కృతసమాసములలో నాంధ్రవర్ణవికార మగపడదు. ఇట 'కనువరాజు' అనియుండుట సమ్మతము. "అనువేలమణితయాచ్ఛ్నాఢగల్లచపేటంబు" అనుదానియందలి 'గల్ల'శబ్దము గండశబ్దపర్యాయమని ప్రాకృతవైయాకరణులు

చెప్పుదురు. "కొల్లాపురపుశక్తిఁ గొలిచినాఁడ" మన్నచోట్లఁ బుంప్వాది వికారము కలిగినదని తెలియనగును. కొల్లాపురముశక్తి యనియు నుండనగును. ఇట్లే 'గుజ్జుపుదళములు, గుజ్జుముదళములు' మన్నగునవి.

205. సూ. 9 :– "సమాసయుగ్భవే దాద్య ఆత్మాదికవిభక్తిగః" తనధర్మవిభవము, నాబుద్ధిపాటవము, నీమహోదారత, ఈగుణసంపద, వెలిదమ్మికంటిపాదపద్మములు, రామునిపాదభక్తిసరసంపుభాషణములు, అచ్చోటిబంధుజనములు, నీయందలిసద్గుణములు, రాజమహేంద్రవరపువిద్వద్గణంబు, "తనధర్మవిభవసంతతసంస్తవామోదపరిపూర్ణులగుమహీసురులు కొలువ" ఇత్యాద్యాకారేణ సమాసో న కార్యః. వికారేతు 'సంస్తవప్రీతిఁ బరిపూర్ణులైనభూసురులు కొలువ" ఇత్యాద్యాకారేణ సమాసస్సాధురేవ. "ఆనారాయణపాండవేయగుణమాహాత్మ్యములజ్యోత్స్న" ఇత్యాదివచనమాచార్యస్య.

వి :– 'విభక్త్యంత మగునాత్మాదికశబ్దము సంస్కృతసమాసముతో మేళనముఁ జెందును' అని "సమాసయుగ్భవేత్" అనుదాని కర్థము. 'తా–నీ–నా' మున్నగుశబ్దము లాత్మాదికశబ్దములు. 'తనధర్మవిభవము, నాబుద్ధిపాటవము, నీమహోదారత, ఈగుణసంపద' అని సంస్కృతతత్సమములతో నాత్మాదికశబ్దములు సమాసము నందుచున్నవి. "వెలిదమ్మికంటిపాదపద్మములు" ఇది మిశ్రసమాసము. 'రాముని పాదభక్తి' ఇది సాధ్యసాంస్కృతికము. 'సరసంపుభాషణములు' పుంప్వాదివికారసహితసాధ్యసాంస్కృతికసమాస మిది. అచ్చోటిబంధుజనములు" ఇందు "ఇచ్ఛ విభక్త్యంతిమస్య' అని ఇదాగమము వచ్చినది. 'నీయందలిసద్గుణములు' ఇందు 'నే రలిచ' అని అలిగాగమము వచ్చినది. 'రాజమహేంద్రవరపువిద్వద్గణంబు' గ్రామనామముయొక్క 'ము' వర్ణమునకుఁ బుంప్వాదేశము. "తనధర్మవిభవసంతతసంస్తవామోదపరిపూర్ణులగుమహీసురులు కొలువ" అనురీతిని సమాస ముండరాదు. దీనిలో 'తన' అనుదానికి సమన్వయము లేదుగాన "తనధర్మవిభవసంతతసంస్తవప్రీతిఁ బరిపూర్ణులైనభూసురులు కొలువ" అనురీతినిఁ బఠించి

నచోఁ 'దన' యనుదాని కన్వయము పొందుపడును. "ఆనారాయణ పాండవేయగుణమాహాత్మ్యమలజ్యోత్స్న" అని యాచార్యప్రయోగము.

**206.** సూ :- షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్.

206 సూ :- నామ్నాం తత్పురుషసమాసే యా షష్ఠీ సా ద్వితీయాతుల్యా స్యాత్. 'రాముని గుణములు, రాముగుణములు, రాములగుణములు, విష్ణురాణి, కవినేర్పు, శంభునిచెలువ, వనముదగ్గఱ, కొండలరాయఁడు, ఇత్యాది. రాముగుణములు ఇత్యాదౌ విభక్తిలోపేఽపి నోత్వస్య నివృత్తిః. అకృతవ్యూహపరిభాషాయా అనిత్యత్వాత్. తత్ర మానమ్ "న బహువ్రీహౌ" ఇత్యాదికమ్. తేన "అతిక్రాన్తోభవ క్తమతిభవకాన్" ఇత్యాదిసిద్ధ మితి శాబ్దికాః. "స్వస్వవిభక్తివికారై ర్బహవశ్చ యథాయథం సమస్యన్తే" ఇత్యనుశాసనా ద్యథేచ్ఛం సంస్కృతాన్ధ్రయో స్సమాసః.

వి :- షష్ఠీ, భవేత్, ద్వితీయాతుల్యా, తత్పురుషసంస్థితా, నామ్నామ్–అని ఛేదము. తత్పురుషసమాసమునఁ బ్రాతిపదికముమీఁద నుండుషష్ఠికి ద్వితీయావిభక్తితోఁ దుల్య మగురూపము కలుగునని యర్థము. 'రామునియొక్క+గుణములు' అనుచోనున్న 'యొక్క' ప్రత్యయమునకు ద్వితీయావిభక్తితుల్యరూపము కలిగి 'రామునిన్+గుణములు' అని యేర్పడి "ద్రుతస్య సర్వత్ర లు క్సమాసేషు" అనుచోప్పున ద్రుతము లోపింపఁగా 'రామునిగుణములు' అనియగును. ఇట్లే రాములయొక్క+గుణములు=రాములగుణములు మున్నగునవిసిద్ధించును. విష్ణుయొక్క+రాణి =విష్ణురాణి, కవియొక్క+నేర్పు=కవినేర్పు, శంభునియొక్క+చెలువ=శంభుచెలువ, వనముయొక్క+దగ్గఱ=వనముదగ్గఱ, కొండలయొక్క+రాయఁడు=కొండలరాయఁడు మున్నగురీతిప్రక్రియతో నీరూపము లన్నియు సాధువు లగుచున్నవని యెన్నవలెను. 'రాముగుణములు' మున్నగుచోట్ల 'ఉ'త్వమునకు నిమిత్తమైన 'యొక్క' అనువిభక్తిప్రత్యయము లోపించినప్పటికిని నుత్వలోపము రాకుండుటకుఁ గారణము "అకృతవ్యూహపరిభాష యనిత్యత యే" యని కవిశిరోభూష

ణము వచించినది. కాని తెనుఁగునందట్టివి వర్తింపవు. "అకృతవ్యూహాః పాణినీయాః" అనుపరిభాష పాణినీయులకే వర్తించునని యందే కలదు గదా. "మహాతోఽత ఉద్విభక్తౌ" "మహతస్స్వద్రుజనితో భవేత్స్వంసి" అనునది కారికార్థమైనప్పటికిని రెండువాక్యములతోఁ గారికార్థ మేర్పడిన దనియు, నవి రెండుసూత్రము లనియు నూహింపవలెను. ఆకారణముచే నవి సన్నియోగశిష్టములు కావు. ఉత్వము ప్రాతిపదికకార్యము. దుజ్జు పరకార్యము. కావున నివి సన్నియోగశిష్టము లగుటకు వీలు లేదు. సమాసమునందుఁ బ్రాతిపదికము నిలుచుట సహజము కాన 'రాముగుణములు' అనియుండుట కెట్టివిప్రతిపత్తియు లేదు. మొదట 'రామ+జస్' అనియుండఁగా నుత్వము వచ్చును. పిమ్మట జస్సుయొక్క ఆదేశమైయుది లోపించును. కావునఁ బై శంక కవకాశము లేదు. అనేకములైనశబ్దములు తమతమ విభక్తులతోను విభక్తివికారములతోను గూడినవై యథేచ్ఛముగా సంస్కృతము లాచ్ఛికములతోడను, నాచ్ఛికములు సంస్కృతములతోడను సమసించుచున్న' వని 'స్వస్వవిభక్తి' అనుదాని కర్థము.

**207. సూ :—** ఇదుపోత్తమోత్తమానాం బహువచన ఉపోత్తమేత ఉద్భవతి.

207 సూ :– ఇకారఉత్తమే ఉపోత్తమే చ యేషాం తే ఇదుపోత్తమోత్తమాః శబ్దాస్తేషా ముపోత్తమేతో బహువచనే ఉకారాదేశ స్స్యాత్. "అన్త్యాక్షరాత్పూర్వ మక్షర ముపోత్తమమ్"-ఇతి సంస్కృతవ్యాకరణసంజ్ఞా. బలిమి, కలిమి, చెలిమి, వెలిమి, మేలిమి, తాలిమి, ఏలిమి, పోఁడిమి, వేడిమి, కలికి, ములికి-ఇత్యాద్యా ఇదుపోత్తమోత్తమా శ్శబ్దాః. తేషాం బహువచనే బలుములు, కలుములు-ఇత్యాదీని రూపాణి.

వి :– ఇదుపోత్తమోత్తమానామ్, బహువచనే, ఉపోత్తమేతః, ఉత్, భవతి—అని ఛేదము. మూఁడుగాని, యంతకంటె నధికముగాని వర్ణములు గలశబ్దములలోఁ దుదివర్ణమున కుత్తమ మనియు, దానికి ముం

దున్నవర్ణమున నుపోత్తమునియుం బేర్లు. ఉపోత్తమోత్తమములలో నున్న ఇకారమునకు బహువచనము పరమగునపు డుత్వము వచ్చునని సూత్రార్థము. కలిమి, కలుములు, మున్నగునవి యుదాహృతులు. బలిమి =దేహబలము. కలిమి=సంపద. చెలిమి=స్నేహము. వేలిమి=హోమము. ఏలిమి=పాలించుట. తాలిమి=క్షమ. మేలిమి=ఆధిక్యము. పోఁడిమి=ఒప్పిదము. వేడిమి=తాపము. కలికి=అఁదుది. ములికి=బాణము మున్నగువానిరూపములను దీనిచే సాధించుకొనవలయును. (చూ. బాల. తత్సమ. 46,47. సూ)

208. సూ :- అస్మద్యుష్మద్వాచ్యా దేకత్వ ఇతో నివీ.

208 సూ :- అస్మద్యుష్మదర్థా దికారాన్తా శ్శబ్దా దేకత్వే క్రమాత్ 'ని-వి' ఇత్యేతౌ స్తః. నేను కవిని, నీవు కవివి, ఇత్యాది. "ఇలోఽస్మద్యుష్మదర్థా త్స్యా న్నామ్నో నిర్విశ్చ వా క్వచిత్" ఇత్యథర్వణః. తేన "నే మహాకవి వచ్చితి నిన్నుఁ జూడ" ఇత్యాది సిద్ధమ్.

వి :- అస్మద్యుష్మద్వాచ్యాత్, ఏకత్వే, ఇతః, నివీ-అని ఛేదము. అస్మద్యుష్మద్వాచ్యమనఁగా నస్మద్యుష్మద్విశేషణము లగునికారాంత శబ్దములకుఁ బరముగా నేకవచనమునందు వరుసగా 'ని-వి' అనునవి యగునని యర్థము. అస్మద్విశేషణవాచకప్రథమాంతముపైని 'ని' అను నదియు, యుష్మద్విశేషణవాచకప్రథమాంతముపైని 'వి' అనునదియు నిల్చునని యర్థము. నేను రవిని, నీవు రవివి, 'రవిని' అనుదానితుది స్వరము కవిభల్లటసూత్రముచే వికల్పముగా లోపించినప్పు డిది 'నేను రవిన్' మున్నగురూపముల నందును. స్వరలోపానంతర మివి ద్రుత ప్రకృతికము లగును. "అస్మద్యుష్మదర్థకవిశేషణము లగునికారాంతపద ములతుది నున్నయికారమునకుఁ బరముగా నివర్ణక వివర్ణకములు వచ్చును. అవి క్వాచిత్కముగా వచ్చును. తచ్ఛబ్దానుప్రయోగము లేని వానికి మాత్రమే యివి వచ్చును. 'న, ము, వు, రు' అనునవి ద్రవ్య గుణవాచకవిశేషణములకును, క్రియాజన్యవిశేషణములకును బరముగా

నిల్చును. పైని వివరించినరీతిని యుష్మదస్మద్విశేషణములకు వచ్చెడి ని-వి-ను-ము-వు-రు- అను ప్రత్యయములు కొన్నియెడల వికల్పముగా నగును" అని "ఇతరోఽన్యత్" అనునథర్వణకారిక కర్థము. "నే మహాకవి వచ్చితి నిన్నుఁజూడ" అనున దుదాహరణము. (బాల. కారక. 33, 34. సూ. (ప్రౌఢ-కారక. 27. సూ.)

**209. సూ :- పరేషాం తు ధర్మోత్తమమధ్యమవత్.**

209 సూ :- ఇకారాన్తవ్యతిరిక్తనామభ్యస్తద్ధర్మే యథా ఉత్తమమధ్యమపురుషార్థకవర్ణకౌ తావేవ స్తః ఏకత్వే క్రియాపదానాం. భూతాద్యర్థత్రయ వ్యతిరిక్తస్తద్ధర్మ సంజ్ఞికోఽర్థః. నేను భక్తుఁడను, నీవు దేవుఁడవు, ఇత్యాది. ఉత్వాయుతావిత్యాదినా 'ను, వు' వర్ణకయో ర్విధానం జ్ఞేయమ్. ఉన్నతుఁడైన నహుషుపుత్రుఁడఁ బూరుఁ డనః మధ్యమలోకేశ్వరుజనకుండ యయాతి యనఁగఁ బరఁగినవాఁడన్" ఇత్యాదిశబ్దానుశాసనవచనాదల్లోపో ద్రుతప్రకృతికకార్యంచ సిద్ధ్యతీతి జ్ఞేయమ్." పాండుభూవరునకుఁ గోడలైతిన్" ఇత్యాదివచనస్త్వనాకరమేవ.

వి :- పరేషాం, తు, ధర్మోత్తమమధ్యమవత్ -అని ఛేదము. ఇకారాంతములు కానినామములకంటెఁ బరముగాఁ దద్ధర్మార్థమునందలి యుత్తమపురుషబోధకప్రత్యయ మేకవచనమున వచ్చును. మధ్యమపురుషబోధకప్రత్యయము బహువచనమున వచ్చును. భూతాద్యర్థత్రయవ్యతిరిక్తకాలవిశేషమే తద్ధర్మ మనిపించుకొనును. "ఉత్వాయుతౌ వనకారౌ స్యాతాం మధ్యోత్తమైకవచనానామ్" అనుచోప్పున 'వు, ను,' అను ప్రత్యయములు మధ్యమోత్తమపురుషైకవచనమునకు వచ్చునని యర్థము. 'నహుషుపుత్రుఁడన్, జనకుండన్, పరఁగినవాఁడన్ అనునవి ఉత్తమపురుషైకవచనమున కుదాహరణములు. 'నహుషుపుత్రుఁడు +ను' అనియుండఁగా డకారోకారమున కకారము గలిగి 'నహుషుపుత్రుఁడను' అని యగును. నువర్ణస్వరము లోపించి ద్రుతకార్యముఁ జెందినచో 'నహుషుపుత్రుఁడఁ బూరుఁడ' అనురూప మేర్పడును. అట్లే జనకుఁడన్, పరఁగినవాఁడన్, మున్నగునవి. 'పాండుభూవరునకుఁ గోడ

లైతి' అనుచోట 'కోడలు' శబ్దము ఔపవిభక్తికము గాన 'కోడలినైతి' యని యుండవలయును. అట్లుండ లేదు గాన నిది నిర్మూల మగుచున్నదని కవిశిరోభూషణాభిప్రాయము. ఔపవిభక్తిప్రత్యయము రానపుడు 'కోడలన్ + ఐతిన్' అనియుండఁగా సంధిచేయఁగా 'కోడలైతిన్' అనురూపము సాధువే యగునుగదా! 'నీవు దేవుఁడవు' అనునది మధ్యమపురుషవిశేషణమున కుదాహరణము.

**210. సూ :— బహుషు న మధ్యమవత్.**

210 సూ :— ఇదన్త్వాదినామ్నాం సర్వేషాం బహుత్వేతు న మధ్యమవత్ మధ్యమపురుషవ న్న భవతి. కిన్తు ప్రథమోత్తమపురుషవ త్కార్యం భవతీత్యర్థః. ఇదన్త్వాద్బహువచనే ప్రత్యయ స్యానుక్తే ర్బహుష్విత్య త్రేకారాన్తస్యాపి గ్రహణమ్. "సర్వేషాం బహువచనే 'రు' ఇతి స్యా న్మధ్యమస్యతు భవే న్మః" ఇతిసూత్రోక్త ప్రకారేణ 'రు, ము' ఇత్యేతౌ వర్ణకౌ స్త ఇత్యర్థః.

వి :— బహుషు, న, మధ్యమవత్ —అని ఛేదము. 'నేను, నీవు' అనుశబ్దములవిశేషణముల కేకవచనమునం దికారాంతములకు వరుసగా 'ని, వి' అనునవి వచ్చుననియు నికారాంతేతరము లగువిశేషణములకుఁ దద్ధర్మార్థకోత్తమమధ్యమపురుషములకు వచ్చుప్రత్యయము లగు ననియుఁ జెప్పఁబడినది. ఇఁక బహువచనమునందు మధ్యమపురుషము వంటిది రాదనఁగా బహువచనప్రత్యయమువంటిది 'రు' అనునది యుష్మచ్ఛబ్దవిశేషణముననూ, నస్మచ్ఛబ్దబహువచనప్రత్యయము 'ము' వంటిది యస్మచ్ఛబ్దవిశేషణబహువచనమునను నగునని యర్థము.

**211 సూ. :- ఉతోఽచ్చ సర్వేషు.**

211. సూ. 1 :- అన్త్యోకార స్యాత్స్యాత్ 'ను, ము, వు, రు' ఇత్యేతేషు వర్ణకేషు సర్వేషు. సర్వేష్వితి సర్వశబ్దస్వారస్యా త్క్రియా స్వప్యుతోఽత్. మేము భక్తులము, మీరు దేవతలరు; మేము కవులము, మీరు దాతలరు. "కోవిదులు గారు" ఇతి కవితాపితామహోక్తిస్తు నిర్మూలైవ. సూత్రేఽస్మచ్ఛబ్దస్య పూర్వనిర్దిష్టత్వ మవివ

క్షితవమితి యుష్మచ్ఛబ్దాదేవ ప్రథమపురుషవర్ణక ఇతి ధ్యేయమ్. ఆచార్యప్రబన్ధేషు ప్రయోగశ్చాత్ర మానమ్. సుతింపుచున్నాఁడను, పోషింపుచున్నాఁడవు' ఇత్యాది. ఉభయార్థవాచిత్వాన్మన శబ్దస్య 'మనము భక్తులము' ఇతి రూపమ్. "ఉభయార్థే విశేష్యే తు భేదకాత్స్యాన్ముమవర్ణకః—ఇత్యథర్వణోక్తేః.

వి :- ఉతః, అత్, చ, సర్వేషు - అని ఛేదము. "ను, ము' 'వు, రు' అనుప్రత్యయములు పరమగునపుడు పూర్వమందున్న ఉకారమకారమగునని సూత్రార్థము." అస్మద్యుష్మదుభయవాచకమగు 'మనము' అనునది విశేష్యమగునపుడు దానివిశేషణమునకుఁ బరముగా 'ము' అను ప్రత్యయము వచ్చును" అనునథర్వణవచనముచొప్పున 'మనము భక్తులము' మున్నగునవి సాధువులగుచున్నవి. దీనింబట్టి అన్యయుష్మదస్మత్సహయోగమున నుత్తరోత్తరము బలీయమగునని విశదమగుచున్నది. 'వాఁడును, నీవును, నేనును బండితులము—మున్నగుచోట్లఁ జివఱనున్న యుత్తమపురుషసర్వనామకార్యమే కలుగుట యిందులకు నిదర్శనము. ఇది పురుషవిషయమున నిత్యమును, వచనవిషయమునఁ బాక్షికము నగునని తెలియనగును. కర్తృబహుత్వమున బలిష్ఠ మగుపురుషమునందు బహువచనము నిల్చుటయు, యుష్మదస్మదన్యతరసంబంధివచనము నిల్చుటయు జరుగును. 'నేనును నీవును బండితులము' ఇం దస్మత్పురుషము బలీయము కావునఁ దత్కార్య మగుమువర్ణకము విశేషణముకంటె వచ్చినది. 'వాఁడును, నీవును బండితులరు. వాఁడును, నీవును, నేనును బండితులము. వజ్రము, నీవును, బిడికిటితాకున నోరఁగుదువు. ఏనును నాదళమును బెనఁగెదము; లేక బెనఁగెదను' మొదలైనవి.

211. సూ 2. :— నను భూతాద్యర్థత్రయాతిరిక్తస్య స్వార్థస్య తద్ధర్మసంజ్ఞకత్వేన 'ఘటింతు మనిశము'ఇత్యాదౌ సన్ధిర్న స్యాత్. "నస్యాత్తద్ధర్మత"ఇతి నిషేధాదితి చేత్తత్ర ప్రథమోత్తమపురుషైకవచనద్వయమేవ గృహ్యతే నాన్యత్; ప్రయోగవిరోధాత్.

"ప్రథమశ్చోత్తమశ్చైవ తాను తద్ధర్మసంజ్ఞకా ।
భూతాద్యవిషయా తత్ర చైకత్వార్థాభిధాయకా ॥

ఉదన్తాచ సదా నాన్తా న సన్ధి స్తత్ర కల్ప్యతే ॥
ఇత్యథర్వణభాషితాచ్చేతి న సన్ధి స్తత్ర దోషాయేతి జ్ఞేయమ్.

వి :- భూతాద్యర్థత్రయాతిరిక్త మైనస్వార్థమునకే తద్ధర్మసంజ్ఞ యుండుటచే 'ఘటింతుము+అనిశము=ఘటింతు మనిశము' అనునపుడు 'ఘటింతుము' అనునది తద్ధర్మార్థకక్రియారూప మగుటచే 'నస్యా త్తద్ధర్మోఽచి' అనుసూత్రముచే సంధి రాకుండవలసియున్నది. కాని యథర్వణునిమతమునఁ బ్రథమోత్తమపురుషైకవచనద్వయమునకే తద్ధర్మసంజ్ఞ గలదనియు, దానికే సంధి రాదనియు గ్రహింపఁబడినది. "తద్ధర్మక్రియలలోఁ బ్రథమోత్తమపురుషము లగునట్టియు, భూతభవిష్యద్వర్తమానములకు విషయము కానట్టియు ద్రుతప్రకృతికములైన 'చేయుడున్, చేయుదున్' అనునుత్తమప్రథమపురుషైకవచనములు రెండుమాత్రమే "నస్యా త్తద్ధర్మోఽచి" అనుతద్ధర్మపదముచే గ్రహింపఁబడుచున్నవి. వాని కచ్చుపరమగునపుడు సంధి రాదు—'అని ప్రథమశ్చోత్తమశ్చైవ' అనునథర్వణవచనమున కర్థము. కావున 'ఘటింతు మనిశము' అనుచోట సంధి వచ్చుట విరుద్ధము కాదు. ఈయథర్వణవచనము 'నస్యా త్తద్ధర్మోఽచి' అనుచింతామణికి వివరణమని తెలియవలెను.

## 212 సూ :- సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా.

212 సూ. 1 :- ప్రథమాదికా సర్వా విభక్తిః సంస్కృతతుల్యా భవతీత్యర్థః. సంస్కృతవ్యాకరణే ప్రాతిపదికేత్యాదిసూత్రై ర్యత్ర యా విభక్తి ర్విహితా సా విభక్తి రత్రాపి భవతీత్యర్థః. కృష్ణుఁడు, శ్రీ, జ్ఞానము, ఇత్యాదౌ ప్రథమా. రాము భజింతున్, తృణము త్యజింతున్, ఇత్యాదౌ ద్వితీయా. గోవులఁ బాలు పితికెన్, ఇత్యాదౌ ద్వికర్మకద్వితీయా. 'వివక్షాతః కారకవిభక్తయః' ఇతి భాష్యకారవచనాత్, 'గోః పయో దోగ్ధి' ఇత్యాదిరూపమపి సాధ్వితి వ్యాకరణవైజ్ఞానికాః. తదనుసారేణ "గోవులవలనఁ బయస్సు పితికెన్" ఇత్యాదిరూపమపి యోజ్యమ్. మాసము వసించెన్, గోదోహమువసించెన్ ఇత్యాదా వకర్మకధాతుయోగే ద్వితీయా. "శాత్రవులఁ దివంబుఁ బొందించెన్" ఇత్యాదౌణ్యన్తయోగే ద్వితీయా. 'భృత్యునిచేత భారము వహింపించెన్'

ఇత్యాదౌ తృతీయా. 'హరి యధిష్ఠించె వైకుంఠ మనిశ మనఘ' ఇత్యాదా వాధారస్య కర్మత్వే ద్వితీయా. ఏవ మన్యత్రాపి రూపం యోజ్యమ్.

వి :- సర్వవిభక్తిః, సంస్కృతతుల్యా - అని ఛేదము. తెలుఁగునందు విభక్తులయొక్క యర్థములు ప్రత్యేకముగాఁ జెప్పఁబడలేదు. సంస్కృతవ్యాకరణమందుఁ జెప్పఁబడినవాని నిచట సరిపెట్టుకొనవలెను. ఏయేయర్థములం దేయేవిభక్తులు పాణినీయమునఁ జెప్పఁబడినవో యట్లే యవి తెనుఁగునందును వచ్చునని యీసూత్రమునుబట్టి తెలియుచున్నది. తెనుఁగునందలిసమస్తవిభక్తులును సంస్కృతమున నేయేవిభక్తులేయేచోట్ల వచ్చినవో యట్లే యాయాచోట్ల వచ్చునని సూత్రార్థము. కృష్ణుఁడు, శ్రీ, జ్ఞానము, మున్నగుచోట్లఁ బ్రథమావిభక్తి వచ్చినది. వానికి వచ్చినప్రథమావిభక్తి ప్రాతిపదికార్థమున వచ్చినది. ధాతువు ప్రత్యయము ప్రత్యయాన్తము అనునవికాక తక్కినయర్థవంతము లగుశబ్దస్వరూపములు ప్రాతిపదికములని చెప్పఁబడుచున్నవి. ఈవిషయము "అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్" అనుపాణినీయసూత్రముచే వివరింపఁబడినది. అట్టిప్రాతిపదికార్థమున "ప్రాతిపదికార్థలింగపరిమాణవచనమాత్రే ప్రథమా" అనుపాణినీయముచేఁ బ్రథమ వచ్చినది. దానికేఁ దెనుఁగునఁ బ్రథమ యగును. రాము భజింతున్, తృణము త్యజింతున్, మున్నగుచోట్ల "కర్మణి ద్వితీయా" అను "కర్తృ కర్మణి ద్వితీయా స్యాత్" అనుపాణినీయము చొప్పునఁ గర్మరూపార్థమున ద్వితీయ వచ్చినది.

"దుహ్యాచ్ పచ్ దణ్డ్ రుధి ప్రచ్ఛి చి బ్రూ శాసు జిమథ్ముషామ్,
కర్మయుక్ స్యా దకథితం తథా స్యా న్నీహృకృష్వహామ్॥"

అనువచనముచొప్పునఁ బితుకు అనుధాతువునకుఁ గర్మయోగమున్నప్పు డది యకథితమగును. అనఁగా నుక్తము కానిదగునని యర్థము. కావునఁ గథితకర్మ, అకథితకర్మ యని కర్మము రెండువిధములు. 'పితుకు' మొదలగుధాతువులతోడివాక్యమున రెండుకర్మము లుండును. దానిచొప్పున గోవులఁ బాలు పితికెన్" మున్నగుచోట్ల ద్వికర్మకత్వము కలుగు

చున్నది. గోవులవలనఁ బాలు పితికెను' అనునపుడు గోశబ్దమున కపాదాన రూపార్థమునఁ బంచమి వచ్చెను. దానికిఁ గర్మత్వమును వివక్షింపఁగా ద్వితీయ యగును. అపు డాక్రియ ద్వికర్మకక్రియ యగుచున్నది. అట్టి వియుఁ దెనుఁగునం దుండవచ్చునని యూహింపనగును. సంస్కృతమునం దకర్మకధాతువులని కొన్ని గలవు. వానికిఁ గర్మాకాంక్ష యుండదు. అట్టివి తెనుఁగునను గలవు. కాని యకర్మకధాతుయోగమునందుఁ గర్మ వాచకపదము ప్రయోగింపఁబడుట తెనుఁగునం దగపడుచున్నది. వాఁడు మాసము వసించెన్, వాఁడు గోదోహము వసించెన్' మున్నగు ద్వితీయ యకర్మకధాతుయోగమునఁ గల్గినది. 'శాత్రవుల దివంబుఁ బొందించెన్' అను ప్రేరణస్థలమునందుఁ గర్తకుఁ గర్మసంజ్ఞ గల్గి ద్వితీయ వచ్చినది. శాత్రవులు దివంబుం బొందిరి. వీరులు శాత్రవుల దివంబుం బొందించిరి. ఇట్టిచోట్ల సంస్కృతమున "గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకాణా మణికర్తా సణౌ" అను సూత్రముచే నప్రేరణార్థమునఁ గర్త యగునది ప్రేరణార్థమునందుఁ గర్మసంజ్ఞను బొంది ద్వితీయ నందుచున్నది. ఆ పద్ధతిచొప్పున 'శాత్రవుల దివంబుం బొందించెన్' మున్నగుచోట్లఁ బ్రేరణార్థమున ద్వితీయ వచ్చినది. ఈవిషయము (క్రియా-123) బాల వ్యాకరణకర్తయు వివరించెను. "హరి యధిష్ఠించె వైకుంఠ మనిశ మనఘు" ఇది 'వైకుంఠమునందు హరి యధిష్ఠించె' అనియుండునపుడు 'వైకుంఠమునందు' అనునాధారసప్తమికిఁ గర్మత్వవివక్ష చేయుటచే దానికి ద్వితీయ వచ్చి పై రూపము సిద్ధించుచున్నది. ఇట్లే మిగిలినవాని నూహింపనగును.

212. సూ. 2 :- "ఉభసర్వతసోః" ఇత్యాదిశ్లోకవార్తికప్రతిపాదితానాం 'ఉభయతః కృష్ణమ్' ఇత్యాదిరూపాణాం తత్సమభాషే నాత్రాసంభవా త్పర్యాయాన్ధ్రపదేన యోగే కారకషష్ఠీ. 'రాము నను నిర్వంకన్' ఇత్యాదిరూపమ్. షష్ఠ్యర్థ ఏవ ద్వితీయావిధానాత్. శేషత్వవివక్షాయాం తు 'రాము నిర్వంకన్, లోకముక్రిందన్, జగమునంతటన్, నీసానదుమన్, ఏవం యథాసంభవం విభక్తి రూహ్యా.

వి :— "ఉభసర్వతసోః కార్యా ధిగుపర్యాదిషు త్రిషు।
ద్వితీయాఽఽమ్రేడితాన్తేషు తతోఽన్యత్రాపి దృశ్యతే॥"

ఈశ్లోకవార్త్తికము 'ఉభయతః కృష్ణం గోపాః' మున్నగురీతిని 'ఉభయతః' మున్నగుశబ్దములతో యోగ మున్నట్టి 'కృష్ణం' మున్నగుశబ్దములకు ద్వితీయను విధించుచున్నది. ఈవార్త్తికముచే సంస్కృతమున సాధింపఁబడినరూపములు తత్సమత్వమునఁ దెలుఁగులోనికి రావు. కాని వానికిఁ బర్యాయము లగునాంధ్రపదములతోఁ గూడినవాక్యములం దాద్వితీయ రావచ్చును. దాని కుదాహరణము 'రాము నిర్వంకలన్' అనునది. సాధారణముగాఁ దెనుఁగునం దీస్థలమున షష్ఠియే నిలుచును. అది కారకషష్ఠి యగును. 'రాముని కిర్వంకలన్' అనియుండుటయే తెనుఁగుసంప్రదాయము. ఈషష్ఠి ద్వితీయార్థమున వచ్చినది. కావునఁ గారకషష్ఠి యని చెప్పవలెను. శేషత్వవివక్షలో 'రాము నిర్వంకన్' అని యుండనగును. ఇట్లే 'జగమునంతటన్, జగమున కంతటన్' మున్నగునవి తెలియనగును. 'నీనానడుమన్=నీయొక్క నాయొక్క నడిమిభాగమునందు' అని దానికర్థము. యొక్కకుఁ బ్రయోగము లేదుగాన 'నీనానడుమన్' అని కవిప్రయుక్తము కావచ్చును. ఇట్లే తక్కినవిభక్తులను గవిప్రయోగానుసారముగా నూహింపనగును.

212 సూ. 3:- 'త్రిశూలంబుచేతఁ బొడిచె నసురులన్, సురలచేతనుతింపఁబడిరయున్, రామునిచేత నొకబాణముచేత హతుఁడయ్యె వాలి' ఇత్యాదౌ తృతీయా. 'దానితో నుపమ' ఇత్యాదౌ 'తులోపమా' శబ్దయోస్సాదృశ్యపరత్వేన తృతీయాఽపి సాధురిత్యుక్తమజన్తపరిచ్ఛేదే మనోరమాయాం భట్టోజీదీక్షితచరణై స్తుల్యార్థైరితిసూత్రే. "స్వవాలభారస్య తదుత్తమాఙ్గజై స్సమం చమర్యేవ తులాభిలాషిణః। అనాగసే శంసతి వాలచాపలం పునఃపునః పుచ్ఛవిలోలనచ్ఛలాత్" ఇత్యాదిస్థలేషు సహార్థే తృతీయా. వినాపి తద్యోగం తృతీయా 'వృద్ధో యూనా' ఇతి సూత్రనిర్దేశాత్. తేన "స్ఫుటోపమం భూతిసితేన శమ్భునా" ఇత్యాదావపి సహార్థస్య గమ్యత్వేనైవ తృతీయేత్యుక్తమ్. ఏవంచ "తుల్యార్థై" రితిసూత్రేణ సర్వథా తులోపమాశబ్దయోగే న తృతీయేత్యేతద్గ్రంథాశయః ప్రతీయతే. అస్తు నామైవం బహుధా పారిప్లవం విదుషామ్. ఉభయ సూత్రే

విహితవిభక్తిస్థానే తోడవిభక్తి మభిషేచయతా మస్మాకంతు నకశ్చి దలాభఇతి కోవిదా విదాంకుర్వన్తు.

వి :- 'త్రిశూలంబుచేతఁ బొడిచె నసురులన్' మున్నగుచోట్లఁ ద్రిశూలము పొడుచుటకు ముఖ్యసాధనము గావున "సాధకతమం కరణమ్" అనుసూత్రముచే దానికిఁ గరణార్థమునందుఁ దృతీయ వచ్చినది. 'సురలచేత నుతింపఁబడియె' మున్నగుచోట్లఁ గర్త్రర్థమునఁ దృతీయ. 'రాముని చేత నొకబాణము చేత హతుఁడయ్యె వాలి' మున్నగుచోట్ల రామశబ్దమునకుఁ గర్త్రర్థమునఁ దృతీయయు, బాణశబ్దమునకుఁ గరణార్థమునఁ దృతీయయు వచ్చినవి. 'దానితో నుపమ' మున్నగుచోట్ల సాదృశ్యపరము లగుతులోపమాశబ్దములతో యోగమున్నపుడు తృతీయ రానగునని 'మనోరమ' అను గ్రంథమునం దజంతపరిచ్ఛేదమున భట్టోజీదీక్షితులవారు "తుల్యార్థైరతులోపమాభ్యాం తృతీయాఽన్యతరస్యామ్" అనుసూత్రమునఁ జెప్పియున్నారు.

"స్వవాలభారస్య తదుత్తమాఙ్గజైః సమం చమర్యేవ తులాభిలాషిణః" మున్నగుచోట్లనిది సహార్థమున వచ్చినతృతీయయే గానితుల్యార్థయోగమున నచ్చినది కాదు. "వృద్ధో యూనా" మున్నగునిర్దేశముల చేతను "స్ఫుటోపమం భూతిసితేన శమ్భునా" మున్నగుచోట్ల సహార్థయోగము లేకున్నను దృతీయవచ్చినది. "తుల్యార్థైః" అనుసూత్రముచేఁ దులోపమాశబ్దయోగమునఁ దృతీయ రాదనియే పై గ్రంథాశయమైనట్లు తెలియుచున్నది. సంస్కృతభాషావిషయమున సంస్కృతవైయాకరణులేమన్నఁ నందురుగాక! ఉభయసూత్రవిహితస్థానమునందు 'తోడ' విభక్తిని విధించుకొనెడి తెనుఁగులాక్షణికుల కెట్టినష్టము గలుగఁబోదుగదా!

212 సూ. 4 :- "గమ్యమానాఽపి క్రియా కారకవిభక్తీనాం నిమిత్తమ్" - ఇత్యుక్తేః 'పలుకులచేనేమి వికచపద్మజవదనా' ఇత్యాదౌ తృతీయా. 'ద్విజులకొంటె ముపాయన మిచ్చెన్' ఇత్యాదౌ చతుర్థీ. 'రామువలన బ్రతికితిమి, పాపమువలన భయపడితిమి' ఇత్యాదౌ పఞ్చమీ. 'రాజుయొక్క పురుషుఁడు, అతనికి సదృశుఁడు'

ఇత్యాదౌ షష్ఠీ. 'రామునకు భక్తుఁడు, జపముంగూర్చి వర్షము' అత్ర కర్మప్రవచనీయ ద్వితీయాస్థానే షష్ఠీ. "అభిరభాగే" "అనుర్లక్షణే" ఇతిసూత్రద్వయేన తత్ర కర్మ ప్రవచనీయసంజ్ఞావిధానాత్. 'కటమునందుఁ గూర్చుండెన్, స్థాలియందుఁ బచించెన్, మోక్షమునందుఁ బ్రేమ, అంతట నాత్మ కలదు' ఇత్యాదౌ సప్తమీ. ఏవం విభక్తయో యథాప్రకృత్యూహ్యాః. 'పొడవు, కుంచము, పడి, ముంత, తూము' ఇత్యాదౌ ప్రథమా. 'అయ్య ననుఁగావవే, అప్ప సిరు లీయవే' ఇత్యాదౌ ద్వితీయా. ఇత్యేవమాకారేణ శుద్ధాన్ధ్రశబ్దైరపి యథాసమ్భవం సర్వవిభక్తయ ఊహ్యాః. తాశ్చ యయాతిచరిత్రాదౌ స్పష్టాః.

వి :— వాక్యమునందలిక్రియాపదార్థము వాచ్యము కాక గమ్యమైనను గారకవిభక్తులు కలుగవచ్చునని "గమ్యమానాఽపి క్రియా కారకవిభక్తీనాం నిమిత్తమ్" మ్మనువచనము చెప్పుచున్నది. ఈవచనముచేతనే "పలుకులచే నేమి వికచపంకజవదనా" మున్నగుచోట్లఁ దృతీయ వచ్చినది. 'ద్విజులకొఱకు పాయసన మిచ్చెన్' అనుచోటఁ జతుర్థి. 'రామువలన బ్రతికితిమి, పాపమువలన భయపడితిమి' మున్నగు చోట్లఁ బంచమి. 'రాజుయొక్క పురుషుఁడు, అతనికి సదృశుఁడు' ఇత్యాదులలో షష్ఠి. 'రామునకు భక్తుఁడు' మున్నగుచోట్లఁ గర్మప్రవచనీయ ద్వితీయాస్థానమున షష్ఠి. 'జపముంగూర్చి వర్షము' అనునపుడు కర్మప్రవచనీయద్వితీయ. 'కటమునందుఁ గూరుచుండెను, స్థాలియందుఁ బచించెన్, మోక్షమునందుఁ బ్రేమ' మున్నగునెడల సప్తమి. ఇట్లే ప్రకృతిభాషానుసారముగా విభక్తుల నూహింపవలయును. 'పొడవు, కుంచము, పడి, తూము, ముంత' మున్నగువానికిఁ బ్రాతిపదికార్థమునఁ బ్రథమ. 'అయ్య ననుఁ గావవే, అప్ప సిరు లీయవే' మున్నగు చోట్లఁ గర్మార్థమున ద్వితీయ. ఈరీతిగా శుద్ధాంధ్రపదములకు విభక్తులను యథాసంభవముగా నూహింపనగునని "సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా" అనుసూత్రమునుబట్టి తెలియనగును. అచ్చతెనుఁగుపదములకు వచ్చిన విభక్త్యర్థములను యయాతిచరిత్రాదులయందుఁ జూడనగును.

**213. సూ. :— అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా.**

213. సూ. 1 :- క్వచి త్సంస్కృతభాషాతిక్రమే ణాన్యవిభక్తిస్థానే ఽన్యా విభక్తిశ్చ భవతి. 'విప్రుల కుపాయన మిచ్చెన్, నూటికి నమ్మెన్, దొరకు హితము, రామునకు మ్రొక్కులు, ఇత్యాదౌ చతుర్థీస్థానే షష్ఠీ. "హరులు కైజామోరలార్పుచుఁ బతికి జోహారు సేయన్"—ఇత్యాదిరామరాజభూషణాదికవివచనేషు తాదర్థ్యచతుర్థీస్థానేషష్ఠీ. ప్రాకృతవ్యాకరణేఽపి "ఙేస్సోజమ్" "తాదర్థ్యే ఙేస్తు"ఇతిసూత్రద్వయేన నిత్యవిభాషయోరుభయత్రాపి షష్ఠీ విహితా. 'హేతిన్ నఱికెన్, శిరమున గురుపాదుకలు దాల్చెన్' ఇత్యాదౌ తృతీయాస్థానే సప్తమీద్వితీయే. 'సుఖ మేగెన్' తృతీయాస్థానే ప్రథమా. "ప్రకృత్యాదిభ్య ఉపసఙ్ఖ్యానమ్." ఇత్యనేన తృతీయాత్ర విహితా. 'వ్యాఘ్రమునకు భయపడి' ఇత్యాదౌ పంచమీస్థానే షష్ఠీ. 'మాసము చదివెన్, మాసమునకుఁ జదివెన్, సారె వచ్చెన్, సారెకు వచ్చెన్' ఇత్యాదౌ ద్వితీయాస్థానే షష్ఠీ "కాలాధ్వనో రత్యన్తసంయోగే" ఇతి సూత్రేణ ద్వితీయాఽత్ర విహితా. ఏవం యథాశిష్టప్రయోగం విభక్తయ ఊహ్యాః.

వి :— అన్యస్యాః, క్వచిత్, భవేత్, చ, అన్యా—అని ఛేదము. ఒక్కొక్కయెడ నొకవిభక్తికి మఱియొకవిభక్తియు నగునని యర్థము. "సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా"అనుచెప్పిన సంస్కృతవ్యాకరణముచే విధింపఁబడినవిభక్తికి బదులు తెలుఁగునందు వేఱొకవిభక్తియు రావచ్చునని యర్థము. 'విప్రున కుపాయనమిచ్చెన్, దొరకు హితము, రామునికి మ్రొక్కులు' మున్నగుచోట్ల వచ్చినచతుర్థికి షష్ఠి వచ్చినది. 'పతికి జోహారు సేయన్' అనునపుడు తాదర్థ్యార్థమున షష్ఠి. హేతిన్ నఱికెన్' ఇటఁ దృతీయాస్థానమున ద్వితీయ. శిరమున గురుపాదుకలు దాల్చెన్' ఇచటఁ దృతీయాస్థానమున సప్తమి. 'సుఖ మేగెన్' మున్నగు చోట్లఁ దృతీయాస్థానమునఁ బ్రథమ. సంస్కృతమున "ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్ - ప్రకృత్యా చారుః" అనియుండును. అతృతీయకుఁ బ్రథమ కలిగినదని యూహింపవలెను. 'వ్యాఘ్రమునకు భయఁపడి' మున్నగుచోట్లఁ బంచమీస్థానమున షష్ఠి. 'మాసము చదివెన్' మాసమునకుఁ జదివెన్, సారె వచ్చెన్, సారెకు వచ్చెన్' మున్నగు

చోట్ల ద్వితీయాస్థానమున షష్ఠి. "కాలాధ్వనో రత్యన్తసంయోగేచ" అనుసూత్రముచొప్పున ద్వితీయ విహితమైనది. ఇట్లే శిష్టప్రయోగాను సారముగ విభక్తుల నూహింపవలయును.

213. సూ. 2 :— యద్యప్యాద్యప్రకృత్యామపి కర్మాదీనాం సమ్బన్ధమాత్రవివక్షాయాం 'షష్ఠీ శేషే' ఇతిసూత్రేణ షష్ఠీ భవత్యేవ. తథాప్యత్ర శేషత్వవివక్షా నాఙ్గీక్రియతే. కిన్తు కారకతావివక్షాయామేవ యా విభక్తి రాద్యాయాం విహితా తస్యామేవ నాన్యా భవతీ త్యురరీక్రియతే. అతఏవ 'కి, కు' షష్ఠీద్వయమ్. ఇతరథా యొక్కషష్ఠీ స్యాత్. "యొక్కచ శేషే షష్ఠీ" ఇతి విధానాత్. కారకాదివ్యతిరిక్త స్వస్వామిభావాదిసమ్బన్ధ ఏవాచార్యస్య యొక్కషష్ఠ్యభిమతా; నాన్యత్రేతి నిష్కర్షః. సమ్బన్ధమాత్రవిహితషష్ఠీకానాం తు 'సర్పిషో జ్ఞానమ్' ఇత్యాదిరూపాణాం 'సర్పిస్సు యొక్క జ్ఞానము' ఇత్యాదిరూపాణి. వైకృతసమాసే తు 'సర్పిస్సుజ్ఞానము, మాతృస్మరణము, చోరునియుజ్జాసనము' ఇత్యాది సిద్ధ్యత్యేవ. అతఏ వాద్యాయాం నిర్ధారణషష్ఠీ. సమాసాభావేఽప్యత్ర కాంతలమేలుబంతి అన్నవలమిన్నవలిగుబ్బచన్నుగవను' ఇత్యాది సమాసోఽప్యత్ర భవతి. "షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నా"మితి సామాన్యోక్తేః లోపలషష్ఠ్యా అపి గ్రహణాత్.

వి :— సంస్కృతమునందుఁ గర్మాదులకు శేషత్వవివక్ష చేసినచో "షష్ఠీ శేషే" అనుచొప్పున షష్ఠి వచ్చును. కాని పై చోట్ల శేషత్వము వివక్షింపఁబడదు. కారకతావివక్షయందే విభక్తి సంస్కృతమున విహితమగునోయట్టివానినే "అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా" అనుచొప్పున వచ్చువిభక్తులు తెనుఁగునఁ గలుగునని యంగీకరింపఁబడినది. కాన 'కి, కు' అనురెండును షష్ఠీప్రత్యయములుగా వచ్చును. లేకున్న "యొక్క చ శేషే షష్ఠీ" అని 'యొక్క' ప్రత్యయమే వచ్చును. కారకాదివ్యతిరిక్తస్వస్వామిభావాదిసంబంధముననే యొక్కషష్ఠి నన్నపార్యుని కభిమతమనియు, నితరస్థలమునఁ గాదనియు నిష్కర్ష. సంబంధమాత్రమున విహితమైనషష్ఠితోఁ గూడిన 'సర్పిషో జ్ఞానమ్' మున్నగువానికి "సర్పిస్సు యొక్క జ్ఞానము, మున్నగురూపము లుండును. వైకృతసమాసమున 'సర్పిస్సుజ్ఞానము, మాతస్మరణము, చోరునియుజ్జాసనము' మున్నగునవి

సిద్ధించుచునే యున్నవి. ఇట్టియెడ నసమాసమునను సంస్కృతమున నిర్ధారణషష్ఠి వచ్చును. 'కాంతలమేలుబంతి, యన్నువలమిన్నవలిగుబ్బచన్నుగవకు' మున్నగురీతిసమాస మిటఁ గల్గును. 'కాంతలలో మేలుబంతి, అన్నువలలోమిన్న' అని విగ్రహము. 'బంతి' శబ్దము 'పఙ్క్తి' శబ్దవికృతి. మేలుబంతి యనుదానికి శ్రేష్ఠురాలని యర్థము. అన్నువ=స్త్రీ, మిన్న=శ్రేష్ఠురాలు. ఇచట షష్ఠికి ద్వితీయాతుల్యత గల్గును. "షష్ఠీ భవే ద్వితీయాతుల్యా" అని సామాన్యముగాఁ జెప్పుటవలన 'లోపల' అనుషష్ఠికిని ద్వితీయాతుల్యత కలుగును.

213. సూ. 3:- 'సర్విజ్ఞానము' ఇత్యాదయ స్తత్సమసమాసాస్తు న సాధవ ఏవ. "జ్ఞో౽విదర్థస్య కరణే" "అధీగర్థదయేశాం కర్మణి" ఇత్యాదిసూత్రాష్టకస్య షష్ఠీసమాసనివృత్తిరేవ ఫలమ్. సమాసే త్వన్తోదాత్తతా స్యాత్. సా చానిష్టా. తథాచ స్వరార్థో౽య మష్టసూత్రీతి పరం నిష్కర్షః. 'లోకకర్తా హరిస్మరణమ్' ఇత్యాదౌ తు కారకషష్ఠ్యా సమాస ఇతిహి శబ్దసిద్ధాన్తఘోషః.

వి :- సర్విజ్ఞానము' మున్నగు తత్సమసమాసములు సాధువులు కావు. "జ్ఞో౽విదర్థస్య కరణే" - "అధీగర్థదయేశాం కర్మణి" - మున్నగు నెన్మిదిసూత్రములకును షష్ఠీసమాసనివృత్తియే ఫలము. 'నివృత్తి' శబ్దమునకు నివారణార్థమేకాక 'కల్గించుట' అనునర్థమును గలదని కొందఱందురు. సమాసము కలిగినచో నన్తోదాత్తత యుండును. అది యిష్టముకాదు గాన నీయెనిమిదిసూత్రములకును ప్రయోజనము స్వరమే యని నిష్కర్ష చేయఁబడినది. 'లోకకర్త, హరిస్మరణము' మున్నగుచోట్లఁ గారకషష్ఠితోడనే సమాసమని శాబ్దికులసిద్ధాంతము. ఇచట మూలమున శబ్దసిద్ధాన్తఘోషః" అని యున్నది. 'శాబ్దికసిద్ధాన్తఘోషః' అని యుండఁదగునేమో ? 'సర్విజ్ఞానము' మున్నగుసమాసములు సంస్కృతవైయాకరణులమతమునందు సాధువులు కాకున్నను దెనుఁగునందవి సాధువులు కావచ్చును. కాని యట్టిసమాసములను ప్రాచీనాంధ్రమహాకవులు ప్రయోగింపనందున సాధువులు కావనియే

చెప్పవలసియున్నది. సంస్కృతమున శేషషష్ఠీసమాసమును వైయాకరణు లంగీకరింపకున్నను దెనుఁగున నన్నయాథర్వణు లంగీకరించినందున శేషషష్ఠికి సమాస మున్నట్లే నిర్ధారణషష్ఠికిని సమాస ముండ నగును. "ప్రయోగమూలం వ్యాకరణ"మ్మను సూక్తియే తెనుఁగువారికిఁ బ్రమాణముగదా.

213. సూ. 4:-క్రియాన్వయే 'సర్పిస్సుం దెలిసెన్, మాత స్మరించెన్' ఇత్యాదీని రూపాణి జ్ఞేయాని. ఏవంస్థితే తత్పురుషే కర్మణ శ్శేషత్వే షష్ఠ్యా ద్వితీయాతుల్యత్వేఽపి న విరోధః. తేన "తమ్మికే లుండఁ బెఱకేల దండయిచ్చు లేము లుడిపెడు లేఁ జూపు లేమతోడ ఇత్యాదయః కవీనా ముక్తయ స్సాధవ ఏవ. 'తల్లికి స్మరించెన్' ఇత్యాదిరూప న్త్వప్రసిద్ధమ్.

వి :- క్రియాన్వయమున 'సర్పిస్సుం దెలిసెన్' మాత స్మరించెన్' మున్నగురూపము లుండునని తెలియనగును. ఇది యిట్లుండఁగాఁ దత్పురుషసమాసమునందుఁగర్మమునకు శేషత్వము వివక్షింపఁబడినపుడు షష్ఠికి ద్వితీయాతుల్యత గల్గినను విరోధము లేదు. మీఁదికవిప్రయోగములోని "లేఁజూపులేమతోడన్" అనునది యుదాహరణము. 'లేఁజూపుయొక్క+లేమతోడన్=లేఁజూపున్ + లేమతోడన్=లేఁజూపులేమతోడన్' మున్నగురీతి నిట్టిప్రయోగములు సాధువులే. ఇచటఁ గర్మత్వమునకు శేషత్వవివక్ష చేయఁబడినది. కావున నిట్టిరూపములనట్లు సాధింపనగును. 'తల్లికి స్మరించెన్' మున్నగురీతిరూపములు తెనుఁగునం దప్రసిద్ధములు.

**214. సూ :- ఏకత్వం భేదకగతబహువచనానాఞ్చ దృశ్యతే వికృతౌ.**

214. సూ :- దృశిగ్రహణేన ప్రయోగానుసరణం జ్ఞాపయ త్యాచార్యః. ఇంపైన ప్రియురాండ్రు, ఒప్పైనసిరులు' ఇత్యాది. వికృతిపదప్రయోగస్వారస్యేన శుద్ధాన్ధ్రే ష్వైకత్వ మాచార్యస్య సమ్మతమితి విజ్ఞాయతే. 'హారికీర్తితతులు విఖ్యాతము' ఇత్యాది వాక్యప్రయోగ స్త్వాథర్వణమతే సాధుః.

"క్వచి దేకత్వ మిష్టం స్యా దప్రాణిస్త్రీవిశేషణే।
సిద్ధమ్వాంతస్త్రీసమయో స్తద్విశేష్యకయో స్తథా॥"

ఇతి తద్వచనమ్. తద్విశేష్యకయో రప్రాణిస్త్రీవిశేష్యకయో రిత్యర్థః. 'అందము, చొక్కటము' ఇత్యాదయ శ్శబ్దా స్సిద్ధవ్యస్తాః. 'ఇంపు, సొంపు' ఇత్యాదయః స్త్రీసమాః.

వి :- ఏకత్వమ్, భేదకగతబహువచనానామ్, చ, దృశ్యతే, వికృతౌ-అని ఛేదము. వికృతియందు విశేషణములయం దున్న బహువచనత్వమున కేకవచనత్వ మగపడుచున్నదని సూత్రార్థము. "ఒక ప్పుడు ప్రాణివాచకమువర్ణకాంత మగునట్టియు, స్త్రీసమ మగునట్టియు, విశేషణమందుఁ జింతామణి చెప్పినవిశేషణగత బహువచనమునకు వచ్చునేకత్వము పాక్షికముగా వచ్చుట సమ్మతమగును" అని యథర్వ ణాచార్యులుగారు చెప్పిన "క్వచి దేకత్వ మిష్టం స్యాత్" అనుదాని కర్థము. 'ఇష్ట మగుపదార్థములు', 'కులిశధారల్ కుంఠితములయ్యె' మున్నగున విచట నుదాహరణములు. 'ఇష్టము లగుపదార్థములు, కులిశధారల్ కుంఠితమయ్యె' ననియు రూపము లుండును. ఇచట 'తద్విశేష్యకయోః' అనుచోట 'సద్విశేష్యకయోః' అని పాఠాంతరము గలదు. సద్విశేష్యకములనుదానికిఁ బ్రాణివాచకము విశేష్యముగాఁ గలదని యర్థము. సిద్ధశబ్దమునకు సహజాచ్ఛికమని యర్థము. సహజ సిద్ధ మైనమువర్ణకముతోఁగూడిన నపుంసకలింగసమ మగువిశేషణమున కును, నాచ్ఛికస్త్రీసమవిశేషణమునకును బహువచనమున కేకవచనము పాక్షికముగాఁ గల్గుచుండుట మహాకవిప్రయోగసమ్మతమగును. తొలి పాఠమునందు 'తద్విశేష్యకయోః' అనుదాని కప్రాణిస్త్రీవిశేష్యకమని యంగీకరించినయెడల నది పూర్వార్ధమునకే పునరుక్త మగుటచే నుత్త రార్థము వ్యర్థము కావలసి వచ్చుచున్నది. కావునఁ బూర్వార్థ మప్రాణి విశేష్యపరమనియు, నుత్తరార్థము ప్రాణివిశేష్యపరమనియు నర్థము చేయుట యుక్తమగును. కావుననే సచ్ఛబ్దమునకుఁ బ్రాణివాచక మువర్ణకాంత మని యర్థము చెప్పుట యుక్త మగునని వ్యా-సం-స. చెప్పినది.

**215.** సూ:— "ద్విగుకర్మధారయౌ తత్పురుషద్వన్ద్వౌ బహుప్రీహిః. అన్యేచ కేచి దుపమానోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః పరిదృశ్యా ఇహ".

215 సూ. 1:— ద్విగుకర్మధారయాద్యాః అన్యే తదితరే తత్పురుషవిశేషాః ఉపమాన ముత్తరపదలోపః రూపక మిత్యేతదాద్యాశ్చ సమాసా ఇహ కేవలవికృతౌ పరిదృశ్యాః. 'పరిదృశ్యా' ఇత్యనేన ప్రసిద్ధ్యనుసరణం జ్ఞాపయతి సూత్రకృత్. 'ముచ్చిచ్చు, మువ్వంక, మువ్వన్నె, ముప్పొద్దు, ముక్కాఁక, ఇరుగడ, ఇరుమేను' ఇత్యాద్యాః ద్విగుసమాసాః.

"ద్విగో రమిశ్రతాయాన్తు ప్రాయ ఏకత్వ మిష్యతే
మిశ్రతాయాం బహుత్వం స్యా దన్యత్రాపి క్వచి ద్భవేత్ ||"

ఇత్యథర్వణః. "సఙ్ఖ్యాపూర్వో ద్విగుః" ఇతి పాణిన్యుక్తే రేషాం ద్విగుసమాసత్వమ్. 'నల్గడం బెడరఁగా'—ఇత్యాద్యాచార్యవచనమ్. 'ముల్లోకంబులు, ముజ్జగంబులు' ఇత్యాదయః మిశ్రద్విగుసమాసాః. ప్రాయోగ్రహణాత్ 'నల్దెసలు'-ఇత్యాదౌ బహుత్వమపి. 'నల్దెసలు గనుంగొనున్ బొరలు లేచు వణంకు' ఇత్యాదయః ప్రయోగాః కవీనామ్. 'ముల్లోకంబులు, ముజ్జగంబులు' ఇత్యత్రామిశ్రసమాసత్వమపి నూపపాదమ్. కథమితి చేత్ పైశాచీసమత్వేన భవతి తత్. "న ప్రాయో లుక్కగచజతదపయవాం" ఇతి ప్రాకృతసూత్రస్యాత్ర మహిమా. "న ప్రాయో లుక్కాదిచ్ఛల్ షట్ఛ్యమ్యన్తే" సూత్రోక్తమితి తన్నిషేధాత్. నచాత్రాతద్గుణసంవిజ్ఞానో బహుప్రీహిః; తద్గుణసంవిజ్ఞానబహుప్రీహిత్వేన వ్యాఖ్యానాత్. తత్సమసమాసతాయాం 'త్రిజగత్తు, త్రిలోకి' ఇత్యాదికం రూపమ్. "ద్విగురేకవచనమ్" "స నపుంసకమ్" "ద్విగోః" ఇతిసూత్రైరేకత్వనపుంసకత్వఙీప్రత్యయానాం విధానాత్. "అన్యత్రాపి క్వచిద్భవేత్" ఇత్యనేన 'కాలుసేయి' ఇత్యాదావేకత్వమితి జ్ఞేయమ్. వస్తుతస్తు ప్రాణ్యఙ్గత్వేనైవా త్రైకత్వం సిద్ధమ్. సూత్రారమ్భేణ తు 'తనకూడుచీరకై కాంచనమడిగి' ఇత్యాదయ స్త్రైక్యాద్యాదికవిప్రయోగా స్సాఙ్గవో భవన్తీతి జ్ఞేయమ్.

వి:— ద్విగుకర్మధారయౌ, తత్పురుషద్వంద్వౌ, బహుప్రీహిః, అన్యేచ, కేచిత్, ఉపమానోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః, పరిదృశ్యాః, ఇహ—అని ఛేదము. ఈవికృతిభాషయందు ద్విగువు, కర్మధారయము, తత్పురుషము, ద్వంద్వము, బహుప్రీహి, ఉపమానోత్తరపదలోపరూప

కాదులునై నమఁటికొన్ని సమాసములును నగపడుచున్నవని సూత్రార్థము ఇచట నొకవిషయ మాలోచింపఁ దగినది. చింతామణిసూత్రములచేఁ బ్రధానముగాఁ దత్సమములు, మిశ్రములు, నైనవానినే సాధింపవల యును గాని యాచ్ఛికసమాసములను సాధింపరాదు. సూత్రము నందు "పరిదృశ్యా" అని చెప్పుటచే దీనికిఁ బ్రసిద్ధ్యనుసరణ మావశ్యక మని సూత్రకర్త జ్ఞప్తికిఁ దెచ్చుచున్నాఁడు. 'ముచ్చిచ్చు', ముప్పంక, మున్నగుసమాసములను దీనిచే సాధించుకొనవలెనని కవిశిరోభూష ణము చెప్పుచున్నది. అట్లు చెప్పుట సరికాదు. చింతామణి వికృతిశబ్ద ముల ననఁగా నాచ్ఛికశబ్దములను సాధింపకుండుటచేతనే యథర్వణా చార్యులుగారు వికృతివివేకమున నావిషయములను జెప్పియున్నారు. ద్విగుకర్మధారయతత్పురుషములు తెలుఁగులో సిద్ధసాంస్కృతికములు, సాధ్యసాంస్కృతికములు, మిశ్రములు, నాచ్ఛికములు ననునాలుగు విధములసమాసము లుపయోగింపఁబడినవి. సిద్ధసాంస్కృతికములు సంస్కృతవ్యాకరణముచేతనే సిద్ధించి తత్సమరూపమునఁ దెనుఁగులో నికి వచ్చుచున్నవి. సంస్కృతమున సంస్కృతవ్యాకరణముచే రూప సిద్ధిని బడసి వచ్చినవగుటచే వానిని సిద్ధసాంస్కృతికము లనుచున్నారు. రెండుసంస్కృతపదములు తత్సమత్వము నొంది తెనుఁగువ్యాకరణలక్ష ణముచే సమసించినప్పుడు వానిని సాధ్యసాంస్కృతికములని యను చున్నారు. ఒకతత్సమపదమునకును నొకయాచ్ఛికపదమునకును వచ్చిన సమాసమును మిశ్రసమాస మనుచున్నారు. రెండుదేశ్యపదములకుఁ గాని రెండుతద్భవపదములకుఁగాని తద్భవదేశ్యమిశ్రములకుఁగాని వచ్చిన సమాసము నాచ్ఛికసమాస మనుచున్నారు. ద్విగుకర్మధారయతత్పు రుషసమాసములు నాల్గువిధములుగా నుండును. ద్వంద్వబహువ్రీహులు మాత్రము సిద్ధసాంస్కృతికములు, నాచ్ఛికములు మాత్రమే యైయుం డును. సాధ్యసాంస్కృతికములు, మిశ్రములునై యాసమాసములు తెలుఁగున నుండవు. కాఁగకసమాసములకు సంబంధము కలదు. సమా

సము కల్గుటకు సాధనములు సామాన్యముగా సామానాధికరణ్యా వై యధికరణ్యము లేయగును. విశేషణవిశేష్యములకుసమాసముకలుగుట ప్రచురము. సమానలింగవిభక్తివచనత్వములు విశేషణవిశేష్యముల కున్న నవి సమానాధికరణశబ్దము లగును. వానిసంబంధము సామానాధికరణ్యము. సామానాధికరణ్యము లేనివి వ్యధికరణము లగుచున్నవి. వ్యధికరణసమాసములలోఁ దెనుఁగునఁ బ్రాచుర్యము గలది షష్ఠీతత్పురుషసమాసము. దీనికి వచ్చినసమాసము వ్యధికరణ సమాసము. ద్విగు కర్మధారయములు రెండును సమానాధికరణసమాసము లగును. సంఖ్యావాచకపదము సమాసపూర్వావయవము గా నుండినసమానాధికరణ సమాసము ద్విగుసమాస మనిపించుకొనుచున్నది. ద్విగుసమాసము, మిశ్రము, నమిశ్రము నని రెండువిధములు. "అమిశ్రద్విగుసమాసము నందుఁ బ్రాయికముగా నేకవచనాంతత యుండును. మిశ్రతయందు బహువచనాంతత యుండును. అమిశ్రమిశ్రసమాసములలో నేకవచన బహువచనాంతత లుండుట ద్విగువునందే కాక మఱికొన్నిఁటియందు నుండును" అని "ద్విగో రమిశ్రతాయాం తు" అను నథర్వణకారికార్థము. "నల్గడం జెదరఁగా" అని యాచార్యులవారిప్రయోగము. 'నాలుగు+కడలు' అని దానివిగ్రహము. "సంఖ్యాపూర్వో ద్విగుః" అనుపాణినీయసూత్రముచొప్పున ద్విగుసమాసత్వము దానికిఁ గలుగుచున్నది. 'ముల్లోకంబులు, ముజ్జగంబులు' మున్నగునవి మిశ్రద్విగుసమాసములు. ప్రాయికశబ్దముచే 'నల్దెసలు' మున్నగుచోట్ల బహుత్వమును నగపడుచున్నది. ముల్లోకములు, ముజ్జగములు—అనువానిని బ్రాకృత వ్యాకరణముచే నమిశ్రసమాసములని కవిశిరోభూషణము సాధించినది. "సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా" అని చెప్పుటచే సమాసములన్నియు సంస్కృతవ్యాకరణలక్షణముచేతనే సాధించుకొనవలయునని చింతామణి సూచించియున్నది గదా! 'త్రిజగత్తు, త్రిలోకి' అనునవి సిద్ధసాంస్కృతికసమాసములు. "ద్విగు రేకవచనమ్", "స నపుంసకమ్",

"ద్విగోః" అను సంస్కృతవ్యాకరణసూత్రములు వీనిని సాధించుచున్నవి. 'కాలుసేయి' మున్నగుచోట్ల నేకవచనాంతత 'అన్యత్రాపి క్వచిద్భవేత్" అనుచొప్పునఁ గల్గినది. 'కూడుచీర' మున్నగునవి "అన్యత్రాపి" అను నథర్వణవచనముచే సాధువు లగునని తెలియనగును.

215 సూ. 2:- 'చిగురుటాకు, కలుకుటమ్ము, పండువెన్నెల, నల్లగలువ, తెల్లదమ్మి, తెల్లనిదమ్మి, నల్లనివాఁడు' తచ్ఛబ్దోత్తర పురుషవాచకః. నల్లనియది. 'అది' శబ్దస్త్ర్యాదిపరః ఇత్యాద్యాః కర్మధారయాః.

వి :- పైఁజూపినసమాసములన్నియు నాచ్ఛికకర్మధారయసమాసములు. తత్సమమిశ్రసమాసముల కుదాహృతులు చూపఁబడలేదు. 'నల్లని వాఁడు, నల్లనియది' అనువానిలోనున్న 'వాఁడు, అది' అనునవి మహదమహద్వాచకములలోఁ దచ్ఛబ్దప్రథమైకవచనరూపములు. 'నల్లని' యనునది విశేషణవాచక మగుటచే నిట్టివానికి విభక్తియోగము లేదు. ఇట్టివిశేషణములకు రాముఁడు-మున్నగువానితో సామానాధికరణ్యము కలుగుటకై తచ్ఛబ్దవిభక్త్యంతరూపములఁ గూర్చి యాంధ్రవైయాకరణులు విభక్త్యంతతను సంపాదించుచున్నారు. 'నల్లనివాఁడు రాముఁడు' దీనిసమాసము 'నల్లనిరాముఁడు' అని యగుచున్నది.

215. సూ. 3:- 'నీవు పోషించిన భక్తులు, ఇత్యాదయః కర్మధారయాభాసాః. "స్యాత్కర్మధారయాభాసః కర్తృత్వే కారకాశ్రితే", ఇత్యథర్వణోక్తేః. 'తత్పురుష స్సమానాధికరణః కర్మధారయః' ఇతి పాణినిః. 'తెల్లదమ్మి' ఇత్యాదౌ బిందురస్తీత్యాధునికలక్షణోక్త మప్రామాణికమ్. 'సప్తర్షయః' ఇత్యాదిసమాసానుసారేణ 'సత్తజడదారులు' ఇత్యాదిసంజ్ఞాసమాసా యోజ్యాః; "అస్త్యస్త్రీత్యుదీరితః" ఇత్యాద్యనుసారేణ "కలఁడు కలం డనెడువాఁడు" ఇత్యాదిరూపస్య కల్పనా. ఇతిశబ్దార్థో అనీతి శబ్దః. "పరాశరమునీంద్ర" ఇత్యస్య "పరాశరుఁ డన్మునీంద్రుఁడు" ఇతివాక్యం ప్రయుక్త మాచార్యేణ. 'వలరాచవారు" ఇత్యాదివచన మిత్యర్థస్య లోపే. 'పడగఁదాల్పు-తేనిఁడిండి" ఇత్యాదౌ ద్వితీయాతత్పురుషః. అతఏవ "ధరిత్రిసాఁచు గరుఁడాల్చినకేలన్" ఇత్యాదయః కవీనా ముక్తయ స్సఙ్గచ్ఛన్తే. 'పట్టుపుట్టముదాల్పు' ఇత్యాదౌ వలుద్వితీయాతత్పురుషః. 'ఉలితునుక, సెలతిక్కువాఁడు' ఇత్యాదౌ

తృతీయాతత్పురుషః. "అపరస్యోపసఙ్ఖ్యాన" మితి వార్త్తికమ్. 'ఉలితునుక' ఇత్యత్ర వివక్షయా షష్ఠీతత్పురుషోఽపి. 'దేవరమేలు' ఇత్యాదౌ చతుర్థీతత్పురుషః. "హిత యోగే చ" ఇత్యుక్తేః. 'దొంగయులుకు' ఇత్యాదౌ పఞ్చమీతత్పురుషః. 'దొరమానిసి, తేఁటిపిల్ల, మల్లెపూవు, జాబిల్లివెన్నెల, గట్టుపట్టి, రాచకొలము, నేతిముంత, నూటికుండ' ఇత్యాద్యా షష్ఠీతత్పురుషాః. 'మాయలయాలకాపరి' ఇత్యాద్యాః మాలా షష్ఠీతత్పురుషాః. 'మాటనేర్పరి' ఇత్యాద్యాః సప్తమీతత్పురుషాః.

వి:— కర్తృగతక్రియాసామానాధికరణ్యరూపకర్తృత్వము కర్మాది కారకగతమగుచుండఁగాఁ గర్మధారయము మాభాసరూపమైన దగును- అని "స్యాత్కర్మధారయాభాసః" అనుదాని యర్థము. 'నీవు పోషించిన భక్తులు' అనునపుడు నిజమైనకర్మధారయమువలె నిది యగపడుచున్నది కాని యదియాభాసమే. కర్మాదికర్తృత్వమున్న చోట్ల సమాసములెల్ల నాభాసములే. కాని యథార్థములు కావు. 'ఉలితునుక' మొదలగుసమాసములు లాక్షణికములగుటచే ద్వితీయాదితత్పురుషములకు దీని నుదాహరింపవచ్చును. కావుననే సూరిగా రల్లే యుదాహరించిరి. షష్ఠీతత్పురుషసమాసమునకు 'ఉలితునుక' మొదలగువాని నుదాహరింపవలెనని కవిశిరోభూషణ మభిప్రాయపడెను. "లోపశ్చ విభక్త్యాదేశ్శబ్దేషు స్యాత్సమాసకాఙ్క్షేషు" అనుసూత్రముచొప్పున నీసమాసములు సిద్ధించుచున్నవి. కావున వీనిని ద్వితీయాదితత్పురుషములుగ నేయూహించుట సమంజసమని తోఁచుచున్నది. ద్వితీయాతుల్యశాస్త్రమునకు వీనిని లక్ష్యములుగా నెంచుట సరికాదు. పైసమాసము లన్నియు వ్యధికరణ సమాసములు.

215 సూ. 4 :— డాలుడమాములు, కుంచెకాళంజాలు, కాలుసేతులు, ఊరువల్లెలు, తల్లిదండ్రులు, కీడుమేళ్లు, వెన్నెలచీఁకట్లు, పగలురేలు, కన్నపెంచినవారు, విన్నకన్నవారు, ఇత్యాద్యాః ద్వన్ద్వసమాసాః. కన్నపెంచినవారు, ఇత్యత్రాన్తగస్యాపి తచ్ఛబ్దార్థస్య పూర్వత్రాప్యన్వయః. "క్వచిత్సమాసేఽన్తగస్య శబ్దస్యాదావపి స్థితిః" ఇత్యథర్వణవచనాత్. వచ్చిరాములు, చేసిచేయములు, చొచ్చిచొరములు- ఇత్యాదావపి ద్వన్ద్వసమాస స్సాధురేవ. "ద్వన్ద్వః కేషాఞ్చి ద్విష్టస్యాత్ క్త్వార్థ

శబ్దేన క్వచిత్" ఇత్యథర్వణవచనాత్. 'వచ్చిరానికుచంబులు' ఇత్యాదౌ క్త్వార్థ పదస్య భిన్నత్వమేవ. 'వచ్చీరానికుచంబులు' ఇతి దీర్ఘప్రయోగస్తు న ప్రామాణికః. ద్వన్ద్వఘటకపదానాం చార్థాన్తర్భావేనైకార్థీభావ ఇతి వైయాకరణసిద్ధాన్తా దత్రాపి 'యు, ను' వర్ణకా చార్థకత్వేన ద్వన్ద్వే గ్రాహ్యౌ.

వి :- డాలుడమాములు, మున్నగునవి యాచ్ఛికద్వంద్వసమాసములు. 'డాలును డమామియును' ననురీతిని వీనివిగ్రహము. ఇందలి 'యును' అనునది చార్థకము. "చార్థే ద్వన్ద్వః" అనిపాణినీయము. వాద్యవిశేషమని దీనికర్థము. "యువర్ణకస్యాద్యన్తాత్తు" అనియు "ఉవర్ణకశ్చాద్యన్తాత్తు" అనియు రెండుపాఠములు గలవు. తొలిపాఠము ననుసరించి యహోబలపతి 'యును' అనునది చార్థకమని వ్రాసెను. అచట 'ఉ, ను' అనునవి చార్థకములని చెప్పుట లెస్స. 'కన్నపెంచినవారు' మున్నగువానియందు "ఒకానొకప్పుడు ద్వంద్వసమాసాంతమున నిలిచి యున్నశబ్దముతోఁ దత్పూర్వశబ్దమున కన్వయము" అనునథర్వణవచనముచొప్పునఁ గన్నవారు పెంచినవారు అని విగ్రహము సెన్నవలయును. ఇచట మొదటిదానిచివఱ నున్న 'వారు' శబ్దము దీనిచివఱఁ గూడ నిలుపవలయును. (ప్రౌఢ. సమాస. 32. సూ.) ఈనిధి ద్వంద్వసమాసమునందే కాక "విశేషణోభయపదకర్మధారయము" నందును వర్తించును. (ప్రౌఢ. సమాస. 17, 18. సూ.) 'వచ్చిరాములు' మున్నగుచోట వచ్చుటయును, రామియును అనురీతిని విగ్రహము సెన్నవలయును. (ప్రౌఢ. సమాస. 29, 30. సూ) "ద్వంద్వః క్వేపాక్త్వైత్" అనునథర్వణకారికలో "క్త్వార్థశబ్దేన" అని పఠించుటకంటె "త్వార్థశబ్దేన" అని పఠించుట సమంజసమనియు, నపుడు 'వచ్చిరాములు' అని రూప ముండదగనియు 'వచ్చురాములు' అని యుండనగునని యు వ్యా॥ సం॥ స॥ చెప్పుచున్నది. నిజ మాలోచింపఁగ 'వచ్చి'అనునది క్త్వార్థకమను పేరు గలయసమాపకక్రియ. క్రియలతో సమాసము తెనుఁగునందుఁ బ్రసిద్ధము కాదు. కావున 'త్వార్థశబ్దేన' అనుపా

కమే సమంజసమనుట లెస్స. "భావార్థకకృదంతశబ్దములతోఁ గూర్పఁబడిన ద్వంద్వసమాసము కొందఱ కిష్టమైయున్నది" అని "ద్వంద్వః కేషాఞ్చిత్" అనుదాని కర్థము. 'వచ్చిరానికుచంబులు' అనుచోట 'వచ్చి' అనుపదము సమాసఘటితము కాదనియు, నది వ్యస్తపదమే యనియుఁ జెప్పవలసి యున్నది. 'వచ్చీరానికుచంబులు' అనుదీర్ఘము ప్రామాణికము గాదు. (ప్రౌఢ. సమాస. 28. సూ)

215 సూ. 5:- అలరువిల్తుఁడు, వేయిగంటి, వేడివెలుఁగు, చలివెలుఁగు, ముక్కంటి, నలువ-ఇత్యాద్యా బహువ్రీహయః. కఱకంఠుఁడు ఇత్యత్ర మిశ్రబహువ్రీహిః. "కఱకంఠముఖాహితాః" ఇత్యథర్వణేనోక్తమ్. ముఖశబ్దేన 'దినవెచ్చము' ఇత్యాద్యా గృహ్యన్త ఇత్యుక్తమ్. దినవెచ్చము, రాయబారము, ఇత్యాదౌ ప్రాకృతసమత్వేనాపి రూపం సువచమ్. 'రాయబారి' ఇత్యత్ర అథర్వణోక్త మిత్త్వమ్. 'త్రినేత్రః, పీతాంబరః' ఇత్యాద్యనుసారేణ 'మూఁడుకన్నులవాఁడు, పీతాంబరమువాఁడు, పట్టుపుట్టమువాఁడు, పట్టుపుట్టముదొర' ఇత్యాద్యా ఆభాసబహువ్రీహయః పుంసి. స్త్రీత్వే తు, మూఁడుకన్నులయది, పట్టుపుట్టమునది ఇత్యాద్యాః "స్యాదాభాసబహువ్రీహిః ప్రథమాదిప్రయోగతః" ఇత్యథర్వణః. ప్రథమాన్తశ్చాత్ర తచ్ఛబ్దశ్చాన్యశబ్దశ్చ. 'వేడివెలుఁగు' ఇత్యాదావపి షష్ఠ్యర్థవివక్షాయాం ప్రథమాన్తప్రయోగ ఇష్ట ఏవ. వేడివెలుఁగువాఁడు ఇత్యాది. కన్నులుమూఁడు కలవాఁడు, ఇత్యాదౌ తు కర్మధారయాభాస ఏవ. మెఱుఁగుబోఁడి, తమ్మికంటి, ఇత్యాద్యా ఉపమానగర్భబహువ్రీహయః. చౌదన్తీత్యత్ర చతుశ్శబ్దస్య "అన్త్యహలో శదుదీ" ఇతిసూత్రే ణాన్త్యహల్లోపే "ప్రాయోలుగాది" సూత్రేణ తలోపే, అనన్తరం వికృతౌ చస్య దన్త్యత్వే చ ఉకారస్థానే తద్భవవుకారాదేశే చ "చవు" ఇతిరూపం సిద్ధమ్. తస్య విభాషయా ఔకారభావస్తు "వాయిరవు ర్వక్రతమా" ఇత్యుక్తిమూలకః. అత్ర సూత్రే వక్రతమయో రాదేశత్వం స్థానిత్వం చాపి రూపానుసారేణ వ్యాఖ్యాయత ఇతి న కిఞ్చిద్బాధకమ్. దన్తీతి సిద్ధావస్థాయాం నిష్పన్నం రూపమ్. 'సుకేశి-హిరణ్యకేశి' ఇత్యాదిభాష్యవచనాత్. "న కర్మధారయా న్మత్వర్థీయ" ఇతి నిషేధో న నిత్య ఇతి చతుర్దన్తీతి రూపమపి సాధ్వితి వ్యాకరణపారీణాః. అతఏవ "లోకప్రీతిచకోరపారణపటు జ్యోతిష్మతీ లోచనే" ఇత్యాదీని మహాకవివచనాని సామఞ్జస్యం లభన్తే.

వి :- అలరువిల్తుఁడు-మున్నగునవి యాచ్ఛికబహువ్రీహిసమా

సములు. కలుకంఠుఁడు–అనునది మిశ్రబహువ్రీహి. మిశ్రబహువ్రీహియు మిశ్రద్వంద్వమునుఁ దెనుఁగునం దుండవని యాంధ్రకవిలాక్షణికసంప్రదాయము. కావున 'కలుకంఠుఁడు'అనునది సాధువు కాదు. కాని 'కలుకంఠా! క్షమియింపుము' అని నన్నపార్యుఁడు ప్రయోగించుటచే దీనిని సాధువుగా నంగీకరింపవలయునని యథర్వణాచార్యులుగారు 'కలుకంఠముఖాహితాః' అని వచించిరి. ఈకారికయొక్క పూర్వార్థము "గ్రామ్యం తత్తద్విధా సాధు" అనునది. "గ్రామీణ లగునీచపాత్రలవచోవిధులు కావ్యమున వ్రాయవలసినసందర్భమున వ్రాయఁబడినచో నవి గ్రామ్యమైనను సాధువులే యగును" అని యర్థము. మిశ్రబహువ్రీహిరూపగ్రామ్య మైన 'కలుకంఠ' మున్నగునవి మహాకవిప్రయుక్తములై యపభ్రంశగ్రామ్యము లగుటచే సాధువులేయగు"నని యర్థము. ఈసందర్భమునఁ "ప్రౌఢవ్యాకర్త" కవిప్రయోగమే వ్యాకరణమునకు మూలమైనపుడు, అట్టిదానినిఁ బ్రయోగించినకవి మహాకవి యైనపుడు తత్ప్రయోగమునుబట్టి సూత్రమును గల్పించుకొనవలయునుగాని యర్వాచీనసూత్రమునుబట్టి ప్రాచీనప్రయోగమును దప్పనుట భావ్యము కాదని యభిప్రాయపడెను. ఈయభిప్రాయము మిక్కిలిసమంజసమని యంగీకరింపకతప్పదు. "కలుకంఠా! క్షమియింపుము" అనుచోట 'కలుకంటా క్షమియింపుము' అనుపాఠమునే నన్నయ ప్రయోగించి యుండునని చెప్పి యగ్రామ్యముగా దీనిని వ్యా॥ సం॥ స॥ సాధించినది. కలుకంఠశబ్దతద్భవరూపము 'కలుకంటు' అని యుండుననియు, దీనికి సంబోధనమం దదాగమదీర్ఘములు రాఁగా 'కలుకంటా' అనురూపము సిద్ధించునని చెప్పుట యెంతయు సమంజసముగా నగపడుచున్నది. ప్రాచీనకవిప్రయోగము ననుసరించి పలువు రర్వాచీనకవు లట్టిప్రయోగము చేసినచో దానికి సూత్రకల్పనచేయుట సముచితము. ప్రచురప్రయోగము లేనిదాని కట్టి సూత్రకల్పనచేయుట యుచితము కాదు. తత్ప్రయోగప్రామాణ్యముచే నదిమాత్రము సాధువగును. దినవెచ్చము–రాయబారము–మున్నగునవి

"కఱకంఠముఖా హితాః" అనువచనములోని ముఖశబ్దముచే సాధుత్వమునందునని చెప్పుట యుచితమని తోఁచుచున్నది. లేకున్న వీనినిఁ బ్రాకృతసమములుగా నంగీకరించి సాధుత్వమును సంపాదింపనగును. "ఉత్వ మిత్వం తథా వాత్వం సమాసే మతుబర్థకమ్" అనునథర్వణవచనముచొప్పున నిత్వము సంపాదింపనగును. ఇది రాజభారశబ్దమునకుఁ దద్భవరూపము. 'రాయబార' మనుదాని కిత్వము చేసినచో 'రాయబారి' యగుననియుఁ గొంద ఱనుచున్నారు. 'పీతాంబరః' అనుదానికి 'పీతాంబరము వాఁడు' అనియు 'త్రినేత్రః' అనుదానికి 'మూఁడుకన్నులవాఁడు' అనియు నాభాసబహువ్రీహిరూపములు నిష్పన్నము లగుచున్నవి. స్త్రీత్వమునను - 'మూఁడుకన్నులయది, పట్టుపుట్టమునది' అనియగును. "ఆభాసబహువ్రీహులు త్రివిధసాధ్యసమాసములయందు నుండనగును. తత్పురుషమున శేషషష్ఠీస్థానమున నిల్చునట్టిప్రథమాద్వితీయాకారవిభక్తుల ప్రయోగమూలమున బహువ్రీహ్యాభాసము కలుగునని. "స్యా దాభాసబహువ్రీహిః" అనునథర్వణకారికకర్థము. బహువ్రీహియర్థము లభించినను బహువ్రీహిలక్షణలక్షితము కానందున నచటిబహువ్రీహి యాభాసమే యగును. "షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్" "క్వచి దన్యవిభక్త్యర్థే ప్రథమాపి ప్రదృశ్యతే" అనువచనములచొప్పున వచ్చినప్రథమాద్వితీయావిభక్తులప్రయోగమున బహువ్రీహ్యర్థము భాసించును. పీతాంబరముయొక్క వాఁడు = పీతాంబరమున్ వాఁడు = పీతాంబరము వాఁడు - మొదలగునవి యుదాహరణములు. 'మెఱుఁగుబోఁడి, తమ్మికంటి' మొదలగునవి యుపమానగర్భబహువ్రీహులని చెప్పఁబడినది. చతుర్దన్తి-అనుదానికి 'చౌదన్తి' అనునది వైకృతము.

215. సూ. 6 :- కేలుదమ్మి-మోముదామర-కైచిగురు-మోవిపండు-అడుగుచిగురు-మైదీఁగ-చెక్కుటద్దము-కన్నుగలువ-కానుమిన్ను- ఇత్యాద్యా ఉపమానాఖ్యాస్సమాసాః. "ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే" ఇతి శాస్త్రేణ పురుష

వ్యాఘ్రః, రాజచంద్రః—ఇత్యాద్యా స్సమాసా స్సిద్ధాః. తదనుసారేణాత్రాపి 'మానిసిపులి, రాచచందురుఁడు' ఇత్యాద్యా స్సమాసాః కల్పనీయాః. యత్ర సామాన్యధర్మస్యాప్రయోగః "ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే" ఇతి తత్సమాసానుశాసనాత్. సామాన్యధర్మస్య ప్రయోగే రూపకసమాసః- "మయూరవ్యంసకాదయశ్చ" ఇతి శాస్త్ర మత్ర బీజమ్. తత్రోత్తరపదస్య ప్రాధాన్యమితి వ్యాకరణపారదృశ్వానః.

వి :—'కేలుఁదమ్మి, మోముదామర. . .కౌనుమిన్ను' అనువఱకుఁ గలమూలములోనిసమాసము లన్నియు నుపమానసమాసములే. "ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే" అనుశాస్త్రముచొప్పున 'పురుషవ్యాఘ్రః, రాజచంద్రః' మున్నగుసమాసములు సిద్ధించుచున్నవి. వాని ననుసరించి తెనుఁగునఁగూడ 'మానిసిపులి, రాచచందురుఁడు' మున్నగురీతిని సమాసములు కల్పించుకొనవలెను. సామాన్యధర్మమునకుఁ బ్రయోగము లేనపుడు "ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే" అనుచొప్పున సమాసము సిద్ధించుచున్నది. సామాన్యధర్మమునకుఁ బ్రయోగ మున్నపుడు రూపకసమాస మగును. దీనిని 'మయూరవ్యంసకాదయశ్చ' అనుశాస్త్రము సాధించుచున్నది. ఇట్టి సమాసములయం దుత్తరపదార్థమునకుఁ బ్రాధాన్య ముండునని వ్యాకరణశాస్త్రనిష్ణాతలు చెప్పుచున్నారు.

215. సూ. 7 :- అతఏవ ప్రసన్నం దృగబ్జమిత్యాదౌ రూపకాలఙ్కారః. "మాం వీక్షతే దృగబ్జేన సేయం ద్విరదగామినీ" ఇత్యాదౌ పరిణామః. "హేతునా కేన ముగ్ధే తే చలత్యధరపల్లవః" ఇత్యాదౌ రూపకోపమయో స్సాధకబాధకప్రమాణాభావాత్సన్దేహః. "పరిణామః క్రియార్థశ్చేత్ విషయీ విషయాత్మనా" ఇతి లక్షణా ద్విషయిణో విషయాత్మతా ప్రకృతకార్యోపయోగితాసిద్ధయే యత్ర కవినా నిబధ్యతే తత్ర పరిణామః. తదన్యత్ర రూపక మిత్యాలఙ్కారికసిద్ధాన్తః.

వి :— "ప్రసన్నమైనదృగబ్జముతో నీమదిరేక్షణ నన్నుఁ జూచుచున్నది" అనునెడ 'దృగబ్జము' అనునది రూపకాలంకారము. దృక్క—

నం దబ్జత్వ మిందుఁ జూపఁబడినదిగదా! "ఈద్విరదగామిని దృగబ్జముతో నన్నుఁ జూచుచున్నది" మున్నగుచోట్లఁ బరిణామాలంకారము. "ఓ ముద్దరాలా! ఏహేతువుచే నీయధరపల్లవము చలించుచున్నది?" అను చోట నధరపల్లవ మనునది రూపకసమాసమా? ఉపమితసమాసమా, యని సందేహము గలుగుచున్నది. వీనిలో నేసమాసమునైనను సాధించుటకుఁగాని బాధించుటకుఁగాని యధరపల్లవమనుచోటఁ బ్రమాణము లగపడవు. కావున దీనిని సందేహాలంకారమని చెప్పనగును. ఉపమానోపమేయముల కెచటఁ బ్రకృతకార్యోపయోగిత్వము సిద్ధించుటకో అను సమానధర్మము నిబంధింపఁబడునో యచటఁ బరిణామాలంకారమనియు, నది లేనిచోట రూపకాలంకారమనియు సంస్కృతాలంకారికుల సిద్ధాంతము.

215. సూ. 8 :- "నెత్తమ్ములతమ్మలైనకనుదమ్ముల" నిత్యాదేః కవివచనస్య పౌనరుక్త్యగ్రస్తత్వా త్కథం సాఙ్గత్య మితిచేత్ -

"ఉపమానానువాదే తు విధి రన్యస్య సమ్మతః ।
స్యా ద్విశేషవివక్షాయాం పునరుక్తిః క్వచిద్ధితా"

ఇత్యథర్వణోక్త్యా తత్సాధుత్వ మవధేయమ్. విశేషవివక్షాయాం గుణవిశేషవివక్షాయా మిత్యర్థః ప్రకృతే వైపుల్యలక్షణగుణవిశేషవివక్షాయాం పునర్విశేషణప్రయోగ ఇతి న పౌనరుక్త్యమ్. "తనచిన్నిరామచంద్రుని నగుమోముదామరసిరుల్" ఇత్యాదికం వచన మనువాద ఆన్ధ్రకవీనామ్. ఉభయత్రాపి న సంస్కృతకవీనా మస్వరసః. "ముఖపఙ్కజం భవతి చన్ద్రసన్నిభమ్." "కుచకలశకిశోరకౌ కథఞ్చిత్తరళతయా తరుణేన పస్పృశాతే" "ప్రసన్నేన్దునిభ స్తస్యాస్తదాసీ న్ముఖచన్ద్రమాః" ఇత్యాది తత్కవిప్రయోగాత్.

వి :- "ఉపమానము ననువదించునపుడు మఱియొకయుపమానపదమును బ్రయోగించుట సమ్మతమగును"-అని "ఉపమానానువాదేన" అనుదాని కర్థము. "తనచిన్నిరామచంద్రునినగుమోముదామరసిరుల్" అనునది యుదాహరణము. తనయొక్క చిన్నవాఁడైనరామచంద్రునియొక్క నగుమో మనునట్టితామరయొక్క శోభలు-అనునది

రామాయణార్థము. ఈచెప్పిన రామాయణార్థ మగుచుండఁగా నీక భారతార్థమునందుఁ దనచిన్న భార్య యగుమాద్రియొక్క 'చంద్రుని నవ్వునట్టిమోము తామరలశోభ' లని యర్థ మగుచున్నది. గుణవిశేషమును వివక్షించునపు డాయుపమానముతోడనే మరలఁ బోల్చుట యొకానొకయెడ సమ్మతమగును" అని "స్యా ద్విశేషవివక్షాయాం పునరుక్తిః క్వచి ద్ధితా" అనుదాని కర్థము. "నేత్రమ్ములతమ్మ లైన కనుదమ్ములు" అనున దుదాహరణము. ఇచట విపులత్వ మనుగుణవిశేషము వివక్షింపఁబడినదికాన నిది పునరుక్తి కాదు. ఈ రెండువిషయములయందును సంస్కృతకవులకు మతభేదము లేదనిమూలమునఁ జెప్పఁబడినది.

215. సూ. 9 :— ననూపమితసమాసే సాధారణధర్మవాచకప్రయోగాభావే "లిలంఘయిషతో లోకా నలంఘ్యా నలఘీయసః । యాదవాంభోనిధీన్ రుద్ధే వేలేవ భవతః క్షమా ॥" ఇతి మాఘోక్తౌ సాధారణధర్మప్రయోగస్య సత్త్వేపి వేలేవేత్యుపమైవోపమితసమాసస్య సాధకప్రమాణమితి తద్వ్యాఖ్యానకారోక్తిః కథం సఙ్గచ్ఛత ఇతి చే త్సత్యమ్. సాధారణధర్మస్యానుగామిత్వ మితిమతే నాత్ర విశేషణ స్యానుగామిత్వమ్. ఏకత్ర లఙ్ఘనం జలపూరణే నాక్రమణమ్. అన్యత్ర విజయ-ఇత్యాద్యర్థభేదస్య విద్యమానత్వాత్. అతఏవ "భాష్యాబ్ధిః క్వాతిగమ్భీరః క్వ చాల్పవిషయా మతిః" ఇతి కైయటోక్తౌ ఏకత్ర గామ్భీర్యం దుష్ప్రవేశత్వమ్; అన్యత్ర దుర్విజ్ఞేయత్వమితి నానుగామిత్వ మిత్యభియుక్తై రుక్తమ్. మనోరమాయాన్తు "అత్ర గాంభీర్యేణ సాదృశ్యం న వివక్షితమ్. కిన్తు వితతదురవగాహత్వాది నాస్య చానుప్రయోగోఽ స్త్యేవేతి సమాసో నిర్బాధఏవ" ఇత్యుక్తమ్. "ఆశ్రిత్య శబ్దమాత్రం సామాన్య మిహాపి సమ్భవతి" ఇత్యాలఙ్కారికమతమ్. అతఏవ బాష్పేణ మలినం నయననలినమ్— ఇత్యాదౌ బాష్పేణ మలినమితి విశేషణమే వోపమితసమాససాధక మిత్యుక్త్వా "అపవిక్రమపఙ్కేచో దారణే ధరణీభృతామ్। నిర్ధూతారిబలాటోపో రేజే రాజపురన్దరః ॥" ఇత్యాదౌ సాధారణధర్మస్యైవ రూపకసాధకత్వ మిత్యుక్తం తైః. తన్మతరీత్యా త్వత్ర ప్రకృతయాదవానామేవ తద్విశేషణవివక్షేతి కథఞ్చి త్సమాధేయమ్. వస్తుతస్తు సాధారణధర్మస్య సత్త్వా త్తత్ర రూపకమేవ. వేలేవే త్యుపమైవేతి నకిఞ్చి ద్బాధకమ్. వేలేవేత్యుపమైవ సాధయ త్యుపమామితి యదుక్తం త న్న క్షోదక్షమమ్.

"యాతవ్యపార్ష్ణిగ్రాహాదిమాలాయా మధికద్యుతిః ।
ఏకార్థతన్త్రప్రోతాయాం నాయకో నాయకాయతే ॥"

ఇతి మాఘోక్తావేవ 'ఏకార్థతన్త్ర' ఇత్యత్ర రూపకత్వే అధిష్ఠానతిరోధానే సారోప్యమాణ తన్త్రత్వస్యైవోపోద్బలకత్వాత్ప్రోతత్వసిద్ధిః. తద్బలాదేవ "పార్ష్ణిగ్రాహాది మాలాయా" మిత్యత్రాపి రూపకమేవ. 'నాయకో నాయకాయతే' ఇతి తూపమైవ. అన్యథా అనుశాసనవిరోధాత్. రూపకానుప్రాణితేయ ముపమేతి స్వైనైవోక్తం కథం సఙ్గచ్ఛత ఇతి విచార్యతామార్యై రిత్యల మస్థానవిశేషవిచారసంరమ్భేణేతి. ప్రకృత మనుసరామః.

వి :— "లోకముల నన్నింటి నతిక్రమింపఁదలంచినట్టియుఁ, దన్నతిక్రమించువారు లేనట్టియు మిగులఁగొప్పదైనయాదవసేనాసముద్రమును వేలవలె నీయోరిమి నిరోధించుచున్నది"—అని ధర్మరాజు నుద్దేశించి పలికినపలుకులివి. ఇదిమాఘకావ్యములోనిది.ఇందుసాధారణధర్మప్రయోగ మున్నను 'వేలేవ' అనునుపమయే యుపమితసమాసమునకు సాధకప్రమాణ మని చెప్పినమాఘకావ్యవ్యాఖ్యాతృవచన మెట్లు సరిపడుననినచో సాధారణధర్మమున కనుగామిత్వ మనుచొప్పున విశేషణమున కిచట ననుగామిత్వము లేదు. సముద్రపక్షమున లంఘనశబ్దమునకు జలపూరణముచే నాక్రమించుట యనియు, సైన్యపక్షమున విజయ మనియు నర్థభేదము వెలయుచున్నది. ఇట్లే "భాష్యాబ్ధిః క్వాతిగంభీరః" అనుచోట నొకపక్షమున గాంభీర్యశబ్దమునకు దుష్ప్రవేశత్వమనియు, రెండవపక్షమున దుర్విజ్ఞేయత్వమనియు నర్థము కలుగుచున్నది. ఈకారణముచే నిచటఁగూడ ననుగామిత్వము లేదని పెద్దలనుచున్నారు. మనోరమయందును "నిచట గంభీరశబ్దముచే సాదృశ్యము వివక్షింపఁబడదు. వితతత్వ దురవగాహత్వములే గ్రహింపఁబడును. ఇచటఁగూడ సాధారణధర్మమున కనుగామిత్వము లేదు. కాన సమాసము నిర్బాధమే" యని చెప్పఁబడినది. శబ్దమాత్రాశ్రయముచే నిచటఁగూడ సామాన్యధర్మప్రయోగము కలదనియే యాలంకారికులమతము. కావుననే "బాష్పేణ మలినం నలిన నయనమ్" మున్నగువానియందు "బాష్పేణ మలిన" మ్మనువిశేష

ణామే ఉపమితసమాససాధకమని వచించి 'రాజపురందరుఁడు' అనురూపకత్వసాధకము సాధారణధర్మమే యని వచించియున్నారు. "ధరణీభృతామ్"=రాజులయొక్క-పర్వతములయొక్క, దారణే=చీల్చుటయందు, అపవిక్రమసంకోచః=పరాక్రమసంకోచము లేనట్టియు, నిర్ధూతారిబలాటోపః=శత్రుబలాటోపము నెగఁజిమ్మినట్టియు, రాజపురందరః=రాజదేవేంద్రుఁడు-అని దానియర్థము. వారిమతమునందుఁబ్రధానులైనయాదవులకే యీవిశేషణవివక్ష యని యెట్లో సమాధానముచెప్పుకొని సరిపుచ్చుకొనవలయును. నిజమున కచట సాధారణధర్మ ముండుటచే రూపకసమాసమే యగును. దీనిచే "వేలే వేత్యుపమా" అనుదాని కించుకయు బాధ కలుగదు, "వేలే వేత్యుపమా సాధయ త్యుపమామ్" అను మాట విమర్శమునకు నిలువదు. శత్రువులపార్శ్వభాగములను నొప్పించు సైనికులను పార్ష్ణిగ్రాహు లందురు. వీరివరుస మాలికగాఁ బోల్పఁబడినది. వీరు పోవునపుడు వీరివరుస మాలికవలె నుండును. మాలికకు నాయకమణివలె నీసైనికులనాయకుఁ డగ్రభాగమున నుండును. మాలికకు నాయకమణి యెట్టిదో యీనాయకుఁడు పార్ష్ణిగ్రాహాదిమాలకు నట్లే నాయకమణివంటివాఁడు. మణు లన్నియు నొక్కసూత్రమునందుఁ గూర్పఁబడినట్లుగా నేకకార్యరూపతన్తువునందుఁ పార్ష్ణిగ్రాహులు నేకకార్యరక్తులే కదా? కావున వీరినాయకుఁడు నాయకమణివంటివాఁడే యగును. దీనిలో నేకార్థమునందుఁ దంతుత్వ మారోపింపఁబడినది. ఈ యేకార్థతంతుత్వబలముచేతనే "పార్ష్ణిగ్రాహాదిమాలాయా" మనునపుడును రూపకమే. "నాయకో నాయకాయతే" అనునది యుపమ. ఇట్లుండ రూపకానుప్రాణితోపమ యిచట నెట్లు కుదురునో పెద్దలు విచారింపవలెను. ప్రకృతము నాలోచింతము.

**215. సూ. 10 :-** ఉపమాశబ్దస్య సామాన్యవాచకత్వాత్ 'పండుమోవి, తమ్మికేలు, తీఁగకౌను, తామరడుగు' ఇత్యాద్యా ఉపమానపూర్వపదసమాసా గ్రాహ్యాః.

వి :— "ద్విగుకర్మధారయే" అనుసూత్రమందలియుపమాన శబ్దము సామాన్యవాచక మగుటచేఁ బండువెూవి మున్నగునుపమాన పూర్వపదకర్మధారయములును గ్రహింపఁబడుచున్నవి.

215. సూ. 11:-జవ్వాదిసెట్టి, పచ్చళ్ళబాపిత, గాజులసెట్టి, ఇత్యాద్యా ఉత్తర పదలోపాః.

"స్యాదుత్తరస్య లోపేఽపి ద్వితీయాఽనియతా క్వచిత్ ।
అన్యత్రాపి తదిష్టిః స్యాత్ప్రయోగా స్తత్ర కారణమ్॥"

ఇత్యథర్వణః.

వి :— "ఉత్తరపదలోపసమాసమునందును సమాసపూర్వపదము నందును ద్వితీయాతుల్యాకారము కొన్నియెడలమాత్రము వచ్చు" నని "స్యాదుత్తరస్య" -అనునథర్వణకారిక కర్థము. ఉత్తరపదలోపేతర సమాసస్థలమునందును నాద్వితీయాతుల్యాకారస్థితి కొన్నియెడల నమ్మత మగును. ఆస్థితికి మహాకవిప్రయోగమే మూలము. 'జవ్వాదిని అమ్ము సెట్టి" అనునపుడు ద్వితీయాకారముతో నుత్తరపదము లోపించి జవ్వా దిన్+సెట్టి=జవ్వాదిసెట్టి, ఊరన్+తిరుగు+పంది=ఊరఁబంది. పచ్చ ళ్లన్+రుబ్బు+బాపిత=పచ్చళ్లబాపిత. ఇట్లేగాజులసెట్టి-మోముదమ్మి తేఁగకొను-వేపల్లెవాడ మున్నగునవి- "అన్యత్రాపి క్వచిద్భవేత్" అనుదాని కుదాహృతులు. దానియొక్క+కలరూపు=దానిన్+ది+కల రూపు=దానిది కలరూపు. వీరియొక్క+నిశ్వాసములు=వీరిన్+వి+ నిశ్వాసములు=వీరివి నిశ్వాసములు. రామునియొక్క+శక్తి=రాము నిన్+ది+శక్తి=రామునిది శక్తి-మున్నగునవిషష్ఠి ద్వితీయాకారముతో నిలుచుట కుదాహృతులు.

215. సూ. 12 :- ఆదిశబ్దేన అఱఁగన్ను, క్రీఁగన్ను, సామేను, కొనచెవి, పెడ తల, ఇత్యాద్యా ఏకదేశసమాసా గ్రాహ్యాః. ఆదిశబ్దేన తావిమొల్ల, పువ్వునీళ్ళు, ఇత్యాద్యా మతుప్సమాసా గ్రాహ్యా ఇతి పరస్పతోక్తమ్.

"ఉత్వ మిత్వం తథైవాత్వం సమాసే మతుబర్థకమ్" ఇతి.

ఉకారాదే ర్మతుబర్థకతా సమాసేఽస్త్రీతి ద్వితీయాచార్యసిద్ధాన్తా దత్ర మతుబన్తేన

సహ కర్మధారయో బోధ్యః. రవ్వమానిసి, ఇత్యాదిక ముక్తానోదాహరణమ్. కుసుమ రసపక్షే పువ్వునీరు, ఇత్యత్ర షష్ఠీసమాసో బోధ్యః. కచ్రకేవ, మేనసగము, మైసగము-ఇత్యాద్యాఅపి క్వచిత్సమాసా స్సన్తి.

“పూర్వత్వ మపరత్వం స్యా న్నామ్నాం సేతుప్రయోగతః”

ఇత్యథర్వణోక్తేః. రాజహంసాద్యనుసారేణ, రాయంచ, రాచిలుక, ఇత్యాదిసమాసా గ్రాహ్యాః.

వి :— అ-ఇ-ఉ-అనునవి సమాసములందు అ స్వార్థకములుగాఁ బదములతుదని నిల్చును. అనఁగా అ-ఇ-ఉ-అనునవి మతుబర్థకములై సమాసాంతమున నిలుచునని యర్థము. అలరువిల్తుఁడు (అలరు+విల్లు+త్ +ఁడు) ఇచట వ్యంజనతకారము సమాసాంతప్రత్యయమైనచో నదంత ప్రాతిపదికము ‘అలరువిల్త’ అనియై యుత్వాదుబ్జులతో ‘అలరువిల్తుఁడు’ అని యగును. ఈప్రక్రియ సరిగా నగపడదు. ‘త’ అనునది సమాసాంత ప్రత్యయమన్నచో నుత్వము డుబ్జువచ్చి ‘అలరువిల్తుఁ’ డగునని యనుట యుచితము. అలరు విల్లుగాఁ గలవాఁడని యర్థము. ఈపక్షమున మతుబర్థకముగ ఉకార మిచట వచ్చినదనుటకు వీలులేదు. అత్వముతోఁ దకారము వచ్చిననగు కమ్మవిల్తుఁడు-పచ్చవిల్తుఁడు-మున్నగునవియు నిట్లే సాధువు లగును. మత్వర్థకోకారమున కిచటఁ బ్రసక్తి లేదుగానఁ గవిశిరోభూషణము దాని నుదాహరించుట సరిగాదు. సర్వధని-మున్నగు సంస్కృతసమాసములందును నిట్లు మత్వర్థీయప్రత్యయములు నిలుచుట గలదు. చతుర్దంతి-సుకేశి-హిరణ్యకేశి-మున్నగునవి “సమాసములోని పదములు పూర్వావయవముగా నుండుటగాని, యుత్తరావయవముగా నుండుటగాని మహాకవిప్రయోగానుసారముగా నుండును” -అని “పూర్వత్వ మపరత్వం” -అనునథర్వణవచనమున కర్థము. “ద్విగు కర్మధారయా” అనుసూత్రములోనియాదిశబ్దముచే ‘అరఁగన్ను, క్రీఁగన్ను’ మున్నగు నేకదేశసమాసములు గ్రహింపవలయునని కవిశిరోభూషణము నుడివినది. తావిమొల్ల-పువ్వునీళ్లు-మున్నగుమతుప్సమాసములీయాదిశబ్దముచే గ్రహింపవలెనని బాలసరస్వతి వచించెను. “ఉ-ఇ-

అ—అనునవి సమాసాంతమున నిల్చి తెనుఁగున మతుబర్థకము లగుచున్నవి" అని "ఉత్వ మిత్వం" అనుదాని కర్థము. ఈసిద్ధాంతము ననుసరించి 'అరగన్ను, క్రీఁగన్ను' మున్నగువానిలోఁ గర్మధారయసమాసము చేయవలెను. 'రవ్వమానిసి' యనునది అకారమున కుదాహరణము. 'పువ్వునీరు' అనునపుడు షష్ఠీసమాసముచే సాధువగును. అపుడు కుసుమరసమని యర్థమగును. 'కనుక్రేవ' మున్నగుకొన్నిసమాసములు కలవు. వీనిలోఁ బూర్వత్వాపరత్వములు కవిప్రయోగానుసారముగా సాధువు లగునని యథర్వణవచనమువలనఁ దెలియుచున్నది. రాజహంస అనుదానిఁబట్టి 'రాయంచ, రాచిలుక' మున్నగుసమాసములను సాధింపనగును.

215 సూ 13 :— యద్యప్యత్ర సూత్రే ద్విగుకర్మధారయాదీనాం తత్పురుషభేదత్వేన తత్పురుషగ్రహణేనైవ గ్రహణం భవతి; తథాపి తేషాం పృథగ్గ్రహణం సార్థకమేవ. తథాహి— తత్సంప్రయోగదశాయాం సమాసవిశేషాణాం సాకల్యేనాత్రప్రయోగసమ్భవేఽపి కేవలవికృతౌ కేషాంచిత్ప్రయోగసమ్భవేఽపి కేషాంచిదసమ్భవాత్సమ్భవదసమ్భవద్భేదగణనా మన్తరా తత్పురుషశబ్దమాత్రగ్రహణేన ప్రేక్షావతాం నిర్విచికిత్సా మతి ర్నభవతి. అత స్సూత్రకృతా భేదగణనా కృతా. ద్వన్ద్వబహువ్రీహ్యోర్భేదగణనాఽభావేఽపి సాహచర్యబలాదేవ తత్పరిగణన స్యోపలక్షణత్వే తయోరపి సమ్భవదసమ్భవద్భేదవిజ్ఞానం సూక్ష్మధియాం సులభ మేవేతి వాగనుశాసనాశయః.

వి :— "ద్విగుకర్మధారయా...బహువ్రీహిః" — అనుసూత్రమునందుఁ దత్పురుషమును గ్రహించినంతమాత్రముననే దానిలోని భేదములే యగుద్విగుకర్మధారయసమాసములకును గ్రహణము కలుగుచుండఁగా వానిని మరల గ్రహించుట యేల యనినచో సంస్కృతసమాసముల కన్నింటికిని దెనుఁగునఁ బ్రసిద్ధి లేకుండుటచేఁ గొన్నింటికి మాత్రమే యచ్చతెనుఁగునఁ బ్రవేశము కలదు కాన వీనిని వేఱుగాఁ జెప్పకున్నచో బహుళముగా నున్నతత్పురుషసమాసప్రభేదములలో వేనికిఁ

దేనుఁగునఁ బ్రవేశముకలదో, వేనికిఁ బ్రవేశము లేదో తెలియుట కష్టము కావున వేఱుగాఁ బరిగణనము చేయఁబడినదని తెలియనగును.

216. సూ :— కార్యా ఔపవిభక్తికవ దన్తవిధయశ్చ.

216 సూ :— ఔపవిభక్తికవర్ణవిధివత్సమాసాన్తవర్ణవిధయశ్చాత్రాపి కార్యాః, అలరువిల్తుఁడు—ఇత్యత్ర తకారః. ముక్కంటి ఇత్యత్ర బిన్దుపూర్వక టికారః. నచాత్రాపి "తేహి విభక్తౌ సమాసే చ" ఇత్యస్య వ్యాపారః, 'వింటికొప్పు' ఇత్యాదౌ వనన్తే సమాసే తస్య చరితార్థత్వాత్. 'నెత్తమ్మిచూలి' ఇత్యాదౌ వికారః. "మూజ్జగంబుల చూలిబొడ్డువాఁడు" ఇత్యాదయః కవీనాం వాచః. ఉకారాన్తపాఠే త్వథర్వణవచనానురోధే నోకారఏవ సమాసాన్త ఇతి ధ్యేయమ్. చుట్టుకైదువు దాల్పు—ఇత్యాదౌ వువర్ణకః. నలువ ఇత్యాదౌ హ్రస్వస్సమాసాన్తః. వేఁడివెలుఁగు—ఉకారస్సమాసాన్తః.

"క్వచిదన్తిమవర్ణస్య సమాసాన్తత్వమిష్యతే" ఇత్యథర్వణః, 'కలకంఠుఁడు' ఇత్యత్ర రకారః. ఔపవిభక్తికవదితి దృష్టాన్తకథనేన తేషామిష్టానామపి యథాప్రసిద్ధి విధానమేవేతి జ్ఞాయతే. 'అలరువిల్తుఁడు' ఇత్యాదౌ "మహతోఽత" ఇత్యాదివచనేన ఉత్వేఽకజౌ అన్తవిధయశ్చేతి చకారేణ వా తద్విధానమ్.

వి :— కార్యాః, ఔపవిభక్తికవత్, అన్తవిధయః, చ—అని ఛేదము. ఔపవిభక్తికములకార్యములవంటికార్యములే సమసాంతవిధులుగ నిందుఁ జేయవలసియుండునని సూత్రార్థము. 'అలరువిల్తుఁడు' ఇత్యాదులయందు సమాసాన్తకార్యములను జూడనగును. "అలరువిల్తుఁడు ఇత్యాదే "మహత" ఇత్యనే నోత్వేఽకజౌ"— అని వ్రాసినదాని ననుసరించి 'అలరువిల్త' అనిఅకారాంతప్రాతిపదికము నే కవిశిరోభూషణ మంగీకరించిన ట్లూహింపనగును. అట్లంగీకరించినచో, తకార మౌపవిభక్తికమనుట సరికాదు. అలరు విల్లుగాఁ గలవాఁ డనునర్థమున అలరు+విల్+త్+ఉ+ఁడు= అలరువిల్తుఁడు—అని కావలసియున్నది. అపుడు అలరు విల్త్+ఉ+ఁడు=అలరువిల్తుఁడు—అని కావలయును. అట్లగుటకు వీలు లేదు. "మహతోఽత" అనుసూత్రముచే నత్వమున కుత్వమును దుజ్జును రావు. పూర్వమున వ్యంజనతకార మున్నదిగాని అకారము లేదుగదా.

ఇంకను నుటిరియొకరీతి నూహింతము. పొల్లుతకారము సమాసాంతప్రత్యయమైనను మత్వర్థకోకారమును జేసిన అలరువిల్లు-అని యగును. దానికి డుజ్జు చేసిన అలరువిల్లుఁడు అనురూప మేర్పడును. ఇదియు సరిగా నగపడదు. ఇది బహువ్రీహిసమాస మగుటచేత అలురు విల్లుగాఁ గలవాఁడని విగ్రహముకాని యలరువిల్లు వానికిఁ గలదని విగ్రహము కాదుగదా! బహువ్రీహివిగ్రహము నంగీకరించినచో మత్వర్థీయమగు ఉకారము రాదు. మత్వర్థీయప్రత్యయము నంగీకరించిన సమాసాంత కార్యము రాదు. కావున నిట్టివానిలో తా-తు-అనువానిలో దేవినైన సమాసాంత ప్రత్యయముగా నంగీకరించుట సముచితమని తోఁచుచున్నది. 'అలరు విల్లుగాఁ గలవాఁడు' అనునర్థమున నొపవిభక్తికమువంటి 'తి' ప్రత్యయమును జేయఁగా 'అలరువిల్తి' అని యగును. మత్వర్థీయాత్వము చేయఁగా 'అలరువిల్త' అని యేర్పడును. దీని కుత్వడుజ్జులు చేయఁగా 'అలరువిల్తుఁడు' అని యగును. ఇట్టిప్రక్రియనే కవిశిరోభూషణ మంగీకరించినచో నది సముచితమే యగును. చౌదంతి- అనునపుడు 'దంత' శబ్దమునకు మత్వర్థమునందు-ఇ-కారము చేయఁగా 'దంతి' అనియగును. ఇకారముగూడ "క్వచిదన్తిమవర్ణస్య సమాసాన్తత్వమిష్యతే" అనుచొప్పున నొకానొకసమాసాంతిమవర్ణమునకే సమాసాంతప్రత్యయత్వమంగీకరింపఁబడుచున్నదిగదా. కాన 'చౌదంతి' అనునపు డీకారము సమాసాంత ప్రత్యయమని చెప్పవలసియున్నది. 'చౌదంతి' అనునది 'చతుర్దన్తీ' అనుదానితద్భవరూపము.

**217.** సూ :- లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యాత్సమాసకాఙ్గేషు.

217 సూ. 1 :- సమాసకావయవేషు శబ్దేషు విభక్త్యాదే ర్లోప స్స్యాత్- 'జేల్పుదొర, కైదువుదారి' ఇత్యాదౌ విభక్తిలోపః. ఆదిశబ్దేన 'తమ్మికంటి' ఇత్యాదౌ వాచకలోపః. 'వేడికంటీ'త్యాదా వుపమానవాచకలోపః, జవ్వాదియమ్మ శెట్టీదివా 'జసెట్టి' 'నడగుట్టము' 'వడిగుట్టము' 'దేవరబాపఁడు' ఇత్యాదా వుత్తరపదలోపః. 'నడగుట్టము' ఇత్యాదౌ అకారాదే ర్మతుబన్తత్వేన వా నిర్వాహః. ఏవమేవ ప్రయోగానుసారేణ 'కలకంఠుఁడు' ఇత్యాదౌ విభక్త్యాదిలోపో జ్ఞేయః.

వి :- లోపః, చ, విభక్త్యాదేః, శబ్దేషు, స్యాత్, సమాసకాం శేషు- అని ఛేదము. కేవలవికృతిపదములకు వచ్చినసమాసమునకు సమాసకమని పేరు. సమాసకమున కవయవము లగుశబ్దములలో నున్నవిభక్త్యాదులకు లోపము కలుగునని సూత్రార్థము. వేల్పుయొక్క+దార (జాత్యేకవచనము) = వేల్పుదార. ధరతీతి ధారీ-దీనితద్భవరూపము 'దారి' యనునది. 'కైదువు ను ధరించినవాఁడు' అను నర్థమున 'కైదువుదారి' అనియగును. తమ్మివంటికన్ను గలవాఁడు-అనునపుడు వాచకలోపముచే 'తమ్మికంటి' అని యగును. 'వేఁడికంటి' మున్నగుచోట్ల నిట్లే యుపమానవాచకలోపమని తెలియవలయును. 'కఱ (నల్లని) యగు కంఠము గలవాఁడు' అనువిగ్రహమున 'కఱకంఠుఁడు' మున్నగునవి మిశ్రబహుహ్రీహు లనియు, నైనను వీనికి విభక్తిలోపాదులు కల్గునని యూహింపవలయుననియుఁ గవిశిరోభూషణము వచించినది. తెనుఁగుసంప్రదాయము కానిమిశ్రబహువ్రీహి నంగీకరించుట యుచితము గాదు. కాన నన్నయగారిప్రయోగమునందుఁగల 'కఱకంటా' యనునది కఱకంటు - అనుదానిసంబోధనమనియుఁ, గరకంఠశబ్దభవము 'కఱకంటు' అనియు నూహించుట యుచితమని తోఁచుచున్నది.

217 సూ. 2 :- చకారా దలుక్సమాస ఆచార్యస్యాపీష్ట ఇతి విజ్ఞాయతే మంటలమారిఇత్యాదౌ "అన్యత్రాపీ" త్యథర్వణోక్త్యా ద్వితీయా స్థితిరితి జ్ఞేయమ్.

వి :- "లోపశ్చ విభక్త్యాదేః" అనుసూత్రములోని చకారము వలనఁ దెనుఁగునం దలుక్సమాసము లుండుట యాచార్యులవారికిఁగూడ నిష్టమేయని తెలియుచున్నది. 'మంటలమారి' అనఁగా మంటలతోఁ జంపునది. ఇట్టిచోట నున్నమంటలు మున్నగువానికి లోపము మున్నగునవి లాక్షణికార్థములు. 'మందులమారి' మున్నగునవియు నిట్టివే. ఇట్టియెడ "అన్యత్రాపి త ద్దృష్టి స్స్యా త్క్వచి త్సుకవిసమ్మతేః" అను నథర్వణవచనముచొప్పున 'యొక్క'అనుప్రత్యయమునకే గాక, తృతీయాది

విభక్తులకును ద్వితీయాతుల్యత గలిగి లోపము వచ్చినదని తెలియవలెను.

217. సూ. 3:- సమాసానాం సఙ్గ్రహేణ చాతుర్విధ్యమ్. పూర్వపదార్థప్రాధాన్యోత్తరపదార్థప్రాధాన్యోభయపదార్థప్రాధాన్యాన్యపదార్థప్రాధాన్యభేదాత్. 'క్రేఁగన్ను, పెడతల' ఇత్యాదౌ పూర్వపదార్థ ప్రాధాన్యమ్ 'పండువెన్నెల' ఇత్యాదావుత్తరపదార్థప్రాధాన్యమ్. 'తల్లిదండ్రులు' ఇత్యాదావుభయపదార్థప్రాధాన్యమ్. 'వాలుగంటి' ఇత్యాదావన్యపదార్థప్రాధాన్యమితి విశేషః.

వి :- పూర్వపదార్థప్రధానములు, నుత్తరపదార్థప్రధానములు, నుభయపదార్థప్రధానములు, నన్యపదార్థప్రధానములునని సమాసములు నాలుగువిధములు. కంటియొక్క-క్రేవ-అనువిగ్రహమున 'క్రేవ+కన్ను= 'క్రేఁగన్ను' అని యైనది. కావున నిది పూర్వపదార్థప్రధానము. ఇట్లే తలయొక్క+పెడ-'పెడతల' అనునదియును. పండువెన్నెల-పండఁబారినవెన్నెల-అనునర్థమున నుత్తరపదార్థప్రధాన మగును. 'తల్లిదండ్రులు' అనునది యుభయపదార్థప్రధానము. 'తల్లియుఁదండ్రియు' నని విగ్రహము. 'వాలినకన్నులు గలది'-అనునర్థమున 'వాలుగంటి' యని యన్యపదార్థప్రధాన మగుబహువ్రీహి యగును. సంస్కృతసమాసములలోఁ బూర్వపదార్థప్రధానసమాసము లవ్యయీభావములే యగుచున్నవి. ఇచట నున్నపూర్వపదార్థప్రధానసమాసము లట్టివి కావు. తెనుఁగున నవ్యయములే లేవు.

**218 సూ - కేవలవికృతిపదై ర్యస్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః.**

218. సూ :- శుద్ధాన్ధ్రపదై ర్యస్సమాస స్త మాన్ధ్రవాక్యజ్ఞా స్సమాసకసంజ్ఞకం వదన్తి. 'నిండుపున్నమనాఁటిజాబిల్లి, చల్లనిమిన్నారితేట, పేరామనిచివురుసౌరు, కమ్మావి, ప్రానిదోటనీటు' ఇత్యాది.

వి:- కేవలవికృతిపదైః, యః, సమాసకం, తం, బ్రువన్తి, వాక్యజ్ఞాః -అని ఛేదము. ఇచట "కేవలవైకృతశబ్దై ర్యస్సమాసకం బ్రువన్తి వాక్య

జ్ఞాః” అనుసారము ఛందోదోషదూషిత మగుటచే గ్రహింపఁదగినది కాదు. తత్సమపదములతో సమ్మిశ్రితము కాక, కేవల మచ్చ తెనుఁగు శబ్దములతో నేర్పడినసమాసమును సమాసకమని వాక్యవిదులు పిలుచు చున్నారని సూత్రార్థము. నిండైనపున్నమ నిండుపున్నమ, నిండుపున్న మయొక్క+నాఁడు, నిండుపున్నమనాఁడు, నిండుపున్నమనాఁటియొక్క+ జాబిల్లి, నిండుపున్నమనాఁటిజాబిల్లి. ఈ విగ్రహమునందు వచ్చిన విభక్త్యాదులకు “లోపశ్చ విభక్త్యాదేః” అనుచోఁవ్వాన లోపము కలుగును. సమాసకములలో నంతటను నిట్లే విభక్తిలోపము కలుగునని యూహింపవలయును.

219. సూ:— సంస్కృతవైకృతశబ్దై ర్మిశ్రసమాస స్సఏవ విజ్ఞేయః.

219. సూ. 1:— సంస్కృతసమశుద్ధాంధ్రపదై ర్య స్సమాస స్సఏవ మిశ్రసమాస ఇతి జ్ఞేయః. ‘పద్మాకరపుఁదావిచెలువు, సర్వైశ్వర్యపులక్ష్మి సెలవు, పంటకలువకంటి పట్టిరామణీయకము, మేటిమునిరాజు, బ్రహ్మదండపుఁగ్రైదువు’ ఇత్యాది.

వి:— సంస్కృతవైకృతిశబ్దైః, మిశ్రసమాసః, సః, ఏవ, విజ్ఞేయః— అని ఛేదము, తత్సమాచ్ఛికశబ్దములలో నేర్పడుసమాస మేది కలదో దానినే మిశ్రసమాసమని తెలియనగునని సూత్రార్థము. ‘తావియొక్క+చెలువు=తావిచెలువు’ అనునిది సమాసక మగుటచే నిందు ‘లోపశ్చ విభక్త్యాదేః’అని విభక్తిలోపముకలుగును. ‘పద్మాకరముయొక్క+తావిచెలువు’ అనుచోట షష్ఠికి ద్వితీయాతుల్యత కలిగి ద్రుతము లోపించును. ముపర్ణకమునకుఁ బుంపులు వచ్చును. పరుషవర్ణపరకత్వమునం దీపుంపులకు నుగాగమము వచ్చి ద్రుతకార్యము జరుగును. ‘పద్మాకరము’ అనుతత్సమపదముతో ‘తావిచెలువు’ అనునాచ్ఛికమునకు సమాసము కలిగినది. కావున దీనిని మిశ్రసమాసమని చెప్పవలయును. మిగిలినవాని నిట్లే తెలియవలయును.

219. సూ. 2 :- నను 'మునిరాజు' ఇత్యత్ర సాన్తాద్వా టజన్తాద్వా డువిధానస్య వైరూప్యమ్. తథాపి శాస్త్రస్య స్వారస్యం కథం వర్తత ఇతిచే చ్ఛృణు. "ఆత్మన ఇమనన్తానామ్" ఇతి సూత్రే సాన్తప్రాతిపదికాదేవ తద్విధానా త్సహాచరితస్యాయో నాత్రాపి తాదృశస్యైవ గ్రహీతు ముచితత్వా దసమాసే సాన్తా త్సమాసే టజన్తాదితి వ్యాఖ్యాన స్యాత్యన్తక్లిష్టత్వాచ్చ.

"స్వార్థప్రాధాన్యభావే స్యా ద్రాజ్ఞో డుః పుంసి చేతనే" ఇత్యథర్వణసూత్రే హేరరాజాదిశబ్దానాం టజన్తత్వమేవే త్యేతాదృశతాత్పర్యం బోధయత శ్చేతన ఇతి ఇబన్తపదస్య స్వారస్యాచ్చ, 'నాన్నన' సూత్రగతసదాపదప్రయోగపర్యాలోచనాచ్చ సాన్తాదేవ డువిధిరితి విజ్ఞాయతే. తథాపి 'కృత్తద్ధిత' సూత్రేణ టజన్తస్య ప్రాతిపదికసంజ్ఞాయాం తస్మాదేవ సుప్రత్యయ ఇతి హ్యేద్యవ్యాకరణమర్యాదా. తస్య సోఽస్థానే డు రిత్యేతద్వ్యాకృత్యనుశాసనస్థితిరితి టజన్తాదేవ డురితి ప్రతిభాతి.

వి :- 'మునీనాం రాజా' అనువిగ్రహమున "రాజాహస్సఖిభ్యష్టచ్" అనుచోప్పున 'టచ్' వచ్చి మునిరాజఃఅనెడి అకారాంతరూప మొకటియు, 'రాజన్' అనుప్రాతిపదికరూప మొకటియు, 'రాజా' అను ప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికరూప మొకటియుఁ గలవు. ఈమూఁటిలో "డుస్స్యాత్సదారాజ్ఞః" అను 'డు'ప్రత్యయము నాన్తప్రాతిపదికముకంటె రావలెనా? టజంతముకంటె రావలెనా? యని శంక. "ఆత్మన ఇమనన్తానాం డావా" అనుసూత్రముచే నాత్మన్, మహిమన్, గరిమన్ మున్నగువానియందు డాప్రత్యయము నాంతముకంటె వచ్చుచున్నది కాన, "డు స్స్యా త్సదా రాజ్ఞః" అనుసూత్రముచొప్పున వచ్చు డుప్రత్యయము నాంతముకంటె విధించుట సమంజసమని తోఁచుచున్నది. "స్వార్థప్రధానభావే స్యాత్ రాజ్ఞో డుః పుంసి చేతనే" రాజశబ్దమున కనుపసర్జనత్వమునను, బుంస్త్వమునను, జేతనవాచిత్వమునను మాత్రమే చింతామణి చెప్పిన డుప్రత్యయము వచ్చును" అని యథర్వణవచనమున కర్థము. నమన్మునిరాజుఁడు = నమస్కరించుచున్న మునిరాజులు కలవాఁడు రాముడు. 'నమన్మునిరాజ సీత=నమస్కరించుచున్న మునిరాజులు కలది సీత. ఈరెండు నుపసర్జనత్వమున నుదాహరణములు.

'సమస్మునిరాజుఁడు' అనునది, అకారాంతమైన 'సమస్మునిరాజ' శబ్దముపై సుత్వాదుజ్ఝులు రాఁగా నేర్పడినరూపమే. 'బహురాజము, బహురాజ' మున్నగున వన్నియు నుపసర్జనములే. సురాజ యయ్యె వసుధ= శోభన మైనరాజు కలది. 'హారరాజము' అనున దనుపసర్జనము. హారరాజ మనునపుడు చేతనత్వము లేనందున నథర్వణవచనానుసారముగా 'డు' ప్రత్యయము రాలేదని తెలియవలయును. 'మునిరాజు' అనునపుడు టజంతమైన "మునిరాజః" అనుదానికి 'మునిరాజ+సు' అనియుండఁగా "డు స్స్యా త్సదా రాజ్ఞః" అనుచొప్పున 'డు' అనునది సుప్రత్యయమున కాదేశమై డిత్వసామర్థ్యమున టిలోపము గలిగి 'మునిరాజు' అని ప్రథమైకవచనలోపము సిద్ధించుచున్నది. 'రాజన్' శబ్దము నకారాంతముకాన దానిప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదిక మగు 'రాజా'అనుదానిని గ్రహించి దానికంటె 'డు' ప్రత్యయము నాగమము చేసి, టిలోపము చేయఁగా రాజు+సు-అనియగును. 'డు' ప్రత్యయము స్త్రీప్రత్యయ మగుటచేఁబ్రథమైకవచనలోపము కల్గి'రాజు'అనురూపము సిద్ధించుననుట లెస్స. రాజన్ అనుప్రాతిపదికముమీఁద 'రాజు' అను రూపమును గవిశిరోభూషణము సాధించుట సరికాదు. ప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికముగాని ద్వితీయైకవచనాంతతుల్యప్రాతిపదికము కాని కుదురనపుడే "క్వచి న్నామగ్రహేష్వైవ" అను నథర్వణవచనము చొప్పున సంస్కృతప్రాతిపదికమును దెనుఁగునందుఁ బ్రాతిపదికముగాఁ దీసికొనుట సంప్రదాయము. ప్రథమైకవచనాంతతుల్యప్రాతిపదికము మీఁద రూపసిద్ధి కలుగుచున్నప్పుడు నామగ్రహణముచేయుట సరిగాదుగదా. టజంతమైనపుడును డుప్రత్యయమును టిలోపసులోపములును జేయఁగా రాజు-అనురూపమే సిద్ధించును. "డు స్స్యా త్సదా రాజ్ఞః" అనుచొప్పున వచ్చిన 'డు' అనుదానిని సుప్రత్యయమున కాదేశముచేయుటవలనఁ బ్రయోజనము లేదు. కావున నట్టికవిశిరోభూషణ ప్రక్రియ సరికాదు.

219 సూ. 3:– 'చెలువయానతి, చెలువానతి'–ఇత్యాదౌ సమాసక ఏవ రూపద్వయమ్ మిశ్రేతు "చెలువయాననము" ఇత్యేవరూపమ్. తత్సమేఽపి 'మదిరేక్షణయాననము, మదగజయానయానందము' ఇత్యేవం రూపమ్.

"వినా లవర్ణం నో సన్ధిర్మిశ్రతత్సమయోర్లుకి"

ఇత్యథర్వణవచనాత్. లుకి-ద్రుతస్య లుకీత్యర్థః.

"నిర్ధారణాదౌ మాత్రం స్యాత్క్వచి న్మాత్రా చ కథ్యతే,
సవర్ణ కాదే స్తద్ధర్మా త్క్వచి త్స్యా ద్వ్యవధానతః"

ఇత్యథర్వణః. 'ఇంతమాత్రము, అంతమాత్రము, ఇచ్చినయంతమాత్రము, ఇచ్చినంతమాత్రము, ఇచ్చినమాత్రము, ఇచ్చుమాత్రము, వచ్చినయంతమాత్రలోన్, వచ్చుమాత్రలోన్, రాముఁడుమాత్రము మాకుఁ బ్రాపు, అతఁడు చూడనిమాత్రన్' ఇత్యాది. "తత్క్షణమాత్రన ముక్తజీవుఁడై", "దీనిమాత్రము", "ఒక్కమాత్రలోన్" ఇత్యాదయో వాగనుశాసనానాం వాచః. "మాత్రం కార్త్స్న్యేఽవధారణే", "మాత్రా స్వల్పేఽపిచ", "స్త్రియాం మాత్రా త్రుటిః పుంసి" ఇత్యాదీ న్యభిధానకారవచనాని.

వి :– 'చెలువ+ఆనతి' అనునపుడు 'వాఽఽతః' అనుచోటను సంధి వికల్పముగాఁ గలిగి రూపద్వయ మేర్పడుచున్నది. మిశ్రసమాసమునందు 'చెలువయాననము' అనురీతిని సంధిలేదు. తత్సమమునందును సంధి రాదు. "మిశ్రతత్సమసమాసములలో షష్ఠీవిభక్తికి ద్వితీయాతుల్యత గలిగి ద్రుతమునకు లోపము కలిగినపుడు లవర్ణముమీఁది 'అ' కారముకుఁదప్ప నితరమో 'అ' కారమునకును సంధి రాదు. లకారముమీఁది 'అ' కారమునకు సంధి యగును"– అని యథర్వణవచనమున కర్థము. కావుననే 'మదిరేక్షణయాననము' మున్నగువానియందు సంధిలేదని తెలుచున్నది. 'చెలువలాననములు, మదిరేక్షణలాననములు, కయ్యంబులాశాపాశంబులు, మాహేశ్వరులిండ్లు, తామరసనేత్రలిండ్లు' మున్నగుచోట్ల లకారము మీఁద నున్న 'అ' కారమునకు సంధి గలిగినది. "నిర్ధారణాద్యర్థములయందు "మాత్రమ్" అనునది నిలుచును. కొన్ని యెడల 'మాత్ర' అనియే నిల్చును. భూతార్థకనవర్ణకవిశేషణముమీఁదను దద్ధ

ర్మాద్యర్థకవిశేషణముమీఁదను వ్యవధానముతోఁగూడ మాత్రశబ్ద ముండవచ్చును” —అని యధర్వణవచనమున కర్థము. ఉదాహరణములను మూలమునఁ జూచునది.

219. సూ. 4 :- అత్రాథర్వణమతం ప్రతిభాతి. ‘భామ యానందము చెందెన్’ ఇత్యాదౌ ‘భామానందముచెందెన్’ ఇత్యాద్యుక్తిః వివక్షితార్థప్రతిభానాభావేన తత్ర సన్ధేరనిష్టత్వేపి సంస్కృతవైకృతయోః ఇకారాకారయో స్తదీయస్వరేణ సన్ధిరిష్టఏవ, లుకితిపదస్వారస్యాత్.

“కుత్రచి త్సంస్కృతీయోఽపి ప్రాణోఽప్యత్ర్య చ్యుతో భవేత్” ఇత్యుక్తేశ్చేతి. “ఏతేన ‘సకలశుభములు శౌరిచ్చు జనులకనఁగ’ ఇత్యాద్యాధునికలాక్షణికోక్తం శాతీపదూష్యతే. “గంగనుకాసెదూటి”, “అత్తానందముఁ జెందె మామకు మదిన్ హర్షంబు సంధిల్లె” ఇత్యాదీని కవివచనానిచ నాతీవదుష్టాని. ‘వినాలవర్ణ’ మిత్యనేన ‘తామరసనేత్రలిండ్ల బందాలుగారె’ ఇత్యాది ప్రయోగోఽపి సాధురితి జ్ఞేయమ్. శబ్దశాసనమతేఽపి “ప్రాయస్తు స్యాత్ కిమాదికస్యేతః” ఇతిసూత్రేణ ‘అనఁజొ్యతుండె నీళ్ళుండఁగాన్’ ఇత్యాదివచనగతరూపాణి గృహ్యన్త ఇత్యుక్తమ్. వస్తుతస్తు ప్రయోగపరంపరాపర్యాలోచనయా వైకృతిప్రకృతిగతయోరేపేకారాకారయోర్వ్యాకృతాచా సన్ధిరితి సంనూచ్యతే. ‘గురువుపోల్కిఁ దనిఁ గొనియాడు’ ‘మిన్నకింకను బాఱిపొమ్ము మీగృహమునకున్” ఇత్యాది వచనరచనాధురీణై రుభయకవిమిత్రాదిభిః కవిభిః ప్రాయశ ఏతన్మతమే వానుసృతమితి ప్రతిభాతి.

వి :— ‘భామ యానందము చెందెన్’ అనుచోట భామానందము చెందెన్—అని సంధిచేసినచో వివక్షితార్థము భాసింపదుగాన సంధి మాని నప్పటికిని సంస్కృతవైకృతములలో నున్న ఇకారాకారములతో సంధి వచ్చుట యిష్టమే—అని ‘లుకి’ అనుపదస్వారస్యమువలనఁ దెలియుచున్నదని యథర్వణవచనాభిప్రాయమువలన వ్యక్తమగుచున్నది. ఈవిషయములో “కుత్రచి త్సంస్కృతీయోఽపి” అనుకారికయు సాయపడుచున్నది. “శౌరిచ్చు’ అనునపుడు సంధి కలుగునని యాధునికలాక్షణికులు చెప్పిన మాట మిక్కిలిదుష్టము కాదు. ‘గంగనుకాసె, అత్తానందము’ మున్నగునవియు మిక్కిలిదుష్టములు కావు. “తామరసనేత్రలిండ్ల, కయ్యంబు

లాశాపాశంబులు-అనునవి 'వినా లవర్ణం" అనుదాని కుదాహృతులు. అనలజ్యోతుండె' మున్నగునవి 'ప్రాయస్తు స్యాత్క్వ-మాదికే స్వేతః' అను చెప్పున సాధువు లగును. "గురువుపో ల్కితని" మిన్న కింకను"-అనుప్రయోగములనుబట్టి వైకృతాచ్చునకు వైకృతాచ్చు పరమైనపుడు సంధి వచ్చు ననుసంగతి తెలియనగుచున్నది కాన "గురువుపో ల్కితని" అనునది సాధువేయగును.

**220. సూ:- సంస్కృతపదేన పరిమిత మాన్ధ్రపదం కర్మధారయో భవతి.**

220. సూ:- స్వల్పం కేవలవికృతిపదం సంస్కృతపదేన సమస్య కర్మధారయ సమాసో భవతి. 'నేఁడిపయోధారలు, వాఁడిమయూఖములు, కలికిభుజంగకన్యకలు, వేల్పువీరభటవర్గము' ఇత్యాది. "కలువదర్భపూరిపలువులు", ఇత్యాద్యాచార్యప్రయోగే "దబ్బపూరిపలువులు"-ఇత్యేవపాఠః "నాచులతలు" ఇతిప్రయోగే షష్ఠీతత్పురుషేణ కథంచి త్సాధుత్వ మున్నేయమ్. "పోయి తము మంచు సుడిగాడ్పుపుష్కరములన్" ఇత్యాదౌ "సుడిగాళ్పుపుష్కరములన్" ఇత్యాద్యాకారేణ వ్యస్తరూపక మాదాయ పాఠ ఏవ సాధుః. స్వల్పత్వం చ షడ్వర్ణపరిమితమితి నియమః.

"ఆన్ధ్రం షడ్వర్ణపర్యన్తం పదం స్యాత్కర్మధారయే" ఇత్యథర్వణవచనాత్. తేన "అతనిఁ దాఁకె పేయిమున్నాలు దంతావళములు" ఇత్యాది తిక్కయజ్వాదికవి వచనాని సాధూని.

వి :- సంస్కృతపదేన, పరిమితమ్, ఆంధ్రపదం, కర్మధారయః, భవతి-అని ఛేదము. అల్పసంఖ్యాకమగువర్ణములు గలయాంధ్రపదము సంస్కృతపదముతోఁ గర్మధారయసమాస మగుననియు, సంస్కృతపదములోనియక్షరపరిమాణముతో సమ మగునక్షరపరిమాణము గలయాంధ్రపదము కర్మధారయసమాస మగుననియు, సంస్కృతపదముతోఁ గొన్ని యాంధ్రపదములు మాత్రమే కర్మధారయసమాసము లగుననియు వివిధరీతుల నీసూత్రార్థమును వచించుచున్నారు. ఇది మిశ్రకర్మధారయమును జెప్పుచున్నది. ద్విగుకర్మధారయతత్పురుషములలో మిశ్రసమాస ముండ నగునని పెద్దలయాశయము. ఈసూత్ర మాయభిప్రాయమును నియ

మించుచున్నదని తోఁచుచున్నది. మిశ్రకర్మధారయము లపరిమితములు గావనియుఁ బరిమితముగా నుండుననియు నర్థము సెన్నుట యుచితమని వ్యా. సం. స. చెప్పినది. అల్పాక్షరకాంధ్రపదము సంస్కృతపదముతోఁ గర్మధారయ మగుచున్నదనునర్థము ననుసరించి కవిశిరోభూషణము "వేఁడిపయోధారలు" మున్నగువాని నుదాహరించినది. 'కఱకుదర్భపూరి పఱుపులు'-అనునపుడు రెండచ్చతెనుఁగుపదములనడుమ దర్భ అనుపద ముండి సమాసము కలుగుట సరిగాదని కవిశిరోభూషణము "దబ్బపూరి పఱుపులు" అని పఠింపుమని చెప్పినది. 'దర్భ' అనునది తత్సమము కాన దానితో మిశ్రసమాసము కల్గుట కభ్యంతర ముండరాదు. ఇంతకుఁ బ్రయోగప్రామాణ్యనిర్ణయమునకు నన్నపార్యుసూత్రమువలె నాతని ప్రయోగము నాధారమగునుగాన 'కఱకుదర్భపూరిపఱుపులు' అనుదానిని సవరింప నవసర ముండదు. నాచుయొక్క+లతలు-నాచున్+లతలు= నాచులతలు, సుడిగాడ్పుపుష్కరములన్-సుడిగాలిపుష్కరములన్- అనురెండును మిశ్రతత్పురుషము లేగదా! పాఠమును మార్పవలసినపని యేమియు నగపడదే. ఆఱువర్ణములపఱకుఁ బరిమితిగల యాంధ్రపదము సంస్కృతపదముతోఁ గర్మధారయ మగును-అని "ఆంధ్రం షడ్వర్ణ పర్యన్త" మ్మనుదాని కర్థమని చెప్పఁబడినది. కాని యీయర్థమునందు దీనికి "వేయిమున్నూఱుదంతావళములు" మున్నగునవి యుదాహరణ ములు కానోపును. అథర్వణవచనమునందలి 'సంస్కృతేన' అనుదానికిఁ దత్సమపద మనునర్థ మెట్లు కలుగును. 'సంస్కృతీయము' అనుదానికే కేవలసంస్కృతపద మని యర్థము చేయవలసియుండఁగా 'సంస్కృతేన' అనుదానికిఁ దత్సమపద మనునర్థ మెట్లగును? కావున నీయథర్వణవచ నమునకు-అనేకమాఱులు-అల్పదండులు-అనునవి లక్ష్యము లగును. 'అనేకమాఱులు' మున్నగునవి యసాధువు లనువారి యథర్వణకారిక నంగీకరింపరని తోఁచుచున్నది. 'వేయిమున్నూఱుదంతావళములు' అను నుదాహరణము దీనికి సరికాదు. ఇది కేవలమిశ్రసమాసము.

221. సూ :- స్వస్వవిభక్తివికారై ర్బహవశ్చ యథాతథం సమస్యన్తే.

221. సూ. 1 :- బహవశ్చాన్యేశబ్దాశ్చ యథాతథం వైకృతాః సంస్కృతైః, సంస్కృతా వైకృతైశ్చ స్వస్వవిభక్తిభి రావిభక్తివికారైశ్చ మిళిత్వా సమస్యన్తే. 'మేటిమునిరాజు, బ్రహ్మదండపుఁగైదువు, తెలిదమ్మికంటి గేహిని, పుట్టినింటిసంపత్తి పెంపు, కలువకంటి కటాక్షంపుగుంపులు' ఇత్యాదయో జ్ఞేయాః. ఏతేన 'పాఁపరాజు. పాఁపవిషము, తేఁపగంధము. ఇత్యాదిసమాసా అపి సాధవః. ఉక్తం చాథర్వణేన—

"సంస్కృతాన్ధ్రపదా న్యత్ర సమస్యన్తే యథాతథమ్ ।
శ్రుతిరఙ్గన మాదాయ విభక్త్యాఽవిభక్తిభిః ॥" ఇతి.
"అభిన్నస్యాపి నాదే స్యా ద్భిన్నేనాఽపి సమన్వయః ।
స్త్రీయశ్చ స్త్రీసమన్వేతో ద్రుత స్స్యా న్నిశ్రుతిః క్వచిత్ ॥"

ఇతి సఏవ. 'మమ్మ నేలినరాముఁడు, మమ్మేలురాముఁడు, మమ్ముఁ జెందనిపాపము, వచ్చియు రానికచంబులు, ఇత్యాదీని పూర్వార్థఉదాహరణమ్. 'దానిగట్టియాపిలుఁదులు' ఇత్యాదౌ షష్ఠీసమాసమధ్యే 'అగు' ఇతి భూధాత్వర్థస్య న సాధుత్వమితి జ్ఞేయమ్. "అతిమానుష మత్యద్భుత మతిదుష్కర మైనకేశవార్జునకృతిన్" ఇత్యాది వచన మాచార్యస్యాపి. "ద్వీపస్కంధారూఢుని నిన్నుఁ జెండ్లిడుకుం గావింపఁగా వచ్చితిన్" ఇత్యుదాహరణ ముత్తరార్థే. 'విస్తరముగ నీయుదంతమును దల్లినిఁ దండ్రినిఁ జెప్పు' ఇత్యాదివచన మాచార్యస్యాపి. 'జగద్గేయుల నన్నపార్యునిని దిక్కసుధీమణి నెఱ్ఱసత్కవిన్' ఇతి సూరకవిపద్యే 'నన్నపండితునిన్' ఇత్యేవపాఠ స్సాధుః.

వి :- స్వస్వవిభక్తివికారైః, బహవః, చ, యథాతథం, సమస్యన్తే- అని ఛేదము. పెక్కుశబ్దములు వైకృతములు సంస్కృతములతోను, సంస్కృతములు వైకృతములతోను దమతమవిభక్త్యవిభక్తులతోఁగూడి సమాసమును జెందుచున్నవని యర్థము. 'మేటిమునిరాజు' మున్నగునవి యుదాహృతులు. 'బ్రహ్మదండపుఁగైదువు' అనునపుడు బ్రహ్మదండముయొక్క కైదు వని యర్థము. షష్ఠీతత్పురుషము కర్మధారయసమాసతుల్యము గావున నే ముపర్ణక మునకుఁబుంపులు కలిగినవని తెలియనగును. 'తెలిదమ్మికంటి గేహిని' అనునపుడు 'ంటి' అనునౌపవిభక్తి వికారము కలిగినది. ఇట్లే 'పుట్టినింటిసంపత్తిపెంపు, కలువకంటికటాక్షంపు

గుంపులు' మొదలగువాని నెఱుంగవలెను. ఈయుదాహరణములందు 'ంపు' అనునుపవిభక్తివికారము కలిగినది. ఇట్లనుటచే 'పాము+రాజు-పాఁపరాజు, పాము+విషము-పాఁపవిషము, వేము+గంధము-వేఁపగంధము' మున్నగువానియందు-ఁప-అనువికారము కలుగును."తత్సమాచ్ఛికశబ్దము లీతెలుఁగునందు సువ్విభక్తులతో సంకలితములై పండితకవీంద్రసమ్మతముగను యథార్థముగను సమసించుచున్నవి"-అని "సంస్కృతాంధ్రపదాన్యత్ర" అనునథర్వణకారికకర్థము. "సంస్కృతమున సమాసములలోఁగలపూర్వనిపాతశాస్త్రపద్ధతి తెనుఁగున వర్తింప" దని యీయాథర్వణవచనము చెప్పుచున్నది. "సమాసగతము లగునవర్ణకాంతాదివిశేషణశబ్దములకు వ్యస్తపదములతో నన్వయము కలుగవచ్చు" నని "అభిన్నస్యాపి" అనుదాని కర్థము. మమ్ము నేలినరాముఁడు-మున్నగునవి యుదాహరణములు. "స్త్రీలింగమైనట్టియు స్త్రీసమమైనట్టియు నిదంతశబ్దములపై నిలిచినద్రుతము (ఇకారాంతస్త్రీలింగశబ్దములమీఁద సముచ్చయాద్యర్థములలో వచ్చిన 'ఉన్' శబ్దములోని యుకారము లోపింపఁగా మిగిలినపొల్లునకారము) కొన్నియెడల 'ని' స్వరూపము కలది యగును" -అని "స్త్రీయశ్చ స్త్రీసమస్యేతో" అనుదానికర్థము. "అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమైన కేశవార్జునకృతి" ననియు నుదాహరణములు. నన్నపార్యునిని-అనునది స్త్రీసమము కాకున్నను నిర్ణుతి కలిగినదిగావున నిది తప్పనియు దీనిని 'నన్నపండితుని' నని దిద్దవలెననియు నభిప్రాయము.

221. సూ. 2:- "తల్లియును నాసహోదరులును మూర్ఖులై", "నన్యుల కానుభద్రమున శతక్రతుజాన కుదృవించెన్" ఇత్యాద్యాచార్యవచనాని. 'పుమాన్ స్త్రియా' ఇత్యాద్యవ్యాకరణానుసారేణ వేద్యాని. ఏవ మన్యాన్యపి రూపాణి సంస్కృతభాషానుసారేణోహ్యాని. అథర్వణేనా ప్యుక్తమ్.

"శబ్దా యేచ సమత్వాన్న"....ఇత్యాదినా.

"సామాన్యస్య వివక్షాయా మేకత్వమపి సమ్మతమ్।
భవే త్సర్వత్ర చ ద్విత్వ మప్యర్థే స్మర్యతే బుధైః॥"

ఇతి తేనైవోక్తమ్. అఙ్గే=స్తనకరచరణాద్యఙ్గప్రయోగవిషయ ఇత్యర్థః. "కాంతకు లజ్జయు రవణము; కాంతము సుజనునకు భూష సౌజన్యనిధీ" ఇత్యాది పూర్వార్ధ ఉదాహరణమ్. సామాన్యేనైకత్వే ప్రాప్తే ద్విత్వ ముచ్యతే ఉత్తరార్ధేన. "సర్వత్రచేత్యుక్తేః సంస్కృతభాషాయా మయం ప్రయోగ స్సమ్మతఏవ." స్తనే తరుణ్యాః పరివృద్ధ్రేవమ్" ఇత్యాదీనాం మాఘాదికవివచనానాం సత్వాత్. అపిశబ్దా దేకత్వ మపి సమ్మతమ్. "కుచ మలరారె నింతులకుఁ గుంకుమచర్చ ఘటింప నత్తఱిన్" ఇత్యాద్యాన్ధ్రకవిప్రయోగాత్. సంస్కృతభాషాయామ ప్యేవంప్రయోగ స్సమ్మత ఏవ." రఘణీ స్తనఏవ దీప్యతే మణిహారావళిరామణీయకమ్" ఇత్యాది శ్రీహర్షాదికవిప్రయోగాత్. అతఏవ వామనాచార్యేణోక్తమ్-"స్తనాదీనాం ద్విత్వవిశిష్టా జాతిః ప్రాయేణ ఇతి. బహువచనప్రయోగస్తు నిర్బాధఏవ.

వి :- తల్లియును- మున్నగుప్రయోగములు సంస్కృతభాషానుసారముగా సాధువు లగునని తెలియనగును. "ఒకానొకప్పుడు నిత్యబహువచనాంతత్వము, నొకప్పుడు నిత్యైకవచనాంతత్వము సమ్మతమగును. ఒకానొకప్పుడు బహుత్వవాచకప్రత్యయము మాత్ర మేయగును. దానివలన నేకవచనార్థము సిద్ధించును. 'అందఱు, అన్ని' మున్నగునవి యుదాహృతులు. "జాతియొక్క వివక్షయందు బహుత్వము చెప్పఁదగు చోటులందుఁగూడ నేకవచనప్రయోగము కవిసమ్మతమై యున్నది. కరచరణాద్యంగవాచకశబ్దములవిషయమునఁ దెనుఁగునందేకాక సంస్కృతమునందును బండితులచే ద్విత్వ మంగీకరింపఁబడుచున్నది- తెనుఁగున బహువచనముఁగూడ నంగీకరింపఁబడుచున్నది" అని సామాన్యస్య వివక్షాయాం" అనుదాని కర్థము. "తల్లియును నాసహోదరులును మూర్ఖులై"

"ధన్యులకానుభద్రదకు శత్రుతుజునకున్" -అను రెండును సమాస విషయకములు గావు. విభిన్నముగా నున్న రెండుకర్తలున్నను వాని విశేషణము బహువచనాంతమై యుండుట కివి యుదాహరణములు కాని యిట 'పుమాన్ స్త్రియా' అనుదానికిఁ బ్రసక్తియున్నట్లగపడదు.

"కాంతకు లజ్జయు రవణము" మున్నగునవి పూర్వార్థోదాహరణములు. "స్తనౌ తరుణ్యాః పరివర్తులేవమ్" అనిసంస్కృతోదాహరణము. "కుచ మలరారె నింతుల" కనునది యేకత్వమున కుదాహరణము. "రమణీ స్తన ఏవ దీవ్యతే" అని సంస్కృతమున నేకత్వమున కుదాహరణము. ఇట్టిప్రయోగములనుబట్టి వామనుఁడు "స్తనాదీనాం ద్విత్వవిశిష్టా జాతిః ప్రాయేణ" అని వచించెను.

ఇతి శ్రీ......చతుర్థో హలన్తపరిచ్ఛేద స్సమాప్తః.

హలంతపరిచ్ఛేదము సమాప్తము.



ఓమ్

విఘ్నేశ్వరాయ నమః

# కవిశిరోభూషణ వివృతి

## క్రియా పరిచ్ఛేదము

**222 సూ :—** ఉపకృతి పరిణతి సంవృతిభేదా త్త్రివిధా క్రియా.

222 సూ :— ఉపకృతి పరిణతి సంవృతి భేదా త్క్రియాఽత్ర త్రివిధా.

వి :— ఉపకృతిపరిణతిసంవృతిభేదాత్, త్రివిధా, క్రియా-అని ఛేదము. సంస్కృతధాతువులు మూఁడువిధములుగాఁ దెనుఁగునఁ దత్సమము లగుచున్నవి. "(1) ఉపకృతి (2) పరిణతి (3) సంవృతి" అనునవి వానిభేదములు.

**223 సూ :—** పుషణ్వాది రుపకృతిః.

223 సూ:- పుష పుష్టౌ, ణు స్తుతౌ, ఇత్యేవమాద్యా క్రియా ఉపకృతిసంజ్ఞా స్యాత్.

వి :— పుషణ్వాదిః, ఉపకృతిః—అని ఛేదము. పుషణ్వాదిక్రియ లుపకృతిసంజ్ఞ కలవి యగుననియర్థము. 'పుష పుష్టౌ, ణు స్తుతౌ' అను రీతి సంస్కృతధాతువులు తెనుఁగునం దుపకృతిసంజ్ఞ నొందుచున్నవి.

**224 సూ :—** అథ భూజ్యాదిః పరిణతిః.

224 సూ:— అథేత్యాన న్తర్యాదౌ. భూ సత్తాయామ్. జి జయే-ఇత్యాదిక్రియా పరిణతిసంజ్ఞా స్యాత్.

వి :— పుషణ్వాదిక్రియలకుఁ బిమ్మట సంస్కృతము లో నున్న భూసత్తాయామ్, జి జయే, మున్నగునవి తెనుఁగునందుఁ బరిణతిక్రియ లనిచెప్పఁబడుచున్నవి.

225 సూ :- అన్యా తు రఞ్జివస్యాదిః.

225 సూ :- అన్యా తు సంవృతిక్రియా తు రఞ్జ రాగే-వస నివాసే ఇత్యాది క్రియా స్యాత్.

వి :- అన్యా, తు, రఞ్జివస్యాదిః—అని ఛేదము. ఉపకృతి, పరిణతి క్రియలను జెప్పినమీఁద మిగిలినది సంవృతిక్రియ యగుచున్నదని యర్థము. రఞ్జ రాగే, వస నివాసే అని సంస్కృతమునఁ బ్రసిద్ధములైనధాతువులు వికృతియందు సంవృతిక్రియలని చెప్పఁబడుచున్నవి.

226 సూ :— స్యా దుపకృతిః కృదన్తా.

226 సూ :- ఉపకృతిక్రియా కృత్ప్రత్యయాన్తా స్యాత్.

వి :- స్యాత్, ఉపకృతిః, కృదన్తా—అని ఛేదము. ఉపకృతి యని చెప్పఁబడినక్రియ సంస్కృతమునందుఁ గృత్ప్రత్యయాన్తమై యిచట నుపకృతి యనుపేరఁ బిలువఁబడుచున్నదని యర్థము.

227 సూ :- సా పరిణతి రయవరన్వితైవ భవేత్.

227 సూ :- సా పరిణతిక్రియా అయ్, అవ్, అర్, ఇత్యేతద్వర్ణాన్తా స్యాత్.

వి :- సా, పరిణతిః, అయవరన్వితా, ఏవ, భవేత్-అని ఛేదము. ఆపరిణతిక్రియ 'అయ్, అవ్, అర్' అనుపరిణామముతోఁగూడి తెలుఁగునందు వర్తిల్లునని సూత్రార్థము.

228 సూ :- సంవృతి రహంతాఽకారా.

228 సూ :- సంవృతిక్రియా అహంతాకారా అలుప్తాకృతిః స్యాత్. ఉపదేశకాలే యత్స్వరూపం తేనైవ తిష్ఠతీత్యర్థః.

వి :- సంవృతిః, అహంతాఽకారా—అని ఛేదము. సంవృతిక్రియ ధాతుపాఠమునందు సంస్కృతమున నెట్లు పఠింపఁబడినదో తెలుఁగున నట్లే క్రియారూపమున నిల్చును. ఉపకృతి, పరిణతులు వరుసగాఁ గృత్ప్ర

త్యయాంతతుల్యతతోను 'అయ్, అవ్, అర్' అనుపరిణామములతోను తెలుఁగునందుఁ గ్రియలై నిలువఁగా సంవృతిక్రియ యట్టిమార్పు లేవియు లేకుండఁగనే సంస్కృతధాతుపాఠమునం దెట్లు పఠింపఁబడినదో యట్లే తెలుఁగునందుఁగూడ వర్తిల్లునని తెలియనగును.

229 సూ :- జ్ఞేయం త్రివిధాసు చ క్రియా స్వేవమ్,

229 సూ :- త్రివిధా సూపకృత్యాదిక్రియా స్వేవంప్రకారేణ లక్షణం జ్ఞేయమ్.

వి :- జ్ఞేయమ్, త్రివిధాసు, చ, క్రియాసు, ఏవమ్—అని ఛేదము. ఉపకృతి, పరిణతి, సంవృతి యనుమూఁడు తెగలక్రియలును పైని దెల్పిన పద్ధతులలోఁ దెలుఁగుభాషయందు వర్తిల్లుచున్నవని తాత్పర్యము.

ఆంధ్రశబ్దచింతామణి తత్సమపదములను సాధించుటకే ప్రధానముగా నేర్పడినట్లు గోచరించుచున్నది. అందును గ్రియాపరిచ్ఛేదము కేవలము సంస్కృతధాతువులను దెలుఁగులోనికిఁ దెచ్చుకొనుపద్ధతులను మాత్రమే యుపదేశించుచున్నది. అచ్చతెనుఁగుధాతువులను సాధించుటకీప్రకరణమునఁ జట్టచివర నొక్క కారికమాత్రమే యుద్దిష్టమై యున్నట్లగపడుచున్నది. చింతామణిలోనిప్రక్రియ ననుసరించి సంస్కృతధాతువు లన్నియు (1) ఉపకృతి (2) పరిణతి (3) సంవృతి—అను సంజ్ఞలతో మూఁడువిధములుగాఁ దత్సమక్రియ లగుచున్నవి. సంస్కృతభాషయందుఁ గృదంతము లైనధాతువులకుఁ దెనుఁగునందు 'ఇంచు' గాగమము చేయఁగా నవి యుపకృతిధాతువులని చెప్పఁబడుచున్నవి. సంస్కృతమునందు 'అయ్—అవ్—అర్' అను పరిణామములను బొందిన ధాతువులపైని దెనుఁగునం దించుగాగమము నొందినవి పరిణతిక్రియలని చెప్పఁబడుచున్నవి. సంస్కృతధాతుపాఠమునందుఁ బఠింపఁబడిన ధాతురూపమునం దెట్టిమార్పును లేక 'ఇంచు' గాగమము చేరి తెనుఁగునందు వ్యవహరింపఁబడుక్రియలు సంవృతిక్రియలని చెప్పఁబడుచున్నవి. ఇట్లు మూఁడువిధములుగనే సంస్కృతధాతువులు తెనుఁగులోనికి వచ్చును.

230 సూ :- తద్ధర్మవర్తమానాతీతాఽగామ్యర్థకాః క్రియా జ్ఞేయాః.

230 సూ 1:- తద్ధర్మః, వర్తమానః, అతీతః, ఆగామీ చేత్యేతదర్థచతుష్టయవాచకాః క్రియాః జ్ఞేయాః. వికృతౌ తద్వాచకవర్ణైః క్రియాణాం సమ్బద్ధత్వాత్తాసామపి తదర్థకత్వముక్తమితి జ్ఞేయమ్.

వి :- తద్ధర్మవర్తమానాతీతాఽగామ్యర్థకాః, క్రియాః, జ్ఞేయాః అని ఛేదము. తద్ధర్మము, వర్తమానము, అతీతము, ఆగామి - అను నాల్గర్థములను బైమూఁడు తెగలక్రియలును జెప్పుచుండును. అయ్యావి (అనఁగా నుపకృతి, పరిణతి, సంవృతి యనుభేదములతో మూఁడువిధములుగాఁ జెప్పఁబడుక్రియలు వర్తమాన, భూత, భవిష్య, త్తద్ధర్మకాలములలో రూపభేదముల నందుచుండునని తాత్పర్యము. ఇపుడు జరుగుచున్నవ్యాపారమును బోధించుక్రియ వర్తమానక్రియ; జరిగినదానిం దెల్పునది భూతక్రియ; జరుగనున్నదానిం దెల్పునది భవిష్యత్క్రియ యని తెలియనగును.

230 సూ 2 :- భూతాద్యర్థత్రయవిలక్షణః కశ్చిదర్థ స్తద్ధర్మాఖ్య ఇత్యాచార్యైర్వ్యవహ్రియతే వికృతౌ. వర్తమానభవిష్యదర్థయోః క్రియాయాః స్వానుబన్ధకత్వం, భూతార్థే ఏకత్వే ఏత్వం, బహుత్వే ఇత్వఞ్చ వర్తత ఇత్యేతదభావాదస్య తత్త్రితయవిలక్షణత్వమ్. తత్రాచార్యైః కాలమవివక్షిత్వైవ ధాత్వర్థమాత్రే వివక్షా క్రియతే. అతఏవ తద్ధర్మ ఇత్యన్వర్థా సంజ్ఞా. తస్య ధాతోర్ధర్మః వాచ్యార్థమాత్రమితి. ధర్మోత్తమమధ్యమవదిత్యత్ర తచ్ఛబ్దపరిత్యాగేన సోఽర్థో నిర్దిష్టస్సూత్రకారేణ. సఏవ నిర్దేశోఽన్వర్థసంజ్ఞాయాం మానమ్. కేవలసంజ్ఞాపక్షే తు తదయోగాదితి ధ్యేయమ్.

వి :- దక్షిణదేశభాషలలోఁగాని, యుత్తరదేశభాషలలోఁగాని తదితరపాశ్చాత్యాదిభాషలలోఁగాని వేనియందును లేనితద్ధర్మకాలమొకటి తెనుఁగునందుఁ గలదు. ఆకాలములోనిరూపములు రెంటిలో నొకరూపము వర్తమానార్థమునందును వేఱొకరూపము భావ్యర్థమునందును బ్రాచీనులచే వ్యవహరింపఁబడినది. కావుననే చింతామణికర్త "ఘటించుచున్నవాఁడు, ఘటింపఁగలవాఁడు" అనువిశేషణరూపము

లనే యనుబంధములతో సాధించియున్నాఁడు. "పోయెడునున్—ఆయెడునున్" మున్నగుక్రియల నథర్వణాచార్యులవారు భావిక్రియలని వ్యవహరించియున్నారు. ఇట్టితద్ధర్మార్థము సకలభాషావిలక్షణమై తెలుఁగుభాషయం దలరారుచున్నది. అహోబలపతిపండితుఁడు "భూతాద్యర్థత్రయవిలక్షణా" మని దీనిం జెప్పినాఁడు. భూత. భావ్యర్థము లనునవి ప్రాచీనకాలమునఁ దద్ధర్మక్రియలే యైయున్నవి. అట్టియెడల భూత, భవిష్య, ద్వర్తమానవిలక్షణమై తద్ధర్మార్థము విలసిల్లుచున్నదని చెప్పుట కెట్లు వీలుపడును? ఇది కుదురఁబడనందుననే కాలవివక్ష చేయక యే ధాత్వర్థమాత్రమునందే వివక్ష చేయఁబడియున్నది. కావున నే "తస్య ధాతో ర్ధర్మః తద్ధర్మః" అనువ్యుత్పత్తిచే వ్యాన సీతద్ధర్మసంజ్ఞ సార్థకమగుచున్నదని యహోబలపతిపండితునియాశయము.

230 సూ 3 :- ద్వితీయాచార్యేణాపి తద్ధర్మార్థస్య భూతాద్యవిషయత్వమేవోక్తమ్. మతద్వయేఽయం భేదః. ప్రథమోత్తమైకవచనాన్తయోః సాన్తయోః పదయోరేవ తద్ధర్మసంజ్ఞకత్వ ముక్తం. తేన తత్రోపచారార్థగతా సంజ్ఞా శబ్దగతత్వేన కృతేత్యవగన్తవ్యమ్. "చేసెదన్-ఘటించెదన్" ఇత్యాదౌ తస్మిన్నేవ తద్ధర్మసంజ్ఞా. కింతు భావిక్రియావ్యవహార ఏవ. ఘటింతురిత్యాదావపి నాన్తత్వేఽభావాన్న తద్ధర్మసంజ్ఞా. వాగనుశాసనమతే త్వేషాం తద్ధర్మార్థకత్వమేవేతి.

వి :- అథర్వణాచార్యులవారు తద్ధర్మార్థమునకు లక్షణము చెప్పియున్నారు. దాని నహోబలపతి స్వాభిప్రాయానుకూలముగా నిందు సమన్వయించుకొనుచున్నాఁడు. ఈతనిదృష్టిలో నన్నయాథర్వణులకుఁ దద్ధర్మసంజ్ఞావిషయమున మతభేద మున్నట్లు వివరించియున్నాఁడు. నిజమునకుఁ దద్ధర్మార్థవిషయమునం దుభయులకును మతభేదము లేదు. తద్ధర్మక్రియను భావిక్రియగా నథర్వణుఁడు వ్యవహరించుట దోషము కాదు. తద్ధర్మక్రియయే నన్నయగారిచే భావ్యర్థమునం దుపయోగింపఁబడుటవలన నథర్వణాచార్యుల కట్లు చెప్పవలసివచ్చెను. కానిచో దాని యవసరము లేదు. కావుననే వర్తమానార్థమునందుఁ దద్ధర్మక్రియ

నన్నయగారిచే వాడఁబడినను దద్విషయము మేమియు నథర్వణాచార్యులు చెప్పలేదు. అట్లే భావిక్రియావిషయమును జెప్ప నక్కఱ లేదు. కాని "దానిలో నున్నయకారముపై నెత్వ ముండునా, అత్వ ముండునా" యను సందేహమును దీర్చుటకై "భావిక్రియాసు యుస్యా స్యాత్" అని నుడివియున్నాఁడు.

నన్నపార్యుఁడు తద్ధర్మక్రియారూపములను వ ర్తమాన భావ్యర్థము లలో నుపయోగించుచువచ్చినను 'ఘటించుచున్నవాఁడు; ఘటింపఁగల వాఁడు' మున్నగువానిని వ ర్తమానభావ్యర్థములలో నువయోగించుచు వచ్చినను "ఘటించుచున్నవాఁడు, ఘటింపఁగలవాఁడు" మున్నగువ ర్త మానభవిష్యదర్థక్రియాజన్యవిశేషణములను దిన వ్యాకరణము నందు సాధించియే యున్నాఁడు-కాలక్రమమున నారూపములలోని వకారము నకు లోపము కల్గి "ఘటించుచున్నాఁడు" అను వ ర్తమానార్థకవిశేషణ మును, "ఘటింపఁగలాఁడు" అనుభవిష్యదర్థకక్రియాజన్యవిశేషణమును నేర్పడి పిమ్మట మఱికొంతకాలమునకు 'ఘటించుచున్నాఁడు, ఘటింపఁ గలఁడు' అని వ ర్తమాన, భావ్యర్థకసమాపకక్రియారూపము లేర్పడినట్లు తోఁచుచున్నది.

"ఘటించెడున్, ఘటించెడిన్, ఘటించున్, ఘటింతురు, ఘటిం చెదరు" అని ప్రథమపురుషమునను, 'ఘటించెదవు, ఘటింతువు, ఘటిం చెదరు, ఘటింతురు' అని మధ్యమపురుషమునను, 'ఘటించెదనున్, ఘటింతునున్, ఘటించెదము, ఘటింతుము' అని యు త్తమపురుషము నను దద్ధర్మార్థకక్రియారూపము లేర్పడును. వీనిలోఁ గొన్నిటికిఁ జింతా మణియు, మిగిలినవానిని వికృతివివేకమును సాధించినవి. ఈరూపముల కన్నిటికిని భారతమునఁ బ్రయోగము కలదు. చింతామణిలో "నస్యా త్తద్ధర్మేతః" అనుసూత్రముచేఁ దద్ధర్మకారమున కచ్చు పరమగు నపుడు సంధి నిషేధింపఁబడినది. కాని భారతమునందుఁ జైకొనఁబడిన రూపముల కన్నింటికిని సంధి చేయఁబడియే యున్నది. అట్టిచో భారత

ప్రయోగములకును, చింతామణిసూత్రమునకును విరోధ మున్నట్లు కొందఱు భావించుటచే నట్టివిరోధము లేదని తెలియఁజెప్పుటకే యథర్వణాచార్యులవారీవివరణము వ్రాసియున్నారు. ఈవివరణము "న స్యాత్తద్ధర్మోక్తితః" అనుసూత్రాభిప్రాయమునే విశదీకరించుచున్నది. చింతామణ్యభిప్రాయముచొప్పునఁ దద్ధర్మధాతూకారమున కచ్చు పరమగునపుడు సంధి రాదని యాసూత్రమున కర్థము. "తద్ధర్మవ ద్వర్తమానాతీత" అనుసూత్రమునందు ధాతుమాత్రమునకే తద్ధర్మసంజ్ఞ చేయఁబడినది. కావుననే తద్ధర్మధాతూకారమునకు సంధి రాదని యాసూత్రమున కర్థము లభించుచున్నది. పైఁజూపఁబడినతద్ధర్మకాలరూపములలో "చేయున్, చేసెడున్" అనురెంటిలోనే తద్ధర్మధాతూకార మగపడుచుండుటచే వానికిమాత్రమే సంధి రాదని పైసూత్రమువలనఁ దెలియుచున్నది. ఆ యర్థమునే యథర్వణాచార్యులుగారు "ప్రథమ శ్చోక్తమ శ్చైవ తాను తద్ధర్మసంజ్ఞకౌ, భూతాద్యవిషయా..." అనుకారికచే వివరించియున్నారు. దానింబట్టి కొంద ఱాకాలమున 'నస్యా'దిత్యాదిసూత్రమునకుఁ దప్పుగా నర్థముచేసియుండిరని యూహింపవలసియున్నది. సూరిగారు పై విషయము నప్పకవిమతానుసారముగా "ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమం బగు"(బాల-సంధి-33) అని వివరించిరి. ఇది సరికాదు.

230 సూ 4 :- నను "ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్" ఇతి సూత్రేణ ప్రథమైకవచనలోపో విహితః. ప్రథమైకవచనఞ్చ అనుక్త న్యాయేన తిబేవ స్యాత్. తిబపి లడాదేశః. లట్చ వర్తమానే విహితః వర్తమానే లడిత్యనుశాసనాత్. తత్కథ మత్ర విశేషాభావః? నచ తస్య లుప్తత్వేన తదభావ ఇతి వాచ్యమ్, లోపేపి తదన్తస్య తదర్థాభిధాయకత్వ స్యాద్యవ్యాకరణరూఢత్వా దితి చేత్ సత్యమ్. తిబ్వర్ణకస్య తత్త్రైకత్వమాత్రవివక్షా వాచార్యేణ క్రియత ఇత్యవధేహి.

వి :— సుబంతప్రక్రియవలెనే క్రియాప్రక్రియయు సంస్కృతమునందువలెనే తెలుఁగునను జరుగును. కావున "రక్షించు" అనుధాతువు

కంటెం దద్ధర్మార్థమునందు లట్టు చేసి ప్రథమపురుషైకవచనవివక్షలో 'తిప్పు' చేయఁగా 'రక్షించు+తి' అనియుండును. "ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం స్యాత్" అనుచో ప్పూనఁ బ్రథమపురుషైక వచనలోపము కల్గి "అన్త్య ద్రుతప్రకృతయః" అని ద్రుతము చేరి "రక్షిం చున్" అనురూప మేర్పడును. ఇట్లే "చేయున్" మున్నగు దేశ్యక్రియ లును సిద్ధించును. ఇట్టిచోఁ దద్ధర్మక్రియ వర్తమానార్థమును జెప్పుమిం డఁగా నర్థవిశేషాభావ మున్న దనుట యెట్లు చెల్లును? అనుశంక రాఁగా నిచట 'తిప్పును' బ్రథమైకవచనమ్మాత్రవివక్షయందే నన్నయగారు చేసి యున్నట్లు సమాధానము చెప్పుకొనవలెనని వ్యాఖ్యానింపఁబడినది.

**231 సూ :— తత్ర ద్వితీయతుర్యౌ యా తౌ స్తః సానుబన్ధకావేవ.**

231 సూ :— తత్ర తద్ధర్మాద్యర్థక క్రియామధ్యే యా ద్వితీయా, చతుర్థా వర్తమాన భవిష్యదర్థకౌ క్రియాశబ్దౌ తౌ సానుబన్ధకావేవ స్తః; నతు కదాచిదపి నిరనుబన్ధకౌ.

వి :— తత్ర, ద్వితీయతుర్యౌ, యా, తౌ, స్తః, సానుబంధకౌ, ఏవ — అని ఛేదము. "తద్ధర్మము, వర్తమానము, అతీతము, ఆగామి" యనునర్థములు గల క్రియలలో రెండవది, నాల్గవది యైన వర్తమానా గామ్యర్థకక్రియ లనుబంధసహితముగనే యుండునని సూత్రార్థము. "ర క్షించు" అనుధాతువునకు "ఉండు" అనునది వర్తమానార్థమునను, "కలుగు" అనునది యాగామ్యర్థమునను ననుబంధము లగుచున్నవి.

**232 సూ.:— వసతి రనుబన్ధక స్స్యా ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర.**

232. సూ. :— యత్ర లడర్థో వివక్షిత స్తత్ర వసతి రనుబన్ధకః స్యాత్ క్రి యాయాః.

వి:— వసతిః, అనుబంధకః, స్యాత్, యత్ర, లడర్థః, వివక్షితః, తత్ర—అని ఛేదము. ప్రక్రియయందు లడర్థము వివక్షించునపుడు తదర్థ మును బోధించుటకై 'ఉండు' అనునది క్రియ కనుబంధముగా వచ్చు నని సూత్రార్థము.

"వర్తమానే లట్" అనుపాణినీయసూత్రముచే వర్తమానార్థమున ధాతువుకంటె లట్టు వచ్చును. లట్టునకుఁ దిబాదిప్రత్యయములును వచ్చును. అవి పరమగునపుడు "అనుబంధము" అనఁగా ననుసరించి బంధింపఁబడినదని యర్థము. ఈయనుబంధము లేకున్నచో నర్థస్ఫూర్తి కలుగదు; కాని, యనుబంధము వచ్చినక్రియయొక్క యర్థమునకచట నెట్టిప్రయోజనము నుండదు. ఓడతోఁ గట్టినయోడవోలె దేనికది యనుబంధమైనదో దానియర్థమునే ప్రతిపాదించుచుండును. (శబ్దపల్లవమని దీనిం జెప్పరాదు.) అట్టిదానినే యనుబంధ మందురు. 'రక్షించు' అనుక్రియకు వర్తమానార్థమున లట్టును, ప్రథమపురుషైకవచనార్థమున 'తిప్పును' జేయఁగా "రక్షించు+తిప్" అని యుండును.

233 సూ :- అస్తి రనుబన్ధక స్స్యాద్యత్ర లృడర్థో వివక్షితో ధాతోః.

233. సూ:- యత్ర లృడర్థో వివక్షిత స్తత్ర ధాతో రస్తి రనుబన్ధక స్స్యాత్. లృడర్థో భవిష్యదర్థః. లృట్ శేషేచ ఇతి విధానాత్. పూర్వత్ర వస నివాసే ఇతి ధాత్వర్థోఽనుబన్ధకః. 'ఉన్న' ఇత్యపరత్ర. "అస భువి" ఇతి ధాత్వర్థోఽనుబన్ధకః. 'కల' ఇతి భవతి క్రియాపదానామ్.

వి :- అస్తిః, అనుబంధకః, స్యాత్, యత్ర, లృడర్థః, వివక్షితః, ధాతోః-అని ఛేదము. ఏక్రియయందు లృడర్థము వివక్షింపఁబడునో యచటఁ గ్రియకంటె "అస భువి" అనుధాత్వర్థమగు "కలుగు" అనునది యనుబంధముగా నిల్చునని సూత్రార్థము. లృడర్థమనఁగా భవిష్యదర్థము. "లృట్ శేషేచ" అనుపాణినీయసూత్రముచే నాయర్థము వ్యక్తమగుచున్నది. పూర్వసూత్రమునందుఁ జెప్పఁబడిన "వసతి" అనుదానికి "ఉండు" అనియు నీసూత్రమునఁజెప్పఁబడిన 'అస్తి' అనుదానికి "కలుగు" అనియు నర్థములైనను గవిప్రయోగానుసారముగా వర్తమానార్థమున "ఉన్న" అనియు, భవిష్యదర్థమున 'కల' అనియు ననుబంధము లగుననియూహింపవలసియున్నది. 'రక్షించు + లట్' అనియుండఁగా 232వ సూత్రముచే "ఉన్న" అనునది యనుబంధముగాఁ జేరి, "చురితి క్రియా

పదానామ్" అనుచోప్పున 'చు' వర్ణము చేరి "రక్షించుచున్న+లట్" అనియుండును. లట్టుస్థానమునందు 'తిప్పు' వచ్చి తిప్పునకు డుజ్వర్ణక మాదేశమగును."రక్షించుచున్న+డు"అనునపుడు"పునరాగమః క్రియాణామ్" అనుసూత్రముచే దీర్ఘము వచ్చి "రక్షించుచున్నాఁడు" అను రూపము సిద్ధించును. భవిష్యదర్థమునందు "రక్షించు" అనుధాతువు కంటె ల్రుట్టు చేయఁగా 233 వ సూత్రముచే 'కల' అనునది యనుబంధముగా జేరి "రక్షించు+కల+ల్రుట్" అనియుండును. 'అనుబంధప్రారనయోః' అనుసూత్రముచే ధాతువునందలిచకారమునకు పకారము వచ్చి రక్షింపు+కల+ల్రుట్" అనియగును. "వ్యతిరేకాదౌ భావిని చాత్స్యాత్" అనుచోప్పున పకారోకారమున కత్వము వచ్చి "రక్షింప+కల+ల్రుట్" అనియగును. ఈ అత్వము "అన్యే ద్రుతప్రకృతయః" అను చోప్పున ద్రుతప్రకృతికమగుట"రక్షింపన్+కల+ల్రుట్" అనియుండఁగా ల్రుట్టునకుఁ బ్రథమపురుషైకవచనవివక్షలో 'వ్యతిరేకార్థే ల్రుటి లటి డుజ్ స్యాత్" అనుచోప్పున డుజ్ వచ్చి ద్రుతమునకు ద్రుతకార్యములుకలిగి "రక్షింపఁగలఁడు" మున్నగురూపములు సిద్ధించుచున్నవి. ఈరూపము లను వర్తమాన, భావ్యర్థములలో నిట్లు సాధించుట నన్నయగారి కభిమతము కానట్లు తోఁచుచున్నది. నన్నయగారిభారతమునం దెచ్చటను నీయర్థములం దీరూపములు ప్రయోగింపఁబడియుండ లేదు. కావున నన్నయగారిభారతములోనిప్రయోగములనే యీసూత్రములచే సాధించుట యుచితము. కావున "రక్షించుచున్న-రక్షింపఁగల" అనురూపములను సాధించి, యవి విశేషణరూపము లగుటచేఁ దచ్ఛబ్దార్థమును వానికిఁ జేర్చినచో "రక్షించుచున్నవాఁడు-రక్షింపఁగలవాఁడు"మున్నగు రూపములు సిద్ధించును. ఇట్టివానిని నన్నయగారు ప్రయోగించియున్నారు గదా! వర్తమానార్థము "రక్షించున్" మున్నగురూపముచేతను, భవిష్యదర్థము "రక్షించెడిన్-రక్షించెదున్" మున్నగురూపములచేతను నన్నయభారతమున బోధింపఁబడుచున్నవి. అథర్వణాచార్యులవా రా

విషయము నే “పోయెదున్-పోయెడిన్” మున్నగువానియందలి యకారము ఎత్వవిశిష్టమై యుండునని “భావిక్రియాసు యస్య స్యా దేత్వమేవ ప్రయోగతః” అని భావిక్రియలుగా వానిని వ్యవహరించిరి. ఇట్లు చెప్పినచో వసత్యర్థమును, అ స్యర్థమును సానుబంధములుగా విధించుట వ్యర్థము కాదా యనుశంక కలుగుచున్నది. నన్నపార్యుఁడు తనభారతభాగమున “రక్షించుచున్నవాఁడు-రక్షింపఁగలవాఁడు” మున్నగురీతిరూపములను బ్రయోగించియుండుటచే వాని సాధించుటకే చింతామణి పై యనుబంధములను విధించియున్నదని యూహింపవలయును. “రక్షించుచున్నవాఁడు, రక్షింపఁగలవాఁడు” మున్నగుచోట్ల ‘తచ్ఛబ్దవస్య లోప స్స్యాదదాతోః క్వచిదేకతా” అనునథర్వణవచనముచొప్పున వకారమాత్రము లోపించి “రక్షింపఁగల+ఆఁడు=రక్షింపఁగలాఁడు, రక్షించుచున్న+ఆఁడు=రక్షించుచున్నాఁడు” అని యేర్పడినరూపములు కాలక్రమమున “రక్షించుచున్నాఁడు_రక్షింపఁగలఁడు” అని మాఱి వర్తమానభావ్యర్థకప్రథమపురుషైకవచనరూపములుగా నిలిచిపోయినవని తోఁచుచున్నది. వానినిబట్టియే యర్వాచీనవైయాకరణులు వర్తమానభావ్యర్థకసమాపకక్రియారూపములుగా వానిని సాధించియున్నారు.

**234** సూ :- భవతి క్రియాపదానాం త్రివిధానా మించుగాగమః.

234. సూ :- ఉపకృత్యాదీనాం త్రివిధానాం క్రియాపదానా మించుగాగమః స్యాత్ స్వార్థే. అనుక్తన్యాయేన “ఆద్యన్తౌ టకితౌ” ఇత్యాద్యపరిభాషయా కిత్వాత్తదన్తావయవత్వమ్. తేన ఇంచుగన్తాదేవ క్రియాపదా చ్ఛపర్ణక స్సిద్ధ్యతి.

వి :- భవతి, క్రియాపదానాం, త్రివిధానాం, ఇంచుగాగమః-అని ఛేదము. లోఁగడఁ జెప్పఁబడిన “ఉపకృతి, పరిణతి, సంవృతి యనుభేదములతో నున్నత్రివిధక్రియాపదములమీఁద ‘ఇంచుక్’ అనునది యాగమముగా వచ్చును-అని సూత్రార్థము. ‘ఇంచుక్’ అనుదానిలోనికకారమున కిత్సంజ్ఞ కలదుగావున “ఆద్యంతౌ టకితౌ” అనుచొప్పున నంతావయవముగా నది చేరుచున్నది.

235 సూ :- ణేశ్చ.

235. సూ :- 'హేతుమతి చ' ఇతిసూత్రేణ యత్రార్థే ణిజ్విహితః. తత్రాపి ఇంచుక్ స్యాత్. 'ఒనరింతున్' ఇత్యాద్యాచార్యప్రయోగమహిమ్నా త్రివిధానామితి పదస్యాస్వరితత్వే దేశ్యక్రియాణామపి హేతుమతీన్చుక్ సామాన్య సూత్రారమ్భాత్. తద్ధర్మ్యాద్యర్థపరిగణనం సానుబన్ధకత్వాఇచ్చ సర్వక్రియాసాధారణమితి జ్ఞేయమ్.

వి :- ణేః, చ-అని ఛేదము. ణిచ్ప్రత్యయము సంస్కృతవ్యాకరణమునందు "హేతుమతి చ" అనుసూత్రముచేఁ బ్రేరణార్థమున విధింపఁబడుచున్నది. అణిజర్థమునందుఁ దెలుఁగున నించుగాగమము వచ్చుచున్నది. ప్రేరణార్థమున ధాతువుల కన్నింటికిని దెలుఁగునం దించుగాగమము కలుగుచున్నదని దానియర్థము. సంస్కృతవ్యాకరణమర్యాదలన్నియుఁ దెలుఁగునందు లేవు కొన్నిమాత్ర మున్నవి. అట్టివాని నన్నింటిని నన్నయాథర్వణులు కొన్నిగుర్తులచే సూచించుచుందురు. అట్లు సూచింపఁబడినవానికిమాత్రమే సంస్కృతవ్యాకరణసూత్రములతోఁ గార్యములను జేసికొనవలయును. కాని యన్నింటికిని సంస్కృతవ్యాకరణ మర్యాదలను సూత్రములను జెప్పికొనరాదు. ప్రకృతమున 'త్రివిధానా మించుగాగమః' అనుసూత్రమునందలి "త్రివిధానామ్" అనుపద మీ సూత్రములోని కనువృత్తముగా దాయని శంకించుకొని 'స్వరితేనాధికారః' అనుచోట్లాన స్వరితత్వ మున్నపుడే యది యధికారముగా వచ్చునుగాని స్వరితత్వము లేనపుడు రాదనియు, 'త్రివిధానామ్' అనుదానికి స్వరితత్వము లేకుండుటచే "ణేశ్చ" అనుసూత్రములోని కది యనువృత్తి రాదనియుఁ గవిశిరోభూషణము నిశ్చయముచేసినది. ఈచర్చ యంతయు నిరర్థకము. తెనుఁగునం దధికారము, ననువృత్తి యనునవి లేవు. ఈకారణముచే వికృతిధాతువులపై నిగూడఁ బ్రేరణార్థమునం దించుగాగమము వచ్చుచున్నదని కవిశిరోభూషణము వ్యాఖ్యానించినది. చింతామణి "అత్యాదితత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాంచ; వర్ణాగమో విశేషః పురుషే వ్యర్థేషుచాపి వచనేషు" అని నన్నపార్యుఁ డభ్య

నుజ్ఞ చేయుటచేఁ బ్రేరణార్థమునం దించుగాగమము తెనుఁగుధాతువులకు వచ్చుచున్నదిగాని యస్వరితత్వకారణముచేఁ గాదని తెలియవలెను.

236 సూ :- అనుబన్ధప్రార్థనయో ర్ణౌ వ్యతిరేకాదికే చ చోః ప స్స్యాత్,

236. సూ. 1 :- అనుబన్ధే ప్రార్థనాద్యర్థే చేచ్చుకస్యచ్చస్థిన శ్చో శ్చకారస్య ప స్స్యాత్. ణిజర్థే విహితస్యాపి తస్య ప స్స్యాత్. వ్యతిరేకాదికే చాప్యర్థే తస్య పకార స్స్యాత్.

వి :- అనుబంధప్రార్థనయోః, ణౌ, వ్యతిరేకాదికే, చ, చోః, పః, స్యాత్-అని ఛేదము. "వసతి రనుబన్ధక స్స్యా ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర; అస్తి రనుబన్ధక స్స్యా ద్యత్ర లృడర్థో వివక్షితో ధాతోః; కర్మణ్యనుబన్ధ స్స్యా త్పతిధాతుః కర్తృవచ్చ తద్విధయః" అను సూత్రములచేఁ గ్రమముగా వచ్చునట్టి 'ఉన్న, కల, పడు' అను ననుబంధత్రయము పరముగా నున్నప్పుడు ప్రార్థనాద్యర్థములందును, ణిజర్థమునందును, వ్యతిరేకాద్యర్థములయందును 'చ'కారమునకు 'ప'కారము; వచ్చునని సూత్రార్థము.

236. సూ. 2 :- నుతి స్త్రీయా ణిన్ పోష షుఙ్ ప్రత్యయః. వర్తమాన వివక్షయా వసతి రనుబన్ధకః. ఇన్చుగాగమః. పాదేశః. చురితి క్రియాపదానామితి చుః; వ్యతిరేకార్థ ఇత్యాది వక్ష్యమాణసూత్రేణ డుజ్. అనుక్తన్యాయేన 'సానునాసికోచ్చారణం జిత్; వర్ణాగమో విశేష ఇతి దీర్ఘః; నుతింపుచున్నాఁడు; పోషింపుచున్నాఁడు.

వి :- 'నుతి' అనునది ఉపకృతిధాతువు. 'పోష' అనునదియు నుపకృతియే. వర్తమానార్థవివక్షలోఁ 'ద్రివిధానా మించుగాగమః' అని ఇంచుగాగమము వచ్చి 'నుతించు-పోషించు' అనుధాతువు లేర్పడును. వర్తమానార్థ వివక్షలో 'ఉన్న' అనుననుబంధము వచ్చును. నుతించు+ఉన్న - పోషించు+ఉన్న' అని యుండఁగా 'ననుబంధప్రార్థనయోః' అనుచోప్పున చకారమునకు 'పకారమును', చురితి క్రియా

పదానా' మనుచెప్పున 'చు' అనునదియును వచ్చి 'నుతించుచున్న – పోషించుచున్న' మున్నగురూపము లేర్పడును. 'వ్యతిరేకార్థే ల్యుటి లటి డుజ్ స్యాత్' అనుచెప్పున డుజ్జును 'పునరాగమః క్రియాణాం' మని దీర్ఘమును గలిగి 'నుతింపుచున్నాఁడు–పోషింపుచున్నాఁడు' అను రూపములు సిద్ధించుచున్నవని కవిశిరోభూషణ మీప్రక్రియను జూపినది. అది సరికాదు. 'నుతించుచున్నాఁడు – పోషించుచున్నాఁడు" అనురీతి రూపములకే ప్రసిద్ధి కలదుగాని పత్వఘటితరూపములకుఁ బ్రసిద్ధి లేదు. అట్లే చింతామణియుఁ జెప్పుచున్నది. "పోషించు" మున్నగు ధాతువులకంటె వర్తమానార్థ వివక్షలో లట్టుచేసి దానికి 'శిప్రత్యయము చేసిన తరువాతఁ గాని, లేక లట్టుచేసినవెంటనే గాని, ఉన్నానుబంధము రావలయును. ఉన్నానుబంధపరకత్వమున 'పత్వము' రావలయును గదా! వర్తమానకాలమునందే యనఁగా వర్తమానార్థ వివక్ష చేసినవెంటనే చువర్ణకము వచ్చుచున్నది. తరువాత ననుబంధము వచ్చుచున్నది. కావున "పోషించు+చు+ఉన్న" అని యుండునపుడు ధాతు చువర్ణమునకు ననుబంధమునకు మధ్యను, చు అను దానితో వ్యవధాన ముండుటవలన 'పత్వము' వచ్చుట కవకాశము లేదు. కాన ఘంటింపుచున్నాఁడు" అని యుదాహరించుట సరికాదు. "ఘటించుచున్నాఁడు" అనియే యుండనగును.

236. సూ. 3 :- ఏవంచ సంజ్ఞాత్రియ మాన్వర్థమ్. ఉప సమీపే అన్త ఇత్యర్థః. కృతిః కృత్ప్రత్యయవిధానం యస్యాః సా ఉపకృతిః. అయాద్యన్తత్వేన పరిణమత ఇతి పరిణతిః. సఙ్గతా వృతిః, అన్యవిలక్షణా కారవిశేషో యస్యాః సా సంవృతి రిత్యర్థావగతేః. వృఞ్ సంభక్తావితి ధాతోః నిష్పన్నః వృతిశబ్దః. యస్యాః సమ్యగ్వృతి ర్వరణం నైయత్యేన స్వరూపస్య ప్రాప్తిః యస్యాస్సేతి వా.

వి :— ఉపకృతి, పరిణతి, సంవృతి—అనుసంజ్ఞలు మూఁడును సార్థకములని తెలియుచున్నది. ధాత్వంతమునందుఁ గృత్ప్రత్యయవిధానము గలది యుపకృతి యనియు, "అయ్-అవ్-అర్" అనురీతిని బరిణ

మించునది పరిణతి యనియుఁ, బైరెంటికిని విలక్షణాకారము కలదిగాని, నియతముగా స్వరూపప్రాప్తి నందునదిగాని సంవృతి యనియు నర్థములు.

236 సూ. టీ:-సంస్తుతింపుచున్. సంస్తుతించు, ప్రస్తుతించు- ష్టుఞ్ స్తుతౌ. అనుమతించు, సమ్మతించు, మన-అవబోధనే, సంతోషించు, తుష తుష్టౌ. 'సంతోసిల్లుచున్నాఁడు' ఇతి ప్రాకృతసమం రూపమ్. 'శసో స్సః' ఇతి సాపేక్షాత్. 'సంతసింపు' ఇతి సంస్కృతభవమ్. రోషించు-రుష రోషే. ఆలాపించు-ప్రలాపించు (లాపిం) అనులాపించు-విలాపించు-సల్లాపించు-లప వ్యక్తాయాం వాచి. వచించు-వచ పరిభాషణే. సంతాపించు, పరితాపించు-తప సంతాపే. మోహించు-ముహ వైచిత్త్యే. వికారించు-డుకృఞ్ కరణే. ప్రసాదించు, ఆసాదించు-అజషద్లృ గతౌ. షద్లృ విశరణాదిషు, ఛేదించు, ఖేదించు, పరిచ్ఛేదించు, విచ్ఛేదించు-ఛిదిర్, ఛిదిర్ ద్వైధీకరణే. వాదించు. ప్రతివాదించు-వదవ్యక్తవచనే. మోదించు, అనుమోదించు, ప్రమోదించు, ముద హర్షే. కామించు-కము కాన్తౌ. కాన్తి రిచ్ఛా. సంపాదించు, ఉపపాదించు, అపాదించు, ఉత్పాదించు-పద్లృ గతౌ. వారించు, నివారించు-వృఞ్ వరణే. ఘోషించు-ఘుషిర్ విశబ్దనే. ఆజః సతతక్రన్దే ఆఘోషించు, ఉద్ఘోషించు, విరోధించు, అనురోధించు, సంరోధించు-రుధిర్ ఆవరణే. ఉల్లాసించు-లస శ్లేషణక్రీడనయోః. ఆశ్లేషించు-శ్లిష ఆలిఙ్గనే. విదాహించు-దహ భస్మీకరణే. భావించు-సంభావించు-భూ సత్తాయామ్. ప్రజ్వలించు, సంవృతిరూపం వా జ్వల దీప్తౌ. ఛేదిల్లు - ఛిద ద్వైధ్యే. రాగిల్లు-రంజ రాగే. ప్రణమిల్లు-ణము ప్రహ్వత్వే శబ్దే. విధించు-డుధాఞ్ ధారణపోషణయోః. శోధించు-శుధ శౌచే. ఆరోహించు - రుహ బీజజన్మని-ప్రాదుర్భావే. చరించు, విచారించు-చర గమనే వేదనే, ఆచారేచ. సమ్మానించు – మాన పూజాయామ్. ఆరోపించు-రూప విమోహే. ఆస్ఫోటించు-పుట భేదనే. సంకోచించు-కుచ కోచే. 'సంకుచించుచున్నాఁడు' ఇతిరూపం సంవృతేరపి. ఉత్పాటించు-పట గతౌ. సంధానించు-డుధాఞ్ ధారణపోషణయోః. మాయించు – మాఙ్ మానే శబ్దేచ. ఆక్రోశించు, క్రుశించు; ద్వితీయం రూపం సంవృతేరపి. క్రుశ ఆహ్వానే రోదనేచ. ప్రసాదించు, గుణంబు సారించు-సృ గతౌ. కోపించు-కుప కోపే. సంశబ్దించు-శబ్దతత్కృతౌ సోపసర్గస్యాపిసంస్కృతౌ మతః. ఉద్ఘాటించు-చౌరాదికో ణిచ్, ఘట హింసనే సంఘాతేచ" ఇతి కవికల్పద్రుమోక్తేః. కశ కృచ్ఛ్రాదేస్సంజ్ఞా. ఆలోడించు లుడ మంథే. వికాసించు, వికసించు-కస గతౌ. ద్వితీయం రూపం సంవృతేరపి. అనువర్తించు-వర్తించు-వృతూ వర్తనే

ఉపదేశించు-దిశ అతిసర్జనే. ధ్యానించు-ధ్యై చిన్తాయామ్. ద్వేషించు-ద్విష అప్రీతౌ. సంకేతించు-కిత నివాసే. ఆచ్ఛాదించు-ఛద సంవరణే. జీర్ణించు-జౄ వయోహానౌ. ఆఘ్రాణించు-ఘ్రా గంధోపాదానే. సంధించు-అనుసంధించు-డు ధాఞ్ ధారణే.జ్ఞానించు జ్ఞా అవబోధనే. మూర్ఛిల్లు-మూర్ఛా మోహసముచ్ఛ్రాయయోః. మర్దించు-మృద క్షోదే. క్రోధించు-క్రుధ క్రోధే. బోధించు-బుధ అవగమనే-సేవించు-షేవృ సేవాయామ్. ప్రవేశించు విశ ప్రవేశనే. దర్శించు-దృశిర్ ప్రేక్షణే వర్షించు-వృష్ సేచనే. హర్షించు-హృష తుష్టౌ.

వి :- సంస్కృతధాతువులు తెనుఁగులోనికిఁ దత్సమములుగా వచ్చినరీతి పైని జూపఁబడినది. సంస్కృతధాతుపాఠమునందుఁ బఠింపఁబడినధాతువు లెందు వరుసగా లేవు మధ్య, మధ్య కొన్ని కొన్నిధాతువులుమాత్రమే యిందుఁ బ్రదర్శింపఁబడినవి. కావున సంస్కృతధాతువు లన్నియుఁ దత్సమములుగాఁ దెనుఁగులోనికి రావనియు, నిందుఁ జూపఁబడినవానిమాత్రమే కవిప్రయోగములలో మనము చూడఁగలమనియు నూహింపవలెను. మొట్టమొదట "స్తుతింపుచున్—" అని చూపఁబడినది. దీనికి 'పత్వ'మెట్లు వచ్చినదో తెలియరాకున్నది. పత్వము వచ్చుటకుఁ జింతామణీయందు దాధారములు లేవు. ఉపసర్గములు క్రియతో సంబంధించి తెలుఁగులోఁ దత్సమము లగుచుండును. వానికిఁ దెలుఁగునందుఁ బ్రత్యేకప్రయోగ ముండదు. ఇందుఁ గ్రియలన్నియు, నుపకృతిక్రియలు. కొన్ని సంస్కృతధాతువులు తత్సమరూపమును బొందునపు డుపసర్గములతోఁగూడి కృదంతరూపమును జెంది, పిదప నించుగాగమముతోఁ గలిసి తత్సమరూపమును జెందును. అట్టి ఇంచుగంతము తెనుఁగునందు ధాతువగును. తెలుఁగువైయాకరణులు దీనిని 'క్రియాధాతుః' అని క్రియయని వ్యవహరించినారు. కృదంతముమీఁద నీధాతువు లేర్పడుట చే నుపకృతి ధాతువులని యివి చెప్పఁబడినవి. ఇందుఁ గొన్ని ధాతువులు సంస్కృతక్రియలయందుఁగూడఁ బఠింపఁదగియున్నవి. అట్టివాని క్రియాధాతువులదగ్గఱ వివరణము మూలమున వ్రాయఁబడినది.

236 సూ. 5. :– ఇదితోఽపి ధాతవః ప్రయోగానుసారేణ కృదంతత్వేన ప్రయోజ్యాః. చండించు-చడి కోపే. ఖండించు-ఖడి మన్థే. తుండించు-తుడి వధే. ఆకర్షించు-కృష విలేఖనే. చుంబించు-చుబి వక్త్రసంయోగే. అవలంబించు–లబి అవస్రంసనే. జృంభించు, విజృంభించు-జృభి జృంభే. సంరంభించు-ఆరంభించు-రభి శబ్దే. స్తంభించు–ష్టుభు స్తంభే. ఆక్రన్దించు-క్రది ఆహ్వానే, రోదనేచ. భంజించు-భజి శాసనే, చింతించు–చితి స్మృత్యాం, ఆనందించు-టునది సమృద్ధౌ. లంఘించు–లఘి గతౌ. ఆలింగించు–లిగి సంశ్లేషణే. ప్రపంచించు-పచి వ్యక్తీకరణే. విడంబించు-డబి నోదే. తంత్రించు-తత్రి ధారణే. యంత్రించు-యత్రి సంకోచనే, మంత్రించు-మత్రి గుప్తోక్తౌ కాంక్షించు-ఆకాంక్షించు-కాక్షి ఇచ్ఛాయామ్" ఇత్యాదయః.

వి :– మీఁదిధాతువు లన్నియు నిదిత్తులు. కాన 'ఇదితో నుమ్ ధాతోః' అనుసూత్రముచొప్పున వానికి నుమ్ము వచ్చును. ఆనకారము బిందువై మనకు గోచరించుచున్నది. ఇవన్నియుఁ గృదంతములే ధాతువులగును గాన నివియు నుపకృతులనియే చెప్పవలయును.

236. సూ. 6 :– నినాదాద్యా విరావాన్తా నామలిఙ్గానుశాసనోక్తా ఆప్లావాప్లవావగ్రహావగ్రహప్రమదసమ్మదాద్యా నిక్వాణాద్యాః ప్రక్వాణాదయ శ్చాత్ర విజ్ఞేయాః.

వి:– పైఁజూపిన వేగాక నామలింగానుశాసనమునందు "శబ్దే నినాదనినదధ్వనిధ్వానరవస్వనాః। స్వాననిర్ఘోషనిర్హ్రాదనాదనిస్వాననిస్వనాః। ఆరవాఽఽరావ సంరావవిరావాః" అని కలదు. నినాదాదులని వీని నందురు, ఇవి కృదంతనామములు. వీనికించుగాగమము చేసినచో నివియు ధాతువు లగును. వీనిపైని ధాతువులమీఁద వచ్చురూపము లన్నియుఁ గల్గును. మఱియు "ఆప్లావ, ఆప్లవ, అవగ్రహ, వగ్రహ, ప్రమద, సమ్మద" మున్నగువానికిని "నిక్వాణ, నిక్వణ, ప్రక్వాణ" మున్నగువానికిని మీఁద నించుగాగమము వచ్చి తత్సమధాతురూపము లేర్పడుచున్నవి. వీనికిని పైవానికివలెనే రూపములు కల్గును. ణద అవ్యక్తే శబ్దే – అనుధాతువునుండి నినాద, నినద. నాద–అను కృదంతరూపము లేర్పడును. "ధ్వన శబ్దే" అనుదానినుండి ధ్వని, ధ్వానశబ్దములును,

'రు శబ్దే' అను దానినుండి 'రవ'అనునదియు, 'స్వన శబ్దే' అను దానినుండి స్వన-స్వానశబ్దములును, 'ఘుషిర్ శబ్దనే' అను దానినుండి 'నిర్ఘోష' అనుశబ్దమును, 'హ్రాద అవ్యక్తే శబ్దే' అను దానినుండి 'నిర్హ్రాద' శబ్దమును, 'స్వన శబ్దే' అను దానినుండి 'నిస్వాన-నిస్వన' అనునవియు, 'రు శబ్దే' అను దానినుండి 'ఆరవ-ఆరావ-సంరావ-విరావ' అనునవియుఁ గృదంతరూపములు సిద్ధించుచున్నవి. మఱియు 'ఆప్లావ - ఆప్లవ; వగ్రహా-అవగ్రహా, ప్రమద, సమ్మద' మున్నగునవియును 'నిక్వాణ - ప్రక్వాణ' మున్నగునవియును నించుగంతముఁలై తెనుఁగున ధాతువు లగుచున్నవని కవిశిరోభూషణము వివరించినది. కాని వీని కన్నింటికిని బ్రయోగప్రసిద్ధి యున్న ట్లగపడదు.

235. సూ. 7 :- "స్యా త్సంస్కృతే ఉపకృతే భేదః క్వచిన్మతః। స యథాశాస్త్ర మున్నేయ స్సౌశబ్ద్యజ్ఞానదక్షిణైః"

వి :- "సంస్కృత్యుపకృతిధాతువులకుఁ గొన్ని యెడల భేదరాహిత్య మగపడుచున్నది. సుశబ్దాపశబ్దజ్ఞానము గలవారు శాస్త్రానుసారముగా నాయభిన్నతను దెలియవలయు" నని పై యథర్వణకారిక కర్థము. నినద-అనునది 'నద అవ్యక్తే శబ్దే' అనుధాతువునుండి యేర్పడినకృదంతరూపము. దాని కించుగాగమము చేయుఁగా 'నినదించు' అనునది యుపకృతిధాతువగును. 'ని+నద్+ఇంచు=నినదించు' అని యేర్పడినది. సంస్కృతి ధాతుపాఠమునందుఁ బఠింపఁబడిన 'నద్' అను ధాతువున కెట్టి మార్పును గలుగ లేదుగాన దీనిని సంస్కృతి యనుట తప్పు కాదు.

236. సూ. 8 :- అథ పరిణతిః : క్షయ్, క్షి క్షయే. పరాజయ్, జి జయే. సంశ్రయ్, శ్రి శ్రయణే. స్మయ్, స్మి స్మితే. విక్రయ్, క్రీఞ్ ద్రవ్యవినిమయే. ఉడ్డయ్, డీఙ్ నభోగతౌ. ఉన్నయ్, నీఞ్ ప్రాపణే. అనుమయ్, మీ గతౌ. అపహ్ను, హ్ను చౌర్యే. ఉపకృతే గ్వా రూపమ్. అనుభవ్, ప్రభవ్, పరిభవ్, సంభవ్, భూ సత్తాయామ్. ప్రసవ్, షూ సూతౌ. ఉపస్కార్, అలంకర్, సంస్కార్, సాక్షాత్కార్, విఫలీకర్, దుఃఖాకర్, సుఖాకర్, పరిష్కార్, పృథాకర్, బహిష్కార్, బలాత్కార్,

హాతాత్కార్ - ఇత్యాదిరూపం యథాశాస్త్రం గ్రాహ్యమ్. డుకృఞ్ కరణే. జాగర్, జాగృ నిద్రాక్షయే. ధర్, ధృ ధృతౌ. భర్, భృఞ్ భరణపుష్ట్యోః. అనుమర్, మృఙ్ మృతౌ. వర్, వృఞ్ వరణే. అనుసర్, సృ గతౌ. స్మర్, స్మృ (ఆధ్యానే) స్మృతౌ. 'పరిహార్, విహార్, సంహార్' ఇత్యాది హృఞ్ హరణే. విస్తర్, స్తృ ఆచ్ఛాదనే. 'ప్రసవ్' ఇత్యాదౌ పరిణత్యుపకృత్యోః రభేదో విజ్ఞేయః. ఏవం రూపాః పరిణతిక్రియా విజ్ఞేయాః.

వి :- 'క్షి క్షయే. జి జయే' మున్నగునవి 'అయ్' అనురూపమునఁ బరిణమించినవి. వీని కించుగాగమము చేయఁగా 'క్షయించు, జయించు' మున్నగురీతి ధాతువులు తెలుఁగునం దేర్పడుచున్నవి. 'అప+హ్ను+ఇంచు=అపహ్నవించు.' ఇది పరిణతిరూపముకూడ నగును. 'అపహ్నవ+ఇంచు=అపహ్నవించు' ఇది యుపకృతిరూపము. ఇట్లుపకృతిపరిణతులకు రెంటికిని సమానరూపత్వము కొన్నింటికిఁ గలదు. అలం+కృ=అలంకర్+ఇంచు=అలంకరించు - అని, అర్ అను పరిణతితోఁ దెనుఁగుధాతువు ఏర్పడును. ఇట్లే సంస్కార్ - సంస్కరించు మున్నగువాని నెఱుంగునది.

236. సూ. 9 :- అథ సంవృతిః :- అర్థించు, అర్థ యాచ్ఞాయామ్. ఖచించు, ఖచ బంధనే. గర్వించు, గర్వ దర్పే. గణించు, గణ సంఖ్యానే. గవేషించు, గవేష మార్గణే. గుణించు, గుణ మన్త్రే. చిత్రించు, చిత్ర లేఖ్యే. పరిచ్ఛేదించు, ఛేద, ఛేదనే. దుఃఖించు, దుఃఖ తత్క్రియాతౌ. దండించు, దండ తత్పాతే. నివసించు, నివాస స్థితౌ. అకర్ణించు, కర్ణ శ్రుతౌ. ప్రేంఖోళించు, ప్రేంఖోళ చాపలే. విభాజించు, భాజి పృథక్కృత్యామ్. మూత్రించు, మూత్ర ప్రస్రావే. నిరూపించు, రూప తత్క్రియాతౌ. రచించు, రచ కృత్యామ్. వర్ణించు, వర్ణ స్తుత్యాదౌ. సూత్రించు, సూత్ర గ్రంథే. సూత్రించు, సూత్ర పైశున్యే. సుఖించు, సుఖ తత్క్రియాతౌ. ఆలోకించు, ఆలోక్య వీక్షాయామ్. ఉపశ్లోకించు, శ్లోక స్తుతౌ. శ్లోక్య సంఘాతే. లిఖించు, లిఖ లేఖనే. వంచించు, వంచ వంచనే. రాజిల్లు, రాజృ దీప్తౌ. భజించు, భజ సేవాయామ్. ఘట్టించు, ఘట్ట చలనే. నటించు, నట గతౌ. ఘటించు, ఘట చేష్టాయామ్. బంధించు, బంధ బంధనే. ప్రాపిల్లు, ఆప్ వ్యాప్తౌ. జపించు, జప వ్యాదుచ్చారణే. దీపించు, దీప దీప్తౌ. విల

పించు, లప భాషణే. గుంభించు, గుమ్ఫ గ్రన్థే. ఉపక్రమించు, విక్రమించు, సంక్రమించు. ఇత్యాద్యాః. క్రము పాదవిక్షేపే. క్షమించు, క్షమూష్ సహనే. ప్రణమిల్లు, ణము ప్రహ్వత్వే. భ్రమించు, భ్రమ చలనే, నియమించు. యమ విరతౌ. శమించు, శమ్ శమే. ప్రస్ఫాయించు, స్ఫాయీ వృద్ధౌ. 'విదళించు, ప్రజ్వరిల్లు, చలించు, ఫలించు' దల భేదనే, జ్వర దీప్తౌ, చల చలనే, ఫల నిష్పత్తౌ. స్పర్శించు, స్పృశించు, స్పర్శ గ్రహణే, స్పృశ్ సంస్పర్శే. భాషించు, భాష వ్యక్తాయాం వాచి. భాసిల్లు, భాసృ దీప్తౌ. శాసించు, శాసు అనుశిష్టౌ. ఆశాసించు, ఆఙ్ పూర్వ శాస్ ఆశిషి. ప్రశంసించు, శంస్ స్తుతౌ. ఆశీర్వదించు, వద వ్యక్తాయాం వాచి ఆర్హించు, అర్హ పూజాయామ్. ఊహించు, ఊహ వితర్కే. గ్రహించు, నిగ్రహించు, ఆగ్రహించు, గ్రహ ఉపాదానే. పూజించు, పూజ పూజనే. వహించు, వహ ప్రాపణే. ఈక్షించు, వీక్షించు, ఈక్ష దర్శనే. అనుబింబించు, ప్రతిబింబించు, బింబ ఆభోగే. ఆగ్రహాదిషు సంస్కృత్యుపకృత్యో ర్భిన్నం రూపం జ్ఞేయమ్. ఏవం సంస్కృతిక్రియా జ్ఞేయాః. అనుష్ఠించె, అధిష్ఠించె, నిర్మించె, అనుమించె, ష్ఠా గతినివృత్తౌ, మాఙ్ మానే శబ్దేచ. ఏవ మాదింతిరూపం గ్రాహ్యమ్. అత్రాప్యుపకృతిసంస్కృత్యో రైక్యం జ్ఞేయమ్.

వి:- 'ఆగ్రహ-ష్ఠా-మా-' మున్నగునవి సంస్కృతిగను, నుపకృతిగను నుండనగునని యూహింపవలెను. మిగిలినవిషయములు స్పష్టములే.

236 సూ 10 :- "యథాప్రసిద్ధి ధాతూనాం ప్రయోగ స్సమ్మతో భవేత్। ఏవో పపదభాజస్స్యు స్సాధవో భ్వాదయః క్రియాః" ఇత్యథర్వణః. తేన 'కరించె-భవించె' ఇత్యాదిరూపాణాం న ప్రయోగః. "పృగాదికవిశేషస్య సంగ్రహోఽపి క్వచిన్మత" ఇతిచోక్తమ్. విజ్ఞాపించు-సంజ్ఞాపించు-జ్ఞా ప్రేరణే చురాదిః.

వి :- 'కవిప్రయోగప్రసిద్ధి నతిక్రమింపకుండ నుపకృత్యాదిధాతువులను బ్రయోగించుట తెనుఁగున సమ్మతమగును. 'భూ-కృ-స్మృ' మున్నగుకొన్నిధాతువు లుపపదసమాసగతములై యున్నపుడుమాత్రమే తెలుఁగునందుఁ దత్సమరూపమునఁ బ్రయోగార్హములగును-అని 'యథాప్రసిద్ధి' యనునథర్వణకారిక కర్థము. పెక్కుకృదంతములు సంస్కృతభాషలోఁ గలవు. వాని కన్నింటికిని నించుగాగమము చేర్చి తెనుఁగునఁ బ్రయోగింపరాదు. అట్లే పరిణతిసంస్కృతులనుగూడ యథేచ్ఛముగాఁ

దెనుఁగునందుఁ బ్రయోగింపరాదు. మహాకవు లేయేయాకారములలో వేనిం బ్రయోగించిరో వాని నట్లే ప్రయోగింపవలెను. 'ణుఞ్ స్తుతౌ' అనుధాతువు నుపకృతిగనే ప్రయోగింపవలెనుగాని పరిణతిక్రియగా నుపయోగింపరాదు. 'శీఙ్ స్వప్నే' అనుధాతువు నుపకృతిగను బరిణతిగను బ్రయోగింపవలెను. 'శయించు-శయనించు' అనునవి తదుదాహరణములు. 'భూ-కృ-సృ' మున్నగుభ్వాదిక్రియలు కొన్ని యుపపదసహితములగనే ప్రయుక్తములగుచు సాధువు లగుచుండు ననుటచే 'కరించు-సరించు' అనునిట్టిరూపములతో నుండరాదనియు, 'ప్రభవించు-ప్రసరించు' మున్నగురీతిని బ్రయుక్తము లగుచుండవచ్చుననియుఁ దెలియవలెను. ఈయథర్వణకారికయందు దున్న భ్వాదిశబ్దమున కర్థము తెనుఁగులోనికిఁ దత్సమములుగా వచ్చినకొన్నిధాతువులే యని చెప్పవలెను. 'స్థా-జ్ఞా' మున్నగుకొన్నిసంస్కృతధాతువులు ప్రేరణార్థమునందువచ్చు 'ఆపుక్' అనునాగమముతోఁగూడి తెనుఁగునందుఁదత్సమములుగా వ్యవహరింపఁబడునని 'పుగాదికవిశేషస్య' అనుదాని కర్థము. 'ప్రస్థాపించు-ఆజ్ఞాపించు-' మున్నగునవి దాని కుదాహృతులు.

236 సూ 11 :- ఉపసర్గబలాద్ధాతూనామనేకార్థత్వమ్- తదుక్తమభియుక్తైః "ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యః ప్రతీయతే, ప్రహారాహారసంహారవిహారపరిహారవత్" ఇతి కైశ్చిత్తూపసర్గసమ్బన్ధమనపేక్ష్యైవ ధాతూనామనేకార్థత్వముక్తమ్. "క్రియావాచిత్వమాఖ్యాతుం ప్రసిద్ధార్థః ప్రదర్శితః। ప్రయోగతోఽనుమన్తవ్యా హ్యనేకార్థా హి ధాతవ" ఇతి. అతఏవ 'పాదో హరు' ఇత్యాదౌ వ్యాకరణభాష్యేకరోతేర్నానార్థకత్వం ప్రపఞ్చితమ్.

వి :- "ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి, ఉప," అనునివి ప్రాదులు. వీనికి మొదట 'ప్ర' అనునది యుండుటచే నివి ప్రాదులని పిలువఁబడినవి. వీనికిఁ గ్రియలతో సంబంధము కలిగినపుడివి యుపసర్గము లని, గతిసంజ్ఞకము లని చెప్పఁబడును. వీనిచేరికమూలల

మున ధాతువు లనేకార్థము లగుచున్నవి. ప్రహారము (ప్ర) ఆహారము (ఆఙ్) సంహారము (సమ్) విహారము (వి) పరిహారము (పరి). వీనిలోఁ గుండలీకరణములకు మధ్యమం బున్నవి యుపసర్గములు. వివిధము లగు నుపసర్గములచేరికచే 'హృఞ్ హరణే' అను ధాతు వొక్కటియు మీఁదఁ జూపఁబడినవివిధార్థములను బోధింపఁజాలుచున్నదికదా! సంస్కృత వ్యాకరణమునందు ధాతుపాఠమున ధాతువులకెదురుగా నీయఁబడినయర్థ మాధాతువులు క్రియావాచకములని తెల్పుటకుమాత్రమే యుద్దేశింపఁ బడినది. అందులకే ధాతువు లనేకార్థకములని పెద్దలు వక్కాణించు చున్నారని "క్రియావాచిత్వ" మనుకారిక కర్థము.

236 సూ. 12 :- క్వచిద్ధేతుమత్యుకా ధాతోర్గ్రహణమ్. 'ప్రస్థాపించె రాజన్యు లన్' 'అర్థవేదయోరాపుగ్వక్తవ్యః' అర్థం కరోత్యాచష్టేవా అర్థాపయతీతి పాణినీ యమ్. అర్థాపించు-ఉత్థాపించు, అధ్యాపించు ఏతద్విశేషగ్రహణం వాగనుశాస నాసా మభీష్టమ్. 'పునరాగమః క్రియాణామ్' ఇత్యుక్తేః. పునఃపూర్వే విశేషే చేతి పున రవ్యయార్థవిజ్ఞానాత్. పునరాగమః క్రియాణామితిహి తదర్థః. అతఏవ "అవధారు దేవ" ఇతిరూపం నిర్బాధమ్. అవధరింపుము-ఇతి తదర్థః.

వి:- కొన్ని యెడలఁ బ్రేరణార్థమునందు సంస్కృతధాతువులకు 'ఆపు' గాగమము వచ్చును. "అర్థవేదయోరాపుగ్వక్తవ్యః" అను పాణినీయసూత్రముచే నాపుగాగమము చెప్పఁబడినది. తత్సమమునం దును, నాపుగాగమవిశిష్టమైన ధాతువుమీఁద నించుగాగమము కలిగి 'అర్థాపించు-ప్రస్థాపించు' మున్నగుధాతువు లేర్పడుచున్నవి. కావుననే యథర్వణాచార్యులుగారు 'పుగాదికవిశేషస్య సంగ్రహోఽపి క్వచి న్మతః' అని చెప్పియున్నారు. పుగాదికవిశేషమనఁగా నీయాపుగాగమాది విశేషములనియే యర్థము. ఈయథర్వణకారిక 'పునరాగమః క్రియా ణామ్' అనుచింతామణికారికకు వివరణము. 'పునరాగమః' అనుదాని కపూర్వవిశేషాగమము క్రియలకుఁ గలుగునని యర్థము. క్రియలకు విశేషాగమము చెప్పుటచే 'అవధరించు' అని అవపూర్వకధృధాతువున

కించుగాగమము చేసిన దానిపైని 'అవధారు' మున్నగురూపము లేర్పడు చున్నవి. ఇందు విశేషాగమము కలిగినదని తాత్పర్యము.

236. సూ. 13 :- 'నుతింపఁగలఁడు-క్షయింపఁగలఁడు' ఇత్యాదౌ వస్త్యనుబన్ధ కత్వమ్. ప్రార్థనార్థే 'ఘటింపుము' ఇత్యాదౌ పత్వమ్. ఉత్తరత్ర వక్ష్యమాణ సూత్రేణ ప్రార్థనార్థే మువర్ణకః. హేతుమణ్ణిచి తు 'పోషింపింపుచున్నాఁడు నన్నతని చేన్-పోషింపింపఁగలఁడు-పోషింపించెన్' ఇత్యాది. సంస్కృతవ్యాకరణే "హేతుమతి చ" ఇతిసూత్రేణ ప్రయోజకవ్యాపారే ప్రేషణాదౌ వాచ్యే ధాతోర్ణిజ్విహితః. "తత్ప్రయోజకో హేతుశ్చ" ఇతి హేతుసంజ్ఞా చ విహితా. కర్తుః ప్రయోజకో హేతుసంజ్ఞా కర్తృసంజ్ఞా చ స్యాదితి తత్సూత్రార్థః. సకర్మకధాతుష్వేవ అగమద్వ యస్య శ్రుతిః, అకర్మకేషు తు స్వార్థేంచుకో లోపో విధీయతే.

వి:- "నుతింపఁగలఁడు-క్షయింపఁగలఁడు" మున్నగువానియందు "కల" అనునను బంధము "వసతి రనుబన్ధక స్స్యా ద్యత్ర ల్పదర్థో వివ క్షితో ధాతోః" అను చోవ్వానఁ గలిగినది. "ఘటింపుము" మున్నగు చోట్లఁ బ్రార్థనార్థమున 'పత్వము' వచ్చినది. ఈపత్వము 'అనుబన్ధ ప్రార్థనయోః' అనుసూత్రముచేఁ జెప్పఁబడినది. ప్రార్థనార్థకమునందు మువర్ణకము వచ్చినది. 'ఘటింపుము' అనురూప మిట్లు సాధింపఁబడి నది. రెండుప్రేరణము లున్నపుడు సంస్కృతమున "హేతుమతి చ" అనుసూత్రముచేఁ దద్రూపములు సాధింపఁబడినవి. తెనుఁగునను బ్రేరణ ముపైఁ బ్రేరణార్థకప్రత్యయము వచ్చుట కివి యుదాహృతులు. అచటఁ బ్రయోజకవ్యాపారము, ప్రయోజ్యవ్యాపారము నుండుటచే ణిచ్చు విహితమైనది. దానిని దెనుఁగున "పోషింపింపుచున్నాఁడు నన్నతనిచే తన్" అనురీతిరూపము లుండవచ్చునని కవిశిరోభూషణము వ్యాఖ్యా నించినది. ఇట్టిరూపము లరుదు. "పోషింపింపుచున్నాఁడు" అనుచోట 'పోషింపించు' అనునది ధాతు వగునపుడు చకారమునకు 'పత్వము' వచ్చుట దుర్లభము. కావున 'పోషింపించుచున్నాఁడు' అనియేయుండ వలెనుగాని 'పోషింపింపుచున్నాఁడు' అనరాదు. 'అతఁ డతనిచేఁ బోషిం

పించుచున్నాఁ డను వాక్యమునఁ బ్రయోజ్యప్రయోజకకర్త లిరువురు కలరు. ప్రయోజకుఁడు పని నుద్దేశించినవాఁడు. ప్రయోజ్యుఁడు నియోగింపఁబడినవాఁడు. ఇందుఁ బ్రయోజకుఁడు కార్యఫలమును బొందును. ప్రయోజ్యుఁడు పని చేయును. కావున నిచటఁ బ్రేరణద్వయము కలదు. ఇట్టివి కొన్ని తెనుఁగునం దరుదుగా నగపడుచున్నవి. ఇచటఁ గర్తకుఁ బ్రయోజకుఁడనియుఁ, గార్యకరణమునకు హేతువనియుఁ జెప్పవచ్చును. ఇట్టి కార్యము సకర్మకధాతువులకుఁ గలుగును. రెండించుగాగమము లొ వచ్చుట సకర్మకధాతువులకే కనఁబడుచున్నది. అకర్మకధాతువులకైనచోఁ బ్రేరణార్థేంచుగాగమము పరమగునపుడు స్వార్థేంచుగాగమము నకు లోపము కలుగును. ప్రేరణార్థమునందు స్వార్థమునందు వచ్చిన ఇంచుగాగమముయొక్క శ్రవణము సకర్మకధాతువులయందే కలుగుచుండును. అకర్మకధాతువులయం దున్నచోఁ బ్రేరణార్థేంచుగాగమము పరమగునప్పుడు స్వార్థేంచుగాగమము లోపించునుగాన శ్రవణముండదు.

236 సూ. 14:- త్రివిధానా మిత్యుక్తేః దేశ్యక్రియాభ్యో న స్వార్థేంచుక్. "తిను, కను, విను," "తినె, వినె, కనె, తినుచున్నాఁడు" ఇత్యాది. హేతుమతీంచుక్ తు తాభ్యో భవత్యేవ. "మ్రొక్కె యక్కన్య మ్రొక్కించి" ఇత్యాద్యాచార్యవచన జ్ఞాపకాత్.

వి :- "త్రివిధానామ్" అను దానికి ఉపకృతి, పరిణతి, సంవృతి రూప త్రివిధధాతువులని యర్థము. వాని మూఁటికి ఇంచుగాగమము వచ్చును. దేశ్యక్రియలకు స్వార్థమునం దించుగాగమము గాదు. ప్రేరణార్థమునందు వచ్చును. దేశ్యక్రియలకుఁ ద్రివిధక్రియలలో గ్రహణము లేదు కాన వానికి స్వార్థేంచుగాగమము రాదని తెలియవలయును. మ్రొక్కించె అను ప్రయోగమును బట్టి తెనుఁగుధాతువులపైఁ బ్రేరణేంచుక్కు వచ్చునని తెలియుచున్నది. ఇది నన్నయప్రయోగము.

236. సూ. 15:- తత్ర క్రియాస్వరూపం చ కించిత్ప్రదర్శ్యతే. "ఒనరెన్, అతఁడొనరించెన్, వీఁకఁ దపం బొనరించుచున్నన్" ఇత్యాద్యాచార్యస్య వచనమ్. పొనరెన్, పొనరించెన్, అమరెన్, అమరించెన్, పొదలెన్, పొదలించెన్, విదలెన్, విదలించెన్, వదలెన్, వదలించెన్, ఇగిర్చెన్, ఇగిర్పించెన్, "ఇగిర్పింపుము చూతమనిన గోత్రభిదుండున్" ఇత్యాద్యాచార్యః. ఇత్యాదిరూపా ణ్యకర్మకక్రియాను "ఒనర్చెన్, ఒనరించెన్, ఒంచెన్, ఓడించెన్" ఇత్యాద్యాచార్య ప్రయోగాదేవ జిజర్థితాన్యపి రూపాణి గ్రాహ్యాణి. ఏతేన "ధర దివ్యాస్త్రతతిం బగిల్చి" ఇత్యాదీని కవీనాం వచనాని సాధూని. "వినియె నమ్మాట లతఁడు, వినిపించె నమ్మాట లతనికి" "అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా" ఇతి కర్మణి షష్ఠీ. దాని మఱిగె నతఁడు "మఱిగించెన్, ఎదుర్కొనె నతనిన్ – ఎదుర్కొనిపించెన్, పురికొనె సేనన్ - పురికొనిపించెన్– ఇత్యాదీని సకర్మకధాతురూపాణి జ్ఞేయాని. "అన్నదానమున ధరామరేంద్రులఁ దనుపు", "నిన్నుద్దిగఁ గలిపించిన, రిపుల నోటువలిచెన్, భువనేశత్వాభరంబు పూన్పఁ దగునే పూరుషన్ జఘన్యాత్మజున్", "వినిచెన్" ఇత్యాద్యాచార్యవచనైః "పూన్చెన్-కలిపెన్–ఎదుర్కొలిపెన్" ఇత్యాదీన్యపి రూపాణి జిజర్థే బుద్ధ్యా గ్రాహ్యాణి. "భువనేశత్వాభరంబు" ఇత్యాద్యాచార్యవచనే వహే ర్ద్వికర్మకత్వేన కర్మద్వయమ్.

వి :- ఇచట దేశ్యక్రియాప్రసంగము చేయఁబడి, వానిస్వభావములు చెప్పఁబడుచున్నవి. చింతామణియందుఁ జివరికారికయగు "అత్యాదితత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాం చ, వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషుచాపి వచనేషు" అనుదానికి దేశ్యక్రియలు లక్ష్యములు కావలెను. అచట నివి యుదాహరింపఁబడవలసియున్నను గవిశిరోభూషణు మిచటనే వానిం బేర్కొనియుండుటచే నిచట వివరింపఁబడుచున్నవి. "ఒనరెన్" అనునది యకర్మకక్రియ. ప్రేరణార్థమునం దిది సకర్మకమగును. "అమరెన్" ఇది యప్రేరణక్రియ. ఇది యకర్మకము. 'అమరించెన్' ఇది ప్రేరణమున సకర్మకము. 'పొదలెన్–విదలెన్–వదలెన్' ఇట్టివన్నియును స్వార్థమునం దకర్మకములు, ప్రేరణమున సకర్మకములు నగును. 'ఇగిరెన్–ఇగిర్చెన్–ఇగిర్పించెన్' అని యిట్టివానికిఁ బ్రేరణమునందు రెండురూపములు కూడ నుండవచ్చును. 'ఒనర్చెన్–

ఒనరించెన్' అనునవి ఒనరుధాతువునకుఁ బ్రేరణార్థకరూపములు. ఇందొకదానియందుఁ బ్రేరణమున చువర్ణకమును, రెండవదానియందుఁ బ్రేరణేంచుగాగమమును వచ్చినవి. ఇట్లే ఓర్చెన్—ఒంచెన్- 'ఓడించెన్' అని ఓడుధాతువునకుఁ బ్రేరణార్థమున రూపము లుండును. ఇట్లే 'తగులు-తగిలిచెన్—తగిలించెన్'. "వినియె నమ్మాట లతఁడు" ఇందు వినుధాతువు సకర్మకము. దీనికిఁ బ్రేరణమున రెండుకర్మము లుండును. "వినిపించె నమ్మాట లతనికి." 'అతనికి' అనునది యముఖ్యకర్మము. దీనికిఁ గర్మార్థమున షష్ఠి వచ్చెను. "అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా" అనుసూత్రమాషష్ఠికి విధానము. ఇట్లే "మఱిగెన్, మఱిగించెన్—ఎదుర్కొనెన్, ఎదుర్కొనిపించెన్ - పురికొనెన్, పురికొల్పెన్ - పురికొలిపించెన్" మున్నగుసకర్మకక్రియ లన్నియుఁ బ్రేరణార్థమున ద్వికర్మకము లగును. "భువనేశత్వభరంబు పూన్పఁదగునే పూరున్ జఘన్యాత్మజున్" అనుచోట 'పూన్పఁదగునే' అనునదియుఁ బ్రేరణార్థమున ద్వికర్మకమైనది.

236 సూ. 16 :- కఱచె నిత్యక్రియాయాః సర్పదంశనపరత్వే 'కఱపించె వతని నహిచేన్' ఇత్యాదిరూపం జ్ఞేయమ్. ఏతాదృశస్థలేషు సర్వత్ర తృతీయైవ; నతు ద్వితీయా. గతిబుద్ధిమాత్రస్య నియమార్థత్వా ణ్ణిజర్థే నీయమానస్య యది భవతి, తర్హి గత్యర్థాదీనామేవ. తేన "పాచయతి దేవదత్తో యజ్ఞదత్తేన" ఇత్యత్ర ప్రయోజ్యే ప్రకృత్యర్థం ప్రతి కర్తృత్వస్యైవ నిరపవాదత్వే నావస్థానా త్తృతీయా సిద్ధ్యతి. "గుణక్రియాణాం స్వాతంత్ర్య ప్రేషణే కర్మతాం గతః। నియమా త్కర్మసంజ్ఞాయాః స్వధర్మేణాభిధీయతే" ఇతి ప్రాఞ్చో వదన్తి. కర్తృ స్వధర్మేణ తృతీయయేత్యర్థః. 'డాయున్' ఇత్యాద 'డాయించు' నిత్యాదిక మేవ రూపమ్. సకర్మకేష్వపి "డాచ సొమ్ము-డాపించెన్. పలికెన్-పలికించెన్-పల్కరించెన్" ఇత్యాద్యపి రూపాంతర మూహ్యోన పరమ్. "సర్వము జెందెన్—చెందించెన్, రిపుల నాపదలఁ బెట్టెన్, పెట్టించెన్" ద్వికర్మకత్వే, ఇత్యాదీని రూపాణి గ్రాహ్యాణి. "చేయఁగలఁడు, చేయింపఁగలఁడు" ఇత్యాదిభవిష్యదర్థే ఉదాహరణమ్. వ్యతిరేకే 'ఘటింపఁడు, ఘటింపింపఁడు, చేయింపఁడు" ఇత్యాది.

వి :- 'కఱచు' అనుధాతువునకు 'పాము కఱచు' అని దంశన

మర్థము. "కలిపించె నతని నహిాచేన్" అని ప్రేరణార్థమునందు రూప ముండును. ఇట్టిచోట్లఁ దృతీయ నిలుచును. ద్వితీయ రాదు. 'గతిబుద్ధి' సూత్రము నియమార్థకమగుటచే గత్యర్థాదుల కప్రేరణార్థములోఁ గర్త యగునది ప్రేరణార్థమునఁ గర్మసంజ్ఞ కలది యగుచున్నది. "దేవదత్తుఁడు యజ్ఞదత్తునిచే వండించుచున్నాఁడు" మున్నగుచోట్లఁ దృతీయ సిద్ధించుచున్నది. "గుణక్రియాణామ్" అనుకారిక కర్థము. "గుణక్రియలు స్వతంత్రము లగుటచేఁ బ్రేరణార్థమునందుఁ "దదావాచకములకుఁ గర్మత్వము గల్గును. కర్మసంజ్ఞ నియమితమగుటవలనఁ దృతీయయు రావచ్చును", అని ప్రాచీనులు చెప్పిరి. 'డాయున్' మున్నగుచోట్లఁ బ్రేరణార్థమున 'డాపించున్' అని యగును. "దాచె సొమ్ము-దాపించెన్" అని ప్రేరణము. "పలికెన్" అనునది స్వార్థము. పలికించెన్ అనునది ప్రేరణము. "వల్కరించెన్" అనునది యాహ్వానార్థకపరమయినరూపము. "చెందెన్-చెందించెన్, పెట్టెన్-పెట్టించెన్" మున్నగుచోట్ల ద్వికర్మకత్వమును గలదు. 'చేయఁగలఁడు-చేయింపఁగలఁడు' మున్నగునవి భవిష్యదర్థకరూపములు. "ఘటింపఁడు-ఘటింపింపఁడు, చేయింపఁడు" మున్నగునవి వ్యతిరేకార్థకరూపములు. వీనిలో సంకేతిత సుప్రసిద్ధము లగువానినిమాత్రమే ప్రయోగింపవలయునని నన్నయాథర్వణులసిద్ధాంతము. వ్యాకరణములచే రూపములు క్రొత్తక్రొత్తవి నిష్పన్నములైనను సంస్కృతకవులవలె వానిని దెనుఁగుకవులు వాడరాదని నన్నయాథర్వణులయాశయము.

236 సూ 17 :- ఆదిశబ్దేన "ఘటింపవచ్చెన్" ఇత్యాదౌ తుమున్ ప్రత్యయార్థాద్యర్థేపి పకారః. "పోషించున్ - పోషింపించున్; చేయించున్ - ఇత్యాదయస్తద్ధర్మక్రియాః. "ఘటించెన్-ఘటింపించెన్, చేయించెన్" ఇత్యాదయోఽతీతార్థక్రియాః.

వి :- "అనుబన్ధప్రార్థనయో ర్నా వ్యతిరేకాదికే చ చోః ప స్స్యాత్" అనుసూత్రమునందలి యాదిశబ్దముచే 'ఘటింపవచ్చెన్'

మున్నగుచోట్లఁ 'జకారమునకుఁ బకారము వచ్చు'నని కవిశిరోభూషణము చెప్పినది; ఘటిరియొకచో "పునరాగమః క్రియాణామ్" అను సూత్రమునకు లక్ష్యమని భావించినది. నిజమునకు "పోషించున్-పోషింపించున్" మున్నగుచోట్లమాత్రమే "అనుబన్ధప్రార్థనయోః" అనుదాని కావశ్యకత లేదు. 'చేయించున్'మున్నగువానిని పునరాగమసూత్రమునకు లక్ష్యముచేయుట గ్రంథకర్త కభిమతము కాదు. కవిశిరోభూషణమిట్లు వ్రాయుట సరికాదు. పునరాగమసూత్రము చింతామణికారిక. చింతామణి సాధింపనితత్సమరూపములు నన్నయగారిభారతభాగమునఁగాని, చింతామణినాఁటిగ్రంథములందుఁగాని ప్రయోగింపఁబడినపుడు వానిని సాధించుటకుమాత్రమే పునరాగమసూత్రము నుపయోగించుట సమంజసమని యూహింపవలయును. అందును తత్సమక్రియలను సాధించుటకే యుపయోగింపవలయును. ఆచ్ఛికక్రియలను దీనిచే సాధింపరాదనియు, నాచ్ఛికక్రియలను "అత్వాదతత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాంచ వర్ణాగమో విశేషః పురుషేష్వర్థేషు చాపి వచనేషు" అనుకారికచే వానిని సాధింపవలయును. అట్లు సాధించుటయే సరియైన మార్గము.

**237. సూ :- వ్యతిరేకాదా భావిని చాత్స్యాత్.**

237. సూ :- వ్యతిరేకాద్యర్థే చ, అస్త్యనుబన్ధే పరే చ క్రియాన్త్యవర్ణస్యా దాదేశ స్స్యాత్. ఘటింపఁడు, ఘటింపింపఁడు, చేయింపక, చేయిఁపింపక; ఘటింపక, ఘటింపింపక. ఆదిశబ్దేన "ఘటింపలేఁడు, ఘటింపరాఁడు, ఘటింపవచ్చు, ఘటింపనయ్యె, ఘటింపఁగన్" ఇత్యాది రుమున్నర్థః. "నన్ను వర్తిలఁజేసెన్, నన్ను ఘటింపఁజేసెన్" ఇత్యాది ణిజర్థవివరణవాక్యమ్. "నారాయణభట్టు వాఙ్మయధురంధురుఁ డీకృతి నిర్వహింపఁగన్" ఇత్యాదయః సత్యర్థాదయశ్చ గ్రాహ్యాః. "పోషింపఁగలఁడు, పోషింపింపఁగలఁడు" ఇత్యాదిభావ్యర్థే. ఏతాదృశస్థలేషు సర్వత్ర అకశాత్వా- ద్దుతప్రకృతిక-కార్యమ్. ప్రాసస్వాతన్త్ర్యత్వేన బిన్దో ర్ద్వైవిధ్యఞ్చ సిద్ధ్యతి. తత్సమక్రియాసు సర్వత్ర పక్షవ్యాప్యత్వమే వాత్వస్య. ప్రార్థనాద్యర్థే అత్వ

భావాత్ ఇద మత్వం దేశ్యక్రియాస్వపి ప్రవర్తతే 'అత్స్యాత్' ఇత్యుక్తేః 'చేయఁడు, చేయవచ్చు, చేయఁగలఁడు'' ఇత్యాది.

వి:- వ్యతిరేకాంద్యా, భావిని, చ, అత్, స్యాత్ — అని ఛేదము. వ్యతిరేకము మున్నగు నర్థములందును, కల-ఉన్న-పడు మున్నగు ననుబంధపరికత్వములను ధాత్వంతిమునకు కదాదేశము కలుగును. 'ఘటించు' అను ధాతువు పరంబగు వ్యతిరేక ప్రథమపురుషైకవచనమున 'వ్యతిరేకార్థే లటి లృటి డుజ్ స్యాత్'' అను చెప్పిన డుజ్ వచ్చి 'ఘటించు+డు' అనియుండఁగా సంచుగాగమ చకారమునకు 'పత్వము' వచ్చి ప్రకృతసూత్రముచే నత్వము కలిగి 'ఘటింపఁడు' అని యగుచున్నది. ఘటించుధాతువు పరంబగు 'క్త్వార్థేచ వ్యతిరేకార్థే' అని కవర్ణకము వచ్చి 'ఘటించు+కి' అనియుండఁగా పత్వాత్వములు వచ్చి 'ఘటింపక-ఘటింపమి' అనియగును. "వ్యతిరేకాద్యా భావిని చాత్స్యాత్" అనుసూత్రమందలి 'ఆది' శబ్దముచే లేఁడు, రాఁడు, వచ్చు, అయ్యె, కన్ — మున్నగువానిని గ్రహింపవలయును. మఱియుఁ దుమున్నర్థమును గ్రహింపవలయును. ఇట్టిశబ్దములు పరమగునపుడు పూర్వమందున్న చకారమునకుఁ బకారము నత్వమును జేరుచుండును. కాన "ఘటింపలేఁడు, ఘటింపరాఁడు, ఘటింపవచ్చు, ఘటింపనయ్యె, ఘటింపఁగన్" మున్నగురూపములు సిద్ధించుచున్నవి. మఱియు "నను వర్తిలఁజేసెన్, నను ఘటింపఁజేసెన్" మున్నగుణిజర్థవివరణవాక్యములుగూడ సూత్రమునందలి 'ఆది' పదముచేతనే సిద్ధించును. వీనిం గొందఱు ఘటకక్రియలని వ్యవహరించుట కలదు. "పోషింపఁగలఁడు, పోషింపింపఁగలఁడు" మున్నగునవియు 'ఆది' పదసిద్ధములే యని కవిశిరోభూషణము చెప్పుచున్నది. నిజమున కీరూపములు చింతామణికి సమ్మతములు కావని తోఁచుచున్నది. వన్నపార్యునిమతమున "పోషింపఁగలవాఁడు-పోషింపింపఁగలవాఁడు" అనునవియే సమ్మతములుగాన నట్టివానినిట నుదాహరించుట యుచితము. కళాద్యుత్రప్రకృతికసంజ్ఞలు పదసంజ్ఞ కలవానికే

కలవు. కాని, అపదముల కనంగాఁ బదసంజ్ఞ లేనివానికిఁ గలుగవు. అట్లుండుట యశాస్త్రీయము. ద్రుతప్రకృతిక కార్యము "పోషింపఁ గలఁడు, పోషింపింపఁగలఁడు" మున్నగువానియందుఁ బదమ ధ్యమునం దగపడుచున్నది. దానిని "ఏతాదృశస్థలేషు సర్వత్రాక త్వాద్ద్రుతప్రకృతికకార్యమ్" అని కవిశిరోభూషణము సమర్థించుట సరిగా నగపడదు. "పోషింపన్, పోషింపింపన్" మున్నగునవి తుము న్నంతములు. వానిమీఁద శక్త్యర్థక మగుకలుగుధాతురూపములను జేర్చిన "ఘటింపఁగలఁడు, ఘటింపింపఁగలఁడు" మున్నగురూపములు సిద్ధించుచున్న వనుట యుక్తము.

**238. సూ :- క్త్వాభూతయోః క్రియాన్త్యస్యేత్.**

238. సూ 1:- క్త్వార్థే భూతార్థేచ క్రియాన్త్యవర్ణ స్యేదాదేశ స్స్యాత్. "ఘటించి, ఘటింపించి, పోయి, ఘటించిరి, పోయిరి" ఇత్యాది భూతార్థే బహువచ నోదాహరణమ్. "వచ్చి, చని, కని, విని" ఇత్యాది.

వి :- క్త్వాభూతయోః, క్రియాన్త్యస్య, ఇత్ –అని ఛేదము, "క్త్వార్థభూతార్థములయందు హ్రస్వేకారము ధాత్వంతమున కాగమ మగును" అని సూత్రార్థము. సంస్కృతవ్యాకరణమునందు క్త్వాప్రత్య యము ధాతువుకంటె విహితమైనది. 'భుక్త్వా, గత్వా' మున్నగునవి దానియుదాహరణములు. తెనుఁగునందు క్త్వాప్రత్యయ ముండదు. కాని దానియర్థమున ధాతువుచివర హ్రస్వేకారము వచ్చునని తెలియు చున్నది. భూతార్థమునం దున్నధాతువునకును, జివర హ్రస్వేకారము వచ్చుచున్నది. "ఘటించు+ఇ=ఘటించి, ఘటింపించు+ఇ" మున్నగు నవి క్త్వాప్రత్యయార్థమున కుదాహరణములు. "ఘటించిరి" మున్నగు నవి భూతార్థమున కుదాహరణములు.

238. సూ. 2 :- అద్యః క్రియాన్త్యేతి సూత్రేణ దేశ్యక్రియాన్తే భూతార్థే ఏకత్వే యత్వం తత్పరత ఏత్వమితిచ విజ్ఞాయతే. తదేత్వసహితం యత్వంచ లఘ్వాదే

ర్నాంతా త్వదాదే నాచార్యప్రయోగే తత్ర చాన్యత్రచ తదన్వయవ్యతిరేకయోః దృష్టత్వాత్. ఏవంస్థితే బహువచనే సావకాశ మిత్వం తత్సమక్రియాసు నిరవకాశే నేత్వేన బాధ్యతే. "నిరవకాశాహి విధయ స్సావకాశాన్ విధీన్ బాధన్తే" ఇతి న్యాయాత్. దేశ్యక్రియాసు తు నకారస్యోపరీత్వం, యకారస్యోపరి యెత్వమితి విషయవిభాగస్య సత్త్వా న్న బాధకః. బహువచనే తు క్రియాద్వయే పీత్వం భవత్యేవ. అయమేవార్థోఽథర్వణాచార్యేణ స్ఫుటీకృతః-"ఇత్స్యాత్ భూతబహుత్వే తు దేశ్యే తూభయతో భవేత్ యస్స్యాద్దేశ్యక్రియా న్త్యే తు భూత ఏకత్వవాచకః ఇతఏవ పర స్సస్స్య దిద్భవే న్నాన్తకాత్పరే" ఇతి. 'ఉభయతః' ఇతి ఏకత్వబహుత్వయో రిత్యర్థః "కనియెన్, వినియెన్" ఇత్యాదా వేత్వవిశిష్టం యత్వమ్; "నీచేసినపని, నీవు ఘటించినకార్యము" ఇత్యాదా వనేనైవ సూత్రేణేత్వమ్; "చేకొని, కైకొని" ఇత్యాదౌ శబ్దపల్లవక్రియాత్వేన లఘ్వాదేరితి నియమస్య భఙ్గో నోదేతీతి జ్ఞేయమ్.

వి :— "అద్యః క్రియాసు" అనుసూత్రముచే భూతార్థప్రథమ పురుషైకవచనమున దేశ్యక్రియాంతమందు యత్వమును, దానికిఁ బర ముగ నేత్వమును గల్గునని తెలియుచున్నది. పత్వముతోఁగూడినయాయ త్వమును లఘ్వాదినాంతపదములకంటె వచ్చునట్లుగా నాచార్యప్రయోగ ములం దగపడుచున్నది. ఆచార్యప్రయోగములందును దదితరస్థలముల యందును దదన్వయవ్యతిరేకము లగపడుచుండుటవలనఁ బై విషయము తెలియుచున్నది. ఇట్లుండఁగ బహువచనక్రియలయందు సావకాశమైన ఇత్వము తత్సమక్రియలలో నిరవకాశమైన ఎత్వముచే బాధింపఁబడుచు న్నది. అనఁగా ఘటించెన్ ('ఘటించు+ఎన్') అనురూపమునఁ గల్గు చున్నది. ఇట 'ఘటించు' అనునపుడు భూతార్థప్రథమపురుషైకవచన మునందు "క్త్వాభూతయోః క్రియా న్త్యస్యేత్" అనుచొప్పున నిత్వము వచ్చుచుండఁగ "ప్రథమైక స్యేద్భవేచ్చ భూతార్థే" అని వచ్చిన ఏత్వము తత్సమక్రియలలో నేకవచనమునం దిత్వమును బాధించినదని కవిశిరోభూషణము చెప్పుచున్నది. ఈసమర్థనము నన్నయాథర్వణు లకు సమ్మతము కాదని "భూతార్థకప్రథమపురుషబహువచనమునందు మాత్రము సంస్కృతధాతువులతుదిని "క్త్వాభూతయోః క్రియా న్త్య

స్యేత్'' అనుసూత్రముచే విధింపఁబడిన ఇదాగమము వచ్చును-అని "ఇత్వాద్యాతఃబహుత్వే తు దేశ్యే తూభయతో భవేత్" అని యథర్వణాచార్యులుగారు వచించి యుండుటచేఁ దెలియుచున్నది. అహోబలపతి యిట్లు పెక్కుచోట్ల సంస్కృతవ్యాకరణసూత్రములు, పరిభాషలు, న్యాయములు చూపి, పిదప దానికి బలముగ నథర్వణవచనమును జూపుచుండును. నన్నయాథర్వణులు సమ్మతించినసంస్కృతవ్యాకరణవిధులను మన మిం దుపయోగింపనగును అట్టిసూచన లేనివాని నిం దుపయోగింపరాదు. టిత్తులు, కిత్తులు మున్నగువానిని జెప్పి వాని లక్షణములను ప్రత్యేకముగాఁ జెప్పనందున నానికిసూత్రము సంస్కృతవ్యాకరణపద్ధతి ననుసరించి చెప్పకొనవలయును. మఱియు "తస్మాదిత్యుత్తరస్య-తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య'' మున్నగు పరిభాషాసూత్రములును దెనుఁగువ్యాకరణమున వర్తించునపు యాయాపద్ధతులు వర్తిల్లునట్లు ప్రక్రియలను సూచించుటవలన నాసూత్రములఁగూడ నిందుఁ బరిగ్రహింపవలయునని యూహింపవలయును. నన్నయాథర్వణవచనములలో నెట్టిసూచనయు లేనపు డట్టి సంస్కృతవ్యాకరణవిధుల నిం దుపయోగింపరాదనియే తెలియనగును. ఈ ఇత్వము భూతకాలికప్రథమపురుషైకవచనమున మాత్రమే నువర్ణాంతదేశ్యక్రియలకును, దదుపలక్షితము లగు డువర్ణాంత, గువర్ణాంతాములకును నగునని యుఁ, దక్కిన దేశ్యక్రియలకు గాదనియుఁ దెలియుచున్నది. కనియెన్, పడియెన్, తగియెన్, మొదలగునవి.

**239. సూ :— ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాంస్యాత్.**

239. సూ :- తద్ధర్మార్థే, భూతార్థేచ క్రియాణాం ప్రథమపురుషైకవచనస్య లోప స్స్యాత్. "ఘటియించునతఁడు, చేయునతఁడు, కనియె నతఁడు, ఘటించునతఁడు" ఇత్యాది.

వి :— ప్రథమైకవచనలోపః, తద్ధార్మాతీతయోః, క్రియాణామ్, స్యాత్ -అని ఛేదము. తద్ధర్మభూతక్రియలయొక్క ప్రథమపురుషైక

వచనమునకు లోపము గల్గునని సూత్రార్థము. 'ఘటించు' ధాతువునకుఁ దద్ధర్మార్థమునకుఁ బ్రత్యేకలకారము లేదు. కావున లట్టు, తిప్పు చేయఁగా దాని కీసూత్రముచేఁ బ్రథమైకవచనలోపము కలిగి తద్ధర్మార్థప్రథమపురుషైకవచనమునందు 'ఘటించున్' అని యగును. భూతార్థమునందు లిట్టును దానికి 'తిప్పును' ధాతుపురకంటేఁ జేయఁగా 'ఘటించు+తి' అని యుండునపుడు "క్త్వాభూతయోః క్రియా స్స్యాత్" అను చొప్పున 'ఘటించు+ఇ+తి', "ప్రథమైకవచనలోపః" అనుదానిచేఁ దిప్పునకు సలోపము, "ప్రథమైకస్యైర్ధ్వ వేచ్చ భూతార్థే" అని ఏత్వము, "అన్యే ద్రుత ప్రకృతయః" అని ద్రుతమును జేయఁగా "ఘటించెన్" అని రూపమగును. ఏకవచనమునఁ దత్సమక్రియల కిత్వము రాదని యథర్వణుని వచనము. తక్కినవానికిని బ్రక్రియ నిట్లే యరయవలెను.

**240. సూ :— వ్యతిరేకార్థే లృటి లటి డుజ్స్యాత్.**

240 సూ :- వ్యతిరేకార్థే వర్తమానభవిష్యదర్థయోశ్చ ధాతో ర్డుజ్ స్యాదేకత్వే- "ఘటింపఁడు, చేయఁడు, ఘటింపఁగలఁడు, చేయఁగలఁడు, ఘటింపుచున్నాఁడు" ఇత్యాద్యుదాహరణమ్.

వి :- వ్యతిరేకార్థే, లృటి, లటి, డుజ్, స్యాత్-అని ఛేదము. 'వ్యతిరేకార్థమునందును, భవిష్యద్వర్తమానార్థములందును ధాతు ప్రథమపురుషైకవచనమునందు 'తిప్పునకు' డుజాదేశమగు ననియర్థము. వ్యతిరేకార్థమున ధాతుపురకంటె లట్టు చేయఁగా దానికి తిప్పు వచ్చి 'ఘటించు+తి' అని యుండఁగాఁ బ్రకృతసూత్రముచే డుజ్ చేయఁగా 'ఘటించు+డు' అనునపుడు "వ్యతిరేకాదౌ భావిని చాత్స్యాత్" అను చొప్పునఁ గ్రియాంతమున కత్వమును, "అనుబన్ధ... చోః వస్స్యాత్" అని ఇంచుకచ్ఛకారమునకుఁ బకారమును వచ్చి "ఘటింపఁడు - ఘటింపండు" అని వ్యతిరేకార్థప్రథమపురుషైకవచనమున రూపద్వయము సిద్ధించును. 'ఘటింపఁగలఁడు' అనురీతిరూపము "ఘటించు+లృట్=

ఘటించు+తి=ఘటించు+కల+తి=ఘటించు+అన్+కల+తి=ఘటింపు+అన్+కల+తి=ఘటింపఁగలఁడు" అని యగును. ఇచ్చట 'అస్తి రను ...ధాతోః, వ్యతి...చాత్స్యాత్; అనుబన్ధ...చోఽవ స్స్యాత్; అన్యే ష్వతిప్రకృతిదృష్టః" అనుసూత్రములు వర్తించి 'ఘటింపఁగలఁడు' అను రూప మేర్పడునని కవిశిరోభూషణ మభిప్రాయపడుచున్నది. 'ఘటింపఁగలఁడు' మున్నగురూపములను నన్నపార్యుఁడు తనభారతభాగమున భావ్యర్థమునఁ బ్రయోగించియుండ లేదు. కావున నట్టిరూపములను చింతామణిచే సాధింప యత్నించుట యుచితము కాదు. చింతామణిచే సాధింపఁదలఁచినచో 'ఘటించు' అనధాతువుకంటె, తుమర్థమున 'ఘటింపన్' అను రూపమును సాధించి, 'కలుగు' ధాతురూపమగు 'కల' అను దానిని దీనికి జోడించి, ప్రయోగము చేసి "ఘటింపఁగలఁడు - ఘటింపఁగలరు - ఘటింపఁగలవు - ఘటింపఁగలరు - ఘటింపఁగలను - ఘటింపఁగలము" అను రీతిని సాధించుట యుచితమని తోఁచుచున్నది. ఘటించుటకుఁ దగినశక్తి కలదని దీనికర్థము. వర్తమానార్థమునందుఁ గూడ ఘటించుచున్+ఉన్నవాఁడు అనియుండఁగా "తచ్ఛబ్దవర్ణ లోపస్స్యాదదాతోః క్వచి దేకతా" అనుచో వ్వాన 'ఉన్నాఁడు' అను రూపమును సంపాదించి, 'ఘటించుచున్' అనుదానితో నిత్యసంధిని 'చోద్వాస్యా' దనుదానిలోని 'వా' అనుదానికి వ్యవస్థ నంగీకరించి 'ఘటించుచున్నాఁడు' మున్నగురూపములను నన్నయాధర్వణులమతమున సాధించుట యుక్తముగా నగపడుచున్నది. నన్నయాథర్వణుల మతమునఁ బై రీతిని సాధించిన 'ఘటించుచున్నాఁడు - ఘటింపఁగలఁడు' అనునవి క్రియాజన్యవిశేషణము లేకాని సమాపకక్రియారూపములు కావని తెలియవలయును. కవిశిరోభూషణము సాధించిన 'ఘటింపుచున్నాఁడు' అనుదానిలోని పత్వము సరికాదు. 'ఘటించుచున్నాఁడు' అనియే యుండఁదగును.

**241. సూ :— స్త్ర్యర్థే పున ర్దుదీ భవతః.**

241. సూః- స్త్రీవిషయే తూక్తార్థేషు 'దు-ది', ఇత్యేతౌ వర్ణౌ స్తః. పున రిత్యవ్యయం విశేషార్థే వర్తతే. తత్ర వ్యతిరేకభవిష్యదర్థయోః దువర్ణకః, వర్తమానార్థే దివర్ణకః ఇతి విశేషః. కాంత ఘటింపదు, ఘటింపఁగలదు, చేయదు, చేయఁగలదు, చేయుచున్నది ఘటింపుచున్నది. స్త్రీ శబ్దోఽత్ర తిర్యగ్జడయో రప్యుపలక్షణమ్. "ఎలుక రాఁగలదు. రాదు, వచ్చుచున్నది" ఇత్యాదిరూపం తత్రోదాహరణమ్; "మదీ తిర్యగ్జడస్త్రీషు తేష్వర్థే ష్వేకతాం గతౌ" ఇత్యథర్వణః. ఆచార్యస్య ప్రబన్ధేషు ప్రయోగాశ్చాత్ర మానమ్ "ఘటింపుచున్నవాఁడు, ఘటింపఁగలవాఁడు, ఘటింపుచున్నయది, ఘటింపఁగలయది" ఇత్యాదౌ తచ్ఛబ్దాన్వయో బోధ్యః.

వి :- స్త్ర్యర్థే, పునః, దుదీ, భవతః-అని ఛేదము. ఇందలి స్త్రీశబ్దముచేఁ దిర్యగ్జడవాచకములును గ్రహింపఁబడును. కాన స్త్రీ తిర్యగ్జడవాచకములు వాచ్యములైనపుడు ధాతువుకంటె వ్యతిరేక భావ్యర్థములయందు దువర్ణకమును, వర్తమానార్థమునందు దివర్ణకమును వచ్చునని సూత్రార్థము. సూత్రమందలి పునశ్శబ్ద మవ్యయము. ఇది విశేషార్థమును బోధించును. కావున స్త్రీశబ్దమునకుఁ దిర్యగ్జడవాచకములు నర్థమైనవి. ఉ. 'కాంత ఘటింపదు' మొదలైనవి. 'ఘటించు' ధాతువుకంటె వ్యతిరేకార్థవివక్షలోఁ బ్రథమపురుషైకవచనప్రత్యయమునకు దువర్ణకమును, 'వ్యతిరేకాదౌ భావిని' అనుచోఁ బ్వాగమ నత్వమును జేయఁగా 'ఘటింపన్ + దు' ద్రుతలోపముచే "ఘటింపదు" అనురూప మేర్పడును. "ఆలత పుష్పింపదు. ఆచిలుక హసింపదు" మున్నగు రూపము లిట్లే సిద్ధించును. భవిష్యదర్థమున మహత్త్వమునందువలెనే 'ఘటింపఁడు' అనురూపమును జేసి 'డు' అనుదానికి బదులుగా నమహత్త్వమున దువర్ణకమును నిలిపినచో 'ఘటింపఁగలదు' అనురూపము సిద్ధించును. వర్తమానార్థమున 'ఘటించుచున్న' అనుదానిమీఁద నిలిచిన 'దు' అనుదానికి బదులుగ 'ది' అనుదానిని నిలుపఁగా 'ఘటించుచున్నది' అని యేర్పడును. తిర్యగ్జడమహత్ప్రర్థకములు కర్త లగునపుడు

వ్యతిరేకభావివర్తమానార్థములందు 'దు-ది' అనువర్ణకము లేక వచనద్యోతకము లగును ధాతువుకంటె వచ్చుచున్నవని "దుదీ తిర్యగ్జడస్త్రీషు" అను నథర్వణవచనమున కర్థము. "ఆస్త్రీ పలుకదు-పలుకఁగలదు-పలుకుచున్నది. ఇట్లే "ఆపక్షి పలుకదు-పలుకఁగలదు-పలుకుచున్నది" మొ॥ తిర్యగ్జడకర్తృకత్వమునందు భూతతద్ధర్మార్థములలో నేకవచనరూపమే బహుత్వమునుసైతము బోధించును. మహతీకర్తృకత్వమున నట్లు బోధింపదు. కాన "ఆపక్షులు పలుకున్, ఆపక్షులు పలికెన్-ఆస్త్రీ పలికెన్. ఆస్త్రీలు పలికిరి" అనియుండును. కాని "ఆస్త్రీలు పలికెన్" అని యుండరాదు. ఆచార్యప్రబంధముల యందుఁ బ్రయోగము లట్లే కలవు. "ఘటించుచున్నవాఁడు, ఘటింపఁగలవాఁడు, ఘటించుచున్నయది, ఘటింపఁగలయది" మున్నగువాని యం దున్న 'వాఁడు, అది' అనునవి తచ్ఛబ్దము లనియు, వానితోఁ బూర్వపదమున కన్వయమనియు నూహింపవలెను. సర్వనామశబ్దము లగు "అది-అవి-వాఁడు-వారు" మున్నగువానికర్థము సందర్భానుసారముగాఁ బూర్వవాక్యము ననుసరించి యుండును. "అది, అవి, వాఁడు, వారు" అనునవియు వానియితరవిభక్తిరూపములును విశేషణశబ్దములమీఁద విభక్త్యర్థమున నిలుచుట గలదు. 'అది, అవి' శబ్దములకు మాత్రము 'శబ్దాత్తచ్ఛబ్దాతః' అనుచొప్పున సమాసమునందు సంధికార్యముగ, అకారలోపము వికల్పముగా జరుగును. అట్టివానియందలి 'అది, అవి' యనునవి విభక్త్యర్థమున వచ్చినవి కావు. తచ్ఛబ్దామహద్వాచకములు. కవిశిరోభూషణము వీనిని విడఁదీసి వేఱుగాఁ జెప్పవలసియుండఁగా నట్టివివరణము చేయకుండుట సరికాదు గదా !

241 సూ. 2 :- "అనవుడు, అడ్డమగుడు" ఇత్యాది శత్రుప్రయోగా దశేనైవ మాత్రేణ తత్ర వర్తమానార్థే డుబ్ భవతీతి జ్ఞేయమ్.

వి. :- "అనవుడు - అడ్డమగుడు" అనువానియందుఁ జివర నున్నడుబ్బు "వ్యతిరేకార్థే లృటి లటి డుబ్ స్యాత్" త్తనుచొప్పునవచ్చినదని

కవిశిరోభూషణాభిప్రాయము. ఇవి రెండును ఆనంతర్యార్థకడువర్ణకము లే గాని డజ్వర్ణకము లుకావు. వీనిసాధుత్వము నన్నపార్యప్రయోగప్రామాణ్యము చేతనే యగుచున్నది. 'అను' ధాతువుపై నీ డువర్ణము వచ్చునపుడు 'అవు' అనునది అనుధాతువున కాగమమగును. ఈ డువర్ణము ద్రుతప్రకృతిక మగుటచే 'అనవుడున్ = అనినతోడనే' అనురూపము సిద్ధించును. అగుధాతువుమీఁద నీడువర్ణము వచ్చినచో 'అగుడున్' అని యగును. అడ్డమగుడు = అడ్డుపడినతోడనే' అనియర్థము. ఇట్టివానివి భావార్థక'డు'వర్ణకములని యూహించుట లెస్స.

**242 సూ :— అన్యస్మాచ్చాధాతో ర్ధాతుత్వవివక్షయైవ భవతీంచుక్.**

242. సూ. :— అన్యస్మా దధాతోశ్చ ధాతుత్వవివక్షయై వేంచుగాగమో భవతి. తత్ర "అస్తమ్, అహమ్ అన్తర్" ఇత్యాద్యవ్యయానాం సుఖకరుణావర్షమత్సరపల్లవాదీనాం;సుబన్తశబ్దానాంచోదాహరణత్వమ్ 'అస్తమించెన్' ఇత్యాదిరూపమ్ "ఊరువడి, ఇనుమడి, ముమ్మడి, సరబడి, పదపడి, తురంగలి, చెంగలి, తోలకరి, తల్లడ" ఇత్యాది దేశ్యశబ్దానామ ప్యేతత్సూత్రేణై వేంచుగత్వమ్. "శత్రువరుల నెల్లఁ దల్లడిల్ల నెగచినన్" ఇత్యాద్యాచార్యవచనమ్. "పల్లించె హాయమున్; ఆరగించె నన్నమున్, వెక్కిరించె నరులన్, అప్పగించె నతనిన్" ఇత్యాదీనాం తద్భవశబ్దరూపాణామ ప్యత్రోదాహరణత్వ మితి జ్ఞేయమ్.

వి :— అన్యస్మాత్, చ, అధాతోః, ధాతుత్వవివక్షయా, ఏవ, భవతి, ఇంచుక్—అని ఛేదము. ఉపకృతి, పరిణతి, సంవృతిభేదము గల త్రివిధధాతువులమీఁద నించుగాగమము వచ్చుచున్నది. వీనికి వ్యతిరిక్తముగ ధాతుభిన్నమైనవానికి ధాతుత్వవివక్ష చేసినంతమాత్రమున నించుగాగమము కలుగునని యీసూత్రము చెప్పుచున్నది. "అస్తమించు, అహంకరించు, అంతరించు" అనునది "అస్తమ్, అహమ్, అంతర్" అను నవ్యయములకు ధాతుత్వవివక్ష చేయఁగా నించుగాగమము వచ్చినరూపములు. ఇంతేకాక "సుఖించు, కరుణించు, వర్షించు, మచ్చరించు, పల్లవించు" మున్నగునవి శబ్దములు. వీనికి ధాతుత్వవివక్షలో

నించుగాగమము వచ్చి పై రూపము లేర్పడుచున్నవి. 'ఉరువడించు, ఇనుమడించు, మూన్నడించు' మున్నగునవి ద్వ్యక్షరశబ్దములకు ధాతుత్వ వివక్షలో నించుగాగమము వచ్చినరూపములు. ఈసందర్భమున 'సర వడి, పదపడి' అని రెండుశబ్దము లుదాహరింపఁబడినవి. వీనికి ధాతు త్వవివక్షలో నించుగాగమము చేయఁగా 'సరవడించు, పదపడించు' అని యగుచున్నవి. ఇట్టిప్రయోగము లదృష్టములు. కావున నీరెండు శబ్దములును లేఖకప్రమాదపతితము లేమో! 'తునగలించు, చెంగలించు, తొలకరించు, కల్లడించు' మున్నగువానికి లోకప్రసిద్ధముగా నించుగా గమ మగపడుచున్నది. పదపడి' యనుశబ్దము 'పదము+పడి=పదపడి' ఇది 'ప్రథమావైభక్తికమౌ' అనుదాని కుదాహృతి. తరువాత నను నర్థములో నిది ప్రసిద్ధమై యున్నది. దీని కించుగాగమము ప్రసిద్ధము కాదు.

**243.** సూ :– తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం చైకవచనమేవ స్యా ద్భూతే తద్ధర్మే చ.

243 సూ. 1 :- భూతతద్ధర్మ్యర్థయోః ప్రథమపురుషబహువచనం త్వేకవచన మేవ స్యా త్తిర్యగ్జడేషు కర్తృషు సత్సు. "ధేనువులు రంజిల్లు, చిలుకలు వర్ధిల్లు, మేఘ ములు వర్షించు" ఇత్యాది తద్ధర్మోదాహరణమ్ 'ధేనువు రంజిల్లె' నిత్యాది భూతార్థే; తత్ర తిర్యగ్జడశబ్దయోః స్వరూపస్యాపి గ్రహణమ్. నచాపూర్వ మిదమ్. పంచస్వాత్త వ్యాకరణే "నదీపార్ణమాప్యాగ్రహేయణీభ్యః" ఇతిసూత్రే నదీశబ్దేన స్వరూ పార్థయో ర్గ్రహణమితి కాద్దిక రుక్తత్వాత్. తేన 'తిర్యక్కులం వచ్చెన్-వచ్చున్' ఇత్యాదిరూపం సిద్ధ్యతి.

వి :– తిర్యగ్జడేషు, కర్తృషు, బహువచనమ్, చ, ఏకవచనమ్, ఏవ, స్యాత్, భూతే, తద్ధర్మే, చ–అని ఛేదము. వాక్యమునందుఁ దిర్యగ్జడవాచకములు కర్త లగునపుడు భూతతద్ధర్మాద్యర్థములలో బహువచనమునం దుండవలసినక్రియ యేకవచనమునందే యుండునని సూత్రార్థము. "మేఘములు రంజిల్లున్, మేఘము రంజిల్లున్, చిలు కలు వర్ధిల్లున్, చిలుక వర్ధిల్లున్, మేఘములు వర్షించున్, మేఘము

వర్షించెన్ మున్నగునవి తద్ధర్మార్థమున కుదాహరణములు. ధేనువులు రంజిల్లెన్, ధేనువు రంజిల్లెన్" మున్నగునవి భూతార్థమున కుదాహరణములు. "తిర్యక్కులు వచ్చెన్, తిర్యక్కులు వచ్చున్" అనునపుడు తిర్యగ్జడశబ్దములవాచకములకే గాక తత్స్వరూపమునకుఁగూడ నిందు గ్రహణమని తెలియవలెను. ఈవిషయము సంస్కృతవ్యాకరణములోఁ బ్రసిద్ధమైయున్నది. దానిని కవిశిరోభూషణము చూపినది. తెనుఁగునకు మహాకవిప్రయోగములు ప్రమాణము లగును. అట్టిప్రయోగములను జూపినచోఁ దెనుఁగువ్యాకరణమున నవి సుప్రమాణము లగును. సంస్కృతవ్యాకరణసాదృశ్యము తెనుఁగువ్యాకరణమునకు శాస్త్రీయప్రామాణ్యమునకు మాత్రమే యుపయోగించును.

243. సూ. 2 :— స్త్రీమహత్సహయోగే తు నైకవద్రూపమ్ "యద్యన్యసహయోగే తు రూప మేవం న విద్యతే" ఇత్యథర్వణోక్తేః "కాంచిరి తామరయు నెలయు ఘనసుఖవృత్తుల్" ఇత్యాది తత్రోదాహరణమ్.

వి :— తిర్యగ్జడవాచకములును, దదితరములును గలిసి యొక వాక్యమునఁ గర్తలైన దానికి బహువచనక్రియ యేర్పడవలసియున్నపుడు క్రియావాచకపదమునకు రావలసినయేకవచనాంతత రాదని యథర్వణవచనమున కర్థము. "కాంచిరి తామరయు నెలయు ఘనసుఖవృత్తుల్." ఇందు 'తామర-నెల' అనునవి కర్తలు 'నెల' అనునది మహద్వత్తు చేయఁదగినది. ఇచట మహత్సహయోగ మున్నదికావున నేకవచనము రాక బహువచనమే నిలిచినది. 'మృగములును వేటకాఁడును వచ్చిరి' మున్నగునవి. 'మృగములు' అనునవి యమహద్వాచకము, లేక తిర్యగ్వాచకమువనియు ననవచ్చును. 'వేటకాఁడు' అనునది మహద్వాచకము. ఇవి బహువచనము లగుటచే వీనిక్రియ యేకవచనమునందుండవలసినను మహత్సహయోగ ముండుటచేఁ గ్రియ కేకవచనాంతత కలుగ లేదు. ఈన్యాయము ననుసరించియే యనేకకర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనములు కలుగుననియు నూహింపవచ్చును.

"ఎవ్వానిబాంధవమిత్రులు జీవధనంబులును డప్పిఁజెందునువాఁడే (భార, శాంతి, 1, ఆ, 52, ప)" సురగంధర్వప్రభృతులు ధరణీశైలావగాబ్ధి ధాత్రీజాదుల్ సచరాచర నీకేయవకృతి చరయఁగఁగావించె జగములందు" (రామా-అరణ్య-2-ఆ-342-వ) మున్నగు ప్రయోగములనుబట్టి పై యథర్వణవచనము సమూలమని తెలియుచున్నది. వీనింబట్టియే తమ సేనలు వారును విశ్రమించిరి' మున్నగునవియు సాధువులగును.

**244. సూ :- అన్యత్ర వుపి.**

244 సూ :- అన్యత్ర ఆగామివర్తమానవ్యతిరేకార్థేషు 'వుపీ' ఇత్యేతౌ స్తః తిర్యగ్జడేషు కర్తృషు బహువచనే. వర్తమానార్థబహుత్వే 'వి', వ్యతిరేకాగామ్యర్థయోః బహుత్వే వుః ఇతి వివేకః. "చిలుకలు రంజిల్లుచున్నవి, రంజిల్లఁగలవు, రంజిల్లవు" ఇత్యాది.

వి :- అన్యత్ర, వుపీ-అని ఛేదము. భూత, తద్ధర్మకాలముల యందుఁ దిర్యగ్జడవాచకశబ్దములు కర్త లగునపుడు బహువచనమున కేకవచనము వచ్చుచున్నది. భూతతద్ధర్మేతరము లగునాగామి, వర్తమానవ్యతిరేకములలోఁ దిర్యగ్జడవాచకశబ్దకర్తృత్వమునందుఁ గ్రియకు 'వు, వి' అనునవి కలుగుచున్నవని సూత్రార్థము. 'చిలుకలు రంజిల్లుచున్నవి' అని వర్తమానార్థమున కుదాహరణము, 'చిలుకలు రంజిల్లఁగలవు, రంజిల్లవు' అనునవి భావివ్యతిరేకముల కుదాహరణములు.

**245. సూ :- స్త్రీవ దేకవచనస్తు.**

245. సూ :- తిర్యగ్జడేషు కర్తృ ష్వేవ్వార్థే ష్వేకవచనస్తు స్త్రీవ త్స్యాత్. స్త్రీత్వే పునర్దుపీ భవతః ఇత్యుక్తత్వా ద్దుపీతి స్త ఇత్యర్థః. అత్ర వర్తమానార్థే 'ది', వ్యతిరేకభవిష్యదర్థయో ర్దుఃతి వివేకః. "చిలుక రంజిల్లుచున్నది, రంజిల్లదు, రంజిల్లఁగలదు" ఇత్యాది.

వి :- స్త్రీవత్, ఏకవచనమ్, తు-అని ఛేదము. తిర్యగ్జడవాచకములు కర్త లగునవు డాగామివర్తమాన వ్యతిరేకార్థములం

దేకవచనమున 'దు-ది' అనువర్ణకములు వచ్చును. వర్తమానార్థమున దివర్ణకమును, వ్యతిరేకభవిష్యదర్థములయందు దువర్ణకమును వచ్చునని తెలియవలెను. "చిలుక రంజిల్లుచున్నది" అని వర్తమానార్థోదాహరణము. "రంజిల్లదు" అని వ్యతిరేకార్థోదాహరణము. "రంజిల్లఁగలదు" అని భావ్యర్థోదాహరణము

**247. సూ :- ఉత్వయుతౌ వనకారౌ స్యాతాం మధ్యోత్తమైకవచనానామ్.**

247. సూ :- సర్వక్రియాణాం సర్వేష్వర్థేషు మధ్యోత్తమైకవచనానాం క్రమాద్వు-ను ఇత్యేతౌ వర్ణకౌ స్తః. "ఘటింపవు, చేయవు, ఘటింపుచున్నావు, ఘటింపఁగలవు, చేయఁగలవు, ఘటింతువు, చేయుదువు; ఘటింపను, చేయను, ఘటింపుచున్నాను, చేయుచున్నాను. ఘటింపఁగలను, చేయఁగలను, ఘటింతును, చేయుదును" ఇత్యాది. "పూజలఁదనప్పడు నల్గ నోడుదున్" ఇత్యాద్యాచార్య ప్రయోగాణామత్తే నువర్ణకస్యోల్లోపో జ్ఞేయః.

వి:- ఉత్వయుతౌ, వనకారౌ, స్యాతాం, మధ్యోత్తమైకవచనానామ్-అని ఛేదము. సమస్తక్రియలకును మధ్యమపురుషోత్తమపురుషైకవచనములలో ఉకారముతోఁ గూడిన 'వ-న' కారములు క్రమముగా వచ్చునని సూత్రార్థము. అనఁగా 'వు' మధ్యమైకవచనమునను, 'ను' ఉత్తమైకవచనమునను వచ్చునని యర్థము. ఘటింపవు-వ్యతిరేకము; ఘటించుచున్నావు-వర్తమానార్థము. ఘటింపఁగలవు-భవిష్యదర్థకము; ఘటింతువు-తద్ధర్మార్థకము." ఇవి మధ్యమపురుషైకవచనక్రియలు. ఇట్లే "ఘటింపను-ఘటింపుచున్నాను-ఘటింపఁగలను-ఘటింతును" అనునవి యుత్తమపురుషైకవచనక్రియలు. ఉత్తమపురుషైకవచనక్రియలలోని నకారోకారమునకు లోపము కల్గినపుడది నన్నయాథర్వణులమతమున ద్రుతమై ద్రుతకార్యముల నందుచుండునని తెలియవలెను.

**248. సూ :- సర్వేషాం బహువచనే రు ఇతి స్యాత్.**

248. సూ :- సర్వక్రియాణాం సర్వేష్వర్థేషు బహువచనే రువర్ణకః స్యాత్.

"వారు ఘటింపుచున్నారు, మీరు ఘటింపుచున్నారు. వారు ఘటింపఁగలరు, మీరు ఘటింపఁగలరు. వారు ఘటింతురు, మీరు ఘటింతురు, వారు ఘటించెదరు, మీరు ఘటించెదరు, వారు ఘటింపరు, మీరు ఘటింపరు, వారు ఘటించిరి, మీరు ఘటించితిరి" ఇత్యాద్రి భూతార్థే ఇత్యపి.

వి:- సర్వేషామ్, బహువచనే, రు, ఇతి, స్యాత్-అని ఛేదము. అన్నిధాతువులకు నన్నికాలములయందును బహువచనమునందు రువర్ణకము వచ్చును. 'వారు' అనునది ప్రథమపురుషబహువచనసర్వనామము; 'మీరు' అనునది మధ్యమపురుషబహువచనము. ఇవి కర్త లగునప్పుడన్నికాలములలోని క్రియలకును 'రు' అనువర్ణకము వచ్చును. మూలమున నుదాహరింపఁబడిన స్వప్తములు ఘటింపుచున్నారు-మున్నగుచోట్ల వర్తమానార్థమున సించుగాగమచకారమునకు 'పత్వము' చేసి కవిశిరోభూషణము గ్రహించినది. అది సరికాదని యిదివఱకే స్పష్టపఱుపఁబడినది.

## 249. సూ. ఉత్తమస్య తు భవే న్ముః.

249. సూ. ఉత్తమపురుషబహువచనే తు సర్వత్ర మువర్ణకః స్యాత్. మేము ఘటింపుచున్నాము-మేము ఘటించితిమి; భూతార్థే ఇత్యపి. "మేము ఘటింపఁగలము-మేము ఘటింతుము-మేము ఘటించెదము-మేము ఘటింపము" ఇత్యాది.

వి:- ఉత్తమస్య, తు, భవేత్, ముః-అని ఛేదము. ఉత్తమపురుషబహువచనమునందంతటను మువర్ణకము వచ్చును. ఉదాహరణములు మూలమునఁ జూచునది.

## 250. సూ. :- ఏకత్వేఽథ బహుత్వే ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః.

250 సూ. :- సంప్రార్థనార్థే వివక్షితే క్రియాభ్య ఏకవచనే బహువచనే చ ముడుజౌ క్రమాత్ స్తః "నన్నుఁ బోషింపుము-నన్నుఁ బోషింపుఁడు-నన్నుఁ బ్రోవుము-నన్నుఁ బ్రోవుఁడు" ఇత్యాది.

వి:- ఏకత్వే, అథ, బహుత్వే, ముడుజౌ, సంప్రార్థనార్థకేషు,

స్తః-అని ఛేదము. సంప్రార్థనార్థకములనఁగా నాశీస్సంప్రార్థనవిధులని యర్థము. ఈయర్థములయం దేకవచనమున మువర్ణాగమును, బహువచనమున డుజ్వర్ణకమును, మధ్యమపురుషైకవచనబహువచనములకు కాదేశము లగునని యర్థము. ఉదాహృతులు మీఁదఁ జూడనగును. "లూణ్మధ్యమ పు-పులకు ముడుజ్డు లగు" (బాల. క్రియ, ౭౭) అని బాలవ్యాకరణవివరణము.

## 251. సూ. :– దా చో ర్లుక్ తద్ధర్మే.

251. సూ. :– తద్ధర్మార్థే ఇంచుగాగమసమ్బన్ధిన శ్చుకారస్య లుక్స్యాత్ దువర్ణకే పరే "ఘటింతున్-వటింతున్; దస్య తకారో వక్ష్యతే.

వి:- దా, చోః, లుక్, తద్ధర్మే-అని ఛేదము. తద్ధర్మార్థమునందించుగాగమసంబంధి యగుచుకారమునకు దువర్ణకము పరమగునపుడు లోపము కలుగునని సూత్రార్థము. ఘటించుధాతువునకు ఉత్తమపురుషైకవచనప్రత్యయమగు 'నున్' అనునది పరమైనపుడు "దుతిచర్ణకౌ" అనుచోటనున్న 'దు' అనునది వచ్చియుండఁగాఁ బ్రకృతసూత్రముచే 'చు'వర్ణకము లోపించి 'ఘటించునున్' అగుచుండును. "బిందుపరస్య తకారో దోస్స్యాత్" అని తకారము వచ్చి 'ఘటింతునున్' అనురూపము నిష్పన్నమగును. తుదినకారమునకు లోపమును నువర్ణోకారమునకు లోపమును జేయఁగా 'ఘటింతున్' అని యగును.

## 252. సూ. :– ప్రథమైక స్యై ద్భవే చ్చ భూతార్థే.

252. సూ. :- ప్రథమపురుషైకవచనాన్తక్రియాపదస్య ఏత్వం స్యాద్భూతార్థే. 'ప్రథమైకవచనలోపః' ఇత్యాదినా ప్రథమపురుషైకవచనస్య లోపః. 'నుతించెన్-ఘటించెన్-చనియెన్-వినియెన్' ఇత్యాది.

వి:- ప్రథమైకస్య, ఏత్, భవేత్, చ, భూతార్థే-అని ఛేదము. ప్రథమపురుషైకవచనాన్త మగుభూతార్థక్రియకుఁ జివర నేత్వ మాగమముగా వచ్చును. తరువాతఁ బ్రథమపురుషైకవచనము లోపించును.

"నుతించు+తిప్=నుతించు+తి=నుతించు+ఎన్=నుతించెన్" తిప్పునకుఁ "ప్రథమైకవచనలోప స్తద్ధర్మ్యకీతయోః క్రియాణాం స్యాత్" అని లోపము. ఏకారాగమము, ద్రుతము, చేసినఁ బై రూపము సిద్ధించును. తక్కినవియు నిట్లే యూహింపవలెను.

**253. సూ. :—** దుతివర్ణకౌ క్రమాత్ స్తః.

253. సూ. :- పూర్వ, ప్రపూర్వసూత్రాభ్యాం తద్ధర్మ్యే, భూతార్థే ఇతి వ్యస్త పదద్వయ మనువర్తతే. క్రియాపదా త్పర్వస్మా త్తద్ధర్మభూతార్థయోః దుతివర్ణకౌ క్రమాత్ స్తః. క్రమోఽత్ర శాబ్ద్యమేవ లభ్యతే.

వి:— దుతివర్ణకౌ, క్రమాత్, స్తః—అని ఛేదము. "డాచో ర్లుక్ తద్ధర్మ్యే, ప్రథమైకస్మి న్యభవేచ్చ భూతార్థే, 'దుతి' వర్ణకౌ క్రమాత్ స్తః" అని చింతామణికారిక. ఇందలి తద్ధర్మభూతములను వరుస ననుసరించి 'దుతివర్ణకౌ' అనువరుస చెప్పఁబడినది. కాన 'దు' వర్ణకము తద్ధర్మ్యార్థమునను, 'తి'వర్ణకము భూతార్థమునను విధింపఁబడిన దని తెలియవలెను. ఇట్లర్థము చేయని యెడల 'తిదువర్ణకౌ' అని పఠింప వలయునుగదా! పూర్వసూత్రము లనువృత్తము లని కవిశిరోభూషణ ముచే ననువృత్తి చెప్పఁబడినది. అనువృత్తిపద్ధతి నన్నయాథర్వణులకు సమ్మతము కాదు. కావున నట్టినన్యాయము సరికాదు.

**254. సూ :—** నాఽద్యస్యాదేః.

254 సూ.:- తద్ధర్మ్యార్థవాచకక్రియాపదా త్ప్రథమైకవచనే న దువర్ణకో భవతి. "పోషించున్-చేయున్" ఇత్యాది.

వి :— న, ఆద్యస్య, ఆదేః—అని ఛేదము. తద్ధర్మ్యార్థకప్రథమపురు షైకవచనమునందు దువర్ణకము రాదని యర్థము. ప్రథమపురుషైకవచన ముఁదప్ప మిగిలినచోట్ల దువర్ణకము వచ్చునని తాత్పర్యము. "పోషించు+లట్=పోషించు+తి ప్రథమైకవచనలోపము ద్రుతము, చేయఁగా 'పోషించున్, చేయున్' మున్నగురూపము లగును.

**255 సూ:- ద్వయోశ్చ భూతార్థే.**

255 సూ:- భూతార్థవాచకాత్క్రియాపదాత్ప్రథమపురుషైకబహువచనయోశ్చ న తివర్ణకో భవతి. పోషించెన్-చేసెన్-పోషించిరి-చేసిరి-ఇత్యాది.

వి:- ద్వయోః, చ, భూతార్థే-అని ఛేదము. భూతార్థమును జెప్పు క్రియాపదముకంటెఁ బ్రథమపురుషైకవచనబహువచనములలోఁ 'తి'వర్ణక మాగమముగా రాదని యర్థము. "పోషించు+లిట్=పోషించు+తి=పోషించు+ఎ=పోషించెన్. పోషించు+ఇ+రు=పోషించిరి." భూతార్థమునఁ బ్రథమపురుషైకవచన బహువచనములయందు 'తి'వర్ణకము రాదు. ప్ర.ఏ.-పోషించెన్, ప్ర. బ. పోషించిరి. మ. ఏ. పోషించితివి, మ.బ. పోషించితిరి. ఉ. ఏ. పోషించితిఁన్, పోషించితిన్. ఉ. బ. పోషించితిమి. తివర్ణకము ప్రథమపురుషైకబహువచనములలోఁ దప్ప మిగిలిన మధ్యమోత్తమపురుషములలో వచ్చినదిగదా! తద్ధర్మార్థక రూపములు ముందుఁ జూపఁబడును.

**256 సూ:- బిందుపరస్య తకారో దో స్స్యాత్.**

256 సూ:- బిందోః పరస్య దువర్ణకసమ్బన్ధినో హల్మాత్రస్య తకారాదేశః స్స్యాత్. "దో చో ర్లుక్ తద్ధర్మే" ఇత్యనేన ఉకారలుకి బిందుపరత్వం దో స్సిద్ధ్యతి. "ఘటింతును నేను; ఘటింతుము మేము-ఘటింతువు నీవు-ఘటింతురు మీరు" ఇత్యాది. "ఆకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్" ఇత్యాదౌ "ఆకర్ణింతురు మహాత్ము లతిహర్షమునన్" ఇత్యాదిపాఠ ఏవ సాధుః. "సలుపుద మీనిదాఘదివసంబులన్" ఇత్యాదివచనాత్. "న స్యాత్తద్ధర్మ్యుఽతః" ఇతి నిషేధో వాస్తవమాత్రవిషయ ఇతి జ్ఞాయతే.

వి:- బిందుపరస్య, తకారః, దోః, స్యాత్ -అని ఛేదము. బిందువునకుఁ బరమైనహల్మాత్రదుగాగమదకారమునకు 'తకారము' వచ్చునని యర్థము. 'ఘటించు+లట్=ఘటించు+తి=ఘటించున్' అని ప్రథమపురుషైకవచనరూపము తద్ధర్మార్థమున నేర్పడుచున్నది. ఇందు "నాద్యస్యాదేః" అను దుగాగమనిషేధము. బహువచనమున "ఘటించు+ఝి=ఘటించు+రు=ఘటించు+దు+రు=ఘటిందు+రు= ఘటింతురు."

“దుతివర్ణకౌ” అని దుగాగమము. ‘దా చోర్ధుక్ తద్ధర్మే’ అని చుకార లోపము. ‘బిందుపరస్య తకారో దో న్యాత్’ అను సూత్రమువలనఁ బై రూపములు సిద్ధించును. దీనిరూపములు :— ప్ర.ఏ = ఘటించున్, ప్ర-బ.= ఘటింతురు, మ-ఏ.= ఘటింతువు, మ.బ= ఘటింతురు, ఉ.ఏ= ఘటింతునన్, ఘటింతున్, ఉ.బ.= ఘటింతుము “ఆకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్” అనునపుడు ఆకర్ణించుధాతు చకారమునకు దుగాగమము పరమగునపుడు పత్వము రాదు. కావున “ఆకర్ణింపుదురు” అను రూపము కలుగదు. కావునఁ బైరీతిని ‘ఆకర్ణింతురు’ అనియే యుండవలసియుండుటచే “ఆకర్ణింతురు మహాత్ము లతిహర్షమునన్” అని కవిశిరోభూషణము సవరించెను. ‘కలువుదమీనిదాఘదివసంబు’లనునపుడు ‘కలువుదము+ఈనిదాఘదివసంబులు’ అనుచోట ‘న స్యాత్తద్ధర్మేఽతః’ అను నిషేధము తగులదు. అధర్వణాచార్యులుగారు ప్రథమోత్తమైకవచనాంతములకే తద్ధర్మసంజ్ఞ మనియు, వానికే సంధినిషేధము తగులుననియు “ప్రథమశ్చోత్తమశ్చైవ తౌను తద్ధర్మసంజ్ఞకౌ। భూతాద్యవిషయౌ తత్ర చైకత్వార్థాభిధాయకౌ। ఉదంతౌ చ పరానాంతౌ న సంధిస్తత్ర కల్ప్యతే” అని నిర్ణయించియున్నారుకదా!

**257. సూ.:— భూతా దుతాం పరేషా మిత్.**

257. సూ. 1:— క్రియాపదాత్పరేషాం ‘ను,ము,వు,రు’ ఇత్యేషాం వర్ణకానాం ఉకారస్య ఇదాదేశ స్స్యాద్భూతార్థే. “నేను ఘటించితిని-నీవు పోషించితివి-మీరు రంజించితిరి-మేము నుతించితిమి-నేను చేసితిని” ఇత్యాది.

వి:— భూతాత్, ఉతామ్, పరేషామ్, ఇత్ —అని ఛేదము. క్రియాపదముకంటెఁ బరమయిన ‘ను-ము-వు-రు’ అను ప్రత్యయములకు భూతార్థమున నిదాదేశము కలుగునని యర్థము. ఘటించు+మిప్ = ఘటించు+ను= ఘటించు+ఇ+ను= ఘటించి+తి+ను = ఘటించితిన్” అని యగును. ధాతువున కుత్తమపురుషైకవచనవివక్షలో “ఉత్వాయ తౌ” అను చోట్లున మిప్పునకు నువర్ణక మాదేశమగును. “క్త్వాతభూయోః క్రియా

త్వాస్స్యాత్' అను చోఁ బ్రాప్తించిన ఇత్వము వచ్చును. 'ద్యుతివర్ణకా' ఇత్యాదిచే తివర్ణకమును, బహుళగ్రహణముచే ఉత్వమున కిత్వమును బ్రమతమును జేయఁగా 'ఘటించితివిన్' అనియు, నివర్ణకలోపమునందు 'ఘటించితిన్' అనియు రూపములు సిద్ధించును. ఇత్వము ప్రథమపురుషైకవచనమునఁ దప్ప మిగిలిన యన్నివచనములయందును భూతార్థమున వచ్చును. భూతార్థకరూపములు 255వ సూత్రవివరణమునఁ జూడనగును.

257. సూ. వృ:- "మనము ఘటింపుచున్నాము-మనము ఘటింపఁగలము-మనము ఘటించితిమి. వ్యతిరేకే- మనము ఘటింపము" ఇత్యాదా వుభయార్థవాచకాస్మచ్ఛబ్దా స్మద్వర్ణః. తద్ధర్మస్తు ఘటింతము ఇతి విశేషః. "సలుపుద మినిభాషదివసంబులం నీవును నేను" "ఇత్తరుణిఁ బరిగ్రహింతము" ఇత్యాద్యాచార్యప్రయోగా ద్వ్యతిరేకాదాత్యసేనాత్వమ్, అథర్వణేన తు "ఉభయార్థే భవే దత్వ మ్వర్థభేదే క్వచిన్న తత్" ఇత్యుక్తమ్.

వి:— తెనుఁగున నుభయార్థవాచి యగు మనశబ్దము కలదు. అది కర్తగా నుండునపుడు క్రియ లీరీతిగా నుండును. 'మనము ఘటించుచున్నాము' అని వర్తమానార్థమునను, 'ఘటింపఁగలము' అని భవిష్యదర్థమునను, 'ఘటించితిమి' అని భూతమునను, 'ఘటింపము' అని వ్యతిరేకమునను రూపములు సిద్ధించును. వీనికి వరుసగా "ఘటించుచున్నవారము, ఘటింపఁగలవారము; ఘటించినవారము, ఘటింపనివారము" అనియర్థములు. నన్నపార్యుఁడు 'మనము సలుపుదము, మనము పరిగ్రహింతము' మన్నరీతిగా దీనిం బ్రయోగించియున్నాఁడు. 'ఉభయార్థవాచకమగు మనము అనునది కర్తగా నున్నపుడు క్రియాపదము తుదియుకారమున అకారము వచ్చును. ఒకానొకచో నర్థభేద మున్నపుడా యత్వము కలుగదు'—అని 'ఉభయార్థే' యనునథర్వణవచనమున కర్థము. దానిచే 'సలుపుదము-పరిగ్రహింతము' మున్నగుచోట్ల నత్వము వచ్చినదని తెలియవలెను. కవిశిరోభూషణము వ్యతిరేకాదౌ ఇత్యాదిచే నత్వము వచ్చుననుట సరికాదు.

257. సూ. 3. :- "భూమీశ్వర! సాకేతపురమునందు, మిగులదీపించుకనకపు మేడలోనఁ, జారుతరపుష్పమయమైనశయ్యమీఁదఁ, బవ్వళింతుము మనము సంభ్రమము మీఱ" ఇత్యాదావర్థభేదః. "ఇప్పుడు మన మొనరింతుమె యిట్టిపనులు" ఇత్యాదౌ వ్యతిరేకార్థో ద్యోత్యతే క్వచిత్. "ఇపుడు మన మొనరింతుమె యిట్టిపనులు" ఇత్యాదౌ తు ప్రశ్నమాత్రం ప్రతీయతే.

వి:- 'పవ్వళింతుము' అనునపుడు 'ఉభయార్థే' అనుసంధర్వాణ వచనముచొప్పున సత్వము రాలేదు. అట్లు రాకుండుట కర్థభేదము కారణము. అర్థభేదమునం దిత్వము రాదని సంధ్యర్వాణవచనమునఁ జెప్పఁబడినది. "పవ్వళింతుము = పవ్వళింపఁగలము" అని సన్నపార్యుఁడు భవిష్యదర్థమునం దిట్టిసిద్ధక్రియారూపము నే ప్రయోగించుటగాని కవిశిరోభూషణము సాధించిన 'పవ్వళింపఁగలము' అను దానిం బ్రయోగింపఁడుగదా! 'ఇపుడు మన మొనరింతుమె' యనుచోటఁ బ్రశ్నార్థము 'ఎ' అనుదానిచేఁ బ్రతీయమానమగుచున్నది కాని 'పవ్వళింతుము' అనుదానిచేతఁ గాదని తెలియవలెను. 'ఇప్పుడు మన మొనరింతుమె యిట్టిపనులు' అనుచోట 'ఇట్టిపను లిప్పుడు మనము చేయము' అని వ్యతిరేకార్థము వ్యక్తమగుచున్నది. కాన సత్వము రాలేదు. ఇట్టియర్థభేదము లున్నపుడు దుగాగమమునకు రావలసిన అత్వము రాదు.

257. సూ. 4 :- "ప్రార్థనార్థే ము శేః త్వే కథ్యతే మధ్యమార్థకః; విభాషా తు పద స్త్వేకే న ప్రాణేతు కదాపి చ" ఇత్యథర్వాణః- "ఘటియింపుముఖము, కరుణఁజూడుమన్మున్" ఇత్యాది. అపి పరేతు "ఘటియింపు మమలసుఖము" ఇత్యేవరూపమ్. అయం వికల్ప ఆచార్యస్యాపీష్ట ఏవ. "ననుం గృపఁజూడు భారతీ" ఇత్యాది తద్వచనాత్.

వి:- ప్రార్థనాద్యర్థములయందు, అనఁగాఁ బ్రార్థనము, వ్యతిరేక ప్రార్థనము, విధి, వ్యతిరేకవిధి-అనునవి గ్రహింపఁబడును. ఏకవచనమున మధ్యమపురుషార్థకము వర్ణకము వచ్చునని చెప్పఁబడినది. వికల్పముగా నది వచ్చునని కొందఱనుచున్నారు. అచ్చు పరమగునపుడు మాత్ర మెన్నఁడును వికల్పముగా రాదు. నిత్యముగనే వచ్చును-అని

"ప్రార్థనార్థే" అనునథర్వణవచనమున కర్థము. అచ్చు పరమగునపుడు విభాషగా రాదనుటచే హల్లు పరమగునపుడును, నేదియుఁ బరముగా లేనపుడును (అవసానమందని యర్థము) వైకల్పికముగా వచ్చుననియుఁ దెలియుచున్నది. 'ననుం గృపఁజూడు భారతీ' అనునపుడు 'ననుం గృపఁ జూడుము+భారతీ' అనుచోట హల్లయినభకారము పరమయినది కావున మువర్ణకము లోపించి "ననుం గృపఁజూడు భారతీ" అని యైనది. లోపము రానప్పుడు 'కృపఁజూడుము' అని యుండును. అవసానమునం దును, "భారతీ ననుం గృపఁజూడు-కృపఁజూడుము" అనియే యుండును. అచ్చు పరమయినపుడు 'కృపఁజూడు మంబ' అనియే యుండును. 'కృపఁ జూ డంబా' అని యుండదు. ఇందు 'విభాషా తు' అనుచోట 'విభాషాతో' అని కొందఱు పఠించుచున్నారు. ఆపాఠమే సమంజసమని తోఁచుచున్నది. ఈవిషయమును సూరిగారు "మధ్యమపురుషమువర్ణకంబునకు హాలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాషనగు" (బాల-సంధి-47) అని వివరించియున్నారు.

257 సూ. 5 :- "తలంపు దయ్యా-సేవింతే-రక్షింతే-పంపుదే-యెఱుంగుదే-వలతయేని యమరవల్లభుండ" ఇత్యాద్యాచార్యప్రయోగాత్ తద్ధర్మార్థే క్రియామాత్రే మధ్యమపురుషే వువర్ణకస్య వికల్పః. "వైచెదు-వైచెదవు; చేసెదు"- ఇత్యాదిప్రయోగాత్ దేత్వంచ. "పోయెదవ్-వచ్చెదవ్" ఇత్యాదిప్రయోగాద్దువర్ణకస్యాత్వం, 'తస్మిన్ పరే ఏత్వంచ'. ఏతదేత్వ మత్వం చాచార్యప్రబన్ధేషు దేశ్యక్రియాస్వేవ ప్రాయశః శ్రూయతే. 'వైచెదువు' ఇత్యాదిరూపమపి తదిష్టమేవ. 'వైచెదవు' ఇత్యత్వసహితరూప మాథర్వణమ్. "క్వచిద్వువర్ణకేచాపి కేచి త్తస్యాస్థితిం జగుః" ఇత్యాథర్వణం వచనమ్. తచ్ఛబ్దేనాత్వ ముచ్యతే. "ఉభయార్థే భవే దత్వం" ఇతి పూర్వసూత్రాత్.

వి.- నన్నపార్యుఁడు "సేవింతు+వు+ఏ, రక్షింతు+వు+ఏ; పంపుదు+వు+ఏ; యెఱుంగుదు+వు+ఏ;వలతు+వు+అ+ఏని-మున్నగువానిని "సేవింతే-రక్షింతే-పంపుదే-యెఱుంగుదే-వలతయేని" అను రీతిఁ బ్రయోగించియుండుటచేఁ దద్ధర్మక్రియలయందు మధ్యమపురుష

మున పువర్ణకము వికల్పమని తెలియుచున్నది. అథర్వణాచార్యులుగారు "పువర్ణకపరకత్వమునందును, "ఉభయార్థే ... న తత్ – అనుచో వ్యాన వచ్చిన. అత్వమునకు స్థితి క్వాచిత్కముగఁ గలదు" అని చెప్పుటచే రూపద్వయము కలుగుచున్నది. "తలంచు + సిప్ = తలంచు + వు = తలంచు + దు + వు = తలందు + వు + ఏ = తలంతువే, తలంతే" అని రూపద్వయము. తలంతు + వు + అయ్యా = తలంతువయ్యా = తలంతయ్యా. ఇచటఁ గవిశిరోభూషణము 'తలంపువయ్యా' అని యుదాహరించుట సరికాదు. 'ఆకర్ణింపుమరు' అనురూపమును సవరించినకవిశిరోభూషణము 'తలంపుదయ్యా' అని యుదాహరింపఁజాలదు. ఇది లేఖకప్రమాదపతితము కానోపును. 'చింతింతువే–చింతింతే; వలతువు + ఏని = వలతయేని–వైచెదు–వైచెదవు; చేసెదు–చేసెదవు" మున్నగుప్రయోగములనుబట్టి వత్వమును గల్గును. 'వైచెదవు' అనురూపము దుగాగమమున కత్వము రానపుడు కల్గును. దుగాగమమున కత్వము కలుగఁగా సిద్ధించినరూపము 'వైచెదవు' అనునది పువర్ణకము రానపుడు 'వైచెదు' అనియుండును. ఉత్తమపురుషైకవచనము నందును, 'వొయెదన్–వచ్చెదన్' మున్నగు రీతిని దువర్ణకోత్వమున కత్వమును నది పరమగునపు డేత్వమును గల్గెను. ఈఏకారాత్వఘటితరూపము లాచార్యప్రబంధములలో దేశ్యక్రియలయందే యగపడుచున్నవి. తత్సమక్రియలలో నగపడవు. "కొన్ని యెడల పువర్ణకము పరమయినపుడును, నత్వము గల్గునని కొందఱు చెప్పుచున్నారు" అని 'క్వచిద్వ్వర్ణ కేచాపి' అనుదాని కర్థము.

257. సూ. 6 :- "ఘటియించెదువు-ఘటియించెదవు–ఘటియించెదన్" ఇతి తత్సమక్రియారూపాణి తు ద్వితీయాచార్యస్య సామాన్యవచనేన విజ్ఞేయాని.

వి.– నన్నపార్యాదిగ్రంథముం దేత్వాత్వఘటితరూపములు దేశ్యక్రియలయందే యగపడుచున్నవి కాన 'ఘటియించెదవు' మున్నగురూపములను సాధించుటకు యత్నింప నవసరము లేదు. మహాకవిప్రయోగము

దొరకినచో 'క్వచిద్వ్యవర్ణకేచాపి' అనునథర్వణవచనముచే నట్టివానిని సాధించుకొనవలెను.

257. సూ. 7 :- భూతార్థే ఇత్యవిశిష్టయో ర్ముపువర్ణకయోః ప్రయోగవికల్పో ప్యాచార్యాభిప్రేతఏవ. "నాదుదక్షిణకరాగ్రము పట్టితిగాన; ఏల నిద్రఁదెల్పి తీవు నావుడు; విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మశాస్త్రములతెలుం గతిం గతి నుదాత్తరసాన్వితకావ్యనాటకక్రమములు పెక్కు చూచితి జగత్పరిపూజ్యులైన-ఇత్యాది" తద్వచనాత్. "భూతే తయో ర్వికల్పత్వమితి కేచి ద్బభాషిరే" ఇత్యథర్వణః. తచ్ఛబ్దేనాత్ర ము-పువర్ణకా వుచ్యేతే. కించ "వ్యతిరేకే ప్రార్థనార్థే ను స్వాన్న స్మువుపరస్తు పః" ఇతి తేనైవ కువర్ణకో విహితః. కుః ప్రార్థనార్థే వ్యతిరేకే వువర్ణకపూర్వః. వ్యతిరేకమాత్రే మువర్ణకపూర్వ ఇత్యర్థః. 'ము-వు పర' ఇత్యత్ర బహువ్రీహి సమాసః ము-వు వర్ణకయో రుపలక్షణత్వేన డుజ్‌యువర్ణకయో ర్బహువచనయోరపి గ్రహణమ్. "ఘటింపకుము-ఘటింపకుఁడు-అలుగకువే" ఇత్యాది. కువర్ణకస్య మువర్ణకపూర్వత్వేన మోకచి పరే నిత్యత్వేనచ "జాగొనరింప కోజనకజాహృదయేశ-మదిం దలంపకమ్మ" ఇత్యాదికం కవీనాం వచన మనాకరమేవే త్యవధేయమ్.

వి:- "తద్ధర్మార్థమునందువలె భూతార్థమందును మధ్యమోత్తమ పురుషైకవచనములయందు ము-వు వర్ణకములు వికల్పముగా నగు నను విషయ మాచార్యులవారికి సమ్మతమే" యనువిషయము "నాదుదక్షిణ కరాగ్రము పట్టితిగాన-ఏల నిద్రఁ దెల్పి తీవు" అనుప్రయోగములను బట్టి తెలియుచున్నది. వీనియందు వువర్ణకము వికల్పముగాన 'నాదు దక్షిణకరాగ్రము పట్టితివి కాన-ఏల నిద్రఁ దెల్పితి వీవు' అనురూపములు నుండనగును ఇవి భూతార్థకమధ్యమపురుషైకవచనరూపములు. 'వింటి నిన్+అనేకములు=వింటివనేకములు. ఎఱింగితినిన్+ఉదార=ఎఱింగితి నుదార' అనువీనికి నివర్ణకలోపము కలిగిన 'వింటి-ఎఱింగితి-చూచితి జగత్పరిపూజ్యములైన' మున్నగురూపము లుత్తమపురుషైకవచనమున నగును. వీనిలో 'చూచితి జగత్పరిపూజ్యములైన' అనుదానిచే మువర్ణకమునకును లోపము వికల్పముగా నగునని తెలియుచున్నది. అథర్వణా చార్యులు 'భూతే తయో ర్వికల్పత్వమితి కేచి ద్బభాషిరే' అని వచించి

యున్నారు. భూతకాలమునందు ను-వు వర్ణకములకు వికల్పత యుండుననీ కొందఱనుచున్నారు అని దాని కర్థము. వ్యతిరేకప్రార్థనార్థమందు (ప్రార్థనార్థవ్యతిరేకమునందు) 'ము-ఁడు' అను విభక్తులు పరమయినచో 'కు' అను నాగమము వచ్చును అని 'వ్యతిరేకప్రార్థనార్థే కుఙ్ స్యాన్మువుపరస్తు సః' అనుదాని కర్థము. ప్రార్థనాద్యర్థములయందు మధ్యమపురుషలకు ముఁడుఁజులు వచ్చును. పై కువర్ణక మేకవచనమున ము విభక్తి పరమగునపుడే కాక వువిభక్తి పరమగునపుడును వచ్చును. 'ఏ-వే'లనువచ్చులతోఁ గూడినవువర్ణకము పరమైనపుడే యీకువర్ణకము వచ్చునని కవిప్రయోగములనుబట్టి తెలియవలెను. "చేయకుము-చేయకువే-చేయకుఁడు-చేయకురే" అనియుఁ బ్రయోగములు గలవు. ము-వు వర్ణకము లుపలక్షణము లగుటచే బహువచనమున డ్రుఁజువర్ణకములు గ్రహింపఁబడుచున్నవి. 'ఘటింపకుము-ఘటింపకుఁడు-అలుగకువే, అలుగకురే- మొదలయినవి. "జాగొనరింపకోజనకజాహృదయేశ" "మఁటన్ దలంపకమ్మ" మున్నగుచోట్ల నచ్చు పరమైనదికాన మువర్ణకము నిత్యముగ రావలసియున్నది. అట్లు రాకుండుటచేఁ బై ప్రయోగములు ప్రామాణికములు కావు-అని కవిశిరోభూషణాభిప్రాయము. 'వ్యతిరేకమధ్యము మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు' అని సూరిగారు (బాల-సంధి-48) పై విషయమును వివరించియున్నారు. వీరిమతమున, అచ్చు పరమయినపుడు మువర్ణకలోపము వచ్చుట సాధువే యగుచున్నది. పై ప్రయోగములు ప్రామాణికకవిప్రయుక్తము లగుటచే నసాధువులని నిరసించుట కవిశిరోభూషణమునకు సాహసమే యగును.

257. సూ. 8 :- "తద్ధర్మప్రథమే స్యాతాం, డుడీవర్ణౌచ వాన్తరా। డోన్తు భేదః తాపి స్యాదితి కేషాఞ్చిదీరితమ్. డుడాద్యాదివర్ణే భూతార్థే చాపి తద్వ్యత్యయే త్సదా" ఇతి చోక్తమ్. "పోయెడిన్ - వచ్చెడున్ - నవ్వు రాజిల్లెడిమోముఁవాఁడు" ఇత్యాది. తద్వ్యత్యయేదిత్యస్య ఏత్వం భవేదిత్యర్థః. "ధాతోః క్రియాను యస్య స్యాదేత్వే మేవ ప్రయోగతః" ఇతి పూర్వసూత్రాత్. 'రాక-పోక-ఘటింపఁ'ఇత్యాదౌ స్యాత్తే వ్యతిరేకార్థే కవర్ణకః ఉక్తః. వ్యతిరేకే ధాతో ర్భావార్థే 'చేయకుము-ఘటింపకుము'

ఇత్యాదా మివర్ణకళ్పితే నోక్తః. ఏతే హ్యాచార్యగ్రన్థేచ స్థితాః. "అంభోరుహామిత్రుఁ డస్తగిరిఁజేరెడునంచు-విషముఁ జేసెడువారిక్-అనికర్మకౌశలం బమరఁజూపెడువారు" ఇత్యాది తద్వచనాత్. ఏతే డ్వాదయః పునరాగమసూత్రేణ విహితా ఇతివా సువచమ్.

వి:- తద్ధర్మప్రథమపురుషైకవచనమునందు ద్రుతాంతములైన 'డు-డి' వర్ణకములు వికల్పముగా ధాతువున కగును. భూతార్థమునందును, దద్ధర్మార్థకములగు 'డు-డి' మున్నగునవి పరము లగుస్థలములందును క్రియలకు నిత్యముగా నేత్వమగును. 'డు-డి' అనునవి చేరునపుడా క్రియలు నామములతో విశేషణములై యన్వయించును. కాన నవి ధాతుజవిశేషణము లగుచున్నవి. డు-డి మున్నగువర్ణములు పరమగునపుడును, భూతార్థమునందును ఏత్వము వచ్చునని యర్థము. "వచ్చెడున్-వచ్చెడిన్-వచ్చెడువాఁడు-వచ్చెడివాఁడు" మున్నగునవి యుదాహారణములు. "రాక-పోక" మున్నగుచోట్ల వ్యతిరేకార్థమున కివర్ణకము. "రామి-ఘటింపమి" మున్నగుతావులలో 'మివర్ణక' మథర్వణునిచేఁ జెప్పఁబడినది. ఇవి యన్నియు నాచార్యులవారిగ్రంథమునందుఁ బ్రయుక్తములే. "అంభోరుహామిత్రుఁ డస్తగిరిఁ జేరెడునంచు; విషముఁ జేసెడువారికిన్" 'చూపెడువారు' మున్నగునవి పునరాగమసూత్రముచే సాధ్యములగునని కవిశిరోభూషణ మనుచున్నది. అది నిజమే. పునరాగమసూత్రము నథర్వణాచార్యులవా రిట్లు వివరించిరని యెంచుకొనుట యుచితము.

**258. సూ. :- లఘ్వేకాక్షరపూర్వక్రియాన్తిమ స్యానయో భవే ది ద్వా.**

258. సూ.:- లఘు, ఏకాక్షరమ్, పూర్వమ్, యస్యాన్తిమాక్షరాత్తస్మా దయన్త క్రియావర్జితా త్క్రియాపదా దిత్వం వాస్యాత్. "ఘటియించె-ఘటించె; నటియించె-నటించె" ఇత్యాది. లఘు కిమ్? "రంజించె" ఇత్యాదౌ మాభూత్. ఏకాక్షరం కిమ్? "కరుణించె" ఇత్యాదౌ మాభూత్. అనయః కిమ్? "జయించె-విక్రయించె" ఇత్యాదౌ మాభూత్. "నప్రాద్యవ్యయపమ్యన్తస్తన్నిషేధే ప్రయోజకః" ఇత్యథర్వణవచనాత్

"విఘటియించున్" ఇత్యాదీని రూపాణి నిర్బాధాని. ఏతేన "చదలేరువారెదుజాడ యుత్తరియించి" ఇత్యాదీని శ్రీనాథాదికవీనాం వచనాని ప్రామాణికానీత్యవగన్తవ్యమ్.

వి.- లఘ్వేకాక్షరపూర్వక్రియాన్తేమస్య, అనయోః, భవేత్, ఇత్, వా-అప్ ఛేదనః. యాన్తభిన్నమై లఘువైన యేకాక్షరము పూర్వమందుఁ గలక్రియాపదాంతిమమునకు నిదాగమము వికల్పముగా నగునని సూత్రార్థము. "ఘట్+ఇంచు=ఘటించు" అనునపుడు 'ఘట్' అనునది లఘువైన యేకాక్షరమగుటచేతను, యాన్తము గాకపోవుట చేతను 'ఇత్' అనునది యాగమముగా వచ్చి 'ఘట్+ఇ+ఇంచు' లఘుయకారము చేయఁగా 'ఘటియించు' అని వికల్పమగుటచే 'ఘటించు' అని రెండుధాతురూపములు లేర్పడును. 'రంజ్+ఇంచు' అనునపుడు 'రంజ్' అనునది గురువైనది గాన నిదాగమము రాలేదు. 'రంజియించు' అని యుండదు. 'రంజించు' అనియే యుండును. 'కరుణ+ఇంచు' అనునపు డిది యేకాక్షరము కాదుగాన నిదాగమము రాదు. 'కరుణియించు' అనురీతిరూప ముండదు. 'జి+ఇంచు=జయ్+ఇంచు' అనుచోట యాన్తమైనదిగాన నిదాగమము రాదు. 'జయియించు' అని కాదు. "జయించు" అనియే యుండును. 'ప్ర' మొదలైనవి క్రియలతోఁ గూడియుండునపుడు లఘ్వేకాక్షరనియమము లేకున్నను నిదాగమము వచ్చుట కభ్యంతరము లేదు. "తౄ ప్లవనతరణయోః" అను ధాతువునకు 'తర్+ఇంచు-తరించు' అను తత్సమరూప మేర్పడును. 'ఉత్+తరించు=ఉత్తరించు' అనుచోట 'ఉత్తర్+ఇంచు' అనునది ప్రాద్యవ్యయసంబంధమువలన గురువంతమైనది. అయినను లఘ్వేకాక్షరనియమమున కిది భంజకము కాదు. "న ప్రాద్యవ్యయసమ్బద్ధః- ప్రాద్యవ్యయసంబంధము లఘ్వేకాక్షరనియమమునకు బాధకముగాదు" అని యథర్వణవచనము చెప్పుచున్నది గాన "ఉత్తరియించు-ఉత్తరించు" అని రెండుధాతురూపము లుండుట కెట్టియభ్యంతరము లేదు.

**259. సూ. తిఙ్మధ్యనామకా స్స్యు ర్మధ్యమపురుషాశ్చ యే రమాన్తాశ్చ.**

259. సూ:- యే మధ్యమపురుషక్రియాశబ్దాః, యే రేఫమకారాన్తాః క్రియాశబ్దాః తేపి చ తిఙ్మధ్యనామకాః స్యుః. సంజ్ఞాపరిచ్ఛేదే తిఙ్మధ్యశేషపఙ్క్తీత్యాదిమాత్రేణ తిఙ్మధ్యానాం కళామధ్యే పాఠః కృతః. తేన ఉద్దిశ్య సంజ్ఞావిధానాద్వినా సంజ్ఞివిశేషోఽనుపపన్న ఇత్యత్ర సంజ్ఞా విధీయతే. "రంజించితివి—చేసితివి" ఇత్యాద్యా మధ్యమపురుషాః. "పోయిరి-ఘటించిరి-ఘటించితిమి-చేసితిమి" ఇత్యాద్యా రేఫాన్తమాన్తప్రథమోత్తమపురుషాః.

వి:- తిఙ్మధ్యనామకాః, స్యుః, మధ్యమపురుషాః, చ, యే, రమాన్తాః, చ—ఇతి ఛేదము. మధ్యమపురుషక్రియలును, రేఫాన్తమాన్తక్రియలను తిఙ్మధ్యము లను సంజ్ఞ కలవి యగుచున్నవి. "తిఙ్మధ్యశేషపఙ్క్తి" అని సూత్రమునందుఁ దిఙ్మధ్యములు కళలుగాఁ బఠింపఁబడినవి. అచటఁ దిఙ్మధ్యసంజ్ఞ చెప్పఁబడలేదు. సంజ్ఞావిధానము లేనిచో వానిని గుర్తించుట కష్టము కావున నా సంజ్ఞ యిచటఁ జెప్పఁబడినది. "రంజించితివి—చేసితివి" మున్నగునవి మధ్యమపురుషక్రియలు. "పోయిరి—ఘటించిరి" మున్నగునవి రేఫాన్తక్రియలు. "ఘటించితిమి—చేసితిమి" మున్నగునవి మాన్తక్రియలని తెలియనగును. ఇవి యన్నియుఁ గ్రియలలోఁ గళ లగుచున్నవి.

**260 సూ:- చో రాత్మనేపదార్థే గృహ్ణాతా వాగమస్య వేత్వం స్యాత్.**

260 సూ:- ఆత్మనేపదార్థే గృహ్ణాతౌ పరే ఇంచుగాగమసమ్బన్ధినః చుకారస్యేత్వం వా స్యాత్. గృహ్ణాతేరర్థోఽత్ర 'కొను' ఇతి శబ్దః. తస్మిన్ పరే క్రియాఫలం కర్తృగామి భవతీత్యాత్మనేపదార్థేతి విశేషణం దత్తమ్. సంస్కృతవ్యాకరణే క్రియాఫలే కర్తృగామిన్యాత్మనేపదం విహితమ్ "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే" ఇతి. "ఘటించుకొని—ఘటించికొని-ఘటింపించుకొని ఘటింపించికొని-కావించుకొని-కావించికొని" ఇత్యాది. ఇంచుగభావేపి "నేర్చుకొని-నేర్చికొని—అందుకొని-అందికొని" ఇత్యాదావపీత్వం భవత్యేవ. అత్యాదితత్సమానామిత్యుక్తేః. అతఏవ "నగియించెన్-తెగియించెన్-ముగియించెన్" ఇత్యాదిరూపమపి సమంజసమితి ధ్యేయమ్. 'ఇతికి

కొని ఇత్యాద్యాచార్యస్య వచనమ్. "మఱువక యప్పనా లతం దనుప్పుకవచ్చున్" ఇత్యాదికం వచనం మూలరహితమేవే త్యవధేయమ్.

వి - చోః, ఆత్మనేపదార్థే, గృహ్ణాతౌ, ఆగమస్య, వా, ఇత్వమ్, స్యాత్ -అని ఛేదము. ఆత్మనేపదార్థకమగు 'కొను' అనునది పరమగు నపు డించుగాగమసంబంధి యగుచుకారమున కిత్వము వికల్పముగా నగునని యర్థము. 'కొను' అనునది పరమగునపుడు క్రియాఫలము కర్తృగామి యగును. అచట సిత్వము వికల్పముగాన "ఘటించికొని-ఘటించుకొని" అని రెండురూపములు కలుగును. ఇంచుగాగమము లేకున్నను "నేర్చికొని-నేర్చుకొని" మున్నగువానియందు సహజచకారమునకు నిత్వము 'అత్త్వాదితత్సమానా' మనుచోవ్వాన వచ్చినది. "నగియించెన్" మున్నగువానియందు ద్వ్యక్షరపూర్వమునకును, లఘ్వేకాక్షరమాత్రముచే సిత్వము వచ్చినది. కొనుధాతువు పరమగునపుడు నగియించికొనెన్-నగియించుకొనెన్-అనురూపద్వయ ముండును. అమ ర్చుక" మున్నగుచోట్ల 'కొను' ధాతువునకు 'క' అనురూపము నిలిచినది కాన నిట్టిచోట్ల నిత్వము వచ్చుట కాధారము లేదు. కొనుధాతువు పరమయినచో "అమర్చికొని-అమర్చుకొని" అనురీతిరూపము లుండ వగును. కాన "అమర్చుక" మున్నగుచోట్లనున్న-క-కారము 'కొను' అనుదానిసంక్షిప్తరూపము కాదని తెలియుచున్నది. కాన నిది ప్రభ్రంశ (నింద్య) గ్రామ్యము.

**261 సూః- రఞ్జతిఘట్యాదీనాం బిన్దోశ్చస్యాపి లావుభౌ భవతః.**

261 సూః- రంజతిఘట్యాదిధాతుభ్యోఽకర్మకేభ్యో య ఇంచుగ్విహితః తత్సమ్బన్ధిన శ్చకారబిన్ద్వో రుభౌ లకారాదేశౌ స్తః. లద్వయస్య సంశ్లేషః. "రంజిల్లు-ఘటిల్లు-విస్తరిల్లు" ఇత్యాది.

విః- రంజతిఘట్యాదీనామ్, బిందోః, చస్య, అపి, లౌ, ఉభౌ, భవతః-అని ఛేదము. "రంజ రాగే-ఘట చేష్టాయామ్" మున్నగునకర్మకధాతువులకంటె నించుగాగమము వచ్చునపు డించుగాగమచకార

బిందువులు రెండిటికి రెండు లకారము లాదేశములగును. రెండు లకారములు సంశ్లేషముఁ జెందియుండును. "రంజిల్లు-ఘటిల్లు" మున్నగునవి యుదాహరణములు.

**261.** సూ 2 :– అత్ర ఆదిశబ్దేన సంప్రృతిక్రియైవ గృహ్యేతేతి నాఽగ్రహః। ఏల భేదిల్లెడు కన్నడైన-భీతిల్లె-ఉత్పాదిల్లెఁ గృష్ణుఁడు – ఇత్యాద్యాచార్యవచనాత్. తేన "పరిల్లు-వర్తిల్లు-శోభిల్లు-సంధిల్లు-రాగిల్లు-అనురాగిల్లు-మత్తిల్లు" ఇత్యాదీనాం గ్రహణమ్ "అకర్మణ స్సకర్మత్వ మకర్మత్వం సకర్మణః। తద్వతాం క్వచి ద్దైక్యం స్యాచ్ఛబ్దశక్తి స్తాదృశీ॥ యథాశాస్త్రం యథాశక్తి యథాశ్రోత్రానురఞ్జనమ్। యథా ప్రసిద్ధి సర్వత్ర శబ్దానాం కల్పనా మతా!"ఇత్యథర్వణః క్వచి దకర్మణ స్సకర్మత్వమ్. "జయించె రిపుల–భూభుజాల జయింపుము" ఇత్యాదీ న్యాచార్యవచనాని. క్వచిత్స కర్మణోఽకర్మకత్వమ్. ప్రణమిల్లె నతనికిన్. అన్యస్యాః క్వచి ద్భవేచ్చాప్యేతి సూత్రేణ కర్మణి నిత్యం షష్ఠీ. క్వచిదర్థవిశేషే సకర్మకత్వమ్. చింతించు రాము నెప్పుడు. క్వచి దర్థవిశేషేఽకర్మకత్వమ్ – చింతిల్లె దేల యిప్పుడు. సంస్కృతభాషావిదోపి వదన్తి. "ధాతో రర్థాన్తరే వృత్తే ర్ధాత్వర్థే నోపసఙ్గ్రహాత్। ప్రసిద్ధే రవివక్షాతః కర్మణోఽకర్మికా క్రియా" ఇతి.

వి:– రంజతిఘట్యాదీనా మనుదానిలోని, ఆదిశబ్దముచే సంప్రృతి క్రియనే గ్రహింపవలయు ననునియమము లేదు. 'భేదిల్లుదురు– ఉత్పాదిల్లెన్' అనునన్నపార్యుని ప్రయోగములలోఁ బరిణత్యుపకృతు లకును ద్విరుక్తలకార మగపడుచున్నది. ఈప్రయోగప్రామాణ్యముచే 'సంప్రృతి, పరిణతి, ఉపకృతి' అనుభేదము లేకుండఁ ద్రివిధధాతువులకును ద్విరుక్తలకారాదేశము రావచ్చునని సిద్ధాంతము చేయవలసియున్నది. అకర్మకధాతువునకుఁ గర్మాకాంక్షఁ గల్గుటయు, సకర్మకధాతువునకుఁ గర్మాకాంక్ష లేకుండుటయు మహాకవిప్రయోగానుసారముగా జరుగును. ఇట్లు జరుగుటకు వివక్ష (అనఁగా ధాత్వర్థము మాఱుట మున్నగునది) కారణము. 'అకర్మణ స్సకర్మత్వమ్' అనుదానికిదే యర్థము. 'ఇంచు–ఇల్లు' అనునవి చేరినధాతువుల కొకప్పుడు భిన్నార్థకత్వమును గలుగును. ఇంచుగంతరూపము ప్రేరణార్థము నీయుక

ద్వారుక్తలకారాగమముతోఁ గూడినరూపమునకుఁ గలయర్థమునే బోధించును. 'శబ్దశక్తి యట్టిదిగదా!' యని "తద్వాతాం క్వచి ద్వైక్యం స్యాత్" అనుదాని కర్థము. వ్యాకరణశాస్త్రపద్ధతిని, శబ్దశక్తిని మీఱి మహాకవిపండితులు దీనిని, మహాకావ్యవ్యవహారములను భిన్నము కాకుండ శబ్దకల్పనము చేయవలెను" అని 'యథాశాస్త్రమ్' అనుదాని కర్థము. 'భేదిల్లుచును' అనునది పరిణామక్రియ. 'భేదిల్లెన్' ఇది యుపకృతి క్రియ. ఇవి నన్నపార్యునిప్రయోగములు. వీనింబట్టి 'రంజకీభవత్యాదీనామ్' అనుదానిలోని ఆదిపదముచే సంవృతిక్రియనే గ్రహింపవలయు ననునియమము లేదని తెలియుచున్నది. 'జయించె రిపులన్-భూభుజుల జయింపుము' అను నన్నపార్యుప్రయోగములవలన సకర్మకధాతువుల కొకప్పుడు సకర్మకత్వము కలుగునని తెలియుచున్నది. ఇచ్చట ద్విరుక్తలకారము వచ్చినపుడు, ఆధాతువు లకర్మకము లగునని యిదివఱకుఁ జెప్పఁబడినది. అట్టినియమమును నన్నపార్యునిప్రయోగములు తొలఁగించుచున్నవని గ్రహింపవలెను. 'ప్రణమిల్లె నతనికిన్' మున్నగుచోట్ల సకర్మకమున కకర్మకత్వము; 'చింతించు రాము నెప్పుడు' అనుప్రయోగమునుబట్టి యొకప్పు డకర్మకమునకు సకర్మకత కలుగునని తెలియుచున్నది. 'చింతిల్లెదేల యిప్పుడు' 'చింతిల్లెదు' అనునది యకర్మకము. "ధాతుపాఠమున నీయఁబడినయర్థమునేకాక ధాతు వర్థాంతరమును బోధించుచున్నపుడును, కర్మత్వము ధాత్వర్థముచే సంగ్రహింపఁబడినపుడును, ప్రసిద్ధివలనను కర్మత్వమును వివక్షింపనపుడును క్రియ యకర్మక మగు"నని సంస్కృతవైయాకరణులు 'ధాతో రర్థాంతరే వృత్తేః' అను వచనములో వివరించియున్నారు.

261 సూ. 3. :- క్వచిదాగమ లాదేశయో రైక్యమ్. "చింతించెన్-చింతిల్లెన్-సంతోషించెన్-సంతోషిల్లెన్-ఉద్భవించెన్-ఉద్భవిల్లెన్-సంభవించెన్-సంభవిల్లెన్-ఆవిర్భవించెన్-ఆవిర్భవిల్లెన్ - విలసించెన్-విలసిల్లెన్ - ప్రకాశించెన్-ప్రకాశిల్లెన్ - అతిక్రమించెన్-అతిక్రమిల్లెన్" ఇత్యాది.

వి:— 'రంజిల్లిరి ప్రజలు—రంజించెఁ బ్రజలను రాముఁడు' నున్నగు రీతిని రంజాదుల యింమక్ప్రకారమునకు ద్విరుక్తలకారము వచ్చినపుడవి యకర్మకములును, స్వార్థబోధకములును నగుచున్నవి. ద్విరుక్తలకారము రానపుడింమగాగమముతోఁ గూడియున్నపుడు ప్రేరణార్థకములు, సకర్మకములు నగుచున్నవి. కానియీనియమము కొన్నియెడలఁ బాటింపఁబడ లేదు. 'చింతించెన్—చింతిలెన్' మున్నగునవి కొన్ని ద్విరుక్తలకారము వచ్చినపుడు. ఇంమక్ప్రకారయుక్తమై యున్నపుడును నర్థభేదము లేకుండఁగనే కవిప్రయుక్తములై యున్నవి. కావుననే కవిశిరోభూషణము 'క్వచిదాగమ లాదేశయో రైక్యమ్' అని వచించి యుదాహరించియున్నఁడు.

261. సూ 4 :— "ఉత్పాద-ఉప్పతిల్లె; జ్యోతి-జోతిల్లె; సంమూర్చ్ఛ-సొమ్మసిల్లె; రంభ-రంపిల్లె; దంభ-దంపిల్లె; సుంభ-సొంపిల్లె; వర్తుల-వట్రిల్లె; తంద్ర-తిత్తరిల్లె; దద్దరిల్లె-తండరిల్లె; ద్వారగ-దోరగిల్లె దలువు; ఆవహ—ఆవటిల్లె; నిర్వహ—నివ్వటిల్లె" ఇత్యాది తద్భవక్రియా స్వాద్ధైవ లాదేశద్వయమ్. "వర్ణలోపాగమా నైకే సర్వస్మిం స్తద్భవే ఽఽదే" ఇత్యాథర్వణవచనా ద్వర్ణలోపాగమాః 'తేగిరవు' ఇత్యాదావివ, 'తేజరిల్లుచున్' ఇత్యత్ర దేశ్యే వర్ణకః, 'ప్రజ్వరిల్లున్'-రలయోరభేదా ల్లకారస్థానే రేఫవ్యవహారః "తత్రోభయో ర్భవే దేకో లకార ఇతి కేచన" ఇత్యథర్వణవచనాత్, క్వచిత్ "పాటిలు-వర్తిలు" ఇత్యాదికం రూపమపి సాధు. తేన "బాలమరంగలోచనకుఁ బాటిలుమోహనసాభిమండలావాలమునన్ జనించి పరువంబున మీఁదికిఁ బ్రాఁకు రోమరా, జీలతి నుప్పవిల్లి వెలసిల్లుకుచస్తబకద్వయంబునన్, వ్రాలినగండు తేటులనవర్తిలు మేచకచూచుకప్రభల్", "అజునిపుత్రునిఁ జేసినట్టి నెయ్యముపొంటె వజానిపౌత్రుఁడవయి యవతరిలితి" ఇత్యాదీని కవివచనాని వ్యాఖ్యాతాని.

వి :— "ఉప్పతిల్లు - జోతిల్లు - సొమ్మసిల్లు" మున్నగునవి తద్భవక్రియలు. వీనికి ఉత్పాద-జ్యోతి-సమ్మూర్ఛ" మున్నగు ప్రకృతిశబ్దములకంటె వర్ణలోపాగమాదివికారములు గల్గుటవలనఁ దద్భవములైనవి. "సర్వవిధము లగుతద్భవములయందును వర్ణలోపాగమాదివికారములు పెక్కు తెఱఁగులఁ గల్గుచుండు"నని యథర్వణాచార్యులుగారు వచించిరి.

ఇట్టితద్భవక్రియలకును ద్విరుక్తలకారాదేశము రావచ్చును. 'వేగము' అనునర్థము గల్గిన 'వేగిరము' అనుదానివలె 'తేజరిల్లున్' మున్నగు చోట్ల రేఫవర్ణకము కలిగినది. 'తేజరము' అనుదానినుండి యేర్పడిన దగుటచే 'తేజరిల్లు' అనునది నామధాతు వగుచున్నది. ఇట్టివానికిం గూడ ద్విరుక్తలకారాదేశము వచ్చినది. 'ప్రజ్వరిల్లున్' అనునది 'ప్రజ్వల్' అనుదానితద్భవరూపము. ఇందు రేఫలకారముల కభేదము పాటింపఁబడినదని తెలియుచున్నది. "ఈద్విత్వలకారములయందు లకార మొకటి లోపించి యొకటిమిగులుటయుఁ గలదని కొందఱనుచున్నారు" అను నథర్వణవచనముచొప్పున "పాటిలు-వర్తిలు" మున్నగురూపములును సాధువు లగుచున్నవి. కావుననే "పాటిలు-వర్తిలు" – అవతరిలితి" మున్నగుకవిప్రయోగములును సాధువు లగుచున్నవి.

**262 సూ :- నతు ణౌ భవేచ్చ లోపో ణ్యర్థే యో వర్తతే పరే తస్మిన్,**

262 సూ :– ణ్యర్థేంచుక్పరే తు న లాదేశద్వయం స్యాత్; కిన్తు తస్మిన్ పరే స్వార్థేంచుగాగమస్య లోప స్స్యాత్ -"రంజించె మమ్మున్-ఘటించె సత్కార్యమున్-జలముత్త్వాదించెన్-ఘూర్ణించెన్–రాజించెన్ - విలసించెన్-ఆవహించెన్-భాసించెన్ – అతిశయించెన్" ఇత్యాది. "విస్తరించె విపులవిభవయుక్తి" ఇత్యాద్యాచార్యవచనమ్. ఘటాదీనామర్థవిశేషే సకర్మకత్వాత్ "ఘటింపించెన్-వర్ణింపించెన్" ఇత్యాదిరూపాణి. ఏవం సకర్మకాణాం సర్వత్రాగమద్వయేన రూపం జ్ఞేయమ్. "ణిజంతాదపి కేచిత్తు ణిచమాహు రనీశ్వరాః" ఇత్యాథర్వణవచనమ్. అనీశ్వరా స్స్వతన్త్రా ఇత్యర్థః. "తేన వివాహమొనర్పు మెప్పుగన్" ఇత్యాదివచనై రాచార్యోక్తేషు సకర్మకేషు "ఒనరింపుము" ఇత్యాదిరూపం క్వచిత్సాధు. ప్రయోగస్తు న ప్రాయః ప్రబన్ధేషు దృశ్యతే. "కేచిత్తు ణిచ మిచ్ఛన్తి ధాతోః స్వార్థగతాగమాత్" ణిజర్థేంచుగ్రహితా దిత్యర్థః. 'ఒనరించె' నిత్యాదయో ణిజర్థేంచుక్సహితాః. "పిదప నిట్లు బుధస్వాఁ జంపింపఁ దగునే" ఇత్యాదికం తత్రోదాహరణమ్.

వి :– న, తు, ణౌ, భవేత్, చ, లోపః, ణ్యర్థే, యః, వర్తతే, పరే, తస్మిన్–అని ఛేదము. ప్రేరణేంచుగాగమము పరమగునపుడు సబిందుకేంచుక్పకారమునకు లాదేశద్వయము రాదు. ప్రేరణేంచుగా

గమము పరమగునపుడు స్వార్థేంచుగాగమమునకు లోపము కల్గును" అని యర్థము "రంజించు+ఇంచు" అని యుండఁగాఁ బ్రేరణేంచుక్స్వరకత్వమున స్వార్థేంచుగాగమమునకు లోపము రాఁగా 'రంజించు' అని ప్రేరణార్థమునను, రంజిల్లు' అని స్వార్థమునను నుండును. 'ఘట' మున్నగునవి యర్థవిశేషమున సకర్మకము లగుటచే 'ఘటింపించెను' మున్నగు రూపము లగును. "కొందఱు స్వతంత్రము ప్రేరణార్థకధాతువుమీఁద మరలఁ బ్రేరణార్థేంచుగాగమము వచ్చు"నను చున్నారు — అని 'ణిజన్తాదపి కేచిత్తు' అనుదాని కర్థము. ఇచట 'ణిజన్తాదపి' అనుచోట 'ణిజర్థాదపి' అని పఠించుట లెస్స. ప్రేరణేంచుక్కు లేనిధాతువుమీఁదనే ప్రేరణేంచుగాగమము వచ్చునని 'కేచిత్తు ణిచ మిచ్ఛన్తి' అనుదాని కర్థము. 'ఒనరించెన్' మున్నగునవి ణిజర్థేంచుక్సహితములు. 'చచ్చు' ప్రేరణమున 'చంపు' అని యగును. ఇట్లు ప్రేరణేంచుక్కు లేనిప్రేరణార్థకములమీఁద మరలఁ బ్రేరణార్థేంచుగాగమ మగును. కావుననే "పిదప నిట్లు సుధన్వుఁ జంపింపఁదగునే" మున్నగునవి సిద్ధించుచున్నవి.

**263. సూ. :— పున రాగమః క్రియాణామ్.**

263. సూ. :— వ్యాఖ్యాత మేతత్సూత్ర మధస్తాదేవ. 'ఘటింపుచున్నాఁడు' ఇత్యత్ర దీర్ఘోప్యనేనైవ సిద్ధ్యతీతి న కశ్చిత్క్లేశః.

వి:— 'పునః, ఆగమః, క్రియాణామ్—అని ఛేదము. క్రియలకు విశేషాగమము ప్రయోగానుసారముగా నగునని యర్థము. పునరాగమ మనుదాని కపూర్వవిశేషాగమమని యర్థము.

**264. సూ. :— పర్యాప్తో మన్మతే తు నఞ్కృతః.**

264. సూ. :— పర్యాప్తః పూర్ణః సుప్రసిద్ధ ఇతి యావత్. మన్మతేతు నఞ్కృతః పర్యాప్తో భవతి. యన్నఞ్కృతం శిష్టప్రయోగేషూపలభ్యతే తత్ప్రయోజ్య మిత్యత్రాస్మాక మభినివేశః. శాస్త్రస్యతు ఉక్తప్రదర్శనార్థత్వేన సార్థక్యమితి భావః. నఞ్కృతో నామ వృత్తిపర్యన్తః. వృత్తిర్నామాస్మచ్ఛబ్దా దయమర్థో బోద్ధవ్య

చింతామణి యుష్మత్క్రియలకు 'అత్వాదితత్సమానామ్' అని సాధన విధానము సూచింపఁగా నథర్వణాచార్యులుగారు వానిని బెక్కుసూత్రములచే సాధించిరి. "పునరాగమః క్రియాణాం" స్మృతకాని కలంకార శాస్త్రపరముగఁ జేసిన శిరోభూషణవ్యాఖ్య సరి కాదు.

**265 సూ :— సంప్రార్థనార్థకా దీత్.**

265 సూ :— సంప్రార్థనార్థక ముడుజ్ వర్ణకాన్తాత్ క్రియాపదా దీత్ స్యాత్. యథా రక్షింపుమీ, కావుమీ, పొమ్మీ, రమ్మీ, కావుఁడీ, పొండీ. రండీ, నాయం నిత్యో విధిః. "వివాహ మొనర్పుము" ఇత్యాద్యాచార్యవచనాత్. "అచ్చతుష్కం భవేత్ ప్రార్థితం ప్రశ్నాదివాచకమ్" ఇత్యథర్వణ సామాన్యోక్తిమహిమ్నా, ఏఁడీ సీసాటీ ఏరీ సిసాటివారు—ఏఁడీ, ఏరీ ఇతిరూపాణి సిద్ధాని.

సి :— సంప్రార్థనార్థకాత్, ఈత్—అని ఛేదము. సంప్రార్థనార్థకములగు ముడుజ్ వర్ణకాంతక్రియాపదములకు 'ఈ'యనుదీర్ఘస్వరము వచ్చునని యర్థము. రక్షించు+సి=రక్షించు + వు=రక్షించు+ము= రక్షింపుము, రక్షింపుమీ; కాచు+సి=కాచు+వు=కాచు+ము = కావు+ము+ఈ=కావుమీ; పోవు+సి = పోవు+వు=పోవు+ము= పోవు+ము=పో+ము=పొమ్ము+ఈ=పొమ్మీ; వచ్చు+సి=వచ్చు+వు =వచ్చు+ము=రా+ము=రమ్ము+ఈ=రమ్మీ; కాచు+థ=కాచు+ డుజ్=కావు+డుజ్=కావుఁడు+ఈ=కావుఁడీ; పోవు+థ=పోవు+డుజ్ =పొండు+ఈ=పొండీ; వచ్చు+థ=వచ్చు+డుజ్=రండు+ఈ=రండీ. సంప్రార్థనార్థమున—ఈ—కారము లేకుండఁగనే ప్రయుక్తమైన 'వివాహ మొనర్పుము' అనునాచార్యప్రయోగమునుబట్టి యీవిధి (ఈకారవిధి) నిత్యము కాదని తెలియుచున్నది. "ఆ, ఈ, ఏ, ఓ—అను నాల్గచ్చులును వ్యంజనవర్ణములమీఁద నిలిచి ప్రశ్నాద్యర్థవిశేషముల నిచ్చుచున్నవి" అని యథర్వణవచనమున కర్థము. అ, ఇ, ఎ, ఒ అనునవి వానిదీర్ఘములకు నుపలక్షణములు. కాఁగా అఆ, ఇఈ, ఎఏ, ఒఓ—అనునవి క్రియా వాచక నామవాచకములమీఁద నిలిచి ఆశీశ్శాపసంప్రార్థనరూపార్థవిశే

మములనిచ్చునని వ్యాఖ్యానింపనగును. చెప్పితివ, చెప్పితివా; చెప్పుము, చెప్పుమీ; చెప్పితివె, చెప్పితివే; చెప్పితివో, చెప్పితివో మున్నగునవి యుదాహరణములు.

**266 సూ :- ఏదోతౌ ప్రశ్నలక్షణౌ భవతః.**

266 సూ :- ఏదోతౌ ప్రశ్నార్థకౌ భవతః. కాచితివే మమ్ము నిపుడు కమలదళాక్షా! ప్రోచితివే మమ్ము నిపుడు భువనాధీశా! ఇత్యాది. ప్రోవవా నన్ను జగదేకపూజ్యపాద! ప్రోవవే నాఁడు కరిరాజు భువనపూజ్య! ఇత్యాది. వ్యతిరేకే సుబంతాదపీత్యుక్తేరథస్తాత్-పల్కు విదేటికే పద్మాముఖి! ఏమే బాలశిరీషగాత్రి! ఇత్యాది.

వి:- ఏదోతౌ, ప్రశ్నలక్షణౌ, భవతః-అని ఛేదము. ఏకార ఓకారములు ప్రశ్నలక్షణము కలవి యగును, అనఁగాఁ ప్రశ్నార్థకములగునని యర్థము. కాచితివే- మున్నగునవి యుదాహరణములు. కాచితివి+ఏ=కాచితివే. రక్షణరూపకార్యనిర్వాహణము గావించితివా యని యర్థము. ఇట్లే ప్రోచితివి+ఆ=ప్రోచితివా? ప్రోవవు+ఆ=ప్రోవవా; ప్రోవవు+ఏ=ప్రోవవే యనుచోట వ్యతిరేకార్థముమీఁద ఆ, ఏ అను వర్ణములు వచ్చినవి. ఇందుఁ ప్రశ్నాద్యర్థములు వ్యక్తము లగుచున్నవి. ఏటకిన్+ఏ=ఏటికే (కిమూదిసంధి) ఏమి+ఏ=ఏమే మున్నగునవి వ్యతిరేకమున సుబంతములమీఁద నేర్పడినరూపములు. ఇవి ప్రశ్నార్థకములు.

**267 సూ:- ఏదోతౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః.**

267 సూ. 1:- వ్యతిరేకార్థకాదపి క్రియాపదా దేదోతౌ సంప్రార్థనార్థకౌ స్తః. నన్ను రక్షింపవో రామ! నలినదళనయన!; ప్రోవవే నన్ను నేవేళ భూమిపుత్రి! ఇత్యాది. అపిశబ్దాత్ క్వచిదన్యత్రాపి. తేన వచ్చునో రాఁడో వాఁడనుచు వాడెను మోమున నేదదేరఁగన్; వెలఁది యైరావతక్షోపకుంభకుచకుంభసంభారహారిదర్శీశ్వరుని వలఁతో-ఇత్యాది వచనాని సాధూని. అదిగో వచ్చె విధాత చూడు మబలా! హంసోత్తమారూఢుఁడై- ఇత్యత్ర అదిగో ఇతి శబ్దో దేశ్యః.

వి:— ఏదోతౌ, వ్యతిరేకాత్, అపి, సంప్రార్థనపరౌ, క్రియాణాం, స్తః-అని ఛేదము. వ్యతిరేకార్థక మగు క్రియాపదముకంటె సంప్రార్థనార్థకము లగు ఏవఒఓలు వచ్చునని యర్థము. రక్షింపవు+ఓ=రక్షింపవో =రక్షింపుము. రక్షింపవు+ఏ=రక్షింపవే=రక్షింపుము. వచ్చును+ఒ =వచ్చునొ; రాడు+ఒ=రాడొ; వలతు+ఓ=వలతో. అదిగో అనునది దేశ్యపదము. 'అచట నగపడుచున్నది, దానిం జూడు' మని దాని యర్థము. కొనుధాతువునకుమధ్యమ పురుషమునందు 'కొనుము, కొమ్ము, కో' యనురూపములు కలుగును: అది యనునది యనుహా త్తచ్ఛబ్దార్థకము. అది+కో=గసడదవాదేశముచే కో యనుదానికి గకారము వచ్చి అదిగో అనురూప మేర్పడియుండునని తోచుచున్నది. అది+కొను అనురెండును దేశ్యము లగుటచేఁ గవిశిరోభూషణము "అదిగో శబ్దో దేశ్యః" అని వచించినది.

267 సూ. 2:— "ప్రార్థనార్థే భవే న్నా న్తా త్కృదేశ్యర్థవిశేషదః,
అన్యత శ్చాపి స భవేత్ క్వచిదర్థవిశేషదః
ఉత్తమాదావపి భవేత్ ప్రశ్నాద్యర్థవిశేషదః
అద్యాదిశబ్దో యుక్త స్స్యా దసమ్బద్ధార్థబోధనే
కిలార్థా దుభయో రస్త్యేనో నోభయోపరివర్జకః
చ ర్దేశ్యే మధ్యమార్థే స్యాత్ ప్రార్థనే ముమ్ముదుజ్ స్థితిః
ఏతి వాన్తో హ్రస్వదీర్ఘో ద్విత్వ మాద న్తతా క్వచిత్
ప్రత్యయార్థేఽవిశేషేఽపి క్వచిద్దేశ్యపదం మతమ్
అత్యేఽప్యర్థవిశేషా స్స్యు రన్తే శ్రుతిమనోహరాః
తద్ధర్మప్రథమైకత్వవాచకాద్ధి క్రియాపదాత్
అదిశబ్దప్రయోగ స్స్యాత్ విశేషార్థే నిరీక్షితే.

ఇత్యథర్వణాచార్యః. క్రమేణోదాహరణాని. దయసేయఁగదే, ప్రోవఁగదే, రాఁగదే-ఇత్యాది. వచ్చితివిగదా, రావుగదా, రక్షింపవుగదా, ఇత్యాది. వచ్చితివి గదా, ఘటించితివిగదా. అదిశబ్దేన వచ్చెన్నదా! ఇత్యాదిరూపఞ్చ గ్రాహ్యమేవ. అర్యశబ్దభవః అద్యేతిశబ్దః ఏకారాదిస్వరసమ్బన్ధరహితోఽర్థవిశేషే ప్రయుజ్యతే.

ప్రోవవయ్యా!, రావయ్యా; నను మఱతురయ్యా!, వినవమ్మా, వినరమ్మా—ఇత్యాది. "నీ రెవ్వరయ్య దుప్రదమహారాజులే" ఇత్యాచార్యస్య వచనమ్. అచటికి వచ్చితి వఁటఁగదా! వచ్చితివఁటయ్యా; వచ్చితివఁటమ్మా, పరస్పరం యోగోఽపి. వచ్చితివి గదయ్యా ఇతి. ఉభయశబ్దేన కదా! కిలార్థకా గృహ్యేతే. తయోరుపరి క్వచిత్ రువు, వర్ణకా ప్రయుజ్యేతే వచ్చుఁగదవే, వచ్చునఁటవే ఇతి. తాదృశం రూప మసమ ఞ్జసమితి నిరాచష్టే సోఽభియోపటివణ్ణకః ఇతి- తత్ర వచ్చుఁగదే—ఇత్యాద్యేవ రూపం సమఞ్జసమ్. నీవునుమ్మా; నీవునుము, మీరునుఁడు. ఏతి—ఏకారే పర ఇత్యర్థః. ద్విగ్వ్యపక్షే హ్రస్వః. తదభావే దీర్ఘ ఇత్యర్థః. అతఁడునువ్వే, ఇతఁడునువ్వే, ఇతఁ డేనూ ఇతి రూపాణి. నిరర్థకంబునువ్వే-ఇత్యాద్యాచార్యవచనమ్. ఎంతజనుఁడైనఁ గానీ. కానిమ్మ ఇత్యస్మిన్నర్థే 'కానీ' ఇతిశబ్దః. 'అవధరింపుము' ఇత్యస్మిన్నర్థే అవ ధారు దేవ ఇతి. చేయరొక్కొ, చేయునొక్కొ, వచ్చునే వాఁడు, తనవెపో సేవ ములం, తనదేకా భక్తి-ఇత్యాదా 'ఒకో' ఇత్యాదిశబ్దాః అన్యశబ్దేనగ్రాహ్యాః. జనకుఁడువోలె నర్మిలి ప్రజన్ బ్రతికింపుచు షష్ఠభాగముం గొనునది-ఇత్యాదిక మత్రిమ శ్లోకార్థ ఉదాహరణమ్. ఆచార్యగ్రన్థేష్వ ప్యేషా క్రియా ప్రసిద్ధా. పల్కు పల్కు వది, అనుష్ఠించునది ఇత్యాదితద్వచనాత్.

వి:– (1) ప్రార్థనార్థమునందు నుజ్యంతమునకుఁ బరముగా 'కదా' యనునది వచ్చును. అది యర్థవిశేషము నిచ్చును. నను గావఁగదే, =కావుము మొ. కాచుధాతువు తుమున్నర్థకరూపము 'కావన్' అను నది. కావన్+కదా+ఏ=కావఁగదే. ఇందు కదా+ఏ అనునవి 'కావక తప్పదు' అనునర్థవిశేషమును బోధించుచున్నవి.

(2) అర్థవిశేషబోధకమగు 'కదా' యనుశబ్ద మొకప్పుడు నుజ్యం తేతరముకంటెఁ బరముగను నగును. ఆవని చేసిగదా నీవు రావల యును. ఇటఁ జేసి యనునది నుజ్యంతము కాదు. దయాబ్ధివిగదమ్మ దయాబ్ధివి యనునది నుజ్యంతేతరము.

(3) 'కదా' యనుశబ్దము ప్రశ్నాద్యర్థవిశేషముల నిచ్చుచు నుత్తమపురుషాదిక్రియలకంటెఁ బరముగా నిల్చును. చేసితిఁగదా! చేసెనుగదా! చేసితివిగదా; అనునవియు దీనికే యుదాహరణములు

కానోపును. ఉత్తమాదియనఁగ నుత్తమమధ్యమప్రథమపురుషములని యర్థము చేయవలయును. మూలమునం దీసందర్భమునఁ - జేసితివా, నీవేల చేయలేదు - అని రెండుదాహరణము లగపడుచున్నవి. అవి సరి కావు వాఁడు రాఁడుగదా; వీఁడు వచ్చునుగదా యున్నగునవి విశేషార్థమునందుఁ ప్రయుక్తములు.

(4) జనకాదిసంబంధార్థము కానట్టి 'అయ్యా, అన్న' మున్నగు శబ్దము లర్థవిశేషమునందుఁ ప్రయుక్తము లగును. చెప్పఁగదయ్యా = చెప్పుము; చెప్పఁగదే = చెప్పుము. వచ్చితివికదయ్యా! వచ్చితివికదమ్మ మొ॥. ఆర్యశబ్దభవమగు 'అయ్యా' యనుశబ్ద మేకారాదిస్వరసంబంధ రహితమై యర్థవిశేషమునఁ బ్రయుక్తమగునని కవిశిరోభూషణము 'అసంబంధోఽర్థబోధనే' యనుదాని కర్థముచేసినది. కావుననే యది ప్రోవవయ్యా; రావయ్యా; మఱతువయ్యా; వినవమ్మ; వినరమ్మ మున్నగు వాని నుదాహరించినది. "ఏ రెవ్వరయ్యా ద్రుపదమహారాజులే" యని నన్నపార్యునివచనము.

(5) కిలార్థకమగు 'అఁట' యనుదానికంటె 'కదా' యనునది, అయ్యా మున్నగునవి ప్రయోగింపఁబడనగును. వచ్చితివఁటకదా, వచ్చితివఁటయ్యా, వచ్చితివఁటమ్మ, వచ్చితివఁటే మొదలైనవి. అఁట, కదా యనువానిమీఁద మధ్యమపురుష వువర్ణకముగాని, రువర్ణకముగాని రావు. వచ్చితివఁటే, వచ్చితివికదే, వచ్చితిరఁటే వచ్చితిరికదే యనియుండును. వచ్చితివఁటవే, వచ్చితివికదవే, వచ్చితిరఁటరే, వచ్చితిరికదరే యనురూపము లుండవు.

(6) 'చు' యనుశబ్దము నిశ్చయాద్యర్థవిశేషమును జెప్పును. దేశ్యమగు నీ 'చు' శబ్దము ప్రార్థనాద్యర్థకమధ్యమపురుషమునఁ బ్రయుక్తము. అట్టియెడ మధ్యమపురుషమం దేకత్వమున "ముమ్మ" అను

ప్రత్యయములును బహుళత్వమున డుజ్వర్ణకము నగును. చుము-చుమ్ము; చుఁడు, చుండు.

(7) ఎవి యనునవి పరమగునపుడు 'చు'శబ్దము వకారాంతమై హ్రస్వదీర్ఘ రూపములతో నుండును. ప్రయోగౌచిత్యమునుబట్టి హ్రస్వముగా నుండునపు డావకారము ద్విరుక్తమగును. చువ్వే, చూవె మొ॥ వకారము శేషమున కుపలక్షణము గావున వెళ్ళేదను జూరె; వెళ్ళేదవుచువ్వే, వెళ్ళేదరుసూరె మొ॥ గసడదవా స్స్వాక్ అను సూత్రముచే 'చ'కారమునకు సకారాదేశము. ఒకప్పుడు 'చు'శబ్దమున కూకారాంతత్వము వచ్చును. కూల్చెదంజూ-చేయుదువుసూ మొ॥

(8) ఒకానొకప్పుడు దేశ్యపదము 'ము' ప్రత్యయార్థమున వచ్చును. 'కానిమ్ము' అనునర్థమున, 'కానీ, కాని' యనునవి ప్రయుక్తములైనవి.

(9) మఱికొన్నిశబ్దములు నర్థవిశేషములయందు శబ్దములతోడిని నిలిచి మహాకవిసమ్మతములై ప్రయోగింపఁబడుచున్నవి. 'పో' యనునది నిశ్చయార్థమునఁ బ్రయుక్తమగుచు-పొమ్ము, పో యనురూపములతో నుండును. 'కా'యనునది కదార్థకము. 'అకాన్' అనునది ఇత్యర్థకము. కానిమ్ము అనునర్థమున కానీ, కాని యనునవియు; అవధరింపుము అనునర్థమున అవధారు అనియుఁ బ్రయుక్తము లగుచున్నవి. ఇట్లే ఒకో, ఒకొ, లే, లె మున్నగువాని నెఱుంగునది.

(10-11) విశేషార్థమునందుఁ దద్ధర్మప్రథమపురుషైకవచనము కంటెఁ బరముగ 'అది'యనుశబ్దమునకుఁ బ్రయోగ ముండునని యథర్వణవచనము చెప్పుచున్నది. చేయునది, చేసెనునది మొదలగునవి యుదాహృతులు.

**268. సూ. భావే టవర్ణకోఽన్తే సర్వేషాం చ క్రియాపదానాం స్యాత్.**

268. సూ.1 :- సర్వేషామపి క్రియాపదానా మన్తే భావార్థే టవర్ణకస్స్యాత్. 'అతఁడు పుటించుట, వచ్చుట, చేయుట' ఇత్యాది. అత్రాథర్వణో క్తవిశేషః.

"టవర్ణకః క్రియాన్తే స్యా ద్భావార్థే సాఽసమాసకః।
పూర్వస్య న వికారోఽస్తి తస్మిన్ లోపశ్చ కస్యచిత్॥
విభక్తిమాత్రం సర్వత్ర మహితం స్యా ట్టవర్ణకాత్।
కేచి న్నాన్త్యాచ్చ గుర్వాదే ర్ద్వ్యక్షరా త్పట్టి మూచిరే॥

"అతఁడు వచ్చుట – నిన్ను రక్షించుట; సమానే వానవచ్చుట, పాటివచ్చుట" ఇత్యాది. పూర్వస్య న వికారోఽస్తీ త్యనేన "అంట-వంట-కంట" ఇత్యాదిప్రయోగస్య భావార్థే న సాధుత్వమ్; కింతు "అనుట"-ఇత్యాదేరేవ. ఏతేన "మధుకైటభారాతి మఱంది రమ్మని పిల్పి పనిగొంట నీకుఁ బ్రాభవము గాదె" ఇత్యాదివచనస్య ప్రామాదికత్వమేవే త్యవధేయమ్ "మింటఁ గడుఁ దెల్లనై పాలుమంటఁ బోవి" ఇత్యాదౌ దువర్ణకలోపః. ఆంధ్రభాషాభూషణే "తినుటను తింట యగున్" ఇత్యాది వచనేన తింటేత్యాదీనాం సాధుత్వముక్తమ్. తదనేన పరాస్తమ్. కించ కైశ్చి ద్వైకారస్యాస్తితావాచకత్వమస్తీతి లక్షణముక్త్వా "వెలిపుటురమై యాచార్యుఁ డొప్పె నుత్తరీకంబై" ఇత్యాదికవివచనముదాహృతమ్. తల్లక్షణం స్వకపోలకల్పితమేవే త్యుపేక్షితమ్. ఉపచారక్రియాత్వేన తాదృశవచనస్యోభాభ్యా మాచార్యాభ్యా మఙ్గీకృతత్వాత్. "అంగనాజనులయుత్తుంగసంగతకుచకుంకుమచందనపంకములయు; వారివ ధమ్మిల్లభారావకలితదివ్యామోదనవపుష్పదామములయు; వారివ పరిధాన చారుధూపములయు విలసితసౌరభావళులఁదాల్చి; యనిలుఁ డనుదూత వోయి" ఇత్యాది వచనం వాగనుశాసనస్య. 'అయు' ఇత్యత్ర యకారైకారయోర్లోపః ఆచార్యేణాఙ్గీకృతః "ఎంగిళాంతులయ్యె" ఇత్యాద్యాచార్యస్య వచనమ్. లోపాభావే "వారివ" ఇత్యత్ర ఏవార్థే ఇకారః. విభక్తిమాత్రమితి "ఘటించుటకొఱకున్, వచ్చుటకొఱకున్," ఇత్యాద్యాకారేణ సర్వత్ర టవర్ణకాదేవ విభక్తయః. ఏవంస్థితే "నుతులఁ గనియెదుకొఱకున్, నీవు ఘటించుకంటెన్" ఇత్యాది భాస్కరతిక్కయజ్వాదికవివచనానాం కిమ్మూలమితి వయం న విద్మః. "నీవు రాఁబట్టి నీవు పోఁబట్టి" ఇత్యాదికం గుర్వాద్యుదాహరణమ్. అనఁబట్టీత్యాదికం ద్వ్యక్షరోదాహరణమ్. ద్వ్యక్షరాదిత్యుక్తేః విడువఁబట్టీత్యాదికం రూప మసాధ్వేవ. టాన్తాత్ విడుచుటఁబట్టీత్యాదికం రూపం ప్రామాణికమేవ.

వి:- భావే. టవర్ణకః, అన్తే, సర్వేషామ్, చ, క్రియాపదానామ్, స్యాత్ –అని ఛేదము. "తెత్సును. అచ్ఛిక ధాతువు లన్నింటికిం జెఁ దుదిని భావార్థమునందు టవర్ణకము వచ్చును" అని యర్థము. భావార్థము

నందు ధాతువుతుదిని టవర్ణకము వచ్చును. అది సమాసమునందును, వ్యస్తతయందునుగూడ వచ్చును. భావార్థకకృదంతములు సమాసపూర్వావయవములుగా నుండునుగాన "ఓగాములు, వచ్చురాములు మున్నగునవి యుదాహృతులు"-అని "టవర్ణకక్రియాన్తే" ఇత్యాది కర్థము. టవర్ణకము పరమగుచుండఁగా దానికి ముందున్ననువర్ణకమున కనుస్వారరూపవికారము కలుగదు. మఱి యాటవర్ణకపరకత్వమున 'డు' మున్నగుప్రత్యయములకు లోపము కలుగును" అని "పూర్వస్య న వికారో న్వోః" అనుదాని కర్థము "తస్మిన్ లోపశ్చ కస్యచిత్" అనుదానికి "ఆడుట-ఆట, పాడుట-పాట, మండుట-మంట, వండుట-వంట, పండుట-పంట, తేరుట-తేట, ఊరుట-ఊట" మున్నగునవి యుదాహృతులు. "ఈ టవర్ణకమునకుఁ బరముగాఁ బ్రథమాదివిభక్తులు నిలుచుటయే యుంటటను సాధువగును" అని 'విభక్తిమాత్ర'మనుదాని కర్థము. "చదువుటచేతన్-చదువుటకున్" మున్నగునవి యుదాహరణములు 'వసిఁగొంట' అనునది కొనుధాతువునకు నువర్ణస్థానమున వచ్చినబిందు వగుటచే నట్టిది సాధువు కాదని కవిశిరోభూషణము చెప్పినది. అది మహాకవిప్రయోగ మగుటచే సాధువే యగును. అట్టివి యితరములు మహాకవిసమ్మతిగాని, లక్షణసమ్మతిగాని లేనపుడు సాధువులు కావు. 'పాఱుచుండుట' అనుటకు 'పాఱుచుంట' అని 'డు' లోపము చేసి యొకకవి ప్రయోగించియున్నాఁడు. అది కవిప్రయోగ మగుటచే సాధువని యంగీకరించుట యుచితము. అట్టిమహాకవిప్రయోగములను గవిశిరోభూషణము నిరసించుట సరికాదు. 'తినుటకు, తింట, అనుటకు, అంట' అనురీతిని నువర్ణాంతము లగునాచ్ఛికధాతువులకు రూపము లుండ వచ్చునని యాంధ్రభాషాభూషణము 'తినుటకుఁ దింట యగున్' అని వచించినది. 'వెడలుపుటురమై యాచార్యుఁ డొప్పెనుత్తర! కంటే' అను దానిని గవిశిరోభూషణము నిరాకరించుట సరికాదని చెప్పవలసిను. పైప్రయోగమునందు 'ఐ' అనుదానికి 'కలవాఁడై' యని యర్థము.

'అయియు' అనునప్పుడు ఇకారమునకు లోపముచేసి 'అయ్యు' అని నన్నపార్యుఁడు ప్రయోగించియున్నాఁడు. మఱియు నతఁడే 'అయు' అనియుఁ బ్రయోగించెను. ఇచట నున్న యువర్ణము సముచ్చయార్థకవర్ణమని యెంచుట యుక్తము. "వారివి + అ = వారివ" మొదలగువానిలోని అకార మవధారణార్థకము. "ఘటించుటకొఱకున్-వచ్చుటకొఱకున్" అను రీతిని టవర్ణకము మీఁదనే విభక్తు లుండవలయునుగాని "ఘటించుకొఱకున్-వచ్చుకొఱకున్" అని ధాతుమాత్రముమీఁద విభక్తులు రారాదు. అయినను "సుతులఁ గనియెడుకొఱకున్" మున్నగు రీతినున్న రూపములు సమంజసములే యగును. విభక్తివివక్షలో ధాతుజవిశేషణములకుఁ దచ్ఛబ్దమధ్యాహార్య మగును. ఆవిధముగా "సుతులఁగనియెడుదానికొఱకున్" అనురూప మేర్పడును.

'తచ్ఛబ్దవస్య లోప స్స్యాదదాతోః క్వచి దేకతా'

'తచ్ఛబ్దమునకును, దచ్ఛబ్దవకారమునకును లోపము కల్గును. అట్టియెడ నిల్చిన అకారాకారముల కేకత్వ మనఁగా నిత్యసంధియుఁ గల్గును' అనునథర్వణవచనము చొప్పున 'దాని' అనివిభక్త్యర్థమున వచ్చినతచ్ఛబ్దమునకు లోపముచేయఁగా 'సుతులఁ గనియెడుకొఱకున్' అనియగుచున్నది. అట్లే 'ఘటించుకొఱకున్-చేయుకొఱకున్' మున్నగునవియును సాధువు లగును. ఇట్టివానిని దుష్టములని కవిశిరోభూషణము నిరాకరించుట మంచిది కాదు. 'రెండక్షరములు గల్గి గుర్వక్షరము పదాదిని గలభావార్థకనకారాంతశబ్దమునకుఁ బరముగా 'పట్టి' యనువిభక్తి వచ్చునని కొందఱు వచించిరి' అని "కేచిన్నాంతాచ్చ గుర్వాదే ద్వ్యక్షరా త్పట్టి మూచిరే" అనుదాని కర్థము. "గుణము హేతు వగునప్పుడు 'పట్టి' అనుపంచమీవిభక్తిప్రత్యయము వచ్చును" అని "పట్టిశ్చైతు పంచమీ గుణే హేతౌ" అనుచింతామణిసూత్రమున కర్థము. పై యథర్వణకారిక దీనికి వివరణము. ఈ 'పట్టి' వర్ణకము సుబంతముల

మీఁద నేకారకు "రాన్-పోన్" మున్నగు వానిమీఁదఁ గూడ వచ్చి 'రాఁబట్టి-పోఁబట్టి' మొన్నగు రూపములు కలుగును. యథర్వణకారిక కర్థము "రాన్-పోన్" మున్నగునవి తుమున్నర్థకములు. ఇవి యసమాపక క్రియలు; కాన విభక్తిప్రత్యయయోగ యోగ్యములు కావు. అయినను నీయథర్వణవచనమున "రాఁబట్టి-పోఁబట్టి" మున్నగునవి సాధువు లగుచున్నవి. "వినఁబట్టి" మున్నగునవి ద్వ్యక్షరనియమమునకు విరుద్ధముగా నుండును గావున వానిపై 'పట్టి' వర్ణకము వచ్చుట సాధువు కాదు. కవిప్రయోగప్రసిద్ధి యున్న పోనివియు సాధువులు కానచ్చును.

268 సూ. 2:- భవే త్కః స్త్రీసమాన్నామ్ను రుత్వం తస్మి న్పరే భవేత్ ।
క్త్వార్థే చ వ్యతిరేకార్థే ధాతో స్తత్రైవ మిర్భవేత్ ॥

తత్రైవ-వ్యతిరేకార్థ ఇత్యర్థః - "వెఱచుక-నిప్పుక-వాలుగంటుక" ఇత్యాది. "అతఁడు ఘటింపక, చేయక" ఇత్యాది. ఘటింపమి-చేయమి-ఘటియించుకొనమి-రామి-లేమి" ఇత్యాది. సమానే "నావేఁడిమి" ఇత్యాది..

"తుమున్నర్థక నాన్తేన మిసమాసః క్వచి ద్భవేత్"

ఇత్యుక్తత్వాత్ "వానిఁ జూడఁజాలమి" ఇత్యాది సిద్ధమ్. వానిమూపోపమి, ఇత్యాది రూపసిద్ధిస్తు "క్వచిద్రూఢ్యాపి సాధుత్వం దృశ్యతే కవిభాషితే" ఇత్యుక్తేః జ్ఞేయా.

వి:- 'అచ్ఛికసమాసప్రాతిపదికమునకుఁ బరముగా 'క' అను ప్రత్యయము వైకల్పికముగా నగును. 'క' ప్రత్యయము పరమగుచుండఁగాఁ బూర్వమున ఉత్వము నిత్యముగా నగును" అని "భవే త్కః స్త్రీసమాన్నామ్నః" అనుదానికర్థము. స్త్రీసమప్రాతిపదికములమీఁద "క-ఉక" అను ప్రత్యయములు పాక్షికముగ నిలుచునని తాత్పర్యము. "వ్యతిరేకక్త్వార్థకమున ధాతువునకు కప్రత్యయమగును. ఆవ్యతిరేకార్థమునందే ధాతువునకు స్వార్థమున మి ప్రత్యయమును వచ్చును" అని "క్త్వార్థే చవ్యతిరేకార్థే" అనుదానికర్థము. "ఘటించు+క" అయియుండఁగా "వ్యతిరేకాదా భావిని చాత్వ్యాత్" అని యత్వమును, "అనుబన్ధప్రార్థనయోః" అని

పత్వమును గలిగి "ఘటిరి ఎక" మని యగుచున్నది. 'ఘటించు+మి' అనియుండఁగా 'మి' అనునది వ్యతిరేకార్థమున వచ్చినది గావున నిది వర నాగునపుడు ఏకారము [illegible] — పత్వమును, ఉకారమున కత్వమును గలిగి 'ఘటింపకు' అనురీతిరూపములు సిద్ధించుచున్నవి. 'అన్' అనునది "తుమున్నర్థక ప్రత్యయము. అది తుదియందుఁగల శబ్దముతో వ్యతిరేకార్థకసంక్షేపవాక్య మతోకుట కొన్నియెడలఁ గలదు" అని "తుమున్నర్థకనా న్తేన" అను దానికర్థము. 'మి' సమాస మనుదానికి వ్యతిరేకసంక్షేపరూపమని యర్థము. "కొన్నియెడలఁ గేవలకవిప్రయోగప్రసిద్ధిచేతనే శబ్దసాధుత్వ మంగపడుచున్న"దని "క్వాచిద్రూఢ్యాపి సాధుత్వం దృశ్యతే కవిభాషితే" అను దానికర్థము. ప్రకృతిప్రత్యయవిభాగము కుదుఱపడని చోట్లలో శబ్దమునకుఁ గవిప్రయోగప్రసిద్ధిచేతనే సాధుత్వము నరయవలయునని తాత్పర్యము. "అవధారు = అవధరింపుము" ఇట్టిరూఢశబ్దములు పెక్కు గలవు, "వానిచూపోపమి" మున్నగునవి యుదాహరణములు. చూపోపమి = చూపు–ఓపు+మి=ఓపమి = చూపోపమి= చూచి సహింపలేకుండుట. వానియొక్క చూపోపమి–అనిసమాసము.

**269. సూ. :-కర్మణ్యనుబన్ధ స్స్యా త్పతిధాతుః క ర్తృవచ్చ తద్విధయః॥**

269. సూ. 1 :– పతిధాతుః కర్మణ్యనుబన్ధో భవతి. తదనుబన్ధవిధయః క ర్తృవద్భవ న్తి చ పల్గ గతావితి ధాత్వర్థాభిధాయకశ్శబ్దో వికృతా 'పడు' ఇతి. కర్త్రర్థే యదనుబన్ధకార్యం తత్సర్వమేతదనుబన్ధేపి భవతి. "ఘటింపఁబడుచున్నాఁడు-ఘటింపఁబడుచున్నారు-ఘటింపఁబడఁగలఁడు - ఘటింపఁబడగలరు-ఘటింపఁబడెన్ - ఘటింపఁబడిరి" ఇత్యాదీని రూపాణ్యూహ్యాని. "చేయఁబడుచున్నాఁడు-చేయఁబడుచున్నారు" ఇత్యాదీనదేశ్యక్రియారూపాణి. "రమణీ! నీకతన మాకు రాఁబడె నిటకిన్" ఇత్యాదౌ పడుధాతో ర్ఘటకక్రియాత్వ మపి. యథా మాకు రానయ్యెన్–పోనయ్యెన్" ఇత్యాదౌ భ్వాదిధాతూనామనుబన్ధత్వే "నీచే రావింపఁబడితిని" ఇతిరూపమ్ "తత్ర తృతీయాషష్ఠీచ విభ క్తీ సమ్మతే ఉభే" ఇత్యాద్యథర్వణవచసా ద్విభ క్తిద్వయమ్. మాచే ఘటింపఁబడిరయెన్, మాకది ఘటింపఁబడిరయెన్" ఇతి.

వి.- "కర్మణి—అనుబన్ధః- స్యాత్ - పతిధాతోః- కర్తృవత్ —చ తద్విధయః" అని ఛేదము. "కర్మార్థకమునందు ధాతువునకు 'పడు' అనునది యనుబంధముగాఁ దుదిని నిల్చును. ఆకర్మార్థమునందు వచ్చు వ్యాకరణకార్యములు కర్త్రర్థమునందువలెనే కలుగును" అనియర్థము. పతిధాతువనఁగా 'పత్లృ గతౌ' అను సంస్కృతధాత్వర్థమగు 'పడు' అనునది యని యర్థము. అనుబన్ధమనఁగా "ప్రధానధాతువు ప్రక్కను నిలిచి యాకర్మార్థమును వ్యక్తము చేయునది" యని యర్థము. "వ్యతిరేకే కాదౌ భావిని చాత్స్యాత్" అను దానిలోని యాదిశబ్దముచే, అత్త్వమును, పునరాగమసూత్రముచే నకారాగమమును నగును. 'అనుబన్ధ ప్రార్థనయోః' అను చోనున్న చకారమునకు - పకారముఁ జేయఁగా "ఘటింపఁబడుచున్నాఁడు" మున్నగురూపములు సిద్ధించును. అకర్మక ధాతువులకుఁ గర్మార్థకత్వ ముండదు. "రమణీ నీకతన మాఱు రాఁబడె నిటకున్" అను చోటి 'పడు' అనునది ఘటకార్థకమే కాని కర్మార్థక పడుధాతువు కాదని తెలియవలెను. అప్రేరణార్థమునందే ప్రేరణకర్తకుఁ బ్రేరణార్థమునద్వితీయ రానపుడు దానికొకప్పుడు తృతీయావిభక్తియు, నింకొకప్పుడు షష్ఠీవిభక్తియు వచ్చును - అని 'తత్రతృతీయ' అనుదాని కర్థము. ప్రేరణకర్తృవాచకము ప్రేరణమున ద్వితీయావిభక్త్యంతము కానపుడు కొన్నియెడలఁ దృతీయాంతమును, గొన్నియెడల షష్ఠ్యంతము నగునని తాత్పర్యము 'తత్రతృతీయ' అనునథర్వణకారికలోని 'తత్ర' అనుదాని కప్రేరణమునందని యర్థము. "నతు ణౌ భవేచ్చ లోపో ణ్యర్థే యో వర్తతే పరే తస్మిన్" అను చింతామణి కిది వివరణ మగుటచే నిట్టియర్థము దీనికిఁ గలిగినది.

269, సూ. 2 :- "భూగమిక్రియయోరర్తే ఘటకాఖ్యా నిరుచ్యతే।
ఉభయత్రాపి భవతి రన్యాపి వ్యతిరేకినీ॥
అన్యాశ్చాప్యర్థఘటకా స్సన్త్య దనేకార్థతాపిచ।
క్వచి దర్థవిశేషస్య వివక్షాపి న దుష్యతి॥

క్వచి దర్థవిశేషేచ రూఢ్యా విశ్రాన్తి రుచ్యతే।
అన్వయస్యాపి గమ్యత్వం రూఢశబ్దేషు కుత్రచిత్ ॥”

ఇత్యథర్వణస్యైవోక్తిః. అస్తే ర్క్రియాణామన్తే. “ఘటింపుచున్నాఁడగున్ - చేయఁగలఁడగున్ - నీవు ఘటింపుచున్నాఁడగుదువు - నేను ఘటింపుచున్నాఁడనగుదున్. వర్తమానభవిష్యదర్థయో ర్భవతే స్తద్ధర్మార్థకత్వేనైవ “తద్ధర్మార్థే అతఁడు నేను నగున్. భూతార్థే అతఁడు నేసెనయ్యెన్” ఇత్యాదిరూపం గ్రాహ్యమ్. అకార్యార్థము ఘటింపనగుచున్నది - ఘటింపనగువాఁడవు - ఘటింపనగుదువు - ఘటింపనయ్యెడి నేను. భూతార్థే ‘ఘటింపనైతిని’ ఇత్యాదిరూపం గ్రాహ్యమ్. వ్యతిరేకే చాన్యత్ర తుల్యమ్. “ఘటింపఁగన్ - ఘటింపఁగాన్ - చేయఁగన్” ఇత్యాది. ‘నమ్మనేరనయ్యెదన్’ ఇత్యాద్యాచార్యస్య వచనమ్. కలదయ్యెన్ - వలదయ్యెన్ - రాఁడయ్యెన్ - లేఁడయ్యెన్ - పోఁడయ్యెన్ - రాదయ్యెన్ - లేదయ్యెన్’ ఇత్యాది. గమిక్రియాతు వ్యతిరేకే కవర్ణకాన్తాత్ప్రయుక్త ఏవ విశేషార్థఘటకో భవతి. “ఘటింపక పోయెన్ - రాకపోయెన్ - చేయకపోయెన్” ఇత్యాదిశబ్దైః ఘటింపఁడయ్యెన్’ ఇత్యాద్యర్థ ఏవ ద్యోత్యతే. అన్యశబ్దేన రాకమానెన్ - రాకతక్కెన్ - రాకచిక్కెన్’ ఇత్యాద్యాః ‘ఘటింపవచ్చు’ నిత్యాద్యా బహవః క్రియాభేదా గ్రాహ్యాః. ‘ఘటింపక పోఁడు - పోక రాఁడు - రాక పోఁడు - లేక పోఁడు’ ఇత్యాదిశబ్దభేదేషు నిషేధముఖేన విధిప్రతీతిః. “కదలి దాఁటఁగలఁడు - లంకసొరఁ గలఁడు - మగుడ రాఁగలఁడు - రాలేక - పోలేక - నీవు రావచ్చునిటకు. కర్త్రర్థే షష్ఠీ. ప్రథమాప్రయోగా త్తద్ధర్మక్రియాయాః ప్రయోగః. “ఇది నీవు రావచ్చుచున్నది - రావచ్చెన్” ఇత్యాదిప్రయోగ స్సంభవత్యేవ ప్రథమాయామ్. “నీ కది సొరరాదు - నీ కిది సొరవచ్చెన్ -” ఇత్యాదౌ సమర్థతాద్యర్థవిశేషప్రతీతిః “అతఁడు పోక యిది కాదు - అతఁడు రాక యిది కూడదు. అతఁడు వినక చదువఁ డితఁడు” ఇత్యాదౌ, పోవున్నన్ - రావున్నన్” ఇత్యాద్యర్థస్య వివక్షా క్రియతే. “కాని” ఇతిశబ్దోఽపి దేశ్యః వ్యతిరేకార్థః క్త్వార్థే వర్తతే. కాని కాకయో రన్వయే బహవో రూపవిశేషా దృశ్యన్తే “పోయెఁ గాక పోనిత్తునే - నీవు వచ్చినంగాక కల్గునే - నీవు వచ్చినఁగాక కల్గునే - నీవు వచ్చినం గాక యగునే - వచ్చిన వచ్చుఁగాక - పోయినఁ బోవుఁగాక - వచ్చుఁగాక - పోవుఁగాక. “దీనిఁ గాని వచ్చుదండధరదిక్పవమాన మదక్షిణం బగుఁగాక” అభూతత్వాద్యర్థే క్త్వార్థశబ్దస్య విశ్రాన్తిః. “అతనిం గాని నుతింపము - అతనికిఁగాక శక్యమా మాకు - అతనికిం గాక యన్యులకు నమస్కృతి సేయము -” ఇత్యాదావన్వయస్య గమ్యతా. “అతని నుతింతుము గాని, యన్యులను నుతింపము” ఇత్యాద్యర్థావగతేః. “అతఁడు రాకమున్నె - అప్పని

ఘటింపఁగాన్, సేయఁగన్' మున్నగురీతిని వ్యతిరేకేతరమున రూపములు. నమ్మనేరనయ్యేదన్' అని యామాచార్యులవారివచనము. 'కలదయ్యేన్, వలదయ్యేన్. రాఁడయ్యేన్, లేఁడయ్యేన్, పోఁడయ్యేన్, రాదయ్యేన్, పోదయ్యేన్' మున్నగుచోట్ల నగుధాతురూపములకు భూతార్థమున ఘటకత్వము. పోవుధాతువు వ్యతిరేకార్థమందు కవర్ణకాంతముతోఁ జేఁ ప్రయుక్త మగునపుడే విశేషార్థఘటక మగుచున్నది 'ఘటింపకపోయెన్, రాకపోయెన్, చేయకపోయెన్' మొ॥ ఇట్టివానివలన 'ఘటింపఁడయ్యేన్' మున్నగురీతి యర్థముతో వ్యక్తమగుచున్నవి. 'అగు-పోవు' అనునవియే కాక యితరధాతువులును క్రియలతుదిని నిలిచి విశేషార్థఘటకములు కానోపును. అట్టియెడ వాని కనేకార్థకతయును గల్గును. 'రాకమానెన్, రాకతక్కెన్' రాకచిక్కెన్' మున్నగునవి యుదాహృతులు. 'ఘటింపవచ్చున్' మున్నగుక్రియలు పెక్కింటికిచటనే యుదాహరణత్వము. 'ఘటింపకపోఁడు, పోకరాఁడు, రాకపోఁడు, లేకపోఁడు' మున్నగు శబ్దభేదములలో నిషేధముఖముగా 'తప్పక ఘటించును' మున్నగువిధి ప్రతీయమాన మగుచున్నది. కడలి దాఁటఁగలఁడు, లంక సొరఁగలఁడు, మగుడ రాఁగలఁడు, రాలేక, పోలేక, నీవు రావచ్చునిటకు. కర్త్రర్థమున షష్ఠి ప్రథమాప్రయోగమువలనఁ దద్ధర్మక్రియకుఁ బ్రయోగము. 'ఇది నీకు రావచ్చుచున్నది, రావచ్చెన్" మున్నగురీతి ప్రయోగములు ప్రథమావిభక్తియందు సంభవింపవచ్చును. "నీ కది సొరరాదు. సొరవచ్చున్" మున్నగుచోట్ల సమర్థతమున్నగునర్థములు ప్రతీయమానము లగుచున్నవి. "అతఁడుపోకయుండరాదు, అతఁడు రాక యుది కూడదు, అతఁడు వినక చదువఁ డితఁడు" మున్నగువానియందు "పోకున్నన్, రాకున్నన్" మున్నగునర్థములు వివక్షింపఁబడుచున్నవి. "ఒకప్పు డర్థవిశేషమును వివక్షించుటయును దోషము కాదు అని— "క్వచిదర్థవిశేషస్య వివక్షాఽపి న దుష్యతి" అనువాని కర్థము. దీనియుదాహరణములు మీఁద నీయఁబడినవి. "ఒకానొకయర్థవిశేషమునందు రూఢి

చేతనే విశ్రాంతి చెప్పఁబడుచున్నది" అని "క్వచిదర్థవిశేషే చ రూఢ్యా విశ్రాన్తి రుచ్యతే" అనుదాని కర్థము. 'కాని' అనుశబ్దము దేశ్యము. ఇది వ్యతిరేకార్థమున వర్తించుచున్నది. 'కాని, కాక' అనువాని కన్వయమునందు రూపవిశేషములు పెక్కు కనఁబడుచున్నవి. పోయెఁగాక, పోనిత్తునే, నీ విచ్చినంగాక కల్గునే, నీవు వచ్చినఁగాక కల్గునే, నీవు వచ్చినంగాక యగునే, వచ్చిన వచ్చుఁగాక. పోయినఁబోవుఁగాక, వచ్చుఁగాక, పోవుఁగాక, దీకొనివచ్చు దండధరదక్షిణపవమాన మాదక్షిణంబగుఁగాక. 'కాక' అనువ్యతిరేకార్థకశబ్దమునకు భూతార్థమున విశ్రాంతి లేదు. అభూతత్వముననే విశ్రాంతి. "ఒకానొకచోఁ గొన్ని రూఢశబ్దముల కన్వయము గమ్యమగు" నని "అన్వయస్యాఽపి గమ్యత్వం రూఢశబ్దేషు కుత్రచిత్' అనుదాని కర్థము. 'అతనింగాని నుతింపము, అతనికిఁగాక శక్యమా మాకు, అతనికింగాక యన్యులకు నమస్కృతి సేయము' ఈమున్నగుచోట్ల నన్వయమునకు గమ్యత్వము. 'అతని నుతింతుముగాని యన్యుల నుతింపము' ఈరీతియర్థములు వానివలన గమ్యములగుచున్నవి గదా! 'అతఁడు రాకమున్న, అప్పని కాకమున్న" మున్నగునవియు సిద్ధించుచున్నవి. కావుననే "కాక మతేమి" మున్నగువానికిని "అయ్య! పరాకు-అయ్యా! హెచ్చరిక" మున్నగువానికిని రూపసిద్ధి కలుగుచున్నది. 'చేయకయమున్న' మొదలైనచోట్ల నిర్ధారణార్థకాకారమునకు యకారశ్రవణము కల్గినదని యెన్నఁగును. "ఇంతకయుమున్న వచ్చెన్ (ఇంతకున్ + అ = ఇంతక = ఇంతక + అయి + అ = ఇంతకయ. ఇంతకయుమున్న యనుచోట ఇంతకుమునుపు = చాల కాలము ముందుగనే వచ్చెనని యర్థము. "ఇత్యాదౌ భూధాత్వర్థో బోధ్యః" అని కవిశిరోభూషణము వ్రాయుటయు సరికాదు. "ఇంతకయమున్న" అనుదానికి లోకప్రసిద్ధి లేదు. 'అయి' అనునది, అగుధాత్వర్థక రూపము. "అతండు నుతింప శక్యమే-వారి జయింప శక్యమే" మున్నగుచోట్ల 'నుతింపన్-జయింపన్' మున్నగునవి భావార్థకములు. "భావా

ర్థమునం దేకవచనము తఱచుగ నగును; క్లీబతయు నగును” అను శాబ్దికోక్తి ననుసరించి పై చోట నేకత్వము, క్లీబతయు నని తెలియవలెను. విశేషార్థవివక్షలో “అతండు నుతింప శక్యుండే” అనియు నుండును. “చేయనే చేసె-చేయక చేయుచున్నాఁడు - రానే వచ్చెన్-పోనే పోను-చేసెనా చేయును-వచ్చునా వచ్చును-చేసినఁ జేయును-చేసినం జేయుచున్నాఁడు - అయినం గానిమ్ము - వచ్చిన రానిమ్ము - వచ్చిన రానీ” మున్నగురీతిరూపములును సాధువులగును. “అన్యాశ్చార్థఘటకాః” అనుదానికి మఱికొన్ని యుదాహరణములు. ‘చేయఁదగును-రక్షింపఁదగును’ మున్నగుచోట్ల ‘తగు’ధాతువునకు సముద్రము దాఁటఁగలఁడు-దాఁటలేఁడు-దాఁటశక్తుఁడు- దాఁటఁజాలఁడు-దాఁటవచ్చును. దాఁటఁజాలును’ మున్నగురీతిఁ గొన్నియెడల సామర్థ్యాద్యర్థ విశేషములు బోధ్యములగును. ‘ఆచేను పండఁబాఱెను-పండవచ్చెను-చేయఁబోయెను-వ్రాయఁబోయెను’ ఇట్లు కొన్నిచోట్ల నారంభసిద్ధప్రాయతాద్యర్థములు బోధ్యము లగును. చెప్పకపోతివి=చెప్పవైతివి; చెప్పకపోఁడు=చెప్పును; రాకపోఁడు=వచ్చును; లేకపోఁడు=ఉండును; చేయకపోయెన్=చేయఁడయ్యెన్” ఇట్టి జంటశబ్దములు వివిధార్థవిశేషఘటకము లగుచున్నవి’అని ‘అన్యాశ్చార్థఘటకాః’ అనుదాని కుదాహరణములు. పోయెంగాక పోనిత్తునే- నీ విచ్చినంగాక కల్గునే-వాఁడు వచ్చెనుగాని ప్రయోజనము లేదు-వచ్చిన వచ్చుఁగాక-పోయినఁబోవుఁగాక-దానింగాని, దీనింగాని నా కిమ్ము — నీవు వచ్చినంగాని కార్యము నెఱవేఱదు’ మున్నగురీతి ననేకార్థములు సిద్ధించుచున్నవి- అని ‘స్యాదనేకార్థతాపి చ’ అనుదాని కుదాహరణములు. ‘ఒకప్పు డర్థవిశేషవివక్షయు దుష్టము కాదు’ అనుదాని కర్థము “అతఁడు పోక యిది కాదు-అతఁడు రాక యిది కూడదు-అతఁడు వినక చదువఁ డితఁడు” మున్నగుచోట్ల ‘పోకున్నన్-రాకున్నన్’ మున్నగువానివివక్ష చేయఁబడుచున్నది. “ఒకానొకచోట నర్థవిశేషమునందుఁ బ్రసిద్ధిచే నర్థ

విశ్రాంతి కల్గును" అని 'క్వాపిపదార్థవిశేషేచ యూధ్వా విశ్రాన్తి రుచ్యతే' అనుగాపి కర్థము. "కొన్ని యెడలఁ గవిప్రయోగమునందుఁ గేవల కవి ప్రయోగప్రసిద్ధిచేతనే సాధుత్వ మంగీకరింపఁబడును" అను 'క్వచిద్రూఢ్యాఽపి సాధుత్వం దృశ్యతే కవిష్వితి' అనుదాని కర్థము. ప్రకృతి ప్రత్యయాదివిభాగము తెలియరాని స్థలములందుఁ గవిప్రయోగప్రసిద్ధి కలుగునపు డట్టివి యాకావ్యప్రయోగప్రసిద్ధిచేతనే సాధుత్వము నొందు చున్నవని తాత్పర్యము. "అవధారు = అవధరింపుము; చూపోపమి మున్నగునవి యుదాహరణములు. 'చూపోపు' అనునది శబ్దపల్లవ ధాతువు కానోపును. "కొన్ని యెడలఁ బ్రసిద్ధార్థకశబ్దములప్రయోగ మునం దన్వయము గన్పడక యుండుటయు గలదు" అని 'అన్వయస్యాఽపి గమ్యత్వం యూధశబ్దేషు కుత్రచిత్' అనుదానికర్థము. 'నన్నుఁ జూచినఁగాదె' - ఇచట 'జనుఁడు' అనుకర్త యధ్యాహార్యము. 'వాఁడు వచ్చెనేని వీఁడు వచ్చును' అనునపుడు "వాఁడు వచ్చెనేని వీఁడు రాఁడు" అని వ్యంగ్యార్థము. 'అతనింగాని నుతింపము' అనునవుడు, 'అతని నుతింతుము గాని యన్యుల నుతింపము" అని వ్యంగ్యార్థము.

269 సూ. శ్లో:- రయుగం మధ్యమైకత్వే క్వచిదర్థే ప్రయుజ్యతే।
దీర్ఘో హ్రస్వశ్చ తత్ర స్యాదేకోఽప్యర్థవిశేషతః॥
మధ్యమస్థే క్రియార్థే తు నిత్యమత్వమిహేష్యతే।
నైకవర్ణస్య తు తథా రయోగస్య తథాగతే॥

క్వచిదర్థే హీనత్వార్థే, ప్రియత్వార్థేచ. రారా శ్రీరామ! నన్ను రక్షింపంగదే - రారా ప్రహ్లదము లేలరణ మొనరింపవే. ద్వితీయో వర్ణో దీర్ఘో హ్రస్వశ్చ "రార దాసుల రక్షింప రామచంద్ర—నన్ను రక్షింపరా—చేయరా—చాలనినుఁగొల్తురా—వక్కె అంకొనరా—రా యిఁకఁ బ్రహ్లదము శేలకణ మొనరింపవే" ఇత్యాదిక్రియాయా మధ్యమగామిన్యాం తు నాత్వమ్. తిన్నరా ఇత్యాదిక మేవ. 'చేసితిరా' ఇత్యాదిమధ్యమగామిన్యా మపి క్రియాయా మేకాక్షరక్రియాయామపి నాఽత్వమ్. పోరా- ఇత్యాదికం తత్రోదాహరణమ్. శేషోఽయ మపహాయ స్సనహాయోవా హీనత్వార్థే మధ్యమపురుషార్థే వర్తతే.

ప్రియత్వార్థే ప్రార్థనార్థకమువర్ణకార్థేచ వర్తతే. నచ ప్రార్థనార్థకవ్యతిరేకార్థే మువర్ణక ఇతి వాచ్యమ్. "అన్యత్రాపి తద్దృష్టి స్సాధ్య త్సద్వాక్యస్య తథాగతేః" ఇత్యథర్వణాచార్యవచనాత్.

వి:- అకారముతోఁ గూడిన రేఫద్వయము మధ్యమపురుషైకవచనమునందు 'నీచత-భక్తి-మైత్రి' మున్నగునర్థవిశేషములందుఁ బ్రయోగింపఁబడును. ఆరేఫద్వయములో రెండవది 'ర లేక రా' అనునదియైనఁ గావచ్చును. 'రారా, రార' అని యుండవచ్చును. కాని "రారా,రర అని యుండదని యర్థము. అట్లు రేఫద్వయమే కాక యొక్కటియు" నర్థవిశేషము నిచ్చును. ఒక్క రేఫము దీర్ఘాంతమే యగునుగాని హ్రస్వాంత ముండదు. 'రా=రమ్ము' అని యుండును; ర=రమ్ము' అని యుండదు. 'రా-ర' అనునది మధ్యమపురుషక్రియాపదముతుదియక్షరముమీఁద నిలిచినచోఁ బూర్వము నున్న క్రియాంత్యవర్ణమునకు అత్వము సమ్మతమగుచున్నది. ప్రార్థనార్థమునందు మధ్యమము వర్ణకము లోపించునపుడె క్రియాంత్యము 'రా' శబ్దపర మగుచుండఁ బూర్వస్థిత స్వరమునకు అకార మాదేశముగా సమ్మతమగును. పాలింపుము+రా =పాలింపుము+అ+రా=పాలింపరా=పాలింపుము. మువర్ణకమునకు లోపము లేనపుడు 'ర' శబ్దపరకత్వమునందు ముప్రత్యయోకార మకారము కారాదు. సత్వము సుమ్ముర. 'ము', ఏకాక్షరక్రియా-అనువానికి రశబ్దపరకత్వమునందుఁ బూర్వస్వరమున కకారాదేశము రాదని కవిప్రయోగప్రసిద్ధినిబట్టి తెలియవలెను. ఇచట "రయోగస్య తథాగతేః" అనుటకన్న "ప్రయోగస్య తథాగతేః" అనుపాఠము మిక్కిలి సమంజసము. "పోరా, లేరా, తేరా" మున్నగునవి యుదాహరణములు. మధ్యమపురుషక్రియేతరపదములమీఁదనగుతము ద్వివిధరకారప్రయోగము సమ్మతమే. కవిప్రయోగము లట్లే కలవుకదా! ఇది 'రయుగంసద్వాక్యస్య తథాగతేః' అనుదాని కర్థము.

268 సూ. 4:- క్రియాః ప్రసిద్ధా బహవ శ్శబ్దపల్లవసంజ్ఞకాః।
ప్రథమాయా ద్వితీయాయా స్సమ్భవ స్తత్ర సమ్మతః॥

తదేవా ద్వివిధ ద్వ్యర్థానాం కర్తృమా ద్వైకర్తృతాదపి।
క్రియాయా ఉపచారస్స్య త్రివిధమాపవద్ధతౌ॥
అకర్మకత్వం ప్రాయస్స్యా ద్వితీయోభయసమ్మతిః।
శబ్దకర్త్రాః పరప్రాప్త స్స్వ్యత్రార్థోపి గృహ్యతే॥
క్వచి ద్విభక్తిపై చిత్ర్యం దృశ్యతే కవిభాషితే।
జాత్వరస్య భవే ద్దస్య డాఽదేశో వా యవర్ణకే॥

ఇతిచ. "అకర్మకత్వం ప్రాయస్స్యా" దిత్యస్య పూర్వత్రాన్వయః. పరత్ర 'ద్వితీయాసమ్బన్ధస్థలే' ఇత్యర్థః. అత్రాధేయస్థక్రియాయా ఆధార, ఆరోప ఉపచార ఇత్యుచ్యతే. పెంపెక్కుచున్నాఁడు, పనిదీఱె, వడిమిగిలె, దెసచెడె, దిక్కుచెడె, పద నెక్కె, లావఱె, పెంపఱె, బలమఱె, భయమఱె, చలముగాఱె, పిఱుసని, కన్నుఁదనిసె, కన్నుఁగానక, కడుపాఱె, కడుపునిండె, తలకొత్తి, ఊర్పుల్గూరి, నీర్గారి, సొంపారి, పెంపారి, తెగటారి– "ఇత్యాదిరూపాణి ప్రథమాసమ్బన్ధ ఉదాహరణమ్. ప్రాయోగ్రహణాత్ క్వచిత్సకర్మకత్వమపి.సీత న్వివాహంబై, పెండ్లియై, ఉద్వాహంబై, "అల ఘుభుజా! నను వివాహముగదే యనినన్" ఇత్యాదివచన మాచార్యస్య. "పెంపెక్కుచున్నాఁడు" ఇత్యాదౌ నుబన్తాన్వయే ఆభాసకర్మధారయత్వం బోధ్యమ్. పాలుమాలుచున్నాఁడు, తగవుమాలి, సిగ్గుమాలి, పట్టువడె, సంకటపడె, ముడిపడె. ప్రథమాన్తత్వేఽపి న క్షతిః. "చిందులు త్రొక్కె, నాట్యమాడె, త్రొక్కులాడె, తుంపెసలాడె, తచ్చనలాడె, విజయముచేసె నతఁడు, కదియఁబడె, చదికలఁ బడెన్" ఇత్యాదీనాం నాన్తానామపి ద్వితీయాన్తత్వేనైవ గ్రహణమ్. ఏతాదృశాని రూపాణి ద్వితీయాసమ్బన్ధే అకర్మకత్వోదాహరణమ్. "అతని మార్గ్కొని వీడుకొని, చేకొని, మరులుకొని, దీకొని, దాకొని, నెలవుకొని, దానింబెండ్లాడె, చెట్టవట్టె, కాలంద్రొక్కె నిద్రమేల్కొని, మేల్కని, "నిద్రాం బుబుధే" ఇత్యాద్యవాక్యస్య పర్యాయవాక్యమిదమ్. "రిపులఁజెక్కాడె, వారిని బెంపుఁజేసె, దానిఁబెండ్లిచేసె, అతనిఁబెండ్లికొడుకుఁ జేసె" ఇత్యాది బహూ న్యుదాహరణాని సకర్మకత్వే. 'చేకొని' ఇత్యాదౌ న గకారాది వర్ణవికారః. "క్వచిన్నైవ వికార స్స్యా ద్ధాత్వర్థా చ్ఛబ్దపల్లవే" ఇతి తస్యైవోక్తేః.

వి:– శబ్దపల్లవము లనెడిసంజ్ఞ కలయనేకము లగుజంటశబ్దక్రియలు కవిప్రయోగములలోఁ బ్రసిద్ధములై యున్నవి. పల్లవశబ్దమునకు 'చిగురు' అని యర్థము. రెండుదళము లేకీభవించి పల్లవముగా నవతరిలి

నట్లు రెండుశబ్దములు కలిసి యొకశబ్దముగా నేర్పడుటచే నట్టివి శబ్దపల్లవము లనిపించుకొనును ఈశబ్దపల్లవక్రియలలో శబ్దశక్తిచే సంప్రాప్తమైనయర్థమే సర్వత్ర గ్రహింపఁబడుచున్నది. ఇట్లగుటచేఁ గొన్నియెడల శబ్దపల్లవములందు శబ్దార్థము గ్రహింపఁబడదనియు, విలక్షణార్థ ముండవచ్చుననియుఁ దోఁచుచున్నది. మఱియు నాశబ్దపల్లవములలోఁ దొలిపదము ప్రథమావిభక్త్యంతముగాని, ద్వితీయావిభక్త్యంతముగాని కానోపును–అని తొలికారిక కర్థము. శబ్దపల్లవములలోనిపూర్వపదములు యథాయోగముగాఁ దత్సమములుగాని వైకృతములుగాని కావచ్చును. ప్రథమావిభక్త్యంతముగాఁ బూర్వపద మున్నపుడు క్రియకు నుపచారార్థము (లాక్షణికార్థము) సిద్ధించుచుండును–అని 'తయోః.... ప్రథమాపదసఙ్గతౌ' అనుదాని కర్థము. ఈప్రథమాంతసందర్భమునందు శబ్దపల్లవక్రియ తఱచుగా సకర్మక మగుచుండును. ద్వితీయావిభక్తిసంబంధమునందు సకర్మకాకర్మకము లగుచుండును–అని, 'అకర్మకత్వం ప్రాయస్స్యాత్' అనుదాని కర్థము. శబ్దపల్లవక్రియలలో శబ్దశక్తివలన వచ్చినయర్థమే తఱచుగా గ్రహింపఁబడుచుండును. కొన్నియెడల వివిధము లగువిభక్తులు వచ్చెడివిచిత్రతలి కవిప్రయోగములం దగపడుచున్నది–అని "క్వాచి ద్విభక్తివైచిత్ర్యం దృశ్యతే కవిభాషితే" అనుదాని కర్థము. సప్తమ్యాదివిభక్తు లుండవలసినచోటఁ బ్రథమాదులు నిలుచుటయే విభక్తివిచిత్రత.

268 సూ. వ్యా:- చక్కనయ్యెన్, విన్ననయ్యెన్ ఇత్యాదికమ్; తెల్లఁబడి, నల్లఁబడి, డిల్లఁబోయి, వెలవెలఁబోయి, విన్నఁబోయి, ఒడఁబడి, తడఁబడి" ఇత్యాదికం చోభయత్రాపి గ్రాహ్యమ్. "కేచిచ్ఛబ్దవిశేషా స్స్యుః క్రియాయోగే ద్రుతాన్వితాః" ఇత్యుక్తేః. 'ఒల్లంబాటు' ఇత్యత్ర 'ఒల్లన్'–ఇతి వ్యతిరేకార్థకో దేశ్యశబ్ద ఇతి బోధ్యమ్.

వి:- "చక్క, విన్న," మున్నగు కొన్ని శబ్దవిశేషములు క్రియాయోగమునందు ద్రుతాన్వితము లగుచున్నవని యథర్వణాచార్యులు

గారు చెప్పియుండుటచే 'చక్కనయ్యె-చక్కన్+అయ్యె' మున్నగునవి ద్రుతాన్వితము లగుచున్నవి. ఇంతేకాక 'తెల్లఁబడు, నల్లఁబడు, డిల్లఁబడు, వెలవెలఁబోవు, విన్నఁబోవు, ఒడఁబడు, తడఁబడు' మున్నగునవి రెండుపక్షములయందు (అనఁగాఁ బ్రథమాసంబంధము కలవిగాఁగాని, ద్వితీయాసంబంధము కలవిగాఁగాని) గ్రహింపనగునని తెలియవలెను. 'ఒల్లంబాటు' అనుచోట 'ఒల్లు=ఇష్టపడు' అనుధాతువుయొక్క వ్యతిరేకనివర్ణ కాంతరూపమని కవిశిరోభూషణాభిప్రాయము. "ఒల్లంబాటు= అంగీకారము" అని యర్థము. ఇందు వ్యతిరేకార్థము లేశమును లేదు గదా!

268 సూ. 6:- శబ్దశక్త్యేతి శబ్దశక్తిమహిమ్నా యోఽర్థః పరిప్రాప్తః శాస్త్రమాత్రే తాదృశ ఏవార్థః ప్రామాణికై ర్గృహ్యతే హి. వివక్షితార్థప్రతిపాదనాక్షమం పదం న ప్రయోజ్య మిత్యర్థః. ఏతేన "గ్రుచ్చెన్, గ్రుచ్చించెన్, నాటెన్, నాటించెన్" ఇత్యాదీని రూపాణి సాధూని. "నిసుం దానికిఁ బెండ్లిచేసెదన్, ఇద్దఱకుఁ బెండ్లి యగున్" ఇత్యాదౌ విభక్తివైచిత్ర్యం ప్రామాణికప్రయోగతోఽవగన్తవ్యమ్.

వి:- "శబ్దమునకుఁ గలయర్థబోధకతాశక్తివలన సంప్రాప్తించిన యర్థమే యంతటను గ్రహింపఁబడును" – అని "శబ్దశక్త్యా పరిప్రాప్త స్సర్వత్రార్థోహి గృహ్యతే" అనుదాని కర్థము. శబ్దము నుచ్చరించినతోడనే యొకానొకయర్థమును స్ఫురింపఁజేయునీశ్వరేచ్ఛనే శబ్దశక్తి యందురు. లోకవ్యవహారమునుండియు, మహాకవివ్యవహారమునుండియు శబ్దశక్తిని గ్రహింపఁదగునని తాత్పర్యము. తాఁజెప్పఁదలఁచినయర్థమును జెప్పఁజాలనిపదమును బ్రయోగింపరాదు. 'గ్రుచ్చించెన్-నాటించెన్' అనునవి ప్రేరణార్థకములు. "సనున్ దానికిఁ బెండ్లిచేసెదన్" మున్నగువానియందు విభక్తివైచిత్ర్యము చూడనగును. "శబ్దపల్లవక్రియలలోఁ గొన్నియెడల వివిధము లగువిభక్తులు నిల్చెడివిచిత్రత కవిప్రయోగములందగపడుచున్నది" అని "క్వచిద్విభక్తివైచిత్ర్యం దృశ్యతే

కవిభాషితే” అనుదాని కర్థము. సప్తమ్యాదివిభక్తు లుండవలసినచోటఁ బ్రథమాదులు నిల్చుటయే విభక్తివిచిత్రత.

268 సూ. 7:- నాత్పరస్యేతి “ఉందురు, ఉంద్రు, మేలుకొందురు, మేలుకొంద్రు, అందురు, అంద్రు, పనిగొందురు, పనిగొంద్రు” ఇత్యాది. “చదువుకొంద్రు గాక, ఎదిరి కిచ్చెదమంద్రు” ఇత్యాదీ న్యాచార్యవచనాని.

వి:- “రువర్ణకము పరము గునపుడు నకారమునకుఁ బరమైయున్న ‘ద’ కారమునకు వికల్పముగా ‘డ’ కారాదేశ మగును”—అని “నాత్పరస్య భవే ద్దస్య డాదేశో వా రువర్ణకే” అనుదాని కర్థము. “అనుదురు-వినుదురు” మున్నగుచోట్ల ‘ను’ వర్ణములోనియుకారము విధానసామర్థ్యముచే లోపించును. “అన్దురు-విన్దురు” అనురూపములలో దకారమునకు డాదేశవిధానముచే “అండురు-అందురు” అని యగును. డకార, దకారములమీఁదియుకారమునకు బైరీతినే లోపముచేయఁగా “అండ్రు-అంద్రు” మున్నగురూపములు సిద్ధించును.

268 సూ. 8:- “ప్రసిద్ధా స్యా ద్విశేషస్య పునరుక్తి ర్న దోషకృత్” ఇతి తస్యైవ వచనమ్. విశేషస్య క్రియాపాత్తశబ్దవిశేషస్యేత్యర్థః. “తరువు పూవులు పూచెన్-కాయలు కాచెన్-పండులు పండెన్-పల్కులు పల్కెన్-దూరులు దూరెన్-నోములు నోచెన్” ఇత్యాది ప్రసిద్ధదేశ్యపదనిర్వాహార్థోఽయం విధిరితి జ్ఞాపయితుం ప్రసిద్ధా విత్యుక్తమ్. వాగనుశాసనేనా ప్యఙ్గీకృత ఏవాఽయం పక్షః. “పల్కులు పలుకనది-నా పల్కినపల్కు” ఇత్యాదివచనజ్ఞాపకాత్. ఆలంకారికాశ్చ కేచిత్ “జగాద మధురాం వాచం విశదాక్షరశాలినీమ్; వాచమూచే సుధాధారామధురాం మధుసూదనః” ఇత్యాదౌ విశేష్యస్య గతార్థత్వేఽపి విశేషణాదానార్థం పునర్విశేష్యస్యోపాదానం నదోషాయేతి పునరుక్తిదోషం పరిజహ్రుః. అలంకృతిసిద్ధాన్తపారదృశ్వానస్తు “క్రియావిశేషణత్వేఽపి వివక్షితార్థస్య సిద్ధత్వాత్తాదృశపరిహారో నాస్మాకం మనోహరతే. “చరణత్రపరిత్రాణరహితాభ్యామపి ద్రుతమ్ పాదాభ్యాం దూరమధ్వానం వ్రజన్నేష న ఖిద్యతే” ఇతి వచనస్తు మనోహరమేవేతి ఫేణుః.

వి :- క్రియచే సకర్మయర్థవిశేషపునరుక్తి ప్రసిద్ధమండితత, కవివ్యవహారప్రసిద్ధ మగునపుడు దుష్టము కాదు—అని “ప్రసిద్ధా స్యాత్”

ఇత్యాది కర్థము. ఉదాహరణము మీఁదిమూలమున "పూఁవులు పూచెన్-కాయలు కాచెన్" మున్నగురీతిని బ్రసిద్ధములు. ఈవిషయము సంస్కృతమునను బ్రసిద్ధమే యనియు నైనను నాలంకారికులు దీనిని గొందఱౌననియుఁ, గొందఱు కాదనియు వివరించిరి. కాని సంస్కృత మహాకవులప్రయోగములనుబట్టి యిట్టిది పునరుక్తిదోషము కాదనియే తేలుచున్నది.

**269. సూ :— అత్త్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాఞ్చ.**

269. సూ :- అత్వేత్యాదికార్యం సర్వం తత్సమక్రియాస్వివ దేశ్య క్రియాస్వపి భవత్యేవ; నతు తత్ర విశేషః. కిన్తు.

వి :- అత్త్వాది, తత్సమానామ్, ఇవ, దేశ్యానామ్, క్రియాపదానామ్, చ-అని ఛేదము. 'వ్యతిరేకాద్గా భావిని చాత్త్వాత్' అను చింతామణికారిక మొదలుకొని చెప్పఁబడినక్రియాపరిచ్ఛేదకారికలలోని 'అత్'మున్నగు కార్యములు తత్సమధాతువులకువలెనే దేశ్య ధాతువులకును నగును-అని యర్థము. దీనిచేఁ దత్సమక్రియాప్రక్రియ దేశ్యక్రియలకును నగునని తెలియుచున్నది. చింతామణియందలి తొలి నాలుగుపరిచ్ఛేదములును దత్సమాచ్ఛికమిశ్రితముగాఁ గార్యములఁ జెప్పుచుండఁగాఁ గ్రియాపరిచ్ఛేదముమాత్రము కేవలతత్సమక్రియనే సాధించి చివర నీకార్యములు దేశ్యక్రియలకును వర్తిల్లు ననుటచే నీ చింతామణితత్సమరూపసాధకముగా వ్రాయఁబడినదనియు, మధ్యమధ్య నున్నయాచ్ఛికకార్యములు ఘుణాక్షరన్యాయమున వర్తిల్లినవనియు నూహింపవలసియున్నది. మఱియు నన్నపార్యుఁడు తనభారతభాగమునఁ బ్రయోగించినతత్సమక్రియలే చింతామణిచే సాధింపఁబడినను గొన్ని నన్నయభారతభాగమునఁ బ్రయుక్తములై యున్నతత్సమక్రియారూపములు ప్రాప్తములుగా సాధింపఁబడ లేదు. "రక్షించెదన్-రక్షించెదున్-రక్షించుచుంటిని" మున్నగునవి నన్నయభారతమునఁ బ్రయుక్తములై

చున్నవి. వానిని చింతామణి సాధింపలేదు. నన్నయభారతభాగమునం దలవుగాఁ గలయీ క్రమములైన— "రక్షింపబడు— అపేక్షించుచున్—రక్షించె దనున్—రక్షింతము—రక్షింపకుము—రక్షింపక" మున్నగునవియుఁ జింతామణియందు సాధింపఁబడలేదు. కాన నట్టివానిని సాధించుటకై 'పునరాగమః క్రియాణామ్' అనుసూత్ర మువదేశింపఁబడినది.

**270. సూ :— వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు.**

270. సూ 1 :- దేశ్యక్రియాణాం ప్రథమాదిపురుషే ష్వేకవచన, బహువచనేషు తద్ధర్మాద్యర్థేషు చ తత్తత్ స్థానేషు వర్ణాగమో విశేషో భవతి. తథా హి-'వచ్చు' ఇతిక్రియాయాం వర్తమానార్థే 'వచ్చుచున్నాఁడు' ఇత్యాది. భూతార్థే-'వచ్చెన్' ఇత్యాది. భవిష్యతి 'రాఁగలఁడు' ఇత్యాది. తద్ధర్మే 'వచ్చున్' ఇత్యాది. వ్యతిరేకే 'రాఁడు' ఇత్యాది. ఉత్తమాదౌ 'వత్తున్' ఇత్యాది. ణిచితు "రప్పించె నతనిన్-రావించె. "వాసన్-ప్రోచున్" ఇతి క్రియాయాం బహువచనే ప్రోతురు; ప్రార్థనే ప్రోవుము. "చనిరయున్ - వినిరయున్ - కనిరయున్" ఇత్యాదౌ భూతార్థకయకారే పరే ఇత్వమ్. 'చనెన్' ఇత్యాదిరూపసిద్ధిః ప్రాగేవ దర్శితా.

వి :— వర్ణాగమః, విశేషః, పురుషేషు, అర్థేషు, చ, అపి, వచనేషు — అని ఛేదము. ఉత్తమపురుషాదులందును, నేకవచనాదులందును, దద్ధర్మాద్యర్థములందును వర్ణాగమవర్ణాదేశాదికార్యములు చింతామణిలోఁ జెప్పఁబడినసామాన్యవిధులకు విశేషవిధు లగుచు వర్తిల్లునని యర్థము. ఈవిషయమునే యథర్వణాచార్యులుగారీక్రిందివిధముగా వివరించినారు. "ఈయాంధ్ర మపరిమితము. అం దాంధ్రదేశ్యము విచిత్రస్వభావముతోఁగూడినది. ఆవిచిత్రత పూజ్యు లగుమహాత్ములయు మహాకవులయుఁ బ్రయోగములందుఁ జూచుకొనవలసినది. దేశ్యశబ్దములలో వర్ణలోప, వర్ణాగమాదికార్యము మిక్కిలివిస్తృతముగా జరుగును. ఏపదము మహాకవిరమ్యమైనదో సహృదయులకు హృదయాహ్లాదకమైనదో యాపదమే పరిగ్రహింపఁదగినది" అని 'భాషేయ మమితా తత్ర'...అనుదాని కర్థము.

270 సూ 2 :- అత్రేయం చిన్తా. తత్సమక్రియాస్వివ ఏత్వమాత్రవిధానే లఘు యత్వరూపసిద్ధిర్నిగ్నాచ్ఛ్రవేతి, యత్వవిధానస్య ప్రయోజన మదృష్టమితి. ఉత్వస్య యత్వమితి వ్యాఖ్యానాత్ 'రాదు - పోదు' ఇత్యాదౌ నాతిప్రసక్తిః. ఏతస్మిన్సూత్రే “నేచెన్ - నేర్చెన్ - నేరంగలఁడు - నేరువంగలఁడు - పొమ్ము - పోవుము - పొండు - పోదండు - తరలుము - తలము - తరలుఁడు - తలుఁడు - పడుము - పడుఁడు - పోదు - పోవదు - వలదు - వలవదు - ఈఁగెన్ - ఇచ్చెన్ - ఇయ్యఁడు - ఈఁగలఁడు, ఇయ్యఁగలఁడు - ఇవ్వఁడు - తలఁపుదువు - తలఁతువు - తలఁపుము - తలఁపుదము - పోవుదము - పోదము - నన్ను మఱి - మఱవక - మఱాక” ఇత్యాది. “కంటిన్ - కంటివి - ఉంటిన్ - ఉంటివి” ఇత్యాదౌ ప్రత్యయస్యాప్యాదేశః. ఏవం దేశ్యక్రియాను వర్ణాగమవైచిత్ర్య మవధేయమ్. తత్రాప్రామాణికప్రయోగత్వం వగన్తవ్యమ్. తదుక్త మథర్వణేనాఽపి.

వచనే పురుషే చార్థే లోపో వర్ణాగమో మతః।
గ్రామ్యతాపరిహారేణ హితా స్యాచ్ఛబ్దకల్పనా॥
శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే।
అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం మతమ్॥
భాషేయ మమితా తత్ర దేశ్యా చిత్రస్వభావయుక్।
తచ్చిత్రతా తు ద్రష్టవ్యా పూజ్యపాదనుభాషితే॥ ఇతి

గ్రామ్యతాపరిహారేణేత్యుక్త్యా “వస్తివి - చేస్తివి - ఆడన్ - ఈడన్” ఇత్యాది గ్రామ్యరూపపరిహారేణ. “వచ్చితివి — చేసితివి - ఆకడన్ - ఈకడన్” ఇత్యాద్యాకారేణ శబ్దకల్పనాఽవశ్యం భావః ప్రతిపాద్యతే.

వి:- చను మున్నగుక్రియలలో నేత్వమాత్రవిధానముచే 'చను+ఎన్' క్త్వాభూతయోః క్రియాన్తస్యేత్ - 'చను+ఇ+ఎన్-లఘుయకారము-'చనియెన్' అని యిట్టురూపసిద్ధి కలుగుచుండఁగా భూతార్థమున యకారమును విధించుట నిరర్థకమని తెలియుచున్నది. ఉత్వమునకే యత్వము వచ్చునని వ్యాఖ్యానించుటవలన 'రాదు-పోదు' అనువాని కత్వము లేదు. 'నేర్చెన్-నేచెన్' మున్నగుచోట్ల రూపభేద మున్నను నర్థభేదముమాత్ర మగపడదు. 'కంటిన్, ఉంటెన్, కంటివి, ఉంటివి' మున్నగువానియందుఁ బ్రత్యయమున కాదేశము. “ఉత్తమమధ్యమ

ప్రథమపురుషములయందును నేకవచన, బహువచనములందును, భూతతద్ధర్మప్రేరణాద్యర్థవిశేషములందును 'సు–ప్తు' మొదలగు వర్ణవిశేషాగమములు నగును" అని "వచనే పురుషే చార్థే లోపో వర్ణాగమోమతః" అనుదాని కర్థము. ఏకత్వాదివచనమునందుఁ బ్రథమాదిపురుషములందును, ప్రేరణాత్మనేపదాద్యర్థవిశేషములయందును, వర్ణలోప, వర్ణాగమ, వర్ణాదేశాదులు గల్గును. అట్టివర్ణలోపాగమాదేశాదులసంఖ్యాకము లగుటచే వానిని వివరింప శక్యము కాదు. మహాకవిప్రయోగములంబట్టియే వానిం దెలియవలె" నని "భాషేయ మమితా" ఇత్యాదివచనమున కర్థము. "గ్రామ్యత్వము లేకుండ శబ్దకల్పన చేయుట సహృదయసమ్మత" మని "గ్రామ్యతాపరిహారేణ హితా స్యా చ్ఛబ్దకల్పనా" అనుదానికర్థము. సంస్కృతవాక్యప్రయోగములలో వ్యాకరణమే బలవత్తరమని చెప్పఁబడుచున్నది. ఆవ్యాకరణముచే నిష్పన్నము కానిశబ్దవిషయమునఁ గవిప్రయోగాశ్రయణము సమ్మత మగుచున్నది. సంస్కృతవ్యాకరణవిరుద్ధము కానపుడే కవిప్రయోగమునకుఁ బ్రామాణ్యము–" అని "శాస్త్రప్రయోగవచసోశ్శాస్త్రం బలవదుచ్యతే" అనుదాని కర్థము. దీనికి మఱియొకరీతిని గవిశిరోభూషణము వ్యాఖ్య వ్రాసినది. అది సరి కాదు. "ప్రయోగమూలం వ్యాకరణమ్" అనునియమము తెలుఁగువ్యాకరణములకుఁ గలదు. కాని శాస్త్రప్రయోగవచస్సులలో శాస్త్రమునకే ప్రాబల్యము గలదని వ్యాఖ్య చేయఁబడినది. సామాన్యవిశేషశాస్త్రపరముగా దీనికి వ్యాఖ్య చేయరాదని తెలియవలెను.

**270 సూ. వ :–** ఆద్యప్రకృతేరపి ప్రయోగానుసారిత్వమేవ. తదుక్తం ధనంజయాచార్యైః.

"వక్తా వాచస్పతి ర్యత్ర శ్రోతా శక్ర స్తథాఽపి తౌ।
శబ్దపారాయణస్యాన్తం న గతౌ తత్ర కే వయమ్?॥

తథాపి కించి త్క్వచి త్ప్రతిబోధాయ నిబంధితమ్।
బోధయేత్ క్వ యదా క్లిష్టే మార్గవి త్సహాయాతి కిమ్?
ప్రమాణ మకలఙ్కస్య పూజ్యపాదస్య లక్షణమ్." ఇతి.

అమరసింహాదికోశకర్తృభిరపి "విశేషం తు జ్ఞేయం శిష్టప్రయోగతః" ఇత్యుక్తమ్. భాష్యాదిష్వపి "లిఙ్గ మశిష్యం లోకాశ్రయత్వా ల్లిఙ్గస్య" ఇత్యాదినా ప్రయోగానుసారిత్వం బహుధా ప్రతిపాదితమితి సర్వ మతీవ శుభమ్.

వి :— "ప్రయోగశరణా వైయాకరణాః" అనుసూక్తి సంస్కృత భాష కనువర్తింపదని కొందఱనుచున్నారు. అది కాదని ధనంజయాచార్యులవా రిట్లు నుడువుచున్నారు. "బృహస్పతి వక్తగను, దేవేంద్రుఁడు శ్రోతగను శబ్దపారాయణ ముపక్రమింపఁబడినది. అయినను దత్పారాయణము తుదముట్టలేదు. మాయట్టివా రట్టిపనిని జేయఁగలరా? అయినను గొందఱకుఁ దెలియుటకై కొంచెముగ సూచింపఁబడినది. విషయము తెలిసినవార లెంతబోధించినను నది సూచనామాత్రమే యగును. లోకమునందుఁ ద్రోవ నెఱింగినవారు మఱియొకనికి 'ఇట్లు పొ'మ్మని బోధింతురేగాని యటకుఁ (లక్ష్యమునకడకు)గూడఁ గొనిపోరుకదా! కావున భాషావిషయమునందుఁ గలంకరహితు లగుపూజ్యపాదులలక్షణమే ప్రమాణ మగుచున్నది" అని 'వక్తా వాచస్పతిః' ఇత్యాదిశ్లోకమున కర్థము. లింగవచనవిభక్త్యాదులను వ్యాకరణము, నిఘంటువు మున్నగువానింబట్టి తెలియవలెనని పెద్దలయాశయము.

ఓం తత్సత్

---

శ్లో|| హంసీవ వసతా దన్తర్వాణీ హంససుమానసే।
సేయం కవిశిరోభూషా దూషణారేః ప్రసాదతః.

శ్లో|| తుష్టో భవే ద్రఘుపతి ర్మయి సత్కృపావా
నేతన్మదీయవచనై రపి దుష్టభావైః।
హృష్టో భవేద్ధి సుతలాలనలాలసావాన్
లోకే పితా నిజశిశో ర్వచనై రసార్థైః. 2

శ్లో|| మత్రాణబన్ధో కరుణైకసిన్ధో శ్రీరామచన్ద్రే ఘృషితార్కచన్ద్రే।
లగ్నా కృతి స్సేయ మశేషకాలం లోకే వరిష్ఠాం లభతాం ప్రతిష్ఠామ్. 3

శ్లో|| శ్రీరామాయ సమస్తదైవతశిఖారత్నాయ తే మఙ్గళం,
ఘోరాఘౌఘభిదాపటిష్ఠమధురాఖ్యానాయ తే మఙ్గళమ్।
పారాతీతసమస్తసద్గుణగణాధారాయ తే మఙ్గళం,
వీరా యోద్ధృతచన్ద్రశేఖరధనుస్సారాయ తే మఙ్గళమ్. 4

శ్లో|| దుష్టేన్ద్రారిసమూహనీరదమహావాతాయ తే మఙ్గళం,
పుష్టారాత్యనుజన్మహృత్కమలసన్మిత్రాయ తే మఙ్గళమ్।
ఇష్టార్థప్రదచాతురీయుతకృపాసీతాయ తే మఙ్గళం,
శిష్టానుగ్రహకామ్యయా రఘుకులే జాతాయ తే మఙ్గళమ్. 5

ఉ|| మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జజప్రముఖమానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తికృదమంగళభంగదసారకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘనప్రభుమూర్తికి రామమూర్తికిన్. 6

సీ|| ఏశక్తిచే నట్టి దిట్టిది యనరాని తేజంబు రూపమై తేజరిల్లె,
నేమాయలానిచే నిది యసత్తయ్యును సద్రీతి దృష్టిగోచరతఁ గాంచె,
నేశక్తిచే జగం బిది పరిణామమై నిగమాంతముల కెల్ల నెఱపనయ్యె,
నేశక్తిమంతుచే నిజ్జగం బంతయుఁ దలఁప వివర్తమై తెలియనయ్యె,

గీ|| నట్టిదంపతు లగసుతాహారహృదంబు
జాతభావితు లీమన్త్రవేత్తఫణిత్రి,
[illegible]
నెంతయుఁ బ్రసిద్ధ మవనిఁ గావింతు రొప్పు. 7

సీ॥ పంటతామరకంటిదంటకూఁతురిమోవిపంటితీయనితేనెజుంటితేఁటి,
భూధరాపత్యంపుఁబుణ్యంపుహృదయంపుఁజూపుకాసారంపుసరసహంస,
బుడుతచందురుమామపువ్వుదాల్పుశిరంబునొడయునిమనిరోని పెద్దఁగుమాటు,
ప్రాచీనశాస్త్రంపుబహుళోక్తిమర్మంపుమహిమంపుఁబెంపుపూమాలవాఁడు,

గీ॥ గాలిబిడ్డనిపాలింటికగనతరువు,
కేవలుంగులకొరచూలికెల్లువిద్దె,
విడుదకులుచర్ణములు రెండు నుడువువాఁడు.
పురుషుఁ డొక్కండు మత్కృతిఁ బొదలఁజేయు. 8

చ॥ అగణితయోగిశహృదయాంబుజహంస లకుందబిన్నయుల్
జగదవనక్రియాదికవిచక్షణమానుషవేషసుందరుల్
నిగమశిఖావచోనిచయనిశ్చితవైభవులైనదంపతుల్
మిగిలినకూర్మి మత్కృతి రమింతురుగాత మతిప్రసిద్ధిగన్. 9

గీ॥ కవిశిరోభూషణం బన్నఁ గడుభయమున
జిహ్మగులు గొండు లీగుట చిత్ర మేమి?
కవిశిరోభూషణం బన్నఁ గడుభయమున
జిహ్మగులు గొండు లీగుట సిద్ధ మరయ. 10

సీ॥ కర్కశతర్కవాక్కర్కశాకుంఠితవిశదమేధావిధావిలసనంబు,
ఫణిరాజభక్తికాప్రముఖశబ్దగ్రంథసారసర్వస్వవిజ్ఞానపటిమ,
ఉభయమీమాంసార్థవిభవానుసంధానబంధురమేధాధురంధరతయు,
వల్మీకసంభవవ్యాకృత్యలంక్రియాకోశాదిపరిచితికౌశలంబు,

గీ॥ సరసకవితామహోమార్గసరసగమన
చతురిమయుఁ గల్గుపండితజనుల కెలమి,
నెలవుకొనఁజేయు జగతిలో లలితసూక్తి
భూషణం బైనకవిశిరోభూషణంబు. 11

క॥ పోషించి మాధవార్యుఁడు
నీషి వసున్ సంస్కృతాదినిర్మలభాషా
భాషి నొనర్చె (శ్రీలింగజ
భాషాసామ్రాజ్యపట్టభద్రుని జేసెన్. 12

—: గద్య :—

ఇతి శ్రీమత్సీతారామచన్ద్రచరణారవిన్దమిలిన్దాన్తఃకరణేన, శ్రీమత్పో
లూరి మాధవయజ్వపణ్డితాఖణ్డల సముజ్జ్వలకృపారస సముక్షిత
కటాక్షాసాదితపాణ్డిత్యాభరణేన, ప్రభఞ్జనవంశముక్తా
మణినా, నిరన్తరారాధితసఙ్కర్షణవన్మణినా, అభి
నవసన్నయభట్టాచార్యేణాహోబలపత్యా
చార్యేణ విరచితాయామాన్ధ్రశబ్ద
చిన్తామణివ్యాఖ్యాయాం కవిశిరో
భూషణాఖ్యాయాం పఞ్చమః

క్రియాపరిచ్ఛేదః.

సమ్పూర్ణోఽయం గ్రన్థః.



ఈ కవిశిరోభూషణము విస్తృతిని ప్రచురించుటకు ద్రవ్యసాహాయ్యము

కావించిన యుదారుల నామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీమాన్, శ్రీనివాసుల వేంకటాచార్యులు, ప్రత్తిపాడు | రు. 1000 |
| 2. | ఆంధ్రసాహిత్య అకాడెమీ, హైదరాబాదు | 1000 |
| 3. | శ్రీ యం. వేంకటరత్నం, గుంటూరుమండలాధ్యక్షుడు (1970-72) | 500 |
| 4. | Dr. M.C. సత్యనారాయణవిద్యాసంస్థ, విజయనగరము | 500 |
| 5. | శ్రీ చన్నావఝ్ఝల విశ్వనాథము, M.A. (C.V.N. సన్, ప్రిన్సిపాలు, సి.వి.కళాశాల) గుంటూరు | 216 |
| 6. | శ్రీ మాతానిరంజనానందగిరి, గౌతమీనగర్, కొవ్వూరు | 116 |
| 7. | శ్రీమతి P. వసంతాదేవి, M.A., ప్రిన్సిపాలు, శారదానికేతనము, గుంటూరు | 116 |
| 8. | శ్రీ B. శ్రీమన్నారాయణ, M.A., చింతలపూడి, పశ్చిమగోదావరి | 116 |
| 9. | శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులు, డా. కే.వి.కే. సంస్కృత [కళాశాల, గుంటూరు | 116 |
| 10. | శ్రీ అవ్వారి కోదండరామశర్మ, గుంటూరు | 50 |
| 11. | శ్రీ ఆకెళ్ళ సూర్యనారాయణమూర్తి, విజయనగరము | 45 |
| 12. | శ్రీ భారతుల సుబ్రహ్మణ్యశాస్త్రి, డా. కే.వి.కే. సంస్కృత కళాశాల, [గుంటూరు | 45 |
| 13. | శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి, | 40 |
| 14. | శ్రీ ఆకెళ్ళ గోపాలకృష్ణమూర్తి, విజయనగరము | 30 |
| 15. | శ్రీ కనకదండి రామబ్రహ్మము, | 25 |
| 16. | శ్రీ రాచకొండ అప్పలనరసింహమూర్తి, విశాఖపట్టణము | 25 |
| 17. | శ్రీ కంచర్ల రామచంద్రరావు, విశాఖపట్టణము | 25 |
| 18. | శ్రీ మాకెన వెంకటఅప్పలనరసింహపాత్రుడు, విశాఖపట్టణము | 25 |
| 19. | V.T. కాలేజ్, విశాఖపట్టణము | 25 |
| 20. | శ్రీమాన్ M. కృపాచార్యులు, శారదానికేతనము, గుంటూరు | 25 |
| 21. | శ్రీ కాశావఝ్ఝల కోటయ్యశాస్త్రి, డా. కే.వి.కే. సంస్కృత కళాశాల, గుంటూరు | 25 |
| 22. | శ్రీమతి M. సావిత్రీదేవి, శారదానికేతనము, గుంటూరు | 25 |
| 23. | శ్రీమతి వి. దుర్గాభవానీదేవి, ,, | 25 |
| 24. | శ్రీమతి T. S. కమలమ్మ, ,, | 25 |
| 25. | శ్రీమతి సూరి సీతామహాలక్ష్మమ్మ, గుంటూరు | 25 |

# అథర్వణాచార్యకారికాసూచి

| సూత్రసంఖ్య | వ్యాఖ్యానభాగసంఖ్య | కారికార్ధభాగాంత్యసూచి | | పుటసంఖ్య |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | | (4) |
| | | **సంజ్ఞాపరిచ్ఛేదము** | | |
| 10 | 3 | శ్రుతేఽపశబ్దే | బుధః | 85 |
| | | ప్రాకృతే | సత్తమః | |
| | | సన్మూలవత్త్వాత్ | సహోమహే | 87 |
| 11 | 3 | ఆద్యా మహోర్వా | పాణినిః | 98 |
| | 6 | వర్ణాలోపాగమా | కవిసమ్మతేః | 100 |
| 18 | 2 | న ఖండః | కదాపిచ | 123 |
| | | తృతీయే | పరేతు సః | |
| | 4 | సంయుక్తే | సరేఫయోః | 125 |
| 19 | 4 | లఘుర్భవేత్ | సద్వాచః | 130 |
| | | క్రియాస్తే | గోచరః | 131 |
| 20 | 2 | య స్స్యాత్ | భవేత్ | 137 |
| | | డుడ్వాది | సదా | |
| | | ఇయాన్తాః | అంతతాపి వా | |
| | | అచోఽచి | ప్రయోగతః | |
| | 3 | వికృత్యాది | శ్రీకవిసమ్మతేః | 138 |
| | 5 | భావిక్రియాసు | ప్రయోగతః | 141 |
| | | డోలాభూషో | మధ్యయః | |
| | 7 | ఆద్యవర్ణాస్తు | కదాపిచ | 142 |
| 21 | 2 | ప్రాణాత్రాణః | భవేన్నణః | 148 |
| 22 | | కశ్చి ద్వదతి | కశ్చన | 150 |
| | | అనయోః | కథ్యతే | 151 |
| 37 | 2 | తృతీయాచ్చ | న యుజ్యతే | 162 |
| 39 | 2 | సంకీర్ణత్వం | మంజులం భవేత్ | 164 |
| 39 | 3 | విసానుకరణం | క్వాచి ద్భవేత్ | 165 |

| (1) | (2) | (3) | | (4) |
|---|---|---|---|---|
| 42 | | గ్రామ్యం | ముఖ్యాహితా | 172 |
| 43 | 3 | సర్వే శబ్దాః | హారకృతే | 177 |
| | | శాస్త్రప్రయోగ | హితమ్ | |
| | 4 | వర్ణలోపాగమా | మతిః | 178 |
| 41 | 2 | పంచవర్గాదయః | నిపయస్స్మృతాః | 181 |
| | | పూర్ణేందు | సన్నిభః | 182 |

సంధిపరిచ్ఛేదము

| (1) | (2) | (3) | | (4) |
|---|---|---|---|---|
| 45 | 2 | సంధిస్తు | న భవేదతః | 188 |
| | | న స్యాద్వాక్య | దోషకృత్ | |
| 46 | 1 | భవన్తి | సాధవః | 191 |
| | 2 | కుత్రచిత్ | భవేత్ | 192 |
| 47 | | అచాం సంధా | అభిధీయతే | 194 |
| 48 | 1 | ప్రథమే | న భవేత్సదా | 196 |
| 49 | 1 | మాసార్థాత్ | పరిమాణకే | 198 |
| 53 | | ఆద్యన్త | నియతం భవేత్ | 208 |
| 60 | 2 | ఆదన్త | విసమ్మతేః | 212 |
| | 3 | కుత్రచిత్ | భవేత్ | 213 |
| 63 | 1 | అన్త్యగస్య | క్వచిదిష్యతే | 220 |
| | 2 | శబ్దానాం | మకారయోః | 221 |
| 63 | 3 | పదే తు | హారిసమ్మతేః | 222 |
| 64 | 2 | నమశ్శబ్ద | అపీష్యతే | 224 |
| 68 | 2 | పరుషా వా | శ్చక్కారభూషణ, | 231 |
| | 3 | కేచిదాద్యస్య | సర్వత్ర కేచన | 232 |
| | | నపోగపదదాః | మతే హారేః | |
| 70 | | స్వత్వం | న ప్రయోగతః | 236 |
| 71 | | ద్రుతిస్య | శబ్దవిన్మతే | 239 |
| | | ఆద్యే | నిమిత్తతామ్ | 240 |
| | | పద్యభేదావ | యాన ముచ్యతే | |
| | | పద్యావసానే | సాధుతామ్ | |
| | | శ్లేషే సఖండ | శ్లిష్టతా మతా | |
| 75 | 2 | సరేఫే పరుషే | శరణం శతేః | 254 |

| (1) | (2) | (3) | | (4) |
|---|---|---|---|---|
| 78 | | సంబంధే క్వచిత్ | విలక్షణః | 259 |
| 79 | | సామానాధికరణ్యే | అత్ర సర్వదా | 262 |
| 80 | | అన్యత్రాపి | సుకవిసమ్మతేః | 263 |
| 81 | | అలాక్ష్యగమః | కవిసమ్మతేః | 264 |
| 83 | | విభాషయా | తత్ర సద్వచః | 266 |
| | | బహవో | అన్యథా | |
| 84 | | వినా ద్వితీయం | ప్రయోగతః | 268 |
| 85 | | వాక్యావసాన | అత్రహి | 271 |
| | | పద్యభేదావ | కథ్యతే | 272 |
| | | **అజంతపరిచ్ఛేదము** | | |
| 95 | | విశ్రుతావత్ర | తచ్చ్యుతిః | 281 |
| | | అన్యత్రాపి | ప్రయోగతః | 282 |
| 99 | 3 | వివక్షాతః | భవేత్ | 288 |
| | 5 | క్వచి దర్థవిశేషేతు | శబ్దకల్పనా | 290 |
| | 7 | చంద్రశార్దూల | రుచిర్యది | 292 |
| | 10 | లింగభేదో | ఉచ్యతే | 294 |
| | 11 | శ్రేష్ఠతాయాం | సమ్మతః | 296 |
| | 12 | భవే దమహాతః | బహుతా మతా | |
| | | క్వచిత్ స్వస్య | మానసే | |
| 100 | | సంబోధనే వా | దూరాదికేఽభితః | 300 |
| | | స్యాన్మధ్యమ | ఆగమమ్ | |
| 103 | | మహాతోమస్తు | సదా భవేత్ | 303 |
| 104 | | కేచిత్తు | అభిధాయకాః | 305 |
| 105 | 2 | శస స్స్యాత్ | ఉచ్యతే | 307 |
| 107 | | సంధి ర్నిత్యం | గతస్య చ | 309 |
| 111 | | సర్వేషాం | సమ్మతేః | 311 |
| 114 | 3 | సాశ్రయా | గతసప్తమీ | 314 |
| | | జే ర్న స్యాత్ | సాన్యతో విధిః | 315 |
| 115 | 3 | శబ్దా యే చ | పదసంగ్రహాత్ | 317 |
| 120 | 1 | భావాదిజన్య | వర్తమానార్థతాంగతా | 322 |
| 120 | 3 | శబ్దేభ్యః | గుణైర్భవేత్ | 323 |
| 121 | | మూర్వాసాదిక | తత్పరమ్ | 325 |

| (1) | (2) | (3) | | (4) |
|---|---|---|---|---|
| 159 | 1 | నిత్యం లుతా | దుజామ్ | 386 |
| | 2 | కాండుర్గాదుః | క్వచిద్వర్ణాగమోమతః | 387 |
| | 14 | కేషాఞ్చిత్ | దరా స్మృతా | 392 |
| | 15 | పునర్ణకః | క్వచిత్తువా | |
| | 16 | కథితార్థాత్ | నః క్వచిత్ | |
| | 17 | బహుత్వం | క్వచిత్ | 393 |
| 161 | | దలటా ముదితాం | ఏకరూపతా | 396 |
| 162 | 2 | కుత్రచిత్ | ప్రయోగతః | 397 |
| 164 | | సమాప్తాక్షర్ణకాః | ప్రతాః | 399 |
| 165 | 2 | ఉదంతకాలతాః | ప్రకారయుక్ | 402 |
| 166 | 5 | విధక్త్వాచ | ప్రయోగతః | 405 |
| 168 | 4 | కుత్రచిత్ | పర్యస్తలిఙ్గతా | 409 |
| | 7 | క్వచిదాద్యస్య | వాచ్యతా | 410 |
| | 10 | ఇయాన్తాః | ఏదన్తతాపిచ | 411 |
| 172 | 2 | కేచిత్తు | సాధవః | 413 |
| | 3 | కుత్రచిత్ | హ్రస్వదీర్ఘయోః | |
| | 4 | కాన్తశబ్దాది | భూరివర్తతే | |
| | 7 | దుమకతా | సమ్మతః | 415 |
| | 8 | క్వచిత్ | ప్రయుజ్యతే | |
| | 9 | ఏకత్వే | ప్రదృశ్యతే | |
| | 10 | అసాద్యస్యాపి | ద్వివర్ణకాః | 416 |
| | 11 | నివర్ణకః | గుణవాచకాత్ | |
| | 12 | శబ్దానాం | విధీయతే | 417 |
| | 13 | అర్థభేదే | అన్యత్ర తత్ప్రచ్యుతిః | |
| | 14 | విశేషేణ సమాసోఽపి | మమ | 420 |
| | 17 | ప్రమతోపజీవినః | ఇతి కేచన | 421 |
| | 18 | ఏవావ్యయా | క్వచిదేకతా | 422 |
| | 19 | అప్రమతానాం | మతాః | 424 |
| | 20 | లోకోక్తీనాం | ప్రతిరక్షణమ్ | 425 |
| | 21 | పరేషాండ్వ్యాద | ప్రకారతా | 426 |
| | 22 | క్వచిత్ | వ్యవస్థితిః | 427 |
| | 23 | దీర్ఘస్య | సమ్మతః | |

| (1) | (2) | (3) | | (4) |
|---|---|---|---|---|
| 172 | 23 | ద్వంద్వేతు | మహాపిచ | |
| | 24 | ఏకాదశాది | సుత్రచిత్ | 428 |
| | 30 | క్వచిద్బిందుః | క్వచిత్స్మృతిః | 433 |
| | 31 | ప్రకృత్యుక్తప్రకారేణ | సహ్యాదయో హితమ్ | 435 |
| | 32 | క్వచిత్కులిశ | సర్గాగమశ్రుతిః | |
| | 33 | అజన్యజన్యభేదేన | విచిత్రతా | 438 |
| | 34 | ప్రతిక్రియం | మే [illegible] | 440 |
| | 35 | అనింద్యతాయాం | సమ్మతిః | |
| | 36 | అహాంతర | సుచరితైః | 441 |
| | 37 | సంగితిః వితాయా | విక్రియతే | |
| | 37 | గితే తాళాది | బుద్ధైః | 441 |
| | 38 | ద్వ్యక్షరాణి | శ్లేషత్వే గోచరాః | 442 |

## హలంతపరిచ్ఛేదము

| (1) | (2) | (3) | | (4) |
|---|---|---|---|---|
| 180 | | స్వార్థప్రధానా | చేతసే | 453 |
| 182 | | పుంబ్రహ్మణః | సంస్థితిః | 456 |
| | 4 | భవద్భిర్ముఖ | సిద్ధాంతపద్ధతిః | 457 |
| | 6 | అజ్ఝలోరాసు | క్వచిద్భవేత్ | 459 |
| | 9 | క్వచిన్నామ | హితో భవేత్ | 462 |
| | 12 | యథాప్రకృతి | సుధీహితమ్ | 465 |
| 192 | | సుర్మురూ సుజనోః | సమా | 475 |
| 195 | | క్వచిద్భవేత్ | సంశ్రుతిః | 479 |
| 196 | | ఊష్మరేఫాన్ | ద్విత్వసంగతిః | 480 |
| 205 | 1 | క్వచిన్నపర్గే | లోపవాన్ | 492 |
| | 4 | భూతార్థే | విశేషణమ్ | |
| | 8 | భవేద్విరుద | విరోధకృత్ | 498 |
| | 9 | సమాసయుక్ | విభక్తిగః | 503 |
| 208 | | ఇతోస్మృత్ | వా క్వచిత్ | 506 |
| 211 | | ఉభయార్థే | సుపర్వకః | 509 |
| | 2 | ప్రథమశ్చోత్తమ | తత్ర కల్ప్యతే | 510 |
| 214 | | క్వచిదేకత్వం | తద్విశేష్యకయాన్వతా | 519 |
| 215 | 1 | ద్విగోః | క్వచిద్భవేత్ | 521 |

